బ్రహ్మశ్రీ మధిర సుబ్బన్న దీక్షితకవి

# కాశీ మజిలీ కథలు

## 3 & 4 భాగములు





# కాశీ మజిలీ కథలు

## 3 & 4వ భాగములు

(ఒకే సంపుటముగా)

ఇది గోదావరీ తీరస్థితంబగు
రాజమహేంద్రవరంబున నివసించియున్న

**బ్రహ్మశ్రీ మధిర సుబ్బన్న దీక్షితకవిచే**

రచించబడినది

సరళ సుందర వచనం

**శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం**




✆ 2473444

**రోహిణి పబ్లికేషన్స్**

పాత కూరగాయల మార్కెట్

మెయిన్‌రోడ్, రాజమండ్రి - 533 101

25

# కాశీ మజిలీ కథలు

బ్రహ్మశ్రీ మధిర సుబ్బన్న దీక్షితకవి

శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం



8440-82732

సుబ్బన్న - కాశీలు

ప్రథమ ముద్రణ :

జనవరి, 2005






సాధారణ ప్రతి

రూ : 125/-

లైబ్రరీ ప్రతి

రూ: 200/-




ప్రకాశకులు :

రోహిణి పబ్లికేషన్స్

మెయిన్‌రోడ్, రాజమండ్రి - 1

ముద్రణ: స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్, విజయవాడ-3. ఫోన్స్: 2578211, 2572832

# నాటిక - నేడు

**శ్రీ మధిర సుబ్బన్న దీక్షిత కవి** విరచిత **"కాశీమజిలీ కథలు"** చదవని పాఠకులు అరుదుగా వుంటారు వ్యాకరణ సమ్మతమైన పద్ధతిలో, భావపూర్ణంగా, పఠితలకు పఠనోత్సాహం కలగచేసేటట్లు, పూర్తిగా చదివిన తర్వాత వెంటనే మర్చిపోకుండా గుర్తుండేలా వ్రాయగల సమర్థుడు శ్రీ సుబ్బన్న దీక్షితులు. ఆనాటి **కాశీమజిలీ కథల** సంపుటాల్లో రచయిత కధాకధన శైలినీ, వ్యాకరణాలంకారశాస్త్ర పాండిత్యాన్నీ కొనియాడుతూ, వాగ్దేవీ నందనులైన శ్రీశ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, శతావధాని శ్రీచెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి, శ్రీ మానవల్లి రామకృష్ణ కవి తమ తమ అమూల్య అభిప్రాయాలను తెలియజేసారు.

ఆ రోజుల్లో కావ్య భాషలో రచన చెయ్యగలిగిన వారికే కవిశబ్ద గౌరవం. ఆ విధంగా సంఘంలో కవిగా గౌరవింపబడాలంటే రచయిత తప్పనిసరిగా శబ్దగాంభీర్యాన్ని ఆశ్రయించవలసి వచ్చేది. తత్కారణంగా ఎంత సామాన్యమైన కథని వ్రాయాలన్నా గ్రాంధికాంధ్రాన్ని ఆశ్రయించే వాళ్ళు ఆనాటి రచయితలు.

కాని రోజులు మారాయి, కాలంమారింది, సంఘంపట్ల రచయితల అభిప్రాయం మారింది. ఇప్పుడు అందరు రచయితలూ వాడుక భాషలోనే తమ భావాల్ని వ్యక్త పరుస్తున్నారు. అయితే రచన ఎల్లప్పుడూ ఆలోచనామృతమేకాని సంగీతంలా ఆపాతమధురం కాదు. రచన మాటల్లో వుండదు మాటల కూర్పులోనే వుంటుంది అంటారు పేరుమోసిన రచయితలు

అరటిపండుని సులువుగా నోట్లో వేసుకోవచ్చు. కాని పనసతొనని సాధించుకోవడంలో ఎంతో శ్రమ వుంది. ఇంకా ఆధునికంగా చెప్పాలంటే – పాతకాలంనాటి మోటు నగల్ని చెరిపించి, నాజూకైన నగల్ని చేయించుకున్నట్లే మేంకూడా **కాశీమజిలీ కథల్ని** నేటి కాలపు వాడుక భాషలోనికి పరివర్తన చేసి పెట్టమని **శ్రీఇచ్ఛాపురపు రామచంద్రం** గారిని కోరాం. వారుకూడా ఎంతో ఉత్సాహంగా మా ప్రతిపాదనని అంగీకరించారు. వెనువెంటనే కార్యరంగంలోకిదూకారు. తత్ఫలితమే వాడుక భాషలో **"కాశీమజిలీ కథలు"** మీ ముందుకు వచ్చి నిల్చాయి. మీరు ఏమాత్రం శ్రమపడకుండా ఈ **"కాశీమజిలీ కథల్ని"** అరటి పండు తిన్నంత సులువుగా చదువుకుంటూ సాగిపోతారు.

మహాకవి కాళిదాసు కావ్యాలకు సంజీవనీ వ్యాఖ్యనం వ్రాసిన మల్లినాధసూరి అంటారు – **"నామూలం లిఖ్యతేకించిత్తు"**ని. తత్సమానంగానే శ్రీ రామచంద్రంగారు కూడా. ఏది ఎలా వున్నా ఏకదేశ వికృత న్యాయాన్ని అనుసరించి ఆనాటి **కాశీమజిలీ కథలే** నేటి ఈ **కాశీమజిలీ కథలు**. రసజ్ఞ పాఠకులైన మీరు మా శ్రమకు పట్టెవర్ధనాలు దిద్దుతారనే మా విశ్వాసమూ, ఆకాంక్షా.

ప్రకాశకులు.

# కథల వెనుక కథ

మిత్రులూ, రోహిణి పబ్లికేషన్స్ అధినేతా, శ్రీ అప్పారావు గారు మధిర సుబ్బన్న దీక్షితకవి విరచిత కాశీ మజిలీ కథలకు నేటి పాఠకులకు తేలికగా అర్థమయ్యే రూపం ఇవ్వవలసిన గురుతర బాధ్యతని నామీద ఉంచినప్పుడు నేను కొంచెం భయపడ్డాను. ఎందుకంటే-స్వతంత్రంగా కథో నవలో రాయడం వేరు, సుప్రసిద్ధ రచనని సరళతరం చేసి తిరుగ రాయడం వేరు-కాశీ మజిలీ కథలలాటి ప్రఖ్యాత రచనను ఆధునిక రూపంలోకి మార్చడం-నా బోటివానికి కత్తిమీద సామే.

భాషాపరంగా క్లిష్టం. రాశిపరంగా చాల పెద్దది. పురాణాలు, చరిత్ర, భూగోళం, ఖగోళ శాస్త్రం, వేదాంతం... తత్వం, వైరాగ్యం.. శృంగారం,ప్రేమ కామం...భక్తి... ఎన్నిటిని స్పర్శించారో మధిర సుబ్బన్న దీక్షితకవి తమ రచనలో! అద్భుతమైన కల్పన... అమోఘమైన కథా శిల్పం. ఏ దృష్టితో చూసినా "కాశీ మజిలీ కథలు" అనర్ఘరత్నమే. అలాంటి రచనని ప్రస్తుత పాఠకులకు-వేగంగా కథను పరుగెత్తిస్తూ మూలానికి ద్రోహం జరగకుండా తిరిగి రాయగలనా! అని నేను ఆలోచిస్తున్న సమయంలో....

నా రచనల వెనకే నా జీవితంతో పాటే ఉండే నా నిరంతర సన్నిహితులు శ్రీ జి. రంగబాబుగారు "మీరు రాయగలరు. కచ్చితంగా రాయగలరు." అని ఆత్మవిశ్వాసం కలిగించారు.

" మీకు ఏ పుస్తకాలు ఎప్పుడు తెచ్చియిమ్మంటే అప్పుడే తెచ్చియిచ్చేపూచీనాది. గురువుగారూ! కాశీ మజిలీ కథల తిరుగ రాతకి వేగంగా శ్రీకారం చుట్టండి-"అని ధైర్యం చెప్పి తొందర చేశారు శ్రీ యిమ్మిడి శెట్టి చక్రపాణి (లెక్చరర్) గారు.

" మీరు రాయగలరండీ.....రాస్తారు" అని ఎనభై దాటిన శ్రీగణపతిరాజు చంద్ర శేఖరరాజు (అడ్వకేట్) గారు వెన్నుతట్టి ఆశీర్వదించారు. ఒక్కసారి మానాన్న గారూ, తెలుగు పండితులూ అయిన కీ.శే. ఇచ్ఛాపురపు వైద్యనాథంగారిని ఒక్కమారు తలుచుకున్నాను. అంతే పన్నెండు భాగాలు పన్నెండు నెలలలో తిరిగి రాయగలిగాను.

ఈ గ్రంథమునకు సరళ సుందర వచనముకు సహకరించిన శ్రీ పానుగంటి కృష్ణరావుగారికి ప్రత్యేక కృతజ్ఞతలు.

వ్రాశాక అర్థమైంది నేనెంత మంచిపనిచేశానో! ఈ కథలు శ్రద్ధగా చదువుతూ రాయడం వలన ఎన్నెన్ని విషయాలు తెలిశాయని! ఎంతగా కథా కథనకౌశలం అర్థమైందని! కల్పనాచాతుర్యం ఎంతగా చూడగలిగానని !

అంతే కాదు. నాపట్టుదలమీదా, ఓపిక మీదా నాకు విశ్వాసం కలిగించింది ఈ ప్రక్రియ. ఇతరుల రచనలను కూడా నేటి పఠితలకు అనుకూలంగాను మార్చగలనని నమ్మకం కలిగించిందీ మహత్తర కార్యం. ఈ రచన వెనుక ఎందరో మహానుభావులున్నారు అందరికీ నా మన: పూర్వక కృతజ్ఞతలు.

ఇట్లు

ఇచ్ఛాపురపు రామచంద్రరావు

# కాశీ మజిలీ కథలు







## మూడవ భాగము

# విషయ సూచిక

### 18 వ మజిలీ నుండి - 29 వ మజిలీ వరకు



## నాల్గవ భాగము

# విషయ సూచిక

### 30 వ మజిలీ నుండి - 43 వ మజిలీ వరకు

# హెచ్చరిక

ఈ పుస్తకములో ఏ కథలను గాని, భాగాన్ని కాని పూర్తిగా గాని, కొంత గాని, కాపీరైట్ హోల్డర్ / ప్రచురణకర్త లైన మా క్లయింటు M/S రోహిణి పబ్లికేషన్స్, రాజమండ్రి వారి నుండి ముందుగా వ్రాత పూర్వకముగా అనుమతి పొందకుండా ఏ రూపముగా వాడుకున్న, కాపీరైట్ చట్ట రీత్యా మరియు ఇండియన్ పీనల్ కోడ్ చట్ట రీత్యా తీసుకొను సివిల్, క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురని యావన్మందికి యీ హెచ్చరిక ద్వారా తెలియజేయడమైనది.

ఇట్లు

**డి.వి.కె. రమేష్**



**డి. వాణి రమేష్,**

అడ్వకేట్స్,

నాళం భీమరాజు వీధి,

రాజమండ్రి - 1

# కాశీ మజిలీ కథలు

## 18. వ మజిలీ

## 3. వ భాగం

### జయభద్రుని కథ

నగర విశేషాలు చూసిన గోపాలుడు వేగంగా పరుగెత్తుకొచ్చి మణిసిద్ధుడి పాదాలమీదపడి – "మహాత్మా! ఈ వూరిమధ్య పెద్దకోటుంది. గుంపులు గుంపులుగా పోతున్న జనంతో నేను కూడా ఆ కోటముందరికి చేరుకున్నాను. గుద్రంగా మూగిన జనం మధ్యలో దూరి నేనొకదృశ్యం చూశాను.

అక్కడొక చితి ఉంది. దానిలోంచి మంటలు ఆకాశమెత్తున లేస్తున్నాయి. నిప్పులు కణకణ లాడుతున్నాయి. చిటపట లాడుతున్నాయి. అది ఎందుకా అని నే నాలోచిస్తూండగా ఒక వేపునుంచి – చక్కగా అలంకరించబడి, పూలపళ్లెంతో ఒక స్త్రీ వేగంగా వచ్చి పువ్వులను చితిలోవేసి – ఏదో మొక్కి గభాలున ఆ చితి మంటల లోకి దూకేసింది! చూస్తున్నవారిలో ఒక్కరేనా ఆమెను వద్దనలేదు, వారించలేదు, అడ్డగించలేదు! నారాయణస్మరణ చేస్తూ ఉండిపోయారు. నేను మాత్రం గొల్లున ఏడవకుండా ఉండలేక పోయాను.

ఆమె మంటలలో దూకడమేమిటి, అగ్నే చల్లనివా డనిపించేలా, నీరు జల్లినట్లే ఆ మంటలు ఆరిపోయాయి. ఆ స్త్రీ నిప్పుల్లో దూకినట్లుగాక – పుటంపెట్టిన బంగారంలా మెరిసిపోతూంది. ఆ ప్రాంతమందే ఉన్న ఒక చక్కని చిన్నవా డామె వద్దకెళ్ళి .."ప్రాణసఖీ, రా నీకళంకం పోయింది"

అంటూ ఆమెను ఎత్తుకుని మంగళ వాయిద్యాలతో కోటలోకి తీసుకుపోయాడు ఆ వృత్తాంత మేమిటిని ఎవరి నడిగినా చెప్పలేదు మా అయ్యగారే అంతా చెబుతారులే – అని వచ్చేశాను" అన్నాడు.

మణి ప్రభావంతో ఆ కథంతా ఆకళింపు చేసుకుని – మణిసిద్ధుడు చెప్పసాగాడు

"ఆ నగరంపేరు మణిప్రస్థం దానిరాజు కుంతిభోజుడు. అతని భార్య సుమతి. వాళ్ళ కేడుగురు కొడుకులు చిట్టచివరివాడు జయభద్రుడు. అతను భూలోకమంతా కీర్తి చెందుతాడని దైవజ్ఞులూ సాముద్రిక శాస్త్రవేత్తలూ రాసిచ్చారు. రాజు ఆ బాలుణ్ణి మామూలుగా కాక ప్రత్యేకంగా పెంచుతూ తగిన వయసు రాగానే విద్యాభ్యాసానికి సుమిత్రు డనువానితో జతపరచి పదిమంది ఉపాధ్యాయులను నియమించి – విద్యలు చెప్పించసాగాడు.

కొన్ని సంవత్సరాలకు జయభద్రుడు, సుమిత్రుడు చాలా విద్యలలో పాండిత్యం సంపాదించారు. రాజకుమారుడికి అన్ని కళలలోనూ పాండిత్యం కలిగింది కాని శృంగార కళలో ప్రవేశం కూడా కలగలేదు.

అది గమనించిన గురువు అతనిచేత వాత్స్యాయన సూత్రాలూ, రతిరహస్యం, అనంగరంగం, రతిమంజరి, రతిరత్నాకరం, రసమంజరి మొదలైన గ్రంథాలను చదివించి బోధించాడు. కాని అత నవన్నీ వ్యర్థమని గురువుతో వాదించేవాడు.

"మిగిలిన విద్యలలో మొదటివాడుగా ఉండడంవల్ల ఆ గురువులకి ఎక్కువ పారితోషికం లభించింది. నాకు నిందలే మిగిలాయి. ఎన్ని సార్లు చెప్పినా నీ కీశృంగార రసం వంట పట్టడంలేదు. దీనిని తెలుసుకుంటే కాని మగవాడిని రసికు డనరు. మళ్ళీ చెబుతాను జాగ్రత్తగా విను" అంటూ నవరసాలు, స్త్రీలలో జాతులు, పురుషార్థాలు మొదలైనవి మళ్ళీ చెప్పాడు

అతని అభిప్రాయం గ్రహించిన సుమిత్రుడు ఉపాధ్యాయుడితో.. "మీరు చెప్పవలసింది చెప్పారు. ఆర్యా! నేనూ కొంత ప్రయత్నం చేస్తాను" అంటూ రాజకుమారుణ్ణి వేశ్యావాటికకు తీసుకెళ్ళాడు.

సుందరుడూ, సుకుమారుడూ అయిన రాజకుమారుడు తమ వీధిలోంచి వెళ్తూంటే వేశ్యాసుందరులు శృంగారం వొలికిస్తూ అతన్ని చూడసాగారు.

అంతకుపూర్వం అలాటివారిని చూడక, జయభద్రుడు వాళ్ళని కుతూహలంగా చూడసాగాడు. సుమిత్రుడు విశేషాలు చెబుతూ అతన్ని నడిపించసాగాడు. చంద్రిక అనే వేశ్య అతన్ని మెచ్చుకుని - నేర్పుకల ఒక దాసిని పిలిచి వాళ్ళని తీసుకురమ్మని పంపింది.

ఆమె వారికడ్డంగా నిలుచుని - "అయ్యలారా! మీకు నమస్కారాలు. అతిసుకుమారుడైన ఇతను నడుస్తూంటే చూసేవారికి బాధ కలుగుతూంది. కొంచెం సేపు విశ్రమించి వెళ్ళరుగాని. దయచేయండి" అని ప్రార్థించింది. సుమిత్రు డతన్నా ఇంట్లోకి తీసుకువెళ్ళాడు.

చంద్రిక వారికి చక్కని స్వాగతం పలికి ఉపచారాలు చేసి..."మీవంటివారి రాకతో మాఇల్లు ధన్యమైంది" అంటూ జయభద్రుని చేయిపట్టుకుని పూలపాన్పుమీద కూర్చోబెట్టి - తనగురించి చమత్కారంగా చెప్పింది.

సుమిత్రుడు జయభద్రుడిని పరిచయం చేయగా.. "భూలోకమన్మథుడని పేరు పొందిన జయభద్రుడా!" అని పొగడుతూ అతనికి చందనం పూసి మెడలో పూలమాల వేసింది. ఆమె చేతిస్పర్శ కతనిలో మదనవికారాలు కలిగి వివశు డయ్యాడు.

అంతలో సాయంకాలపు గంటకొట్టారు సుమిత్రు డదిరిపడి - "మేము ఎవరికీ తెలియకుండా వచ్చాం. వచ్చి చాలాసేపైంది. రాజుగారికి తెలిస్తే ప్రమాదం. మళ్ళీరావాలనిపిస్తూంది..." అంటూ రాజకుమారుడి చెయ్యి అందుకున్నాడు.

"అయ్యో! అప్పుడే వెళ్ళిపోతారా? ఈ మనోహరుడి రూపం తనివితీరా చూడనేలేదు. అదృష్టం కాకపోతే రాజకుమారుడి దర్శనం లభిస్తుందా? ఈ దాసురాలిని దయచూసి ఎలాగైనా ఈ రాత్రి ఇక్కడుండండి" అని ప్రార్థించింది చంద్రిక.

"రేపొస్తాం" అని జయభద్రుడిని అక్కడి నుంచి బలవంతంగా తీసుకుపోయాడతను.

రాజకుమారుడు "ఇప్పుడుమనని సత్కరించిన స్త్రీ ఎవరు? ఇలాటివారిని నే నెప్పుడూ చూడలేదు సుమా. నువ్వీవీధికి మునుపొచ్చావా? మన పట్నానికిదే ప్రధానవీధి కాబోలు! నా కక్కడుండగా శరీరం వివశమైనదేం? మనం మళ్ళీ అక్కడికెళ్ళొచ్చునా?" అంటూ ప్రశ్నలు వేశాడు.

"మిత్రమా! మనల్ని ఆదరించింది వారకాంత. ఆమె వెలయాలు కావడంవలన ఎప్పుడు పోయినా ఆటంకపరిచే వారుండరు. ఆమెను చూడడంతో నీ హృదయంలో శృంగారరసం అంకురించింది" అంటూ మన్మథావస్థలు వివరించాడు. "ఈ గుణాలు ఉపదేశం లేకుండానే మనుషులకి కలుగుతాయి. ఇంతవరకూ నువ్వు పరస్త్రీని చూడలేదు కనుక రసోదయం కాలేదు" అంటూ విద్యామందిరానికి తీసుకుపోయాడు.

ఆ రాత్రి జయభద్రుడికి నిద్రపట్టలేదు. ఉదయంలేచి కాలకృత్యాలు తీర్చుకుని "మిత్రమా! అక్కడి కెప్పుడయినా పోవచ్చు నన్నావుకదా. ఇప్పుడు పోవచ్చునా?" అని సుమిత్రుణ్ని అడిగాడు.

"రాజపుత్రా! ఇది సమయం కాదు. అక్కడికి సాయంకాలమే పోవాలి" అన్నాడు సుమిత్రుడు.

జయభద్రుడికి నిముష మొక యుగంగా గడిచింది

సాయంత్రం అతన్ని రహస్యంగా చంద్రికవద్దకు తీసుకుపోయి వారి నిద్దరినీ ఏకాంతానికి వదిలి – "ఇప్పుడే వస్తాను" అని ఉద్యాన వనానికి పోయాడు

రాజకుమారుడికి ఒకవేపు లజ్జ, మరోవేపు ఏమీ తెలియనితనం. అంతలో చంద్రిక అతనికి చందనం శరీరమంతా పూసింది. మెడలో పూల దండలు వేసింది. వీణవాయిస్తూ పాటపాడింది. అప్పటి కతనేం చెయ్యాలో మన్మధుడే బోధించాడు. వాళ్ళిద్దరూ సుఖపారవశ్యంలో తేలిపోసాగారు.

సుమంత్రుడు వచ్చి జయభద్రుణ్ణి యింటికిపోదాం, రమ్మన్నాడు. కాని - అతను తెల్లవారే వరకూ అక్కడే ఉండనిమ్మని వేడుకున్నాడు.

సుమంత్రుడు ఒంటరిగా పోయి జయభద్రుడి విషయమై ఏదో చెప్పి తెల్లవారాక వెళ్ళి జయభద్రుణ్ణి పిలిచాడు.

అతను - "రేపు పొద్దున్న రమ్మని చెబితే ఇప్పుడే వచ్చేశావేం?" అన్నాడు. సుమంత్రుడు నవ్వుతూ "రాత్రిగడిచి - సూర్యోదయమై రెండు జాము లయిం" దని చెప్పి - అతికష్టంమీద అతన్ని అవతలికి తీసుకువచ్చి రాత్రి విశేషా లేమిటని అడిగాడు.

"శృంగారమే రసము. వేశ్య రసికురాలు. ఆమె నాకు గురువు కంటే నీ కంటే శృంగారం చక్కగా నేర్పింది. ఇప్పుడు నాకా రసం చక్కగా తెలిసింది" అన్నాడు.

విద్యామందిరానికి వెళ్ళగానే ఉపాధ్యాయు డతన్ని చూసి - "కళ్ళింత ఎర్రగా ఉన్నాయేం?" అని అడిగాడు.

సుమిత్రుడు - మీరిప్పు డతన్ని పరీక్షించవచ్చు" అన్నాడు.

ఉపాధ్యాయుడు తానడిగిన ప్రశ్నలకు జయభద్రు డిచ్చిన సమాధానాలు విని పొంగిపోయాడు. అంతలో రాజకింకరు డేదో ఉత్తరం తెచ్చి ఉపాధ్యాయుడి కిచ్చాడు. అత నది చదివి - "నిన్ను అంతఃపురానికి పంపమని రాజుగారు రాశారు. ఈ కింకరుని వెంటవెళ్ళు" అన్నారు. సుమిత్రుడు జయభద్రునితో రహస్యంగా - "నేను క్షణంలో వస్తాను. నువ్విక్కడే ఉండు" అని రాజుదగ్గరికి వెళ్ళాడు.

"నాయనా! నీ మిత్రు డెప్పుడేనా వివాహం విషయం మాట్లాడుతున్నాడా? ఎన్నో సంబంధాలు వస్తున్నాయి. ఇప్పుడు ఇంద్రసేన మహారాజు సునీతి చిత్రపలకం పంపారు. ఆమె విద్యావతి, రూపవతి, గుణవతి అని జగత్ప్రసిద్ధి చెందింది. అలాటి సంబందాన్ని కాదనకూడదు. వాని తల్లికూడా ఈ సంబంధంలో ఉత్సాహం చూపుతోంది. ఈ చిత్రపటం తీసుకెళ్ళి చూపి వాడి నొప్పించు. నీకు మంచి పారితోషికమిస్తాను" అన్నాడు రాజు.

అందుకు సుమిత్రుడు – "జయభద్రుడు చాలాసార్లు నాతో వివాహవిషయం మాట్లాడాడు. సునీతి గురించి మేము కొంత విన్నాం. అతన్ని ఒప్పించి మీ కిప్పుడే వార్త పంపుతాను. అనుజ్ఞ యివ్వండి" అన్నాడు.

"స్త్రీలు చూడడానికి ఆ చిత్రపటాన్ని అంతఃపురానికి పంపాను. నువ్వెళ్ళు. నీ వెనకే పంపిస్తాను" అని అతనికి శల విచ్చాడు.

అతను వెళ్ళేసరికి జయభద్రు డెక్కడా కనపళ్ళేదు. 'వారకాంత ఇంటికి పోయిఉంటాడు. ఒక్కడే పోయాడు – నాతో పనిలేకుండా. అయ్యో! ఏమీ ఎరగని వాడిని దుర్వ్యసనంలో దింపాడు తను. ఇది ఎవరికేనా తెలిస్తే రాజకుమారుడి ఎంత కళంకం! –' అనుకుంటూ ఆ మేడకి పోయి – "జయభద్రా!" అని పిలిచాడు.

అతను లోపలికి రమ్మన్నాడు. "ఒక్కమ్మాట చెప్పాలి. బయటకురా" అన్నాడు సుమిత్రుడు. అత నెలాగో వచ్చాడు.

అతని చేయిపట్టుకుని – "నువ్వింత స్వతంత్రుడి వయ్యావేం? మీ నాన్నగారు నీ కోసం కబురు పంపారు. నువ్వు కనపడలేదని కింకరులు చెప్పారు. నేను తీసుకొస్తానని చెప్పి వచ్చాను. రహస్యంగా కూర్చుని చదువుకుంటున్నా వన్నాను. ఆలస్యం చేస్తే వాళ్ళు విద్యామందిరాని కొచ్చేస్తారు. సునీతి అనే రాకుమార్తె చిత్రపలకం తెప్పించారు. దానిని చూసి, ను వ్వంగీకరిస్తే వివాహానికి ముహూర్తం నిశ్చయించి శుభలేఖ ఇప్పుడే రాస్తారట. సునీతి అత్యంత అందగత్తె. వేగంరా" అన్నాడు.

జయభద్రుడు - "నా భారమంతా నీదే అన్నానుగా. నీకు నచ్చితే నాకు నచ్చినట్లే. నేను చిత్రఫలకం చూశాననీ నచ్చిందనీ నాన్నగారికి చెప్పు. శుభలేఖ రాయించు. నువ్వెళ్ళు. నేను నీ వెనకే వస్తాను - " అని తలుపు మూసుకుని లోపలికి పోయాడు.

మర్నాడే శుభముహూర్తం కావడంవల్ల వివాహప్రయత్నా లెక్కువ చేయకుండానే - కత్తిని మంత్రి సామంతుల కిచ్చి వివాహం చేసుకు రమ్మని రాజు పంపాడు.

ఆ రాత్రి సుమిత్రుడు మళ్ళీ జయభద్రుడి దగ్గరకుపోయి వివాహ విశేషాలు చెప్పి ఇంటికి రమ్మంటే - మర్నాడు ఉదయం తప్పకుండా వస్తానని ప్రమాణం చేశాడు. మర్నాడు అతన్ని పెళ్ళికొడుకుని చేస్తారని ఎంతో చెప్పగా విధిలేనట్లు అతను వచ్చాడు. తల్లితండ్రు లతనికి మంగళస్నానాలూ అవీ చేయిస్తూంటే పిచ్చివాడిలా ఉండిపోయాడు. సందు చూసుకుని చంద్రిక దగ్గరకి పోయేవాడు.

ఐదోరోజు సునీతి సారెతో అత్తారింటి కొచ్చింది. జయభద్రుడి కోసం ప్రత్యేకంగా అలంకరించబడిన మేడలో దిగింది. అదే రోజున - మిత్రుడైనరాజు శత్రువులచేత ఓడించబడి సహాయం రమ్మని వార్తపంపగా, రాజు ఆరుగురు కొడుకులనీ తీసుకుని, సైన్యంతో అక్కడికి వెళ్ళాడు. ఆ సందడిలో తనని ఎవరూ గుర్తించరని జయభద్రుడు చంద్రిక దగ్గరకు పోయాడు.

సాయంకాలం జయభద్రుడి తల్లి సుమిత్రుణ్ని పిలిచి - "మావాడికి మహాసిగ్గుగా ఉంది. నా దగ్గరే తలెత్తి మాట్లాడడం లేదు. వాడేనువ్వు, నువ్వేవాడు కనుక చెబుతున్నాను రాత్రి - వాడిని సునీతి మేడకు తీసుకుపోయి జరగవలసిన వినోదాలు జరిపించు" అంది.

అత నెంత వెదికినా స్నేహితుడా పరిసరాలలో కనపడక చిత్రఫలకం పట్టుకుని చంద్రిక ఇంటికెళ్ళాడు. అతన్ని కూర్చోబెట్టి చిత్రపలకం చూపించి - "నీ ప్రవర్తన విపరీతంగా ఉంది. ఎప్పటికప్పుడే ఏదో చెప్పి నన్ను మోగిస్తున్నావు" అని మొదలుపెట్టి, వేశ్య సంపర్కం

ఎందుకు కూడదో వివరించి, అతను ఇంటికి రావలసిన అవసరాన్ని నొక్కిచెప్పి వెంటనే తనతో రమ్మన్నాడు.

"ఆమె నిజంగా ఈ చిత్రంలోలా ఉందా? ఐతే ఈరాత్రి తప్పకుండా వస్తాను. చంద్రికను నువ్వు మామూలు వేశ్యలా పరిగణింపకు" అన్నాడతను.

ఎన్నో శపథాలు చేయించుకుని సుమిత్రుడు వెళ్ళాక - అత నా చిత్రపటంతో చంద్రిక దగ్గరకు వెళ్ళాడు. మిత్రులమధ్య మాటలను వినడానికి చంద్రిక ఒక దాసిని పెట్టిందని అతనికి తెలియదు. " ఈ బొమ్మలోనిది ఎంత అందంగా ఉందో చూశావా? ఈమెను భార్యగా పొందగలిగే వాడి అదృష్టం ఎలా ఉంటుందో, ఆమెలోని లోప మేమిటో చెప్పు. నీబుద్ధి చాతుర్యం చూస్తాను"అని చిత్రఫలకం అందించాడు.

ఆమె సునీతి సౌందర్యాని కాశ్చర్యపోయి ఆమెను చేరితే జయభద్రుడు మళ్ళీ తన ముఖం చూడడని - పటాన్ని అటూ యిటూ తిప్పి, అతను పరాకుగా ఉన్న సమయంలో కంటిగుడ్డు మీద చిన్న మచ్చపెట్టి "ఈమెకు ఎడమకంటి గుడ్డులో కళంకం లేకపోతే - చక్కనిదే. కాని ముఖానికి అందమే నేత్రాలు. అలాటి అందం లేనిదే ఏం లాభం? ఇలాటి దాన్ని లోపం కప్పిపుచ్చి కట్టబెట్టవలసిందే కాని పేరున్నవాడు పెళ్ళిచేసుకోడు -" అని అతని మనసులో విషం చిమ్మింది.

"అరె! ఇందాక నేను చూసినప్పు డా లోపం కనపడలేదే!" అని ఆశ్యర్యపోతూ అతను మళ్ళీ చిత్రపటం చూసేసరి కాలోపం కనిపించింది.

"మీ కనులు పెద్దవి కనుక చిన్న మచ్చ కనిపించలేదు. నా కనులు చిన్నవి కనుక కనిపించింది" అందామె నవ్వుతూ.

"అయ్యో! నా మిత్రుడెంత ద్రోహం చేశాడు! వాడి మాట నమ్మడం వల్లే గుడ్డిది తటస్థపడింది. ఇక నన్ను గుడ్డిదాని మొగుడంటారు కాబోలు. ఈ అపఖ్యాతెలాపోతుంది?...దానిమొహం యిదివరకు చూడలేదు కదా. ఇటుపైన కూడా చూడను

అదే దానికి ప్రాయశ్చిత్తం నేనీ చంద్రికతో కలుసున్నానని సుమిత్రుడిలా చేసి ఉంటాడు ఎవరినీ నమ్మకూడదనే శుక్రనీతి యదార్థం." అనుకుంటూ, ఆ పటం తన భార్యదని చెప్పకుండా మూలకి విసిరేశాడు.

కలతపడిన అతని మనసు చంద్రిక ఉపచారాల వల్ల తేటపడింది

సుమిత్రుడు సునీతి ఉన్న మేడకి అలంకారాలూ అవీ చేయించి ఎంతసేపు ఎదురుచూసినా జయభద్రుడు రాకపోడంతో – కోపంగా చంద్రికింటికి వెళ్ళాడు. తలుపుమూసి ఉంది దాసితో కబురంపాడు. ఆమె ఒకచీటీ తెచ్చింది. "నువ్వు నాకు స్నేహితుడిరూపంలో ఉన్న శత్రువ్వి నాజన్మంతటకీ సరిపడే అపకారం చేశావు ఇంతటితో నీస్నేహం సరి. ఇక ఎన్నడూ నాదగ్గరకు రాకు. నీతులు చెప్పకు " అని ఉందాచీటిలో. అది చదివి సుమిత్రుడు మూర్ఛపోయాడు. అంతలోనే లేచి – 'వెలయాలి బోధ యింత చేసిం దన్నమాట! ఇక నాకు మిత్రుడి దర్శనం లభింపదు కాబోలు. ఏం చెయ్యాలి? ఇంత నింద మోపడానికి నేనేం అపకారం చేశాను? అతనికోసం ఎదురు చూస్తున్న సునీతికేం చెప్పేది?"అని దుఃఖిస్తూ – అంతఃపురానికి పోయి సునీతి కొక ఉత్తరం పంపాడు. "తల్లీ! నీ భర్త వేశ్యాలోలుడై రావడం లేదు. నామీద అకారణంగా శత్రుత్వం వహించాడు. నా మాట వినడం లేదు. నే నతన్ని మార్చాలని ప్రయత్నిస్తున్నాను. అంతవరకూ దీనిని గుట్టుగా ఉంచు. కాలక్రమంలో అన్నీ చక్కబడతాయి. అల్లరి చేసుకుంటే ఇహపరాలు రెండింటికీ దూరమౌతావు."

అది చదివిన సునీతి – ఏదో ఆలోచించుకుంది. రహస్యంగా కాలక్షేపం చేయసాగింది. జయభద్రు డక్కడే ఉన్నాడని మిగిలిన వాళ్ళనుకున్నారు



# సునీతి కథ

పాతివ్రత్యంలో చంద్రమతికి సాటివచ్చే సునీతి అలా గుట్టుగా గడుపుతూంటే – "చెల్లీ నువ్వొక్కమాటైనా మరిది నివతలకి రానివ్వకుండా చక్కగా వశపరచుకున్నావు నీ అదృష్టం మంచిది – " అని తోటి కోడళ్ళు దెప్పుతున్నా చిరునవ్వు నవ్వి ఊరుకునేది.

ఒకనా డామె పరిచారిక భ్రమరిక అనే ఆమె ఏదో ఆకు తీసుకొచ్చి – "అమ్మా నువ్వెంతో చక్కని దానివి విద్యావంతురాలివి గుణవంతురాలివి ఇలాటి నీకు భర్త సుఖం కరువైంది అతన్ని చూడాలని ఎంత ప్రయత్నించినా అతను కనపడడు ఎప్పుడొస్తాడో, ఎప్పుడు పోతాడో? ఈ రహస్యం వారి ఆప్తులతో చెప్పి మందలిద్దామన్నా నువ్వొప్పుకోవు ఇది మీ తండ్రికి తెలిస్తే ఎంతో కోపగిస్తాడు

చిన్నప్పటినుంచీ నీతో పెరిగిదానిని అందుచేత నాకింత చింత.

ఇవాళ పొద్దున్న నేనిక్కడి దేవాలయానికి వెళ్ళాను. అక్కడ జటాజూటంతో అపరశంకడిరులా ... జపం చేసుకుంటున్న ఒక సిద్ధుడు కనిపించాడు అతన్ని చూస్తేనే మహానుభావు డనిపిస్తుంది. అందరూ వెళ్ళిపోయాక నే నతని పాదాలమీద పడి . స్తుతించి . నీ పరిస్థితి వివరించి . నీభర్త వేశ్యాలోలుడైన విషయం చెప్పాను అత నడుగగా నీ వృత్తాంతం చెప్పాను .

అప్పు డతను హరి నామస్మరణ చేస్తూ తన వద్దనున్న భరిణలో దాచిన ఈ ఆకుతీసి –

"దీని పసరు అతని శరీరంలో ఎక్కడరాసినా అత నామెకు వశు డౌతాడు ఇది దేవతా సిద్ధౌషధం సునీతి నీతిమతికనక కాని సామాన్యుల కివ్వను. అలస్యమైతే పసరు రాదు. వేగంగా వెళ్ళి ప్రయత్నించు" అంటూ దానినిచ్చాడు. ఇదిగో" అని అందించింది.

— కాశీ మజిలీ కథలు – 3వ భాగం

"సఖీ! నీకు నా యందెంత వాత్సల్యం! నాకోసం చాలా శ్రమపడ్డావు. దేవుని దయవలన పరిస్థితి చక్కబడితే నా ఐశ్వర్యమంతా నీదే. ఆ సిద్ధుడుత్తముడు. సరే. ఈ రాత్రే ప్రయత్నిస్తాను కాని నేనింత వరకూ అతని మొహమే చూడలేదే! ఈ రాత్రి మాత్రం ఎలా సంభవిస్తుంది?" అంది సునీతి.

"ఆయన బోజనాని కింటికి వస్తారు కదా. మీ అత్తగారి నడిగి ఈరాత్రి నువ్వు వంటచేసి వడ్డించు. అప్పుడు సులభంగా పసరుని అతని మీద చిమ్మవచ్చు" అంది

సునీతి అత్తగారితో..."వా రీరాత్రి తనకి ప్రత్యేకమైన వంటలు చేయమన్నారు" అని చెప్పి ఆవిడ ఇచ్చిన సామగ్రి తీసుకుని - అద్భుతమైన పిండి వంటలు చేసి చక్కగా అలంకరించుకుని - జయభద్రుడు వచ్చి వడ్డించమనగానే వడ్డించసాగింది అప్పుడామె తన మగని చక్కదనాన్ని చూసి ఇంత చక్కని వాడిని చూడడానికైనా నోచుకోలేదు కదా అని విచారించింది.

అతని దృష్టంతా చంద్రిక మీ దుండడంచేత - ఆమె ఎవరో అనుకుని భోజనం చేశాడు. సునీతి ఆ పసరు నతనిపై చిమ్మడం విరమించుకుని - తనమంగళసూత్రం చల్లగా ఉంటే అంతే చాలనుకుని...మళ్ళీ తనమేడలోకి వచ్చేసింది.

భ్రమరిక కష్టపడి తెచ్చిన పసరును తాను వృధా చేసిందని చింతిస్తూ..మేడలోకి పోయేదారిలోని పుట్టకలుగులో పోసి - ఆ విషయం ఆమెకు చెప్పకుండా తలుపేసుకుని శయ్యమీద చేరి తన భర్త రూపవిశేషాలన్నీ దాసికి చెప్పసాగింది. అంతలో తలుపు శబ్దమైంది. సునీతి - "ఎవరు?" అని అడగ్గా "జయభద్రుణ్ణి" అని జవా బొచ్చింది.

తటాలున మంచం దిగి తలుపు తీసింది అతని పాదాలు కడిగి శిరసున చల్లుకుని అతనితో సరసంగా మాట్లాడుతూ అతని మనసు

కరిగించింది. అతను చాలా సంతోషించి తాను తెచ్చిన రత్నాల నామె కిచ్చాడు. రతి తప్ప తక్కిన శృంగారకేళులుతో ఆమెను తృప్తి పరచి అతను వెళ్ళిపోయాడు అలాగ ప్రతిరాత్రీ అతనువచ్చి ఆమెతో గడిపి రత్నాల నిస్తున్నాడు

ఆమె ఆ రత్నాలను మార్చి దానధర్మాలు, దేవతారాధనలు, వ్రతాలూ చేస్తూ ఏరోజు ధనం ఆరోజే ఖర్చు చేయసాగింది

అందువలన ఆమెకు చాలా పుణ్యాత్మురాలనీ, జయభద్రుడు చాలా ప్రయోజకుడనీ పేరు రాసాగింది '

గోపకుమారుడు సిద్ధుడికి నమస్కరించి – "అయ్యా నాకో సందేహం కలిగింది వెర్రిగొల్లవాడిని కదా అని సందర్భమూ హేతువూ లేకుండా కథ చెప్పుకుపోతున్నారు జయభద్రుడు చంద్రిక ఇంట్లో ఉండేవా డన్నారు. దానిని విడచి ఆ రాత్రి సునీతి ఇంటి కెందు కొచ్చాడు? ఇంత విలువగల రత్నా లెలా రోజూ తెస్తున్నాడు? ఇంకా. రతి చేయకుండానే సంతుష్టి చెందే డన్నారు అలా చెయ్యడానికి కారణమేమిటి? నా కేమీ అర్థంకావడం లేదు వివరించండి ' అన్నాడు

మణిసిద్ధుడు నవ్వుతూ 'నువ్వడుగుతావో అడగవో..కథ నెంత శ్రద్ధగా వింటున్నావో పరీక్షించాను సర్లే. విను.

సునీతి ఔషధి పసరు నొక పుట్టలో పోసిందని చెప్పాను కదా పాతాళలోకంలోని నాగరాజు విహారార్థం భూమికి బయలుదేరి ఆ దారిన పైకి వస్తుంటే శిరస్సుమీద పసరు పడింది దాంతో అతని కామెమీద అనురాగం కలిగింది కామరూపు డవడం వల్ల జయభద్రుని వేషం దాల్చాడు. కాని ఆమె పాతివ్రత్యాన్ని భంగం చేయడానికి కిష్టపడక దివ్య ప్రభావం వల్ల అలాటి తృప్తిని కలిగించాడు నాగ రాజుకి రత్నాలకి కొదవుండదుకదా? అసలు జయభద్రుడి కివేవీ తెలియవు. అతను చంద్రిక ఇంట్లోనే నివసిస్తున్నాడు.

ఒకనాడు చంద్రిక వీధి గుమ్మంలో నిలుచుని ఉండగా - మణిహారాలు పట్టుకుని ఇద్దరు బ్రాహ్మణులు వెళ్తున్నారు. అవి ఎవ రిచ్చారని ఆమె అడిగింది వారు సునీతినీ జయభద్రుడినీ వారి దానగుణాన్నీ తెగపొగడుతూ చెప్పారు.

చంద్రికకు - జయభద్రుడు సునీతికి రహస్యంగా సొమ్మిచ్చి వస్తున్నాడేమో. .అని అనుమానం వచ్చి - తెలుసుకు రమ్మని ఒక దాసిని పంపింది. ఆమె వృద్ధబ్రాహ్మణి వేషం వేసుకుని సునీతి దగ్గరకు వెళ్ళింది సునీతి ఆవృద్ధ ముత్తయిదువని - "అవ్వా! మీదేవూరు? ఎక్కడికి పోతున్నావు? ఇన్నాళ్ళు ఐదోతనం కల నీపుణ్యం గొప్పది-" అంది.

"అమ్మా! మాది కాశ్మీరదేశం నామొగుడు చిన్నతనంలో కాశీకిపోయి నేటివరకూ రాలేదు. ఆయనని వెదుకుతూ దేశాటనం చేస్తున్నాను. నీకీర్తి విని వచ్చాను. నీభర్తకి నీమీద అనురాగముందా? సంతానముందా? ఈ ఐశ్వర్యం పతిసంపాదనా, పుట్టింటి వారిదా? నిజంచెప్తే వినాలని ముచ్చటగా ఉంది" అం దవ్వ.

సునీతి "నాకు పతియే దైవం. నా ఐశ్వర్యమంతా పతిసంపాదనే ఇంకా సంతానం లేదు. దైవానుగ్రహంవల్ల నా కేలోటూ లేదు " అంటూ ఆ బ్రాహ్మణికి భోజనంపెట్టి దారి బత్తెంగా ఒక ముత్యాలహారం ఇచ్చింది.

ఆ దూతిక చంద్రికవద్ద కొచ్చి - అనంగచంద్రిక కాహారం చూపగా ఆమె సునీతి దాతృత్వాన్ని మెచ్చుకుంది. 'జయభద్రు డెంత మాయవాడు! రహస్యంగా భార్య కన్నీ ఇస్తూ నావద్దకు వట్టిచేతుల్తో వొస్తాడు ఈ హారమొక్కటే వెయ్యి దీనారాలు చేస్తుంది. ఇలాటిది ఒక్కనాడేనా నా కివ్వలేదు. ఇతనిమీద ఆశతో నా ఐశ్వర్యమంతా ఖర్చుచేశాను ఏమడిగినా - తండ్రి చాటువాడిననీ, తనకేమీ దొరకవనీ అంటాడు వీడినేం చేసినా పాపంలేదు. ఈరాత్రే వీడికి తగిన ప్రాయశ్చిత్తం చేయాలి" అనుకుని నలుగురు దొంగలకి కబురు చేసి వాళ్ళకి కర్తవ్యం బోధించింది.

ఆ రాత్రి భోజనం చేసి వచ్చిన జయభద్రుడికి - తనకి ఆరోగ్యం బాగోలేదనీ - వేరొక మంచం మీద పడుకోమనీ దాసీ చేత చెప్పించింది.

"అనంగచంద్రి కెక్కడుంది? వైద్యుణ్ణి పిలిపించేదా?" ఆత్రంగా అడిగా డతను

'ఇప్పు డెవరొచ్చినా రానివ్వొద్దని నాకు చెప్పి గాఢంగా నిద్రపోయింది మీ రా మంచం మీద పడుకోండి. పొద్దున్న చూడొచ్చు" అంది దాసి.

అతను పడుకుని - "అయ్యో నాకిదేంకర్మ? కామంవల్ల కదా ఈ మూల పడుండ వలసివచ్చింది. ఈ తుచ్ఛురాలివల్లే ప్రాణమిత్రుడి తోనూ భార్యతోనూ విరోధం తెచ్చుకున్నాను ఇప్పుడు నా గౌరవం చూడక నన్నిలాటి దుర్గంధంలో పడుకోమంది. అతి పరిచయం అనర్ధమే. సరే. రేపు నా భార్య ఇంటికి పోతాను అది గుడ్డిదని ఇది కల్పించి చెప్పిందేమో. ఇకదీని ఇంటికిరాను" అనుకుంటూండగా నిద్రపట్టేసింది

తెలివొచ్చేసరికి నక్షత్రాలు కనపడ్డాయి. 'ఇదేమిటి? నేను గదిలో పడుకుంటే. చుక్కలు కనపడుతున్నా యేమిటని ఆశ్చర్యపోతూంటే - అతనికి మాటలు వినపడ్డాయి.

భీముడు : మారేసూ! ఈయ నెవర్రా? బోగందానికీ ఇతనికీ విరోధమెందు కొచ్చిందిరా?

మారేసు : మనరాజుగారి అఖరి కొడుకు వెర్రిబాగులోడు. ఉన్నదంతా ఊడ్చి ముండకిచ్చేడు. ఇక యివ్వడాని కేమీ లేదేమో. నూతిలో పారేయమంది. బోగమాళ్లకి నీతుంటుందా?

భీముడు . ఈయనకి పెళ్ళాముందా?

మారేసు . ఈయన పెళ్ళామే కదరా భీముడూ, బ్రామ్మలకి దానధర్మాలు చేస్తది? అలాటామె నిడిచిపెట్టినందుకీయన కీ శాస్తికావలసిందే.

భీముడు . బోగంది మన కేమిస్తానంది?

మారేసు . వేరే అడగక్కర్లేదు. వెనకటి మామూలే.

కాశీ మజిలీ కథలు - 3వ భాగం

భీముడు : ఇది వరకెవరినేనా తీసుకుపోయావా?

మారేసు : దీనితల్లి నాటినుంచీ మే మీ పనిచేస్తున్నాం. కొన్నాళ్ళు నాతో దర్మడు వచ్చేవాడు. కాసుగాడూ వొచ్చేవాడు వాళ్ళిద్దరూ లేక నిన్ను పిలిచాను. ఇలాటి రాజకుమారుల్ని పదిమందిని పడేశా నీనూతిలో.

భీముడు : వాళ్ళనెందుకు పడేశావ్?

మారేసు : ఎందుకేంటి. వాళ్ళదగ్గర డబ్బున్నన్నాళ్ళూ బాగా చూస్తుంది. డబ్బయిపోతే ఇలాగే చంపించేస్తుంది. సాలుకి నాకు సంచీ రూపాయలు ముట్టజెబుతుంది.

భీముడు : నీకు మంచి అండే దొరికింది. ఇటుపైనుంచి నన్నుకూడా పిలుస్తూండు.

మారేసు : ఈ యేడు కన్నాలవ ల్లెంత ముట్టింది?

భీముడు : ఇంకా పంచుకోలేదు. ఎలాగేనా నిరుటికన్న తక్కువే బంట్రోతులకి, అమ్మోరికి, పంచాగం బ్రాహ్మడికి, నాయకుడికి – అందరికీ పంచగా ఏం మిగులుతుంది?

మారేసు : మునపటి లాబాలు లేవు. అన్నిళ్ళల్లోనూ ఇనప్పెట్టిలే. గాజుదీపాలే. అవి ఆర్పడమే తెలియదు చవక చమురు మనకొంప తీస్తూంది.

ఆ దొంగల మాటలనుంచి – అనంగచంద్రిక చేసిన దుర్మార్గం అర్థమై, ఏం చేయాలో తోచక, దేవుణ్ణి ధ్యానిస్తూ, 'వారకాంతల వలపులు నమ్మొద్దని చెప్పిన మిత్రుడి మాట వినకపోడంవల్ల కదా ఈ గతి పట్టిం'దని విచారించాడు. దొంగలు మంచంతో సహా నూతిలో పారేసారు.

ఆ నూతిలో నీరెక్కువగా ఉండడంతో అతను కొంచెమునిగి, ఈతరావడం వల్ల పైకి వచ్చి ఒక మర్రిమొక్క పట్టుకుని అలసట తీర్చుకోసాగాడు

అంతలో నూతిలో మరేదో పడిన చప్పుడైంది. వేలాడుతున్న అతని పాదాలకు -మృదువైన వేళ్ళు, కాళ్ళు తగిలాయి. మనిషిఅని తేల్చుకుని ఆవేళ్ళకు తనకా ళ్ళందించాడు. చేతితో తడిమేసరికి జుత్తందింది. పొడవైన ఆ శిరోజాలను పట్టుకుని పైకి లాగగా మృదువైన పరిమళం వ్యాపించింది. ఆమె స్త్రీ అని గ్రహించి - అయ్యో! నాలాగే ఈమెనూ ఏదుర్మార్గులో నూతిలో పడేశారు. బతికున్నట్లే ఉంది. ఈమెను కాపాడతాను - అనుకుంటూ ఆమెను ఎత్తిపట్టుకుని కౌగిటిలో బిగించి మునగకుండా నిలిపాడు. ఆమె అతని భుజంమీద వాలి అలసట తీర్చుకోసాగింధి. అప్పటికి సూర్యోదయమైంది ఒకరినొకరు చూసుకుని ఆశ్చర్యపోయారు. జయభద్రుడు "నాకువచ్చిన అవస్తే నీకు వచ్చిందా? మెరుపుతీగెలా ఉన్న నిన్ను నూతిలో పారెయ్యడాని కే కరినుడికి చేతులొచ్చాయి? నువ్వేం నేరం చేశావు?" అని అడిగాడు.

ఆమె - పైకి వెళ్ళాక చెబుతానన్నట్లు సంజ్ఞ చేసింది. అత నామెకు ధృడమైన మర్రిమొక్క నందించి, తాను మెల్లగా మొక్కలని పట్టుకుని పైకి పోయాడు. అక్కడ దొంగలు పారేసిన తాళ్ళు ముడివేసి ఆమెను గట్టెక్కించాడు. ఇద్దరూ పునర్జన్మెత్తినట్లే భావించారు.

అది మహారణ్యం కనక జనసంచార మేమీలేదు. అక్క డుండడానికి సందేహించి ఎక్కడికేనా పోదామనుకున్నారు. ఆమె కాకలిగా ఉన్నట్లు గ్రహించి - కనిపించిన వెలగ చెట్టెక్కి పళ్ళుకోసి ఆమెకిచ్చాడు. ఎండవేడికి వాడిపోయిన ఆమెను ఒక చెట్టు నీడకు తీసుకెళ్ళి ఆమె చరిత్ర అడిగే ముందు తన గురించి - "నేను కుంతిభోజుడను రాజు ఏడవకుమారుడు జయభద్రుణ్ని ఒక వార కాంత మాయలో పడి భార్యను నిరసించి ఇలాటి పాట్లు పడుతున్నాను ఇలాటి అవస్థ అనుభవించవలసి ఉండి - ప్రాణమిత్రుని మాట పెడచెవిని పెట్టాను" అని తనకధ చెప్పాడు.

అప్పు డామె అతని వృత్తాంతానికి విచారించి తన కధ చెప్పసాగింది.



# కాశీ మజిలీ కథలు

## 19 వ మజిలీ

### హైమవతి కథ

"అయ్యా! సైంధవ లవణమునూ, అడవి ఉసిరికాయనూ కలిపినట్లు విధి విచిత్రాలు చేస్తూంటాడు. మీ తండ్రీ, నా తండ్రీ స్నేహితులే.

మా తండ్రి పేరు మంత్రపాలుడు. మేము మగధదేశ రాజధానైన అమరావతిలో ఉంటాము. మాతల్లి - చంద్రమతి. మా తండ్రి ధర్మంగా పాలిస్తూంటే లేకలేక ఈశ్వరి కటాక్షంవల్ల నేను పుట్టాను. నేనుపుట్టుకతోనే అతిచక్కనిదాన్ని.

నాకు యుక్త వయసు వచ్చేటప్పటికి నాకు తగిన వరునికొరకు అనేక దేశాల నుంచి మాతండ్రి వరుల చిత్రపటాలు తెప్పించాడు. వాటిలో మీది ఉంది. నేను సమ్మతి తెలిపాను కానీ అప్పటికే మీకు వేరొకరితో పెళ్ళి నిశ్చయమైనదట. అందుకు ఆశాభంగం చెంది మిగిలిన వరులను మా తల్లితండ్రులు పరిశీలించారు. కళింగదేశరాజు వీరపాలుని కుమారుడు గుణవర్మ సమస్తశాస్త్రాలూ గ్రహించిన సుందరుడు. కాని వాని పరిస్థితి సామాన్యంగా ఉంది. కొంచెం అప్పు లున్నాయి. లాటదేశపు మహారాజు శూరపాలుడి కొడుకు ధనవర్మ. సామాన్యరూపసి. విద్యలేదు. కుబేరు డంత ధనం కలవాడు.

మా తల్లి ధనవర్మకే న న్నివ్వమంది. కాని మాతండ్రి ధనం కంటె విద్యగొప్పదని నన్ను గుణవర్మ కిస్తానన్నాడు. వారిద్దరిమధ్య వాగ్వాదం జరిగింది. ఎటూతేలలేదు.

మా తండ్రి కోపగించి - గుణవర్మకు నన్నిస్తున్నట్లు శుభలేఖ వ్రాయించి వీరపాలుడి కప్పటికప్పుడే పంపేశాడు. మా తల్లి నన్ను

ధనవర్మకిచ్చి వివాహం చేస్తానంటూ - రహస్యంగా ధనవర్మ తండ్రి శూరపాలునికి లేఖపంపింది.

అయిద్దరూ నన్ను వివాహం చేసుకోవాలని ఉత్సాహ పడుతున్న వారే కనుక - శుభముహూర్తానికి మాపట్నం వచ్చేశారు.

మా తండ్రి వీరపాలుడి పరివారాన్ని తగిన విడిదిలో ఉంచి ఉపచారాలు చేయిస్తూంటే, మాతల్లి తాను రహస్యంగా ఏర్పాటు చేసిన విడిదిలో శూరపాలుడి పరివారాన్ని దింపి - ముహూర్తంకోసం ఎదురుచూడసాగింది.

వివాహ ముహూర్తం వేకువ జామున కనక రాత్రినుంచీ పెళ్ళి సందడి ప్రారంభమైంది. అటు గుణవర్మ పల్లకీలో ఊరేగుతూంటే, ఇటు ధనవర్మ పేరు చెప్పకుండా ఊరేగ సాగాడు. నన్ను పెళ్ళికూతురిని చేసి వింతగా అలంకరించారు.

మా అమ్మ నాతో రహస్యంగా - "నిన్ను మీ తండ్రొక దరిద్రుడికిచ్చి గొంతు కొయ్యదలచుకున్నాడు. ఆ దరిద్రం నువ్వు భరించలేవు. అందుకు నేనో ఉపాయం ఆలోచించాను. ధనవర్మ ఐశ్వర్యం గురించి నీకు తెలుసుకదా. పైన చూస్తే తమలపాకుల తట్టలా కనిపించే ఒక బుట్టలో నిన్ను దాసి తీసుకుపోయి నాపేర నున్న సత్రంలో దింపుతుంది. ఆపెళ్ళివా రక్కడ పీటలమీద సిద్ధంగా ఉన్నారు" అంది.

నే నామె మాటలు తీసెయ్యలేకపోయారు.

ఆ దాసి నన్ను గంపలోపెట్టి ఒక వీధిలోంచి వెళ్తూంటే - అక్కడ ఇళ్ళంటుకుని - మంటలూ శబ్దాలూ చెలరేగాయి. సామానులు బయట పడేస్తూండడంతో తోవలేకపోయింది. నెత్తిమీద గంపలో గృహస్తుల సామాను దొంగిలించి పోతూందని రక్షకభటులు దానినాపి ప్రశ్నలు వేశారు. అది కంగారులో ఒకమాటకి మరోమాట చెప్పగా - ఆగంప లాక్కుని ఒకచోట పెట్టించారు. అగ్నిజ్వాలల నార్పడానికి రక్షకభటులు వెళ్ళిపోయారు.

అది మళ్ళీ వచ్చి నన్ను తీసుకెళ్తుందేమో అని నే నెదురు చూస్తూంటే – గుఱ్ఱాలమీద పోతున్న పురుషులు గృహస్తుల మాటలతోపాటు, బరువుగా ఉందని నాగంపని కూడా గుఱ్ఱంమీద వేసుకున్నారు. అగ్నిప్రమాదం హడావిడిలో ఆ దొంగలని రక్షకభటులు పట్టించుకోలేదు.

"మనం వచ్చిన వేళమంచిది. అగ్ని ప్రమాదం జరగకపోతే పెళ్ళి వారింత అశ్రద్ధగా ఉండరు. వారి పెట్టి లింత సులువుగా మనకి చిక్కేవికావు "

"పెళ్ళి సమయంలో ఎలాగూ పరధ్యానంలో ఉంటారులే."

"మనవేషాలు చూసి దొంగలనుకోరు. రాణిగారి సత్రంలో పెళ్ళివారెవరో?"

"భాగ్యవంతుల లాగే ఉన్నారు మరి – మేళతాళా లెందుకు లేవో?"

"ఎందుకు వృథా అని మానేసుంటారు. పెళ్ళికొడుకు మాత్రం చాలా బాగున్నాడు."

"రాజ బంధువులం అనగానే నమ్మేశారు!...మనని తరుముకుంటూ రారు కదా?"

"మనం చాలా దూరం వచ్చేశాం. ఈ అడవిలో దారి మన కలవాటుకాని వారికేం తెలుస్తుంది?"

"ఇక్కడ ఆగి సొమ్ము పంచుకుందాం. తెల్లవారబోతూంది."

నాకు వారిమాటలు వినిపిస్తున్నాయి. బుట్టపేళ్ళ సందుల్లోంచి కొంచెం కనిపిస్తూనూ వుంది. వాళ్ళు గుఱ్ఱా లాపి – అందర్నీకేకవేసి – పెట్టెలు దింపి – వాటిలోని రత్నాలనీ, బంగారాన్నీ రాసిగా పోసి పంచుకోసాగారు. న న్నెక్కించుకున్న గుఱ్ఱపురౌతు ఎంతకీ రాలేదు. నేను మెల్లగా మూత తీసుకొని గంపలోంచి బయటికొచ్చాను. రౌతొకచోట పాము కరిచి చచ్చి పడున్నాడు.

దేవుడు నాయందున్నా డనుకుంటూ – అడవంతా తిరుగుదామని ధైర్యం తెచ్చుకున్నాను. కొంచెందూరంలో – విలువకల వస్త్రాలతో పెట్టెలు

కనిపించాయి. ఆ ప్రక్కన తినుబండారాలు కల గంప కనిపించింది. వాటితో ఆకలితీర్చుకుని - ఒక తోవ కనిపిస్తే దాని వెంట పోయాను.

క్రూరమృగాల అరుపులకు భయపడ్డాను ఆ అరణ్యమూ అదీ కలలా అనిపించసాగాయి దేవుణ్ణి తలుచుకుంటూ వెళ్తొంటే ఒకపొదలోంచి పులిగాండ్రు మంది నేను మూర్ఛపోయాను.

తెలివొచ్చేసరి కది బాణం దెబ్బకు చచ్చిపడుంది. ఆశ్చర్యంతో చుట్టూ చూశాను. నల్లని ముఖమూ, కోరపళ్ళు, మిడిగుడ్లూ కలిగి జంతువుని తలపించేలా ఎవడో వస్తున్నాడు. వాడు బాణాలూ, విల్లూ ధరించబట్టి మని షనుకున్నాను. వాడు నన్ను చంపేస్తా డనుకున్నాను.

కాని - "పెట్టా! నువ్వెవరివి? ఈ అడవి కెందుకొచ్చావ్? నీవూరేది?" అంటూ అస్పష్టమైన మాటలలో అడిగాడు.

నే నంతా చెప్పి - "నీక్కావసినంత ధన మిస్తాను. నన్ను మావూరు చేర్చగలవా?" అని అడిగాను.

మూటలోంచి తినుబండారాలు తీసిచ్చాను. వా డవితిని ఆనందంతో గంతులేస్తూ - "ఇవి ఏ చెట్టుని దొరికాయి? చూపు. ధన మంటే ఏమిటి? నువ్వు కట్టుకున్న ఆకు మంచి మెత్తగా ఉంది. మా అడవిలో ఇలాటివి లేవు మీ అడ వెక్కడుందో చూపిస్తావా?" అంటూ అమాయకంగా ఏవేవో అడిగాడు. నాకు ఋష్యశృంగుడు జ్ఞాపకం వచ్చాడు వాడిని చూస్తుంటే.

"నాకు పిల్లలు లేరు. భార్యుంది. నిన్ను మా యింటికి తీసుకెళ్తాను, వొస్తావా?" అని అడిగాడు.

"అలాగే, పద..." అన్నాను.

"ఇందాక పెట్టినవి మరికొ న్నివ్వవా?" అని దీనంగా అడిగాడు. నేనన్నీ ఇచ్చేశాను. అవి తిని వాడెంత ఆనందించాడో! కొంతదూరం వచ్చాక - "నువ్విక్కడే ఉండు. నేను పోయి ఆ పులి మాంసం తెస్తా. దాని చర్మం చలికాలంలో వెచ్చగా ఉంటుంది. చర్మాలు

చాలా ఉన్నాయింట్లో, మాంసం లేదు. ఒట్టిచేతుల్తో ఇంటికెళ్తే నాపెళ్ళాం బాదుతుంది" అన్నాడు.

"ఇక్కడ మృగాలబాధ, చాలా ఎక్కువగా ఉంది. నీ విల్లు, బాణాలు చూసి అవి మనదగ్గరకి రావడం లేదు. నీతో వెనక్కి రావాలంటే కాళ్ళు నొప్పెడుతున్నాయి. నన్ను మీ ఇంటిదగ్గర వదిలి మాంసం తెచ్చుకుందువు గాని" అని బతిమాలాను.

"అలాగే. కాని నా పెట్టతో నేను పులిని కొట్టానని చెప్పకు. ఏమీ దొరకలేదంటాను నేను" అన్నాడు. కొంతదూరం తీసుకుపోయి – తాటాకులతో కప్పిన ఒక డొంకను చూపించి "యిదే మా ఇల్లు" అన్నాడు. అందులో చర్మాలు తప్ప మరేమీలేవు. ఆ కంపుకి నే నివతలకి వచ్చి కక్కుకున్నాను. అప్పుడు వాడు వెదురుగొట్టంలోంచి తేనె తీసి ఇచ్చాడు. ఆకలి మీదున్న నేనది తీసుకున్నాను.

అంతలో మృగంలాటి అతని పెట్టొచ్చింది. నా గురించి అది అతనితో తగువు పెట్టుకుంది. నేను దాని కాపరం చెడగొట్టేదాన్నని తిట్టింది. నేనెంత చెప్పినా నావృత్తాంతం చెప్పినా, వినకుండా – "నా బంధువులతో చెప్పి నిన్నేం చేయిస్తానో చూడు" అంటూ పోయింది.

సాయంకాలమౌతూంటే, నేను క్రూరమృగాల గురించి భయపడుతూంటే – "పులిచర్మం కప్పుకుంటే నీ దాపు కే మృగంమూరాదు. నా పెట్టకల్లు త్రాగి అలా పేలింది. పొద్దుట మామూలుగా వొస్తుంది. నీకేం భయం లేదు" అనివాడు ధైర్యం చెప్పాడు.

ఆ దుర్గంధానికి నాకు నిద్ర పట్టడంలేదు. అంతలో...అది వచ్చి – నన్ను బంధువులకి చూబిస్తూ... "నా కాపురం చెడిపిన రంకులాడి" అని చెప్పింది.

ఆమె బంధువు లతన్ని "కులం విడిచినందుకు తప్పు పెట్టిస్తాం చూడు" అని అరుస్తూ నన్ను బలాత్కారంగా కాళ్ళు చేతులూ పట్టుకుని ఈ నూతివద్దకు మోసుకొచ్చి – "చావు, రండా" అని నూతిలో పడేశారు. తరువాత జరిగింది మీకు తెలిసిందే" అని ఊరుకుంది.



# కాశీ మజిలీ కథలు

## 20. వ మజిలీ

జయభద్రుడు హైమవతి చరిత్ర విని దైవలీల కెంతో ఆశ్చర్యపడ్డాడు. అతని కామె మీద మన్మధ భావం కలిగినా ఆమె మనసు తెలుసుకునేవరకూ తొందర పడకూడదను కున్నాడు.

"హైమవతీ! ఎండ ఎక్కువగా ఉంది. ఇది క్రూరమృగా లుండే అరణ్యం. చీకటిపడ్డాక ఇక్కడుంటే ప్రమాదం. ఏదైనా వూరు చేరుకోవాలి. సుకుమారివైన నువ్వెలా నడవగలవు? నా భుజాల మీద కూర్చో. మెల్లగా తీసుకు పోతాను." అన్నాడు.

"నేను మీ కంత శ్రమివ్వలేను. నన్నుద్ధరించిన దేవుడికి ఏమిచ్చి ఋణం తీర్చుకోవాలా అని ఆలోచిస్తున్నాను. మీ వెనకే నడుస్తాను పదండి" అంది.

ఇద్దరూ నడవసాగారు. మాటలైతే చెప్పింది కాని ఆమె నడవలేక పోతూంది. "ఎలా తెల్లవారుతుందో?" అందామె బెదురుగా. "భయపడకు. నిన్ను నా భుజాల మీదుంచుకుని కాపాడతాను. నీప్రాణానికి నాప్రాణం అడ్డు.... అదిగో ఆశిలాఫలకం మీద..నా తొడమీద తలపెట్టుకుని నిద్రపోదువుగాని" అంటూ అటు తీసుకెళ్ళాడు.

ఆ రాత్రి త్వరగానే గడిచింది.

ఉదయం లేచేసరికి జీనుకట్టిన గుర్ర మొకటి అక్కడ మేస్తూ కనపడింది. ఆమె – "అది చనిపోయిన రౌతుది. దొంగయొక గుర్రం"అంది.

వాళ్ళిద్దరూ దానిమీద వేగంగా ప్రయాణం చేశారు. వాళ్ళొక పల్లె పరిసరాలకు చేరారు. అక్కడ బసచేసి – భోజనంతయారు చేసుకుని తిన్నారు. ఆమె "అమరావతి పోదాం." అని కోరడంతో – దారడిగి తెలుసుకుని అటువేపు వెళ్ళ సాగారు. తోవలో ఒక పట్నం కనిపించింది

అక్కడ సత్రంలో దిగి భోజనం చేసి అరుగుమీద విశ్రాంతి తీసుకుంటూంటే – కొందరు బ్రాహ్మణులు సంభాషించుకోవడం వారికి వినిపించింది.

"అమరావతి చక్రవర్తి మంత్రపాలుడు తన కూతురు హైమవతిని వీరపాలుడి కుమారుడు గుణవర్మకు కన్యాదానం చేయడానికి నిశ్చయించి సుమూర్తంలో వైభవంగా కన్యాదానం చేశాడు. కాని...ఆశీర్వచనమైన తరవాత కన్యను లోపలికి తీసుకుపోయి బ్రాహ్మణులకు బహుమతు లివ్వబోతుంటే ఇంట్లో అల్లరి పుట్టింది."

"ఏమీ?"

"పెళ్ళికూతురు అత్తగారికి నమస్కరించబోగా – తమకు చిత్ర పటంలో చూపించిన పిల్లకాదనీ, మాయచేశారనీ గొడవపెట్టింది. దాంతో దెబ్బలాట జరిగి పెళ్ళివారు కొట్టుకున్నారు."

"అస లెందుకిలా జరిగిందీ?"

"రాజుగారి భార్య గుణవర్మ దరిద్రుడనే కారణంగా తన కూతురి నివ్వడం ఇష్టంలేక రహస్యంగా ధనవర్మను రప్పించి గంపలో అడివికి పంపి – మరో కన్యక నిక్కడి పెళ్ళిపీటల మీదకు పంపిందట. ఆమె కూడా ధనవర్మని పెళ్ళాడలేదు."

"తరువాత?"

"మంత్రపాలుడు భార్యను నిర్బంధించి అడిగి నిజం తెలుసుకుని హైమవతికోసం గ్రామ మంతా వెదికించాడు. కాని ఆమె జాడ తెలియలేదు. దాంతో శూరపాలుడూ, వీరపాలుడూ మంత్రపాలుడి మీద ద్వేషం పెంచుకున్నారు."

"తరువాత?

"మంత్రపాలుడు కావాలనే తమని మోసం చేశాడని ఇద్దరూ ఏకమై అతన్ని నిర్బంధించారు. తన కూతురి జాడ తెలిపిన వారికి గొప్పపారితోషిక మిస్తానని మంత్ర పాలు డన్ని దేశాలకీ దూతలని పంపాడు."

"తరువాత?"

"ఏమైందో మాకు తెలియదు. ఆ వేళ సంభావనలు లేకపోడమేకాక రాజభటుల చేత దెబ్బలు కూడా తిన్నాము."

"ఇప్పు డెక్కడికి పోతున్నారు?"

"మణిప్రస్థానికి పోతున్నాం. ఆ దేశపురాజు కుంతిభోజుడు. అతనికొడుకు జయభద్రుని భార్య సునీతి నిత్యమూ బ్రాహ్మణులకి దానం చేస్తుందట. ఆమె దగ్గర దానం పొందిన వారికి మరెవరినీ యాచించే పనే ఉండదట. ఈమధ్యే మావూరినుంచి కొందరు బ్రాహ్మణు లామెదగ్గరకు వెళ్ళి చాలాధనం సంపాదించు కొచ్చారు."

ఆ మాటలు వినిన హైమవతి – "అయ్యా! ఈ బ్రాహ్మణుల మాటలు విన్నారు కదా? నావల్ల తల్లిదండ్రుల కెన్ని సమస్య లొచ్చాయి! నేను సంతోషంగా ఇంటికి పోవాలనీ వాళ్ళు నన్నాదరిస్తారనీ అనుకున్నాను. కాని వాళ్ళు శత్రురాజుల పరాభవానికి బలవన్మరణం పొందుతారు. ఇక నన్ను ఆదరించే వారెవరు?" అని దుఃఖించింది.

"విచారించకు. నేను ఆ శత్రువులను జయించి మీ తండ్రికి సంతోషం కలిగిస్తాను. మనం వేగంగా అమరావతి వెళ్దాం" అన్నాడు జయభద్రుడు.

ఆమె – "మీ భార్య దానగుణం గురించి ఆశ్చర్యంగా చెప్పుకుంటున్నారే! అంతధనం ఆమె కెక్కడిది? మీ రిచ్చారా?" అని అడిగితే అతను చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు.

వాళ్ళు రెండు మూడు రోజులకి మరో వూరు చేరుకున్నారు. సామగ్రి తేవడానికి చేతిలో రొక్కంలేదని అతడు సందేహిస్తూంటే – ఆమె తన నగ ఒకటి అందించింది. అతని కా నగ విలువ తెలియకపోవడం, షాహుకారు కపటి అవడం, భోజనానికి వేళ సమీపించడం వల్ల స్వయంపాకానికి దా న్నిచ్చేశాడు.

అతనేదో పనిమీద అంగడికి పోతూ దేవాలయాన్ని చూసి అందులోకి వెళ్ళగా అక్క డొక సన్యాసి దుఃఖిస్తూ కనపడ్డారు. అతనికి

మూడు రోజులనుంచి భోజనం లేదని విని అతనికి భోజనం పెట్టదాని కింటికి పిలిచాడు. అతను వారిద్దరిమీదా పాదోదకం చల్లి..."వరహా దక్షిణ లేనిదే నేను భోజనం చేయను" అన్నాడు. అలా వరహా ఇవ్వలేకనే అత న్నెవరూ భోజనానికి పిలవలేదు.

అతను సంపాదించిన వరహాలను భూమిలో పాతిపెడుతూండే వాడు.

వడ్డించిన విస్తరిముందు నుంచి లేచిపోడం సహించలేక ఆమె తన చేతి రత్న కకణం ఇచ్చి భోజనం చేయమని వేడుకుంది.

అత నా కడియం అందుకుని తృప్తిగా భోంచేసి దీవించి వెళ్ళాడు. అతని చర్యల నాశ్చర్యంగా చెప్పుకుంటూ వాళ్ళు భోజనాలు చేశారు.

అక్కడినుంచి బయలుదేరి ప్రయాణం సాగిస్తూ ఒకగ్రామం చేరుకుని - ఒక నగల వర్తకుడి అరుగుమీద విశ్రమించగా - కొందరు నగల వర్తకుల సంభాషణ వినడం తటస్థించింది.

రామశెట్టి : సునీత పుణ్యమా అని బంగారమూ రత్నాలుచవకై పోయాయి. బ్రాహ్మణులకు ఊరికే వస్తున్నాయి కనుక వచ్చిన ధర కమ్మేస్తున్నారు.

సుబ్బిశెట్టి : ఆ సునీతి ఎంత భాగ్యవంతురాలో! దానమిస్తున్న వన్నీ దేవతా రత్నాలే. ఔనూ... ఆమెపేరే కాని ఆమె భర్త పేరు వినరాదేం?

రామశెట్టి : ఆమె మగనిపేరు జయభద్రుడట. ఆ వస్తువులన్నీ అతనే తెచ్చిస్తున్నాడట.

సుబ్బిశెట్టి : మగవాడు సంపాదించడమే కాని పేరు ప్రతిష్ఠలు భార్యవల్లే రావాలి.

రామశెట్టి : మీ రావస్తువు లేమైనా కొన్నారా?

సుబ్బిశెట్టి : లేదు. ఈ మధ్య వీరశెట్టికి జరిగిన ప్రాయశ్చిత్తం విన్నావా?

రామశెట్టి : లేదు. అదేమిటో చెప్పు.

సుబ్బిశెట్టి : మన రాజుగారి కుమార్తె హైమవతి వివాహం సంగతేనా విన్నావా? పాపం, శూరపాల వీరపాలులిద్దరూ ఏకమై ఆమె తల్లి తండ్రులని జైలులో పెట్టి ఆమెను వెదకడానికి దేశ దేశాలూ దూతలని పంపారట.

రామశెట్టి : భార్యాభర్తల దొకమాట కాకపోతే అలాగే అనర్థం జరుగుతుంది.

సుబ్బిశెట్టి : ఆమెను బాగా తెలిసిన వారెవరో వీరిశెట్టి దగ్గర ఆమె కర్ణభూషణం పట్టుకొన్నారట. అతను దొంగవస్తువులు కొంటాడు కదా! ఎవరో ఆ వస్తువును అమ్మజూపితే స్వయంపాకం మాత్రమిచ్చి దానిని తీసుకున్నాడట. అమరావతికి తీసుకెళ్ళి అమ్మబోతే రాజభటులు గుర్తుపట్టి అతన్ని ఖైదులో పెట్టారట. అమ్మినవాడిని చూపించే వరకూ విడుదల చేయమని తీర్పు చెప్పారట.

రామశెట్టి : ఇలాటి విచిత్రమే నేను మరొకటి విన్నాను. ఈ ప్రాంతంలో ఒక సన్యాసి ఉన్నాడట. అతను నిత్యమూ వరహా ఇచ్చేవాళ్ళింట్లో కాని భోజనం చేయడట. ఇలా బోలెడంత డబ్బు సంపాదించాడట. మొన్న ఎక్కడో రత్నకంకణం దక్షిణగా ఇస్తే సంతోషంగా తీసుకున్నాడట. ఆ కడియాన్నమ్మ బోగా – సన్యాసిఅని కూడా చూడకుండా కారాగారంలో పడేశారట. అతని కా శాస్తి జరగవలసిందే. భిక్షకు పోయి బ్రాహ్మణుల నెన్నో చిక్కులు పెట్టేవాడట".

ఆమాటలు విన్న హైమవతి ఎంతో దుఃఖిస్తూ – "నా తల్లితండ్రులు దొంగల్లా జైలు పాలవడమా! అయ్యో! నావల్ల వాళ్ళ కెన్నికష్టాలు వచ్చాయి! వేగంగా పోయి కనపడితే వారి చెర వీడుతుంది. పదండి..." అంది.

జయభద్రుడు – "నువ్వక్కడికి పోయి ఏంచేస్తావు? ఆ ఇద్దరిలో ఎవరిని వరిస్తావు? ముందుగా నీ తల్లితండ్రులకి కనపడితే ఏం లాభం? నీ వల్ల ధనవర్మ గుణవర్మ కలహించుకుంటారు" అన్నాడు. ఆ మాటల కామె మరింత దుఃఖించ సాగింది.

అతను - "ఏడవకు. నా బుద్ధిబలం చేత నీ తల్లితండ్రులని చెర విడిపిస్తాను" అన్నాడు.

ఆ రాత్రే అమరావతి చేరుకుని ఒక పేద బ్రాహ్మణు డింట్లో బసచేశారు. రోజుకొక వేషం ధరించడంతో వాళ్ళ నెవరూ పోల్చుకోలేక పోయారు. జయభద్రుడు గౌరవనీయమైన వేషంలో గుణవర్మ ధనవర్మ ఉన్న సభకువెళ్ళి తన విద్యా పాటవం ప్రదర్శించి వారి స్నేహం సంపాదించుకున్నాడు. అతను రోజూ వాళ్ళ వద్దకు వెళ్ళి వినోదం కలిగిస్తూ కొద్దిరోజులలోనే వాళ్ళు తను చెప్పినట్లు వినేలా చేసుకున్నాడు. వాళ్ళు తమరహస్యాలన్నీ అతనితో చెప్పసాగారు.

ఒకనాడు - ధన మదంకల దనవర్మ అతనితో - "మిత్రమా! నీకంటె నాకు మరెవరూ ఆప్తులు లేరు. నీ దగ్గర దాచే రహస్యాలూ లేవు. హైమవతి చాలా అందగత్తె అని నేను వచ్చి అవమానం పొందాను. గుణవర్మ కూడా అంతే. దాని తల్లితండ్రులు హైమవతి నెక్కడో దాచి ఉంటారు. వాళ్ళు నిజం చెప్పరు. ఆమె అలంకారాలు దొరికినా జాడతెలియలేదు. తన కూతుర్ని నాకివ్వడానికి మంత్రపాలుడు మొదటే ఒప్పుకోలేదన్న కసినాకుంది. హైమవతి జాడ కనిపెట్టి మంత్రపాలుణ్ని చంపెయ్యాలని నా పట్టుదల. గుణవర్మ ఇందుకొప్పుకోలేదు" అన్నాడు.

జయభద్రు డాశ్చర్యపోతూ - " మిత్రమా! తొందరపడకు. నేను నిజం తెలుసుకుని నీకు చెబుతాను కొంతమేరకు నాకిప్పటికే తెలిసినా నిస్సంశయంగా తెలుసుకుంటే తప్ప చెప్పను. మంత్రపాలుడి కేమీ తెలియదు. రేపు నీకంతా చెబుతాను" అన్నాడు.

అప్పుడే చెప్పమని ధనవర్మ ఒత్తిడి చేసినా ఎలాగో వారించాడు. ధనవర్మ ఎలాగో గడువు వరకూ ఆగి అతని దగ్గరకొచ్చి చెప్పమన్నాడు.

తనకి దైవం అనుకూలిస్తున్నందుకు జయభద్రుడు మనసులో చాలా సంతోషిస్తూ - "ధనవర్మా! ఏం చెప్పేది? లోకంలో కొందరు స్నేహితుల్లా నటిస్తూ పగతీర్చుకుంటారు. అందువల్ల ఎవరినీ

నమ్మకూడదు. హైమవతి ఎక్కడికీ పోలేదు. నీకు మిత్రుడిగా నటిస్తున్న గుణవర్మ అధీనంలోనే ఉంది. అతను రహస్యంగా ఆమెతో సుఖాలనుభవిస్తూనే ఉన్నాడు. నువ్వు అమాయకుడివి కనక అతన్ని నమ్మేస్తున్నావు. కావాలంటే నీకు ప్రత్యక్ష్యంగానే చూపిస్తాను" అన్నాడు.

ఆ మాటలకు ధనవర్మ – "ఆ విషయం నాకు చూపిస్తే నీకర్ధరాజ్యం ఇస్తాను. గుణవర్మ నాముం దెంత? నేను వాడి దేశాని కప్పిచ్చాను. ఎప్పుడు చూపిస్తావ్?" అని తొందరపెట్టాడు.

జయభద్రుడు నాలుగు రోజులు గడు వడిగాడు. సమయం చూసి గుణవర్మ దగ్గరకూడా హైమావతి ప్రసక్తి తెచ్చి ధనవర్మతో చెప్పినట్లే చెప్పి అతనికీ రోషం తెప్పించాడు.

నిర్ణయించబడిన రాత్రి – ఒక మేడని చక్కగా అలంకరించి – హంసతూలికా తల్పంమీద హైమావతిని కూర్చుండబెట్టి ...ఆమెను పువ్వులు దండలు కడుతూ ఉండమన్నాడు.

ధనవర్మనీ గుణవర్మనీ విడివిడిగా అదే మేడలోని రెండు గదులలోకి ఒకరికి తెలియకుండా ఒకరిని రప్పించి ఉంచాడు.

ముందుగా – ధనవర్మకి హైమవతిని ఒక కిటికీలోంచి చూబెట్టాడు. అతను – "ఇలాటి అందగత్తెను పొందని జన్మెందుకు? దుర్మార్గుడైన గుణవర్మ నాకడ్డం వస్తున్నాడు. అతని పని రేపు పడతాను." అని మనసులో అనుకుని "మిత్రమా! నువ్వన్న మాట నిలబెట్టుకున్నావు. హైమవతిని చూసి నా కళ్ళు ధన్యమయ్యాయి గుణవర్మ ఎక్కడ?" అని అడిగాడు.

జయభద్రుడు – "నువ్విక్కడ పీఠంమీద కూర్చుని తాంబూలం వేసుకుంటూ ఉండు. ఈ దారిని నీ వైరి గుణవర్మ వచ్చి ఆ గదిలోకి పోతాడు. వారు తలుపులు బిగించుకుని సరససల్లాపా లాడుకుంటారు. వీణానాదం నీకు వినపడుతుంది. నువ్వేమీ మాట్లాడకు. నేను బయట కాచుకుని ఉంటాను. నే నొచ్చి పిలిచేవరకూ బయటకురాకు" అని పైకి వచ్చి గొళ్ళెం పెట్టాడు.

గుణవర్మ రాగానే అతని చేయి పట్టుకుని - మరోదారిని మేడమీదకి తీసుకెళ్ళి ధనవర్మ ఉన్న గది వెనుక కిటికీ సందులోంచి అతన్ని చూపించాడు.

గుణవర్మ - 'ఈ మిత్రద్రోహి నాతో చెప్పకుండా ఎలాటిపని చేస్తున్నాడు! రేపు వీడిపని పడతాను' అని మనసులో నిశ్చయించుకున్నాడు. గుణవర్మని ధనవర్మ గదిముందునుంచీ తీసుకెళ్ళాడు. కాని.. .అతను గది తలుపుబయట గొళ్ళెం పెట్టి ఉండడంతో ఏమీ చెయ్యలేక పోయాడు. గుణవర్మని తీసుకెళ్ళిన జయభద్రుడు హైమవతిని చూపించాడు. అతనికి కూడా ధనవర్మకి కలిగిన ఊహలు కలిగాయి.

జయభద్రుడు హైమవతికి సైగ చేయగా అమె వీణమీద గానం చేయసాగింది. ఆమెను చూసి అతనే మోహం ఆపుకోలేకపోయాడు. కాని ఆమె అతన్ని వారించి కర్తవ్యం నెరవేర్చమంది.

అతను వారిద్దరినీ ఒకరి తరువాత ఒకరిని చెరో దారినా మేడ దాటించాడు.

మర్నాడు వాళ్ళొకరి కొకరు ఎదురుపడినప్పుడు - 'నన్ను వంచించి హైమవతితో కులుకుతూ...ఏమీ ఎరగన ట్లిలా నటిస్తున్నాడు!' అని ఒకరిగురిం చొక రనుకుని సభకు 'పోయినప్పుడు సౌహార్ద్ర సూచకంగా హస్త గ్రహణంచేస్తాం కదా? ఇవాళ వాడి కెడమచే యందించి కుడిచేతితో కత్తితీసి తలనరికేస్తాను" అని నిశ్చయించుకున్నారు.

వాళ్ళు ముందుగా అనుకున్నట్లే ఒక క్షణంలో ఒకరి తల ఒకరు నరుక్కుని వీరస్వర్గం పోయి రంభకోసం తగవు లాడుకో సాగారు. సభలో ఉన్న రెండు పక్షాలవారూ తమరాజులు అలా మరణించడంతో తా మొకరిపై ఒకరు యుద్ధానికి దిగారు. జయభద్రుడు వీరపాల శూరపాలురకు కబురంపగా వాళ్ళు సేనలతో వచ్చి తీవ్రమైన పోరాటం సలిపి - చివరి కిద్దరూ మరణించారు

ఈ లోగానే జయభద్రుడు సేన లన్నిటినీ లోబరుచుకుని మంత్రపాలుణ్ణీ, అతని భార్యనీ చెరవిడిపించి...సింహాసనం ఎక్కించాడు. ప్రజలంతా చాలా సంతోషించారు

వీరపాల శూరపాలురు యుద్ధంలో చనిపోవడంతో జయభద్రుడు మంత్రపాలుడితో కూడా ఆ ఇద్దరి దేశాలకూపోయి వాటిని స్వాధీనం చేసుకుని పాలించసాగాడు.

ఒకనాడు మంత్రపాలుడు - తనకి అకారణంగానే ఎంతో ఉపకారం చేస్తున్న జయభద్రుణ్ని అతని వృత్తాంతం అడిగాడు.

అప్పు డతను హైమవతితో సహా వచ్చి అతనికి నమస్కరించాడు. మంత్రపాలుడు తనకుమార్తెను గుర్తుపట్టి సంతోషంగా కౌగలించుకుని భార్యకు ఆ సంగతి చెప్పాడు. హైమావతి తన తల్లితండ్రులకి జరిగిందంతా వివరించింది. జయభద్రుడు అల్లుడైనందుకు వారి సంతోషం పట్టశక్యం కాకపోయింది. వారిద్దరికీ వివాహం చేసి - తనరాజ్యాని కధిపతిగా జయభద్రుడికి పట్టాభిషేకం చేశాడు. అతను ప్రజలను చక్కగా పరిపాలిస్తూ తన దేశానికి వచ్చిన బ్రాహ్మణులను సత్కరించేవాడు. ఆ బ్రాహ్మణులు సునీతి దానగుణం గురించి చెప్పనిదే ఉండేవారు కాదు. ఒకనాడు పండిత బ్రాహ్మణు డొకడు రాగా....అతనికి స్వాగతం పలికి, అర్చనలు చేసి...."భూమండలంలో మీరు చూడని దేశాలుండవు. అందరిలోకీ కీర్తివల్ల మంచి దాతలెవరు?" అని అడిగాడు.

సుదేవుడనే ఆ బ్రాహ్మణుడు - "దేవత దయవలన నేను చూడని దేశాలు లేవు. భూమిమీద కల దాతల నందరినీ చూశాను కాని విదర్భదేశంలోని సునీతి అను సాధ్వీమణి వంటి దాత నెక్కడా చూడలేదు. ఆమె పతి ఎంత సంపాదనపరుడో తెలియదు. ఆమె నిత్యమూ అర్థులకి కోటిరత్నాలు దానం చేస్తుంది అవి భూలోకానివి కావు. నా పాండిత్యానికి మెచ్చుకుని ఆమె ఇచ్చిన ఈ రత్నాల పతకం చూడండి - " అని తీసి చూపాడు.

ఆ పచ్చల పేరు చూసి ఆశ్చర్యపడిన జయభద్రుడు పరీక్షకులచే వెలకట్టించబోగా అవి అమూల్యములనీ వాటిధర కట్టడం తమతరం కాదనీ అనేశారు.

జయభద్రుడా బ్రాహ్మణుని చూసి "మీరు సునీతి భర్త జయభద్రుణ్ని చూశారా? ఎలా ఉంటాడు?" అని అడిగాడు.

"మీ రేమనుకుంటే అనుకోండి కాని - అతనికీ మీకూ ఏ మాత్రమూ తేడాలేదు. మిమ్మల్ని చూగానే నాకు సంతోషం కలిగింది. ఆమె పతితో పీటలమీద కూర్చుని బ్రాహ్మణులకు దానం చేస్తూంటుంది. అందుచేత నే నాయనను చక్కగా చూడగలిగాను."

ఆ మాటలకు జయభద్రుడు మరింత ఆశ్చర్యపడి - బ్రాహ్మణుని పంపి - తాను అంతఃపురానికి పోయి - "హైమవతీ! వింతలు వినవస్తున్నాయి మా దేశానికి పోయి చూసి రావాలి. సునీతి కీర్తి నువ్వు వింటున్నావు. అక్కడ నన్ను పోలినవాడు మరొక జయభద్రుడు పీటలమీద కూర్చుంటాడట! నేను రహస్యంగా వెళ్ళొస్తాను. నువ్వు భద్రంగా ఉండు - " అని ఆమె తాను కూడా వస్తానన్నా వొద్దని - అతను తన ఊరికి వెళ్ళాడు.

పూర్వపు వేషంతో అతనా పట్నం వీధిలో వెళ్తూంటే ఎందరో వచ్చి పరిచయంతో ఏవో వ్యవహారాలు మాట్లాడ సాగారు. బోలెడంత మంది బ్రాహ్మణులు అతన్ని అనుసరించి వొస్తుంటే అతనేమీ మాట్లాడక కోటలోకి పోయి తల్లితండ్రులకి నమస్కరించాడు. వాళ్ళు మామూలుగానే మాట్లాడారు. కొత్తగా చూడలేదు. బంధువులూ, స్నేహితులూ అందరూ అంతే. దానితో అత నవమానించ బడినట్లు భావించి - ఇప్పుడు నాకు మరోచోట రాజ్యముందని తెలిస్తే ఎంతో గౌరవించి ఉందురు. నాకేమీ లోటులేదు కదా...సునీతి సంగతేమిటో చూసి పోదాం అని ఆ మేడకి వెళ్ళాడు.

తల్లి ఎదురొచ్చి "సమయంకాని సమయంలో వచ్చావేం? దానధర్మాలు చేయలేదా? వంటయింది. భోంచేసి వెళ్ళు." అంది.

ఆమె కేమీ చెప్పకుండానే సునీతి ఉన్నచోటుకి వెళ్ళాడు. ఆమె మాయా జయభద్రుడితో పీట మీద కూర్చుని ఒక బ్రాహ్మణునికి కాళ్ళు కడుగుతూంది. జయభద్రుడు ద్వారందాటి లోపల ప్రవేశించేంతలో మాయా జయభద్రుడు మాయ మయ్యాడు.

సునీతి పీటమీద భర్త కనపడక అటుయిటు చూసి..ద్వారం దగ్గరుండడం గమనించి – "ఇదేమి చిత్రం! పీటమీదనుండి అక్కడి కెలా వెళ్ళిపోయారు? మాయలా ఉందీ!" అని తానువెళ్ళి అతని చేయిపట్టుకుని – "బ్రాహ్మణునికి పాదాలు కడిగి వస్తువు దానం చేయకుండా లేచి వచ్చారేం? శాస్త్రవిరుద్ధం కాదూ? నావల్ల పొరపాటేమైనా ఉంటే మన్నించండి" అంటూ అటు తీసుకువెళ్ళబోయింది.

" నే నెవరి ననుకుంటున్నావు? మునుపెన్నడేనా నన్ను చూసి ఉన్నావా? నీమాట లేమీ నాకర్థం కావడం లేదు." అన్నాడు, అతను.

ఆమె అతను పరిహాస మాడుతున్నా డనుకుని – నవ్వుతూ. . "నాధా! మీరు కుంతిభోజుని ఏడవకుమారులు జయభద్రులు. నేను మీభార్య సునీతిని. మిమ్మల్ని చాలాకాలం నుంచి చూస్తున్నాను. వొచ్చే జన్మలో కూడా వదలను. ఇదే మన బాంధవ్యం పాపం, బ్రాహ్మణుడు చేయిజాపి కూర్చున్నాడు. ఇది పరిహాసానికి సమయం కాదు. వేగం రండి–" అంది.

ఆమె మృదువయిన మాట కత నాశ్చర్యపోయి – ' ఈ సుందరి నా భార్య అవడం నిజమే. కంటిలో మచ్చ వేశ్య కల్పించినది. ఇప్పుడు నేను తన పీటమీద కూర్చుని లేచి వచ్చినట్లు మాట్లాడుతూందే! తానెవరినో కూర్చోబెట్టుకుని ఆ గుట్టు నాకు తెలియకుండా ఇలా అంటూంది కాబోలు. బ్రాహ్మణులు చెప్పుకుందు కేముంది? దానమిస్తే ఛండాలుణ్ని అయినా దేవేంద్రుడని పొగుతారు."అని అనుకుంటూండగా –

"మీరేమిటో ఆలోచిస్తూ ఆలస్యం చేస్తున్నారు దానం మధ్యలో జాగు కూడదు కదా?" అందామె.

"నువ్వెందు కిలా మాటిమాటికి రమ్మని నన్ను నిర్బంధిస్తావు? నీగుట్టు దాగుతుందనా? నాకు నిజం తెలిసిందిలే. ఇన్నాళ్ళూ ఎవరినో పెట్టుకుని ఆ తప్పు కప్పి పుచ్చుకోడానికి దానదర్మాలు చేస్తున్నావు. ఇప్పుడేదో బొంకబోతున్నావుకాని లాభంలేదు నే నీవూరొదిలి చాలా కాలమైంది. పెళ్ళయ్యాక నీమొహమే చూడలేదు ఎప్పుడూ నీతో ఉన్నట్లే మాట్లాడుతున్నావు" అన్నాడు కఠినంగా

ఆ మాటల కామె ఉలిక్కిపడి – "నా భర్తకు పిచ్చి పట్టింది. అసందర్భంగా మాట్లాడుతున్నాడు. వేగంగా చికిత్స చేయించాలి. మా మామని పిలవండో" అంటూ అరిచింది.

ఆ అరుపులకి కుంతిభోజుడు, అతన్ని భార్య పరుగున వచ్చారు. వైద్యులూ వచ్చారు. వాళ్ళందరినీ చూసి జయభద్రుడు నవ్వుతూ..."ఓహో! మీ అందరికీ పిచ్చి పట్టినట్లుంది. ఈమె మాటలు నమ్మివచ్చారా! నేను పిచ్చివాణ్ణి కాను. నేను తనతో ఉన్నట్లు చెబుతూంది. మీరు నన్నెప్పుడేనా చూశారా? అడవులపాలై నేను వచ్చాను. మీరు నన్నేమీ అవమానించక్కర్లేదు. ఈ పాటి రాజ్యం నాకూ ఉంది" అనే సరి కతనికి నిజంగానే పిచ్చెక్కిందనుకున్నారు.

అతని తల్లి – "ఇందాకా నా దగ్గరకొచ్చి – పలకరించినా మాట్లాడక పోయినప్పుడే నా కనుమానం వచ్చింది. నీ కెవరో భూతం పట్టించారు. ఎలా బాగుపడతావో!" అని ఏడవసాగింది.

జయభద్రుడు తెల్లబోతూ – "నేనిన్నాళ్ళూ పరదేశంలో ఉండివస్తే నువ్వతిన్నగా మాట్లాడావు కావు. నా భార్య కపటపు మాటలు విని నువ్వు కూడా నాకు పిచ్చెక్కిందని ఏడుస్తున్నావు! మీ అందరినీ చూస్తూంటే నిజంగానే పిచ్చెక్కుతుంది. ఒక్కరేనా నన్ను కొత్తగా భావించి మాట్లాడరేం?" అన్నాడు కోపంగా.

వైద్యు లతనికి చికిత్స చేయడానికి బలవంతంగా పట్టుకోగా – పకపక నవ్వుతూ – "నిష్కారణంగా నాకు పిచ్చెక్కిందని వెద్యంతో నన్ను వేధిస్తున్నారే! ఇలాగని తెలిస్తే నే నిక్కడికి రాకనే పోదును. నన్నొదలండి. నాదేశం పోతాను" అన్నాడు.

అప్పుడు వైద్యులు – "వీనిది పిచ్చికాదు. గాలిసోకింది. రాకపోదు ననేది భూతాలమాటే రాజా!"అంటూ, అతన్ని బందీ చేసి భూతవైద్యులు 'మారాజపుత్రుని వదులు. లేకపోతే నిన్ను పైకి పంపిస్తాం' అంటూ బెత్తాలతో బాదసాగారు.

ఆ దెబ్బలకు తాళలేక "తండ్రీ! చిరకాలానికి నీదగ్గర కొచ్చినందుకు మంచి శిక్షే వేయిస్తున్నావు. వీళ్ళు నన్నూరికే బాదుతున్నారు. నాకు పిచ్చీలేదు, దెయ్యమూ పట్టలేదు. మీరు న న్నర్థం చేసుకోలేక భ్రమపడుతున్నారు. దీనంతటికీ కారణం నా భార్య. నేను చెప్పేది సావధానంగా వినండి. లేదా నా మిత్రుడు సుమిత్రుడి నొకసారి రప్పించండి" అని వేడుకున్నాడు.

సుమిత్రుడు రప్పించబడ్డాడు.

కౌగలించుకుని. .కన్నీళ్ళు పెట్టుకుని... జరిగిన దంతా చెప్పాడు. "కావాలంటే అమరావతి వెళ్ళి ధ్రువపరచుకో" అన్నాడు. సుమిత్రుడు అమరావతిలోని విశేషాలు కొన్ని విని ఉన్నా – అవి చేసినది అతనో కాదో అని సందేహిస్తూంటే ... రాజు వద్ద కొక దూతవచ్చి – "అమరావతి రాజు మంత్రపాలుని కూతురు హైమవతి – తనభర్త ఉన్మత్తు డయ్యాడన్న వార్త విని ఉచిత పరివారంతో వచ్చి వేచి ఉంది. జయభద్రుని చూడాలని తొందరపడుతూంది –" అని చెప్పాడు రాజుగారు. హైమావతిని ప్రవేశపెట్టమన్నారు.

జయభద్రుని పరిస్థితి చూసి హైమవతి చాలా విచారించింది. "నా భర్తకు పిచ్చిపట్టిందని మీరెలా నిశ్చయించారు? ఇలా బంధించడానికి మరేదైనా కారణముందా? మా అక్క సునీతి ఎక్కడ? ఆమె ఎలా అంగీకరించింది?" అని అడిగింది.

రాజు ఆమె మాటనుంచి జరిగిన దర్థం చేసుకుని – "నీ మాటలు వింటూంటే మాకు పిచ్చెక్కుతోంది. మా జయభద్రుడు మమ్మల్ని విడిచి ఎక్కడికీ పోలేదు. నిత్యమూ అతన్ని చూస్తూనే ఉన్నాం. ఆ దంపతుల వల్ల దానాలందుకున్న బ్రాహ్మణు లెందరో! వారినడిగినా తెలుస్తుంది. అత నెన్నోదేశాలు తిరిగి ఎన్నో చేసినట్లు మీరు చెబుతున్నారు! నాకేమీ తోచడం లేదు. ఇదంతా ఏదో ఇంద్రజాలంలా ఉంది. నిజానిజాలు నువ్వే తేల్చాలి." అన్నాడు.

అప్పుడు హైమవతి – "అయ్యో! ఇందుకా మీ రాయన్ని బంధించి బాధిస్తున్నారు! ఆయన మాటలు నిదానంగా విని ఉంటే బాగుండేది. ఇప్పుడైనా వెంటనే ఆయనని వదలండి" అంది.

రాజు అప్పటికప్పుడే జయభద్రుడికి విముక్తి కలిగించాడు. జయభద్రుడి వేశ్యాలోలత్వానికి కాబోలలాటి శిక్ష అనుభవించవలసి వచ్చింది

బంధాలు తొలగిన జయభద్రుడు తండ్రిని చూస్తూ "నాన్నగారూ! మీరు చెప్పే మాటలు వింతగా ఉన్నాయి. నే నెప్పుడూ మీదగ్గరే ఉన్నానంటున్నారు కదా. అందుకు నిదర్శనం చూపించగలరా?" అని అడిగాడు.

అక్కడున్న ప్రతివాళ్ళూ – "మేము మిమ్మల్ని ప్రతిరోజూ ఇక్కడ చూస్తూనేవున్నాం" అన్నారు.

అతను బ్రాహ్మణులకి రాసిచ్చిన దానపత్రాలు చూపించేరు. అవి అతని దస్తూరి లోనే ఉన్నాయి.

దాంతో జయభద్రుడికి మతిపోయింది. వాళ్ళు తనని గురించి పడిన భ్రమకు హేతువు లేకపోలే దనుకున్నాడు. హైమవతి వేపు చూస్తూ "ఇదేమి వింత?" అని అడిగాడు.

తెలివైన హైమవతి కొంచెం ఆలోచించి – "ఆ విషయం తెలుసుకుందుకు నా కొక్కరోజు గడు వివ్వండి. రేపు చెబుతాను –" అంది.

సరే అని అందరూ తమ ఇళ్ళకి వెళ్ళిపోయారు.

జయభద్రుడు హైమవతితో కలిసి సునీతి మేడకు వెళ్ళి ఆమె సత్కారాలు పొందాడు. తాను వేశ్యాగృహం వదిలింది మొదలు అప్పటివరకూ జరిగిందంతా సునీతికి వివరంగా చెప్పాడు.

అది విని సునీతి తన పాతివ్రత్యం భంగమయిందేమో అని భయపడింది.

అప్పుడు హైమవతి "అక్కా! నీ వృత్తాంతమంతా నాకు చెప్పు. జయభద్రుడు మొదట ఏరోజు నీదగ్గరకి వచ్చాడో ఆనాటినుంచి

మొదలుపెట్టి చెప్పు మధ్యలో ఏవైనా వింతలు కాని విశేషాలు కాని జరిగి ఉంటే వాటిని కూడా దాచకు" అని సునీతిని కోరింది.

సునీతి చెప్పసాగింది. " నాభర్త మొదట వేశ్యాలోలుడై నా ముఖమే చూడలేదు. అందుకు సుమిత్రుడే సాక్షి. ఒకనాడు భ్రమరిక అనే నా దాసి వశ్యౌషధిని తెచ్చి నా మగని తలమీద రాయమంది. కాని నేనాయనను చూసిన పరవశంలో ఆ మందును పూయలేదు. నా మేడకు వస్తూ దారిలోని పుట్టలో పోసేశాను.

అదేం మహిమో తెలియదు, ఆరాత్రి నా భర్త చక్కని వేషంతో వచ్చి నా కోర్కెలు తీర్చాడు. అది మొదలు ప్రతిరోజూ వొస్తూ రత్నహారా లిస్తూ నా ఇష్టాలు తీర్చేవాడు. కొన్ని రోజులయ్యాక ఎప్పుడూ నా దగ్గరే ఉంటూ నేను కోరినవిస్తూ బ్రాహ్మణులను సంతోషపెట్టేవాడు.

ఒకరోజు ఒక విశేషం గమనించాను. జాగ్రత్తగా విను. నేను రతిక్రీడలలో అలసి సొలసి నిద్రించాను. ఏదోకారణం వల్ల నాకు హఠాత్తుగా మెలకువొచ్చింది.

కళ్ళు విప్పి చూసేసరికి నాభర్త వెయ్యిపడగల శేషుడిలా కనిపించాడు. నేను భయపడి - కళ్ళుమూసుకుని అరిచాను. అతను లేచాడు. మామూలు రూపంలోనే కనపడుతూ "ఏం? ఏమైంది? ఎందుకలా అరిచావు?" అని అడిగాడు.

నేను పరిశీలనగా చూశాను. అతను మామూలుగానే కనిపించాడు. "మీకు నిద్రలో అలాటి వికృతరూపం ఎందు కొచ్చింది?" అని అడిగాను. "అదినా వికృతరూపం కాదు. నీకల భయపడకు" అని ఊరడించాడు.

నేను - కాబో లనుకున్నాను. యధాప్రకారం పతిసేవ చేసుకుంటున్నాను. ఇంతకంటె ఏ విశేషమూ నే నెరగను. మీతో నిజం చెప్పాను. ఆపైన మీయిష్టం "

అదివిని హైమవతి తలూపుతూ - "నిజం దొరికింది. సునీతి వలన ఏతప్పూలేదు. ఆమెను నిందించడం తగదు. ఈ ఇంద్రజాల మంతా

వశ్యౌషధి వలన సంభవించింది. సునీతి కీర్తికీ అదే కారణం. ఆ పసరును ఈమె పుట్టలో పోసినప్పుడు పాతాళలోకంలో ఉండే శేషుడి తలమీద పడుంటుంది. అత నీమెకు వశుడై కామరూపంలోవచ్చి ఈమెను సంతోషపెడుతున్నాడు. సామాన్య మానవుల కిలాటి దివ్య రత్నాలంకారాలు లభింపవు. నిద్రాసమయంలో కామరూపం నిలవదు. కనుక సునీతికి ఆరాత్రి అతని నిజరూపం కనిపించింది.

మీరు రాగానే అతను పీటలమీద మాయమై పోయాడు. దేవతా సంపర్కం స్త్రీలకు వ్రతభంగం కానేరదు కనుక సునీతి పవిత్రురాలే" అని – జరిగినది చూసినట్లే చెప్పేసరికి అందరూ సునీతిని నిర్దోషిగా అంగీకరిచారు.

ఆ వార్త వూరిలో వ్యాపించింది. అందరూ అద్భుతంగా చెప్పుకో సాగారు. కొందరు మంచిగా చెప్పుకుంటే కొందరు చెడ్డగా చెప్పుకున్నారు.

అందుకు సునీతి చాలా విచారిస్తూ "ఇంతకుముందు నన్నుత్తమురా లన్నవారే ఇప్పుడదే నోటితో దుష్టురా లంటున్నారు.

ఇలాటి నిందల బతుకుకంటె నీచం మరింకేదీ ఉండదు. జాగ్రత్తగా ఆలోచించి చూస్తే – శేషుడు మాత్రం పరపురుషుడు కాడా? పరపురుష సంపర్కంతో అపవిత్రమైన శరీరాన్ని అగ్నిలో పడేస్తాను శుద్ధి కావించుకుంటాను అనుమతించండి" అని భర్తపాదాల మీద పడి ప్రార్థించింది.

జయభద్రు డామె ప్రయత్నాన్ని మానిపించాలని ఎంతగానో ప్రయత్నించాడు. అయినా ప్రయోజనం లేకపోయింది. "మీ రీవిషయంలో అడ్డు చెప్పకండి నేను త్రికరణ సాక్షిగా మీ పాదాలనే నమ్మి ఉంటే అగ్ని నన్నేమీ చెయ్యజాలదు. కళంకం కలిగిందా, దగ్ధం కావిస్తుంది. ప్రజల నిందలను నేను భరించలేను. బంగారం శుద్ధయ్యేది అగ్నివల్లనేకదా? అలాగే నా బుద్ధి నిర్మలాన్ని కూడా అగ్నివల్లనే తెలుసుకోవచ్చు. మీ పాదాలనే నమ్ముకున్న నన్నుకరుణించి చితి ఏర్పరచండి" అని సునీతి మరీమరీ వేడుకుంది.

అప్పుడు చేయగలగిం దేమీలేక జయభద్రుడు పట్నపు కోట ముందర మంచి గంధపు చెక్కలతో చితి పేర్పించి ఆ వార్త పట్నమంతా చాటింపు వేయించాడు. పౌరులు గుంపులు గుంపులుగా చూడడానికి వచ్చారు. సామంతులు, మంత్రులు, బంధువులు, ఎంద రెందరో సునీతి నీతిని మెచ్చుకుంటూ చూడడానికి వచ్చారు. అందరూ ఆ చితి చుట్టూ చేరి వింత చూస్తూంటే - చితిని ప్రజ్వరిల్ల జేశారు.

స్నానం చేసి...అలంకరించుకుని.. బ్రాహ్మణులకు దానమిచ్చి . వారి ఆశీర్వచనాలు తీసుకుని ...సూర్యుడికి నమస్కరించి...చితి చుట్టూ మూడు సార్లు ప్రదక్షిణం చేసి - ఆమె అందులో దూకింది.

ఆమె పాతివ్రత్య మహిమవల్ల అగ్నిలోదూకినా దగ్ధంకాక మెరుగు పెట్టిన బంగారంలా ప్రకాశిస్తూ...ప్రేక్షకు లందరికీ తన నిర్మలత్వాన్ని నిరూపించుకుంటూ - అగ్ని చల్లారిపోగా - ఆమె సిగలోని పూవయినా వాడకుండా మిగిలింది.

ప్రజలు కరతాళ ధ్వనులు, జయజయ నాదాలూ చేశారు. అప్పుడు అపర సీతలా పాతవ్రత్య మహిమచేత ప్రకాశిస్తున్న సునీతిని జయంభద్రు డెంతో ఆనందంతో చెయ్యిపట్టుకుని కోటలోకి తీసుకుపోయాడు. ఆమెను పట్టపురాణిగా చేసుకుని, హైమవతితో కూడా ...ఇద్దరు భార్యలతోనూ అతను చాలాకాలం రాజ్యం పాలించాడు.

గోపాలా! నువ్వు చూసి నామె ఆ సునీతి. పాతివ్రత్య మహిమవల్ల అగ్నిలో దూకినా భస్మ మవకుండా నిలిచింది.

ఈ కథావిశేషం విన్నవారికి ఆయురారోగ్యాలు వృద్ధవుతాయి. లే, వంట చేసుకుని భోజనం చెయ్యాలి" అన్నాడు యతీంద్రుడు.

గోపాలు డతని నెన్నో విధాల స్తోత్రం చేశాడు.

మణిసిద్ధుడు లేచి స్నానంచేసి వంటచేసుకుని తాను భుజించి, గోపాలుడికి పెట్టి కొంచెం సేపు విశ్రాంతి తీసుకుని మళ్ళీ ప్రయాణం సాగించాడు.



# కాశీ మజిలీ కథలు

## 21. వ మజిలీ

## కందర్పుని కథ

అదాక పట్టణం... మణిసిద్ధుడికి అక్కడ ఉండడానికి చోటు దొరకలేదు. సత్రంచాలా రద్దీగా ఉంది.

స్వాములవారు శిష్యుడితో – "ఇక్కడ మనకి సరైన జాగాలేదు. ఇంత రద్దీలో బసచేయడం నాకిష్టంలేదు. మరోవూరు పోదాం" అన్నాడు.

అప్పుడు గోపకుమారుడు – "స్వామీ! చాలాదూరం నడచిరావడంతో అలసటగా ఉంది. అన్నం తింటే తప్ప నడవలేను. పరదేశంలో పద్ధతులు సాగుతాయా? ఏదో ఓచోటు చూసి వంటకానిచ్చెయ్యండి" అని బతిమాలాడు.

యతి వాడి మాటలు తీసెయ్యలేక ఒక దేవాలయంలో మకాం చేసి – వాడిని బజారుకు పంపి – తాను స్నానపానాదులు చేయసాగాడు.

గోపాలుడు అంగడి నుంచి వొట్టి చేతులతో రావడంచూసి నవ్వుతూ – "నువ్వేమీ తేలేదు. వంటెలా చేసేది?" అని అడిగాడు.

"స్వామీ! ఏం చెప్పమంటారు? నేను చూసిన వింతనే అంగడివాడు చూస్తూ ఏ వస్తువూ అమ్మడంలేదు. ఆవింత చెబుతాను, వినండి" అంటూ చెప్పసాగాడు.

"మధ్యవయసులో ఉన్న ఒక ఆడదానిని గాడిద మీదెక్కించి ఊరేగిస్తున్నారు. ఆ గాడిదముందు వికృతమైన వాద్యాలు వాయిస్తున్నారు. ప్రజలు వేళాకోళంగా నిందలతో ఆ వింత చూస్తున్నారు

అదేమిటని అడిగితే ఎవ్వరూ ఏమీ చెప్పలేదు. అంచేత చేతు లూపుకుంటూ వొచ్చెయ్యవలసి వచ్చింది కొంతసే పయ్యాక మళ్ళీ వెళ్ళి తెస్తాను ఆ కథేమిటో చెప్పండి ' అని కూర్చున్నాడు.

కాని - స్వామి వాడిచేత సామగ్రి తెప్పించి వంట, బోజనాలు అయ్యాక - ఒక చక్కని ప్రదేశంలో కూర్పుని మణికి నమస్కరినంచి ఆ వృత్తాంతం తాను తెలుసుకుని - వాడికి చెప్పసాగాడు.

దక్షిణదేశంలో కుంభకోణం అనే పట్నముంది దాని రాజు విక్రమకేతుడు. ముసలితనంలో అతని కొక కొడుకు పుట్టాడు వాడి రూపలావణ్యాలు చూసి పెద్దలు వాడికి కందర్పు డని పేరు పెట్టారు.

కందర్పుడు చాలా తెలివైనవాడు పదహారేళ్ళు వచ్చేసరికే చాలా విద్యలలో నేర్పరితనం సాధించాడు ఒకనా డతని ఉపాద్యాయుడు భూగోళశాస్త్రం చెబుతూ - రంగురంగులు కల ఒక పటాన్ని చూపించాడు.

"ఈ పటంలో ఇన్ని రంగులున్నాయేం?" అని కందర్పుడు అడిగాడు

"రాజకుమారా! పచ్చని రంగుకల ఈ ప్రదేశ మంతా భరతఖండం ఇందులో కల ఏభయ్యారు దేశాలకీ గుర్తులున్నాయి. స్నన్ననిగీతలు నదులు. గోదావరి, గంగ, కృష్ణవేణి, కావేరి, తుంగభద్ర ..అని రాయబడి ఉన్నాయి చూడు ఇది సముద్రం ఇది హిమవత్పర్వతాలు. ఈ మూలనున్నది పారసీకదేశం పశ్చిమోత్తరమున ఉన్నదేశం హూణులది" అంటూ ఉపాధ్యాయుడు చెబుతూంటే - ఇందులో మనదేశం ఎక్కడుంది? ' అని అడిగాడు.

అతను చూపించాడు. కందర్పుడు ఆశ్చర్యపోయి - "ఇదా మన రాజ్యం! ఈ మాత్రానికేనా మనవాళ్ళు చక్రవర్తులని గర్వపడతారు? గుమ్మడికాయలో గింజపాటికూడా లేదు. వందిమాగదులు చేసే స్తోత్రాలు విని నిజ మనుకున్నాను. నేనే ఈ భూమి కంతా ప్రభు వనుకున్నాను. ఎవ్వరూ ప్రభువనుకుని గర్వపడక్కర్లేదు సర్వేశ్వరుడే అందరికీ ప్రభువు" అన్నాడు ఉపాధ్యాయు డతన్ని ఆశ్చర్యంగా చూశాడు.

"అయ్యా! భగవంతుడి సృష్టి అతి చిత్రమయింది. ఒక దేశంలో ఉన్న వింతలు మరో దేశంలో ఉండవు. ఈ దేశాలన్నీ చూస్తే ఎన్ని విచిత్రాలు కనపడతాయో. ఎలాటి విద్వాంసులు ఎదు రౌతారో! ఎలాటి ఎలాటి స్త్రీలు దర్శనమిస్తారో. నూతిలో కప్పలా దేశం కదలకుండా తనదేశమే గొప్పదనుకునే వాడి జన్మెందుకు? కళ్ళకు సాఫల్యం దేశాలు చూడడమే. అందుకే యాత్రలూ, తీర్ధయాత్రలూ పెట్టారు. నాదేశ మెంత, నే నెంత? ఇప్పుడు మీరు చిత్రపటంలో చూపించిన దేశాలన్నీ చూడాలనుంది" అన్నాడు.

ఉపాధ్యాయు డొక నిట్టూర్పు వదిలి - "దేశాటనమంటే మాటలు కాదు. ఎలాటి వాడికేనా పరదేశ వాసం ప్రాణసంకటమే. అదీకాక నీకోరిక చాలా అసాధ్యమైంది. గరుత్మంతుడు, ఆంజనేయుడు మొదలైన వారికి కూడా దేశాలన్నీ చూడడం సాధ్యంకాదు" అన్నాడు.

"ఎందుకని?" అడిగాడు కందర్పుడు.

"కొన్ని దేశాలకు గుర్రాలమీదా, ఓడలమీదా పోవచ్చు కొన్ని దేశాలకు దారులే లేవు. గగన మార్గంలో ఎలా పోగలరు? భరతఖండం తిరిగి రావచ్చు కాని ఇతర ద్వీపాలకు పోవడం వీలుపడదు. ఉత్తరంలో హిమవత్పర్వతాలు అడ్డంగా ఉన్నాయి. అదీకాక భరతఖండం చూడ్డానికే మనిషి ఆయుర్దాయం చాలదు కనక వెర్రి ఆశలు పెట్టుకోకు. నీ తండ్రి ముసలివాడై పోయాడు. రాజ్యభారం వహించి న్యాయంగా పాలించు" అని సలహా ఇచ్చాడు

"ప్రజలను పాలించమని పదే పదే చెప్పకండి. నాపాటి ప్రజాపాలన ఎవరేనా చేయగలరు దేశాటనం మాట చెప్పండి. యాత్రలకి పోయేవారు చూసే దేశాలతో తృప్తి ఉండదు ఇతర ద్వీపాల విశేషాలే చూడాలి. ఆ ద్వీపాలకు వెళ్ళడానికి సాదనా లుండకపోవు ప్రవరుడి కధ మీరే చెప్పారు ఔషదులో.. యంత్రాలో..ఏవో ఒకటుండకపోవు అలాటి సాధనాలు సంపాదించాలి. ఇక నేనీ ప్రయత్నంలోనే ఉంటాను. మాతండ్రికి తెలిస్తే ఒప్పుకోరు. కనక రహస్యంగా ఉంచండి".

అని తన నిర్ణయం తెలియజేశాడు కందర్పుడు. అది మొదలు ప్రతిరోజూ కందర్పుడు అతనిని విశేషాలేమైనా ఉన్నాయా అంటూ అడుగుతూనే ఉన్నాడు ఒకనాడు అతను సంతోషంగా వచ్చి రాజకుమారుణ్ణి ఏకాంత స్థలానికి తీసుకుపోయి - "ఉదరపోషణార్థం తిరిగే సన్యాసులూ బైరాగులూ ఏం చెప్పగలరు? మాతాత చాలా వృద్ధుడు ఎన్నో దేశాలు తిరిగి ఎన్నో విశేషాలు చూసినవాడు. ఆయనకి నీసంగతి చెప్పాను.

ఆయన - "మణివర్మ అనే విశ్వకర్మకులస్థుని దీవూరే. అతను పూర్వులనాటినుంచీ నువ్వుకోరిన యంత్రాలు చేయడం తెలిసిన వాడు. అతను కీలు జింక నొక దాన్ని చేసి ఆకాశంలో తిరిగేవాడట. అది వాడింట్లోనో, ఎక్కడో రహస్యంగా దాచి ఉంచవచ్చు. నేనూ వాడి నాన్నా స్నేహితులం కనుక నాకు తెలుసు మణివర్మ తండ్రి చనిపోయాక నేను వాళ్ళింటి కెళ్ళడం మానేశాను" అన్నాడు.

నేను పట్నమంతా తిరిగి తిరిగి వాడిల్లు కనుక్కున్నాను. అది - రాజభవనంలా ఎత్తయిన గోడలమధ్య ఉంది లోపల చాలా విశాలంగా ఉంది. మణివర్మ బతికే ఉన్నాడు కాని ఎప్పుడూ ఇల్లుదాటి బయటకు రాడు పిత్రార్జితం లక్షలకొద్దీ ఉందట ఆ ఇంట్లోకి వెళ్ళాలంటే అతని అనుమతి ఉండాలి. తలుపు లెప్పుడూ మూసే ఉంటాయి. నా కింతకంటె ఎక్కువ సమాచారం దొరకలేదు నువ్వు తెలివైనవాడివి కనక వాడిని కలుసుకుని నీపని సాధించుకోగలవు" అని చెప్పాడు.

అదెంత పని అనుకున్నాడు రాజకుమారుడు కందర్పుడు.

ఒకనాడు సాయంత్రం మాసిన బట్టలు కట్టుకుని సామాన్యుడిలా తయారై వారినీ వీరినీ అడుగుతూ మణివర్మ ఇంటి ముందుకి వెళ్ళాడు. ఆ సింహద్వారం చూసేసరికే - లోపలికి పోవడం అసాధ్య మనిపించింది. ఇంట్లోకే వెళ్ళలేకపోతే రహస్యంగా దాచిన కీలు జింకని సంపాదించడం ఎలా? - అనుకుంటూ ద్వారపాలకుణ్ణి - "లోపలికి పోవచ్చునా?" అని అడిగాడు.

వెళ్ళాడు చిత్రపటాలు రాసే నైపుణ్య ముండడంవల్ల కందర్పుడు తాను అంగీలో దాచి రహస్యంగా తెచ్చిన సామగ్రితో ఒకచెట్టు మొదట కూర్చుని సుభద్ర ఆకారం.. పక్కన తన ఆకారం పూలతోట...అన్నీ గీసి తన దగ్గ రుంచుకున్నాడు. సుభద్ర వాడుక ప్రకారం అక్కడికొచ్చి..."ఇదేమిటి? కొత్తవాడిని తీసుకొచ్చి కూడా నువ్వే నీరు తోడుతున్నావేం?" అని అడిగింది.

"వాడు పాదులు కడుతున్నాడు." అన్నా డతను. అప్పు డామె అతన్ని వెదుక్కుంటూ వచ్చి - ఏదో పని చేస్తున్నట్లు నటిస్తున్న అతనిని చూసి - "ఏమిరా! ముసలాడు కష్టపడుతూంటే నువ్విక్కడ వొళ్ళు దాచుక్కూర్చున్నావా! కూలి పంచుకోవా?" అని అడిగింది.

అతను చిరునవ్వు నవ్వుతూ - "ఏం చేసేది? నా కీమోటు పని అలవాటు లేదు. ఇలాటిపని అని ముసిలాడు చెప్పలేదు. బతిమాలి తీసుకొచ్చాడు. నాకు చిత్రాలు రాసే నేర్పరితనం ఉంది. నా పని తీరుచూడండి-" అంటూ తాను గీసిన పటంచూపాడు.

దాన్నిచూసి ఆమె ఆశ్చర్యపోయి - "ఈ రూపం నాదిలా ఉందే! ఈ జంట ఎక్కడిది? నువ్వు నన్నింతకు మును పెక్కడేనా చూశావా?" అని అడిగింది.

"తలుపు తీసేటప్పుడు చూశాను. బాగుందా?"

"ఈ చిత్రంలోని పురుషు డెవరు? ఇంత ప్రజ్ఞకలవాడివి కొద్దిపాటి కూలి కెందు కొచ్చావు? నీమాటలు కూడా గొప్పగా ఉన్నాయి నిజం చెప్పు"

"రామిరెడ్డికీ నాకూ పరిచయముంది కనక కూలి నిర్ణయించు కోలేదు. ఏమిచ్చినా తీసుకుంటాను. నీలాటి అందగత్తె కటువంటి భర్తుంటే బాగుంటుం దనిపించి అతన్నలా గీశాను. తప్పుకాదు కద?" అని భయం నటించాడు.

ఆమె పటం చూస్తూ...ఏదో ఆలోచించుకుని..."నాకు చిత్రరచన నేర్చుకోవాలని చాలాకాలం నుంచి సరదాగా ఉన్నాతగిన

గురువు దొరక్క ఊరుకున్నాను. మంచి సమయం దొరికింది మా తాత అస్వస్థతతో ఉన్నాడు. నువ్వు ప్రతిరోజూ ఇతనితో రా, ఇక్కడే నేర్చుకుంటాను." ఎన్నాళ్ళలో నేర్పగలవు? నువ్వుకోరిన ధనమిస్తాను. కానీ త్వరగా నేర్పాలి " అంది సుభద్ర "నీచురుకుతనం పరీక్షించి కాని ఎన్నాళ్ళు పట్టేదీ చెప్పలేను. నీకు రోజూ ఎంతసేపు నేర్చుకుందుకు వీలుంటుంది? ఇప్పుడే మొదలెడదాం"

ఆ మాటల కామె చాలా ఆనందించి - అతను చెప్పినట్లు తూర్పుగా ముఖంపెట్టి దేవుణ్ణి ధ్యానించింది అతను ముందుగా సరస్వతీదేవి బొమ్మ గీయించాడు. అతనికి వేళ్ళపై నున్న బట్ట తొలగి ఉంగరాలు బయటపడగా ఆమె కనుమానమొచ్చి చేతులపైనా ముఖంపైనా ఉన్న వస్త్రాలు తొలగించింది చంద్రబింబంలాటి అతని ముఖం బయట పడింది.

"ఇంత చక్కని శరీరాన్ని దాచుకుంటావేం? నిజంచెప్పు. నువ్వెవరివి? నీ కుల మేమిటి? ఇలాటి వేషంలో ఎందుకొచ్చావ్?" అని ప్రశ్నలు వర్షించింది

అతను నవ్వుతూ - "నే నీపట్నపు రాజకుమారుడు కందర్పుడిని. నీరూపలావణ్యాల గురించి విని - నిన్ను చూసి నీ చిత్రం రాసుకోవాలని ఇలా వచ్చాను. లేకపోతే నీ దర్శనం దొరకదు కదా" అన్నాడు.

"ఏమీ. నా చరిత్ర దేవరకే వెళ్ళిందా! ఇంతవరకూ నే నేవైనా అపచారాలు చేస్తే మన్నించండి. ఈ దీనురాలితో తమరి కేమి పని పడింది?" అందామె భయంగా.

అత నామె భయంపోగొట్టే మాటలు చెప్పి - స్నేహ భావంతో మెలగమని - "నా అంతఃపుర ప్రవేశ దోషాన్ని మన్నించు." అన్నాడు.

"ఈ చిత్ర పటంలో నా పక్కన మిమ్మల్ని ఏ అభిప్రాయంతో గీశారో. నాకు చిత్ర లేఖనం నేర్పకుండా మిమ్మల్ని వెళ్ళనిస్తానా?" అందామె పరిహాసంగా.

అంతలో – "సుభద్రా!" అని పిలుపు వినపడింది.

"మాతాత– సామాన్యుడు కాడు. మీతో చాలా మాట్లాడాలి. దయచేసి సాయంత్రం ఈ ముసలివానితో రండి" అని ఆమె లోపలికి పోయింది.

అతను సాయంత్రం మళ్ళీ కూలివానితో ఆ యింటికి వెళ్ళాడు. సుభద్ర అతన్ని పూపొదరిళ్ళ చాటుకి తీసుకెళ్ళి తానిచ్చిన శ్రమ కతని పాదాలు కందా యంటూ పాదాలమీద పడబోగా అత నామె భుజాలు పట్టుకుని ఆపాడు. ఆస్పర్శ వారిలో పరస్పరానురాగాలు కలిగించింది.

చీకటి పడబోతుంటే – "ఇక యిక్కడుండ కూడదు. మీ ఇంటి విశేషాలేమీ చెప్పావు కావు. మీ తాతేం చేస్తూంటాడు? నీకు తల్లిలేదట. మీ తాత నిన్ను బాగా చూసుకుంటాడా?" మీ ఇంట్లో చిత్రవిచిత్ర వస్తువులెన్నో ఉన్నాయట. నాకు చూపిస్తావా?" అని అడిగా డతను.

"మీ రీరాత్రి ఇంటికి పోవద్దు. మా తాత మంచం దిగిరాలేడు. మా అవ్వ అతని దగ్గరే ఉంటుంది. మా ఇంటి విశేషాలన్నీ రాత్రి చూపిస్తాను" అని – కనుచీకటి పడడంతోనే ఆమె అతన్ని తన మేడకి రహస్యమార్గం ద్వారా తీసుకుపోయి ఒకచోట కూర్చోబెట్టి – వృద్ధులకు చేయవలసిన పనులుపూర్తిచేసి – ఆహారంతో సహా తిరిగి వచ్చింది. వొస్తూ – తాత తలకిందున్న తాళం చెవులు సంగ్రహించి మరీ వచ్చింది.

ఆ భవన విశేషాలు చూసి అత నాశ్చర్యపోయాడు. మణివర్మ పూజా గృహంలో విశేషాలు చూపిస్తుండగా – అక్కడ మరజింక కనిపించింది.

"ఇదేమిటి?" అని అడిగా డతను. "తోలుజింక – ఎందుకో మాతాత దీనిని చాలా జాగ్రత్తగా కాపాడుతూంటాడు. ఈ గదిలో కెవ్వరినీ రానివ్వడు. నన్నొక్కర్తినే రానిస్తాడు. మా తాత మంత్ర తంత్రాలలో ఘటికుడు. ఆయనకి రోగం రాకపోతే మనమిలా తిరగలేం"

అతను దీపకాంతిలో ఆ జింక నెత్తిపట్టుకుని దానిలోని లిపిని చదివి పరమానంద భరితుడై "నీకు నామీ దెంతో అనురాగముంటే

తప్ప ఇలాటి రహస్యాలు చూపెట్టవు. నిన్ను నా ప్రియురాలిగా చేసుకుంటాను కనుక నాకోరిక తీర్చడం నీకు న్యాయం. ఈ వస్తువులన్నిటిలోకీ నాకీ జింక చాలా నచ్చింది దీనికి అతీత శక్తు లున్నట్లు దీనిమీది శాసనమే చెబుతూంది. దీని నొకసారిస్తే పరీక్షించి పనవగానే తిరిగిచ్చేస్తాను. ఏమంటావు?" అన్నాడు.

ఆమె ఓసా రాలోచించి - "మీరడగాలే కాని ప్రాణాలేనా ఇస్తాను. ఈ జింకొక లెక్కా? మాతాత అతిదుర్మార్గుడు ఇది కనపడకపోతే నన్నే అనుమానిస్తాడు. సరేలెండి. మీ పనిముందు ఏదేనా తక్కువే. మహా ఐతే ప్రాణాలు తీస్తాడు. అంతేకదా" అంది.

"నీప్రాణాలకు హాని కలిగించే పని నేను చెయ్యగలనా? దీనిలాటిదే మరొకటి తయారు చేయించి ముసలాడి చేత పంపిస్తాను. దీనిస్థానంలో దాన్ని పెట్టు. అప్పుడు మీ తాతకి అనుమానమే రాదు" అని ఆమెను ఒప్పించి దానిని పట్టుకుని ఇవతలకి వచ్చాడు.

"ఎవరైనా సరే ముందు స్వజాతి యువతిని పెళ్ళాడి. తరవాత మరోజాతి వారిని చేసుకోవచ్చు లేకపోతే ఆమె సంతానాని కదికార ముండదు. ఆ సంతానాన్ని గూఢజు లంటారు. నేను త్వరలోనే పట్టాభిషిక్తుడి నౌతాను. నిన్ను రెండో భార్యగా స్వీకరిస్తాను. నా మాటనమ్ము" అని ఆమెకు నచ్చజెప్పి - దీపకాంతిలో ఆజింకని సిద్ధం చేసే విధానం చదివాడు.

" ఈ జింక కుడిచెవిలోని బిరడా తీసి నోటిగాలితో నింపితే - గుర్రంలా నిలబడుతుంది. అప్పు డా బిరడా బిగించి, ఎక్కి, ఏ చెవి నెలా నొక్కితే అటువేపు ఎగిరిపోతుందట. తలమీద శీలలను కుడిఎడమలకి తిప్పితే పైకీ క్రిందకీ వెళ్తుంది. అక్కడే ఉన్న రెండోశీలను నొక్కి కావలసిన వేగాన్ని పెట్టుకోవచ్చు ఎడమ చెవిలోని బిరడాను తీసేస్తే వట్టితోలులా ఉంటుందట ఆహా. ఇలాటిది తయారు చేయడం విశ్వకర్మకే సాధ్యం. ఇలాటి అద్భుత వస్తువు నీ సాంగత్యం వల్లే లభిస్తుంది. నీ ఎదుటే పరీక్షిస్తాను" అంటూ ఆ జింకను గాలితో పూరించి ఇద్దరూ మేడమీదకి తీసుకు వెళ్ళారు.

అప్పుడు కందర్పుడు "వెళ్ళొస్తాను" అంటూ ఆమె బుగ్గమీద చిటికేసి - జింకనెక్కి, కుడిచెవినొక్కి ఆకాశంలోకి ఎగిరాడు దానిని మెల్లగా నడిపించి తన మేడమీద వాలాడు. అప్పటికి తెల్లవారుతోంది.

ఒక చర్మకారుడి చేత అలాటి జింకను తయారు చేయించి రామిరెడ్డి వద్దకెళ్ళి - "నేను మరోపని మీద నీకు చెప్పకుండా వెళ్ళాను. నువ్వు నన్ను వెతుక్కున్నావు కాబోలు"

అంటూంటే, వాడు నవ్వుతూ "నా దగ్గర కపటాలాడకు. నాకేమైనా ఇవ్వవలసి వొస్తుందని కాబోలు. నాకంతా తెలుసు. మణివర్మ ఛండశాసనుడు సుమీ, జాగ్రత్త" అన్నాడు.

కందర్పు డతనికి పారితోషిక మిచ్చి - "సుభద్ర నాదగ్గర చిత్ర రచన నేర్చుకుంటూంది. నిన్న నేను మరిచిపోయి దీనిని తెచ్చేశాను. జాగ్రత్తగా, అతిరహస్యంగా దీని నామెకియ్యి." అని దాని నిచ్చేశాడు.

తరువాత ఉపాధ్యాయుడి వద్దకు వెళ్ళి జింకవిశేషాలన్నీ చెప్పి - " ముందుగా ఏ దేశం పోవాలి?" అని అడిగాడు.

"భరతఖండం సులభంగా చూడొచ్చు. హిమాచలాని కవతలేముందో తెలియదు. ముందుగా అక్కడికిపో. రేపే శుభముహూర్తం" అన్నా డాయన. కందర్పు డాయన కెన్నో చెప్పి ఇంటికి వెళ్ళాడు.

మర్నాడుదయం ఇష్టదేవతా ప్రార్థన చేసి ఆహారపదార్థాలు మూట కట్టుకుని జింకమీద ఎగిరిపోయాడు. అది ఎంత వేగంగా వెళ్తున్నా కుదుపనేదే లేదు.

హిమవత్పర్వతాలకు ఉత్తరభాగంలో చాలాదూరంవరకూ పర్వతాలూ అడవులే తప్పమరేమీలేదు. అరణ్యాల మీదుగా వెళ్తున్నప్పుడు జింకను భూమికి దగ్గరగా పోనిస్తూ చెట్లకున్న పళ్ళని కోస్తూ... వెళ్ళాడు. సాయంత్రం కాబోతూంటే - అతనికి పట్నం కనిపించింది.

జింకనాపి ఆ పట్నం నాలుగు మూలలా తిరిగాడు. దానికి చివరే కనిపించలేదు. అది ఆ దేశపు రాజధాని కావచ్చు ననుకున్నాడు. ' ఈదేశం మా దేశానికి సహస్రయోజనా లుంటుంది. అంతదూరమూ ఇట్టే తీసుకొచ్చేసింది జింక దీనిని తయారు చేసిన వా డెంత గొప్పవాడు!' అనుకుంటూ జింకలోని గాలి తీసి మడిచి చంకలో పెట్టుకుని పట్నంలో తిరగ సాగాడు

అప్పుడతనామె కన్నీరు తుడుస్తూ – 'నువ్విలా దుఃఖిస్తే నేనేం చేసేది? ఇక్కడుంటే నీ మర్యాద నిలవదు. నిన్ను విడచి పోడానికి కాళ్ళాడవు. నిన్ను రమ్మనడానికి సందేహంగా ఉంది. ఇల్లువదిలి ఏడాదైంది. వృద్ధులైన నా తల్లితండ్రులెలా ఉన్నారో? ఈ జింక మీద ఒక్కరోజుల్లో వెళ్ళి రావచ్చును నువ్వు నాతో వొస్తే ఏ లోటూ ఉండదు" అన్నాడు

"నేను నా బంధువులని వదిలి ఇదివరకే మీ అధీనమయ్యాను నన్ను రమ్మనడానికి సందేహ మెందుకు? మీదేశం పోయి హాయిగా ఉందాం. నేను గర్భవతినని మీవాళ్ళకి చెప్పేపనిమిగిలింది. కాని. ఇప్పుడు చెబితే తప్పుగా ఎంచుతారు. స్త్రీలకు, భర్తే – తల్లీ, తండ్రీ, దైవమూ. మావాళ్ళ లెక్క నాకు లేదు త్వరగా పోదాం పదండి ఈ నిర్బంధాలలో ఉండడ మెందుకు? నాకోసం విచారించేది మదురిక ఒక్కర్తే. మనం స్థిరపడ్డాక దాన్ని కూడా తెప్పించుకుందాం" అని ప్రయాణానికతన్ని తొందరపెడుతూ రత్నాలపెట్టెలు మొదలైనవి సవరించుకుని సిద్ధం చేయసాగింది

కందర్పుడు చాలా సంతోషించాడు జింకను సిద్ధంచేసి మనోరమని పిలిచాడు ఆమె వచ్చి – 'ముందు కూర్చునేదా? వెనక కూర్చునేదా?" అని అడిగింది

"ముందే కూర్చో' అని జింకను ఆకాశమార్గం పట్టించాడు.

అంతవరకూ చెప్పి – మణిసిద్ధుడు – "చెప్పవలసిన కద చాలా ఉంది మన ప్రయాణానికి వేళయింది. తరువాత మజిలీలో చెప్పుకుందాం" అన్నాడు గోపాలుడు కావడి మోసుకుంటూ గురువు వెంట నడవసాగాడు.



# కాశీ మజిలీ కథలు

## 22. వ మజిలీ

### విద్యావతి కథ

"గోపాలా! విను. కందర్పుడు ఆ సుందరితో జింకమీద ఆకాశమార్గంలో వెళ్తూంటే – ఆ వేగాన్ని భరించలేక మనోరమ – " కొంచెంసేపు విశ్రమించి వెళ్దాం. జింకను నేలమీదికి దింపడి" అంది. అతను జింకను భూమ్మీద దింపాడు.

ఆమె కళ్ళు తెరచి – "ఇది ఏదేశం? మీ రాజధానిక్కడి కెంత దూరం? మా వూరు వదిలి ఎంత దూరం వచ్చాం? మననెరిగిన వారెవరూ ఇక్కడుండరుకద?" అని అడిగింది.

అతను – "ఇదే దేశమో నాకూ తెలియదు. మావూ రీ రాత్రిలోగా చేరగలం. మీదేశం ఇక్కడికి చాలా దూరం ఉంటుంది. ఇక్కడ మనని తెలిసిన వాళ్ళుండకపోవచ్చు కాని మన రూపాలు చూసి సందేహించవచ్చు. అంచేత నువ్విక్కడే ఉండు. నేను బజారుకి పోయి తినుబండారా లేవైనా తెస్తాను" అని జింకని మడిచి చంకలో పెట్టుకుని పట్నంలోకి వెళ్ళాడు.

అంగడిలో ఆహార పదార్థాలేమీ దొరకలేదు. అతను వారినీ వీరినీ అడుగుతూ పట్నం చివరకు పోయాడు. ఆ వీధి వేశ్య కాంతలతో నిండి ఉంది. ఆ వీధి విశేషాలు చూస్తూ మనోరమ సంగతి మరచిపోయి వెళ్తూంటే – ఒక విచిత్ర భవనం ద్వారంముందు నిలబడి ఒక విటుడూ, వేశ్యమాతాదెబ్బలాడుకుంటున్నారు

"విద్యావతి అంత సులభంగా అంగీకరింపదని ఎన్ని సార్లు చెప్పాలిరా దరిద్ర చూడామణీ! నక్కెక్కడ? నాగలోక మెక్కడ? నీలాటి

నీచుల మొహమేనా చూడదు ఎన్ని సార్లు చెప్పినా సిగ్గులేకుండా గుమ్మం పట్టుకుని వేలాడుతున్నావు, ఛో" అని ఆవేశ్యమాత తలుపేసింది.

అతను దుఃఖిస్తూంటే - కందర్పుడు వెళ్ళి అతని వృత్తాంతం అడిగాడు.

అప్పుడతను - "ఏంచెప్పమంటారు? నేను రెండిటికీ చెడ్డరేవడి నయ్యాను. ఈ ప్రాంతంలోని ఒక గ్రామానికి మేము అధికారులం.

మా తండ్రి నా చిన్నతనంలోనే చనిపోయాడు నేను పెద్దవగానే మా అమ్మ సురక్షితంగా ఉంచిన ఆస్తిని నాపరం చేసింది.

ఒకనాడు నేనోదేవాలయంలో హరిభజనకి వచ్చిన విద్యావతిని చూశాను. ఆమె సౌందర్యానికి ముగ్ధుడినై పోయాను ఆమె వారకాంత అని తెలిసి - చాలా సంతోషించి - ఆమెను నా అధీనం చేస్తే క్రమంగా నా ఆస్తంతా ఆమె కిస్తానని రత్నావతికి కబురు పంపాను. అప్పుడు రత్నావతి నన్ను మేడమీదకి తీసుకుపోయి సత్కారాలు చేసింది. కాని విద్యావతిని మాత్రం చూపించలేదు. రేపురేపంటూ ఆశపెడుతూ మా ఆస్తినంతా తెప్పించుకుంది. వారి కా గ్రామం కూడా రాసిచ్చేశాను. ఇంక మా ఇంట్లో ఏమీలేవు. చివరకి గట్టిగా అడిగితే నన్ను దరిద్రచూడామణి అని పొమ్మంది మీరే చూశారుగా? దీనిమూలాన నాకు పెళ్ళి కూడా కాలేదు. అప్పులన్నవారు మిగల్లేదు.

చూడబోతే మీరు మహాత్ముల్లా ఉన్నారు. నిష్కారణంగా దరిద్రుడై పోయిన నాకు-దీనిని మందలించి ఏదయినా ఆధారం కలగజేయండి" అని అతి దీనంగా వేడుకున్నాడు

అది విన్న కందర్పుడి కతని మీద జాలీ, రత్నావతి మీద కోపమూ కలిగాయి. 'వేశ్యలకు కరుణ ఉండదు. రత్నావతి నెలాగేనా పరాభవించి వీని కుపకారం చేస్తాను' అని నిశ్చయించుకున్నాడు.

"బుద్ధిహీనుడినై భాగ్యమంతా పోగొట్టుకున్నావు జరిగినదానికి విచారించి ఏంలాభం? నువ్వీప్రాంతంలోనే ఉండు. నీ ఆస్తిని నీకిప్పిస్తాను" అని కందర్పు డావేశ్యల రహస్యాలన్నీ బాగా తెలుసుకుని, ఒక చిత్రకారు డింటికివెళ్ళి, తన జింకకు గరుడవాహనం రంగు వేయించుకున్నాడు.

చీకటి పడ్డాక మహావిష్ణువులా తయారై జింకమీద ఆ వారకాంతమేడమీద వలయాకారంలో తిరగ సాగాడు. అప్పటికి విద్యావతి సఖులతో మేడమీద వీణ వాయిస్తూ విష్ణువు మీద పాటపాడుతూంది. ఆమెమీద పడే టట్లతను తులసిమాల జార్చాడు.

ఆమె త్రుళ్ళిపడి ఆకాశంవేపు చూసింది. అప్పుడు కందర్పు డొక ఉత్తరం వదిలాడు. విద్యావతి చాలా ఆశ్చర్యమూ ఆనందమూ పడుతూ మహావిష్ణువులా ఉన్న అతనికి నమస్కరించి – తడబడిపోతూ ఉత్తరంచదివింది.

"సుందరీ! నేను కందర్పజనకుడిని. నీ భక్తికి మెచ్చి నీకు దర్శన మివ్వాలనుకుంటున్నాను" అని ఉం దా ఉత్తరంలో.

దానిని ముమ్మారు చదివి చెలులను పంపేసి మేడ తలుపు వేసి – రమ్మని చెయ్యూపింది. 'నేటికి నాయందు దయ కలిగింది.

స్వామి నన్ను కనికరించారా!" అంటూ దండకాలు చదివింది.

అప్పు డతను మెల్లగా ఆమేడమీదకి దిగాడు. ఆమె సాష్టాంగపడి మొక్కింది. అత నామెను లేవనెత్తి గదిలోకి తీసుకువెళ్ళాడు. ఆమె మాట్లాడకుండా మెలగసాగింది. అప్పు డత నామెకు మరో ఉత్తరం అందించాడు.

"విద్యావతీ! పూర్వజన్మలో నువ్వొక గోపికవి. కృష్ణావతారంలో కామంతో తృప్తిపడక నన్ను వర మడిగావు తరువాత జన్మలో తీరుస్తానని నీకు మాటచ్చాను. ఆ కోరిక తీర్చడానికే నే నిప్పుడు వచ్చాను. నీ ఇష్టమొచ్చి నన్నాళ్ళు రాత్రులు వచ్చి నీ కోరిక తీర్చి వెళ్తూంటాను. భక్తులకోరిక తీర్చడం కంటె మాకు మరేదీ అధికం కాదు కదా?" అని రాయబడిందా ఉత్తరంలో. అది చదివి ఆమె భక్తి విశ్వాలతో, తల్లికైనా తెలుపకుండా, తన నర్పించుకుంది.

రాత్రి ఆమెతో గడిపి సూర్యోదయానికి ముందు జింకనెక్కి వెళ్ళిపోయాడతను. అలాగ కందర్పు డామెతో ప్రతిరాత్రీ సుఖించసాగాడు.

అప్పుడతనామె కన్నీరు తుడుస్తూ - "నువ్విలా దుఃఖిస్తే నేనేం చేసేది? ఇక్కడుంటే నీ మర్యాద నిలవదు. నిన్ను విడచి పోడానికి కాళ్ళాడవు. నిన్ను రమ్మనడానికి సందేహంగా ఉంది. ఇల్లువదిలి ఏడాదైంది. వృద్ధులైన నా తల్లితండ్రులెలా ఉన్నారో? ఈ జింక మీద ఒక్కరోజుల్లో వెళ్ళి రావచ్చును. నువ్వు నాతో వొస్తే ఏ లోటూ ఉండదు" అన్నాడు.

"నేను నా బంధువులని వదిలి ఇదివరకే మీ అదీనమయ్యాను నన్ను రమ్మనడానికి సందేహ మెందుకు? మీదేశం పోయి హాయిగా ఉందాం. నేను గర్భవతినని మీవాళ్ళకి చెప్పేపనిమిగిలింది కాని. ఇప్పుడు చెబితే తప్పుగా ఎంచుతారు. స్త్రీలకు, భర్తే - తల్లీ, తండ్రీ, దైవమూ. మావాళ్ళ లెక్క నాకు లేదు త్వరగా పోదాం పదండి. ఈ నిర్బంధాలలో ఉండడ మెందుకు? నాకోసం విచారించేది మదురిక ఒక్కర్తే. మనం స్థిరపడ్డాక దాన్ని కూడా తెప్పించుకుందాం" అని ప్రయాణానికతన్ని తొందరపెడుతూ రత్నాలపెట్టెలు మొదలైనవి సవరించుకుని సిద్ధం చేయసాగింది.

కందర్పుడు చాలా సంతోషించాడు జింకను సిద్ధంచేసి మనోరమని పిలిచాడు ఆమె వచ్చి - "ముందు కూర్చునేదా? వెనక కూర్చునేదా?" అని అడిగింది

"ముందే కూర్చో" అని జింకను ఆకాశమార్గం పట్టించాడు.

అంతవరకూ చెప్పి - మణిసిద్ధుడు - "చెప్పవలసిన కద చాలా ఉంది. మన ప్రయాణానికి వేళయింది తరువాత మజిలీలో చెప్పకుందాం" అన్నాడు గోపాలుడు కావడి మోసుకుంటూ గురువు వెంట నడవసాగాడు



# కాశీ మజిలీ కథలు

## 22. వ మజిలీ

### విద్యావతి కథ

"గోపాలా! విను. కందర్పుడు ఆ సుందరితో జింకమీద ఆకాశమార్గంలో వెళ్తూంటే - ఆ వేగాన్ని భరించలేక మనోరమ - " కొంచెంసేపు విశ్రమించి వెళ్దాం. జింకను నేలమీదికి దింపడి" అంది. అతను జింకను భూమ్మీద దింపాడు.

ఆమె కళ్ళు తెరచి - "ఇది ఏదేశం? మీ రాజధానిక్కడి కెంత దూరం? మా వూరు వదిలి ఎంత దూరం వచ్చాం? మననెరిగిన వారెవరూ ఇక్కడుండరుకద?" అని అడిగింది.

అతను - "ఇదే దేశమో నాకూ తెలియదు. మావూ రీ రాత్రిలోగా చేరగలం. మీదేశం ఇక్కడికి చాలా దూరం ఉంటుంది. ఇక్కడ మనని తెలిసిన వాళ్ళుండకపోవచ్చు కాని మన రూపాలు చూసి సందేహించవచ్చు. అంచేత నువ్విక్కడే ఉండు. నేను బజారుకి పోయి తినుబండారా లేవైనా తెస్తాను" అని జింకని మడిచి చంకలో పెట్టుకుని పట్నంలోకి వెళ్ళాడు.

అంగడిలో ఆహార పదార్థాలేమీ దొరకలేదు. అతను వారినీ వీరినీ అడుగుతూ పట్నం చివరకు పోయాడు. ఆ వీధి వేశ్య కాంతలతో నిండి ఉంది. ఆ వీధి విశేషాలు చూస్తూ మనోరమ సంగతి మరచిపోయి వెళ్తూంటే - ఒక విచిత్ర భవనం ద్వారంముందు నిలబడి ఒక విటుడూ, వేశ్యమాతాదెబ్బలాడుకుంటున్నారు.

"విద్యావతి అంత సులభంగా అంగీకరింపదని ఎన్ని సార్లు చెప్పాలిరా దరిద్ర చూడామణీ! నక్కెక్కడ? నాగలోక మెక్కడ? నీలాటి

నీచుల మొహమేనా చూడదు. ఎన్ని సార్లు చెప్పినా సిగ్గులేకుండా గుమ్మం పట్టుకుని వేలాడుతున్నావు, ఛో" అని ఆవేశ్యమాత తలుపేసింది

అతను దుఃఖిస్తూంటే - కందర్పుడు వెళ్ళి అతని వృత్తాంతం అడిగాడు.

అప్పుడతను - "ఏంచెప్పమంటారు? నేను రెండిటికీ చెడ్డరేవడి నయ్యాను. ఈ ప్రాంతంలోని ఒక గ్రామానికి మేము అధికారులం.

మా తండ్రి నా చిన్నతనంలోనే చనిపోయాడు నేను పెద్దవగానే మా అమ్మ సురక్షితంగా ఉంచిన ఆస్తిని నాపరం చేసింది.

ఒకనాడు నేనోదేవాలయంలో హరిభజనకి వచ్చిన విద్యావతిని చూశాను. ఆమె సౌందర్యానికి ముగ్ధుడినై పోయాను. ఆమె వారకాంత అని తెలిసి - చాలా సంతోషించి - ఆమెను నా అధీనం చేస్తే క్రమంగా నా ఆస్తంతా ఆమె కిస్తానని రత్నావతికి కబురు పంపాను. అప్పుడు రత్నావతి నన్ను మేడమీదకి తీసుకుపోయి సత్కారాలు చేసింది. కాని విద్యావతిని మాత్రం చూపించలేదు. రేపురేపంటూ ఆశపెడుతూ మా ఆస్తినంతా తెప్పించుకుంది వారి కా గ్రామం కూడా రాసిచ్చేశాను. ఇంక మా ఇంట్లో ఏమీలేవు. చివరకి గట్టిగా అడిగితే నన్ను దరిద్రచూడామణి అని పొమ్మంది. మీరే చూశారుగా? దీనిమూలాన నాకు పెళ్ళి కూడా కాలేదు. ఆప్తులన్నవారు మిగల్లేదు.

చూడబోతే మీరు మహాత్ముల్లా ఉన్నారు. నిష్కారణంగా దరిద్రుడై పోయిన నాకు-దీనిని మందలించి ఏదయినా ఆధారం కలగజేయండి" అని అతి దీనంగా వేడుకున్నాడు.

అది విన్న కందర్పుడి కతని మీద జాలీ, రత్నావతి మీద కోపమూ కలిగాయి. 'వేశ్యలకు కరుణ ఉండదు. రత్నావతి నెలాగేనా పరాభవించి వీని కుపకారం చేస్తాను' అని నిశ్చయించుకున్నాడు.

"బుద్ధిహీనుడినై భాగ్యమంతా పోగొట్టుకున్నావు. జరిగినదానికి విచారించి ఏంలాభం? నువ్వీప్రాంతంలోనే ఉండు. నీ ఆస్తిని నీకిప్పిస్తాను" అని కందర్పు డావేశ్యల రహస్యాలన్నీ బాగా తెలుసుకుని, ఒక చిత్రకారు డింటికివెళ్ళి, తన జింకకు గరుడవాహనం రంగు వేయించుకున్నాడు.

చీకటి పడ్డాక మహావిష్ణువులా తయారై జింకమీద ఆ వారకాంతమేడమీద వలయాకారంలో తిరగ సాగాడు. అప్పటికి విద్యావతి సఖులతో మేడమీద వీణ వాయిస్తూ విష్ణువు మీద పాటపాడుతూంది. ఆమెమీద పడే టట్లతను తులసిమాల జార్చాడు.

ఆమె త్రుళ్ళిపడి ఆకాశంవేపు చూసింది. అప్పుడు కందర్పు డొక ఉత్తరం వదిలాడు. విద్యావతి చాలా ఆశ్చర్యమూ ఆనందమూ పడుతూ మహావిష్ణువులా ఉన్న అతనికి నమస్కరించి – తడబడిపోతూ ఉత్తరంచదివింది.

"సుందరీ! నేను కందర్పజనకుడిని. నీ భక్తికి మెచ్చి నీకు దర్శన మివ్వాలనుకుంటున్నాను" అని ఉం దా ఉత్తరంలో.

దానిని ముమ్మారు చదివి చెలులను పంపేసి మేడ తలుపు వేసి – రమ్మని చెయ్యూపింది. 'నేటికి నాయందు దయ కలిగింది.

స్వామి నన్ను కనికరించారా!" అంటూ దండకాలు చదివింది.

అప్పు డతను మెల్లగా ఆమేడమీదకి దిగాడు ఆమె సాష్టాంగపడి మొక్కింది. అత నామెను లేవనెత్తి గదిలోకి తీసుకువెళ్ళాడు. ఆమె మాట్లాడకుండా మెలగసాగింది. అప్పు డత నామెకు మరో ఉత్తరం అందించాడు.

"విద్యావతీ! పూర్వజన్మలో నువ్వొక గోపికవి. కృష్ణావతారంలో కామంతో తృప్తిపడక నన్ను వర మడిగావు. తరువాత జన్మలో తీరుస్తానని నీకు మాటచ్చాను. ఆ కోరిక తీర్చడానికే నే నిప్పుడు వచ్చాను. నీ ఇష్టమొచ్చి నన్నాళ్ళు రాత్రులు వచ్చి నీ కోరిక తీర్చి వెళ్తూంటాను. భక్తులకోరిక తీర్చడం కంటె మాకు మరేదీ అధికం కాదు కదా?" అని రాయబడిందా ఉత్తరంలో. అది చదివి ఆమె భక్తి విశ్వాలతో, తల్లికైనా తెలుపకుండా, తన నర్పించుకుంది.

రాత్రి ఆమెతో గడిపి సూర్యోదయానికి ముందు జింకనెక్కి వెళ్ళిపోయాడతను. అలాగ కందర్పు డామెతో ప్రతిరాత్రీ సుఖించసాగాడు.

తన భక్తిని మెచ్చి శ్రీహరి కరుణిస్తున్నాడని పొంగిపోతూంది విద్యావతి. అతను చెప్పవద్దన్నాడని ఆ రహస్యం తన తల్లి రత్నావతికి కూడా చెప్పలేదు.

రత్నావతిని వంచించాలని వెళ్ళిన కందర్పుడు విద్యావతి సౌందర్యానికి తానే మోసపోయి, పగలంతా ఎక్కడో గడుపుతూ రాత్రయ్యేసరికి విద్యావతిని చేరుకునేవాడు. అలాగ ఆమెతో సుఖంలో మునిగి అతను తననీ మనోరమనీ కూడా విస్మరించాడు కొన్ని సంవత్సరాలు గడిచాయి.

ఒకనాడు రత్నావతి కూతురితో - "ఇక నీ నియమాలు కట్టిపెట్టి ధనార్జన సంగతి ఆలోచించు" అనగా

"అమ్మా నా వృత్తాంతం తెలియక నువ్వలా అంటున్నావు. సాక్షాత్తూ విష్ణువే వచ్చి రాత్రులు నాతో క్రీడిస్తున్నాడు. ఆ మహానుభావుడే నాకు విటుడవగా మిగిలిన విటులతో పనేమిటి?" అంది విద్యావతి.

ఆ మాటలకు రత్నావతి ఆశ్చర్యపోయి - "ఇన్నాళ్లూ నాతో చెప్పావుకావేం? నేను కన్నతల్లినే కాని పైదానను కాదుకదా" అంది.

"ఆయన ఆజ్ఞలేదు ఇవాళేనా సాహసించి చెప్పాను. ఆయనతో మరికొంత చనువు పెరగగానే నీకూ దర్శనమిప్పిస్తాను - " అంది విద్యావతి.

ఒకరాత్రి ఆమె మంచి సమయం చూసి - "స్వామీ! నాదో చిన్నకోరిక బ్రహ్మాండనాయకుడివైన నీ అండచేరి కూడా నే నిక్కడుండడ మేమిటి? మీ వైకుంఠం చూడాలని వేడుకగా ఉంది నన్నోసా రక్కడికి తీసుకెళ్ళి వైకుంఠం అంతా చూపించరూ?" అని ప్రార్థించింది.

"అదెంత పని? అలాగే" అన్నా డతను.

"మా తల్లికి మీ దర్శనం ఒక్కసా రిప్పించరూ" అని కోరింది.

అందు కతను - ఆశ్చర్యం నటిస్తూ - "మీతల్లికి నన్ను దర్శనమిమ్మంటున్నావా చాలు చాలు అది చేసిన పాపాలకు కొత్తనరకం

సృష్టించాలి. అందుకు నేను అంగీకరించను" అన్నాడు కొంచెం కోపంగా "నేను ప్రేయసినై ఉండి మా తల్లిని రక్షించుకోలేకపోతే ఇంకెందుకు దేవా? నాతల్లి పాపాలు చేస్తే నిష్కృతి చెప్పండి" అని విద్యావతి వేడుకోగా –

అతను ధ్యానం నటించి కొంతసేపయ్యాక – "సరే, మీ తల్లి చేత ఒకపని చేయించు. ఆమె అన్యాయంగా ఆర్జించిన దంతా ఎవరిది వారి కప్పగించేసి మిగిలినదుంటే బ్రాహ్మణులకి పంచమను. ఏమీ మిగలకూడదు. అప్పుడామె పవిత్రురా లౌతుంది. నేను దర్శన మిస్తాను. నరకం తప్పుతుంది" అన్నాడు కరుణిస్తున్నట్లు.

రత్నావతి కూతురిద్వారా అదివిని...చాలా ఆనందపడి... వైకుంఠయాత్రకోసం ఉవ్విళ్ళూరుతూ తన సొమ్మంతా పంచిపెట్టెయ్యడాని కంగీకరించింది. ఆమె కిటికీలోంచి రహస్యంగా వారి సంభాషణ విని ఉండడంతో ఆమె కేమీ సందేహం కలగలేదు.

రత్నావతి పట్నంలో చాటింపు వేయించింది. ఎవరినుంచి ఏం తీసుకుందో గుర్తున్న మేరకు వారికి కబురంపింది. ఆమె దానా లందుకుందుకు వచ్చిన బ్రాహ్మణుల సంఖ్య అత్యధికంగా ఉండి వారు తగవులాడుకుని కొట్లాటలకు కూడా దిగవలసి వచ్చింది. ఆర్జించిన కోటిరూపాయల ఆస్తినీ ఆమె తెలిసినమేరకు యజమానులకీ, దాసదాసీ జనానికీ, బ్రాహ్మణులకీ పంచివేసింది

తాను వైకుంఠం వెళ్తున్నట్లు ఆప్తులు కొందరికి చెప్పింది. దాంతో విష్ణువుని చూడాలని చాలామంది ఆమె ఇంటిముందు పోగయ్యారు.

జింకమీద కందర్పుడు మేడమీద వాలాడు. రత్నావతి కేదో అనుమానం వచ్చినా కూతురివల్ల బయలు పడలేదు. చేతులు జోడించి స్తోత్రం చేసింది. విద్యావతి– "మీరు చెప్పినట్లే మాతల్లి తన సర్వస్వాన్నీ దానం చేసేసి వైకుంఠ యాత్రకి సిద్ధంగా ఉంది" అంది.

"ఇప్పటి కామె పవిత్రురాలైంది తీసుకెళ్తాలే. కాని – ఇద్దర్నీ ఒకేసారి ఈ వాహనం మీద తీసుకెళ్ళడం కష్టం. నిన్ను ముందు

తీసుకెళ్తాను" అన్నా డతను. అతను జింకని రహస్యంగా సిద్ధం చేశాడు విద్యావతి – "ముందు కూర్చుండేదా, వెనక కూర్చోనా?" అని అడిగింది

పూర్వం మనోరమ కూడా అలాగే అడిగిందని జ్ఞాపకం వచ్చి...దానితో మనోరమ గుర్తుకువచ్చి – అతను మూర్ఛపోయాడు. కీలు వదలడంవల్ల జింక చప్పబడి చర్మంలా పడిపోయింది. విద్యావతి అతనికి శైత్యోపచారాలు చేసి సేద తీర్చింది. "ఇదేమి స్వామీ? ఇలా పడిపోయారేం? నామీద దయ తప్పిందా?" అంటూ ఆమె అతనికి సేవ చేసింది

అతను కళ్ళుతెరవకుండా – "అయ్యో! రాజపుత్రీ. నిన్నెంత మోసం చేశాను! అంతఃపురంలో ఉండనివ్వక అడవిలో వదిలేశాను. ఏంకష్టాలు పడుతున్నావో!" అంటూ పలవరించాడు.

రత్నావతి కూతుర్ని చూసి – "శ్రీహరేమిటి, ఇలాటి అవస్థేమిటి? నా కేమిటో అనుమానంగా ఉంది. గరుడవాహనం జింకచర్మంలా ఉండడ మేమిటి? ఇదంతా ఏదో కుట్రలా ఉంది. గ్రహింపలేక నువ్వు మునిగావు. నా కొంపముంచావు" అంటూ గుండెలు బాదుకుంటూ గోలు గోలున ఏడవసాగింది.

"ఊరుకో, స్వామికి మనమేనా భక్తులం? ఎవరో జ్ఞాపకం వచ్చుంటారు" అని తల్లిని వారించి "స్వామీ! లెండి. పొద్దుపోయింది. వైకుంఠం పోదాం" అంది విద్యావతి.

"ఇంకెక్కడి వైకుంఠం? నా మనోర మెక్కడికి పోయింది? నువ్వెవర్తివి? కీలుజింక లేకపోతే ఇన్నినర్థాలు జరగకపోవును కదా"

విద్యావతి అతన్నింకా బతిమాల బోతూంటే – రత్నావతి "ఓసి నిర్భాగ్యురాలా! నీకింకా తెలియలేదా? ఇది గరుడవాహనం కాదు. కీలుజింక. దీనికి రంగులేసి ఎవడో మనకొంప ముంచాడు. నీమాట నమ్మి నేనూ గంగలో దిగాను కట్టుకోడానికి గుడ్డముక్కయినా లేదు. ఏం చెయ్యాలి?" అంటూ ఆ జింకను కత్తితో కోసి మూల పారేసింది.

ఆమె గొల్లున ఏడుస్తూంటే - అందరూ ఆమెను చుట్టు ముట్టి ఏమైంది?" అంటూ అడిగారు.

రత్నావతి ఏడుస్తూనే తమకి జరిగిన నష్టమంతా చెప్పి - "కొంతసేపుంటే ఈ యిల్లు పొందిన బ్రాహ్మణుడొచ్చి మమ్మల్ని వెళ్ళగొడతాడు. కట్టుకుందుకు గుడ్డముక్కైనా ఉంచుకోలేదు. ఇదంతా తెచ్చిపెట్టింది విద్యావతే" అంటూ మళ్ళీ ఏడవసాగింది.

ఆ ఏడుపుకి కందర్పుడికి కొంచెం తెలివొచ్చి - "మీ రెవరు? నా మనోర మెక్కడుంది? ఈ ఇల్లెవరిది?" అని అడిగాడు.

విద్యావతి తెల్లబోయి చూసింది. "అలా అంటావేం? అసలు నువ్వెవరివి? మనోర మెవరు? నిజంచెప్పు" అంది. కందర్పుడు దేశాటనం చేయడం చెప్పి "మనోరమ కాకలిగా ఉందంటే ఆమెనుంచి నేను బయలు దేరి ఊళ్ళోకి వచ్చాను. పళ్ళు తీసుకెళ్ళాలి. దొరుకుతాయా?" అని అడిగాడు కందర్పుడు

"అయ్యో! మనపనైపోయిందే" అని ఆమె తల్లిని పట్టుకుని ఏడుస్తూంటే - ఆ ఇంటిని పొందిన బ్రాహ్మణుడు - "అమంగళంగా ఇలా ఏడుస్తావేం? నేను గృహప్రవేశోత్సవం చేసుకుంటాను. శూద్రు లిక్కడుండ కూడదు. ఎక్కడికేనా పొండి" -అన్నాడు.

ఆ మాటలకు - "నేను వైకుంఠానికి పోతా ననుకుని మీకీ ఇల్లిచ్చాను. ఆ ప్రయాణం చెడిపోయింది. కనక మేమీ ఇంట్లోంచి పోడానికి వీల్లేదు. మీరు మీ ఇంటికి పొండి. తనకుమాలిన ధర్మ ముండదు కదా" అంది రత్నావతి.

"నీ దానం గొప్పగా ఉంది. నిన్నివ్వమని ఎవ రేడిచారు? నీగృహం దానంపట్టినందుకు నన్ను కులంలోంచి వెలివేశారు. ప్రాయశ్చిత్తంగా కొంతసొమ్ము గురువుగారి కిచ్చుకున్నాను నువ్వు దానంచేసినవన్నీ తిరిగి తెచ్చుకో. నేనీ ఇల్లు వదులుతాను" అని తగవు పెట్టా డా బ్రాహ్మణుడు

అంతలో కందర్పుడికి పూర్తిగా తెలివొచ్చింది. వీళ్ళని భంగపరచాలని తనే భంగపడడం తప్పు - అనుకుని.. మెల్లగా లేచేసరికి ఒకమూలన చిరిగిపడున్న జింక కనిపించింది 'దీని నెవరిలా చేశారు?" అని కోపంగా అడిగాడు అప్పుడు రత్నావతి అతన్ని తిట్టిపోసి బెదిరించింది.

"ఓసి రండా! అరచావంటే రాజుతో చెప్పి నీ పీక తెగనరికించగలను" అని అక్కడున్న వారి వీపు తిరిగి - "దీని కూతురు విద్యవతికీ నాకూ చాలారోజు ల్నించీ సాంగత్యముంది. మా తల్లి వైకుంఠాని కెలా పోగలదని ఆమె అడిగితే - అది పాపాత్మురాలు, నరకానికే పోతుందని చెప్పాను నన్ను మరీ మరీ బతిమాలగా పురాణంలో ఉన్నవిధంగా తన ధనమంతా బ్రాహ్మణులకు దానం చేస్తే వైకుంఠం లభించ వచ్చన్నాను. అలా చేసింది కాబోలు. మరణానంతరం కదా స్వర్గమో నరకమో తెలిసేది? ఎంతో విలువైన నా తోలుజింక నిది చింపేసింది. అందుకు మీరు సాక్ష్యంగా ఉండండి. నేనిప్పుడు రాజుగారి దగ్గరకెళ్ళి దీనిని శిక్షింప జేస్తాను" అన్నాడు కందర్పుడు

అప్పుడు విద్యావతి తల్లితో - "ఆయన మాటలు విన్నావా? రాజసభలోకూడా ఇలాగే చెబుతాడు. మనమాటలు వినేదెవరు? మనగ్రహస్థితి అనుకుని ఎక్కడికేనా పోవడమే మంచిది. ఇచ్చిన దానాన్ని పుచ్చుకోడం నీతికాదు. రాజు మననే ఆక్షేపిస్తాడు. దేవుడి దయుంటే మళ్ళీ సంపాదించుకోవచ్చు. విచారించకు" అంది.

"చూడబోతే నువ్వు కావాలనే ఇలా చేసినట్లుంది నా డబ్బంతా ఖర్చుచేయించి మీరు సుఖపడ్డారు నన్ను జోగిని చేసిన ఇతన్ని వదిలెయ్యమని వేదాంతం చెబుతావా? మీ అందరి సంగతీ రాజుకి చెబుతాను ఇప్పుడున్న రాజు పూర్వపు వాడుకాదు నాగదత్తుడనే ఇతను న్యాయాన్యాయాలని చక్కగా విచారించే సమర్థత కలవాడు. ఆయన పట్టాభిషేక మేళానికి నేను పోయాను - " అని రత్నావతి అంటూంటే తెల్లవారింది

కందర్పుడూ, పురోహితుడూ దానికంటే ముందే రాజసభకు బయలుదేరారు. రత్నావతి వాళ్ళని వదలకుండా అనుసరించసాగింది. ఆమె దానమిస్తుందేమో అని కొందరు బ్రాహ్మణులు వెంటపడగా పురోహితుడు జరిగింది చెప్పాడు.

వాళ్ళమెను పరిహాసం చేసి పోయారు.

ఆ విచారణ వినడానికి చాలామంది పౌరులు రాజసభకు హాజరయ్యారు. రాజు ముందుగా రత్నావతిని – "ఏం చెప్పుకుంటా"వని అడిగాడు.

ఆమె జరిగిందంతా చెప్పింది. "ఇతను మమ్మల్ని మోసం చేశాడు. కనక మానష్టమంతా అతను భరించాలి" అని కోరింది.

రాజు కందర్పుడిని – "ఏంచెబుతావ్?" అని అడగగా – అతను "ఆమె మాటలలో కొంత అసత్యముంది నేను కందర్ప జనకుడినని విద్యావతికి చెప్పాను. ఆమె పండితురాలు కనుక విష్ణువనుకుందేమో! కందర్ప జనకు డనడంలో నా ఉద్దేశం మన్మద బావాలు కలిగించేవాడినని మాత్రమే. పురాణంలో అలా చెప్పబడి ఉంది కనక రత్నావతి తనకున్నదంతా బ్రాహ్మణులకిస్తే ఆమెకు వైకుంఠం ప్రాప్తిస్తుందన్నాను. నాది తప్పయితే బ్రాహ్మణుల ఆశీర్వచనాలన్నీ తప్పే. ఆశీర్వచనం ప్రకారం ఎవరికి జరుగుతుంది? నే నామెనుంచి ఒక్క కాసైనా తీసుకోలేదు. ఈ మాత్రాని కీ రత్నావతి నన్ను కారుకూతలు కూసి – ఎంతో విలువైన నా తోలు జింకను చింపేసింది. దాన్ని దేశాటనం కోసం ఎరువు తెచ్చుకున్నాను. దానిని రత్నావతి చింపేసిందనడాని కీ పురోహితుడే సాక్షి" అన్నాడు.

నాగదత్తుడు మనసులో ఏదో ద్యానించుచున్నాడు. అతని కళ్ళనుంచి వొస్తున్న బాష్పాలు తుడుచుకుని – "తీర్పు రేపు చెప్తాను. ఇప్పుడందరూ వెళ్ళి రేపు రండి" అన్నాడు. కందర్పుణ్ని మాత్రం చెయ్యిపట్టుకుని ఆపి – తన అంతఃపురానికి తీసుకు వెళ్ళారు.

కంధర్పుడి కేమీ అర్థంకాలేదు కాని...అతని ముఖంలో మనోరమ పోలికలు కనపడ్డాయి నాగదత్తు డతనిని ఏకాంత ప్రదేశానికి తీసుకెళ్ళి కూర్చోబెట్టి - అతని వివరాలన్నీ అడిగాడు. కందర్పు డాలోచనలో పడగా - "యదార్థం చెప్పండి. మీకు సంతానం ఉందా? నన్ను మీ కొడుకుగా భావించండి. మనోరమని తలుచుకుని ఎందుకు విచారించారు?ఆమె ఎవరు? - దయచేసి మీ వృత్తాంతమంతా చెప్పండి" అని వినయంగా అడిగాడు.

అతని మాటలు వినేసరికి కందర్పుడి కానందం కలిగింది. జరిగినదంతా చెప్పాడు. అప్పుడు నాగదత్తుడొక చీటిరాసి పరిచారికతో లోపలికి పంపాడు.

లోపలి నుంచి ఒక స్త్రీ తడబడుతూ వచ్చి - 'నా భర్తెక్కడ?" అంటూ కందర్పుడిని చూసి . అతని పాదాలమీద పడి.. . "నాథా! రక్షించండి"అని ప్రార్థించింది."అయ్యో. ఈ మెవరు? నీ కేమౌతుంది? గుర్తులు చెప్పు" అని అడిగాడు కందర్పుడు. "ఇంకా తెలియలేదా? ఆవేళ నువ్వు వదిలి వెళ్ళిన మనోరమే నేను నీ కొడుకుని దైవకృపవల్ల ఆపదలన్ని గడిచాయి" అన్నాడు నాగదత్తుడు

"ఇది కల కాదు కద? నిజమేనా? మనోరమా! ఏదీ...నీముఖం చూడనీ ' అంటూ ఆమెను కౌగలించుకుని - "ఇవాళెంత సుదినం!" అంటూ కొడుకుని చేరదీసి - "నీ కీ రాజ్యమెలా వచ్చింది?" అని అతనినీ, 'మనోరమా! నేను తిరిగిరాకపోడంతో ఏం చేశావ్? నన్ను కృతఘ్ను డనుకున్నావా? .. తరవాత ఏం చేశావో, ఏమైందో చెప్పు. వినాలని నాకు చాలా ఆరాటంగా ఉంది" అన్నాడు కందర్పుడు

ఆమె కన్నీళ్ళు తుడుచుకుని - ఆకథ చెప్పసాగింది.



# నాగదత్తుని కథ

"మీరు పళ్ళకోసం పట్నంలోకి వెళ్ళి ఎంతకీ రాకపోడంతో నేనా చెట్టుక్రింద కూర్చుని పరిపరివిదాల ఆలోచిస్తూ - ఎవరేనా అటొచ్చిన అలికిడైతే చెట్టుచాటుకు పోయి దాక్కుంటూ సాయంకాలం వరకూ ఎదురు చూశాను. మీరు రాలేదు గుండె బయంతో ఝల్లుమంది.

'నాభర్త ఎక్కడో ఆపదలో చిక్కి ఉంటాడు. లేకపోతే ఇంతసేపు నన్నిక్కడ ఒంటరిగా వదలి పెడతాడా? అతనిక రాడు. నేనేం చెయ్యాలి? - ఇది కలకాదు. నిజమే. నాకిలా టవస్థ వచ్చి పడింది! ఇప్పు డెక్కడికి పోవాలి? ఎవరితో చెప్పుకోవాలి? నన్ను ఊరడించే వారెవరు?' అనుకుంటూ...మీరు వెళ్ళిన తోవలో ఎవరు వస్తున్నా మీరే అనుకుంటూ - కాకపోయేసరికి గుండె బాదుకుంటూ చాలాసేపు దుఃఖించాను.

సాయంకాలమైంది. మొండి ధైర్యం తెచ్చుకున్నాను. పట్నంలోకి పోవాలని నిశ్చయించుకున్నాను వొంటి మీది నగలన్నీ మూటకట్టాను. మీరు పోయిన దారినే నడవసాగాను. కొంచెం దూరం వెళ్ళేసరికే ఒక ముసల్ది కూర్చుని ఏడవడం గమనించాను.

ఆమె దగ్గరకెళ్ళి - "అవ్వా! నువ్వెవరివి? ఎందు కేడుస్తున్నావు? చీకటి పడుతూంది. పట్నంలోకి రావా?" అని అడిగాను

అవ్వ నన్ను కన్నెత్తి చూసింది. "అయ్యోతల్లీ! నన్నోదార్చడానికి నువ్వు మళ్ళీ బతికొచ్చావా." అని అరుస్తూ నాపై పడి కౌగలించుకుంది.

నేను భయపడి - "అవ్వా! నన్నెవరనుకుంటున్నావు? నేను నీ బంధువుని కాను. ఎవరికోసం నువ్వు ఏడుస్తున్నావ్? నీ వృత్తాంతం చెప్పు" అన్నాను.

అవ్వ - "నేనొక బోగందాన్ని. నాపేరు రుక్మవతి. నాకు కామమంజరి అనే కూతు రుండేది అది అచ్చంగా నీపోలికే. అది దురదృష్టవశాత్తూ కొన్నాళ్ళ కిందట చనిపోయింది. ఇది దాని స్మశానం. అది జ్ఞాపకం వచ్చినప్పుడల్లా నేనిక్కడి కొచ్చి ఏడుస్తూంటాను ఇవాళ

నువ్వొచ్చావు. నిన్ను చూస్తుంటే నా కూతుర్ని చూసినట్లే ఉంది. నీ దేవూరు? మా ఇంటి కొకసారి వస్తావా? ఒక్కర్తివే ఇక్కడి కొచ్చావేం? నీవృత్తాంత మేమిటో చెప్పు" అంది.

"అవ్వా. నేనో రాజకుమార్తెను. కొన్ని కారణాల వల్ల ఈవూరు చేరాను నాభర్త దేశాంతరం వెళ్ళాడు. ఈవూరొచ్చాడేమో చూద్దామని వచ్చాను నేను గర్భవతిని. గర్భందాల్చి ఆరుమాసాలు గతించాయి. నా బంధువులు దూరదేశంలో ఉన్నారు నన్ను నీచపు పనులకు నియోగింపకపోతే నీవెంటొస్తాను" అన్నాను నేను.

అవ్వ అలాగే అని తనింటికి తీసుకువెళ్ళింది. అంతకంటె గత్యంతరం లేక అలా అన్నాను. అవ్వ ఇల్లు చాలా వైభవంగా ఉంది. ప్రాణాలు నిలుపుకోడం కోసం తింటూ మిమ్మల్ని స్మరించుకుంటూ అతి కష్టంమీద కాలం గడపసాగాను. ఏదో మిషతో ఊరిబయటకు పోయి మీ జాడకోసం చూసేదాన్ని కాని ప్రయోజనం ఉండేదికాదు

రుక్మవతి చెల్లెలు రత్నావతి అనే వేశ్య వచ్చి అక్కతో ఏదో చెబుతూండేది నేను పట్టించుకునేదాన్ని కాను

నాకు నవమాసాలు నిండి ప్రసవవేదన ప్రారంభమైంది. అప్పుడవ్వ - "అమ్మా! ప్రసవ సమయంలో కళ్ళకి గంతలు కట్టుకోడం ఈదేశాచరమై ఉంది" అంటూ నాకళ్ళకి గంతలు కట్టింది.

"రాతిగుండుని కన్నావే." అంటూ గంతలు విప్పారు. నా పక్కలో ఒకరాతి గుండుంది. గ్రహస్థితి అలా ఉందికాబోలని నా దుః ఖాన్ని దిగమింగుకున్నాను. నన్ను రుక్మవతి, రత్నావతి ఓదార్చారు. అప్పుడుకూడా నాకు జీవించాలనే ఆశ వదిలింది కాదు.

కొన్ని నెలలయ్యాక నన్ను మంచివస్త్రాలు కట్టుకోమనీ, అలంకారాలు చేసుకోమనీ వాళ్ళు బోధించసాగారు అదంతా నామీద ప్రేమనుకుని వారి మాటప్రకారమే చేయసాగాను.

ఒకనాడు రత్నావతి నా దగ్గరకొచ్చింది. "నువ్వెప్పుడూ విచారంగానే ఉంటావేం? చక్కని అందముంది. వయసులో ఉన్నావు.

నీ యౌవనాన్ని వృదాచేసుకుంటావేం? నిన్ను చూస్తుంటే నాకు బాదగా ఉంటుంది. వయసులో సుఖపడని జన్మమెందుకు? మాలో కలిసిపోయావు కనక మాలాగే ఉండాలి. నువ్వు ఊఁ అంటే బోలెడంత మంది విటులను రప్పిస్తాను. మాకెన్నో విద్యలూ వశీకరణ మార్గాలూ తెలుసు" అంటూ ఏవేవో చెప్పింది కాని అవేవీ నా బుర్ర కెక్కలేదు. నేను వినలేదు

ఒకనాడు నాగదత్తుడు పట్టాభిషిక్తుడై ఏనుగు నెక్కి ఊరేగుతూంటే ఆ జనంలో మీరు కనపడతారేమో అనే ఆశతో మేడెక్కి తొంగి చేశాను. అతనూ నన్ను చూశాడు. వేశ్యావాటికలో ఉన్నాను కనుక నన్ను వేశ్య అనుకున్నాడేమో ఆరాత్రి రుక్మావతికి కబురు పంపాడు

ఆమె నాకు చెప్పి – "రాజశాసనం ధిక్కరిస్తే కష్టాలలో పడతాం" అంటూ భయపెట్టింది.

'దనం సంపాదించాలను కుంటూంది. కాబోలు ఇంక ఇక్కడుండ కూడదు. ఆ రాజు వస్తే అతని పాదాల మీద పడి నా వృత్తాంతం చెప్పి రక్షించ మంటాను ప్రజలని న్యాయంగా పాలించే రాజుకి నామీద దయపుట్టకపోతుందా?' అని మౌనంగా ఉండి పోయాను. నా మౌనాన్ని అది అర్ధాంగీకారంగా తీసుకుంది కాబోలు. ఆరాత్రే రమ్మని నాగదత్తుడికి కబురంపింది

అతను రహస్యంగా .. ఒక్కడే మా ఇంటికొచ్చి లోపల నడుస్తూ...చూడకుండా ఒక అవుదూడని తొక్కాడు. ఆదూడ అంబా అని అరిచి – "వీడెవడో నన్ను తొక్కాడే అమ్మా!" అని తల్లికి చెప్పగా –

ఆ ధేనువు – "మాతృసంగమం చేయదానికి వెళ్తున్న అధముడు నిన్ను తొక్కడంలో ఏం ఆశ్చర్యముంది? వాడికి కిందా మీదా కనపడుతున్నాయా?" అంది.

వాటిభాష తెలిసిన నాగదత్తుడు 'నేను వచ్చింది వారకాంత ఇంటికి వీరికీ మాకూ వావివరసలేమిటీ? నేను కోరినదానిని మా తండ్రి ఎన్నడేనా ఉంచుకున్నాడేమో' అనుకుంటూ అతను నా వద్దకు వచ్చాడు.

నేను మాసిన చీరలో. . అలంకారాలు లేకుండా ..ఒక మూలకూర్చుని కన్నీరు కారుస్తున్నాను అతను నా వైఖరిచూసి –

"నువ్వెవరివి? విటులని చూసి వేశ్యలు ఏడవరు. నువ్వెందు కేడుస్తున్నావు? నిన్ను చూస్తే వేశ్య అనిపించదే. యదార్థమేమిటో నిర్భయంగా చెప్పు" అని అడిగాడు.

అప్పుడు నాకు వాత్సల్యంతో గుండె పులకరించింది. నే నంతా అతనికి చెప్పాను అతను తలూపుతూ - ఆవు, దూడల మధ్య జరిగిన సంభాషణ చెప్పి - "విచారింపకు నేను నిజంగా నీ కొడుకునే. ఈ రుక్మవతి మోసంచేసి నేను పుట్టగానే నన్ను ఊరిబయట నూతిలో పారవేసి నీకు రాయి పుట్టిందని చెప్పి ఉంటుంది.

ఈ పట్నపురాజు ధర్మకేతుడు ఒకనాడు విహారం చేస్తూ దాహమేసి ఒక నూతిదగ్గరకు వెళ్ళాడు. నూతిలోంచి శిశువు ఏడుపు వినపడుతూంటే తొంగిచూడగా నేనందులో ఉన్నాను. నాపైన ఎండపడకుండా ఒక పాము పడగపట్టి ఉంది.

సంతానం లేని రాజు నన్ను బయటకు తీయించి నారూపానికి మెచ్చుకుంటూ - భగవంతుడే సర్పరూపంలో తనకు పుత్రుణ్ణి ప్రసాదించాడని భావించి నాగదత్తుడని పేరు పెట్టి నన్ను పెంచు కోసాగాడు.

మొన్ననే నాకు పట్టాభిషేకం చేసి రాజు తపోవనానికి వెళ్ళిపోయాడు. ఒకసారి నా కథంతా నాకు చెప్పాడు. కాలక్రమం చూసినా నువ్వు చెప్పిందీ రాజుచెప్పిందీ ఒకటే అయింది. నిజం - వాళ్ళ చేతే చెప్పిస్తా. మనం కోటలోకి పోదాం, రా .. మా తండ్రిని కూడా వెదికి రప్పిస్తాను" అంటూ నన్నిక్కడికి తీసుకొచ్చాడు

అప్పటినుంచీ నే నిక్కడే మీకోసం ఎదురు చూస్తున్నాను" అని మనోరమ తనకథ ముగించింది

కందర్పుడు ఆశ్చర్యపోయాడు నాగదత్తుడు తనపుత్రుడే. మనోరమకి పుట్టాడు "ఆహా! కాలం నడిచినట్లే లేదు!

కాని ఎంత వేగంగా ఇన్నేళ్ళు గడిచాయి! సంవత్సరంలోగా ఇంటికి తిరిగి వచ్చెయ్యాలని దేశాటనం బయలు దేరాను. మా తల్లి

తండ్రులెంత విచారిస్తున్నారో! అదీకాక సుభద్ర సంగతి నీకు చెప్పాను కదా! నాకోసం ఆమెఎంత క్రుంగి పోతూందో...." అని నిట్టూర్చాడు. అంతలో - మరొకస్త్రీ అక్కడికి వచ్చింది. కందర్పు డాశ్చర్యంగా - "ఈమెవరు?" అనిఅడిగాడు.

"ఈమె మీ ప్రధమ ప్రేయసి సుభద్ర" అని చెప్పింది మనోరమ.

అతని ఆనందానికీ ఆశ్చర్యానికీ హద్దులేదు. "ఈమె యిక్కడి కెలా వచ్చింది?" అంటూ వాళ్ళిద్దర్ని కౌగలించుకున్నాడు. "సుభద్రా! నువ్వక్కడి కొచ్చి ఎంతకాల మయింది? ఈ బంధుత్వం ఎలా తెలుసుకున్నావు? ఇక్కడి కెలా వచ్చావు?" అని ప్రశ్నలు కురిపించాడు.

సుభద్ర - "మీ రా మరజింకని తీసుకువెళ్ళిన కొన్ని రోజులకి మా తాత మణివర్మ ఆ గదిలోకి వచ్చి జింకని తీసి చూసి గుండెలు బాదుకుంటూ - నన్ను పిలిచాడు.

"సుభద్రా! నా గదిలో ఉన్న జింకని తీసి దానిస్థానంలో దీన్నెవ రుంచారు?" అనిఅడిగాడు.

"నాకు తెలియదు -" అన్నాను.

"నిజం చెప్పు. దాంతో నాకు పెద్ద పనుంది. ఎన్నాళ్ళనుంచో ప్రాణప్రదంగా దాచుకుంటున్నాను. నువ్వే తీసుంటావనిపిస్తూంది" అంటూ నాచేత నిజం చెప్పించడాని కెన్నోవిధాల ప్రయత్నించాడు. అయినా నేను చెప్పలేదు.

అప్పు డతను చాలా కోపగించి నన్ను దగ్గరగా రమ్మని - ఏదో మూలిక నా తల వెంట్రుకలలో ఉంచి - "సుభద్రా! నువ్వీ జింక సంగతి తెలిసికూడా చెప్పకపోతే ఇప్పుడే చిలకవై పోతావు ఆలోచించుకో" అని అవకాశమిచ్చాడు. కాని నేను నిజం చెప్పకుండా అబద్ధాలే చెప్పాను.

ఆ మూలిక ప్రభావ మేమిటో కాని అక్షణంలోనే నేను చిలకనై ఎగిరి పోయాను. అప్పుడు మా తాత విచారిస్తూ... "సుభద్రా! రా! నీ చిలకరూపం తీసేసి మళ్ళీ సుభద్రని చేసేస్తాను" అని పిలిచాడు.

కాని నాకలాటి క్రూరుడి దగ్గ రుండడం ఇష్టం లేక దూరంగా ఎగిరిపోయి ఒక చిలకల గుంపులో కలిశాను. అవి మొదట నన్ను చేరనివ్వకపోయినా మెల్లగారెండు మూడు రోజుల్లో తమలో కలవనిచ్చాయి

పదిరోజులవరకూ నాకు జాతి జ్ఞానం ఉంది. నేను మీదేశం వెళ్ళి మీ అంతఃపురం చూశాను. మీ తల్లితండ్రులు నిద్రాహారాలు మాని మీమీద బెంగతో ఉన్నారు దేశాంతరం వెళ్ళినట్టు విని - నేను కొన్ని చిలకలని *తోడు తీసుకుని అనేక* దేశాలు తిరిగాను. అప్పటికే నాకు జాతి జ్ఞానం పోయింది. ఎక్క డెక్కడ తిరిగానో ఏంచేశానో తెలియదు.

ఒకనా డొక అరణ్యంలో తిరుగుతూంటే - పొదల రాపిడికి నాతలలోని మూలిక జారిపడింది కాబోలు నాకు మామూలు రూపు వచ్చేసింది. మళ్ళీ సుభద్రనై పోయాను. పూర్వ వృత్తాంతం జ్ఞాపకం వచ్చి నాలుగుమూలలా చూశాను ఎవరూ కనపడలేదు.

'దైవంనన్నీ అరణ్య మధ్యంలో పారేసి శాపవిమోచనం చేశాడు. చిలకగా ఉంటేనే బాగుండేది. ఇప్పు డెక్కడికి పోగలను? క్రూరమృగాల అరుపులకి గుండెలదురుతున్నాయి' అని విచారిస్తూ అక్కడి నుంచిపోడానికి దారి వెదుకుతూంటే - ఒక వీరుడు విల్లంబులు ధరించి గుర్రంమీద వస్తున్నాడు. అతనొక వరాహాన్ని తరుముకుంటూ నేనున్న చోటుకి వచ్చాడు.

మనిషి కనిపించినందుకు నేను మహదానందపడిపోతూ - "రక్షించండి, రక్షించండి" అంటూ దీనంగా ప్రార్థించాను. అతను గుర్రాన్ని నాకు దగ్గరగా తెచ్చి - "నువ్వెవరివి? ఇలాటి అరణ్యంలో ఒంటరిగా ఎందుకున్నావు? నీ భర్తఎవరు? తల్లితండ్రులెవరు?" అంటూ ప్రశ్నించాడు. నేను ఏమీ దాచకుండా నా వృత్తాంతమంతా చెప్పుకున్నాను. అంతావిని -

"తల్లీ! భయపడకు. నేను కందర్పుని కొడుకుని నాపేరు నాగదత్తుడు. తల్లి మనోరమ. నే నాయనను వెదుకుతున్నాను" అంటూ తనగురించి చెప్పి నన్నిక్కడికి తీసుకు వచ్చాడు.

అప్పట్నించీ మనోరమ నన్ను సోదరిలా చూసుకుంటూంది. నేను మీ కోసం ఎదురు చూస్తూ కాలం గడుపుతున్నాను" అంది.

ఆ రాత్రి వాళ్ళందరూ ఆనందంగా గడిపారు.

మర్నాడు నాగదత్తుడు తండ్రి అనుమతితో రత్నావతిని సభకి పిలిపించి - అది చేసిన దుర్మార్గాలన్నీ ప్రజలనోటే చెప్పించి "ఓసీ! నీకు వైకుంఠం కావాలా! కందర్పుడికి చేతనవలేదు. నేను పంపుతాను చూడు" అంటూ తండ్రి చేసిన ప్రతిజ్ఞ ప్రకారం - సిగ గొరిగించి, వికృతంగా తయారు చేయించి - గాడిదపై ఎక్కించి -

"రత్నావతి వైకుంఠానికిపోతూంది. చూడండ హో...అంటూ చాటింపు వేయించి వీధులన్నీ తిప్పండి" అంటూ కింకరుల నాజ్ఞాపించాడు.

"విద్యావతి గుణవంతురాలే అని కందర్పుడు చెప్పగా - కొంతధనమిచ్చి పంపాడు" అని ఆగి -

"నీ ప్రశ్నకి సమాధానం దొరికిందా?" అంటూ మణిసిద్ధుడు గోపాలు ణ్నడిగాడు.

"మీరు చెప్పే కథకి తిరుగుంటుందా? కాని తరవాతేమైంది? కందర్పుడు భార్యా పుత్రులతో ఇంటికి పోయాడా? లేక అక్కడే ఉన్నాడా?" అని అడిగాడు గోపాలుడు.

"నువ్వేదీ వదలవు కదా శౌనకా! సరే విను. కందర్పుడు తల్లితండ్రులని తలుచుకుని...మర్నాడే భార్యాపుత్రులతో బయలుదేరి మహావైభవంగా కుంభకోణం వెళ్ళి...తనకోసం బెంగపెట్టుకున్న తల్లి తండ్రులకి సంతోషం కలగ జేశాడు. సుభద్ర కందర్పుడికి రెండవభార్య అయి సకల సుఖాలూ పొందింది. కందర్పుడు పట్టాభిషిక్తుడై... కొన్నాళ్ళయ్యాక కొడుకు నతని రాజ్యానికి పంపాడు"

శౌనకుడి లాటి గోపాలుడి కప్పటికి పూర్తిగా తృప్తయింది.



# కాశీ మజిలీ కథలు

## 23. వ మజిలీ

ఒక పట్నంలో మజిలీ చేశారు గురు శిష్యులు. మణిసిద్ధుడు కార్యక్రమాలన్నీ పూర్తిచేసుకుని ఊళ్ళోకెళ్ళిన గోపాలు డింకా ఎందుకు రాలేదా అనుకుంటూంటే - వాడు పరుగున వచ్చి అయ్యగారికి నమస్కరించి

"చిత్రమిది చిత్రమిది సువిచిత్రమిదియ

చిత్రమిది చిత్రమిది కడు విచిత్రమిదియ" అంటూ పద్యం చదివాడు.

గురువు నవ్వుతూ "నీకూ కవిత్వ మొస్తూంది! పద్యం చెప్పేస్తున్నావు! ఇంతవరకూ ఎక్కడున్నావు? వీధిలో కెళ్ళావంటే ఊరికే రావు. ఇంతకీ నువ్వు చూసిన చిత్రమేమిటి? అన్నం చల్లరిపోతూంది తిను" అన్నాడు.

మీ దయుండాలే కాని నేను కవినవడం ఆశ్చర్యమా? వినండి. ఈ వూరి వింతలు చూస్తూ నేనొక దేవాలయానికి పోయాను. అక్కడొక శిలాశాసన ముంది. దానిని చదవాలని కొందరు బుద్ధిమంతులు ప్రయత్నిస్తున్నారు. చివరికి - పసరు విశేషంతో చూడగా చివరి రెండు పాదాలు మాత్రం తెలిశాయి. వాళ్ళెంత ప్రయత్నించినా మొదటి రెండు పాదాలూ మాత్రం చదవలేకపోయారు. అందులోని విచిత్రమేమిటో అనేది వాళ్ళకి సందేహంగానే ఉండిపోయింది. నేనా పాదాలు వల్లించుకుంటూ వచ్చి మీముందు చదివానంతే. చివరి రెండు పాదాలబట్టి చూస్తే - మొదటి రెండు పాదాలలోనూ ఏదో విచిత్రం చెప్పబడి ఉంటుంది కదా? మీరు త్రికాలజ్ఞులు కనక మీరు మొదటి రెండు పాదాలూ చదివెయ్యగలరు. మీరవి చదవండి. నేను భోంచేస్తాను"అన్నాడు వాడు. వాడి ఉత్సాహాన్ని కాదనలేక మణిని ముందుపెట్టుకుని ద్యానించి పద్యం పూర్తిగా చదివాడు. అది ఒక స్త్రీ యొక్క చిత్ర విచిత్రమైన వృత్తాంతాన్ని చెప్పే పద్యం. శౌనకుడు భోజనం చేశాక మణిసిద్ధు డాపద్యం వెనక కథ చెప్పసాగాడు.

# తెనాలి రామలింగ కవి కథ

"ఆంధ్రదేశ రాజులలో చాలా ప్రఖ్యాతి గాంచిన కృష్ణదేవరాయల చరిత్రలో కొన్ని ఘట్టాలు నీ కిదివరకే చెప్పాను. ఆ మహారాజు ఆస్థాన కవీశ్వరులు - అల్లసాని పెద్దన్న, ముక్కుతిమ్మన్న, అయ్యలరాజు రామభద్రుడు, భట్టుమూర్తి, మాదయగారి మల్లన, పింగళి సూరన్న, ధూర్జటి, తెనాలి రామలింగ కవి. వీరిని అష్టదిగ్గజాలంటారు. ఆ కాలంలో వీరితో సమానులైన పండితులు కాని కవీశ్వరులు కాని శాస్త్రజ్ఞులు కాని లేరట. తెనాలిరామలింగ కవి యుక్తి, సమయస్ఫూర్తి, హాస్యం, కల్పనాచాతుర్యాలలో అతని కతనే సాటి. పూర్వ జన్మలో అతను చాలాకాలం పరమేశ్వరి నారాధించాడు. ఆమె ఎంతకీ ప్రత్యక్ష్యం కాకపోడంతో అతను విసిగిపోయి దేవి నెత్తిపొడవడంతో ఆమె అతన్ని వికటకవి కమ్మని శపించింది. అప్పు డత నామెను స్తోత్రం చేశాడు. ఆమె కరుణించింది. అతని సమయస్ఫూర్తిని అందరూ మెచ్చుకుంటారు. ఎవరికీ దీర్ఘకోపం రాదు. అతనికవిత్వం అతిచక్కగా ఉంటుంది... అని ఆమె దీవించింది. అందువలన అత నీ జన్మలో వికటకవిగా వాసి కెక్కాడు.

కృష్ణదేవరాయ లొకనాడు ప్రొద్దున్నే కొలువుతీరి పండితులతో విద్యావిషయాలు ముచ్చటిస్తున్నాడు. "నాకు పండిత వాదాలు వినాలనుంది. కాని పైవారెవరూ మీతో వాదించడానికి సాహసించరు. మీలో మీకు వాదన పెట్టాలంటే ఒకరిపట్ల ఒకరు దీర్ఘకాలం శత్రుత్వం పెంచుకుంటారేమో అని సందేహంగా ఉంది. మీ కెవరేనా తెలిసిన పండితు డుంటే చెప్పండి పిలిపిస్తాను. వారితో మీరు వాదిస్తూంటే వింటాను" అన్నాడు.

భట్టుమూర్తి లేచి, రాయలను స్తుతించి "అలాటి పండితుడు మాకు తెలిసి ఎవరూ లేరు. మీరు సెలవిస్తే మాలో మేమే తర్కించుకుంటాం. గెలిచిన వారికి మీరు పారితోషిక మిద్దురుగాని. కాని ఈ ప్రసంగానికి రామలింగడిని మాత్రం దూరంగా ఉంచాలని మా ప్రార్థన. అతనుంటే ఏదో మాయచేసి మరెవరినీ గెలవనివ్వడు"అన్నాడు.

అంతలో - ద్వారపాలుడు జయ జయ నినాదంతో వచ్చి - "రాజా! కాశీదేశం నుంచి నిన్న రాత్రి ఒక వేశ్య ఏనుగులు, గుర్రాలు మొదలైన వైభవంతో వచ్చి ఉందట. దేవరకు పత్రి కంపింది" అంటూ అందించాడు.

"నాపేరు మందారవల్లి, వేశ్యకులంలో పుట్టినా ఆ వృత్తి నసహ్యించుకున్నాను. అరవైనాలుగు కళలోనూ కూలంకషంగా జ్ఞానం సంపాదించాను. ఎందరో పండితులనుంచి జయపత్రిక లందుకున్నాను. మీ సభలో పండుతులగురించి విని వారితో వాదించాలని వచ్చాను నే నే పండితుని ముందేనా ఓడిపోతే అతని సేవకురాలి నౌతాను. నేనే గెలిస్తే అతను జయపత్రికను నాకిచ్చి, నేనడిగే ధనమిచ్చి, సన్యాసం తీసుకోవాలి. అది నావ్రతం " అని ఉందందులో.

అదివిని - "వేశ్యకింత గర్వమా! రాయల ఆస్థానకవీంద్రుల గొప్పతనం తెలియదు కాబోలు దీనిగర్వం భంగపడదానికే వచ్చింది. దానిని విడవకూడదు" అన్నారు పండితులు.

అంతలో మరో పరిచారకు డామె జయపత్రికలు కల పెద్ద పెట్టెను మోసుకొచ్చాడు. భట్టుమూర్తి లేచి తానే ఆమె నోడించి పంపుతానన్నాడు. కాని రామలింగ కవి ఉంటే ఎవరినీ గెలవనివ్వడు కనక అతన్నెక్కడికేనా పంపెయ్యమన్నాడు.

ధూర్జటి "మందారవల్లిని జయించాలంటే సులభంకాదు. అందుకు సమర్థుడు రామలింగకవే" అన్నాడు.

రాయలు ఆ విజయాన్ని భట్టుమూర్తికి లభింప జేయదలచి - అతనిని వాదనకు పంపుదామన్నాడు. రామలింగ కవిని దూరంగా పంపుతానన్నాడు. సభ చాలించి అంతఃపురానికి వెళ్ళిపోయాడు.

ఆవేళ రామలింగ డెందుకో సభకి రాలేదు. కాని....అతనితో సమానుడైన మిత్రుడు సుభద్రుడు - సభావిశేషా లతనికి చెప్పాడు. రాజకింకరు డొచ్చి రాజశాసనం అందించగా - "ఇప్పుడే పోతున్నాను" అని ప్రత్యుత్తరం రాసి పంపి మారువేషంలో అక్కడే ఉన్నాడు.

మర్నాడు పండితు లందరూ గుమిగూడారు. భట్టుమూర్తి అధైర్యంగా – "మందారవల్లి నే విద్యలో జయించడమేనా కష్టమే. అసాధ్యమే. చెప్పుకుందుకు సిగ్గేస్తూంది. నిన్న సాయంకాలం స్త్రీవేషంలో ఒక దాసిని తీసుకుని దాని దగ్గరకు వెళ్ళాను. దాని వైభవం చెప్పడానికి వీల్లేదు.

"లోపలికి పోవచ్చునా?" అని ద్వారరక్షకు లనడిగాను. "విద్యావంతులు కాని యువతులలో ఆమె మాట్లాడదు" అన్నారు వారు.

"నేను పండితురాలినే" అని చెప్పి ఆ ద్వారం దాటాను. ఇంకా ఎన్నో ద్వారాలు. అన్నిటి దగ్గరా అదే ప్రశ్న. చివరి కామె గది చేరాను.

అది ఇంద్రసభలాగే ఉంది. ఆమె శిష్యురాళ్ళకి శాస్త్రాలు చెబుతోంది. ఆమె అందం అత్యంత అద్భుతం. ముఖమంతా కళ్ళే! సౌందర్యం సంగత టుంచండి. ఎందరో స్త్రీలు ఆమె చుట్టూ ఉండి శాస్త్రపాఠాలు చదువుతూంటే అందరికీ అన్నిరూపాలై చెబుతూంది. ఆమెను చూశాక పత్రికలో వ్రాసింది అక్షరాలా నిజమే అనిపించింది.

ఆమె నన్ను చూసింది. ఆమె చూపుకే నేను వివశుడి నయ్యాను. నేనెక్కడున్నానో... ఎందుకు వచ్చానో...ఏ వేషంలో ఉన్నానో అంతా మరిచిపోయాను. ఆమె నేనెందుకు వచ్చానో కనుక్కోమని దాసికి చెప్పింది. ఆమె నన్నడిగింది. నే నెలాగో ధైర్యం తెచ్చుకుని – "మందారవల్లిమీద పుష్పమాలికా బంధం కట్టి కానుకతెచ్చాను" అన్నాను.

"బాగుంటే మా ఉపాధ్యాయిని నీకు పారితోషిక మిస్తుంది. చదువు" అంది.

రాగయుక్తంగా చదవాలనుకున్నాను. కాని...సంకోచంవల్ల గొంతు సరిగా రాక – అరచనను ఒకబాలిక కందించాను. ఆమె మందారవల్లి కందించగా అందరూ వినేటట్లు చదివి – పెదవి విరుస్తూ ఒకామె కందించింది. ఆమె లేచి కోకిల స్వరంలో శాస్త్ర దృష్టాంతాలతో తప్పులు చెబుతూ ఆ రచనెన్నో విధాలుగా ఖండించింది.

నా జవాబు కోసం చూసింది కాని నానోటినుంచి మాటే రాలేదు. ఆ దోషాలు మనకి తెలియనే తెలియవు. మందారవల్లి దగ్గరలో కూర్చున్న ఒకామె – "నీ కవితతో పని లేదు. మా మందారవల్లి దీనులను రక్షించడాని కంకణం కట్టుకుంది. ఈ ముత్యాలహారం తీసుకో – ఆమె ప్రసాదంగా" అని అందించబోయింది. నేను తీసుకోకుండా వచ్చేశాను". "మంచిపని చేశావు. నిన్న సభలో పలికిన డాంబికాలన్నీ ఏమయ్యాయ్? నిజంగా జయించే వాడిలా రామలింగడిని మరోవూరు పంపించేశావు కూడాను" అన్నాడు రామభద్రుడు. వాళ్ళు తగవులాడు కోసాగారు.

మర్నాడు సాయంత్రం సుభద్రుడు వాళ్ళకలహాలనీ వివరాలనీ రామలింగడిని రహస్యంగా కలుసుకుని చెప్పాడు.

## మందారవల్లి కథ

"కవీంద్రా! ఇవేళ రెండుగంటలకి చిత్రశాలలో సభ జరిగింది. రాయలవారు చాలా ఉత్సాహంగా దిగ్గజాలను ఏనుగుమీది ఊరేగిస్తూ సభకు వెళ్ళారు. ఆ సభావిశేషాలను చూడడంకోసం ఎక్కడెక్కడి నుంచో కూడా వచ్చారు. సభా ప్రాంగణం చక్కగా అలంకరించబడింది. నిశ్శబ్దంగా ఉంచడంకోసం రాజభటులు నియోగించబడ్డారు.

మందారవల్లి పల్లకీ మీద వచ్చింది. ఆమె చుట్టూ శిష్యురాళ్ళు జయజయ నినాదాలు చేస్తుంటే ఆమె అపర సరస్వతీదేవిలాగే వచ్చింది. ఆమెను చూడడంతోటే మన పండితుల గుండెలు ఝల్లుమన్నాయి. ఆమె రాకతో అందరి దృష్టీ అటు తిరిగింది. ఆమె తనకోసం ఏర్పాటు చేయబడిన తెర వెనుకకు వెళ్ళిపోయింది. ఆ తెరలో గంట మ్రోగేసరికి ఆమె శిష్యురాళ్ళు తమ ఉపాధ్యాయిని మందారవల్లి విద్యావిజయాలను తెలిపేగీతాలూ పద్యాలు పాడారు.

"అయ్యా! మేమందరమూ మందావల్లి శిష్యురాళ్ళము. మా కన్ని విద్యల్లోనూ పాండిత్యముంది. ప్రతివాదు లెవరో చెప్పండి. వారు

ముందు మమ్మల్ని జయిస్తే తరువాత మందారవల్లి వారితో వాదిస్తుంది" అని తమ తమ అభిమాన విద్యలను తెలిపారు.

కొంతసేపు సభ నిశ్శబ్దమయింది. పండితులలో ఒక్కరయినా వారు చెప్పిన విద్యలు తెలిసిన వారు లేరు. అప్పుడు వారు – "పాల సముద్రం లోతు, మధించిన వారికి తెలుస్తుంది కాని పాలుతాగే పిల్లికేం తెలుస్తుంది? విద్యా మర్మాలన్నీ తెలిసిన మా ఉపాధ్యాయిని మందారవల్లి ముందు – పొట్టపోసుకోడానికి చదివిన ఈ పండితపుత్రు లొక లెక్కా? వాదనకు ఎవరిని నియోగించారు? వారి కే విద్య వచ్చును? మాలో ఎవరితోనైనా సరే ప్రసంగించండి. లేదా జయపత్రిక నిప్పించండి. వృధాగా కాలం గడుపుతారే?" అన్నారు.

రాయలుకి సిగ్గూ కోపమూ కూడా వచ్చాయి. తన కవులను – "మందారవల్లి శిష్యురాళ్ళు విసిరిన సవాలు వినపడిందా?" అని పేరు పేరునా అడిగాడు.

వారు – "భట్టుమూర్తి ప్రసంగించడానికి సిద్ధంగా ఉన్నాడు" అన్నారు. అతన్ని ముందుకు తోశారు. అతనేదో చదవబోయాడు కానీ గొంతు పెగల లేదు. శరీరం చెమటలు కమ్మింది. మనిషి – వణికిపోసాగాడు.

వాళ్ళతన్ని చూసి నవ్వుతూ – "మీరు ప్రతివాదులుగా వచ్చారా? ఏశాస్త్రంలో పరిశ్రమ చేశారు? రాయలవారి పండితుల్లో ప్రధానులు మీరేనా?" అని ఆ స్త్రీ లడిగే సరి కతను తడబడి ఒక మాటకి మరోమాట చెప్పాడు. సభలోని వారు గొల్లున నవ్వారు.

ఆ స్త్రీలు రాయల ఆస్థానంలోని పండితులని హేళన చేయగా రాయలు ఏం చేయాలో తోచక ప్రధాని వేపు చూశాడు. అతడు నిలబడి "విద్యావతులారా! మా దివాణంలో చాలామంది పండితులున్నారు. కొందరు ఊరెళ్ళారు. వాళ్ళొచ్చేవరకూ ఊరుకోవడం ఎందుకని ఈ చిన్నసభ చేయించాం. అందుచేత – గెలిచామని పొంగిపోకండి. మళ్ళీ

సభ చేసెదెప్పుడో ముందుగా తెలియజేస్తాం. ఇప్పటికి మీరు మీ నివాసాలకు వెళ్ళండి" అన్నాడు.

ఎవరిమట్టుకు వారు వెళ్ళిపోయారు.

ఆసంగతి సుభద్రుడు రామలింగడికి చెప్పాడు. అదివిని - "ఇప్పుడు మన దివాణానికి చెడ్డపేరు వచ్చింది. మందారవల్లి సామాన్యురాలు కాదు. దానిని నేను కపటోపాయంతో జయిస్తాను. ప్రధానమంత్రి చాలా బుద్ధిమంతుడు. నాజాడ అతనికి చెప్పు. వాళ్ళేం ఆలోచిస్తున్నారో తెలుసుకుని నాకు చెప్పు" అని - ఆరాత్రి ఇష్టదేవతా ప్రార్థన చేసుకుని నిద్రపోయాడు. కలలో, ముందేంచేయాలో కనిపించింది.

మర్నాడు సుభద్రుడు వచ్చి రామలింగనితో మాట్లాడుతుండగా రాజకింకరుడు వచ్చి "రాయలవారి భార్య రామలింగకవి భార్యతో మాట్లాడ్డానికి వచ్చిం"దని -తలుపు తెరచిన సుభద్రుడికి చెప్పాడు.

ఏం చెయ్యాలో భార్యకి చెప్పి - తాను చాటుగా ఉండి పోయాడు. ఆమె రాజపత్నికి తగు మర్యాదలన్నీ చేసింది. రాజపత్ని కొంచెంసేపు లోకాభిరామాయణం మాట్లాడి - వచ్చిన ఆపదను వివరించి - రాయల వారి శాసనాన్ని మనసులో పెట్టుకోకుండా - చెడ్డపేరు రాకుండా చేయమని ప్రార్థించినట్లు ఆమె భర్తకు తెలియజేయమంది.

"దీనికి నన్నింతగా కోరాలా! మీ అవమానము మా అవమానం కాదూ? ఆయన ఊరెళ్ళారే! మందారవల్లిని జయించాడానికి వారే ఉండాలా? ఈమాత్రపుపని ఆయన కూతురే చేయగలదు" అని చెప్పి...నమ్మించి రాజపత్నిని వారింటికి పంపింది.

ఆ సాయంత్రం ఊరి విశేషాలు తెలుసుకువచ్చి సుభద్రుడు - "నేను పూజారి భార్య వేషం వేసుకుని ప్రసాదంగా పువ్వులూ పళ్ళు పట్టుకుని మందారవల్లి కివ్వాలని వెళ్ళాను. నన్నెవరూ ఎక్కువగా అడ్డగించలేదు. అక్కడ మందారవల్లి, శిష్యురాళ్ళు మాట్లాడుకుంటున్నారు.

మందారవల్లి : అష్టదిగ్గజాలంటే ఏమో అనుకున్నాను. మీతోనే మాట్లాడలేకపోయారా! అన్నట్లు రామలింగ దున్నాడా?

ప్రియంవద : ఏమో తెలియదు. మాతో ప్రసంగించిన భట్టుమూర్తికి సభాకంపం కాబోలు మమ్మల్ని చూసి బెదిరిపోయాడు. ఆ రామలింగడు మాత్రం అంతకంటె ఎక్కువా?

మందారవల్లి : అత నసాధ్యుడు . సభలో అతను లేడనుకుంటాను.

హేమలత: రేపటి సభలో అతనినే ప్రతివాదిగా ఉంచుతారని ఊళ్ళో అనుకుంటున్నారు.

మందారవల్లి : కాదులే. లవిత్ర అనే కాంత వచ్చి వాదిస్తుందని పత్రిక వచ్చింది. దీని అర్థం మీకు తెలుసా?

ప్రియంవద : మందారవల్లి అంటే తీగ. లవిత్ర అంటే కొడవలి. కొడవలితో తీగెను పరాభవించ వచ్చునని వారి ఉద్దేశం. కాని ఈ తీగె ఉక్కుది. దీన్ని నరకబోతే కొడవలే విరిగిపోతుంది.

నేను వాళ్ళ మాటలు వింటున్నాను. అంతలో ఎవరో రావడంతో ఇంక నిలబడడానికి అవకాశంలేక నేను ప్రసాదం మందారవల్లి కిచ్చాను. దీవించాను.

ఆమె నాకు గద్దె వేయించి కూర్చోమని నా వృత్తాంతం అడిగింది.

"నేను సావిత్రీ దేవి దేవాలయపు అర్చకుని అమ్మాయిని. మీ పాండిత్యం, సౌందర్యం దాతృత్వాల గురించి వూళ్ళో గొప్పగా చెప్పుకుంటూంటే మిమ్మల్ని చూడాలనిపించి వచ్చాను మా సావిత్రీదేవి చాలా గొప్పది. ఆమె దయవల్లనే రామలింగకవి అంతవాడయ్యాడు. ఆప్రసాదం తీసుకున్న నీకు జయమగుగాక అని దీవించాను.

ఆమె చాలా సంతోషించి – నాకు పారితోషిక మిప్పించి – మీ విద్యాబలప్రభావాల గురించి తరచి తరచి అడిగింది ఆమె భయపడేలా నీ వృత్తాంతం చెప్పాను తరవాత ఆమె లవిత్ర గురించి అడిగింది "నీ

శిష్యురాలే" అన్నాను ఆమె నిన్ను తలుచుకుని బయపడుతూంది. ముందేం చెయ్యాలో ఆలోచించుకో' అన్నాడు. రామలింగడు అతను చెప్పిన విశేషాలకు సంతోషించి - చాలా మెచ్చుకున్నాడు.

రాజు చెప్పగా - మంత్రి పాఠశాలకు పోయి దానిలో చదువుతున్న వందమంది బ్రాహ్మణ కుమారుల నేరి - పండితుల్లా అలంకరించి రామలింగడి ఇంటికి పంపాడు. అతను వారికి చెప్పవలసిన వన్నీ చెప్పాడు చూసి రమ్మంటే కాల్చివచ్చే చురుకుదనం వల్ల ఆ వటువులు శూరుల్లా పొంగిపోయారు

రామలింగకవి ఒక ఉత్తరం రాయించాడు. "విదుషీ! నువ్వు విద్యలలో గొప్పదాని వయినా కులం రీత్యా సామాన్యురాలి వవడం వలన బ్రాహ్మణోత్తములు, రాజులు - కల సభాస్థలికి పల్లకీ ఎక్కి రావడం అనర్హమయిన పని అని నీకు తెలిసే ఉంటుంది. తెలిసికూడా తప్పు చేసిన వారికి నిష్కృతి లేదంటారు. అది అలా ఉండనీ.

ఇంతకు మునుపు చేసిన దాన్ని మొదటితప్పుగా ఎంచి క్షమించడ మయింది" అని రాయించిన ఉత్తరంమీద రాజముద్ర వేయించి దాని ఆజ్ఞాపత్రికగా పంపాడు

దానిని చదువుకున్న మందారవల్లి నిట్టూర్పు వదిలి - స్నేహితురాలితో "చూశావా! నేను సభకి పోవడం తప్పట. కులానికి సామాన్యురాలినట. మనని విద్యలలో కాక కపటోపాయంతో జయించా లనుకుంటున్నారు. వారి దేశంకదా! సర్లే. జయపత్రిక తీసుకోనీ. వీటన్నికీ సమాధానం చెబుదాం" అంది.

సభ కూడకముందే పల్లకీలో రావడానికి అనుమతించమని వినయంగా ఉత్తరం రాసి పంపింది

అందరికంటే ముందు సభకి రావడమే అపజయ సూచకమని కొందరు భావించారు. రామలింగకవి పల్లకీ మీద వైభవంగా వచ్చి తన కోసం అమర్చి ఉన్న తెరవెనక ప్రవేశించాడు. సభ నిశ్శబ్దంగా ఉంది

ప్రధానమంత్రిలేచి – వాదనలో వాదిప్రతివాదు లనుసరించవలసిన నీతి నియమాలు చెప్పాడు. నిబంధనలు చెప్పాక . మందారవల్లి శిష్యరాళ్ళు మెరపుతీగెల్లా వచ్చి చక్కనిపాటలు, నృత్యంతో సభ్యులకు ఆశ్చర్యానందాలు కలిగించారు. అప్పుడు రామలింగకవి శిష్యులలో మొదటివాడు లేచి – "దేవా! ఇది రంగస్థలికాదు పండిత సభ అయినా వీరు జాతిలక్షణం కొద్దీ అభినయం చూపారు. మేము వచ్చింది వీరితో పాండిత్య విషయమై వాదించడానికి తప్ప ఆటపాటలు చూడ్డానికి కాదు. శృంగారలీలలతో సభ్యులను మోహింపజేసి జయపత్రికల నందుకోవడం వీరి కలవాటు కాబోలు. లేకపోతే ఈ సంగీతమెందుకు?" అన్నాడు ఆక్షేపిస్తూ.

సభాసదుల కది సమంజసమే అనిపించింది.

అప్పుడు మందారవల్లి శిష్యరాలు ముందుకువచ్చి – "ఈ వటూత్తముని మాటలు చాలా వింతగా ఉన్నాయి. ఔను మధురమైన చిలక పలుకులు మార్జాలాని కిం పవవు. సంగీతశాస్త్రం కళలలోనిది కాదు కాబోలు – " అంది.

"బ్రహ్మచారికి ఏం తెలుస్తుందిలే" అంది మరొకతె. అలాగ అముగ్గురూ వందశ్లోకాలు చదివా రతనిమీద.

మిగిలిన స్త్రీలు ఏమంటే ఏంతవ్పో అని అణకువగా మాట్లాడసాగారు రామలింగకవి శిష్యులు – వారికి తెలియని లిపి – బ్రహ్మలిపి అని పుస్తకాలు చూపీ, రతిరహస్యాలడిగీ మందారవల్లి శిష్యరాళ్ళని నోరు మూయించారు అప్పటి కా సభ ముగిసింది.

ఆ సాయంత్రం కూడా సుభద్రుడు ప్రసాదమిచ్చే మిషతో మందారవల్లి నివాసానికి వెళ్ళి చాటుగా వారిమాటలు వినసాగాడు.

**మందారవల్లి** : కాంతలారా. నిన్నటి సభలో మీరంత పిరికితనంగా ప్రవర్తించారేం? యుక్తి యుక్తంగా ఒక్క మాటా చెప్పలేకపోయారేం?

**శిష్యురాళ్ళు** · ఆ బ్రహ్మచారులు ఎదకొచ్చిన గిత్తల్లా విజృంభిస్తూ మమ్మల్నొక్కమాటైనా మాట్లాడనిచ్చారు కాదు కదా. మేమేం చెప్పినా కాదని ఏదో పుస్తకం చూపించడం దానిలోనిది బ్రహ్మలిపి అవడం. ఆ

లిపి మేమెన్నడూ ఎరగనిది. విద్యలచేతకాక మాటలలో ఓడిపోయాం. ఆ లోటు మీరు రేపు తీరుస్తారని ఆశతో ఉన్నాం.

మందారవల్లి : అయ్యో! ఒట్టిమాటలకే ఓడిపోయారా! ఇదంతా రామలింగడి కల్పన కాని మరొకటి కాదు. పులి ఉన్నపొదకు రావడం మనదే తప్పు. నామన సెందుకో అపజయాన్ని సూచిస్తూంది. అతను లవిత్ర అనిపేరు పెట్టుకుని స్త్రీవేషంలో ఎందు కొచ్చాడో? లోకమంతా జయించి చివరకి వీళ్ళచేత ఓడించబడవలసి వస్తూంది. రామలింగడి గురించి తెలిసికూడా రావడం – కాలగతి.

శిష్యురాళ్ళు : అమ్మా! నువ్వోడిస్తావని కొండంత ఆశతో ఉన్నాం. రామలింగకవి పేరే లేదుకదా? నీవిద్యామహిమ మరచి అతని గురించి భయపడతావేం?

మందారవల్లి : మీకు తెలియదు. జరగబోయేది నాకు తెలుస్తుంది సరే

వాళ్ళు అలా మాట్లాడుకుంటూంటే సుభద్రుడు ప్రసాదం పట్టుకువెళ్ళాడు. ఆమె ముఖంలో కళలేదు. ప్రసాదం తీసుకొమ్మని ఒకామెకు చెప్పి అతన్నింటికి వెళ్ళమన్నట్లు సూచించింది. అతను వచ్చి తెనాలి రామలింగని కంతా చెప్పాడు.

మర్నాడు సభలో మందారవల్లి శిష్యురాళ్ళు పాటలు పాడగా లవిత్ర శిష్యులు తాము కల్పించిన సామగానం పాడి సభ్యులని నవ్వించారు.

ప్రధాని ఇరు పక్షాలవారినీ మందలించాడు.

తరవాత మందారవల్లి మాటలు వినపడనట్లు నటించసాగింది లవిత్ర. పత్రికా వాదం (రాతలో) చూద్దామా అని ఆమె అడిగితే – "ఆ పనికైతే ఇంత దూరం రావడందేనికి? ఇంటిదగ్గరుండీ చేయవచ్చు" అంది. తరువాత "నాకెంత చెవుడైనా ఎదుటివారి పెదవుల కదలికను బట్టి మాటలు గ్రహించగలను. తెరచాటు వాదాలకి నేనంగీకరించను" అంది.

""బహిరంగంగా కనపడడానికి నేనొప్పుకోనని చాలాసార్లు చెప్పాను" అంది మందారవల్లి.

"ఐతే ఓడిపోయినట్లొప్పేసుకో" అంది లవిత్ర.

అప్పుడు న్యాయం చెప్పమని మందారవల్లి సభని కోరింది. వారు కొంతసేపు తమలో తర్కించుకుని - "లవిత్ర నీకన్న ఎక్కువ చదువుకున్న దాని నంటూంది. వాదించడానికి సిద్ధంగా ఉంది. చెవుడువల్ల తెరలోంచి మాట్లాడలే నంటూంది. స్త్రీలకు స్త్రీలముందు రాణివాసం అక్కర్లేదు. నువ్వు ఇతర స్త్రీలను చూస్తున్నావు కదా. కనుక ముఖాముఖీవాదం చేయడమే మాకు ఉచితమనిపిస్తూంది." అన్నారు. తమమాటను సమర్ధించే - కాళిదాసు శ్లోకం ఒకటి చదివారు. కాని - మందారవల్లి అందు కొప్పుకోలేదు.

అప్పుడు ప్రధానమంత్రి లేచి - "నువ్వు కోరిన న్యాయవాదులేం చెప్పారో విన్నావు కదా. పదినిముషాలలో ప్రసంగం ప్రారంభింపకపోతే నువ్వోడిపోయినట్లే. తరవాత పత్రికలో రాసినట్లు జరపబడుతుంది" అన్నాడు.

మందారవల్లి తల్లడిల్లిపోతూ -"రాజా! ధర్మపాలన చేసే మీరే అన్యాయానికి పూనుకుంటే ఇక రక్షించేవారెవరు? నాకు ప్రతివాదులుగా ఉన్న మీరే తీర్పివ్వడం సమంజసమా? మన తగవు మరొక రాజుదగ్గరకి పంపండి. ఆయన చెప్పినట్లు వినడం కర్తవ్యం. అలాకాక బలవంతంగా అపజయం నా నెత్తిమీద రుద్దితే నేనేం చెయ్యగలను?" అంది

రాజు - 'నీమాటకు మే మంగీకరిస్తున్నాం. ఈ విషయమంతా రాతమూలకంగా మన చక్రవర్తిగా రయిన పాదుషాకి పంపుతాం.నువ్వు ఢిల్లీకిపోయి వాదించుకో, మేమూ తగిన వారిని పంపుతాం. ఇది తేలేవరకూ నీ ఆస్తంతా మా స్వాదీనంలో ఉంచుతాం. జయాపజయాలు తేలేక తగిన విధంగా జరపబడుతుంది" అని అప్పుడే అలాటి ఆజ్ఞాపత్రిక రాయించి ఇచ్చాడు.

సభ్యులందరూ పెద్ద ఎత్తున లవిత్రను ప్రశంసించారు, ఆమె పల్లకీ ఎక్కి శిష్యవర్గంతో వెళ్ళిపోయింది. రాయలవారు రామలింగకవి ఉన్నచోటు తెలుసుకుని వెళ్ళి పండిత బృందంతో అతని పాదాలమీద

ఉండిపోయాడు. "నువ్వుతప్ప పరమేశ్వరుడేనా మందారవల్లిని ఓడించలేడు. దేవీకటాక్షమున్న నీకు అసాధ్యమేముంది" అని రాయలు ప్రశంసించగా-" మాతప్పులని మన్నించు" అని పండితులు వేడుకున్నారు.

నీ ఆజ్ఞమేరకు మందారవల్లి ఢిల్లీ వెళ్ళడానికి అనుమతించాను. ఆమె విద్యావతి కనక అక్కడి వారిని వశపరచుకుని తీర్పు తన పక్షాన చెప్పించుకోగలదు కనక తగిన పరివారంతో నువ్వక్కడికి వెళ్ళి మిగిలిన పని కూడా పూర్తి చేసుకురా" అన్నాడు రాయలు.

రామలింగడిచేత అవమానించబడిన మందారవల్లి చాలా విచారంతో - ఎవరికీ తెలియకుండా తన నివాసానికి వెళ్ళిపోయింది. ఆరాత్రి ఆమెకూ శిష్యవర్గానికీ ఈ దిగువ సంభాషణ జరిగింది.

**హేమలత** : ఏమమ్మా! అసలు ప్రసంగించకుండానే ఓడిపోయిన ట్లొప్పుకున్నావు. లవిత్ర అంత ప్రజ్ఞావంతురాలా? నువ్వేదో ఆమెని ఓడిస్తావని మేము గంపెడాశ పెట్టుకున్నాం. ఏమీ లేకపోయింది. ఏ సభలోనూ నువ్విలా పిరికిదానిలా ప్రవర్తించలేదు. గ్రహచారం కాబోలు.

**మందారవల్లి** : (నిట్టూర్పు వదులుతూ) ఏంచెప్పేది? గ్రహచారం బాగులేక మన మీ వూరు వచ్చాం. లవిత్ర అనేదొకతె ఉందనుకుంటున్నా వేమిటి? రామలింగడే ఆ వేషం వేసుకుని వచ్చాడు. కంఠస్వరం తెలియలేదూ?

**మంజువాణి** : ఐతే? స్త్రీ పురుష వివక్షతో మనకి పనేముంది? కావలసినది విద్యాప్రసక్తి కదా? ప్రసంగం ప్రారంభింపనే లేదు. ఇదే మాకు సందేహంగా ఉంది.

**మందారవల్లి** : దేవ రహస్యం ఒక టుంది. అది మీకు తెలియక ఇలా అంటున్నారు.

**మంజువాణి** : ఏమిటా దేవరహస్యం?

**మందారవల్లి** : ఎదుట నిలబడి నే నెవరి కోనూ ప్రసంగించ లేను. మాట్లాడబోతే ఏమాటా తోచదు

*మంజువాణి* : ఎందుకనీ?

*మందారవల్లి* : పూర్వం నేనొక పొరపాటు చేశాను. అందుకని సిద్ధుడు నన్ను శపించాడు. రామలింగ డారహస్య మెలాగో కనిపెట్టాడు. అందుకే ఆడవేషంలో వచ్చాడు. ఆడవాళ్ళ ముందు రాణివాసం అంటే కుదరదు కదా? యుక్తులలో అతను మనందరికంటే పదాకులు ఎక్కువ చదివినవాడు.

**హేమలత** : ఓహో! ఇదా! ఇది మాకు తెలియదు. ఇందుకన్న మాట నువ్వతనంటే బెదిరేది. ఇప్పుడు మనమేం చెయ్యాలి?

*మందారవల్లి* : ఢిల్లీ వెళ్ళి చూడదగిన వారిని చూసి మనవాదం గెలిచేటట్లు చూడాలి.

*ప్రియంవద* : అదెంతపని? మనని చూడడంతోటే ఆ యవన ప్రభువు మన పక్షాన తీర్పు చెప్పక పోతాడా? ఇవాళే ప్రయాణం కడదామా?

*మందారవల్లి* : నువ్వు రాజశాసనం చూడలేదు కాబోలు.

**హేమలత** : ఏమిటా రాజశాసనం! దానిలోని విశేషలేమిటి?

*మందారవల్లి* : జయాపజయాలు తేలేవరకూ మన ఆస్తి ముద్రవేయిస్తారట. మనం సామాన్య వేషాలతోనే తప్ప వైభవంగా వెళ్ళడానికి వీల్లేదు.

*మంజువాణి* : అయ్యో! అలా ఐతే మన మొహాలెవరు చూస్తారు?

*మందారవల్లి* : మనసమస్య వాళ్ళకేం తెలుస్తుంది? పోడానికి బండి, అన్నవస్త్రాలకు తగిన విత్తం మాత్రమే ఇస్తారట. మరి మీ రంతా వస్తారా?

*మంజువాణి* : రావొచ్చుకానీ... మా తల్లి వృద్ధురాలు. ఇంటిదగ్గర ఒక్కతే ఉంది. ఆవిడ నొకసారి చూసి మిమ్మల్ని ఢిల్లీలో కలుసుకుంటాను.

*మందారవల్లి* : హేమలతా! నువ్వో?

**హేమలత** : మంజువాణితో ఇంటికి పోయి మా వారిని చూసి వస్తాను.

*మందారవల్లి* : భ్రమరవాణి ఏమంటుంది?

*భ్రమరవాణి* : అమ్మా! నేను కిందటి మజిలీలోనే శల వడిగాను. జ్ఞాపకంలేదా?

*మందారవల్లి* : విద్యుత్ప్రభకీ పనుందా?

*విద్యుత్ప్రభ* : నాకిప్పుడే ఒక వర్తమానం వచ్చింది. ఒక రాజకుమారుడు నాకు కన్నెరికం చేస్తాడట. వెళ్ళకేం చెయ్యగలను?

*మందారవల్లి* : వసంతసేనా! నువ్వేం చెబుతావు?

*వసంతసేన* : కుంతలేశ్వరుడి కుమారుని వశంలో ఉన్నదాన్ని. నీకు తెలుసుకదా. సంగీతం నేర్చుకుని రమ్మని నీ శిష్యరికానికి పంపారు. నీ దయవల్ల అది పూర్తయింది. నేనొచ్చింది మొదలు విరహంతో బాధపడుతున్నానని అతను వార్తలు పంపుతూనే ఉన్నాడు. రాయలవారి ఆస్థానకవుల ప్రసంగాలు వినాలని ఆగాను. కాని ఇప్పటికే వెళ్ళిపోవలసింది. ఇంకా వెళ్ళకపోతే మాట దక్కదు. లేకపోతే నీకంటే ముందే ఢిల్లీ ప్రయాణానికి తయారవనూ?

*మందారవల్లి* : నిద్రుమోష్టి కూడా అలాగే చెబుతుందా?

*నిద్రుమోష్టి* : నేనలా అనేదానిగా అనుకున్నావా? (ఆమెచెవిలో) నాకిప్పుడు రోగాల బాధ ఎక్కు వౌతూంది. ప్రయాణ మార్గంలో పథ్యపానాలమరవుకదా. ఇదివరకైతే రాజభోగంగా జరిగింది కనుక ఏ లోపమూ కనిపించలేదు ఇప్పు డింటికిపోక ఏం చేసేది?

*శరచ్చంద్రిక* · అమ్మా! నాసమస్య మరేమీ లేదు మా చెల్లులు తల్లి లేనిది. దాన్ని నేనే పెంచి పెద్ద చేశాను అది గర్భవతయిందని ఉత్తరం వచ్చింది. దానిని చూడాలని నాకు చాలా ఆత్రంగా ఉంది. అది కనగానే రావాలని నా అభిమతం.

*మందారవల్లి* : ప్రియంవ దేదీ?

*ప్రియంవద* : స్నేహితురాలా! నీ హీనస్థితి గురించి విచారిస్తూ ఇక్కడే ఉన్నాను.

మందారవల్లి : వీరి మాటలన్నీ విన్నావు కదా? ఢిల్లీకి నాతో ఎవరూ రారట. తలో కారణం చెబుతున్నారు. వాళ్ళ ననవవలసినపనిలేదు. నువ్వేనా వస్తావా?

ప్రియంవద : నీతోరాక ఎక్కడికి పోతాను? నాకు మరో దిక్కులేదు కదా. నీతో మంచి చెడ్డలు పంచుకుని అనుభవించగల దానినే. వీళ్ళందరినీ పోనీ. మనమిద్దరమే ఢిల్లీవెళ్ళి విజయం సాధించుకొద్దాం.

మణిసిద్ధు దంతవరకూ చెప్పి ఆగాడు.

గోపాలుడు "ఆపేశారేం గురువుగారూ?" అని అడగనే అడిగాడు.

"వేళెంతయిందో చూడు. మనం బయలుదేరవలసిన సమయ మయింది."

"మరి – తక్కిన కథ? " అడిగాడు గోపాలుడు.

"తరువాత మజిలీలో చెప్పుకుందాం" అని అతను గోపాలుడితో కలసి బయలుదేరాడు. మణిసిద్ధుడు ఓంకారం జపించుకుంటూ నడుస్తూంటే – కావడినెత్తుకుని అతని ననుసరిస్తున్న గోపాలుడు – మందారవల్లికి ఢిల్లీలో ఏమౌతుందా అని ఆలోచిస్తున్నాడు.

వాళ్ళు తరువాత మజిలీ చేరుకున్నారు.

# కాశీ మజిలీ కథలు

## 24. వ మజిలీ

రాయలవారు ఆజ్ఞాపించగా రామలింగకవి ఒక శుభ ముహూర్తంలో సుభద్రుడు తోడు రాగా...తగిన పరివారంతో ఢిల్లీ బయలు దేరాడు. కొన్నాళ్ళు ప్రయాణించాక ఒకనాటి సాయంకాలానికి భర్గదుర్గం అనే గ్రామం చేరి - ఒక బ్రాహ్మణుని ఇంట్లో బసచేశాడు.

ఆ రాత్రి ఆ ఇంటికి దగ్గరలోనున్న దేవాలయంలో బ్రాహ్మణులు స్వస్తి చెబుతూంటే - అవేద నాదాన్ని విని అక్కడికి పోయి విశేషాలు చూడసాగాడు. స్వస్తి చెప్పడం అయ్యాక అర్చకు డిచ్చిన ప్రసాదాలు తీసుకుని ఆ బ్రాహ్మణులు దేవాలయ ముఖమంటపంలో కూర్చుని మాట్లాడుకోసాగారు.

*గోవిందశాస్త్రి* : పేరావధాని గారూ! మీరీ మధ్య దేశాటనానికి పోయారు కదా. ఎప్పుడొచ్చారు! వార్షికాలు బాగా ముట్టాయా? విశేషా లేమిటి?

*పేరావధాని* : నేను రాత్రే వచ్చాను. విశేషా లేమున్నాయి? ఈ కాలంలో వేదం చదువుకోకూడదు. తప్పులో తడకలో నాలుగు పద్యా లల్లిన వాడికే గౌరవం. నాకది తెలియదు కదా. నా కెక్కడా వార్షికాలు లేవు. మందారవల్లి అనే మహా విద్వాంసురాలు కాశీలో నాకు నూటపదహారులు వార్షికం వాగ్దానం చేసింది. ఆమెను చూడాలని వెళ్ళాను.

*గోవిందశాస్త్రి* : ఆ పద్దు ముట్టిందా?

*పేరావధాని* : ఎందుకు ముడుతుంది? నాకంటే ముందు నా అభాగ్య దేవత వెళ్ళింది. ఆ మందారవల్లి రాయువారి ఆస్థానకవులతో ప్రసంగించడానికి వెళ్ళిందట. అంచేత వెళ్ళిన వాడిని వెళ్ళినట్లే వచ్చాను.

*గోవిందశాస్త్రి* : మీరు కూడా అక్కడికి వెళ్ళలేక పోయారా?

*పేరావధాని* : నయమే. ఆమే ముష్టెత్తు కోడానికి వెళ్ళిందట.

*గోవిందశాస్త్రి* : ముష్టిలో ముష్టి వీరముష్టి.

*పేరావధాని* : నువ్వువిజయనగరం వెళ్ళావు కదా? అక్కడి వింతలూ విశేషలూ ఏమిటి?

*వెంకటకవి* : మందారవల్లి అట్టహాసంతో విజయనగరం వెళ్ళింది. మొదటసభలో భట్టుమూర్తి మొదలైన పండితు లందరినీ చిత్తు చేసింది. కాని...తరువాత ...రామలింగకవి లవిత్ర అనే పేరుతో వెళ్ళి ఆమెను నోరు మెదపకుండా చేసేశాడు.

*గోవిందశాస్త్రి* : మొదటి సభలో అతను లేడా?

*వెంకటకవి* : లేడట. ఉంటే అలా ఎందుకు జరుగుతుంది? మొదటి విజయంనాడు మందారవల్లి బ్రాహ్మణులకు విరివిగా దానాలు చేసింది. అందులో నాకూ కొంత ముట్టింది.

*గోవిందశాస్త్రి* : తరవాతే మైంది?

*వెంకటకవి* : రాయలవారు ఆమె ఆస్తి పాస్తులన్నీ లాక్కున్నా రట. ఆమె తగవు తీర్చడం కోసం ఢిల్లీ చక్రవర్తివద్దకు పోయిందట.

*పేరావధాని* : అయ్యో! ఎంత మాట విన్నాం. ఆ పుణ్యాత్మురాలి కలాటి కష్టం రావలసింది కాదు. ప్రతిరోజూ బ్రాహ్మణులకి అనేక దానాలు చేసేది.

*గోవిందశాస్త్రి* : రామలింగకవి చర్యలు అద్భుతాలే. మనం వింటూనే ఉన్నాం కదా. అతను మన దుష్టవర్మకి పురాణం చెప్పగలడేమో.

*వెంకటకవి* : మామూలు పురాణం కాదు. విపరీత పురాణం చెప్పి బుద్ధి తెప్పించగలడు. క్రూరబుద్ధి కలవారని తెలిస్తే వాళ్ళని పరాభవించడమే అతని వ్రతం.

*గోవిందశాస్త్రి* : ఒకసా రతనివద్దకు పోయి రమ్మని ప్రార్థించినా బాగుండేది. దుర్మార్గుడు కొత్త అర్థాలు చెప్పమని వేధించుకు తింటున్నాడు.

రామాయణంలో భారతార్థం చెప్పాలట. భారతంలో రామాయణార్థం చెప్పాలట!

**వెంకట కవి** : రామలింగకవి కొత్త అర్థాలు బాగా చెప్పగలడు. మనవాళ్ళు డబ్బు కోసం, అతను పీఠం మీద కూర్చుంటే తాము కింద కూర్చుని పురాణం చెబుతున్నారు. ఇంతకంటె అధమం ఏముంటుంది?

***గోవిందశాస్త్రి*** : ఏంచేస్తాం? వెళ్ళకపోతే పూర్వులు మనకిచ్చిన మాన్యాలు లాక్కుంటాడు. అందుచేత నువ్వు చెప్పినదే శాస్త్రమంటూ స్తోత్రం చేసి ఎలాగో కాలక్షేపం చేస్తూ వస్తున్నాం. ఎవడి పాపం వాడిది.

వాళ్ళు మాట్లాడుకుని ఇళ్ళకి వెళ్ళి పోయారు. వారి మాటలను రామలింగడు సుభద్రుడికి చెప్పి ఆ ఇంటి బ్రాహ్మణుడిని దుష్టవర్మ గురించి అడిగారు. అతను మెల్లగా చెప్పసాగాడు.

# దుష్టవర్మకథ

దుష్టవర్మకి రెండు మూడు గ్రామాలున్నాయి. అతని పూర్వులు మంచి పేరు ప్రఖ్యాతులు కలవారు. ఎందరో బ్రాహ్మణులకు భూదానాలు చేశారు. ఈ గ్రామంలో ఉన్న బ్రాహ్మణు లందరికీ ఆ భూములే ఆధారం. ఆ అధికారంతో దుష్టవర్మ ఇక్కడున్న బ్రాహ్మణు లందర్నీ నిత్యం పురాణం చెప్పడానికి రమ్మని ఆజ్ఞాపిస్తాడు. అలా రాని బ్రాహ్మణు డెవరేనా ఉంటే అతని భూమికి ఆటంకాలు పెడతాడు.

పురాణం చెబుతున్నప్పుడు వాటిలో ఉండే అర్థాలు కాక కొత్త అర్థాలు చెప్పమని వేధిస్తారు. ఏదో ఒకటి చెప్పబోతే సందేహాలు లేవనెత్తుతాడు. చెప్పకపోతే బుద్ధిహీనులని నిందిస్తాడు.

"ఏమేనా యివ్వండి" అని యాచిస్తే "పూర్వులిచ్చిన మాన్యాలే చాలు" అంటాడు. ఇలాగ ఈవూరి బ్రాహ్మణు లందరూ నానా ఇబ్బందులూ పడుతున్నారు. మరో చోటికి పోయి యాచించుకుందుకు కూడా అవకాశాలు తక్కువే."

ఆ మాటలు విని రామలింగకవి సుభద్రుడితో మంతనాలు జరిపాడు. ప్రయాణం వాయిదా వేసుకుని – మర్నాడు పురాణం చెప్పేవేళకి దుష్టవర్మ ఇంటి కెళ్ళాడు. అప్పుడు దుష్టవర్మ ఎత్తైన ఆసనంమీద కూర్చుని – చుట్టూ చాపలమీద కూర్చుని పురాణం చెబుతున్న బ్రాహ్మణులపై ప్రశ్నలు సంధిస్తున్నాడు.

అవి విని రామలింగకవి వారికి దగ్గరగా వెళ్ళి అందరూ వినేలా ఏదో చెప్పబోతూంటే – దుష్టవర్మ "మీ రెవరు? మీదే ఊరు?" అని అడిగాడు.

రామలింగకవి : మేము బ్రాహ్మణులం అద్భుత పౌరాణికులం మాకాపురం కాశీపురం.

దుష్టవర్మ : అబ్బో! నా ఎదుటనే పౌరాణికుల మని చెప్పుకుంటున్నారే! మా సంగతి తెలియనట్లుంది. ఈ బ్రాహ్మణుల నడిగి తెలుసుకొండి.

రామలింగకవి : మీ సంగతి వినే వచ్చాం. ఈ బ్రాహ్మణులే చెప్పారు. మిమ్మల్ని చూశాక – మేము మీ గురించి విన్నది నిజమే అనిపించింది. మా పురాణ విశేషాలు వింటే మీరు అలా అనరు.

దుష్టవర్మ : అలాగా! నాపేరెక్కడ విన్నారు! కాశీపట్నంవరకూ వ్యాపించిందా!

రామలింగకవి : ఇక్కడకూర్చున్న మీకేమీ తెలియడం లేదు. కాశీలో ఎక్కడవిన్నా మీ పేరే చెప్పుకుంటున్నారు. అంతేకాదు. ధర్మలోకంలో మీకోసం కొత్త గృహాలు నిర్మించుచున్నట్లు వార్తలొచ్చాయి.

దుష్టవర్మ : మీ రిక్కడికి ఎందుకొచ్చారు?

రామలింగకవి : మా పురాణ విశేషాలు మీకు చూపించడానికీ, ప్రత్యేకంగా మిమ్మల్ని చూడ్డానికీ.

దుష్టవర్మ : మీ పురాణ విశేషా లెలాటివి?

రామలింగకవి : మేము పురాణాలని నూట పది విధాలుగా

చెప్పగలం. ఎప్పుడో జరిగిన విషయాన్ని ఇప్పుడే ఇక్కడే జరుగుతున్నట్లు చూపుతాం. అంతేకాక రామాయణంలో భారతార్థమూ, భారతంలో రామాయణర్థమూ రామాయణంలో భాగవతార్థమూ.. మూడింటిలోనూ విపరీతార్థాలూ విస్పష్టంగా చెప్పగలం. వెయ్యిమాట లెందుకు? మాప్రజ్ఞ చూస్తే మీకే అర్థమౌతుంది.

**దుష్టవర్మ** : అందుకు మీరేం పారితోషికం కోరతారు?

**రామలింగకవి** : మీరు సంతోషించి, తగినవారమని ఒప్పుకుంటే .అదే మాకు పారితోషికం. మరేదీ అక్కర్లేదు.

**దుష్టవర్మ** : మరి మీ వింతల నెప్పుడు చూపుతారు?

**రామలింగకవి** : ఎప్పుడో ఎందుకు? ఈ రాత్రే!

**దుష్టవర్మ** : కావలసిన సామ గ్రేమిటి? ఏయే పురాణాలు తెప్పించాలి?

**రామలింగకవి** : ఏమీ అక్కర్లేదు. పురాణాలన్నీ మామొహంలోనే ఉన్నాయి.సభాభవనాన్ని చక్కగా అలంకరించండి. దూది కొంత తెప్పించి ఉంచండి. అంతకంటె ఏమీ అక్కర్లేదు."

రామలింగకవి తన నివాసానికి వెళ్ళిపోయాడు. అతని మాటలకు ఆ బ్రాహ్మణులు ఆశ్చర్యపోయారు. తమపురాణం ముగించి – రామలింగకవి వద్దకుపోయి విశేషా లడగసాగారు.

అతను వాళ్ళందరినీ తను చెప్పినట్లు వినేలా చేసుకుని ఏం చేయాలో బోధించి – ఆ రాత్రి ఆగ్రామంలో ఉన్న బ్రాహ్మణు లందరూ చుట్టూ ఉండగా వైభవంగా సభాభవనానికి వెళ్ళాడు పౌరులు కూడా వచ్చారు.

రామలింగకవిని చూసి దుష్టవర్మ కొంచెం జంకాడు. సభాభవనంలో ఉన్న ఆసనాలమీద అందరినీ కూర్చోమని, సుభద్రుడూ రామలింగడూ ప్రధానమైన ఆసనాలమీద కూర్చున్నారు.

ఈ అద్భుత పురాణం వినడానికి దుష్టవర్మ ఆత్రత పడుతూంటే సుభద్రుడు పురాణం చదవసాగాడు. రామలింగడు అర్థం చెప్పసాగాడు.

రామలింగకవి : ద్రోణాచార్యుడూ, కృతవర్మ మొదలైన వీరులు సాయం చేస్తుండగా అర్జునుడు చాలాకోపంగా రావణాసురుణ్నీ అతని పక్కనున్న భీముణ్ని, కర్ణుడినీ చావగొట్టాడు. అప్పుడు రావణాసురుడు పాండవులను సహాయానికి పిలవగా శ్రీరాముడు కర్ణుడిని కోరగా కర్ణుడే రావణుణ్ణి కొట్టాడు. ఇది రామాయణంలో భారతార్థం.

దుష్టవర్మ : ఇదేం పురాణం? ఇదేం అర్థం? రావణాసురు డెప్పటివాడు, పాండవు లెప్పటివారు?

రామలింగకవి : అయ్యా! తమరు మా పురాణ మంతా అయ్యేవరకూ అడగకూడదు. మధ్యమధ్య ప్రశ్నలు వేయకూడదు.

దుష్టవర్మ : సరే సరే.

సుభద్రుడు : మరి (పద్యం చదివాడు)

రామలింగకవి : ఆ సమయంలో బృహస్పతిగారు శుక్రాచార్యుల వారితో వచ్చి -

రావణాసురునికి నీతి చెప్పగా అతను వినలేదు. బృహస్పతి తన రథంమీద కూర్చుని

ధ్యానించుచుండగా ఆంజనేయుడు తనకు సాయం చేసినందుకు బదులు తీర్చుకొనుటకై

దృష్టద్యుమ్నుడు వచ్చి కత్తిదూసి అతని వెంట్రుకలు కోశాడు.

దుష్టవర్మ : (పకపకనవ్వుతూ) బాగుంది. బలేబాగుంది.

రామలింగకవి : అప్పుడేవిమైంది? ముందుంది బోలెడు.

దుష్టవర్మ : ఇది ఇంతటితో చాలునుకానీ ప్రత్యక్షపురాణ మన్నారే. అదేమిటో,

ఎలా ఉంటుందో చెప్పండి. సభ చాలిద్దాం.

రామలింగకవి :చిత్తం, అలాగే! కర్ణుడు రావణునిలా ఎదుర్కున్నాడు - అని

(పద్య పాదం చదువుతూ చాలాకోపంగా నటిస్తూ లేచి సింహాసనంలో కూర్చున్న దుష్టవర్మని క్రిందపడేసి)

– "దుష్టద్యుమ్నుడు ఇలా తలగొరిగాడు" – అంటూ కత్తితో దుష్టవర్మ జుత్తుకోసి

"సుగ్రీవుడు కంసుణ్ణి ఇలా తన్నా"దంటూ నాలుగు తాపులు తన్ని "హనుమంతుడు సుశర్మ ఇంటి నిలా అంటించా" దంటూ దూదిపోగును అంటించాడు.

దానితో సభా భవనంయావత్తూ అంటుకుని...ఆకాశ మెత్తున మంటలు లేచి రెండు గడియలలో అక్కడ బూడిదే మిగిలింది. పౌరులు హాహాకారాలు చేస్తూ వీధిలో పడ్డారు. దుష్టవర్మ గుండెలు బాదుకుంటూ ఏడవసాగాడు.

రామలింగకవి పద్యాని కర్థం చెప్పసాగాడు. "పూర్వం ఆంజనేయులవారు లంకాపట్నం తగలబెట్టినప్పుడు ఇళ్ళల్లోంచి బయటకు పరుగెత్తి వీధుల్లో పడిన రాక్షసు లిలాగే అమ్మో! బాబా! కొడుకో! అంటూ ఏడిచారు. ఇదే ప్రత్యక్షపురాణం."

ఆ ప్రమాదాన్ని వారించడానికి గ్రామస్తు లందరూ అక్కడికి పరుగెత్తుకొచ్చారు. దుష్టవర్మ రామలింగకవి చేసినపనిని వారితో చెప్పి నిరూపణ చూపించి – అతన్ని పట్టుకొని తనకి సాయం చేయమని కోరాడు.

పౌరులు రామలింగకవిని – "అలాటిపని ఎందుకు చేశావ్?" అంటూ అడిగారు.

అప్పుడతను – "అయ్యా! నే నీపని అతని అనుమతిమీదే చేశాను. యుద్ధపంచకం చదవమనీ, ఎప్పుడో జరిగిన విషయాల నిప్పుడు జరుగుతున్నట్లు చెప్పమనీ, ఒకపురాణం చదువుతూ మరో పురాణార్థం చెప్పమనీ అతని నోటినుండే వచ్చిన మాటలు. కావాలంటే ఈ బ్రాహ్మణులనడగండి" అన్నాడు వినయంగా.

ఆ మాటలువిని దుష్టవర్మ పళ్ళు పటపట కొరుకుతూ – "అద్భుత పురాణమంటే అదేమిటో అనుకున్నాను. ఆంజనేయుడు దక్షిణగోగ్రహణం చేస్తున్న సుశర్మని కర్ణుడు కొట్టాడట! రావణుని దృష్టద్యుమ్నుడు కొట్టాడట! అదలా ఉంచండి నాజుత్తు కోసి, కాలితో

తన్నుతూ భవనం కాల్చేశాడు. దీనిని సమర్థించుకుంటూ అతను చెప్పిన మాటలు ఉచితమేనా?" అని అరిచాడు. అందుకు రామలింగకవి... "నీలాటి వాళ్ళకి ఉచితంగా తోచవులే. బ్రాహ్మణులంతా కింద కూర్చుని పురాణం చెబుతూంటే ఎద్దులా ఎత్తుగద్దె మీద కూర్చుని శంకలు చేయడ మనుకున్నావా? మా పురాణాలు దుష్టవర్మ ఛేదకాలు. నా నేరాన్ని విచారించడాని కిక్కడివారి కధికారం లేదు. కావాలంటే ఢిల్లీ చక్రవర్తి దగ్గరకిరా." అంటూ అధికార పత్రం చూపించాడు.

పౌరు లదిచూసి ఏమీ అనలేకపోయారు - ఢిల్లీలో సాక్ష్యానికి తాముకూడా వస్తామన్నారు బ్రాహ్మణులు. తమ పీడ ఆ వేళతో వదిలిందని వాళ్ళెంతో సంతోషించారు.

## మంగమణికథ

**రా**మలింగకవి సుభద్రుడితో బండెక్కి కబుర్లు చెప్పుకుంటూ ప్రయాణం సాగిస్తూంటే - కొంతదూరం వెళ్ళేసరికి చీకటి పడింది. కాని గ్రామమేదీ కనపడలేదు. చీకటికి భయపడుతూ బండివాడు ఎడ్లని వేగంగా తోలసాగాడు.

దారిలో ఒక చోట అడ్డంగా ఒకబండి ఉండడం చూసి- తనబండిని నిలిపి - "మీరెవరు?" అని అరిచాడు.

"అయ్యా! మేము మార్గస్థులం. ఢిల్లీ పోతున్నాం. మా బండెద్దు దేనినో చూసి బెదిరి పారిపోయింది. దానిని వెదకడానికి బండివాడు పోయాడు. ఇంతవరకూ తిరిగి రాలేదు. బండిలో ఉన్నవాళ్ళం ఆడవాళ్ళమే. మగవాళ్ళు ముందు పోయారు. మా బండివాడు వచ్చే వరకూ ఆగితే మీ కెంతేనా పుణ్యముంటుంది" అని - బండిలోంచి ఒకస్త్రీ కంఠం దీనంగా వినిపించింది.

రామలింగడు సుభద్రుడికి సంజ్ఞచేసి తటాలున బండిదిగి - "అమ్మలారా! భయపడకండి. మేము బ్రాహ్మణులం. విద్వాంసులం.

ఉదరపోషణార్థం దేశాటనం చేస్తున్నాం. ఉపకారంతో అవసరం పడని దెవరికి? మీ బండివాడు వచ్చేవరకు ఉంటాం. మేము వాడికోసం వెదుకుతాం. దొరక్కపోతే మా బండిలో మిమ్మల్ని గ్రామం చేరుస్తాం. మిమ్మల్ని ప్రాణప్రదంగా చూసుకుని మీ మగవారి కప్పగిస్తాం" అని ఎంతో ఆదరంగా మాట్లాడి, బం డాపించాడు.

"అయ్యా! మీరు బ్రాహ్మణులని వినడంతోటే మా చింత వదిలిపోయింది. విద్యావంతులైన మీ సహవాసం మాకు మంగళం చేకూర్చకపోతుందా? మీ కిదే నమస్కారం–" అంది బండిలోంచి ఆకాంత. అతని వాగ్ధోరణి కామె ముందే ముగ్ధురాలయింది.

ఎంతసేపటికీ వాళ్ళ బండివాడు తిరిగి రాలేదు. తమకోసం వాళ్ళు ఆగిపోయారని ఆమె కృతజ్ఞతలు తెలుపుకుంటూంటే రామలింగకవి పరిచయం పెంచుకుని, ఆ బండికి దగ్గరగా వెళ్ళి "మీదేవూరు? మీ పేరేమిటి? ఢిల్లీ ఎందుకు వెళ్తున్నారు? రెండవ యువతి మీకే మౌతుంది?" అంటూ అడిగాడు.

"అయ్యా! మేం వైష్ణవులం మా మగవారు ఢిల్లీ చూడ్డానికి వెళ్ళారు, చక్రవర్తిని చూస్తారు. మేం వారి దగ్గరకి పోతున్నాం. నాపేరు మంగమణి. ఈమె నాపినతల్లి కూతురు, ప్రియంవద. ఈ రాత్రి మీ సహాయం లభించకపోతే మేము భయంతో బిక్కుబిక్కుమంటూ ఈ అడవిలో ఉండవలసివచ్చేది. మాకోసం మీరీరాత్రి అ భోజనం ఉండవలసి వచ్చింది. మీ ఉపకారం ఎప్పటికీ మరిచిపోలేము. మీ స్వగ్రామం ఏది? ఏయే విద్యలు చదివారు?" అందామె.

"నాపేరు రామకవి. నా శిష్యుడి నామధేయం సుభద్రుడు. నా జన్మభూమి ఉత్తర కురుదేశం నాకన్ని విద్యలలోనూ పాండిత్యముంది" అన్నాడు రామలింగకవి.

అలాగ వాళ్ళు మాట్లాడుకుంటూ ఉండగానే తెల్లవారింది. అంతలో బండివాడు పారిపోయిన ఎద్దుని తోలుకువచ్చాడు. బండిలోని మంగమణి, ప్రియంవద ముసుగులు వేసుకుని కూర్చోడం వల్ల వారి

నిజరూపాలు మరుగున పడిపోయాయి. బండివాళ్ళు అతివేగంగా బళ్ళని తోలారు. మధ్యాహ్నానికి వాళ్ళొక అగ్రహారం చేరారు.

మంగమణి ప్రియంవదలు వేరే వండుకోబోతే వారిని వారించి తమతోపాటే భోజనం చేయమని రామలింగకవి మంచిమాటలు చెప్పాడు. అది మొదలువారందరిదీ ఒకే వంట అయింది.

ప్రయాణం చేసేటప్పుడు వారి బండిని ముందుంచి తమబండిని దానివెనుక నడిపించవలసిందిగా బండివాడికి చెప్పాడు. నాలుగురోజు లలాగడిచేసరికి యువతులకి అతనిమీద గౌరవం, ప్రేమ, అభిమానం పెరిగాయి. అతనంత పరోపకార పారీణుడు మరెవరూ ఉండరన్నారు. అతని రుణం ఏమిచ్చినా తీరదన్నారు.

వాళ్ళు ప్రయాణం చేస్తూ ఒకనాటి సాయంకాలానికి విద్యానగరం అనే పట్నం చేరుకున్నారు. ఆ పట్నాన్ని ధర్మకేతుడనే రాజు పరిపాలిస్తున్నాడు.

వాళ్ళొక సత్రంలో బస చేశారు. స్నాన సంధ్యలు చేసి పట్నం తిరిగి వచ్చిన రామలింగకవి భోజన మయ్యాక వారివద్దకు వచ్చి – "ఏడడుగులు కలిస్తేనే స్నేహ మౌతుందన్నారు. పదిరోజులనుంచి మీ సహవాస భాగ్యం మాకు లభిస్తూంది. కనక మమ్మల్ని మంచి మిత్రులుగా భావించవచ్చును. నీ ఆకార గౌరవాలు చూస్తూంటే ఆశ్రిత మందారవల్లి అనిపించక మానదు. నీ పరిచయం లభించినప్పుడే మా కష్టాలు తీరిపోయాయనుకున్నాం.

ధనం సంపాదించడం చాలా కష్టం. నేను చిన్నప్పటి నుంచే దేశాటనం చేస్తున్నాను. కాని ఎక్కడా సరిపడ్డంత డబ్బు కూడలేదు. ఇవాళొక ఆధారం కనిపించింది. దానికి మీ సహాయం కావలసి ఉంది. మీరు కొంచెం సేపు శ్రమపడితే మేము భార్యాపుత్రులతో చిరకాలం సుఖపడతాము. సాహసించి చెప్పడానికి నాకు నోరు పెగలడంలేదు. కాని – ధనచాపల్యం చెప్పమని ప్రేరేపిస్తూంది. ఏం చేసేది? దీనంతటకీ కారణం నీ సౌహార్ద్రమే" అన్నాడు.

మంగమణి అతని మాటలకు చాలా చలించి - "అయ్యా! ప్రయాణంలో మీరు చేసిన ఉపకారం ఎంతో గొప్పది. ఏ బంధువూ, మిత్రుడూ కూడా అంతలా చేయడు. అలాంటి మీకేం చేసినా కృతజ్ఞత చూపడ మౌతుంది కాని ఉపకారం చేయడ మవదు. నన్నింతగా పొగడక్కరలేదు. నేనేం చెయ్యాలో చెప్పండి. వేగంగా చేసి మీ రుణం తీర్చుకుంటాను" అంది.

అప్పుడు రామలింగకవి మెల్లగా .."ఇలాఅనడం నీకే చెల్లుతుంది. నా ఉద్దేశం విను. ఈ పట్నపు రాజు ధర్మకేతుడు. పేరుకి తగిన ధర్మాత్ముడు అతని భార్య సుశీల - నిజంగా సుశీలే. ఆమె ప్రతి శుక్రవారం దంపతి పూజ చేసి ఆ దంపతులకు బంగారం, మణుల నగలిస్తూందట.

అదివిని మేము రాజసభకుపోయి మా విద్యాపాటవాలు ప్రదర్శించాం. రాజుమెచ్చుకుని...

"మీరు కుటుంబ సమేతంగా వచ్చారా!" అని అడిగాడు.

"ఔను మహారాజా!" అన్నాను.

మా మాటలు విని రాజు - "మీరిద్దరూ భార్యాసమేతంగా రేపు పొద్దుట దయ చేయండి" అన్నా డెంతో గౌరవంగా.

ఇప్పుడేం చెయ్యాలో తోచడం లేదు. దీనికేదేనా మార్గం చెబుతావని నిన్ను వేడుకుంటున్నాను" అన్నాడతను

అప్పుడామె చిరునవ్వు నవ్వుతూ ప్రియంవద మొహం చూసి - "వీరిమాటలు విన్నావా? మార్గ మేదేనా చెప్పాలట! ఏం చెబుదామన్నా వారిపట్ల చూపవలసిన కృతజ్ఞతా భావం అడ్డొస్తూంది. మనం ఒకసారి వారి సరసన కూర్చోవాలని అడుగుతున్నారు కానీ మెలాగేనా పరోపకారం చెయ్యాలని శాస్త్రం. అందులోనూ బ్రాహ్మణులూ, విద్వాంసులూ, మనకి స్నేహితులూ. అలాటి వారికోసం ఏం చేసినా దోషమవదు. మన మగవారు విన్నా తప్పుపట్టరు. దేనికైనా మనస్సు ప్రధానం. మనం వీరివద్ద ఇక్కడ కూర్చోడం లేదా? అలాగే అక్కడా కూర్చుందాం. నువ్వెవరిపక్కన కూర్చుంటావు?" అని అడిగింది

అందుకామె నవ్వుతూంటే – "నవ్వుతావేం? మన బ్రాహ్మణులే కదా? నీ మొగు డనుమానిస్తే నేను చెబుతాలే" అని ఆమెకు చెప్పి – "అయ్యా! మీపని మీరు చూసుకోండి. మేము మీపక్కన కూర్చుని దాన మందుకోవాలనే కదా మీ అభిప్రాయం? మీ లాభం ఎందుకు పోగొట్టాలి? అలాగే కూర్చుంటాం వేగంగా పంపించెయ్యాలి సుమండీ! తెలిసిన వాళ్ళెవరేనా ఉంటే గొడవొస్తుంది" అంది.

రామలింగడు – "నే నామాట వారికి ముందే చెప్పాను. మనం పోవడమే ఆలస్యం, పీటవేసి కూర్చోబెట్టి ధార పోస్తారట మరి నేను వెళ్ళి వారికి చెబుతాను. ఇలాటి సాహసం చేయడం నీకే సాధ్యం. నీ ఔదార్యం ఎంతో మెచ్చదగింది" అంటూంటే మంగమణి మాట మళ్ళించింది.

మర్నాడు సూర్యోదయం అవడంతోటే రాజపత్ని వాళ్ళని తీసుకురావడానికి గుర్రపు బళ్ళని పంపింది. మంగమణి, ప్రియంవదలు బ్రాహ్మణస్త్రీలలా తయారై మేలి ముసుగులు వేసుకుని చెరొకరి పక్కగా కూర్చున్నారు అంతకు మునుపు చనువుగా మాట్లాడినా – భార్యఅనే భావం వచ్చి వాళ్ళని లజ్జ ఆవహించింది.

బళ్ళు అంతఃపురం చేరాక వాళ్ళు దిగి, పరిచారికలు చూపిన గదులలోకి వెళ్ళారు ముత్తయిదువులు వచ్చి వారిని అభ్యంగన స్నానాలు చేయమంటే వాళ్ళంగీకరింపలేదు. సుశీల స్వయంగా వచ్చి వారి సౌందర్యం లావణ్యాలు చూసి ఆశ్చర్యపోయింది. మేలి ముసుగులో ఉన్నా వాళ్ళు చూసేవారికి వింత సౌందర్యవతులుగానే అనిపించారు.

సుశీల చాలా బలవంతపెట్టి – మంగమణి వద్దంటున్నా వినకుండా ఆమెకు తలంటి పన్నీటి జలకాలతో స్నానం చేయిస్తూ – 'ఇంత సౌందర్యవతిని సార్వభౌముడికి భార్యగా చేయక ఒక నిరుపేద బ్రాహ్మణుడికి కట్టి పెట్టిన విధినెంత తిట్టినా తప్పులేదు కదా! ఇంత అందగత్తెలు మనుషులలో ఉండరు' అనుకుంటూ ఆమెకు కొత్తబట్టలు నగలతో అలంకారాలు చేసింది.

ప్రియంవదకు కూడా తలంటుపోసి – "ఆమె నీకే మౌతుంది? నీకు సంతాన మెందరు?" అని అడిగింది.

ప్రియంవద ఫక్కున నవ్వగా - మంగమణి - "దేవీ! దానికింకా చిన్నపిల్లల చేష్టలు పోలేదు. మరో లాభావించకండి. ఇది నాకు పినతల్లి కూతురు. భర్తలకు వలెనే మేమూ చాలా ప్రేమగా ఉంటాం" అంది.

పరిచారికలు పూజామంటపంలో రామలింగని పక్క మంగమణినీ, సుభద్రుడి పక్క ప్రియంవదనీ బంగారు పీటలమీద కూర్చోబెట్టారు.రాజు భార్యతో వచ్చి వారి కుపచారాలు చేసి అనేక దానాలు ఇచ్చి, వారిచే ఆశీర్వచనాలు పొందారు.

విందు భోజనం అయ్యాక ఏకాంతం లభించగా - ప్రియంవద - "రామకవి మనతో పీటలమీద కూర్చోడమే ఆలస్యం, వెళ్ళిపో వచ్చున్నాడు. కాని...ఆశీర్వాదాలు "బ్రహ్మముడులు" తలంబ్రాలు ఎన్ని గొడవలని! ఈ బ్రహ్మముడులు నిజమైన బ్రహ్మముడులు కావుకద? చక్రవర్తులనైనా లక్ష్యం చెయ్యని నువ్వితని పక్క కూర్చున్నావు! కాలమహిమ..." అంది.

మంగమణి - "ప్రియంవదా! ఈ పాటిదానికే వింత పడుతున్నావు! జరగబోయేది తెలిస్తే..." అంది.

"ఏమిటి?" అడిగింది ప్రియంవద.

"భోజనం చేసి వస్తూంటే సుశీల చెప్పింది."

"ఏమని?"

"ఈరాత్రి మనకి శోభనం చేయిస్తుందట. అంతఃపురాలు చక్కగా అలంకరించమని పరిచారికలకు చెప్పింది. ఆమె వ్రతం అలాంటిది కాబోలు. మనని చూసింది మొదలు తెగ మురిసిపోతోంది. మనమిప్పుడేం చెయ్యాలి? మొహమాటానికి పోతే ఏదో అయిందట. స్నేహంవల్ల కలిగిన ఫలితమిది. నువ్వన్నట్లు బ్రహ్మముడుల్లాగే ఉన్నాయి పోనీకదా, పేదవాళ్ళు బాగుపడతా రనుకుంటే ఇంతకి తెచ్చారు. ఇంతవరకూ పీటలమీద పక్కపక్కన కూర్చుని - ఇప్పుడు మేము భార్యలం కామంటే ఎవరు నమ్ముతారు? నిజం చెప్తే మననే నిందిస్తారు. ఏం జరిగితే అదే జరగనీ.ఇప్పు డెంత చింతించినా లాభము ండదు. రామకవి తెలిసే మనని

మోసం చేశాడు. ఈ బ్రాహ్మణ స్నేహం చాలు. మనం పోదాం. శిక్షించడమే జరిగితే ముందు వాళ్ళనే శిక్షిస్తారు" అని మంగమణి అంటూండగా, ఏదో పని కల్పించుకుని రామకవి అక్కడి కొచ్చాడు.

అతన్ని చూస్తూ ప్రియంవద కోపంతో కళ్ళెర్రజేసి – "మమ్మల్ని చక్కగా మోసగించావు. ఇంతకు మునుపూ నీపేరు కలవాడి చేతనే మోసగించ బడ్డాం. నువ్వతనికంటె మోసగాడివి. నిజం చెప్పేసి నిన్ను దండించేలా చేస్తాం, చూడు" అంది.

అతను భయపడుతున్నట్లు నటిస్తూ – "మొదట నాకీ గొడవలేమీ తెలియవు. దాన మందుకోడమేకదా అనుకున్నాను. మిమ్మల్ని ప్రార్థించాను. ఇలా జరుగుతుందని తెలిస్తే మిమ్మ ల్నడగకనే పోదును. మీముఖం చూడ్డానికి నాకూ సిగ్గుగానే ఉంది. తప్పించుకునే తోవ కనపడదు. ఇప్పుడు లభించిన ద్రవ్యమంతా వదులుకుంటాను, ఏదేనా ఉపాయం చెప్పండి. మర్యాద నిలబడితే ధనం మరో మార్గంలో సంపాదించుకోవచ్చు. మీ వంటి ఉత్తములను కష్టపెట్టడం న్యాయంకాదు" అన్నాడు.

అప్పుడు మంగమణి – "అయ్యో! రాజపత్ని ఉత్సాహా న్నాపడం ఎవరి తరమూ కాదు. ఇప్పుడు వేరే ఉపాయమూ లేదు. రోటిలో తలపెట్టి రోకటిపోటుకి వెరవడం దేనికి? ముందే ఆలోచించుకోవలసి ఉంది. దేనికైనా కారణం మనసు. దానిని గట్టిపరచుకుంటే ఏ ప్రమాదమూ జరగదు. విద్వాంసు లయిన మీ కింత కంటె ఎక్కువ చెప్పక్కర్లేదు"అంది.

అత నెంతో వినయంగా – "నువ్వు నా కింతగా చెప్పాలా? మీరెలా అంటే అలాగే చేస్తాం" అన్నాడు.

అంతలో సుశీల పంపిన దాది అక్కడికి వచ్చింది. "రాణిగారు వస్తున్నారు" అని చెప్పింది.

రామకవి తన గదికి పోయాడు.

సుశీల వారిని శయ్యాగృహాలకి తీసుకువెళ్ళింది. అప్పటికి సాయంసమయమైంది. ఊళ్ళోని పేరంటాళ్ళను రప్పించి

ఉచితాసనాలమీదకూర్చోబెట్టిగంధం రాయించి ... తాంబూలా లిప్పించి వినోదాలు జరిపించి మంగళహారతులు పాడించింది. ఆ దంపతులను చూడడంవల్ల తన కళ్ళు ధన్య మయ్యాయని ఆనందించింది. ముత్తయిదువులచేత తలుపులు మూయించింది.

అప్పుడు రామలింగకవి ఆమెను చూశాడు. ముసుగులేని ఆమె తాను విన్న దానికంటే వెయ్యి రెట్లు అందంగా కనపడి అతను మోహపరవశు డయ్యాడు. ఈమె చేత ఒక్కసారి చూడబడితే ఇక రాజ్యా లెందుకు? అనుకున్నాడు. ' ఈమెతో నేను నీతివాక్యాలు పలికాను. నేను తొందరపడితే తేలికై పోతాను. ఈమె చూపుల్లో కొంచెం చపలత్వం కనపడుతోంది. కొంతసేపాగితే మన్మథుడు ఉపకారం చేయక మానడు! అనుకుంటూ మంచం దిగిపోయి... గంధపు పూతలు తుడిచేసుకుని దండలను తీసేసి" దగ్గరలో ఉన్న పీఠంమీద కూర్చున్నాడు.

మంగమణి కూడా మంచం దిగింది. కాని అలంకారా లేమీ తీసెయ్యకుండా- గదిలో ఒకచోట అమర్చబడిన వీణ నందుకుని అద్భుతమైన రాగం ఆలపించింది. ఆ సంగీతం విన్నవారికి మోహం కలగక మానదు. కొంతసేపు వీణమీద సంగీతం ఆలపించి రత్నకంబళి మీదే నిద్రలోకి జారిపోయింది.

తెల్లవారింది. గదిలోకి వెళ్ళగా అక్కడ అప్పటికే ప్రియంవద వచ్చి ఉంది. ఆమెను చూసినవ్వుతూ - "రాత్రెలా గడిపావు? మన మెక్కడ? ఈ బ్రాహ్మణు లెక్కడ? ఈ దాంపత్య మేమిటి? ఇలాటిదీ ఏ పురాణంలోనైనా వర్ణించ బడిందా? మన మనసులు మాత్రం పాషాణాలా? వాటికి మాత్రం స్పంద నుండదా! రామకవి బీదబ్రాహ్మణు డనుకున్నాం కాని - ఎంత మాత్రమూ కాదు. అతని ఆకారమే అతని గొప్పతనాన్ని సూచిస్తుంది. శయ్యమీద పడుకున్న అతన్ని చూసేసరికి నాకే ముచ్చటేసింది.వజ్రంలాంటి నా హృదయం దూదికంటే తేలికయి పోయింది. ఎలాటి వారినీ లెక్కచెయ్యని నాకితనితో ముప్పేత్తుతూ దేశాటనం చేయవలసిన రాత రాశాడు కాబోలు భగవంతుడు. చెదిరి పోయిన మనసు నతికష్టంమీద కూడదీసుకున్నాను. నువ్వేం చేశావ్? నిజం చెప్పు" అని అడిగింది.

ప్రియంవద సిగ్గుపడిపోతూ - "మనకోసం వీళ్లని బ్రహ్మసృష్టించి నట్లున్నాడు. లేకపోతే వీళ్ళతో పీటలమీద కూర్చోడానికి మనం అంగీకరించే వాళ్ళమా? విధి విచిత్ర సంఘటనలను కూర్చుతూ ఉంటుంది. నేను నీకంటె ప్రౌఢురాలను కాను - నాకు రాత్రి సుభద్రుని ఆకార విలాసాలు అపురూపంగా తోచాయి. వాటి ననుసరించి మన్మథుడు నామనసుపై మదనశరాలు వేశాడు. నా మనసు మొత్తబడి పోయింది. నేనతనికి నామనసులోని కోరికను చెప్పేసు కున్నాను.

అత నెంత గాంభీర్యం కలవాడని! నాచేత ఔననిపించుకునే వరకూ ఆశలు పెట్టి అప్పుడేమో - "నా గురువాజ్ఞ లేనిదే ఏపనీ చేయను -" అని నన్ను సిగ్గుపడేలా చేశాడు. నువ్వేమంటావో అని నేను భయపడుతున్నాను" అంది.

అంతలో తలుపు చప్పుడైంది. వాళ్ళు తలుపుతియ్యడంతోటే, తన వెంట తీసుకెళ్ళి చక్కని ఆహారం పెట్టి సంతోషపరచింది. అలాగ మూడురాత్రులు గడిచాక - నాలుగో నాటి ఉదయం మంగమణి ప్రియంవదతో - "నిన్నటిరాత్రి ఎంత అపుకుందామన్నా - రౌతుని లక్ష్యంచేయని గుర్రాల్లా నా ఇంద్రియాలు ఆగాయి కాదు. మన్మథుడి లాటి మహాబలవంతుడు మరొకడు లేడేమో. నా నియమాలన్నీ మంటకలిశాయి. ఎంతమోసం! రామకవిలాటి చతురుడు మరొక డుండడు. ఎంత నేర్పరితనమని! ఎంత గంభీరుడని! ఎంతటి రసికుడని! రతి రహస్యవేత్తంటే ముందు అతన్నే చెప్పాలి. ఇంగితజ్ఞానం అతనికంటె మరెవరికీ ఎక్కువుండదు. నా ప్రౌఢిమంతా అతనిముందు చిల్లిగవ్వపాటి చేసిందికాదు." అని ఒక్కసారాగి మళ్ళీ చెప్పసాగింది. "నాకెప్పటికీ తన మనసివ్వ లేపోయినా, నేను తాళలేక - అవకాశం కోసం చూశాను. అతను మెడలోంచి తీసి శయ్యమీ దుంచిన దండల నందుకుని - "అయ్యా! వీటిని మీ మెడలో ఉంచక తీసేస్తారేం? వీటిని వేసుకుంటే మీరు మరింత బాగా ఉంటారు" అంటూ అతని మెడలో వేశాను.

అతని చతురత్వం చూడు. వాటిని వెంటనే తీసి - "బాలా! ఇవిమాకేలా? నీవంటి యువతులు దాల్చవలసినవి" అంటూ నా మెడలో వేశాడు.

"వద్దు వద్దు" అని నేను పెనగులాడాను ఆ సమయంలో అతను నా శరీరంలో ఎక్కడ ఎలా తాకాడో నా శరీరం వివశమై పోయింది ఎంత రతిప్రౌఢుడైనా అంత తొందరగా కళాస్థానం తెలుసుకోడం అసాధ్యం మళ్ళీ అతనేమీ ఎరగనట్లు ఉంటాడు. అప్పుడు నేను సిగ్గుపడి లోపలికి పోయాను ఆపనులన్నీ అతను తెలిసే చేశాడేమో అని నా అనుమానం. నువ్వేమంటావ్?"

"ఎరుగనివా డతను కాదు. మనమే అమాయకులమయ్యాం. గురుశిష్యు లిద్దరూ కలసి చేసిన గూడుపురానీ అనే అనుకుంటున్నాను. మొదట అతన్ని పట్టించుకోకూడ దనుకున్నా అతన్ని చూడ్డంతోటే అంతా మరచి పోతాను. ఐనా వ్రతం విడిచినా ఫలం దక్కింది కాదు. వలచివస్తే రంభనయినా కాదనే మగవాడి సహజ గుణం ఎక్కడికి పోతుంది? రాత్రంతా నా శక్తిని పూర్తిగా వినియోగించినా అతనికి నాపై వలపు కలిగించుకోలేక పోయాను. వాళ్ళ మొహాలు చూడ్డానికే సిగ్గేస్తూంది కనక మన దారిని మనం పోవడమే మంచి దనిపిస్తూంది" అంది ప్రియంవద.

"అయ్యో! ఎంతమోస పోయాం! వాళ్ళని నిందించడ మెందుకులే. మనని మనం మరచిపోయి మోహంలో పడ్డాం. జరిగింది చాలు. పురుషసాంగత్యం అక్కర్లేదు కానీ మనం పోదాం. ఢిల్లీ చక్రవర్తి వద్ద మంత్రి విజయవర్మ. అతని భార్య సుశీలకు అక్కట సుశీల నడిగి పరిచయపత్రం తీసుకుపోదాం"

"అలాగే" అంది ప్రియంవద

సుశీలను ప్రార్థించి పరిచయ పత్రం తీసుకుని రామలింగడికీ సుభద్రుడికీ తెలియకుండా ఆ రాత్రే బండిలో ప్రయాణం మొదలుపెట్టి కొన్నాళ్ళకు ఢిల్లీ చేరుకున్నారు.

రామలింగకవి కూడా తమకు రాజపత్ని ఇచ్చిన వాటిలో ఉత్తమమైనవి ఆ వూరిలోని బ్రాహ్మణులకు పంచిపెట్టి మళ్ళీ ప్రయాణం సాగించాడు ప్రయాణంలో ఎన్నో గ్రామాలలో – గర్వపడుతున్న వారిని పరాభవించి కొన్ని రోజులకి ఢిల్లీ చేరుకున్నాడు.

ఢిల్లీ చేరిన మంగమణి, ప్రియంవద చూసేవాళ్ళకి అసహ్యం కలిగే లాటి వస్త్రాలు ధరించి ఒక సత్రంలో బస చేశారు. అక్కడ ఒక అవ్వ ఎందుకో దుఃఖిస్తూంటే – "అవ్వా! పొద్దుట్నించీ చూస్తున్నాను. ఎందు కలా దుఃఖిస్తున్నావ్? నిన్నోదార్చే వారెవరూ కనిపించరేం?" అని మంగమణి అడిగింది. ఆ అవ్వ తనకథ చెప్పసాగింది.

# అవ్వకథ

"అమ్మాయీ! నన్ను భగవంతుడే ఓదార్చాలి కాని మనుషుల శక్యంకాదు. మావూరు అంబాపురం. నేనొకనాడు వూళ్ళో తిరుగుతూ ఒకమగవాడిని చూసి అతని ఆకార గౌరవాలను బట్టి దాత అనుకుని అతని దగ్గరకు వెళ్ళాను.

అతను నన్ను పలకరించి "అవ్వా! నువ్విక్కడి కెందుకొచ్చావు?" అని అడిగాడు.

"నేను పేద ముత్తయిదువని, చాలామంది పిల్ల లున్నారు. మగడు చాలా ముసలివాడు. దరిద్రం నన్ను తెగబాధిస్తోంది. మీలాంటి పుణ్యాత్ము లేమైనా ఇస్తే దినం గడుస్తుంది. లేకపోతే ఉపవాసమే మా గతి అని దీనంగా ప్రార్థించాను.

అతని హృదయం జాలితో కరిగింది కాబోలు – "శివశివా!" అంటూ చెవులు మూసుకుంటూ నాకేదో ఇవ్వడానికి ఎవరినో అడిగాడు. అతని బాధ చూసి – నాకు విరోధి అయిన ఒక బ్రాహ్మణుడు అతనితో – "అయ్యా! ఈ అవ్వ విషయమై మీ రంతగా విచారించనక్కర్లేదు. దీనికి సంతానం లేదు వేలకొలదీ రూపాయలున్నాయి. నిత్యమూ పేరంటానికి తిరుగుతుంది. కొత్తవాళ్ళ దగ్గర తనకేమీ లేదని అబద్ధాలాడుతుంది" అంటూ నా గురించి లేని పోనివి చెప్పాడు.

అప్పుదతను నీకు మంచి చీరకొని పెడతాను. నాతో బజారుకిరా" అన్నాడు. నేను దురాశతో అతని వెంట వెళ్ళాను.

"నీకు తెలిసిన మంచి దుకాణ మేదేనా ఉందా?" అని అతనడిగాడు. నాకు తెలిసిన మంచి దుకాణానికి అతన్ని తీసుకెళ్ళాను. అతనా వర్తకుణ్ణి - విలువయిన చీరొకటి తీయమన్నాడు. అతనది నాకు చూపించి - "అవ్వా! ఇది బాగుందా? లేకపోతే మరోటి ఎంచుకో. ఖరీదు గురించి చూడకు" అన్నాడు. నేను అంతకంటే విలువైన మరో చీరను ఎంచుకున్నాను.

"చాలా?" అని అడిగా దతను నేను ఆశతో మరో చీర తీసుకున్నాను.

"ఇది నీకు చాలా?" అని మళ్ళీ అడిగాడు. నే నింకో చీర తీసుకున్నాను.

"అయ్యో! సామాన్యమైన చీరలే తీసుకుంటున్నావు. ఈదుకాణంలో విలువైన చీరలే లేవా? నాశక్తి నీకు తెలియదు. నీ ఇష్టం వచ్చినన్ని చీరలు తీసుకో, ఇస్తాను" అని అతనంటే - చివరకాక కాశీదేశపు జరీ పట్టంచు చీర తీసి చూపాను అతను దానివెల అడిగితే వేయి మాడలని చెప్పాడు. అతను పెదవి విరిచాడు.

"ఇంతకన్న ఖరీదైన చీర ఈ గ్రామంలోనేలే"దని వర్తకుడు చెప్పేడు.

"ఉంటే చాలా ఖరీదైనది తీసుకురా. నీకు మంచి అవకాశం వచ్చింది" అని బ్రతిమాలాను. అతను లేదనేశాడు.

నేను చాలా విచారిస్తూ దాతతో - "అయ్యా! నా దురదృష్టానికి మీరేం చేస్తారు? ఇంతకంటె ఖరీదైన చేర లేదట. ఆవెలపెట్టి మా ఇంట్లో ఉన్న వారందరికీ వస్త్రాలు కొనివ్వండి మీ దయవల్ల చాలాకాలం సుఖపడతాం" అన్నాను."

"అలాగే, నువ్వా బట్టలు ఏరుకుంటూఉండు. ఇంతలో నే నీ చీరను నా భార్యకు చూపించి వస్తాను. ఇదికాక మరేదైనా ఇమ్మంటుందేమో మాబస - ఇందాక నువ్వు చూసిందే. క్షణంలో వస్తాను" అన్నాడు.

"అలాగే వేగంగా రండి" అన్నాను.

అత నావర్తకుడితో – "నే నీచీరను మా ఆడాళ్ళకి చూపించొస్తాను – అంతవరకూ ఈ అవ్వ తాకట్టుగా ఉంటుంది మా నివాసం ఇక్కడికి దగ్గరే" అన్నాడు.

వర్తకుడు నన్ను చూసి – "ఏమమ్మా! నువ్వీయ నెన్నెరుగుదువా?" అని అడిగాడు.

"ఈ యనెంత గొప్పవా డనుకున్నారు? నేనుకాదు, లోకమంతా ఎరుగును. నీ సొమ్ము కేమీ భయంలేదు నేను హామీగా ఉంటా" అని అతన్ని పంపాను. అప్పుడు మాకుటుంబానికత నిస్తానన్న చీరలూ అవీ ఎంచి మూట కట్టించాను. అతనికోసం ఎదురు చూడసాగాను. సాయంకాలం వరకూ కళ్ళు చిల్లులు పడేలా చూశాను. అతని జాడలేదు. అప్పుడు నేను భయపడుతూ – "అతన్ని తీసుకొస్తాను, నన్ను వెళ్ళనివ్వండి" అని కోరాను. కాని వర్తకుడు నన్ను కదల నివ్వలేదు. ఏం చెయ్యాలి? – "వాడెవడో నే నెరగను. వీధిలో కనపడి చీరలిస్తాను రమ్మంటే వచ్చాను. ఇంత మోసగాడని నాకు తెలియదు. నన్ను గోతిలో దించాడు. ఏం చెయ్యాలి? నన్నుపోనీ ఊరంతా వెదికి వాణ్ని తీసుకొస్తాను" అని అనేక విధాలుగా వేడుకున్నాను.

"దురాశాపరురాలివైన నీకు ఇలాటి శాస్తి జరగవలసిందే. నే నడిగితే అతను జగమంతటికీ తెలుసు నన్నావు? నాకు రావలసింది నీ కొంప అమ్మించి పుచ్చుకుంటాను" అని నన్ను తిడుతూ నా వెంట కొందరు మనుషులని పంపించాడు.

వాళ్ళూ నేనూ ఊరంతా వెదికాం. కాని వాడు కనపళ్ళేదు. అప్పుడు నేను వర్తకుడి దగ్గరికి పోయి– "దీను రాలిని...ముష్టి ముండని. నన్ను వదిలిపెట్టు. తెలియక మోసపోయాను" అని ఎంత బతిమాలినా అతను దయ తలచలేదు. పత్రికా ముఖంగా చక్రవర్తి దగ్గర తగవు పెట్టాడు ఆ తగవుకే నేను వచ్చాను. చక్రవర్తి పుణ్యాత్ముడు ఏంచేస్తాడో? తిన్నదికాదు, కుడిచింది కాదు వీధిలో పోతూంటే మీద-పడింది" అని మళ్ళీ ఏడుపు ప్రారంభించింది.

ఆ అవ్వమాటలు విని మంగమణి, ప్రియంవద నవ్వుకున్నారు. "లోభుల డబ్బు ఇలాగే పోతుంది. ఆ బ్రాహ్మడెవడో చాలా చతురుడు. మన రామకవి కాదుకద?' అనుకుని ఆ అవ్వని మాటలతో ఓదార్చి వెళ్ళిపోయారు.

## సుప్రభ కథ

మంగమణి ప్రియంవదలు ఢిల్లీవచ్చి పది రోజులైపోతూంది. వాళ్ళిద్దరూ మారు వేషాలలో ఉండి విజయవర్మ భార్య అయిన సుప్రభతో తమ వృత్తాంతం చెప్పుకోవడానికి అవకాశం కోసం ఎదురు చూస్తున్నారు. ఒక పర్వదినాన ఆమె దేవాలయానికి వెళ్తుందని తెలిసింది. వాళ్ళిద్దరూ అక్కడికి వెళ్ళి సుప్రభ దేవతా దర్శనం చేసుకున్నాక ముఖపంటపంలో – ముసుగులతో ఆమె ఎదుటికి పోయి మెల్లగా సుశీరాసిన ఉత్తరం ఆమె కందించారు. ఆమె ఆ ఉత్తరం చదువుకో సాగింది.

"అక్కా! ఈ కాంతలు రూపంలోనూ, విద్యలోనూ అసమానులు. చూసిన వారికి తెలుస్తుంది వీళ్ళు ఉత్తమజాతి వారు. నాకు పుత్రికల వంటివారు కాబట్టి వీరిని గౌరవించమని నీకు వేరే రాయనక్కరలేదు. వీరి కోరికను తీర్చవలసిందిగా నీ భర్తను ప్రార్థించమని ఈ ఉత్తరం రాసిచ్చాను. నా ముద్దు చెల్లించగలవు"

ఆ ఉత్తరాన్ని సుప్రభ ముమ్మారు చదువుకుంది. చాలా సంతోషించింది. వారిని చూసింది మాసిన బట్టల్లో ఉన్న వారి అసలు రూపాలు బయటకు కనపడక – నాచెల్లెలకి వీరిమీద అభిమాన మెందుకు కలిగిందో అని ఆలోచిస్తూ – కూర్చోమని వారికి సైగ చేసింది.

తాను ఇంటికి పోయేటప్పుడు వారినీ కూడా తనతో బండిలో తీసుకు వెళ్ళింది. తన ఇంట్లో– వారికి ఉపచారాలు చెయ్యడానికి తగిన పరిచారికలను నియమించింది. ఇంట్లోనే ఉన్నా రెండు మూడు రోజులవరకూ వారితో, మాట్లాడ్డానికి సుప్రభ కవకాశమే చిక్కలేదు.

ఒకనాడు సాయంకాలం సుప్రభ తన అంతఃపురంలో కూర్చుని వారిని రప్పించి, కూర్చోబెట్టి – "మీ రెవరి పుత్రికలు? మీ దేదేశం? సుశీలకీ మీకూ స్నేహం ఎలా కలిసింది? మీకు మావలన కావలసిన పనేమిటి?"అని ప్రశ్నించింది.

మంగమణి సుప్రభతో కొంత పరిచయమయ్యాక తమ పని చెప్పడం బాగుంటుందని నిశ్చయించుకుని – అప్పటికి తగినట్లు జవాబు లిచ్చి – "అమ్మా! నువ్వు చాలా ఉత్తమురాలివని ప్రజలంతా చెప్పుకుంటున్నారు. ధనముంటే గుణా లలవడతాయి. సుశీల ఎప్పుడూ మీ శీలం గురించే చెబుతూ ఉంటుంది. మీ సంతానం గురించి ముచ్చటించడమే మరిచాము. మీకు సంతానం ఉందా? అని అడిగింది.

సుప్రభ ఆ ప్రశ్నకొక నిట్టూర్పువిడిచి ...ఏదో తలుచుకుని... కన్నీరు పెట్టుకుంది. మంగమణి ఆమె దైన్యాన్ని చూసి – "సంతానం గురించి అడిగినంత మాత్రాన విచారిస్తున్నారు అది కొరతగా అనుకుంటు న్నాను. దేవుడు చేసే వాటికి విచారించడం వ్యర్థం కదా? మీ విచారానికి హేతు వేమిటి?" అని మృదువుగా అడిగింది.

సుప్రభ కన్నీరు తుడుచుకుని – "నాలాటి దురదృష్ట వంతురాలు ఎక్కడా ఉండదు. నన్నెందుకు పొగుడుతావు? నాకు సంతానం లేదు. ఇరవయ్యేళ్ళ క్రిందట ఒక ఆడపిల్ల పుట్టింది. దాని కేడాది నిండాక మేము సకుటుంబంగా కాశీ వెళ్ళాం. ఆ సమయంలో గంగానది ఆకాశమంత ఎత్తుగా పొంగింది. మాకు గంగపూజ చెయ్యాలని ఉత్సాహం కలిగింది. మారేడు పత్రి, తులసి పత్రి, అనేక రకాల పూలూ, ఎర్ర తామర పూలూ వేలకొద్దీ తెప్పించాం.

తరువాత నేనూ, నాభర్తా, బిడ్డా, నాగమణి అనే దాసీ, కొందరు బ్రాహ్మణులూ ఒక ఓడ నెక్కాం. నావికులు ఓడను ప్రవాహానికెదురుగా నడిపించ సాగారు. బ్రాహ్మణులు గంగాసహస్ర నామాలు చదువుతూంటే, బంగారు పళ్ళెంలో పువ్వులుంచి నేనూ నా భర్తా అత్యంత భక్తిపూర్వకంగా గంగకు పూజ చెయ్య సాగాము.

నాగమణి మా బిడ్డ నెత్తుకుని మాకు దగ్గరగా నిలబడింది. మమ్మల్ని చూసి మా బిడ్డకూడా పువ్వులు తీసి గంగలో వేయ సాగింది. అది అలా పూజ చేస్తూంటే మాకెంతో ముద్దుగా అనిపించింది. దాసీ పువ్వు లందిస్తూంటే పాప ఆ పువ్వుల్ని నీటిలో వేయసాగింది. అది మాకు చాలా వేడుకగా అనిపించి మానిపించ బుద్ధి కాలేదు.

మా దాది బిడ్డ చేతికి పువ్వులందించి "వెయ్యి...వెయ్యి..." అంటూ నీటివేపుకి కొంచెం వంగింది. బిడ్డ చేయిపట్టు వదిలి తటాలున నీటిలో పడిపోయింది. బిడ్డతోపాటు నాగమణి కూడా ప్రవాహంలోకి ఉరికింది. ఇద్దరూ కొట్టుకు పోయారు. అందరం గొల్లుమని ఏడుస్తూ చూశాం. ఏమీ కనపడలేదు.

నాకు జీవితం మీద కోరిక నశించి గంగలో పడిపోదామని ఎంత ప్రయత్నించినా పడవలోని వాళ్ళు నన్ను కదల నిచ్చారు కాదు.

తరువాత వారికోసం ఎన్ని ప్రయత్నాలు చేసినా వాళ్ళ శవాలు కూడా కనపడలేదు.

మాపాప అందం ఏమని చెప్పేది? నాది నిర్భాగ్యజన్మ. అలాటి ముద్దుల కూతురు దక్కుతుందా? - దాన్నిప్పుడు స్మరించుకోడం దేనికి? కానీ, మీరు వచ్చిన పనేదో చెప్పండి." అంది.

వాళ్ళు మాట్లాడు కుంటూంటే విజయవర్మ కొంచెం వయసుమళ్ళిన ఆడదానిని వెంటబెట్టుకుని అంతఃపురానికి వచ్చాడు.

అతను రావడం చూసి మంగమణి, ప్రియంవదా లోపలికి పోయారు.

అప్పుడు మంత్రి - భార్యనిచూస్తూ.."ఇదెవరో తెలుసునా?" అని అడిగాడు.

సుప్రభ నిదానించి ఆమెను చూసి "అయ్యో...ఇది మన నాగమణికదూ? ఎలా వచ్చావే? బతికున్నావా! నాబిడ్డ నేం చేశావ్?" అంటూ దాన్ని కౌగలించుకుంది.

"అందరమూ సురక్షితంగానే ఉన్నాం. విచారించకండి. మీ కూతురు సజీవంగానే ఉంది. దేవుడి దయవలన మీ వద్దకు రాగలదు" అని నాగమణి చెప్పగానే సుప్రభ ఎంతో సంతోషిస్తూ "నాబిడ్డ బతికుందా! నిజంగానే? ఇప్పటి కది పెద్దదయి వుంటుందే! నన్ను గుర్తుపట్టగలదో లేదో? ఎక్కడుంది? ఎందుకు తీసుకు రాలేదు? మా దగ్గరకు రానందా? దయలేని వాళ్ళమని నిందిస్తూంది కాబోలు. నీ వృత్తాంతం పూర్తిగా వివరంగా చెప్పు. ఇన్నాళ్ళూ ఎక్కడున్నావు? ఏంచేశావు? ఏ యే దేశాలు తిరిగావు?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించేసింది"

అప్పుడు నాగమణి జరిగిన వృతాత్తంతం మొదలుపెట్టింది.

## నాగమణికథ

"అమ్మా! నా వృత్తాంతం భారతమంతుంది. అంచేత క్లుప్తంగా చెబుతాను వినండి. మీరు చూస్తూండగానే పాపని పట్టుకుందుకు నీటిలో దూకాను కదా! పడిన చోటే పాప నా చేతికి చిక్కింది. కాని అంతలోనే ఒక సుడి వొచ్చి మమ్మ ల్నిద్దర్నీ ముంచేసి దూరంగా తేల్చింది.

అప్పుడు దైవవశాన ఒక కర్ర చేతికి దొరికింది దాన్ని ఊతంగా పట్టుకుని - ఒకచేత్తో బిడ్డని మునిగిపోకుండా పట్టుకుని నీటిమీద తేలసాగాను. ఆ ప్రవాహవేగానికి నిముషంలో మరో-పట్నం ప్రాంతానికి పోయాను.

అక్కడ - నీటి కట్టెల కోసం ఈదుతున్న ఒక పల్లె వాడు మమ్మల్ని సమీపించాడు. నేను - "రక్షించు" అంటూ అరిచాను. వాడు వేగంగా మా దగ్గర కొచ్చి, నా చేతిపైనున్న బిడ్డను మెల్లగా తీసుకుని తెప్పలో ఉంచి నన్ను కూడా పక్కకి చేర్చుకోవాలని ప్రయత్నించాడు.

కాని అంతలోనే మరొక సుడివచ్చి మా ఇద్దరినీ దూరంగా తోసేసింది. వాడు నా దగ్గరకు ఈదుకురావాలని ఎంత ప్రయత్నం చేసినా వీలుపడలేదు. బిడ్డ తెప్పమీదుండడంవల్ల దానిని కాపాడుతూ ఈదడం అసాధ్యమై పోయింది. వాడు నన్ను వదలి వేగంగా ఈదుకుపోయి నేను చూస్తూండగానే ఒడ్డుచేరుకున్నాడు. అది చూసి నే నెంతో సంతోషించాను. బాలికను రక్షించినందుకు భగవంతుడికి అనేక నమస్కారాలు చేశాను.

ఆ కర్రను ఊతగా చేసుకుని నేను ప్రవాహంలో కొట్టుకు పోసాగాను. సాయంకాలమైంది. ఎవరూ కనపడలేదు. చీకటి పడడంతోటే నాకు భయంవెయ్యడం మొదలుపెట్టింది కాని, చావడానికి సిద్ధపడిన దాన్నికనక దేముడి మీద భారంవేసి ఆ కర్రని వదలకుండా నీటిలో పోతున్నాను.

తెల్లవారినా తీరం కనిపించలేదు. సాయంకాలానికి నాకు చాలా ఆకలెయ్య సాగింది. శరీరం స్వాధీనం తప్పుతూంది. ఆ కర్రమీద తలపెట్టుకుని చచ్చిన దానిలా పడున్నాను. నా శరీరం నీటిలో ఉంది. రెండు చేతులతోనూ కర్రని పట్టుకున్నాను. అది నిద్రో, మూర్ఛో తెలియదు ఏదో నన్నావహించింది.

ఎంతదూరం ఎన్ని రోజులు ప్రవాహంలో కొట్టుకుపోయానో తెలియదు. కళ్ళు తెరిచేసరికి – ఒక పట్నంలో ఒక బ్రాహ్మణుడు నా నోట్లో అన్నరసం పోస్తున్నాడు. ఆ పుణ్యాత్ముడివల్లనే నేను బతికి బట్ట కట్టాను

అతను స్నానం చేస్తూంటే కర్రతో సహా నే నారేవులోకి కొట్టుకువచ్చి అటూ ఇటూ కర్రతోపాటు తిరుగుతూంటే నామొహం అతనికి కనిపించి నా ముక్కునున్న వజ్రపురవ్వ తళుకు లతనికి మొరపుల్లా అనిపించాయట. అతను శవంగా భావించాడట. దబ్బాశతో నన్ను తీరానికి లాగాడట అంతలో మరొక రక్కడికి రాగా ఇద్దరూ నన్ను పరీక్షించి ప్రాణముందని నిశ్చయించి చేతులతో నన్ను పట్టుకుని ఒడ్డున పడుకో బెట్టారట. ఆ పుణ్యాత్ముడు ఇంటికి పోయి అన్నంపిండి రసం చేసి నానోటిలో కెక్కించాడట.

అన్నసారం తగలడం తోనే నాకు స్పృహ వచ్చింది. కొంచెం బలం కూడా రావడంతో నన్నత నింటికి తీసుకుపోయి ఉపచారాలు చేసి నాలుగు రోజుల్లో నన్ను మళ్ళీ మామూలు మనిషిని చేశాడు. నే నతనికి నా నగలన్నీ ఇచ్చేశాను. నా వృత్తాంతం చెప్పి నన్ను నా దేశానికి తీసుకెళ్తే మంచి పారితోషికం ఇప్పిస్తానన్నాను. అత నంగీకరించాడు.

అంతలో విధివశాత్తూ అతనికేదో రోగం వచ్చి హఠాత్తుగా మరణించాడు. నా తండ్రే చచ్చిపోయినట్లు ఏడిచాను. ఆయన భార్య నా పాదం మంచిది కాదని నన్ను వాళ్ళింటినుంచి వెళ్ళగొట్టింది.

నేను నా గ్రహచారాన్ని తిట్టుకుంటూ స్వదేశానికి పోడానికి సహాయమెవరేనా దొరుకుతారేమో అని వెదుకుతూ నాలుగుమూలలా తిరుగుతూ ఆ పట్నంలో ఉన్న ఒక దేవాలయానికి పోయాను. ఆ పట్నం పేరు కలిఘాతా నగరమట.

నేను దేవాలయానికి వెళ్ళిన సమయం సాయంకాలం. అక్కడ కన్నులపండగగా దీపాలు పెట్టారు. ఒకమూల వేదమంత్రాలు చదువుతున్న పండితులు. మరొకవేపు హరిభజనలు చేస్తున్న భక్తులు" అవి వింటూంటే నా మనసుకి చాలా ఆనందం కలిగింది. చాలాపొద్దు పోయేవరకూ అక్కడ ఉత్సవం చేశారు.

ద్వీపాంతరం నుంచి ఎవరో రాజకుమారుడు వచ్చి స్వామి కారోజున భోగం జరిపిస్తున్నాడని నాకు తెలిసింది. అవన్నీ చూస్తూ నేను నా దుఃఖం మరచిపోయాను. రాత్రి రెండు జాముల వరకూ అక్కడ సందడిగానే ఉండడంవలన నేను నిర్భయంగా దేవాలయంలో కాలక్షేపం చేశాను.

క్రమంగా అక్కడివారు తమ ఇళ్ళకు పోసాగారు. అర్చకులు గుడికి తాళాలు వేస్తూ ఆవరణలో ఉన్నవా రందరినీ బయటకు పొమ్మన్నారు. అప్పుడు నేను చావడి అరుగుమీదకి వెళ్ళిపోయాను. ఆగుమ్మం తలుపులు కూడా తాళంవేసి వారు ఇళ్ళకి పోయారు. ఆ అరుగుమీదనేనొక్కతినే ఉన్నాను. నా భయానికి తోడు చీకటి కూడా అక్క డెక్కువగా ఉంది.

ఆ దేవాలయానిక కొక పక్క కోటగోడ పర్వతంలా ఉండడంవల్ల మరింత చీకటిగా ఉంది ఆ వీధి మారుమూలగా ఉండి జనసంచారం అతితక్కువగా ఉంది. నేనున్న అరుగుమీద ఓ గది ఉంది. దానికి తలుపులు లేవు కనుక లోపలికి పోదాని కభ్యంతరం లేదు ఆపైన భయంగా ఉండడంతో నేనా గదిలోకి వెళ్ళి ఒక మూలన కూర్చుని - ఎప్పుడు తెల్లవారుతుందా అని దేముణ్ణి ధ్యానించసాగాను.

అలాటి సమయంలో ...మెల్లగా అడుగులు వేస్తూ ఒక స్త్రీ ఆ గదిలోకి వచ్చింది. ఆమె ధరించిన నగల కాంతులకు నాకళ్ళు మిరుమిట్లు గొల్పాయి. ఆనగలను చూసి లక్ష్మీదేవో, పార్వతీదేవో అనుకున్నాను. కాని అంతలోనే - భూత భేతాళాలు యక్షిణీ రూపంలో సంచరిస్తూంటా యని జ్ఞాపకం వచ్చి గుండె గుభేల్మంది.

మూలకి ముడిచిపెట్టుకుని, ఊపిరి బిగబట్టుకుని ఉన్నాను.

ఆమె నలుమూలలా చూసి...నేను నిద్రపోతున్నాననుకుని - 'రామామణీ!' అని మెల్లగా పిలిచింది. ఆ పిలుపు స్పష్టంగా వినపడక నన్నే పిలుస్తూందినుకుని - "ఓయ్" అని పలికాను

"అయ్యో! ముందుగా వొచ్చి నిద్రపోతున్నావా! గోడదగ్గరుంటా వనుకున్నాను. కోటగోడ దాటదం చాలా కష్టమైంది సుమా! కింద ఏదుంటే ఉండనీ - అని దూకేశాను. కొంచెం పక్కగా నేలబారున నుయ్యుంది. దానిలో పడేదాన్ని. లేచిన వేళ మంచిదే. చెప్పవలసిన విషయాలెన్నో ఉన్నాయి. తోవలో చెబుతాలే! ఇప్పుడే రెండు గంటలు కొట్టారు. రాజకుమారుడు రాసిన చీటిలో సరిగ్గా పన్నెండు గంటలకి బండి పంపుతానని ఉంది. బండి వచ్చిందేమో చూడు" అందామె

ఆ మాటలనుంచి నేను కొంతవరకూ విషయం గ్రహించాను. ఆమె నన్ను తన సఖురా లనుకుంటూంది. నిజం చెప్పకుండా ఆమెతో పోయి కొంతసాయం చేద్దామని నిశ్చయించుకున్నాను.

ఆమె తట్టి లేపగానే లేచి బయటకు వెళ్ళాను. అప్పుడే బండివచ్చి నిలబడింది. ఆ శబ్దాని కామెక ా వచ్చి నా చెయ్యి పట్టుకుని

బండి దగ్గరకు తీసుకుపోయింది. ఆ బండిలోంచి ఒకామె దిగి అందులోకి ఎక్కమని వినయంగా సంజ్ఞ చేసింది. నేనేమీ మాట్లాడకుండా ఎక్కేశాను. ఆమె కూడా ఎక్కాక తలుపులు బిగించారు.

బండివాడు బండిని చాలా వేగంగానడిపాడు. కొద్దిసేపటికే ఒక సముద్రపు రేవుకి తీసుకుపోయాడు. బండి ఆగడంతోటే ఒక పరిచారిక తలుపుతీసి - "రండి, రండి" అని పిలిచింది.

మేమందరమూ బండిదిగి దానివెనక వెళ్ళాం. అక్కడొక ఓడ సిద్ధంగా ఉంది. మమ్మల్నామె దానిలోకి తీసుకుపోయింది.

ఆ ఓడచాలా విశాలంగా ఉంది. నాలుగుమూలలా గాజుదీపాలతో, మనోహరమైన వస్తువులతో చక్కగా అలంకరించబడి ఉంది. రాజభవనం కంటే అందంగా ఉన్న ఒక గదిలో మమ్మల్ని ప్రవేశపెట్టి ఆ పరిచారిక వెళ్ళిపోయింది.

ఆ దీపాల వెలుగులో ఆమె నన్ను నిదానంగా చూసి- "అయ్యో! రామామణి ఏదీ? బండిలో ఉండిపోయిందా? పిలిపించు. ఓడ బయలుదేరుతుందేమో నిలపమను-" అంటూ గట్టువేపు చూడసాగింది.

అప్పుడు నేను నవ్వుతూ - "రామామణి ఎవరు? నీతో వచ్చిందా?" అని అడిగాను.

"మా రామామణి ఓడదాకా నాతోనే వచ్చింది. దారి తెలియక ఎక్కడికో పోయుంటుంది. నీకు పుణ్యముంటుంది. దాన్ని కొంచెం పిలిచిపెట్టు" అని బతిమాలింది.

"నీకేమీ తెలియదు. నేనే నిన్ను మోసం చేశాను. దేవాలయం గదిలో ఉన్నది నేను కాని రామామణి కాదు. నాపేరు నాగమణి. నీకు మీ రామామణి ఏంపనులు చేస్తుందో అంతకంటె ఎక్కువగానే నేను చేస్తాను.

నా వృత్తాంతం వింటానంటే చెబుతాను" అన్నాను.

ఆమె కొంతసేపు తెల్లబోయి – నన్ను పరిశీలనగా చూసి "నువ్వు ఎవరివి? ఆ గదిలోకి ఎలా వచ్చావు? నన్ను ఇలా మోసం చేయడం ధర్మమేనా?" అని అడిగింది

"నేను నిన్నేమీ మోసం చెయ్యలేదు – నేను ఢిల్లీ చక్రవర్తిగారి మంత్రి విజయవర్మ భార్యకి సఖురాలను నాపేరు నాగమణి..." అంటూ నా వృత్తాంతమంతా పూసగుచ్చిన ట్లామెకు చెప్పి – "నువ్వేమీ విచారించకు. నన్నే రామామణిగా భావించుకో. ప్రాణం పోయినా నీమాట జవదాటను. దేవుడు నాకు విదేశయానం రాయబట్టి నాకలాటి బుద్ధి పుట్టిందేమో! నామాట నమ్ము. నీ వే రాజు కుమార్తెవి? నీపేరేమిటి? నువ్విప్పు డెవరిని వరించి ఇలా వెళ్తున్నావ్?" అని అడిగాను.

ఆమె ఆశ్చర్యంగా చూసి – "నువ్వు చెప్పింది నిజమేనా? ఏం దైవఘటన! విజయవర్మ భార్య సుప్రభ నాకు పెదతల్లి ఔతుంది. ఆమెకెంత ఆపద వచ్చింది!లేకలేక కలిగినపిల్ల గంగలో పడిందా! బతికివున్నట్లు వారెరుగుదురో? ఎరుగరో? విధివిలాసం అద్భుతం. కానీ నీకూ నాకూ బాంధవ్యముంది. నిన్ను నా ప్రాణిసఖిగా తలచి నీకు నా వృత్తాంతం చెబుతున్నాను, విను" అని తన కథ చెప్పసాగింది.

# కల్పవల్లి కథ

నా పేరు కల్పవల్లి. మా అమ్మ పేరు సునంద. ' ఈ పట్నం రాజు సింధువర్మ. నేనతని కుమార్తెని. కొన్నాళ్ళ కిందట నేనొక సాయంత్రం జలకమాడి అలంకరించుకుని తల ఆరబెట్టుకుంటూ మేడమీదకు పోయి అటూ ఇటూ తిరుగుతూ, చల్లగాలికి వొళ్ళు పులకరిస్తుండగా, నామనసులో అద్భుతమూ అపూర్వమూ ఐన ఆనందం ఒకటికలిగింది. అది ఇలాఅలా ఉందని చెప్పడానికి వీలులేదు. అప్పుడు నాకేమీ తోచక మేడమీంచి క్రిందికి...వీధిలోకి తొంగి చూశాను.

అప్పుడు మన్మధుణ్నీ, జయంతుణ్నీ, వసంతుణ్నీ మించిన అందగాడైన ఒక రాజకుమారుడు ఆ వీధిని పోతూ నా హృదయా న్నాకర్షించాడు. అంతకుముందు నాలో కలిగిన మదనవికారం అతన్ని చూడ్డంతోటే మరింత పెరిగిపోయి పిచ్చిచేష్టలకి ప్రేరేపించింది.

నేనిన్ని మల్లి పూలు తీసుకుని ఆమదనుడి మీద చల్లాను. నా సాహసం నాకే తెలియదు.

ఆ అందగాడు తన మీద పూలు పడేసరికి తలెత్తి చూశాడు. నేనూ అతన్ని చూస్తున్నాను కనుక మా ఇద్దరి చూపులూ ఒకదాని కొకటి తగులుకున్నాయి. అప్పు డావీధిలో మరెవరూ లేకపోడంతో ఒకరి నొకరం సావకాశంగా చూసుకున్నాం.

నేనతని రసికత్వమెంతటిదో చూడాలని - 'గోపికలను మేనుపులకరించేలా ముద్దాడిన శ్రీకృష్ణుడు మిమ్మల్ని రక్షించుగాక' అని అర్థం వచ్చేదీ, నా వలపుని సూచించేదీ శ్లోకం ఒకటి రాసి పూబంతిలో ఉంచి అతని పైకి విసిరాను.

అతను జవాబుగా - నేను చూస్తూండగానే చీటి రాసి తన చేతిలో ఉన్న పావురం ముక్కుకి తగిల్చాడు. అది రివ్వున ఎగిరివచ్చి ఉత్తరాన్ని నా ముందు వదిలి పోయింది.

అతను నా లేఖకి తగినట్లే జవాబు పంపాడు. అప్పుడు నేను –

అయ్యా! మీ కుల, శీల, నామ దేశాలు తెలియవు. ఐనా మీ రూపం చూసి పరవశ నయ్యాను. అదలా ఉంచితే అంతఃపురంలో ఉండే నేను మీ కోరిక నెలా తీర్చగలనా? అని విచారిస్తున్నాను. ఎవరినీ దేనినీ పరిగణింపకుండా స్వేచ్ఛగా అభీష్టం తీర్చుకుందామన్నా ఎలా సాగుతుందో తెలియడం లేదు. మీలాటి సర్వజ్ఞులకి తెలియని విషయా లుండవు. మీ జవాబుకోసం ఎదురుచూస్తుంటాను" అంటూ లేఖ పంపాను.

కొంతసేపట్లో ఇందాకటి పావురం నా కతనినుంచి జవాబుతెచ్చి అందించింది. దాంట్లో –

"నేను సింహళద్వీప ప్రభువైన సింహకేతుడనే రాజకుమారుణ్ణి, నా పేరు మకరందుడు. నేనీ దేశం చూడడానికి పదిరోజుల కిందట వచ్చాను. నాలుగు రోజుల్లో మాదేశం తిరిగి వెళ్ళిపోతాను. నీకిష్టమైతే నావెంట తీసుకుపోయి నీ కోరికలు తీరుస్తాను. దీనికి విచారింపనక్కర్లేదు. క్షత్రియులకు గాంధర్వవివాహం సమ్మతమే. నువ్వు అంతఃపురంలో ఉన్నా ఉపాయంతో కార్యం సాధించుకోవచ్చు. ఆప్తబంధువులని విడచి రమ్మనడానికి బాధగానే ఉంది. నీ యిష్టమేదయితే అది చేస్తాను. రేపు శుక్రవారం మాత్రం ప్రయాణం తప్పదు" అని రాసి ఉంది.

ఆ ఉత్తరం చదివి – అతనివెంట రావడానికి నేను సిద్ధమే అని రాసి ఆ లేఖ పంపించేశాను యౌవనం – పిశాచంలాటిది కదా! బంధువులని వదలలేను. అతన్నీ వదలలేను. ఏం చెప్పేది నా బాధ? –

అప్పుడు రామామణి వచ్చి "ఎందుకలా ఉన్నావ్?" అని అడిగింది.

చెప్పాలా? మానాలా? అని కొంతసేపు తట పటాయించి – చివరికి, జరిగిన దంతా చెప్పేశాను.

ఆమె నా సాహసానికి చాలా ఆశ్చర్యపోయి – "ఇంత సాహసానికి పూనుకుంటావా. నాతో అయినా చెప్పొద్దూ? నిన్నొక్కరోజు చూడకపోతే ఉండలేని మీ తల్లితండ్రుల కేది దిక్కు? చాల్లే. ఇలాటి

పనులెప్పుడూ చెయ్యకు. నువ్వంతగా కోరితే అతన్నే ఇక్కడుంచేటట్లు చేస్తాను. లేకపోతే అతనికంటె ఘనుణ్ణి తెస్తాం. అంతేకాని ఇలా చెయ్యకు. నీ ఉద్దేశం మార్చుకున్నట్లు ఉత్తరం రాసి నా కివ్వు. నేను తీసుకెళ్ళి అతని కిస్తాను" అని నయనా భయానా చెప్పింది. నేనేమీ అనకుండా తలవంచుకుని ఏడవ సాగేను.

అప్పుడు రామామణి – "సఖీ! నామాటలు రుచించ లేదా? లోక పరిపాటిననుసరించి చెప్పాను. అందుకు విచారించడం దేనికీ? మంచి చెడులు నువ్వే ఆలోచించుకో. ఉత్తరం ఇస్తే తీసుకెళ్ళి అతని కిస్తాను" అంది.

"మాటలకేం? ఎన్నైనా చెప్పొచ్చు. ఆ రాజకుమారుడి నొక్కసారి చూస్తే నువ్విలా అనవు. అతనొక దీవికి ప్రభువు. కనక మన సిరికి ఆశించి ఇక్కడుండే వాడు కాదు. అతని లాటి వాడు మరొక రెవరూ ఉండరు.

ఆడపిల్లలకి తల్లితండ్రులు బాల్యమునందే! యౌవనం వచ్చేసరికి వాళ్ళు దూరస్థులే. తల్లిదండ్రుల్ని వదిలి రుక్మిణీదేవి శ్రీకృష్ణుని వరించి వెళ్ళపోలేదూ? నువ్వొక్కదానివి నాతో వచ్చావో, నాకే కొరతా ఉండదు. ప్రయాణానికి సిద్ధమవు" అంటూ దాని మనసు మార్చాను.

ఆమెకూడా అంగీకరించి ప్రయాణ సన్నాహాలు మొదలు పెట్టింది. రాత్రి పొద్దుపోయేవరకూ నాదగ్గరే ఉంది. దేవాలయం దగ్గరుండమని చెప్పాను. అదివెళ్ళి చూసివచ్చి తానెక్కడుంటుందో చెప్పింది. అనుకున్న వేళకి కోటగోడకి గొలుసువేసి నేను దిగి వచ్చాను. తరువాత జరిగింది నీకే తెలుసు. రామామణి కేదో అంతరాయం ఎదురైంది. లేకపోతే తను రాకుండా ఉండదు. అయినా మానవసంకల్పం జరుగుతుందని లేదు.

నీ మాటలు చక్కగా ఉన్నాయి. రామామణికన్న ఎక్కువ దానినే దేముడు నాకు సమకూర్చాడు. నువ్వు మంచి నేర్పరిలా ఉన్నావు. అదీకాక మా పెదతల్లికి నువ్వు హితురాలివి.

రాజకుమారుడికీ నాకూ మధ్య జరిగిన విషయాలన్నీ నీకు చెప్పాను కదా. ఇకమీద టేం చెయ్యాలో నాకు తెలియదు. అది నువ్వే ఆలోచించు. నా జీవితం నీ అధీనంలో ఉంచుతున్నాను. అనాధనైన నన్ను రక్షించు" అంటూ ఆమె నా పాదాలమీద పడింది.

నే నామెను దగ్గరగా తీసుకుని సమయోచితమయిన మాటలతో ఆమె నోదార్చాను. మా మాటల్లోనే తెల్లవారింది.

ఎటుచూసినా సముద్రమే కాని మరేదీ కనపడ్డంలేదు. ఓడచాలా వేగంగా నడుస్తోంది. కొంచెం పొద్దెక్కేసరికి పరిచారికలు మా గదిలోకి ఆహారపదార్థాలు తెచ్చి ఉంచారు. ఆమెకు ప్రియమైన మాటలు చెబుతూ కల్పవల్లి చేత తినిపించాను. నేను కూడా తిన్న తరవాత ఆమె తన ప్రయాణం గురించే చెబుతూ నన్నా రాజకుమారుడి మనస్సెలాటిదో తెలుసుకు రమ్మంది.

సమయం చూసి, పరిచారికలచేత నారాక తెలియజేసి ఆయనవద్దకు వెళ్ళాను. ఆయన నాకు ఉచిత మర్యాదలు చేశాడు. నేను నమస్కరించి అతనితో చెప్పవలసిన మాటలన్నీ చెప్పాను. వాగ్ధోరణిని బట్టి అతను మంచి రసికుడే అనిపించింది.

రాజకుమార్తె వద్దకొచ్చి అతని గురించి చెప్పి ఆమెకు చాలా సంతోషం కలిగించాను. అంతలో సూర్యాస్తమయం అయింది. అంతకు ముందు ఓడలోని ఒక గదిని అలంకరించి ఉంచారు నేను రాజపుత్రికకు విచిత్రమైన అలంకారాలు చేశాను. ఆమె మోహినీదేవతలాగే ఉంది. ఆమె అందం చూసి నేనే ఆశ్చర్యపోయాను. అందమైన ఇద్దరినీ జతకూర్చినందుకు దేముణ్ణి మెచ్చుకుంటూ ఆమె చెయ్యి పట్టుకుని అతనున్న గదిలోకి తీసుకెళ్ళి అతని పక్కన కూర్చోబెట్టాను.

ఆమె సిగ్గుపడుతూ మంచం దిగి ఒక మూలకి పారిపోయింది. వాళ్ళిద్దరి చేతా వినోద కృత్యాలు చేయించి ..తలుపు బిగించి నేను నా గదికొచ్చి నిద్రపోయాను.

సూర్యోదయం కాకముందే ఆమె వచ్చి నా పక్కలో పడుకుంది. – "రాత్రి విశేషాలేమిటి?" అని నవ్వుతూ అడిగాను.

ఆమె సిగ్గుపడుతూ "ప్రియ సఖీ! నాప్రియుడు నా చెంతకు చేరిన వెంటనే నేకట్టుకున్న చీరముడి జారిపోయి వడ్డాణంలా నా పిరుదులమీద నిలిచి పోయింది సుమా! అంత వరకే నాకు జ్ఞాపకం ఉంది. తర్వాత అనంగలీలా పారవశ్యంలో అతడెవడో? నే నెవ్వరినో? ఆ శృంగారం ఏమిటో? నాకు కొంచెం కూడా గుర్తులేదు సుమా! ఇంక ఏమని నీకు చెప్పేదాన్ని. అంత సంతోషం నాకు అతని సహచర్యల్లో కలిగింది" అని చెప్పింది.

ఆ ఓడ పదిరోజులకి సింహళద్వీపపు రేవు చేరుకుంది. అక్కడ వేచివున్న రాజకింకరులు ఓడలోని వస్తువాహనాలని రాజగృహంలోకి చేర్చారు. తరువాత రాజకుమారుడు రహస్యంగా మమ్మల్నొక ఉద్యానవనంలోని మేడలోకి తీసుకెళ్ళి ఉంచాడు.

మకరందుడు ప్రతిరోజూ వచ్చి వినోదించి వెళ్తూండే వాడు. అతడు యువరాజవడం వల్ల మారాక మరెవరికీ తెలియకుండా – గూఢచారులని నియమించాడు. అత నంతకుముందు వివాహం చేసుకున్న భార్యపేరు రోలంబ అట. మకరందుని కామెపై ప్రేమ తగ్గిపోతూ వచ్చింది. కొత్త ఎప్పుడూ వింతా, పాత రోతా కదా.

ఒకనాడు మకరందుడు మా ఉద్యాన వనానికి వస్తూంటే –ఆమె అతన్ని అనుసరిస్తూ... అక్కడక్కడ ఆగుతూ మా ఉద్యానవనం గుర్తుపెట్టుకుని వెళ్ళింది. నన్ది మేడమీంచి చూశాను. ఆ విషయం రాజకుమారుడికి చెప్పాలనుకుని – అంతలో మరోమాటల్లో పడిపోయి మర్చిపోయాను.

మర్నాడు ఉదయం మా ఇంట్లో పనిచేసే దాసివచ్చి – "అమ్మా! ఈ దేశంలో ఎరకల సానులు చక్కగా ఎరుక చెబుతారు. మన వీధిలోంచి ఒకతె – "మీకెరుక కావలెనా" అని అడుగుతూంది. నేను మిమ్మల్నడిగి చెబుతానని వచ్చాను. దానికేం చెప్పమంటారు?" అని అడిగింది.

అప్పటికి మారాజపుత్రిక నెలతప్పిందేమో అని అనుమానంగా ఉంది. అది తెలుసుకుందామని – దానిని రప్పించమన్నాను. దాసివెళ్ళి నిముషంలో దాన్ని వెంట తీసుకువచ్చింది. దానితో మరో చిన్నది – దాని కూతురట – అది కూడా వచ్చింది.

వాళ్ళనొక గదిలో కూర్చోబెట్టి – నేను రాజపుత్రిక వద్దకు వెళ్ళి చెప్పగా ఆమె – "నువ్వెక్కడి దానివి! అప్పుడే అలాటి వెర్రితలపులు పెట్టుకోకు." అని ఆక్షేపించినా బలవంతంగా చెయ్యిపట్టుకుని ఎరకలసాని ముందుకు లాక్కొచ్చాను. పొగవేయించాను. ఎరకలసాని ఆపొగ వాసన చూడడమేమిటి మామనసులోని మాట ఉన్న దున్నట్లు చెప్పింది.

మారాజపుత్రిక గర్భం దాల్చిందన్న సంతోషంలో దానికి మంచి బహుమానం ఇద్దామని నేను మేడమీదకి వెళ్ళాను. అప్పుడా చిన్నది – "అమ్మా! రోలంబరాణి మనల్ని చూసిరమ్మన్న దీ ఇల్లేనా?" అని అడిగిందట.

వాళ్ళ భాష కల్పవల్లికి తెలుసుకనుక, వాళ్ళువెళ్ళి పోయాక నా కది చెప్పింది.

అప్పుడు నేను కిందటి రోజు జరిగింది చెప్పి – "ఇది రోలంబ చేస్తున్న కుట్రలా ఉంది." అన్నాను. మకరందుడు అప్పుడే వచ్చాడు. అతని కావృత్తాంత మంతా చెప్పాను.

నా మాటలు విని అతను – "కావచ్చు నే నూరినుండి వచ్చినప్పట్నించీ నన్ను చురచుర చూస్తోంది. ఐతే మాత్రం మీ కేమిటి? ఊరినుంచి వచ్చి అంతా చక్కదిద్దుతాను. అంతవరకూ ఓపిక పట్టండి" అన్నాడు.

అది విని కల్పవల్లి ఉలిక్కిపడి – "అయ్యో! మీ రెక్కడికి వెళ్తారు? మీతో మమ్మల్నీ తీసుకుపొండి. మీరు లేకుండా మేమిక్కడుండలేం" అంది.

"కల్పవల్లీ! కుశద్వీపంలో కొందరు రాజులు దెబ్బలాడుకుని చివరకి సంధి చేసుకుని – రెండు తెగలవారూ మా తండ్రి చెప్పినట్లు

నడుచుకుందుకు ఒడంబడిక రాసుకున్నారట. ఆ తగవు తీర్చడానికి మా తండ్రి నన్ను కూడా తమతో రమ్మన్నాడు. వెళ్ళక తప్పదు. అత నుండగా మీరెలా వస్తారు? వేగమే వచ్చేస్తాను" అని మమ్మల్ని అంగీకరింప జేసి అతను వెళ్ళాడు.

మకరందుడు వెళ్ళిన కొద్దిరోజులకి రోలంబ కొందరు పరిచారికలను వెంటబెట్టుకుని మా ఉద్యానవనానికి వచ్చింది. ఆమెరాక వినగానే నేను కల్పవల్లి నొక గదిలో ఉంచి తాళం వేసి – దగ్గరలోనే కూర్చుని పూలు కట్టుకోసాగాను. రోలంబ ఉద్యానవన విశేషాలు చూసేదానిలా తిరిగి తిరిగి మావద్దకు వచ్చి – "ఇందులో ఎవరున్నారు?" అని అడిగింది.

అప్పుడు నేనులేచి నిలబడి నమస్కరించాను.

*రోలంబ* : నీవు ఎవరివి? ఏవూరు?

నేను : మాది జంబూద్వీపంలోని కాశీపట్నం. నేనొక వర్తకురాలిని. నాపేరు నాగమణి.

*రోలంబ* : ఈ దేశ మెందు కొచ్చావు?

నేను : వర్తకం నిమిత్తం.

*రోలంబ* : ఏం వర్తకం చేస్తావు?

నేను : రత్నాల వర్తకం చేస్తాను. మా వాళ్ళందరూ సరుకులు తీసుకొని గ్రామాలకి వెళ్ళారు.

*రోలంబ* : ఎప్పు డొస్తారు?

నేను : అదినాకు తెలియదు. సరుకులు అమ్మిన వెంటనే వస్తారు.

రోలంబ : ఈ సౌధంలో ఎవరి అనుమతితో ప్రవేశించావు?

నేను : ఈ సౌధ మెవరిదో వారి అనుజ్ఞనే తీసుకున్నాం.

*రోలంబ* : నువ్వు తిరస్కార భావంగా జవాబులు చెబుతున్నావు. నేనెవరినో ఎరుగుదువా? నీ ఆజ్ఞాపత్రి కేదీ?

నేను : మీకలా అనిపించిదేమో కాని నా మాటల్లో ధిక్కారంలేదు. ఆజ్ఞాపత్రిక మావారి వద్ద ఉంది

రోలంబ : ఈ గదిలో ఏముందో చూడాలి తాళం తీయించు

నేను . దీనిలో సరుకులు వేసుకుని మావాళ్ళు తాళం బిగించి ఎక్కడికో పోయారు కనక తాళం తీయడానికి నాకు స్వతంత్రం చాలదు.

రోలంబ . నీకు స్వతంత్రం లేదు కాని నాకుంది చూడు.

అంటూ ఏదో ఊదింది అప్పుడు ఆయుధాలు ధరించిన చాలామంది అక్కడికి వచ్చారు. వారిని చూసి నాకు వణుకు పుట్టింది. వారిచే ఆతాళం పగలకొట్టించి లోపలికి పోయి కల్పవల్లిని చూసి ఆమె అహంకారంతో - ఏమే బొంకులాడీ. దీనిలో సరుకులున్నాయని నాతో చెప్పావే. ఈ వగలాడి ఎవతె? మీ గురించి తెలియకుండా వచ్చాననుకున్నావా? ఇక మీపాట్లు చూసుకోండి. అంటూ మామాటలు లెక్క చెయ్యకుండా మా పాదాలకు సంకెళ్ళు వేసి మమ్మల్ని తీసుకుపోయి చెరొక జైల్లోనూ ఉంచింది.

అప్పటి మా దుఃఖం ఏమిని చెప్పేది? ఓదార్చడానికేనా ఒకరి కొకరు తోడు లేము. గర్భవతి అయిన రాజపుత్రిక అంతఃపురాలలో పరిచారికలు సేవలు చేస్తూంటే బంధువులతో కూడ ముఱిపెంగా విందులారగించవలసిన దానికి బదులు - చెరసాల్లో రాతినేలమీద పడుకుంటూ అంబలి కూడు తినవలసివచ్చింది! దైవనిర్ణయం ఎంతకరిసం!

కొన్ని నెల లయ్యాక - రోలంబ చెరసాలనుంచి మమ్మల్ని తన ముందుకి రప్పించుకుని - "మీరు మీదేశానికి పోవాలనుకుంటే చెప్పండి. ఇప్పుడే ప్రత్యేకంగా ఓడ ఏర్పాటు చేసి పంపిస్తాను. లేకపోతే మరో చెరసాలలో పెట్టిస్తాను" అంది.

మేము మకరందుని జాడ ఏమాత్రమూ తెలియక పోడంతో నిరాశ చేసుకుని - "వేగంగా పంపించండి" అన్నాం.

రోలంబ అంతకు మునుపే సిద్ధం చేసి ఉంచిన ఓడలోకి మమ్మల్ని రహస్యంగా చేర్చింది. మా ఓడ చాలా దూరం వెళ్ళేవరకూ రోలంబ ఒడ్డున నిలబడి చూస్తూనే ఉంది గాలి ప్రతికూలంగా ఉండడంతో మా ఓడ జంబూద్వీపం బదులు వ్యతిరేక దిశలో నిర్మానుష్యమైన ఒక దీవికి కొట్టుకు పోయింది. ఓడవాళ్ళు మమ్మల్ని అక్కడదింపి – గాలి అనుకూలంగా తిరిగేవరకూ మమ్మల్ని అక్కడ ఉండమన్నారు. భోజన పదార్థాలు సమృద్ధిగా ఉండడంవలన మే మక్కడ కొన్ని రోజులు సుఖంగా ఉన్నాం.

అంతలో కల్పవల్లికి ప్రసవవేదన ప్రారంభమైంది. నేను·చాలా భయపడుతూ దైవాన్ని ధ్యానించాను. ఆమె శుభలగ్నంలో ఒక కూతుర్ని కంది. నేనామెకు తగిన రీతిగా లోటు రానివ్వకుండా ప్రసవం జరిపించాను. చంద్రబింబంలా మెరుస్తూ ఆ పాప మా విచారాన్ని కొంతవరకూ పోగొట్టింది నావికులు కూడా – "త్వరలోనే మంచిగాలి వీస్తుంది" అని మమ్మల్ని ఓదార్చసాగారు.

అంతలో మరో ఓడ మా ఓడలాగే ఆ దీవికి కొట్టుకొచ్చింది దానిలోంచి మకరందుడు దిగి తీరాని కొచ్చాడు. మే మతని పాదాలపై పడి ఏడ్చాం. అతను మమ్మ ల్నోదార్చి జరిగినదంతా తెలుసుకున్నాడు. తనవృత్తాంతం ఇలా చెప్పాడు. "ద్వీపాంతరం నుంచి ఇంటికి రాగానే మిమ్మల్ని ఆ ఉద్యానవనంలో చూడక అక్కడున్నవాళ్ళని మీగురించి అడిగాను.

ఆ దుష్టురాలు రోలంబ వారికి కూడా చెప్పి ఉంచింది కాబోలు – "కొన్ని రోజులకిందట జంబూద్వీపం నుంచి ఓడరాగా వారు దానిలో తమద్వీపానికి వెళ్ళిపోయారు" అని చెప్పారు

నాకేంచెయ్యాలో తోచలేదు ఎందరినో అడిగాను. అందరూ అలాగే చెప్పారు.

నాలుగురోజు లుండి – మాతండ్రి వద్దకు వెళ్ళి కుశద్వీపానికి వెళ్ళినపని అవకపోయినా మిమ్మల్ని చూడాలని మరోపని కల్పించుకుని

వచ్చాను. అక్కడ రెండు నెలలుండి మాదేశం వచ్చాను. అప్పుడు మళ్ళీ మీ విషయమై ఆరాతీయగా...గూఢచారుల మధ్య ఏదో కలహం వచ్చి ఒకళ్ళ మీదొకళ్ళు నేరం మోపుతూ – చివరకు, జరిగిన వృత్తాంత మంతా చెప్పారు.

నేను చాలా విచారిస్తూ, ఎవరికీ చెప్పకుండా ఆక్షణంలోనే ఓడని సిద్ధం చేసుకుని బయలుదేరారు. దేముడి దయవల్లగాలి తోపు నన్నిక్కడికి తీసుకొచ్చింది. మిమ్మల్ని చూడగలిగాను. నావలన మీరు దారుణమైన కష్టాలనుభవించారు. నేనేం చెయ్యగలను? జరిగిపోయిన దానికి విచారించి లాభంలేదు. ఇప్పుడు మా దీవికి పోదాం.

కల్పవల్లిని పెళ్ళాడానని మాతండ్రికి చెప్పి పట్టమహిషిగా చేసుకుంటాను. మీ ఎదుటనే రోలంబకి సంకెళ్ళు వేయించి చెరసాలలో పెట్టిస్తాను" అంటూ మా విచారాన్ని తొలగించాడు.

మర్నాడు – మంచిగాలి విసరడం లేదని నావికులు చెబుతున్నా వినకుండా ఓడలు రెండింటినీ చాపలెత్తించి ప్రయాణం ప్రారంభించాడు. ఓడలు గాలి వాలులో వెళ్తూండడంతో మా ఓడలు చాలా వేగంగా పోయి నాలుగు రోజుల్లోనే జంబూద్వీపం సమీపించాయి. ఇంక ఒకగడియలో రేవు చేరతాం అని అనుకుంటూండగా ఒక సుడిగాలి వచ్చి మా ఓడని గిరగిర తిప్పి నీటిలో ముంచేసింది.

ఓడ మునిగేవరకూ నేను కల్పవల్లి కన్న శిశువుని చంకలో పెట్టుకుని ఉండి, నీటిలోపడడంతోనే శిశువును వదలక – దేముడి దయవల్ల దొరకిన బల్లని ఊతగా పట్టుకుని పైకితేలి మునపటి అలవాటు చొప్పున బిడ్డని మునగకుండా ఎత్తిపట్టుకుని నాశక్తికొద్దీ ఈద సాగాను. జీవి తాశవదలి దేవుణ్ణి ప్రార్థించసాగాను.

ఇంతలో ఒక చిన్న పడవ దైవికంగా మాకు దగ్గరగా వచ్చింది. అందులో ఒకస్త్రీ , పురుషుడూ కూర్చుని ఉన్నారు. దయామయులైన వారు మమ్మల్ని చూసి – ఆ పడవలో కెక్కించుకుని ఒడ్డుకి తీసుకెళ్ళారు.

నేను సేద తీర్చుకుని...చెక్కుచెదరకుండా ఉన్న బాలికను చూసి ఆశ్చర్యమూ ఆనందము పడుతూంటే వారు నా వృత్తాంతం అడిగారు. నేను సమయోచితంగా చెప్పి నావారిగురించి విచారిస్తూంటే - అతను -

"మాదికాశీపట్నం. నాపేరు విష్ణుశర్మ. నేను బ్రాహ్మణుణ్ని. నాకు చాలా డబ్బుంది. ఈ బాలికను మాకిస్తే ప్రాణంలా పెంచుకుంటాం. నువ్వూ మాదగ్గర ఉండొచ్చు. ఏలోటూ ఉండదు" అన్నాడు:

నేనాలోచించాను. పరమనిర్భాగ్యురాలినైన నాకీ శిశు వెందుకు? - అనుకుని - ఏడుస్తూ అప్పుడే ఆ పసికూనని వారిచేతుల్లో ఉంచాను ఆ మర్నాడే అతను శిశువుని తీసుకుని వాళ్ళవూరు వెళ్ళిపోయాడు.

నే నాశవదలకుండా కల్పవల్లి మకరందులకోసం వెదుకుతూ సముద్ర ప్రాంత పట్నాలన్నీ తిరగసాగాను. నా గ్రహచారమెంత క్రూరమైనదో చూడండి.

ఒకనాడు నేను వారి గురించి తెలుస్తుందేమో అని కలిఘాతా నగరానికి వెళ్ళాను. రాజపుత్రి ధరించే నవరత్న కంఠాభరణ మొకటి నావెంట ఉంది. దారిభత్యం కోసం నేను దాని నంగడిలో అమ్మజూపాను.

రాజభటులది చూసి - "ఇంతవిలువైన ఆభరణం నీకెలావచ్చింది?" అని అడిగారు.

నిజం చెబితే ప్రమాదమని ఏదో అబద్ధం కల్పించి చెప్పాను. వారు నామాటలు నమ్మక వస్తువుతో సహా నన్ను రాజాస్థానానికి తీసుకుపోయారు.

రాజు ఆ నగ తనకూతురు ధరించినదిగా గుర్తుపట్టి అది నాకెలా వచ్చిందని అడిగాడు. నిజంచెబితే రాజపుత్రి దుశ్చరిత్ర లోకానికి తెలియడం కంటె మరేప్రయోజనమూ ఉండదని - దారిలో దొరికిందని చెప్పాను అతను నామాటలు నమ్మలేదు. నామీద కోపించి యావజ్జీవ కఠిన కారాగారవాసం విధించాడు. చావుకేతెగించిన నాకా దండన ఏమాత్రమూ విచారం కలగ జెయ్యలేదు. పైగా సంతోషమే కలిగింది.

రాజభటులు నన్నప్పటి కప్పుడే తీసుకుపోయి చెరసాలలో ఉంచారు. పధ్నాలుగు సంవత్సరాలపాటూ శిక్ష అనుభవించాను. అప్పుడొక రోజు రాజభటులు నాదగ్గరకొచ్చి సంకెళ్ళు తీసి నన్ను గౌరవంగా రాజుగారి అంతఃపురానికి తీసుకెళ్ళారు అక్కడ నాకోసం ఎదురు చూస్తున్న కల్పవల్లి కనిపించింది! నా అవస్థ చూసి ఆమె గొల్లున ఏడుస్తూ నన్ను కౌగలించుకుంది. ఆమె నన్నోదార్చుతూ..."సఖీ! నువ్వెలా బతికావు? నా కంఠాభరణం గుర్తుపట్టి నిన్ను చెరసాలలో పెట్టారట! నిజమెందుకు చెప్పావు కాదు?" అంటూ ప్రశ్నించింది. నేను కూడా "మీ రెలా బతికారు? ఇక్కడికెలా వచ్చారు? నీ ప్రియు డెక్కడున్నాడు?" అని ఆమె నడిగాను.

"ఆ ఓడ మునిగేవరకూ మేమిద్దరం ఒక శయ్యమీద కూర్చుని సంగీతం పాడుకుంటున్నాం కదా. ఓడ మునిగిపోయాక ఆశయ్యే మాకు తెప్ప అయింది. దాని ఆధారంగా సముద్రంలో మునగక గాలివాటంగా కొట్టుకు పోయాం. అంతలో ఒక ఓడ మా దగ్గరకు వచ్చింది. ఆ నావికులు మమ్మల్నిచూసి దానిలోకి ఎక్కించుకున్నారు. ఆ ఓడ మన రాజకుమారు డెక్కివచ్చినదే! వాళ్ళు మమ్మల్ని గుర్తుపట్టారు. పదిరోజుల్లో సింహళద్వీపానికి చేర్చారు.

అతని రాక కోసం ఎదురుచూస్తున్న సింహకేతుడు కుమారునకు సంభవించిన దానికి చాలా విచారించి అప్పటికప్పుడే పట్టాభిషేకం చేశాడు.

రోలంబ చేసిన ఘోరకృత్యాలన్నీ తండ్రికి చెప్పి ఆమెను చెరసాలలో పెట్టిస్తానంటే - నేను విరమింప జేశాను. నేను భోగాలనుభవిస్తున్నాను కాని నువ్వులేక పోయావనీ, ఉంటే ఎంత సంతోషించే దానవో అనీ చింతిస్తూ గడపసాగాను.

కొన్ని సంవత్సరాలు గడిచాక నాకు నాతల్లి తండ్రులని చూడాలని పించింది. నేను కోరగానే సహృదయుడైన నా భర్త చతురంగ సేనలతో అప్పుడే ఓడలు సిద్ధం చేయించి ప్రయాణమయ్యాడు. మొన్నను ఈ పట్నం చేరాం.

ఈ సన్నాహమంతా చూసి నా తండ్రి శత్రుసైన్య మనుకుని సంధికి రాయబారం పంపాడు.

అప్పుడు మేము "శత్రువులం కాం. ఆప్తులం. నిన్ను చూడాలనివస్తున్నాం" అని జవాబుపంపాం. అతను సంతోషిస్తూ కానుకలతో మావద్దకు వచ్చాడు. మే మతనికి నమస్కరించి నిలబడగా అతనేమీ మాట్లాడకుండా ఊరికే చూడసాగాడు.

అప్పుడు మకరందు డాయనను – "ఈమెవరో తెలుసునా?" అని అడిగాడు.

అంతలో నేను – "తండ్రీ! నన్నే మరచిపోయావా?" అని అతని మీదపడి ఏడ్చాను.

ఆయన నన్ను గుర్తుపట్టి ఊరడించి కోటలోకి తీసుకెళ్ళి నాతల్లికి చెప్పాడు.

ఈరెండు రోజులూ గడచినవన్నీ చెప్పుకుని గడిపాము. ఏదో ప్రసంగ సందర్భంలో నా కంఠాభరణం అమ్మజూపిన స్త్రీ విషయం వచ్చింది. ఆ మాట విని నేనదిరి పడి నిన్ను తీసుకురమ్మని దూతలను పంపాను. దైవానుగ్రహం వలన మన మందరమూ బతికి ఒకచోట చేరుకున్నాం. ఈ రోజుఎంత మంచిరోజో! అని సంతోషిస్తుండగా మకరందు దక్కడికి వచ్చి నన్ను చూసి ఆశ్చర్యపడుతూంటే –

ఓడ మునిగింది మొదలు నాటివరకూ జరిగిన విశేషాలు చెప్పాను.

నామాటలు విని వారా పాపను చూడడాని కప్పటికప్పుడే కాశీకి పోవాలని సన్నాహాలు చేస్తుంటే నేను వారిని వారించాను "మీరిలా పెద్దఎత్తున పోతే ఆ బాలిక వృత్తాంతం ఎవరూ చెప్పరు. ఆ బాలి కీ పాటికి పదహారేళ్ళ వయసు కలిగి వుంటుంది. నేను పోయి రహస్యంగా కనుక్కుని మీకు వార్త పంపుతాను. అంతవరకూ ఇక్కడుండండి. మా మంత్రి పుత్రిక కూడా ఆ ప్రాంతమందే ఉండి వుండాలి. ఇద్దరి గురించీ వాకబు చేస్తాను నన్ను పంపండి" అన్నాను.

వాళ్ళు నన్ను వెంటనే పంపించారు. చాలినంత డబ్బుతో, శుభముహూర్తంలో బయలుదేరి గంగానదీ తీరంలో ఉన్న అన్ని పట్నాలూ చూస్తూ చివరి కొక పట్నం చేరుకున్నాను

గంగానదిలో కొట్టుకుపోతున్నప్పుడు పల్లెవాడు శిశువుని తీసుకుపోయి గట్టెక్కిన గ్రామ తీరంలో వృక్షాలలో కొన్ని గుర్తున్నాయి. కనక ఆ రేవులో అలాటి చెట్లని చూసి ఆ వూళ్ళో కొన్నాళ్ళున్నాను. గంగానదిలో ఈదే పల్లెవాళ్ళ ఇళ్ళకి పోయి వాళ్ళతో స్నేహం చేసి ఆడవాళ్ళకి కానుకలిచ్చి - "కొన్నేళ్ళ కిందటి గంగలో కొట్టుకొచ్చిన పిల్లని తీసిన పల్లెవా డెవరు?" అని అడగసాగాను

అలా అడగ్గా అడగ్గా ఒక ముసిలిది నేనిచ్చిన పారితోషికానికి సంతోషిస్తూ - "అమ్మా! నువ్వడిగిన రహస్యం నాకు తప్ప మరెవరికీ తెలియదు. నాకు జ్ఞాపకం వొస్తూంది. నాకొడు కొకనాడు గంగలో కట్టెలకై ఈదుతూ ఒక ఆడది శిశువుతో కొట్టుకుంటూ పోవడం చూసి బాలికను మాత్రం తెప్ప మీద ఎక్కించుకొచ్చి ఆవిషయం చెప్పి శిశువుని చూపెట్టాడు.

బంగారు తీగెలా మెరిసిపోతున్న ఆ బాలికను చూసినే నాశ్చర్యపడుతూ - "దీన్ని మనం పెంచలేం. కలవారి బిడ్డలా ఉంది. మన పొరుగునున్న మనోరంజనికి సంతానం లేదు కనక తగిన సొమ్మిస్తే దాని కిచ్చేద్దాం. అడిగిరా" అని పంపాను.

వాడుపోయి - అంతా దానికి చెప్పాడు. అది సంతోషించి మాఇంటికి వచ్చి... శిశువుని తెగముద్దు లాడుతూ అప్పుడే తన ఇంటికి తీసుకుపోయింది. మేము కోరినంత ధనమిచ్చి ఈ రహస్యం ఎవరికీ చెప్పవద్దని మాచేత ప్రమాణం చేయించుకుంది. కొన్నాళ్ళకి నాకొడుకు జలగండంతోనే చనిపోయాడు. నేను అనాధనయ్యాను" అని ఏడిచింది.

"అమ్మా. ఈ పాటి కా పాపపెద్ద దౌతుందే ఇక్కడే ఉందా?" అని అడిగాను.

"అబ్బో! ఆ బాలిక చాలా పేరు పొందింది. మనోరంజని దానికి మందారవల్లి అనుపేరు పెట్టి నాలుగేళ్ళొచ్చేవరకూ ఎవరికీ చూపించకుండా ఎంతో గారాబంగా పెంచింది

సంగీతం, సాహిత్యం మొదలైన అన్ని విద్యల్లోనూ గురువుల వద్ద శిక్షణ యిప్పించి ప్రవీణురాలిని చేసింది. ఆ చిన్న దతి తెలివైనది. గురువులకే తప్పులు దిద్ద గలదని అందరూ చెప్పుకునేవారు. ఇక్కడి విద్వాంసులు చాలక మందారవల్లిని కాశీపట్నం పంపింది ఆమె ఇప్పుడు చక్రవర్తులకి సైతం దర్శన మివ్వదని చెబుతారు. మనోరంజని నాలుగేళ్ళ కిందట చనిపోయింది. కనపడేదే దాని మేడ పాడు పడిపోయింది" అంది ముసిలిది.

నేను అక్కడి నుంచి బయలుదేరి రెండు రోజులకి కాశీ వెళ్ళాను. మందారవల్లి అక్కడ పదహారేళ్ళు వచ్చే వరకూ విద్యాభ్యాసం చేసి అన్ని విద్యలలోనూ అసమాన పాండిత్యం సంపాదించి శిష్యురాళ్ళను వెంట బెట్టుకుని దేశాటనం చేస్తూందని తెలిసింది.

తరువాత నేను విష్ణుశర్మగురించి కనుక్కుంటూ గుర్తుల నడిగి అతనింటికి వెళ్ళాను. అక్కడొక బ్రాహ్మణుడు కనపడగా "ఇది విష్ణుశర్మగారి ఇల్లేనా?" అని అడిగాను

"ఇది ఆయన ఇల్లేకాని ఆయన చనిపోయి పదేళ్ళవుతూంది. అతనికి భార్యాపుత్రులు లేరు. మేము దాయాదులం కనక ఈ యిల్లు మావశమైంది" అన్నాడాయన.

"అయ్యో! ఎంత కష్టం! కొన్నేళ్ళ కిందట ఆ దంపతులు హేలాపురినుంచి ఒక బాలికని తీసుకొచ్చారు. ఆ బాలికేమైందో?" అని అడిగాను.

"నువ్వెవరివి? వారి ఆంతరంగిక విషయం అడుగుతున్నావు? హేలాపురి నుంచి వచ్చిం దతని భార్యకాదు. ఒక వారకాంత. దానిపేరు మంజుభాషిణి. విష్ణుశర్మ భార్య చిన్నతనంలోనే చచ్చిపోయింది. ఆ మంజుభాషిణినే భార్యగా చూసుకుని తన సొత్తంతా దానికి ధారపోశాడు. ఎరగనివా రామె అతని భార్యనుకుంటారు.

అతను చనిపోయాక దినవార కృత్యాలకై ఈ ఇల్లు మాకిచ్చింది. అందువల్ల మేమిందులో ఉన్నాం. హేలాపురి నుండి తీసుకువచ్చిన చిన్నది

చక్కగా ఉంది దానికి ప్రియంవద అని పేరుపెట్టి విద్యాబుద్ధులు నేర్పించి పెద్ద చేసింది మహావిద్వాంసురాలని పేరున్న మందారవల్లికి ప్రధానశిష్యురాలిగా ఆమెతో ఇప్పుడు దేశాటనం చేస్తూందని విన్నాను. దానిని పెంచిన మంజుభాషిణి మరణించింది. నాకు తెలిసిన దింతే" అన్నా డాయన

నేను సంతోషిస్తూ ఆయనకి నమస్కరించి - మరికొందరి నడిగాను. వాళ్ళు కూడా ప్రియంవద కథని ఆయన చెప్పినట్లే చెప్పారు.

నేను వారిద్దరి జాడా వెదుకుతూ కొన్నిరోజులు దేశాటనం చేశాను. మందారవల్లి పేరు ప్రపంచమంతా వ్యాపించింది కృష్ణదేవరాయల ఆస్థానకవులతో ప్రసంగించడానికి విజయనగరం వెళ్ళిందని తెలిసి అక్కడికి పోయాను. అక్కడ కపటంతో ఆస్థాన కవు లామెను ఓడించి వస్తువాహనాలన్నీ లాక్కొనగా తగవుకి ఢిల్లీ పట్నం వచ్చిందని విన్నాను ఆ విషయం విని నేనెంతో సంతోషిస్తూ వాళ్ళని చూడడ్డాని కిక్కడికి వచ్చాను. ఇక్కడ మీరు కనిపించారు. జరిగిన వృత్తాంతం ఇదే

భగవంతుని దయవలన నాచేత పెంచబడిన బాలిక లిద్దరూ ఒకేచోట పెరిగి విద్యల్లో ప్రౌఢలయ్యారని విని నేను పట్టలేనంత ఆనందంగా ఉన్నాను. వాళ్ళిక్కడికి వచ్చే ఉంటారు మీ బంధుత్వం తెలియక ఎక్కడో ఉండి ఉంటారు" అని కళ్ళంట నీళ్ళు పెట్టుకుంది. నాగమణి.

అదివిని - సుప్రభ సంతోషం పట్టలేక కొంతసేపు ఉక్కిరిబిక్కిరై - తరవాత తేరుకొని - "నాగమణీ. నువ్వు చెప్పిన కదంతా నిజమే. ఇది కలకాదు కదా! ఏదీ ..మళ్ళీ చెప్పు కాశీలో వారు నీతో ఏం చెప్పారు? జీవించే ఉందని చెప్పారా! అయ్యో! తను క్షత్రియ పుత్రిక అని తెలియక వారకాంతలా దేశాటనం చేస్తోందా!" అని విచారించింది.

అప్పుడు విజయవర్మ అవృత్తాంతమంతా వివరంగా తెలుసుకుని - "ఔను మందారవల్లి తగవు గురించి రాయలవారి ఆస్థానం

నుండి పత్రికలు మా సభకు వచ్చాయి. ఇంకా పరిశీలించలేదు. నువ్వు తొందరపడకు నేనంతా పరిశీలించి రప్పిస్తాను. ఆమె వారకాంత అనిపించుకున్నా శీలం కాపాడుకుంటూంది ఇదే మేలు" అంటూ భార్య నూరడించి - నాగమణిని చాలా గౌరవించాడు

మంగమణి ప్రియంవదతో - "మనవృత్తాంతం సుప్రభతో చెప్పుకుందుకు ఎప్పుడూ ఏదో ఆటంకం వస్తూంది. మంత్రిగారు వెళ్ళారేమో చూసిరా ఆమె తన కష్టాలను మనతో చెప్పుకుంది. దుఃఖంలేని వారుండరు కదా! పుట్టిన ఒక్క పుత్రికా గంగలో పడిపోయింది. మళ్ళీ సంతానం కలగలేదు. కావలసినంత సంపదుంది ఏం చేసుకుంటారు? దేము డెవరినీ సుఖంగా ఉండ నివ్వడు" అంది.

ప్రియంవద అంతఃపురంలోకి పోయి తొంగిచూసివచ్చి - "వారింకా అక్కడున్నారు. సుప్రభ ఏం వార్తవిందో, కళ్ళంట నీళ్ళు పెట్టుకుంటూంది. భర్త ఓదార్చుతున్నాడు. విదేశవార్త లేవైనా తెలిశాయేమో తొందరపడొద్దు..." అని మంత్రిగా రక్కడి నుంచి వెళ్ళాక మళ్ళీ సుప్రభ దగ్గరకు వెళ్ళింది.

"అమ్మా! మీరెందుకిలా విచారంగా ఉన్నారు? విదేశవార్త లేమైనా తెలిశాయా?" అని మెల్లగా అడిగింది."

సుప్రభ తలెత్తి - "అడుగంటి వున్న నాదుఃఖాన్ని నాగమణి వచ్చి పైకి తోడింది. ఇందాక మీతో గంగలో పడినదని చెప్పిన నాగమణి ఇదే. గంగలోపడి కొట్టుకుపోయి ఎక్కడో వొడ్డుచేరి సుఖదుఃఖాలనుభవించి వచ్చిందట. నాబిడ్డ కూడా జీవించే ఉందని చెబుతూంది" అని - నాగమణి చెప్పిన వృత్తాంత మంతా సుప్రభ మంగమణికి చెప్పింది.

ఆ కథవిని - మంగమణి ప్రియంవద ముఖం చూస్తూ "ఏమీ సమాధానమికవ్వక - ప్రియంవదతో అవతలికి పోయి ఆశ్చర్యం అణచుకోలేక "మనచరిత్రలిలా ఉన్నాయేం! ఇది కల్పితం కాదుకద? కాదు...నిజమే. మనం క్షత్రియ కన్యలమని తెలుసుకోక వారకాంతల మనుకుని కులాని కపఖ్యాతి తెచ్చాం. అయ్యో! వీళ్ళు నా తల్లితండ్రులు!

నీ తల్లితండ్రులు కలిఘూతా పురంలో ఉన్నారు. మనకోసం ఈ నాగమణి ఎన్ని కష్టాలు పడిందో! దాని రుణం ఎప్పటికీ తీర్చుకోలేం. ఇప్పుడు వీళ్ళు ఎలా భావిస్తారో చూసి - తరవాత మనం చెబుదాం. ఆహా! దైవసంఘటన లెంత విచిత్రం! మనం చేసిన పనులలో చెడ్డవేమైనా ఉన్నాయేమో ఆలోచించు. నాకైతే ఏమీ జ్ఞాపకం లేదు" అని వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటూంటే - సుప్రభ అక్కడికొచ్చి - "అక్కడుండక వచ్చేశారేం? మా అమ్మాయి కథ బాగులేదు కాబోలు. నేనేం చెయ్యగలను? అదలా ఉంచి ... మీరు వచ్చిన పనేదో చెప్పండి. నాలుగురోజులైనా వినడానికే అవకాశం కుదరలేదు. ఎలాటి పనయినా మావారిని ప్రార్థించి చేయిస్తాను" అంది.

మంగమణి చిరునవ్వుతో - "మీపుత్రిక మందారవల్లిని నే నెరుగుదును. ప్రియంవద ఎరుగుదును. వారి చరిత్రలు విని ఆశ్చర్యపోతున్నాం. వారూ మేమూ కలసి కొంతకాలం దేశాటనం చేశాం వారే మేముగా సంచరించాం. వాళ్ళమీద మీ అభిప్రాయ మేమిటి? వాళ్ళొస్తే మీరు స్వీకరిస్తారా?" అని అడిగింది.

"అయ్యో! నా ప్రాణాలయిన ముద్దుల కూన లెప్పుడొస్తారా, చూద్దాం, అని ఎంతో ఆత్రంగా ఎదురు చూస్తున్నాను. స్వీకరిస్తారా అని అడుగుతావేం? మా అమ్మాయిని మీరెక్కడ చూశారు? ఎలా ఉంది? మా విషయం తెలియక తన కన్నతల్లి మనోరంజని అనే చెబుతుంది నిర్దయురాలయిన ఈ పాపాత్మురాలి నెరుగదు - " అని ఆమె విలపించ సాగింది.

ఆమె దుఃఖంచూడలేక - "తల్లీ! నీకింత శోకం కలగజేసిన కష్టాత్మురాలిని నేనే. ఈమే ఆప్రియంవద" అంటూ ఆమెను కౌగలించుకుంది. అప్పుడు సుప్రభ, నాగమణి, అంతఃపుర కాంతలూ ఆ మాటలువిని అమితాశ్చర్యపోతూ - మంగమణినీ, ప్రియంవదనీ కౌగలించుకుంటూ...వారిముసుగులు తీసి వారి రూపవయో లావణ్యాలకు ముగ్ధ లౌతూంటే -

ఆ వార్త విని మంత్రి అక్కడికి వచ్చి వారి వృత్తాంతమంతా విని - సంతోషం పట్టలేక, కళ్ళనిండా ఆనంద బాష్పాలతో వారిని దగ్గరగా తీసుకుని వారి విశేషాలు మళ్ళీ మళ్ళీ విన్నాడు.

కొంతసే పయ్యాక మందారవల్లి - "తండ్రీ మా తగవు గురించి నువ్వు వినే ఉంటావు. నన్ను రామలింగకవి లవిత్ర అనే పేరుతో వచ్చి కపటంతో జయించాడు. శాపకారణంగా, ఎదురునిలిచి నేను వాదించలేను. అది అతని కెలాగో తెలిసిం దనుకుంటాను. ఇప్పుడు మేమేం చెయ్యాలి? వేశ్యల మనుకుని ఇలాటి వాదాలకు పూనుకున్నాం. మేము ఓడిపోతే అనేక చిక్కులొస్తాయి. ఎలాగైనా మేము గెలిచేటట్లు చూడు" అని ప్రార్థించింది.

అత నప్పటి కేమీ చెప్పకుండా వాళ్ళనోదార్చి కొత్త నగలూ బట్టలూ ఇచ్చి ఆ రోజు గడిపాడు.

మర్నాడు సాయంకాలం అంతఃపురంలో కూర్చుని తన కుమార్తెలను రప్పించుకుని - "ఈ రోజు మోహనచంద్రుడు మీ తగవు విచారించాడు విజయనగరం నుంచి తెనాలి రామలింగకవి వాదించడానికి వచ్చాడు. తన వాదమంతా అధికారికి చెప్పాడు. మీ తరపున నేను గట్టిగా వాదించాను. కాని చక్రవర్తి అభిప్రాయం వారి పక్షంగా ఉంది. నువ్వు స్త్రీలతో సంభాషించినట్లు సాక్ష్యం చూపుతున్నారు. మన వాదం నిలబడదని మనకే తెలిసిపోతూంది.

శాప లోపం మనని బాధిస్తుంది కాని వాళ్ళకేం? నీ వృత్తాంతం పాదుషా వారికి రహస్యంగా చెప్పి తగవును ఎల్లుండి వరకూ వాయిదా వేయించాను. నువ్వోడితే - అతన్ని కాపాడే రాజు ఆజ్ఞ చొప్పున నడుచుకుంటానని రాశావు. దాని అర్థమేమిటి? నీ అభిప్రాయం చెప్పు. గెలిచిన పండితుని పాలించేవాడి ఆజ్ఞ ప్రకారం నడవడ మేమిటని పాదుషావా రాక్షేపించారు. దీనిలో అంతరార్థ మేదైనా ఉందా?" అని అడిగాడు

అందుకు మందారవల్లి - "అప్పటి ఆలోచన లిప్పుడేం పనికొస్తాయి? నే నెవ్వరి చేతా ఓడనని - దరిద్రులైన విద్వాంసుల

నుంచి ధనం ఆకర్షించ కూడదని రాజులనే ముఖ్యులుగా ఎంచాను. అదే విషమించింది. దీనికి సాధనం మీరే ఆలోచించండి" అంది.

"ఆ మహారాజు చాలా ప్రఖ్యాతి కలవాడు కదా. పోనీ అతన్ని పెళ్ళాడతావా? అప్పుడే సమస్యా ఉండదు. దీన్లో తప్పులేదు" అన్నాడు.

"తోవలో రామకవికి పత్నిగా నటించాను" అందామె.

అప్పుడతను మరింత విచారించి "రేపు చూద్దాం" అని ఆలోచనా మందిరానికి వెళ్ళిపోయాడు.

మర్నాడు ఉదయం సుప్రభ మంగమణిని పిలిచి – "అమ్మా! నీ తండ్రికి రాత్రంతా నిద్రలేదు. నీ విషయం గురించే ఆలోచించారు పాదుషాగారు రేపు నువ్వోడిపోయినట్లు ఉత్తరం ఇస్తారట. అప్పుడు నువ్వు కృష్ణదేవరాయలుకి దాదివై ఉండాలి రామకవి, సుభద్రుడు ఎక్కడున్నారు? వాళ్ళనెందుకు వదిలి వచ్చారు? వాళ్ళని రప్పించా లనుకుంటున్నారు. నాకేమీ తోచకుండా ఉంది. కులం తెలియక పోవడంవల్ల ఇన్నిపాట్లు వచ్చాయి. దీనంతటకీ మూలమైన రామలింగకవినే ప్రార్థిస్తే అతనేదో ఒక ఉపాయం చెబుతాడు" అంటూంటే – వీధిలోంచి నాగమణి పరుగెత్తుకొంటూ వచ్చి – "అమ్మా. ఇప్పుడు మన వీధిలోంచి తెనాలి రామలింగకవిట. పదిమంది బ్రాహ్మణులు చుట్టూ ఉండగా వస్తున్నారు. దుష్టవర్మ అనే సామంతరాజుకి అద్భుతపురాణం చెప్పి మోసపుచ్చాడట. ఆ తగవీ వేళ విచారించి మోహనచంద్రుడు చాలా మెచ్చుకుంటూ అతని పక్షమే తీర్పు చెప్పారట. అతని మెడలో పూలదండలు వేసి బ్రాహ్మణులు స్తోత్రాలు చదువుతున్నారు. ఎవరో ఎదురు పడితే మాట్లాడుతున్నారు. మనమేడమీదకి పోయి చూస్తే కనపడతారు" అంది మంగమణి ప్రియంవద, సుప్రభ, నాగమణి – నలుగురూ మేడమీదకి పోయి కిటికీలలోంచి చూశారు.

అప్పుడు మంగమణి – "ప్రియంవదా! ఇతను మనరామకవి లాగే ఉన్నాడే. ఔను. ఆ నడకే చెబుతూంది. అతని చూపులూ అంతే" అనే సరికి..

"ఔను నిజమే. అవతలి పక్క సుభద్రు దున్నాడు. నువ్వతన్ని గుర్తుపట్టలేదు కాబోలు. నాగమణి అతన్ని రామలింగకవి అందేమిటీ? పొరపాటయి వుండొచ్చు. రామకవి ఇక్కడి కెందు కొచ్చాడో?" అంది ప్రియంవద.

"మంగమణి పని ఉందికదా ..మనకోసం రాకూడదా? నాగమణీ అతనిపేరు నువ్వేమని విన్నావ్?"

"రామలింగకవి అని-"

"వెళ్ళి అతని పేరు స్పష్టంగా తెలుసుకు రా" అని ఆమెను పంపింది.

"ప్రియంవదా! నాకు మరో ఆలోచన వచ్చింది. అది నిజమైతే ధన్యులమే. రామలింగకవే రామకవినని చెప్పి మనని మళ్ళీ మోసం చేశాడేమో. ఇతరుల కింత బుద్ధి సూక్ష్మత ఉండదు" అని మంగమణి అంటూంటే - నాగమణి వచ్చి - "అతను నిశ్చయంగా రామలింగ కవే. మరోవింతకూడా వినొచ్చాను. నిన్నమీరు చెప్పిన అవ్వని మోసం చేసిన వాడితనేనట. రాజసభలో ఆ అవ్వ దుఃఖాన్ని చూసి రామలింగ కవి మోహన చంద్రుడితో నిజం చెప్పి ఆ సొమ్ము తానిస్తానని అవ్వను విడిపించేడట. మీ వాదం మాటరాగానే రేపు నిరూపిస్తా నన్నాడట. నేనక్కడ చాలాసేపే ఉన్నాను. అతను రామలింగ కవే" అంది.

ఆ మాటలు విని మంగమణి - "ప్రియంవదా! మంచివార్త విన్నాం. మన చిక్కులు తీరేయి. మొదటినుంచీ రామలింగ కవి పేరువిన్నప్పుడల్లా నా మనసులో అదోవింత ఆనందం కలిగేది. ఈ వార్త నాతండ్రికి చెప్పి వారి నీరాత్రి విందుకు పిలిపిస్తాను. అప్పుడు వారితో మాట్లాడవచ్చు" అని అప్పుడే తండ్రివద్దకు పోయి ఆ వృత్తాంతం చెప్పింది.

విజయవర్మ రామలింగ కవినీ అతని మిత్రుణ్నీ విందుకు పిలిచాడు. అందరూ భోజనం చేస్తూంటే - మందారవల్లి, ప్రియంవద వింతగా అలంకరించుకుని... పట్టుచీరలు కట్టుకుని, పంక్తులమధ్య తిరుగుతూ కొసరి కొసరి వడ్డించసాగారు. వారి చమత్కారపు మాటలకు రామలింగ కవి చాలా ఆశ్చర్యపోయాడు.

కొంతసే పయ్యాక మందారవల్లి ఒకమూల నిలబడి... "తండ్రీ! రామలింగకవిగారి ప్రఖ్యాతి వినడమేకాని వారిని చూసి ఉండలేదు. నేడు సుదినంగా భావిస్తున్నాను. ఈయన మందారవల్లి నోడించానని చెప్పారు. ఏ విద్యలో ఓడించారు? లవిత్ర ఓడించిందని కొందరన్నారు. ఆమె ఎవరు? - ఇది తెలుసుకోవాలని చాలా కుతూహలంగా ఉంది. చెప్పి తీరాలి" అంటూ తండ్రి ముఖం చూసింది. విజయవర్మ రామలింగ కవి ముఖం వేపు చూశాడు.

అప్పుడు రామలింగకవి - ఓహో! ఈమె మందారవల్లిలా ఉందే! మంత్రిని తండ్రీ అనిపిలుస్తూంది! ఈ బంధుత్వమెలా కలిసిందో? బ్రాహ్మణులకీ వేశ్యలకీ సంబంధా లుంటాయా? ఈమె నిశ్చయంగా మందారవల్లే. ఇది చాలా వింతగా ఉంది" అని ఆలోచిస్తూ మంత్రి మాటకి జవాబు చెప్పకుండా ఉండిపోయాడు.

అప్పుడు సుభద్రుడు - "అయ్యా! మందారవల్లిని జయించ డానికి విద్యలవరకూ పోనక్కర్లేదు ఇతను మాటలోనే ఆమెను నిరుత్తరురాలిని చేశాడు. లవిత్ర అంటే ఇతని శక్తే" అని సమయాను కులంగా చెప్పాడు.

రామలింగకవి ఈ మాటలను మనసుని పట్టించుకోక - ఆమెను చూస్తూ - మోహపరవశుడై - మందారవల్లే అని నిశ్చయించుకుని ఆలోచనలలో భోజనం చెయ్యడం కూడా మరిపోయాడు.

మందారవల్లి అతని మనసులోని కోరిక గ్రహించి - భోజనానంతరం రత్నకంబళి మీదకూర్చుని - మిగిలిన వారందరూ తాంబూలాలు. వేసుకుంటూ కబుర్లు చెప్పు కుంటూంటే - పన్నెండేళ్ళ వయసుకల చిన్నదాని కొక పద్యం చెప్పి - సంగీతం పాడించే నెపంతో వారి వద్ద చదివి రమ్మంది.

ఆ బాలిక వారి వద్దకు పోయి - దిగువ అర్థం వచ్చే పద్యం చదివింది.

'దాది హస్తాలలో ముద్దుముద్దుగా పెంచబడే రాజకుమార్తె సముద్రంలో పడిపోయింది. అందులో మునిగిపోకుండా తీరానికి చేర్చబడి

ఒకవార కాంతకు అమ్మబడింది. వేశ్య పెంపకంలో పెరిగి పెద్దదయికూడా తమ కులవృత్తిని చేయకుండా సకల విద్యలనీ నేర్చి దేశదేశాలూ తిరిగింది. సంపాదించిన సంపదంతా ఒకనాడు కోల్పోయి, ఒక బ్రాహ్మణునికి భార్యగా నటించి ఎన్నోఘనమైన దానాలను అందుకొంది. చిట్టచివరకు తన తల్లితండ్రులను చేరుకొంది. ఇదంతా దైవమహిమ కాదా!?" అని వీణమీద పద్యం పాడిన బాలిక చివరి రెండు చరణాలూ చదవడం మరిచి పోయింది.

ఆ పద్యం వినేసరికి రామలింగకవిలోని అనుమానం తొలగిపోయి - ఆశ్చర్యం కలిగింది. ఆమె చరిత్రంతా పద్యంనుంచి గ్రహించి - "చిత్రమిది చిత్రమిది సుచిత్ర -" అని చదివాడు. అలాగ అతను మూడోపాదం చదవగానే సుభద్రుడు - "చిత్రమిది చిత్రమిది కదు విచిత్ర మిదియ"- అని నాలుగవ పాదం చదివాడు. తానురచించిన పాదాలే వారు చదవడంవిని, తెరచాటునున్న మందారవల్లి మనసు పొంగిపోయింది. ఆమాటే ప్రియంవదకు చెప్పి - ఇక ఆగలేక - తెరవెనుక నుంచి ముందుకు వచ్చి రామలింగకవి మెడలో పూలమాలను వేసింది. ఆయనకు నమస్కరిస్తూ - "అయ్యా! పూర్వం భోజరాజు తన సమస్యను పూర్తిచేసిన వారికి అక్షరలక్ష లిచ్చేవాడట. నే నీమాలను సమర్పించాను. ఈ దండను నా హృదయానుబంధంగా భావించండి" అని పలికి ఒక పక్కన నిలబడింది.

అంతలో ప్రియంవద కూడా ఒక దండను సుభద్రుడి మెడలో వేసి - "ఇది చివరి చరణం పూరించినందుకు కానుక" అని అతని వెనక నిలబడింది. అప్పుడు రామలింగకవి - మంత్రితో - "అయ్యా! వీరి కంఠధ్వని ఎక్కడో విన్నట్లనిపిస్తూంది. వీరు మంగమణి, ప్రియంవద అనేవారు కాదుకదా? వారు మాకు చేసిన మేలెప్పటికీ మరచిపోలేనిది." అన్నాడు.

మందారవల్లి నవ్వుతూ - "ఔ నౌను. మీ ఎత్తి పొడుపు మాటలర్థం కాకపోలేదు. వాళ్ళు మాతో అంతా చెప్పారు. పేద

బ్రాహ్మణులని చెప్పుకుని పేర్లు మార్చుకుని దానా లందుకుందుకు తమపక్కన కూర్చోబెట్టుకుని కపట దాంపత్యం చేశారట. ఎంత బాగుందో చూడండి.

వారు మీరేనా? ఆ ఆడవాళ్ళనేం చేసి వచ్చారు? అంతటితో మీపేదరికం తీరిందికదా" అని పలికేసరికి –

సుభద్రుడు – "పేదరికం పోడానికి అంతుంటుందా? భిక్షమెత్తేవాడు ఊరికొక వేషం వేస్తాడు. దానిని వెక్కిరింప కూడదు" అన్నాడు. అప్పుడు ప్రియంవద అతనికేదో సమాధాన మిచ్చింది. వారు వాదించుకున్నారు. ఆ వాదనలో రామలింగడి మాటే నెగ్గింది.

అప్పుడు విజయవర్మ చాలా సంతోషిస్తూ రామలింగకవి నెంతో గౌరవించి మందారవల్లి కథను వివరంగా చెప్పాడు. "ఇది నా పుత్రిక. జాతి స్మృతిలేక ఎన్నో చిక్కులు పడింది. శీలవతి అని మీరే ఎరుగుదురు. ఈమెను భార్యగా స్వీకరించండి. బ్రాహ్మణులు క్షత్రియ కన్యను వివాహమాడడం అనే ఆచారముంది" అని కోరాడు.

రామలింగకవి ఏదో ఆలోచించినట్లు నటించి – "ఈమె మొదటి పత్రికలో వ్రాసిన మాటలు జ్ఞాపకమున్నాయా? వాటి కర్థమేమిటి?" అని అడిగాడు.

"అదేమీ మాకు తెలియదు. నువ్వు దేనికేనా సమర్థుడివి. పాదుషాగారిచేత మీ రాజుకి రాయించి ఈ వివాహానికి రప్పిస్తాను" అని విజయవర్మ హామీ ఇచ్చాడు. దాంతో రామలింగకవి ఆ వివాహాని కంగీకరించాడు. మందారవల్లి, ప్రియంవదలు అంతఃపురంలోకి వెళ్ళిపోయారు.

మర్నాడు విజయవర్మ మోహనచంద్రుడి వద్దకుపోయి కథంతా చెప్పాడు. దాంతో పాదుషా కూడా ఆ వివాహం జరగాలని ఉత్సాహపడ్డాడు. వివాహ ముహూర్తం దగ్గరలోనే పెట్టించి సామంత రాజులకు శుభలేఖలు పంపించాడు.

ఆ విజయ వార్త విని కృష్ణదేవరాయలు చాలా సంతోషించి అష్టదిగ్గజ కవులతో, మంత్రితో, పరిజనంతో అక్కడికి వచ్చాడు.

కలిఘూతాపురం నుంచి కల్పవల్లి, సునంద, మకరందుడు, సిందువర్మ మొదలైన బంధువు లందరూ వచ్చారు. వారు మందారవల్లినీ ప్రియంవదనీ కౌగలించుకుని వారి కథలు విన్నారు.

శుభముహూర్తంలో వారి కత్యంత వైభవంగా వివాహం జరిగింది.

రామలింగని కవిని అక్కడ కొన్ని రోజులుంచమని యవనప్రభువు కృష్ణదేవరాయలను కోరాడు. ఆరాజు పరివారంతో విజయపురికి వెళ్ళిపోయాడు.

రామలింగ కవి చమత్కార కృత్యాలను చూస్తూ మోహనచంద్రుడు వారం ఒక గడియలా గడిపాడు. ఆ వింతలు చెప్పడాని కిప్పుడు సమయం చాలదు.

రాయలవారు చంద్రగిరికి పోతూ ఒకనా డిక్కడ ఆగి ఈపద్యాన్నొక శిలపై చెక్కించి స్థాపించారు. ఇంకా పెక్కుచోట్ల కూడా వ్రాయించాడు.

గోపా! నువ్వు చూసిన పద్యం వెనుక కథఇది" అని ముగించాడు మణిసిద్ధుడు.

"బలే మంచి కథ చెప్పా రయ్యగారూ. ఇంత ఆనందం నాకెప్పుడూ కలగలేదు. ఇంకా వేళ చాలా ఉంది కదా. రామలింగకవి ఢిల్లీ పట్నంలో వింతచర్య లనేకం చేశాడని చెప్పారుకదా! వాటిలో కొన్ని చెప్పండి, మీ పాదాలొత్తుతాను" అని ప్రార్థించాడు గోపాలుడు.

"కర్మం చాలక నోటినుంచి వచ్చినందుకు పట్టుకున్నావు కదా! మరెప్పుడేనా చెబుతాను. ఇప్పటికి వదిలెయ్. కొంచెం విశ్రాంతి తీసుకోవాలి" అని ఆ రోజుగడిపి మర్నాడు మళ్లీ ప్రయాణం సాగించాడు.



# కాశీ మజిలీ కథలు

## 25. వ మజిలీ

మణిసిద్ధుడు జపం చేసుకుంటున్నాడు. వింతలను చూడడానికి వీధిలోకి వెళ్ళిన గోపాలుడు పరుగుపెడుతూ వచ్చాడు. "స్వామీ! మీ జపం వేగం కానివ్వండి. మంచి వింత చూసొచ్చాను. ఆకథ మీరు చెప్పాలి" అని గురువుని తొందరపెట్టాడు.

గురువుగారు జపం ముగించి – "ఏరా! నీకెన్ని సార్లు చెప్పాలి? జపం చేసుకుంటూంటే అంతరాయం కలిగించకూడదని తెలియదా? సరే. ఇంతకీ ఏం కొంపముగిలింది?" అని అడిగాడు.

వాడు కొంచెం జంకుతూ – "స్వామీ! ఈ వూరి చెరువు గట్టు దగ్గర రెండు స్థంబా లున్నాయి. నేను కొంచెం చూస్తూండగా, వయసులో ఉన్న ఇద్దరు యువకుల చిత్రపటాలను తీసుకొచ్చి ఆ స్థంబాలకు కట్టి రాజభటులు కొరడాలతో కొట్టారు. మరో స్త్రీ విగ్రహా న్నక్కడే నిలబెట్టి, పదిమందీ ఆమె మొహమమీద ఉమ్మారు అంతలో మరికొందరు వచ్చి వాని కట్లు విడిపించి తీసుకుపోయారు. దీని వృత్తాంత మేమిటో తెలుసుకోవాలనే మిమ్మల్ని తొందరపెట్టాను." అన్నాడు వినయంగా.

మణిసిద్ధుడు భోజనం పూర్తిచేశాక మణికి నమస్కరించి దాని మహిమవలన ఆ వృత్తాంతం తెలుసుకుని తిరిగి గోపాలుడికి చెప్పసాగాడు.

# వీరప్రతాపుని కథ

సింధుబా అనే నగరానికి రాజు వీరప్రతాపుడు. అతను మొదట పద్మిని అనే ఆమెను పెళ్ళాడి ఆమెయందు సంతానం కలగక - సంతానాన్ని కోరుకుని ముగ్గురిని పెళ్ళాడాడు. ఆ భార్యల పేర్లు కమలిని, కుముదిని, మాలిని. వారివల్ల కూడా అతనికి సంతానం కలగలేదు. వీరప్రతాపుడు నలుగురు భార్యలనీ సమానంగానే చూసేవాడు. కోటలో నాలుగుదిక్కులా నాలుగు మేడలు కట్టించి అన్ని సదుపాయాలూ అమర్చి నియమిత దినాలలో వారివద్దకు పోయేవాడు. ఒక భార్య కేదిస్తే మిగిలిన ముగ్గురికీ కూడా అదే ఇచ్చేవాడు. ఇలాగ కొన్ని రోజులు గడిచాయి.

ఒకనాడు మంత్రసిద్ధుడనే యోగి వచ్చి అతని చింతకు కారణం విని అతని చేత ఒక హోమం చేయించాడు. ఆ పాయసాన్ని వీరప్రతాపుడు నలుగురు భార్యలకూ ఇవ్వగా - వారు నలుగురూ పదవమాసంలో ఒకే రోజున కొడుకుల్ని కన్నారు. వీరప్రతాపుడు బ్రాహ్మణులకు విస్తారంగా దానధర్మాలు చేశాడు. కొడుకులకు విజయుడు, భానుడు, రాముడు, చంద్రుడు అని పేర్లు పెట్టాడు.

వాళ్ళు నలుగురూ చక్కగా ఎదిగారు. నలుగురినీ సమానంగా చూసుకునే వాడు వీరపుత్రుడు. వారందరికీ విద్యాభ్యాసం చేయించడానికి గురువులని నియోగించాడు. వాళ్ళు చక్కగా రాజవిద్యల నభ్యసించారు. యువకు లవడంతో రాజువారికి వివాహాలు చేయడానికి నిశ్చయించి ఉత్తమ రాజకన్యల చిత్రపటాలు తేవడానికి నేలనాలుగు మూలలకీ దూతలని పంపాడు.

ఆ దూతలు దేశాలన్నీ తిరిగి ఉత్తమ రాజకన్యల చిత్రపటాలు నాలుగింటిని తెచ్చారు. అవి పట్టుకుని రాజు పెద్దభార్య పద్మిని వద్దకు వెళ్ళాడు. "ఈ రాకుమార్తెలు నలుగురూ రూపయౌవన విద్యాసంపన్నులు" అంటూ వారివారి చరిత్రలు చెప్పి - "నీ కుమారుడికి ఎవరిని కోడలిగా చేసుకుంటావు?" అని అడిగాడు. ఆమె చాలా సేపు ఆలోచించి "పద్మగంధిని-" అంది. ఆ చిత్రపటం ఆమెకిచ్చి - రెండోభార్య కమలిని

వద్దకు వెళ్ళి - ఈ ముగ్గురి రాచకన్యల్లో ఎవరిని కోడలిగా చేసుకుంటావు?" అని అడిగాడు. అప్పుడామె - "నాలుగో చిత్రపటం ఏదీ?" అని అడిగింది. "అమెను పద్మిని కుమారుడికి నిశ్చయించి ఆమె కిచ్చాను" అన్నాడతను.

"బాగుంది. మంచి అమ్మాయిని ఇష్టంకలభార్య కొడుక్కి నిశ్చయించి మాకు పనికిరాని కన్యలని చూపించి ఎవరు కావాలని అడుగుతున్నారా! వీళ్ళ ముగ్గురిలోనూ నాకొక్కతె కూడా అక్కర్లేదు. ఇష్టముంటే ఆ పద్మగంధినే నా కొడుక్కిచ్చి పెళ్ళి చేయండి. లేకపోతే మానేయండి" అంది కమలిని.

"నీకేమీ తెలియదు. పద్మగంధికంటె వీరెందులోనూ తక్కువ వారు కారు. నామాటవిని వీరిలో ఒకరిని కోరుకో" అని రాజు బతిమాలాడు. కాని ఆమె ఎంతకీ అంగీకరించింది కాదు. పెద్ద భార్య నెలాగైనా ఒప్పించవచ్చు. దీనిలా ఆమె మూర్ఖురాలు కాదు అనుకుని - "పద్మగంధినిస్తే సంతోషిస్తావా? - " అని అడిగాడు. "అలాగే" అందామె.

అతను మళ్ళీ పెద్ద భార్య పద్మిని దగ్గరకెళ్ళి - "ఈమె విద్యలలో అసమానురాలట. నువ్వుకోరుకున్న పద్మగంధికి విద్యాగంధం అట్టే లేదని రహస్యంగా నాకు తెలిసింది. రూపం కూడా సామాన్యమేనట. రంగులతో అలా మెరిపించారట. నీమీద ఉన్న ఇష్టం కొద్దీ చెబుతున్నాను. ఈమె నీ కుమారుడికి తగదు" - అన్నాడు. "మీరు చెబుతున్నది కపటం కాక నిజమే కదా? నా కుమారుడు మీ కుమారుడు కాడా?" అంటూ మత్స్యగంధి చిత్ర పటాన్ని తీసుకుని పద్మగంధి పటా న్నిచ్చేసింది.

అతను రెండోభార్య దగ్గరకెళ్ళి - "నువ్వు కోరిన మత్స్యగంధి పటమిదుగో" అని అందించాడు. పెద్ద భార్య దగ్గర జరిగిన సంభాషణ కమలిని గూఢచారిణి ద్వారా విని ఉండడం వల్ల ఆమె ముఖం ముడుచుకుని - మీ ప్రేమ తెలిసింది. విద్యలేని దాన్ని, కురూపిని పెళ్ళిచేసుకోడం కంటె నా కొడుకు పెళ్ళికాకుండానే ఉండిపోతాడు. మంచి కన్యలని మీ ముద్దుల కొడుకుల కిచ్చి చెయ్యండి" అంది.

"నువ్వుకోరినదాన్నే చేస్తానన్నానుగా?"అన్నాడు వీరప్రతాపుడు. "ఐతే...మత్స్యగంధిని నా కొడుక్కి నిర్ణయించండి. మీ కపటపు మాటలు నమ్మి పద్మగంధిని కోరుకున్నాను" అందామె.

అత నాశ్చర్యపోయి – "ఈ మాటైనా స్థిరమేనా?" అడిగాడు.

"మీ మాటలు కపటం కాకపోతే" అందామె.

"నిన్ను మోసం చేసి వెర్రిదాన్ని నీ కొడుక్కి కట్టబెట్టాలని ఎందు కనుకుంటాను? నాకు మాత్రం కొడుకు కాడా?" అని – పద్మిని తాను చెప్పినట్లు విటుంది కనక మూడోభార్య కుముదిని దగ్గరకు వెళ్ళి – మిగిలిన మూడు పటాలూ చూపించి కోడల్ని ఎన్నుకోమన్నాడు. ఆమె – "నాలుగు చిత్రపటాలు తెప్పించి – మంచి దాన్ని మీకు నచ్చిన భార్యకిచ్చి మిగిలినవే చూపడం లోపం కాదా? అది కూడా తెచ్చి ఉంటే సంతోషిద్దుం కదా" అంది.

రాజు ఎంత ప్రయత్నించినా వాళ్ళు నలుగురూ ఒకే రాచకన్యను కోర సాగారు. ఎవరితో ఏం చెప్పినా అది మిగిలిన ముగ్గురూ గ్రహించి ఆమె కోరినకన్యే తమకీ కోడలు కావాలనడంతో ...అతను విసిగిపోయాడు. ఎవరి మనసునీ మార్చలేక చివరికి – 'బ్రహ్మసృష్టిలో హెచ్చుతగ్గులు లేకుండా ఉంటాయా? సవతులు కావడంవల్ల ఒకళ్ళపై ఒకళ్ళు అసూయచూపుతూ నన్ను వేధిస్తున్నారు. ఎవరిష్టం వచ్చిన వాళ్ళని వాళ్ళే చేసుకుంటారు. నా కీ శ్రమెందుకు?" అని నిర్ణయించుకుని నలుగురు కొడుకులనీ పిలిపించాడు.

"కుమారుల్లారా! మీకు వివాహం చేయాలని ఉత్తమ రాజపుత్రికల చిత్రపటాలు తెప్పించాను. మీ తల్లులు ఒకరేది కోరితే మిగిలిన ముగ్గురూ అదే కావాలంటున్నారు. వాళ్ళని ఒప్పించడం నాతరం కాలేదు. ఇంతవరకూ మీ నలుగురికీ అన్నీ సమానంగా ఏర్పరుస్తూ వచ్చాను. కాని...స్త్రీలలో కొంచెమేనా తేడా లేకుండా ఒకేలా ఉంటారా? అందుకని నేను మీ పెళ్ళిళ్ళు చెయ్యలేను. మీకు కావలసిన డబ్బిస్తాను. మీరు దేశాటనం చేసి మీ ఇష్టం వచ్చిన కన్యని పెళ్ళి చేసుకురండి" అన్నాడు.

ఆ మాటలకి వాళ్ళు చాలా సంతోషించారు. తండ్రి ఆజ్ఞ ననుసరించి, తల్లులకి చెప్పి, చాలా ధనంచేత పట్టుకుని - శుభముహూర్తం చూసుకుని దేశాటనానికి బయలు దేరారు. బయలుదేరే ముందు - సంవత్సరాని కొకసారి కలుసుకుందామని - అందుకొక చోటుని నిర్ణయించుకున్నారు.

## విజయుని కథ

పెద్దకొడుకైన విజయుడు ముఖ్యమైన ఆయుధాలు పట్టుకుని గుర్రంమీద తూర్పు దిక్కుగా వెళ్ళసాగాడు పదిరోజులపాటు అనేక ప్రదేశాలను దాటి పదకొండవ రోజు నాటి సాయంకాలానికి ఒక పట్నం చేరుకున్నాడు.

అప్పటికే చీకటి పడిపోయింది ఊళ్ళో ఎక్కడికి పోవాలో తెలియరాలేదు. అప్పటికి కనపడిన చోటులో ఆగాడు. అక్కడున్న చావడిలో ఆ రాత్రి గడపొచ్చునని - గుర్రాన్ని దగ్గరలో కట్టి - తాను ఆ చావడి నేలని శుభ్రపరచుకుని కూర్చున్నాడు

కొంతసేపయ్యాక అతను అటూ ఇటూ చూస్తూంటే ఒకవేపు వెలుగుజాడ కనిపించింది అక్కడ మనుషులుంటారనీ, వాళ్ళ సడగొచ్చనీ అక్కడికి వెళ్ళాడు. కాని అది ఆ ఊరి స్మశానం అక్కడొక శవం సగం కాలుతూంది. ఆ మంట వెలుగు అదే. అక్కడెవరూ లేరు.

అతను భయపడకుండా - అలాటివే కాటి మంటలు మరి రెండిటిని కూడా గమనించి "ఓహో! ఇది స్మశానం. తెలియక ఇక్కడ మకాం పెట్టాను. ఆ చావడి ప్రేతకర్మల కోసం కట్టినది కావచ్చు. దీనికి భయపడవలసిన పనిలేదు" అని ధైర్యంగా చావడికి వచ్చి కూర్చుని - నిద్రపోకుండా - తెల్లారడం కోసం ఎదురు చూడసాగాడు.

కొంతసేపయ్యాక ఒకమూల పెద్ద చప్పుడయింది. అతను తుళ్ళిపడి - అటువేపు చూసేసరి కక్కడొక పెట్టె పడి ఉంది. అతను

దాని దగ్గరకు వెళ్ళి – 'ఓహో! ఇటువేపు కోట గోడ హద్దయి వుండవచ్చు. దొంగ లీపెట్టను కోటగోడమీంచి పడేసి ఉంటారు. దీన్లో ఏముందో చూద్దాం – అనుకుని – కాలుతున్న చితిలోంచి ఒక కొరివిని తెచ్చి – ఆ పెట్టెమూత తెరిచి చూశాడు.

అందులో ఒక సౌందర్యరాశి మూర్ఛపోయి పడుంది. అది చూసి అత నాశ్చర్య పోయాడు. ఈమె కింకా ప్రాణమున్నట్లే ఉంది. పెట్టెలో భంధించడంవల్ల బతకడం కష్టమే. కానియ్, నాకు తోచిన చికిత్స చేస్తాను. అనుకుంటూ ఆమెను మెల్లగా పెట్టె బయటకు లాగి నిలబెట్టాడు. కాని ఆమెకు స్పృహలేక – నిలబడలేక తూలిపోయింది.

అతనామె నెత్తుకుని చావడిలోకి తీసుకొచ్చి ఉపచారాలు చేశాడు. కాని యెంతసేపటికీ ఆమెకి తెలివి రాకపోడంతో గుర్రంమీద పడుకోబెట్టి మెల్లగా నడిపిస్తూ – ఒక బ్రాహ్మణుడి ఇంటికి తీసుకొచ్చాడు.

"పుణ్యాత్మా! మేం విదేశస్థులం. ఈమె నాభార్య. రోగగ్రస్త అయింది. ఇక్కడ రెండు రోజులుండి చికిత్స చేయించుకుంటాను. దయచేసి కాస్త చోటిస్తారా?" అని ప్రార్థించాడు. అతను అంగీకరించి ఒక మూల గది చూపించాడు.

ఆవేళ సాయంకాలాని కామెకి తెలివొచ్చింది. కళ్ళు తెరుస్తూనే – "హా! తల్లీ! ఇప్పటికి నీ కళ్ళు చల్లబడ్డాయా? నిన్ను నమ్మినందుకు మంచి పనిచేశావు" అని పలవరించి మళ్ళీ మూర్ఛపోయింది.

అతను మళ్ళీ ఉపచారాలు చేశాక కొంతసేపటికి తెలివొచ్చి – "అయ్యా! మీరెవరు? నేనిక్కడి కెలా వచ్చాను?" అని అడిగింది.

విజయుడు – "అంతా చెబుతాను కానీ నీలాటి సుందరి నీ స్థితికి తెచ్చిన దుర్మార్గు లెవరు? ఎందు కిలా చేశారు? నేను వీరప్రతాపుడి కుమారుణ్ని. దేశాటనం చేస్తూ తెలియక నిన్నరాత్రి స్మశానంలో ఉన్నాను. అర్ధరాత్రి ఎవరో ఒక పెట్టెను స్మశానంలో పడేశారు దానిలో నిన్ను చూసి ఇక్కడికి తీసుకొచ్చాను" అని చెప్పాడు.

ఆ మాటలు విని ఆమె అత న్నొకసారి ఎగాదిగా చూసి - నావృత్తాంతం చెబుతాను వినండి" అంటూ చెప్ప సాగింది.

"నేనీ పట్నపురాజు బలవర్ధనుడను వారి కూతురిని. నాపేరు హేమ. నా చిన్నతనంలోనే మాతల్లి స్వర్గస్తురాలయింది. మా తండ్రి వినీతి అనే ఆమెను ద్వితీయ వివాహం చేసుకున్నాడు. ఆమెకు సంతానం కలగలేదు. అందుచేత నేనంటే యీర్ష్యగా ఉండేది.

° తండ్రి నన్ను చాలా గారాబంగా పెంచుతూ నాకు సకల విద్యలూ నేర్పించాడు. నేను యౌవనంలోకి వచ్చాను. నాతండ్రి నాకు వివాహం చేయడానికి ప్రయత్నించసాగాడు. నా సవతి తల్లి నా వివాహ ప్రయత్నా కెప్పటి కప్పు డేదో ఒక విఘ్నం కల్పిస్తూ ఉండేది.

మొన్న మా తండ్రి వేటకు వెళ్ళాడు. అతను వెళ్ళడమేమిటి, మా సవితి తల్లి నన్ను చూడాలని కబురు మీద కబురు పంపసాగింది. నాకు విసుగెత్తింది. చిట్టచివరకి భయపడుతూనే నిన్న సాయంకాలం ఆమె ఇంటికి వెళ్ళాను.

ఆమె నన్ను చూసి ఎంతో ప్రేమున్న దానిలా కౌగలించుకుని కూర్చోబెట్టి...మంచిమాటలు నాలుగు మాట్లాడింది ఏదో ఫలహారం తెచ్చి తినమంది. నా కనుమానం కలిగి తరవాత తింటాననంటూ దానిని మూట కట్టాను.

అక్కడితో వదలక నా వొంటికి గంధం పూయించి, పువ్వులూ దండలూ వేసి "వాసన చూడు" అంటూ ఏదో పరిమళ ద్రవ్యం నా ముక్కుదగ్గర ఉంచింది అది వాసన చూడడంతోటే నాకు స్పృహతప్పింది. తరువా తేం జరిగిందో నాకు తెలియదు. మీ దయవల్ల బ్రతికాను. నా సవతి తల్లి రాజ్యకాంక్ష కొద్దీ నన్నిలా చంపబోయింది. రాజకుమారా! మీరు కన్య నన్వేషిస్తూ దేశాటనం చేస్తున్నా నన్నారు కదా! నన్ను భార్యగా స్వీకరించండి. మీ పాదసేవ చేసుకుంటూ బ్రతుకుతాను" అని అతన్ని ప్రార్థించింది.

విజయుడికి చాలా ఆశ్చర్యం వేసింది. 'ద్రవ్యముపై ఆశ ఎంత దుర్మార్గమైంది! స్త్రీ ఎంతకైనా సాహసించ గలదు! సరే! దేవుడు నా కప్రయత్నంగానే ఈమెను సమకూర్చాడు ఈమె రూపంలో దేవకన్యను మించి పోతూంది. ఇంకేం కావాలి?" అనుకుంటూ ఆమె కభయమిచ్చి రెండుమూడు రోజుల్లో ఆమెకు పూర్తి స్వస్థతను.చేకూర్చాడు.

కొద్ది రోజులు గడిచాక ఒకనాటి సాయంకాలం విజయు డామె గదిలోకి వచ్చి – "నే నిందాక అంగడికి పోయాను. అక్కడ నీ గురించి ప్రజలు ఏమేమో చెప్పుకుంటున్నారు. రాజుగారు లేని సమయంలో నువ్వెవరినో తీసుకుని లేచిపోయావని – నీ సవతి తల్లి వేటనుంచి వచ్చిన మహారాజుకి చెప్పిందట. ఆయన చాలా కోపగించి నిన్ను వెదకడానికి నాలుగు వేపులా దూతలని పంపాడట. నిన్ను పట్టి ఇస్తే పారితోషిక మిస్తానని ప్రకటించాడట.

ఈ మాటలే వూరంతా చెప్పుకుంటున్నారు. ఎలాటి కల్పనో చూడు. మన మిక్క డుంటే ప్రమాదం వస్తుంది. ఇప్పుడు నిజం చెప్పినా ఎవరూనమ్మరు. కనక ఎక్కడికేనా పోవడం మంచిది. ఏమంటావ్?" అని ఆమె నడిగాడు.

"అదే మంచిది" అందామె కూడా. ఆ రాత్రి అత నామెను గుర్రంమీ దెక్కించుకుని చాలా వేగంగా ప్రయాణించి కొన్ని రోజుల కొక పట్నం చేరాడు. అక్క డొక సత్రంలో బస చేసి ప్రయాణపు శ్రమ తీరేదాకా రెండు మూడు దినా లుండాలనుకున్నాడు.

చీకట్లో సత్రం అరుగుమీద పడుకుని ఉండగా –ఆమె – "మనం ఎన్నాళ్ళిలా చిక్కులు పడాలి? ఎప్పటి కేన్నా మనం సుఖపడతామా?" అంది

"నువ్వు విచారించకు. ఈ పట్నపు రాజు చాలా సరసుడట. రేపాయన వద్దకు వెళ్తాను. ఆయన దర్శన మవడ మేమిటి, నీ వొళ్ళంతా బంగారం చేసి, ఏడంతస్తుల మేడ మీద హంసతూలికా తల్పం మీద నిన్ను కూర్చోబెట్టనా? నా ప్రభావం చూద్దువుగాని" అన్నా డతను.

అదే సమయంలో .. పట్టణంలో విశేషాలు తెలుసుకుందుకు మారువేషంలో తిరుగుతున్న ఆ పట్నపు రాజు భీమశర్మ చెవిలో ఆ మాటలు పడ్డాయి. అత నా మాటల కాశ్చర్యపోయాడు. వీడెవడో నేర్పరిలా ఉన్నాడు. నన్ను చూడగానే, అంతధనం సంపాదిస్తా నంటున్నాడు! నిజమో, డాంబికామో చూద్దాం! అనుకుంటూ పోయి మర్నాడు ఉదయం సభ చేశాడు

మన ఊరిసత్రంలో విదేశీ దంపతు లున్నారు. వారిలో మగవాడిని గౌరవంగా తీసుకురండి" అని భటులని పంపాడు వారు వెళ్ళి విజయుని కావార్త చెప్పగానే అతను చాలా సంతోషించి గొప్ప వేషంతో వారి వెంట రాజదర్బారుకి వెళ్ళాడు. రాజు అతన్ని చూసి ఏమీ మాట్లాడకుండా అతనిని దగ్గరలో ఉన్న ఆసనం మీద కూర్చోమని చేతితో సంజ్ఞ చేశాడు. విజయు డెవరితోనూ మాట్లాడక సభా విశేషాలు చూడసాగాడు.

మధ్యాహ్నంవరకూ సభచేసి రాజు సింహాసనం నుంచి లేచాడు. సభవారూ, విజయుడూ కూడా లేచి నిలబడ్డారు. కొందరు రాజుగారి దగ్గర సెలవు తీసుకుని వెళ్ళిపోయారు. రెండోసారి మరికొందరు, మూడోసారి కొందరూ వెళ్ళారు నాలుగోసారి మంత్రి శలవు తీసుకున్నాడు. విజయుడు అంతవరకూ రాజు వెనుక నడచి అప్పుడు "రాజా! అనుజ్ఞ ఇస్తే నేనుకూడా శెలవు తీసుకుంటాను" అని అన్నాడు. "మంచిది" అన్నాడు రాజు. రాజు వెళ్ళగానే విజయుడు మంత్రి శెలవు తీసుకున్న చోటుకి వచ్చి- "మంత్రి ఎవరు?" అని అడిగాడు. అంతవరకూ రాజువెంట ఉన్న అతను రాజుకెంత ఆప్తుడో అనుకుంటున్న మంత్రి - అతని గంభీర స్వరానికి - వినయంగా - "నేనే" అన్నాడు.

"ఓహో! నువ్వేనా మంత్రివి! సరే! మా కిప్పుడు - తవ్వడానికి సాధనాలతో కూలివాళ్ళనీ, నూరు గజాలగొలుసూ...మూడు వందల మంది భటులనీ సహాయంగా ఏర్పాటు చెయ్యి ఈ పట్నంలో కొన్ని

కొత్త వీధు లేర్పరచాలని రాజశాసనం. ఏమాత్రం ఆలస్యమైనా మీ ఉద్యోగాలు నిలబడవు" అన్నాడు ఆజ్ఞా పిస్తున్నట్లే.

మంత్రి భయపడుతూ "అలాగే...చిత్తం. .రెండు గడియలలో అంతా సిద్ధం చేస్తాను" అన్నాడు. అన్నట్లే విజయుడు కోరినవి వెంటనే ఏర్పాడు చేశాడు.

రాజకుమారుడు వారందర్నీ వెంట బెట్టుకుని – మంచి మేడ కల వీధులలోకి పోయి మేడలమీదుగా గొలుసులు లాగించి – "దీని మీదుగా కొత్తవీధి నిర్మించాలి: దీనిలో ఉన్నవారు తక్షణం కాళీచేసి లేచిపోవాలి" అన్నాడు.

ఆ మేడ యజమాని బయటకు వచ్చి – జనాన్ని చూసి – తన ఇల్లు తవ్వడానికి సిద్ధంగా ఉండడం చూసి – 'అయ్యో! బోలెడంత డబ్బుపోసి కొత్తగా కట్టుకున్నాను. దీనిని కూలగొడతారంటే నేనేం చెయ్యగలను?' అని మొరపెట్టుకున్నాడు.

"అది మాకు తెలియదు. లేచిపోతే లేచిపో. లేకపోతే ఇప్పుడే తవ్విం చేస్తాను. అడ్డంవస్తే బందీ గృహంలో పెట్టిస్తాను" అంటూ తవ్వమని పనివాళ్ళను తొందర చేశాడు విజయుడు.

ఇంటి యజమాని మొర్రోమంటూ అతని పాదాలమీద పడ్డాడు. "వొట్టిమాటలకి పనులు జరగనూ జరగవు, ఆగనూ అగవు" అన్నాడతను. ఆ సూచన గ్రహించి ఇంటి యజమాని విజయుణ్ని తనమేడమీదకు తీసుకుపోయి రహస్యంగా గుసగుసలాడి ఇంటివిలువలో కొంత సొమ్మిచ్చాడు

విజయు డక్కడినుంచి పక్కమేడవద్దకు పోయి గొలుసుల్ని ఆమేడమీంచి లాగించగా ఆ యజమాని కూడా ఇంతకు ముందు వాడి సంగతివిని – తాను కూడా అలాగే రొక్క మిచ్చాడు. అలాగ విజయుడు పెద్ద మేడలన్నిటి మీంచీ గొలుసులు లాగించి సాయంత్రానికి లెక్క లేనంత ధనం సేకరించాడు.

ఆ ధనాన్నంతా ఒకింట్లో దాచి, పని వాళ్ళని పిలిచి – "ఈ వూళ్ళో వాళ్ళందరూ వొట్టి మూర్ఖుల్లా ఉన్నారు. ఎక్కడ వీధి వేద్దామన్నా తమ ఇల్లు పోతుందని ఏడుస్తున్నారు. నాకు దయ ఎక్కువ. ఒకళ్ళని దుఃఖపెట్టేపని చేయడానికి నా మనసొప్పదు. కనుక మీరిప్పటికి పొండి. తరవాత చూద్దాం" అని వారికి కానుక లిచ్చి పంపేశాడు.

రాజు విజయుణ్ని సభకు పిలిచిన తరవా తేమైందో పట్టించుకోనేలేదు.

మర్నాడే ఆ వూరిలో ఏడంతస్తుల మేడ ఒక దానిని కొని – దానిని అద్దాలు, పటాలు, బంగారంతో నింపి, ఏడవ అంతస్తులో హంసతూలికా తల్పం అమర్చి దానిలో భార్యతోసహా హాయిగా కాలక్షేపం చేయసాగాడు.

భీమవర్మ నెలకొకసారి రాత్రివేళ నగర సంచారం చేస్తాడు. అలా నగరంలో తిరుగుతూ ఒకచోట దీపాలకాంతులతో అద్భుతంగా ప్రకాశిస్తున్న విజయుడి మేడచూసి – ఆశ్చర్యపోయి...అంతకు మునుపు ఆమేడ ఉండేది కాదని గ్రహించి...'ఓహో! ఇది ఆనాడు సత్రంలో పడుకుని చెప్పిన పురుషుడు కట్టించినది కాదుకద? ఈ మేడ అతనిదే ఐతే అతనంతటి ఘనుడు లేనే లేడని చెప్పొచ్చు. ఇంత డబ్బు అతి స్వల్ప వ్యవధిలో ఎలా పోగుచెయ్యగలడు?... రేపు కనుక్కుందాం సంగతేమిటో...' అని ఆ మేడని గుర్తుపెట్టుకుని వెళ్ళిపోయాడు.

మర్నాడు మంత్రిని పిలిచి – "దేవాలయం వీధిలో...కుడిపక్కగా ఉన్న ఏడంతస్తుల మేడెవరిదో ఎరుగుదువా?" అని అడిగాడు.

"దేవరవారి ప్రియమిత్రుడిదే" అన్నాడు మంత్రి.

"నే నెరగని ఆ మిత్రు డెవరు?"

"ఆవేళ తమవెంట ఐదంతరములు దాటి పైకొచ్చినవాడే" అన్నాడు మంత్రి.

"వాడి కింత ధనం ఎలా వచ్చింది?" అని ఆశ్చర్యపోతున్న రాజుకి అతను చేసిన పనులు చెప్పాడు మంత్రి.

రాజు ముక్కుమీద వేలేసుకుని - "ఎంత నేర్పరి! వాడిని నే నెరగను. నన్ను వా డెరగడు. వాడు తన భార్యతో ఆడిన మాటలు యదార్థాలో డాంబికాలో చూద్దామని సభకు రప్పించా అంతే. వాడు చెప్పినంతా చేశాడు! దీన్ని బట్టి వాడి తెలివి తేటలూ, నీ బుద్ధిలేని తనమూ తెలుస్తున్నాయి. నా ఆజ్ఞ అని అతను చెప్పినప్పుడు ఆజ్ఞాపత్రికేది? అని అడగక అతనేం చెబితే అది చేసేస్తే నీకంటె మూర్ఖుడు భూమ్మీద మరొకడుంటాడా? నే నిమ్మన్నానని అంటే చాలు ఏదేనా ఇచ్చేస్తావన్న మాట!"అని చివాట్లు పెట్టాడు.

"దేవా! వానికి మీరు ఆహ్వానం పంపించారు. నాకన్న పై అంతస్తుకు మీతో వచ్చాడు. ఎంత గొప్పవాడు కాకపోతే అలా మీవెంటరాగలడని అతని మాటలు నమ్మాను. అంత మోసగాడని ఎవరికి తెలుస్తుంది? అతను నామీద చేసిన అధికారం మీరైనా ఎప్పుడూ చేయలేదు. ఐనా మీ ఆజ్ఞాపత్రిక లేకుండా వాని కధికారమివ్వడం నా తప్పే' అని మంత్రి ఒప్పుకున్నాడు.

మర్నాడు భీమవర్మ మంత్రినీ సామంతులనీ తీసుకుని విజయుని మేడ దగ్గరకు పోయాడు. విజయుడు వారందరికీ తగిన సత్కారాలు చేసి వారు వచ్చిన కారణం అడిగాడు.

అప్పుడు రాజు - "అయ్యా ! మీ వివరాలు తెలుసుకోవాలని మా కోరిక. మీ బుద్ధిబలంతో దేవలోకాన్నయినా జయించవచ్చు. మీ మీద రాజ్యభారం వేసి కొన్నాళ్ళు విశ్రాంతిగా ఉంటాను. మీ అభిప్రాయ మేమిటి?" అని అడిగాడు.

విజయుడు రాజుకి తన వృత్తాంత మంతా చెప్పాడు.

రాజు అది విని చాలా సంతోషించి- అప్పుడే అతనికి ప్రధానమంత్రి అధికారమిచ్చి తన ముద్రికల నతనికి అందించాడు. అది

మొదలు విజయుడు రాజాస్థానానికి వెళ్తూ ప్రజలు చాలా సుఖపడేటట్లు తానే రాజ్యపాలన చేయసాగాడు.

ఒకనా డతను తన పేర కట్టబడిన సత్రానికి పోయి- ఎందరు బ్రాహ్మణులు భుజిస్తున్నారో అని పంక్తులమధ్య తిరుగుతూంటే - తన తమ్ముడైన భానుడు కనిపించాడు. విజయుడు అతన్ని గుర్తుపట్టి భోజనమైన తరవాత తన ఇంటికి తీసుకెళ్ళి -

"తమ్ముడా! ఇలా దీనంగా తయారయ్యావేమిటి? ధనమంతా - ఏమైంది? ఎవరినీ పెళ్ళి చేసుకోలేదా? పేద బ్రాహ్మణుడిలా సత్రాల వెంట తిరుగుతూ క్షత్రియధర్మం మంట కలిపావేం? ఇంటికి పోలేక పోయావా? నేను నీ అన్నని విజయుణ్ణి" అని తన వృత్తాంత మంతా పూసగుచ్చినట్లు చెప్పాడు.

## భానుడి కథ

అప్పుడు భానుడు తెల్లబోయి - కన్నీరు కారుస్తూ - "అన్నా! నా దైన్యస్థితి నేమని చెప్పేది" అంటూ తన వృత్తాంతం చెప్పసాగాడు.

నేను మన పట్నం వదలి - అనేక గ్రామాలుదాటి ఒకనాటి సాయంకాలానికి కుంభకోణం చేరుకున్నారు. అక్కడొక సత్రంలో బసచేసి ఉండగా - కొందరు వంచకులు నాదగ్గరకొచ్చి - నన్ను నిలువునా పరిశీలించి అతివినయంగా నా వృత్తాంతం అడిగారు. "వివాహం చేసుకుందుకు కన్య నన్వేషిస్తూ వచ్చాను. ఇక్కడ ఉత్తమ కన్య లెవరేనా ఉన్నారా? కావలసినంత డబ్బిస్తాను" అన్నాను.

వాళ్ళు నా దగ్గర చాలా డబ్బున్నట్లు గ్రహించి - "మీకు నచ్చే కన్యకని తెస్తాం. కొన్నాళ్ళిక్కడే ఉండండి" అంటూ నాకెన్నో ఉపచారాలు చేయసాగారు. నేనందుకు చాలా ఆనందిస్తూ వాళ్ళని ఆప్తులుగా భావించసాగాను.

నాలుగురోజులు గడిచాక ఒక చక్కని యువతిని నావద్దకు తీసుకొచ్చి - "ఇలాటి ఆమె నీకు కావాలా?" అని అడిగారు.

ఆమె నా ఎదుట ఎన్నో శృంగార చేష్టలు చేసి తన మనసు వ్యక్త పరిచింది. ఆమె చూపులకే నా మన సామె పరమైపోయింది. ఆమె ఉన్నంత సేపూనా నోరుపెగలనే లేదు. వాళ్ళామెను కొంతసేపు నాతోఉంచి తీసుకు పోయారు.

మళ్ళీ వచ్చి - "మిత్రమా! ఇలాటి కన్య మీకు ఇష్టమైతే చెప్పు" అన్నారు.

లోకానుభవం లేని నేను - "మిత్రులారా! ఆమెలాటిది ఎందుకు? ఆమెనే నేను పెళ్ళాడకూడదా?" అని అడిగాను,

"అబ్బో! ఆమె నెంత ప్రయత్నం చేస్తే తీసుకు రాగలిగామని! ఆమె సాధారణంగా వచ్చేది కాదు. కోటీశ్వరులకి కానివశంకాదు. నువ్వలాటి వాడివైతే చెప్పు. ఆమెతో మాట్లాడతాం" అన్నారు వాళ్ళు.

నేను నా దగ్గరున్న ధనమంతా లెక్కపెట్టుకుని కోటికంటె ఎక్కువగా ఉండడంతో "నే నామెను భరించగలను" అని వారితో చెప్పాను.

"ఐతే సొమ్మంతా మాకియ్యి" అన్నారు వాళ్ళు.

"ఆమెను నావశం చేశాకే ఇస్తాను" అన్నాను నేను.

కొద్దిరోజులయ్యాక వాళ్ళు నన్నామె మేడమీదకి తీసుకుపోయి తల్పంమీద కూర్చోబెట్టారు. అంతలో ఆమె నావద్దకు వచ్చి నా మెడలో పూలమాల వేసి నన్ను వరించానంది. నే నా సంతోషంలో నా ధనమంతా ఆమె అధీనం చేశాను.

ఇది పగలు...ఇది రాత్రి అని భేధం తెలియకుండా కొన్నాళ్ళు హాయిగా గడిపాను. ఎల్లకాలమూ అలాగే గడిచిపోతుం దనుకున్నాను. కాని...కొన్ని రోజులయ్యాక - ఆమె తల్లి అట, ఒక ముసిల్ది నా వద్దకు వచ్చి - "అబ్బాయీ! నువ్వు చాలారోజుల నుంచీ మా ఇంట్లో ఉండి సుఖపడుతున్నావు. నువ్విచ్చిన సొమ్మంతా నీ పువ్వులకీ, తాంబూలాలికీ

పన్నీటికీ అత్తరులకీ సరిపోయింది. ఇంక మేమెలా బతకాలి? నీ దగ్గర సొమ్మేమైనా ఉంటే తే. లేకపోతే ఫో. మా పిల్ల మరొకడిని చూచుకుంటుంది" అంది.

నేను ఉలిక్కిపడి – "అయ్యో! ఈమె నా భార్యకాదా! మరొకరి నెలా ఆదరిస్తుంది? ఆ ధూర్తులు నాతో అలా చెప్పలేదే! ఇంక నాదగ్గర సొమ్మెక్కడుంది? అంతా మొదటే ఇచ్చేశాను" అన్నాను.

"బాగుంది. మేము వేశ్యలం. మా వృత్తి నువ్వెరగవు కాబోలు – మాకు ధనమే భర్త. ఆ ధూర్తులు చెప్పిన దానికంటె ఎక్కువ రోజులే నిన్నిక్క దుండనిచ్చాం ఇంక పో" అని ఆమె నన్ను వీధిలోకి తరిమి తలుపేసేసుకుంది.

కట్టుబట్టలు తప్ప నా వద్ద మరేమీ మిగలలేదు. నే నా దుర్మార్గులని వెదుకుతూ తిరుగుతూంటే వారొకచోట కనిపించారు. ముసిల్ది చేసింది వారికి చెప్పాను. వారు నవ్వి "మేమేం చేస్తాం" – అని ఇక నామాట వినిపించుకోకుండా ఎక్కడికో పోయారు. నేను చాలా విచారిస్తూ...ఇంటికి పోతే అందరూ నవ్వుతారని...కూడు గుడ్డలకి ముఖం వాచి ఇలా తిరుగుతున్నాను. మొన్న ఈవూరు వచ్చాను."

విజయుడు తమ్ముడి అవస్థకు చాలా బాధపడి కొత్త బట్టలు, అలంకారాలు ఇచ్చి కొన్నాళ్ళు తనదగ్గ రుంచుకుని – ఒకనాడు – "తమ్ముడా! మనం ఇల్లు వదిలి సంవత్సరం దాటింది. సంవత్సరాని కొకసారి కలుసుకుందామని నిర్ణయించుకున్నాం కదా. మన సోదరు లక్కడికొచ్చి మనకోసం ఎదురు చూస్తుంటారు. ఇంతవరకూ ఈ విషయం నాకు గుర్తురానేలేదు. కనక మనమిప్పు డక్కడికి పోవాలి" అన్నాడు.

విజయు డాసంగతి భార్యకు చెప్పగా అతనితో తానుకూడా వస్తానంది. విజయుడు తన దేశం చూసి రావడానికి రాజువద్ద శెలవు తీసుకున్నాడు. ఎక్కువ డాంబికంతో వెళ్తే దేశ విశేషాలు తెలుసుకోడం కష్టమని – ముగ్గురూ సామాన్యుల ధోరణిలోనే బయలు దేరారు.

అక్కడక్కడ కొన్నాళ్ళుంటూ - దేశ విశేషాలు తెలుసుకుంటూ ప్రయాణం సాగించారు.

ఒకనా డొక తోటలో విజయుడు, భార్య కూర్చుని వినోదంగా మాట్లాడుకుంటూంటే - చూసిన భానుడు ఓర్వలేక - 'మేమిద్దరమూ ఒక్క చక్రవర్తికే పుట్టాం. వీడి కింత వైభవం! నాకింత హీనస్థితి! దేము డెంత అన్యాయం చేశాడు!. వాడిలా భార్యతో కబుర్లు చెప్పుకుంటూ హాయిగా కాలక్షేపం చేసే భాగ్యం నాకు లేకపోయిందే! నేను భార్యలేక ఒంటరితనం అనుభవిస్తున్నానని మరచిపోయి వాడెంత ఆనందంగా గడుపుతున్నాడు! కానీయ్. వాడు నిద్రపోతూంటే చంపి వాడి భార్యని స్వాధీనం చేసుకుంటాను. సుఖించడాని కింత కంటే వేరే ఉపాయం లేదు! అనుకుని అవకాశం కోసం పొంచి చూడసాగాడు.

ఆ దంపతులు రాత్రి నిద్రపోతున్న సమయంలో - భానుడు మెల్లగా లేచి ఒకకత్తి తీసుకుని - ఒకరి నొకరు కౌగలించుకుని పడుకున్న ఆ దంపతులని చూసి అన్నగారి మెడమీద గురిచూసి ఆ కత్తితో వేటు వేశాడు. ఆ కత్తి దెబ్బకు విజయుడు -"అమ్మో!" అని కేకవేసి ప్రాణాలు వదిలాడు. ఆ కేకకు హేమ హడలి పోయి లేచి - మగని మెడమీది కత్తిని చూసి గుండెలు బాదుకుంటూంటే - భానుడు "ఎందుకు చింతిస్తావు? మా అన్న పరలోకానికి వెళ్ళిపోయాడు. ఎంతసేపేడ్చినా తిరిగిరాడు. నేను నిన్నంత కంటె ఎక్కువ సుఖపెడతాను. నాతోరా", అన్నాడు.

"ఓరి! దుర్మార్గుడా! ఎంత పనిచేశావు! మీ అన్న నీకేం అపకారం చేశాడని ఇంత ఘాతుకాని కొడిగట్టావు? కామాతురిడివై ఇంత క్రూరకృత్యానికి పాల్పడతావా! నేను నీవశ మౌతాననే ఆశ పడ్డావా? నన్ను కూడా ఆ కత్తితోనే నరికేయ్" అని మూర్ఛపోయింది. భాను డామెను పట్టుకుని గుర్రం మీదెక్కించుకుని వేగంగా వెళ్ళిపోయాడు

మర్నాడు ఉదయం పరిచారకులు అక్కడికి పోయి చనిపోయినట్లు పడున్న విజయుణ్ణి చూసి - మరెవరూ కనపడక అక్కడుంటే ఆ నేరం తమమీద పడుతుందని - తలోదారినా పోయారు.

కొంతపొద్దెక్కిన తరవాత – దైవికముగా ఆదారిన ఒక వైద్యుడు వెళ్తూ ఆ రాజకుమారుణ్ణి చూసి పరీక్షించి – కత్తివేటు తిన్నా ప్రాణంపోక వున్న అతని గాయానికి మూలికలు, ఆకుపసరు పిండి –కత్తిని తీశాడు. ఆపసరు మహిమెట్టిదోకాని విజయుడు నిద్రలేచినట్లు లేచాడు.

అప్పుడా వైద్యుడు – "నువ్వెవరు? నిన్నెవరిలా చంపారు? నీ అయువు గట్టిది. ఈ వైద్యం నాకు తప్ప మరెవరికీ తెలియదు. వేటు వేసిన వారు కత్తి తియ్యకపోబట్టి బతికావు. కత్తి తీసేస్తే అప్పుడే ఛచ్చిపోయివుందువు" అన్నాడు.

విజయు డాయనకు నమస్కరించి – "మహాత్మా! ప్రాణదాతలైన మీకు నేనేం చేసి రుణం తీర్చుకోగలను? నన్ను చంపినవాడు నా సోదరుడే అయివుండాలి. వాడికి నామీద అసూయకి కారణం కనపడదు. నాభార్య నన్ను చంపదు. నిజం దైవానికే తెలియాలి" అంటూ తన వేలి ఉంగరం ఆయనకు కానుకగా ఇచ్చి – మొదట పోదామనుకున్న స్థలానికి పదిరోజులకు చేరాడు.

అక్కడ తనకోసం ఎదురుచూస్తున్న కడపటి తమ్ముడు చంద్రుణ్ణి చూసి – కౌగలించుకుని – "తమ్ముడా! ఇక్కడి కొచ్చి ఎన్నాళ్ళయింది? ఎక్కడెక్కడ తిరిగావు? రాముడు కనపడ్డాడా? ఏమేం వింతలు చూశావు? వివాహం చేసుకున్నావా? నేను నిన్ను చూడకనేపోదును. దైవకృప వల్ల బతికాను – " అంటూ తన వృత్తాంత మంతా చెప్పాడు. అది విని – "భానుడెంత పనిచేశాడు! ఆ పనివాడు చెయ్యకపోతే అక్కడే ఉందును కదా? జ్ఞాతివైరం ఊరికేపోదు. నా వృత్తాంతం చెబుతాను. విను" అంటూ చెప్పసాగాడు.



# చంద్రుడి కథ

"నేను మొదట ఉత్తరదేశం పోయి అక్కడి ప్రసిద్ధమైన పట్నాలలో ఉత్తమలక్షణాలు కల రాచకన్యల గురించి వాకబు చేశాను. కాని అక్కడేమీ తెలియలేదు. అక్కడి నుంచి పశ్చిమ దేశానికి వెళ్ళాను. అక్కడ కూడా నా మనసుకు నచ్చే రాచకన్యల వివరాలు లభించలేదు.

ఒకనాడు కొందరు సిద్ధులు శ్రీశైలం పోతూంటే నేను వారితో కలసి శ్రీశైలం వెళ్ళాను. మహా శివరాత్రినాడు పాతాళగంగలో స్నానంచేసి మల్లికార్జునునికి అభిషేకం చేసి మారేడు దళాలతో పూజించి - అక్కడెవరో ఆ పర్వత ప్రభావం చదువుతూంటే విన్నాను. వామన గుహ వృత్తాంతం బాగా గుర్తు పెట్టుకుని - మర్నాడు పాతాళగంగకు తూర్పుగా కొంతదూరం నడిచి - పైకెక్కి చూసేసరికి ఒక బిలం కనిపించింది. దాని ముందు వామనమూర్తి విగ్రహముంది.

నేను సాహసించి గుహలో ప్రవేశించాను. అది కొంతదూరం పోయేవరకూ విశాలంగానే ఉంది. క్రమంగా చిన్నదౌతూండడంవల్ల వొంగునీ ...పాకుతూనూ వెళ్ళవలసి వచ్చింది. గాఢాంధకారమై ఏమీ కనపడక తడుముకుంటూ పోయాను. పగలు, రాత్రి తెలియకుండా ఎన్ని రోజులలా పోయానో. ఒకచోట చేరేటప్పటికి - ముందుకి పోవడానికీ లేదు, వెనక్కి రావడానికీ లేదు.

నేనలాటి సాహసం చేసినందుకు పశ్చాత్తాపపడుతూ. ఊపిరాడడం కూడా చాలా కష్టమౌతూంటే కళ్ళుమూసుకుని దేవుణ్ణి ధ్యానించసాగాను.

కొంతసేపటికి మనోహరమైన వీణా గానం వినిపించింది. ప్రాణం పోయేముందు అలా వినిపిస్తుందేమో అనుకున్నాను. కాని ఆ గానం మరింత స్పష్టమయింది. నాలో జీవితాశ మొలకెత్తింది జై పరమేశ్వరా అంటూ పైకెగ బాకాను. క్రమంగా ఆ గుహ విశాలమై - నిలబడి నడవడాని కవకాశం కలిగింది. కొంతదూరం నడిచాక వెలుగు కనిపించింది.

ముందుకి పోయేసరికి అరటితోట ఎదురైంది. ఆకలిగా ఉండి అరటిపళ్ళు తిని అక్కడే ఉన్న చెరువులో నీళ్ళు తాగి అలసట తీరేవరకూ గాఢంగా నిద్రపోయాను లేచాక అరటితోట మూలలో కనపడిన మార్గం ద్వారా పోగా ఒక ఆవరణా, దానికి ద్వారమూ కనిపించాయి.

అందులో ప్రవేశించేసరికి రత్నకాంతులు కనులకు మిరుమిట్లు కొలిపాయి. విశాలమైన స్ఫటిక శిలా మంటపం. దానిలో మారేడు దళాలతో అర్చింపబడిన స్ఫటిక లింగం ఉన్నాయి. పూజాపాత్రలెన్నో ఉన్నాయి. తూర్పు భాగంలో రత్నసోపానాలతో మెరుస్తున్న తటాకం ఉంది. అవన్నీ చూసి నేను నివ్వెర పోయాను. మహాత్ములెవరో ఇక్కడ తిరుగుతున్నారని భావించాను. ఎవరోవచ్చి ఈ లింగాన్ని పూజిస్తున్నారు. వారి వృత్తాంతం తెలుసుకోవా లనుకున్నాను. కొంచెం ముందుకు సాగాను.

అక్కడ కుడి ఎడమలకు రెండు ద్వారాలున్నాయి. కొంతసేపు ఆలోచించి ఎడమద్వారం లోంచి పోయాను. అదొక కొండశిఖరం మీదకి తీసుకు పోయింది. వెనుదిరిగి చూస్తే నేనొచ్చిన గుహాద్వారం కనపడలేదు. ఈ అడవిలో నన్నేదో క్రూరమృగం తినేస్తుం దనుకుంటూ ఒక చెట్టుక్రింద చతికిలపడ్డాను.

అంతలో ఒక ఏనుగు బంగారు కలశం తొండంతో పట్టుకుని కిందకి పోతూంది. నేను దానికి కొంచెం వెనకగా నడవసాగాను. అది కొండదిగి పాతాళగంగ ఒడ్డుకి పోయింది. ఆ గంగలో కలశంలోకి నీరు తీసుకుని తిరిగివస్తూంటే నేను దాని కెదురుగా నిలబడ్డాను. అది బెదరలేదు. నేను సాహసించి తొండం తడుతూ దానిపైకి ఎక్కి కూర్చున్నాను. అది నేను ప్రవేశించిన గుహలోకే ప్రవేశించింది. వేగంగాపోయి స్ఫటిక శిలామండపంలో ఆ కలశం ఉంచింది. నేనూ అక్కడదిగి – చెరువులో స్నానం చేసి...కలశంలోని జలంతో ఆ లింగానికి అభిషేకం చేసి ...పూలతో పూజించి ధ్యానిస్తూంటే – ఎవరో వస్తున్నట్లు అనిపించి ఓమూలకిపోయి దాక్కున్నాను.

కొంద రందగత్తె లక్కడికి వచ్చి...వస్త్రాలు విడచి ఆ చెరువులో జలకాలాడి - బట్టలు కట్టుకుని లింగంచుట్టూ కూర్చున్నారు. ఒకరు వీణమీద పాడుతూంటే ...ఒకరు పాత్రలు సిద్ధం చేస్తుంటే మరొకరు నిర్మాల్యంతీస్తూ - "ఇది మునుపు నేను చేసిన పూజాద్రవ్యం కానట్లుంది. కొత్తవా రెవరేనా వచ్చి పూజించేరా?" అని అడిగింది.

పూజా ద్రవ్యాలకు గుర్తులేమిటి? అనేశారు వారు.

పూజలు చేసి వాళ్ళు వెళ్ళిపోయాక ...వాళ్ళు అక్కడికి అలవాటుగా వస్తారని అర్థమై - అరటి పళ్ళతో ఆకలి తీర్చుకుని... తటాకంలో స్నానం చేసి లింగార్చన చేసి అక్కడే ఉన్నాను. ఆ వేళ వారికి కొత్తవారెవరో అక్కడికి వచ్చి అర్చించారని స్పష్టంగా నిదర్శనాలు కనిపించి - మర్నాడు వెదకాలని నిశ్చయించుకుని ఆవేళకు స్వామినర్చించి వెళ్ళిపోయారు.

అప్పుడు నేను ధైర్యంగా మంటపంలోకి వచ్చి ఆదివ్యాంగనల నివాసం కను క్కుందామని - ఈసారి కుడివేపు ద్వారంలోంచి వెళ్ళాను. మరోచోట మళ్ళీ రెండు ద్వారాలు కనిపించాయి. కుడివేపు ద్వారంలోంచి పోయాను. నేను బయటకు వచ్చాను. అందుకు ఎంతో విచారించాను. మునుపు ఏనుగు ధర్మమా అని వెళ్ళగలిగాను. ఇప్పుడెలా పోగలను?

ఆ కోనంతా మారేడు చెట్లే. వాటి పళ్ళు తింటూ ఆకలి అణచుకుని - రెండు మూడు రోజులకి విసుగెత్తి ఒక మారేడు చెట్టెక్కి కిందనున్న పెద్దరాతి మీద పడి ప్రాణాలు విడవాలని నిశ్చయించుకుని - నిన్ను పూజించే ఆ సుందరిని వచ్చే జన్మలో నాకు భార్యగా చేయమని దేవుని ప్రార్థించి - దూకబోతూ కిందకి చూసేసరికి ఆ పాషాణం కనిపించలేదు.

నాలుగు మూలలా చూసేసరికి నన్నా వృక్షం ఎక్కడికో తీసుకుపోతున్న ట్లనిపించింది. నేనా కొమ్మని గట్టిగా పట్టుకుని స్ఫటిక శిలా మంటపాన్నే మనసులో నిలుపుకున్నాను. కుదుపులేకుండా చాలా వేగంగా ప్రయాణించిందా వృక్షం. మనుషుల కోలాహలం వినపడి కళ్ళు

తెరచి చూసేసరికి - పెద్ద పెద్ద మేడలు కల ఒక పట్నం మధ్యనున్న ఒక దేవాలయం దగ్గర ఆ చెట్టు నిలబడి ఉంది.

అక్కడి ఆలయంలోని శివలింగాని కనేకులు అర్చనలు చేస్తున్నారు. అదే దేశమో తెలుసుకోవాలని దిగబోయికూడా - ఆ వృక్షం వెళ్ళి పోతుందేమో అన్న అనుమానంతో ఆగిపోయాను. ఆ భక్తుల ప్రార్థనలబట్టి - అది కాశీపట్నం అని తెలిసింది. కాశీవిశ్వనాథుని చూసినందుకు నా జన్మధన్యమైందని తలచేటప్పటికి ఆ గుడి అంతర్ధానమయింది! నాలుగు మూలలా చూసేసరికి రామలింగేశ్వరుని ఆలయం కనిపించింది. అదీ మాయమై కేదారేశ్వరుని ఆలయం కనిపించింది.

అలాగ ఆ వృక్షరాజం ధర్మమా అని అనేక దేవాలయాలను చూడగలిగాను. ఆ వృక్షాన్నే ప్రత్యక్షదైవంగా తలచుకుంటూ అది ఎంత వేగంగా పోతూందో చూడాలని కళ్ళు తెరిచేసరికి ఏమీ కనపడలేదు. దిక్కులు అలుక్కుపోయిన ట్లనిపించాయి. ఆ వృక్షం ప్రతిక్షేత్రంలోనూ ఆకులు విదిల్చింది. అవి ఆయా లింగాలమీద పడ్డాయి!

నేను మనసులో మాటిమాటికీ ఆస్ఫటిక శిలా మంటపాన్నే తలుచుకుంటున్నాను. ఆ వృక్షం కొండపక్కన ప్రవహించే నదివద్ద ఆగింది. నేనక్కడి సోపానాలను గుర్తు పట్టాను. నేను చెట్టు ఎక్కిన చోటు అదే! నేను మెల్లగా చెట్టు దిగాను. వృక్షం మాయమైపోయింది. నేను దానికోసం ఎంతో విచారించాను. ఆ వృక్షం ఆగినచోట - మారేడు పత్రితో అర్చించబడిన శివలింగం ఉంది!

దైవ సంకల్పం వల్ల మునపటి ఏనుగు అక్కడికి వచ్చింది. మునపటిలాగే నేను దానినెక్కి స్ఫటిక శిలా మంటపం చేరుకున్నాను. ఆ దేవకాంతలు చెరువులో జలకాలాడి శివలింగాన్ని భక్తితో అర్చించారు. పూజచేసినామె కొందరు సఖులతో అరటితోటలోకి వెళ్ళింది. మంటపంలో ఇద్దరు స్త్రీలు ఇలా మాట్లాడుకో సాగారు.

**తమాలిక** : మల్లికా! మన సఖి అత్యంత అందగత్తె అయినా వివాహా న్నెందుకు కోరుకోవడం లేదో? తన యౌవనాన్నిలా అడవికాచిన వెన్నెలలా వృధా చేస్తూందేం?”

**మల్లిక** : తమాలికా! అదొక రహస్యం. మొన్ననే చారుమతి ద్వారా విన్నాను. నీకు తెలియదు కాబోలు. చెప్పమంటావా?

**తమాలిక** : చెప్పు చెప్పు. నే నెరగను. మనకీ రహస్యా లున్నాయా?

**మల్లిక** : నలకూబరుడు ఆమెను వరించి దూతద్వారా ఆ విషయం ఆమె తండ్రికి తెలియ జేశాడు. అతను తన భార్యతో - నలకూబరుడు రూపంలో మనోహరుడేకాని నిత్యమూ రంభయందే ఆసక్తి కలిగి ఉంటాడు. అందుచేత మన పుత్రికని అతనికిస్తే సవతి చేత పరాభవం ఎదుర్కోవలసివస్తుంది. కాని రాచబిడ్డడు అడిగాక ఇవ్వకుండా ఉండకూడదు. ఏం చేయాలో తోచడం లేదు - అని, ఆలోచిస్తూ తన అభీష్టదైవం హటకేశ్వరుడిని ధ్యానించి నిద్రపోగా - కలలో అరజాములో భూమ్మీది, దివ్యక్షేత్రాలన్నీ తిరిగివచ్చిన వాడికి తప్ప ఇతరునికి నీ పుత్రిక నియ్యవద్దని చెప్పి మాయ మయ్యాడట. ఆ మాటే అతను నలకూబరుడికి చెప్పేసరికి మన సఖి పట్ల విముఖు డయ్యాడట. అందుకే ఎందరో యక్ష కుమారులు వచ్చి అడిగానా మాణిభద్రుడు తన శపథం తెలియ జెప్పడంతో ఎవరూ ఆ కార్యానికి సిద్ధమవలేదట. ఇది చారుమతి చెప్పిన రహస్యం.

**తమాలిక** : ఎంతో ప్రభావమున్నవాడు కాని ఆ పని చేయలేడు. శపథం నెరవేర్చగలిగిన వాడు రూపవంతుడు అవునో లేదో? ప్రతిభ, రూపం ఒక్కరిలో ఉండడం అరుదు.

**మల్లిక** : రూపమున్న చోటే ప్రతి భుంటుంది. ఐనా భగవంతుడి మాట వ్యర్థంగా పోతుందా?

అంతలో అక్కడికి చారుమతి వచ్చింది. మాటల సందర్భంలో - “నాకు రాత్రొక కలవచ్చింది. ఆ కలలో నేనొక మానవుణ్ణి

వివాహం చేసుకున్నాను. అతనిది నల కూబరుడిని కూడా వెక్కిరించగల సౌందర్యం. దేవతలనూ యక్షులనూ మించిన సోయగం కల రాజకుమారులెందరో ఉన్నారు" అంది.

**చారుమతి** : ఔను.

**మల్లిక** : నిజమే. శివరాత్రికి శ్రీశైలం వెళ్ళినప్పుడు పురాణం వింటున్న ఒక యువకుడిని చూశాను. అంత సొగసైన వాడిని నేనెక్కడా చూడలేదు. అతని వివరాలు తెలుసుకుందామని ఎంతో సేపు అక్కడున్నాను. కాని వీలుపడలేదు. మనచారుమతి కలాటి సుందరుని లభించజేయమని మల్లికార్జునస్వామి కనేక నమస్కారాలు చేశాను. కనక నువ్వు కన్నకల నిజమే ఔతుంది.

**చారుమతి** : వేళ దాటిపోతూంది. పోదాం పదండి.

వాళ్ళు గుహా మార్గంలో వెళ్ళిపోయూరు. ఆ మాటలకి నేను పరవశించి పోయాను. వాళ్ళ మాటలనుంచి స్ఫటిక శిలా మంటపంలో ఉన్నది హటకేశ్వరుని శివలింగమనీ, చారుమతి వివాహం కోరుకుని ప్రతిదినమూ ఈ స్వామి నారాధిస్తూందనీ, మారేడువృక్షం నన్ను అన్ని దివ్యక్షేత్రాలకు తిప్పిన ఫలితం ఇదనీ నిశ్చయించుకుని ఆ మంటపంలో నిర్భయంగా విహరిస్తూ అరటిపళ్ళూ నీరూ తీసుకుని ఆ రాత్రి సంతోషంగా గడిపాను.

మర్నాడు ఉదయం స్నానం చేసి జపంతరువాత అక్కడి పూజాపాత్రలన్నీ తారుమారు చేసి నిర్మాల్యాన్ని చెరువులో వేసి ఆ లింగాని కభిషేకం గావించి పూలతో సహస్ర నామార్చన చేశాను. అక్కడున్న వీణమీద మంగళ గీతాలు పాడాను.

తరువాత ఆ దేవకన్యలు వచ్చి...కొత్తవాళ్ళొస్తున్నారని నిర్ణయించుకుని...తలోమూలా వెదకుతుండగా మల్లిక నేనున్న పూలతోటలోకి వచ్చి నన్ను చూసి వెళ్ళింది. కొంతసేపటికి మరికొందరు కాంతలు వచ్చి దూరంగా నిలిచి నన్ను పరిశీలించి వెళ్ళిపోయూరు. దూరంగా ఉండి చూడడమే తప్ప నన్ను పలకరించలేదు.

వాళ్ళు తమలో తాముగా సౌందర్యం గురించి మాట్లాడు కుంటూంటే – చారుమతి "మీలో ఎవరైనా అతనితో మాట్లాడారా?" అని అడిగింది. వారు లేదన్నారు. మల్లిక "నేను శ్రీశైలంలో చూసిన వా డితడే." అంది. అప్పుడు చారుమతి – "మల్లికా! నువ్వెళ్ళి అతని వివరాలు తెలుసుకో. ప్రసన్నంగా మాట్లాడితే ఇక్కడికి తీసుకురా. ఎంత అందగాడో చూద్దాం" అంది.

మల్లిక నా దగ్గరకు వచ్చింది. నేనామెని చూచి దూర దూరంగా పోతూంటే – ఆమె పువ్వులు కోసే నెపంతో నా దగ్గరగా వచ్చి – నమస్కరించి – "అయ్యా! మీరెవరు? ఏ దేశం? ఈ ఏకాంత గుహకి ఎందుకు వచ్చారు? ఇది మాణిభద్రుడునే వాని కూతురు చారుమతి అను యక్షకన్యక విహార వనం, నే నామె సఖురాలిని. మొన్న శివరాత్రినాడు శ్రీ శైలంలో మిమ్మల్ని చూసిన జ్ఞాపకముంది. మీరుఅప్పటి కక్కడికి వచ్చారా?" అని అడిగింది.

"ఔను శ్రీశైలం వచ్చాను. పురాణాలు విన్నాను. కాని నిన్ను చూసిన గుర్తులేదు. నాపేరు చంద్రుడు. రాజకుమారుణ్ని, మల్లికార్జునుడి అనుగ్రహమే నన్నిక్కడికి తీసుకొచ్చింది. నేను రావడం వల్ల మీ కిబ్బంది లేదు కదా? ఉంటే ఇప్పుడే వెళ్ళిపోతాను. నాకిక్క డేమీ పనిలేదు" అన్నాను.

ఆమె మందహాసం చిందిస్తూ – "మీరు అమానుషప్రభావ సంపన్నులు కాకపోతే ఇక్కడి కెలా రాగలరు? మహాత్ములని సత్కరించడం గృహస్థ ధర్మం. కనుక మీరు పూజార్హులు. మా సఖురాలు స్ఫటిక శిలామంటపంలో ఉంది. మిమ్ము తీసుకురమ్మని నన్ను పంపింది" అంటూ అక్కడ జరిగింది చెప్పి నన్నక్కడికి రమ్మని ఒత్తిడి చేసింది.

నే నేమీ మాట్లాడక పూజనంగీకరించినట్లు ఆమె వెంట మంటపానికి వెళ్ళాను. నన్ను చూసి అందరూ నిలుచున్నారు. నేనెవరి వంకా చూడకుండా కూర్చోమని సంజ్ఞచేశాను. చారుమతి నాకు పూజ చేసింది.

ఎంత సౌందర్యం! ఆమెను చూస్తూనే నేను మన్మధవికారం పొందాను. చారుమతి స్థితికూడా అంతే. ఆమెను చూస్తూ వివశుడినైన నా మెడలో చారుమతి ఒక పుష్పమాలిక వేసింది.

"ఆమె చేసిన దానికి బదులు వద్దా?" అంటూ మల్లిక నాకొక పూలదండ అందించగా నేను ఆమె మెడలో ఆ దండ వేశాను. అలాగ చారుమతీ నేనూ దండలు వేసుకోగా వాళ్ళంతా మామీద తెల్లని పూలు చల్లారు. మాకు అవే తలంబ్రాలు.

"మల్లికా! మీరు నాకు చేసిన అపూర్వ సత్కారాలకి చాలా సంతోషించాను. కృతజ్ఞత చూపడం తప్ప మరేమీ చెయ్యలేను. మీ సఖురాలు చారుమతి పేరు ఎప్పుడూ నాహృదయంలో ఉంటుంది" అన్నాను.

"అదే మనకి పదివేలు. అంతకంటె వేరే ఏమీ అక్కరలేదు" అని చారుమతి మల్లికతో అంది. అప్పుడు వాళ్ళంతా తమలో తామేదో ఆలోచించుకుంటున్నారు

తరవాత - మల్లిక నాతో ."అయ్యా! మీకు అలకాపురిని చూడాలనే అభిలాష ఉండకపోదు మా సఖురాలికి మిమ్మల్ని అక్కడికి తీసుకెళ్ళాలని కోరిక ఉంది. అది దేవభూమి కనుక శుచిగా వెళ్ళాలి. మీరు తటాకంలో స్నానం చేసి రండి" అంది.

నేనామె వెంట వెళ్ళాను. పూల వనంలా అనిపిస్తున్న ఒక సరస్సు దగ్గరకి నన్ను తీసుకెళ్ళి - "అందులో మునిగారంటే అలకాపురి చేరుతారు" అంది.

నేను నీళ్ళలో నిలబడి చేతులతో నీరు చిమ్ముతూ ముమ్మారు మునిగి లేచేసరికి నాకు స్త్రీరూపం వచ్చేసింది! 'అయ్యో! ఈ యక్ష కాంతలు నన్నెంత మోసం చేశారు! అందుకే కాబోలు వారిని యక్షిణులంటారు' అనుకున్నాను.

. అంతలో "నాతీ! వేగం రా" అని పిలిచింది. "అయ్యో! నేనిలా ఆడదా న్నయ్యా నేమిటి? దీనివల్ల మీకు లాభమేముంది? అలకాపురికి తీసుకెళ్తామని చెప్పి ఇలా చెయ్యడం న్యాయమా?" అని ఆమె నడిగాను. "వనితా! విచారింపకు. దీనిలో మునిగిన వారు స్త్రీలుగా మారతారు. నిన్నీరూపంలో అలకాపురికి తీసుకుపోవాలని ఇలా చేసింది. మళ్ళీ

మగవాడిని చేస్తుంది" అనడంతో నేను తేలిక పడిన మనసుతో ఆమె వెంట వెళ్ళాను. వాళ్ళందరూ పరిహాసం చేస్తూంటే సిగ్గుపడ్డాను. చారుమతి – "నారీ! మనింటికి పోదాం, రా" అంటూ నాచెయ్యి పట్టుకుని లాక్కుపోయింది. వాళ్ళవెంట ఆ గుహావిశేషాలు చూస్తూ నే నలకాపురికి వెళ్ళాను. ఎరిగినవారికి తప్ప ఆ గుహలో వెళ్ళడం ఎవరి తరమూ కాదు. సఖులమధ్య ఉంచి తీసుకెళ్ళింది కనుక అలకాపురిలో నన్నెవరూ గమనించలేదు.

అలకాపురిలో వీధులు రత్నాల పలకలతో నిర్మించబడ్డాయి. మట్టి కంటె బంగారమే ఎక్కువుంది. ఇక చారుమతి అంతఃపురమంటే అదో ఇంద్రజాలమే. అవన్నీ వర్ణించాలంటే ఏడాది చాలదు.

చారుమతి భోజనం వేళ అతిగౌరవంగా చూస్తూ నాతో ఏకశయ్యమీద నిద్రించేది. నేను నిద్రపోతున్నానుకుని చారుమతి తన విరహమూ, నన్ను పురుషునిగా చూడాలనే కాంక్ష, తల్లితండ్రుల భయమూ సఖులకు చెప్పింది. వారు అంతా తాము చూసుకుంటా మని హామీయిచ్చారు.

మర్నాడు నేను వాళ్ళతో మునపటి గుహామార్గంలో స్ఫటిక శిలామండపం వెళ్ళాను. నన్నక్కడ మరొక తటాకంలో స్నానం చేయించడంతో నేను తిరిగి మగవాడినయ్యాను. నన్నూ చారుమతినీ ఒక లతా మంటపంలో పూలశయ్య ఏర్పరచి దానిమీద కూర్చోబెట్టి ఎన్నో వినోదాలు చేశారు. ఆమెతో నేను చెప్పలేనంత సుఖం అనుభవించాను.

అలా ఆమెతో కొన్నాళ్ళు గడిపాను. నేనక్కడ ఉండగా – శివపూజ నెపంతో చారుమతి అక్కడ నాతో ఎక్కువసేపు గడిపి వెళ్ళేది. ఒకనా డామె నియమందాటానని విచారిస్తూంటే – నేను బిల్వ వృక్షం మీద క్షేత్రాలన్నీ తిరిగిన విధం చెప్పాను. ఆమె చాలా సంతోషించి – తన తల్లితండ్రుల కా విషయం వివరిస్తానంటే – మల్లిక – "వారు నీకు వివాహ ప్రయత్నం చేసినప్పుడు చెప్పవచ్చు–" అంది.

అంతలో మనసోదరుల విషయం జ్ఞాపకం వచ్చి చారుమతితో మన సోదరుల గురించి చెప్పాను. అప్పటి కామె గర్భందాల్చడం వలన పతి సంపర్కం కూడదని – నేను వెళ్ళడాని కెలాగో అంగీకరించి – ఒక వీణ నాకిచ్చి అపూర్వరాగ మొకటి మీటిచూపి – “ఏకాంతంగా కూర్చుని ఈవీణ మీద ఆరాగం పాడితే నేను నీచెంతకు వస్తాను. యక్షకాంతలం కనక మాకా సామర్ధ్యముంది. ఈ రహస్యం ఎవరికీ చెప్పకండి సుమా! కావలసినప్పుడల్లా రప్పించుకోండి” అని చెప్పింది.

“నే నీగుహలోకి రావడానికి నానా యాతనలూ పడ్డాను. ఇక్కడినుంచి ఎలా వెళ్ళేది?” అని అడగ్గా ఆమె మల్లికకు సైగ చేసింది. ఆమె మరోదారిలో నన్ను రెండు గడియల్లో శ్రీశైలంలో వదలి అనుజ్ఞ తీసుకుని వెళ్ళిపోయింది. అది వారికి తప్ప ఇతరులకి తెలియని మార్గం. నేను శ్రీశైలం మలికార్జుడిని ఆరాధించి – అనేక గ్రామాలు దాటి ఉజ్జయిని చేరుకున్నాను.

అక్కడ విక్రమార్కుడిచే స్థాపించబడిన సత్రంలోకి వెళ్ళి చూడగా అక్కడ ఒక గదిలో మన రాముడు కనిపించాడు. కాని అతనేమిటో ఆలోచిస్తూ నన్ను గుర్తు పట్టలేదు. నే నతన్ని కౌగలించుకుని – “నేను నీ తమ్ముడు చంద్రుణ్ణి, నువ్విక్కడి కొచ్చి ఎన్ని రోజులైంది? ఎక్క డెక్కడికి పోయావు? ఏం వింతలు చూశావు? మన సోదరులు వచ్చారా? సొమ్మంతా ఏంచేశావు? వివాహం చేసుకున్నావా? నీ వృత్తాంతం చెప్పు” అని అడిగాను.

అప్పు డతను నన్ను చూసి చాలా ఆనందిస్తూ తన వృత్తాంతం వివరించ సాగాడు.



# రాముడి కథ

"తమ్ముడూ! మనం నలుగురం ఒక్కసారే పట్నం వదిలాంకదా. నేను ధనమంతా గుర్రాల మీదెక్కించుకుని పశ్చిమ దేశానికి వెళ్ళాను. అరణ్యమార్గంలో వెళ్తూండగా ఒక దొంగల గుంపు నామీద పడి ప్రాణాలు మాత్రం వదిలి ధనమంతా దోచుకు పోయింది. అప్పుడు నేనొక్కడినే ఒక మార్గంలో పోయి అడవిలో నడవగా నడవగా ఒక పల్లె కనిపించింది. అక్కడొక రెడ్డింటికి పోయి అన్నం పెట్టమని అడిగాను.

ఆ రెడ్డి నా వృత్తాంతమంతా విని కనికరంతో నన్ను కొన్ని రోజులు వాళ్ళింట్లో ఉంచుకుని ఉపచారాలు చేశాడు. అతడు ఒక దొంగల రాజు. ఆదేశంలో ఉన్న దొంగలు దోచుకున్న సొమ్ములు తెచ్చి అతని ముందుంచుతారు. అతను ఆ సొత్తును వారికి పంచుతాడు. అంతేకాకుండా ఏ దారులు కొట్టాలో, ఏ వూళ్ళు దోచుకోవాలో, ఎవరింటికి కన్నం వేయాలో, అందరికీ చెబుతాడు. దోచుకుని వచ్చిన దొంగలు ఆ రెడ్డికి జరిగిన కథలన్నీ వివరంగా చెబుతారు.

పదిరోజులపాటు వారి మాటలు వినేసరికి నా కావిద్య పట్టుబడి పోయింది. రెడ్డి నా బుద్ధి సూక్ష్మత కనిపెట్టి నన్నుకూడా తగినవారితో దొంగతనానికి పంపేవాడు నేను నైపుణ్యంగా కన్నంవేసి బంగారం, వెండి తస్కరించి తెచ్చి అతని కిచ్చేవాడిని.

అలా కొన్నాళ్ళు గడిచాయి. ఆ రెడ్డికి రుచిర అనే కూతురుంది. పదహారేళ్ళ వయసున్న దానిని తన మేనల్లుడి కిచ్చి పెళ్ళి చెయ్యాలని రెడ్డి ప్రయత్నిస్తూంటే ఆమె నా మీద ప్రేమ పెంచుకుని ఆ విషయం ముందు నాకు చెప్పింది. నేను సంతోషించి ఆమెతో రహస్యంగా క్రీడించేవాడిని.

ఆమె వివాహనికి ముహూర్తం సమీపించగా ఒకనా డర్ధరాత్రి విలువైన మణులూ, రత్నాలూ కొన్ని తీసుకుని మేమిద్దరం అరణ్యంలోకి పారిపోయాం. క్రమంగా ఊళ్ళు దాటి చివరి కీ వూరు చేరాం.

ఈ వూళ్ళో కొన్నాళ్ళ పాటు ఆమెతో రాత్రి పగలు తెలియకుండా మన్మధక్రీడల్లో మహాసుఖం పొందాం. మేము తెచ్చిన సొమ్ము స్వేచ్ఛగా ఖర్చుపెట్టగా ఒక నెలకి సరిపోయింది. తరువాత సొమ్ములేక నేను విచారిస్తూంటే – "మనిద్దరికీ చోర విద్య చక్కగా తెలుసు. మీరు కన్నం తవ్వండి. నేను లోపలికిపోయి ఎంత భద్రంగా దాచిన వస్తువులనయనా సంగ్రహించి తేగలను" అంది.

నేనింకా ఆలోచిస్తూంటే – "ఈ రాత్రి అమావాస్య. ఈ పట్నం రాజుగారింటికి కన్నం వేద్దాంరండి" అంది. ఆ రాత్రి విక్రమార్క మహారాజు నిద్రపోతున్న అంతఃపురానికిచేరి కన్నం వేశాం.

అప్పుడు విక్రమార్కుడు భార్యతో ఏదో మాట్లాడుతూ చౌర్య రహస్యాలగురించి చెప్పి... "రెడ్డి అనే వాడొకడు చోరవిద్యలో బహుదిట్ట. వాడిని పట్టుకోవాలని ఎన్నో విధాల ప్రయత్నిస్తున్నాను. వాడి జాడ తెలయడంలేదు" అంటూ చోరకళ గురించి వివరిస్తున్నాడు.

ఆ సమయంలో మేం గదిలోని వస్తువులు సంగ్రహించాం. వెళ్ళిపోయే సమయంలో శ్రుతి చేయబడిన వీణ కనిపించగా ఊరుకోలేక వెళ్ళి వేలితో మోగించాను. విక్రమార్కుడు ప్రమాదం గ్రహించి తటాలున లేచి ఆ గదిలోకి వచ్చి రుచిరను పట్టుకున్నాడు. నేను దొరక్కుండా పారిపోయాను. కాని నా ప్రాణాలన్ని రుచిర మీదే ఉన్నాయి.

రుచిరను పట్టుకుని ఆ రాజు – "నువ్వెవరివి? నీతోవచ్చిన వా డెవరు? నీవృత్తాంతం చెప్పు నిజం చెబితే నిన్ను వదిలేస్తాను" అంటూ ఎంత అడిగినా మూగదానిలా మాట్లాడక ఆకాశంవేపు వేలు చూపుతుందట. సభలో దానిని రాజభటులు పరాభవించబోతే – స్త్రీ అవడంవలన అలా చేయ్యద్దని వారించాడట.

ఈ స్త్రీ దొంగచేత మాట్లాడించినా, గజదొంగను పట్టి ఇచ్చినా వారికి మంచి పారితోషిక మిస్తానని రాజు మొన్నటి దినం చాటింపు వేశాడు. కొత్వాలు ఈ సత్రంలోనికి వచ్చి కొత్త వాళ్ళని పరిశీలించాడు.

కాని నా ఆకారం గౌరవనీయంగా ఉండడంతో నన్నేమీ అడగలేదు. ఇదీ నా వృత్తాంతం. దైవంలా వచ్చావు నువ్వు. నా ప్రాణనాయికని విడించుకునే ఉపాయం చెబితే నేను బ్రతికి వుంటాను. లేదా నీకళ్ళముందే ప్రాణాలు వదులుతాను.

రుచిర ఎంతచక్కనిదో! అందానికి ఆమెను చెప్పివేరొకరిని చెప్పాలి. నేనంటే ఎంత అనురాగమో! ఎంత తెలివైనదో! అంటూ కన్నీరు కార్చడం చూసి, వీడు ఉత్తమవంశంలో జన్మించిన కారణంగా చోరకృత్యాలకు పూనుకోవడానికి, నీచజాతి స్త్రీని కూడడానికీ మాతృదోషమై ఉంటుదనుకున్నాను. రుచిరంటే చాలా ప్రేమ కనక వీడి నిప్పుడు మార్చలేము. తరువాత చూద్దాం. ఇప్పుడెలాగేనా రుచిరని విడిపించుకు రావడమే మంచిది – అనుకుని – "అన్నా! విచారించకు. రెండుమూడు రోజుల్లో నిన్ను రుచిరతో జతపరుస్తాను" అని అత న్నోదార్చాను.

మర్నాడు విక్రమార్కుడి ఆస్థానానికి వెళ్ళాను. రాజుగారి పీఠం దగ్గరగా నిలబెట్టబడిన రుచిరను చూచి– ఎంత అందమైందో! – అని ఆశ్చర్యపోయాను.

ఎప్పటిలాగే రాజభటులు ఆమెను – "నువ్వెరివి? నీ వృత్తాంతం చెప్పకపోతే నిన్ను దండించక మానం" అంటూ బెదిరిస్తూంటే ఆమె ఏమీ మాట్లాడక ఆకాశం వేపు వేలు చూపించింది.

అప్పుడు నేను లేచి – "రాజా! ఈమెను మాట్లాడించిన వారికి పారితోషిక మిప్పిస్తానని చాటించారు. నేను మాట్లాడిస్తాను. ఆ పారితోషిక మేదో చెప్పండి" అన్నాను. రాజు నన్ను చూసి–"ను వ్వెవరి?" అని అడిగాడు.

నేను "తరువాత చెబుతాను. ముందు మీరు పారితోషికం ఏమిటో చెప్పండి.' అన్నాను. "నువ్వేం కోరితే అదే ఇస్తాను" అన్నాడాయన.

నేను ఆ మాటకి చాలా సంతోషిస్తూ రుచిరవద్దకు వెళ్ళి ఆమె చెవిలో – "నేను మీ మరిదిని. రాముడు మా అన్న. నిన్ను విడిపించుకు

రమ్మని పంపించాడు. నీకేమీ భయంలేదు. నీ విడుదలనే రాజుగార్ని పారితోషికంగా కోరతాను" అని చెప్పి –

రాజుగారితో "మీరేం అడుగుతారో అడగండి" అన్నాను.

రాజుగారు – "నువ్వెవరివి?" అని అడిగారు

రుచిర : ఆడదాన్ని

రాజు : ఎవరి కూతురివి?

రుచిర : జనకుని కూతురిని

రాజు : ఎవరి భార్యవి?

రుచిర : జగదభిరాముని భార్యని.

ఆమాటలలోని గూఢార్థాలకి రాజు చాలా సంతోషించి ఇంకా ఏవేవో అడగబోతుండగా నేను లేచి – "దేవా! నే నామెను మాట్లాడించాను. నా పారితోషికం ఇప్పించండి. నేను వేగంగా వెళ్ళిపోవాలి" అన్నాను.

"నీ కోరికమిటో చెప్పు. అవితీర్చాకే నా పని చూసుకుంటాను" అన్నాడు రాజు.

"రాజా! ఈమె నింకేమీ అడగకుండా విడిచి పెట్టడమే నా కోరిక" అన్నాను.

"సరే ఈమెను విడిచిపెడతాను కాని – మేము నువ్వెవరి వని అడిగి నప్పుడు ఆకాశంవేపు వేలుచూపించింది. దానర్థమేమిటో తెలుసుకుని విడిపిస్తాం. అదేమిటో చెప్పమను" అన్నాడు.

నే నామెనుండి తెలుసుకుని – మరేమీ కాదు రాజా 'నేను మీ చేతిలో చిక్కాను. నన్ను రక్షించగలిగన వాడు భగవంతుడే అతడే! నన్ను విడిపించాలి' అని ఆకాశం వేపు వేలుచూపించింది. అంతే" అని చెప్పాను.

రాజు మెచ్చుకుంటూ ఆమెకి కొత్తబట్టలూ, నగలూ ఇచ్చి విడుదల చేశాడు. నే నామెను సత్రానికి తీసుకొచ్చి రాముడి కప్పగించాను. వారిద్దరూ ఆరోజు వారిద్దరూ విరహతాపం తీర్చుకున్నారు.

మర్నాడు నేను రాముడిని ఏకాంతంగా సమీపించి "అన్నా! సహవాస దోషంవల్ల ఎవరికేనా దుర్గుణాలు అలవడక మానవు. దొంగతో పరిచయం వల్ల నీకు దొంగబుద్ధి అబ్బింది. మనం గొప్ప వంశంలో జన్మించాం. నీచపు పనులు చెయ్యకూడదు. ఈ రుచిర తెలివైనదే అయినా జాతి ప్రభావంవల్ల తన పనులు మానదు. అదీకాక ఉత్తమజాతి స్త్రీవలనే ఉత్తమ సంతానం కలుగుతుంది. రుచిరను పుట్టింట్లో వదలిరా. నీకు దేవకాంతను పెళ్ళి చేస్తాను. మల్లిక అనే యక్షకాంత నేను చెప్పినట్లు వింటుంది" అంటూ నేను శ్రీశైలం వెళ్ళింది మొదలు జరిగిన కథంతా చెప్పాను.

రాముడెంతో ఆనందిస్తూ – "నీవీణా మహత్యం చూడాలనుంది. ఈ రాత్రి చారుమతి నిక్కడికి రప్పించు – " అని అడిగాడు. ఆరాత్రి ఏకాంత ప్రదేశంలో కూర్చుని ఆ వీణమీద రాగం ఆలపించగా చారుమతి అక్కడి కొచ్చింది. అప్పుడు రాముడికి సైగ చేయగా అతను మేమున్న గదిలోకి తలుపు తెరచుకుని వచ్చాడు.

అతన్ని చూసి చారుమతి మాయమై పోయింది. నేనొక్కడినే తప్ప యితరు లుండేటప్పుడు తనని పిలవకూడదని ఆమె చెప్పిన మాట మరచిపోయినందుకు విచారిస్తూ అతని కామాటే చెప్పాను.

ఆ రాత్రి వాడు రుచిరతో – "మాతమ్ముడి మాటలు విన్నావా? నువ్వు నాకు తగినదానివి కావట! మనమిద్దరమూ ప్రేమగా ఉండడం వాడి కిష్టం లేదు. వాడొక యక్షకాంతను దక్కించుకుని – దాని దాసితో నాకు పెళ్ళిచేస్తాడట! ఎంత బాగుందో చూడు. సవతి బిడ్డల కంతకంటె ఎక్కువ ప్రేమ లుంటాయా? నాకు వాడి పాటి తెలివితేటలు లేవనుకున్నాడు" అంటూంటే వీధిలోంచి వచ్చిన నా కా మాటలు వినిపించాయి.

నన్ను గమనించి వాళ్ళు మాటలు కట్టి పెట్టేశారు. వాళ్ళదుర్బుద్ధి తెలిసి ఆ రాత్రి నేను పడుకునే గదిలో పరిచారకుణ్ణి పడుకోబెట్టి నేనే మరోచోట పడుకున్నాను.

పొద్దుట వెళ్ళి చూసేసరికి వాడు కత్తివేటుకి చచ్చి పడున్నాడు నా వీణ కూడా కనపడలేదు. నాకెంతో దుఃఖం కలిగింది. ఇక నేను చారుమతి నెలా కలుసుకోగలను? - వాడికోసం ఊరంతా వెదికాను కానీ వాడుకనపడలేదు. అడవులు, పల్లెలు, పట్నాలు, గ్రామాలు వెదుక్కుంటూ ఇక్కడి కొచ్చాను. దైవవశాత్తూ నువ్వు కనిపించావు. మనమిద్దరం సోదరులవల్ల భార్యలేని వాళ్ళమయ్యాం. భార్యలేని బతుకూ ఒక బతుకేనా? - అంటూ విలపించాడు.

విజయుడు చంద్రుణ్ణి ఓదార్చుతూ – "దేముడు చేసిన దానికి వగచి లాభమేమిటి? అదృష్టముంటే మళ్ళీ అన్నీలభిస్తాయి. తగిన ప్రయత్నం చేద్దాం. వీణ దొరక్కపోతే మళ్ళీ ఆ పర్వతాలకు వెళ్దాం. అదీకాక యక్షిణులకు దివ్య దృష్టి ఉంటుంది. నువ్వెక్కడున్నా చారుమతి వెతుక్కుని వస్తుంది" అంటూ అతని విచారాన్ని తొలగించాడు.

తరువాయి కథను మణిసిద్ధుడు అప్పటికి వేళదాటి పోతూండడంతో తరువాతి మజిలీలో చెప్పాడు.

# కాశీ మజిలీ కథ

## 26. వ మజిలీ

గోపాలా! వినుమరి! ఆ అన్నదమ్ములిద్దరూ అలా మాట్లాడుకుని మర్నాడు ఉదయం ఆవూరు వదిలి స్వదేశానికి వెళ్తూ ఒకనాటి రాత్రికి భీమవర్మ పాలించే విజయపురానికి చేరుకున్నారు. అక్కడ విజయుడిచేత స్థాపించబడిన ధర్మసత్రానికి వెళ్ళి వాకబు చేయగా ఆ సత్రం విజయుడునే మహానుభావుడు కట్టించాడనీ అతను స్వర్గస్తుడయ్యాడనీ అక్కడివారు చెప్పారు.

ఆమాటలు విని విజయుడు తమ్ముడితో తానక్కడ చేసిన వన్నీ రహస్యంగా చెప్పి సత్రంలో నలుమూలలా తిరుగుతూంటే అక్కడొక శిలాశాసనం కనిపించింది. దానిమీద రాజు విజయుణ్ని ఎన్నోవిధాలుగా ప్రశంసిస్తూ రాయించిన శాసనం ఉంది.

అక్కడినుంచి నడుస్తూంటే వారికొక గదిలోంచి మాటలు వినిపించాయి.

"అన్నా! వాళ్ళకి మొదటినుంచీ మనమిద్దరమూ అంటే అసూయే. నేను రుచిరతో ఉండడం ఇష్టం లేక ఎన్నో చెప్పాడు. మనల్ని నమ్మి తల్లి తండ్రుల్ని వదిలి వచ్చిన ప్రియురాలిని విడచి పెట్టడం న్యాయమా?"

"కాదు. తన్నాశ్రయించిన వారినెవరినైనా విడచిపెట్టకూడదు"

"పోనీ, తాను నాకు పెళ్ళి చేస్తానన్నది మాత్రము మంచిదా? తన భార్య దగ్గరదాసి. మేమిద్దరమూ వారిద్దరికీ దాసులై ఉండాలని కాబోలు"

"వాడి భార్యని నువ్వు చూశావా?"

"ఎర్రగా ఉండగా సరా? నేను తిన్నగా చూడలేదు. నాకు రుచిరే బాగుంది."

"వీణమీటి రప్పించి సరిగా చూడలేక పోయినావా?"

ఎన్నిపాట్లు పడ్డా ఆ వీణను సవరించడమే తెలియలేదు.

"ఆవీణని ఏం చేశావ్?"

"దారిలో బత్తెంలేక ఒక బ్రాహ్మణుడి కమ్మేశాను "

"అయ్యో! ఎంత పని చేశావ్ ఆ బ్రాహ్మణు డెవరో జ్ఞాపకం ఉందా?"

"ఆయనొక మార్గస్థుడు. దారిలో తారసపడ్డాడు. తవ్వెడు బియ్యానికి దుకాణం మీద బేరం జరుగుతూంటే తాను బియ్యాన్నిచ్చి వీణ తీసుకున్నాడు"

"నువ్వు వీణ తెచ్చినట్లు చంద్రు డెరుగునా?"

"తెలిస్తే తీసుకు రానిస్తాడా? చంపేశాను."

"ఐతే మన మిద్దరమూ వీరపురుషులమే."

"క్షత్రియవంశంకదా. అన్నట్లు నువ్వు విజయుణ్ని చంపే హేమని తీసుకెళ్ళావా?"

"ఆ, ఏం లాభం? ఆ రండ నామాట విన్నదికాదు."

"అడవిలోకి తీసుకెళ్ళి నిర్బంధించలేక పోయావా?"

"చెయ్యవలసిం దంతా చేసి చూశాను చంపుతానన్నా లొంగకపోతే ఒక నూతిలోకి తోసేశాను అంతలో ఒక బ్రాహ్మణుడు స్నానం చేయడానికి వస్తూంటే నేను పారిపోయాను."

"మంచి పని చేశావు ఇక మనం ఇంటికి పోయి నిరభ్యంతరంగా రాజ్యం చేసుకోవచ్చు."

"నేనొక్కడినే వస్తే తండ్రి ఆక్షేపిస్తాడు నే నెవరినేనా పెళ్ళి చేసుకోవాలి. నీకైతే రుచిరుంది".

"దానికి చింతెందుకు? నీ కిష్టమైన స్త్రీని ఏరుకో. రాత్రి కెళ్ళి కన్నం వేసి ఆమెను తెస్తాను తెల్లారేసరికి దేశం దాటిపోదాం."

"అలా ఐతే రేపు బిచ్చగాడి వేషం వేసుకుని చూసొస్తాను. చాలావేళైంది పడుకో. నిద్రపో. రుచిర పడుకుంది కాబోలు..."

"నాలుగు రాత్రులు నుంచి నిద్రలేదు చిన్న కన్నం వేయగా చిక్కులొచ్చాయి. దాటాములే. రాత్రికి రాత్రి నడచి ఇంతదూరం రావడం వల్ల నిద్రపోయింది. లేకపోతే మనకంటే ఎక్కువగానే మెలకువగా ఉండేది"

ఆమాటలు విన్న విజయుడూ, చంద్రుడూ ఆశ్చర్యపోయారు.

"చూడు భానుడెలాటి పనిచేశాడో! నన్ను నరికి నా ప్రియురాలిని నూతిలో పడదోశాడు. ఆమె ఎన్ని కష్టాలు పడిందో, ఇలాటి వాళ్ళు క్షత్రియవంశంలో ఎందుకు పుడతారో. కత్తివ్వు. వీళ్ళనిప్పుడే నరికేస్తాను" అని కోపగించిన విజయుణ్ని చంద్రుడు – "అన్నా! వదిన కేమీ అపకారం జరిగుండదు. ఆ బ్రాహ్మణుడెవరో రక్షించే ఉంటాడు. ఎంతయినా వీళ్ళు మన సోదరులే! చంపడం న్యాయం కాదు" అంటూ శాంతింప జేశాడు.

తెల్లవారాక వాళ్ళు వీళ్ళూ ఎదురుపడి పోయారు.

"తమ్ములారా! క్షేమంగా ఉన్నారా?" "అంటూ పలకరించి కౌగలించుకున్నారు. భానుడూ రాముడూ సమయానికి తగ్గట్లు సమాధానాలు చెప్పారు.

అప్పుడు భానుడు – "అన్నా! అవేళ నువ్వూ వదినా దూరంగా చెట్టుకింద పడుకున్నారు అప్పుడొక పెద్దపులి నాపై దూకబోగా నేను భయపడి పరుగెత్తాను. అది నన్ను చాలా దూరం తరిమింది. తరవాత కొన్ని రోజులకి మీరున్న చోటుకి వచ్చి చూడగా మీరు లేరు. అది మొదలు మిమ్మల్ని వెదుకు తున్నాను" అన్నాడు విజయుడితో.

అప్పుడు రాముడు కూడా – "తమ్ముడూ! నువ్వూ సత్రంలో మరో గదిలో పడుకున్నావు కదా. ఆ రాత్రి మమ్మల్ని శోధించడానికి రాజభటులు సత్రానికి వచ్చారని జాడ తెలిసి మేము పారిపోయాం" అని చంద్రుడికి చెప్పాడు. వాళ్ళిద్దరూచెప్పిన అబద్ధాలకు వీళ్ళు ఆశ్చర్యపోయారు.

విజయుడు – "తమ్ముళ్ళూ! మనం ఇల్లు విడిచి వచ్చి చాలాకాలమైంది. మన తల్లితండ్రులు మనకోసం చాలా ఆరాటపడుతూ ఉంటారు ఇంటికి పోదాం" అన్నాడు. చంద్రుడు అంగీకరించాడు కాని మిగిలిన ఇద్దరూ మరికొన్నాళ్ళు దేశాటనం చెయ్యాలనుకున్నారు. విజయుడు సూటిగాకాక పరోక్షంగా వాళ్ళని మందలించాడు. వాళ్ళిద్దరూ రహస్యంగా మాట్లాడుకుని వీళ్ళని చంపడానికి ప్రయత్నాలు చేయసాగారు.

విజయుడు తన భార్యజాడ తెలుసుకుందుకు – బలవర్ధనుడు పాలించే కరిపురం వేపు వెళ్తూ ఒక అరణ్యంలో నూతి దగ్గరలో భోజనానికి ఆగగా రుచిర మంచినీటికోసం నూతి వద్దకు పోయి తొంగిచూసి "ఈ నూతిలో ఇద్దరు స్త్రీలు మునుగుతూ తేలుతూ ఉన్నారు" అని కేకలు వేసింది. విజయుడు, చంద్రుడు నూతిలోకి తొంగి చూసారు. ఆ సమయంలో భానుడు, రాముడు వారి కాళ్ళుపట్టుకుని నూతిలోకి తోసేశారు. తరువాత వాళ్ళు ఎక్కడికో పారిపోయారు

విజయుడు, చంద్రుడికీ, ఈతవచ్చు కనుకపైకి తేలి రాళ్ళని ఊతంగా పట్టుకున్నారు. కాని ఆ నుయ్యి చాలాలోతు. లోపలినుంచి ఎంత గట్టిగా కేకలు వేసినా ఎవరికీ వినపడదు. వాళ్ళిద్దరూ నాలుగు రోజులు నిగ్రహించుకుని ఆకలి కాగలేక స్పృహ తప్పారు.

ఆ ప్రాంతంలో ఒక భాగ్యవంతుడి ఇంట్లో వెండి బంగారాలుకల పెట్టెలను దొంగిలించి ఎత్తుకు పోతూంటే ఆ ఇంటియజమాని పదిమందితో వాళ్ళని తరుముతూ వచ్చాడు. ఇంక దొరికిపోతామనుకున్న దొంగ లా పెట్టెల్ని నూతిలో పారేసి పారిపోయారు. అది చూసిన ఒకడు యజమానికి చెప్పగా అతను గొలుసులు, పగ్గాలు మొదలయిన వన్నీ తెప్పించి మనుషులని నూతిలోకి దింపాడు.

వాళ్ళు వివశులై పడున్న రాజకుమారులని చూసి – "దొంగలు దొంగలు" అని అరిచారు. దాంతో ఎవరూ నూతిలో దిగడానికి సాహసింపలేదు. డబ్బుకాశపడిన కొందరు నూతిలోకి దిగి వాళ్ళని పలకరించ బోయి .. జవాబు రాకపో ఊపిరి పరీక్షించి "వీళ్ళు

చచ్చిపోయారు" అని కేకలు వేయగా యజమాని శవాలను పైకి తే దానికి గంపలను దింపించాడు.

వాళ్ళు పైకి లాగబడ్డాక చూసి..."వీళ్ళు నీటిలో ఉండడం వల్లశరీరాలు తెల్లబడ్డాయి. వీళ్ళా దొంగలు కారు. ఇంత తొందరలో శరీరం ఇలా మారదు. వీరికింకా ఊపిరుంది" అంటూ ఆ దయామయుడు మజ్జిగ, అన్నం తెప్పించి పోసి...వారి శరీరాన్ని నిప్పుతో కాపించగా వాళ్ల శరీరాలకి చెమటలు పట్టాయి. అంతలో పనివాళ్ళు నూతిలోంచి పెట్టెలను బయటకు తీశారు.

యజమాని చేసిన ఉపచారాల వల్ల రాజపుత్రులకు మర్నాడే తెలివొచ్చింది. అతను చేసిన ఉపకారానికి చాలా సంతోషించి - తమ వృత్తాంతం చెప్పి - కొన్ని రోజులుండి - మళ్ళీ ప్రయాణం కట్టారు. కరిపురం చేరి రాజమార్గంలో వెళ్తూండగా ఒక భవనం ద్వారానికి - "వీణావాదన పరీక్షామందిరం" అనే ప్రకటన కనిపించింది.

చంద్రుడు "అదేమిటో చూసివద్దాం - అన్నాడు.

"ఇప్పుడు చాలావేళ అయింది రేపొద్దాంలే" అన్నాడు విజయుడు.

అంతలో లోపలినుంచి ఎవరో రాగా - ఆ ప్రకటన ఏమిటని వారి నడిగాడు చంద్రుడు. అందుకాయన - "ఇక్కడ ఒక విపరీతపు వీణ ఉంది. దానిని శ్రుతి చేసి పాడిన వారికి పారితోషిక మిస్తానని మా రాజపుత్రిక ప్రకటించగా ఎందరో వైణికులు ప్రయత్నించి భంగపడ్డారు. మీరు కావాలంటే ప్రయత్నించండి" అన్నాడు. చంద్రుడా వీణను చూసి "నాదే...నాదే" అని ఆనందంతో గంతులు వేశాడు.

విజయు డక్కడున్న అధికారులతో - "మే మీ వీణను శ్రుతి చేసి పాడగలం. దీనివలన మాకు కలిగే లాభమేమిటి? మీ రాజపుత్రిక ఎవరు? ఎందుకీ శాసనం చేసింది?" అని అడిగాడు.

"అవేం మాకు తెలియవు. మీపేర్లు చెబితే రాజపుత్రిక కందిస్తాం" అన్నారు.

రాజకుమార్తె అప్పటికప్పుడే సభ ఏర్పాటు చేయమని పన్నెండేళ్ళ వయసుకల తన కొడుకుని సభకు పంపింది. ఆ కుర్రవాడిని చూడగానే విజయుడి హృదయంలో విచిత్రమైన స్పందనలు కలిగాయి. తన భార్య హేమని చూసినట్లే అనిపించింది. "ఆ బాలుడిలో నీ పోలికలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. నా కుడి కన్నదురుతోంది. ఇది శుభసూచకం" అన్నాడు చంద్రుడు.

అతను వీణమీద మోహనరాగం ఆలపించే సరికి శ్రోతలంతా మోహంతో నాట్యం చేశారు. అతని అపూర్వ గానాన్ని ఎంతో మెచ్చుకున్నారు శ్రోతలు. విజయుడాబాలుడి దగ్గరకు చేరి వివరాలడగ్గా – "నేను విజయుని పుత్రుణ్ణి మాతల్లి పేరు హేమ. నాపేరు గజదత్తుడు" అని చెప్పాడు.

"మీ తండ్రి ఎక్క డుంటాడు?"

"మా తల్లి ఎరుగును."

"బాబూ! మీ తండ్రిని మే మెరుగుదుం. అందుకే నిన్నింతగా చూస్తున్నాం. ఈ వార్త మీ తల్లికి చెప్పు" అన్నాడు విజయుడు

గజదత్తుడు తల్లి వద్దకు పోయి – సభావిశేషాలు చెప్పి..."నా తండ్రితో బాంధవ్యముందని చెప్పారు" అనగా ఆమె వారిని ఉన్నపళాన తీసుకురమ్మంది.

"ఎన్నిసార్లయినా మీరు రాజపుత్రికే అంటారేం? ఈ దేశానికి మగప్రభువు లేడా? వచ్చిన వారందరినీ మీ రాజపుత్రిక అంతఃపురానికి రప్పించుకుంటుందా? ఆమె చరిత్రేమిటి? ఆమె భర్తెవరు?" అని అడిగాడు విజయుడు.

"అయ్యో! మీ రెరుగరా? ఇప్పుడామె దేశాన్ని పాలిస్తోంది. స్వర్గస్థుడైన తండ్రికి పుత్ర సంతానం లేదు – రాజపుత్రిక పేరు హేమ. ఆమెపతిపేరు విజయుడు. ఆయ నెక్కడున్నాడో తెలియదు. ఇందాకా సభకు వచ్చిన వా డామె కొడుకు సుగుణాలలో ఆమె అరుంధతే. అతి పవిత్రురాలు" అంటూ వాళ్ళని అంతఃపురంలోకి తీసు కెళ్ళారు.

గజదత్తుడు వారి కెదురొచ్చి ఆహ్వానించి రత్నపీఠాల మీద కూర్చోబెట్టాడు. తెరచాటునుండి చూసిన హేమ పరుగున వచ్చి విజయుడి పాదాల మీద పడి – "జీవించి..కుశలంగా వచ్చారా!" అంటూ ఆనంద బాష్పాలు కురిపించింది. విజయు డామెను కౌగలించుకుని ఊరడించాడు. కొడుకుని కూడా ఆలింగనంచేసుకుని ఆనందించాడు.

అప్పు డతను – "హేమా! నువ్వు నన్నెందుకు.విడిచి వచ్చావు? ఎక్క డెక్కడ తిరిగావు?" అంటూ వివరాలు అడిగాడు.

## హేమ కథ

"మనం చెట్టు కింద నిద్ర పోతూంటే మీ సోదరుడు కత్తితో మీ మెడమీద వేటు వేసి నన్ను లేపి బలాత్కారం చేయబోయాడు. మిమ్మల్ని వధించినట్లు చూడగానే నేను మూర్ఛపోయాను. ఆ స్థితిలో నన్నొక అడవికి తీసుకుపోయాడు. అక్కడ నాకు తెలివొచ్చాక భార్యగా ఉండమని నిర్బంధించాడు. నేను ఎంతమాత్రం ఒప్పుకోకపోవడంతో నన్ను ఒక నూతిలోకి తోసి పారిపోయాడు. అంతలోనే ఒక బ్రాహ్మణుడు ఆ నూతివద్ద స్నానం చేయడానికి వచ్చి నన్నుచూసి పైకి తీసి దగ్గరలో ఉన్న అగ్రహారం లోని తనింటికి తీసుకెళ్ళి నా వృత్తాంతం అంతా విన్నాడు. జాలిపడి కొన్నాళ్ళు తనింట్లో పెట్టుకుని కాపాడాడు.

నేనప్పటికి గర్భవతిని కనుక ఆ చిహ్నాలు చూసి నన్ను కన్న కూతురిలా చూసుకుంటూ పోషించాడు. నేనెప్పుడూ మీ గురించే ఆలోచిస్తూవుండేదాన్ని. పదవమాసంలో ఈ బిడ్డడుపుట్టాడు. మాకు ఏ లోటూ లేకుండా జాతకర్మ నామ కర్మాదులు చేసాడు. వీడి కైదేళ్ళు వచ్చేసరికి పిల్లలతో ఆడుకుంటూండగా – ఆ అగ్రహారం అరణ్యమధ్యంలో ఉండడంవల్ల ఒక ఏనుగు వీడి నెత్తుకుని అడవిలోకి తీసుకొని పోయింది.

నేను గుండెలు బాదుకుంటూ అది వెళ్ళిన వేపు పోయాను. ఆ బ్రాహ్మణుడు కూడా నన్ననుసరించాడు. పిల్లవాడు కనపడలేదు. నేను

చచ్చి పోదామని ఆయనను వెనక్కి పొమ్మన్నాను. కాని అతను నా ఉద్దేశం గ్రహించి - "నీ కుమారున కేమీ భయంలేదు. రాజౌతాడు. నువ్వు మళ్ళీ నీ పతిని కలుసుకుంటావు నేను లగ్నం కట్టి చూశాను." అంటూ నన్ను చావనివ్వక ఇంటికి తీసుకుపోయాడు

కొడుకు మీద బెంగతో నిద్రాహారాలు మాని నేను కృశిస్తూ దినమొక యుగంగా గడుపుతూంటే ఒకనాడు రాజభటులు వచ్చి "ఏనుగు ఎత్తుకుపోయిన పిల్లవాడి తల్లెవరు?" అంటూ అడుగుతూ వచ్చారు.

"ఆ పాపాత్మురాలిని నేనే" అని చెప్పగా ..."మీ పుత్రుడు కుశలంగా ఉన్నాడు. మిమ్మల్ని చూడాలని తొందరపడుతున్నాడు" అన్నారు.

నేను పొంగిపోయి - "నిజమేనా? నాకొడుకెలా బతికాడు?" అనడిగాను. "మా రాజుగారికి వేటలో మంచి ప్రావీణ్యముంది. మొన్న ఏనుగు తొండంతో మీ అబ్బాయిని పట్టి తీసుకుపోతుండగా దానినుంచి మీ వాడిని తప్పించారు. మీ వాడు అమ్మ, తాత అని ఏడుస్తూంటే ఎక్కడున్నారని అడిగి - ఈ దిశ చూపగా గ్రామాలలో ఈ వార్త చెప్పి వీడి తల్లిని తీసుకురమ్మని పంపారు" అన్నారు.

"ఆ కరుణామయునిది ఏదేశం? ఇక్కడికి ఎంతదూరం?"

"కరిపుర ప్రభువు బలవర్ధనమహారాజు నీ పుత్రుణ్ణి రక్షించారు. ఆ దేశానికి ఇక్కడి నుండి మూడు రోజుల ప్రయాణం చేస్తేకాని చేరలేం" అన్నారు. నేను బ్రాహ్మణునితో..."ఆ రాజు మా తండ్రి.

నన్ను కులటగా భావిస్తాడేమో? ఏం చేయాలి?" అని అడగ్గా - "నేను నీతో వచ్చి నా కూతురిగా చెప్పి అన్ని సంగతులూ సమయోచితంగా తెలియచేస్తాను"

అంటూ ఆయన నాతో కూడా బయలు దేరాడు.

అక్కడ నన్నెవరూ గుర్తు పట్టలేదు. నా కొడుకుని చూడడమేమిటి, ఆనందంగా కౌగలించుకుని ఏడిచాను. అప్పుడు బ్రాహ్మణుడు నా వద్దకు వచ్చి - "తల్లీ! మీ తండ్రి భార్య మాటలు విని నిన్ను శిక్షించడానికి వెదకి తెమ్మని చారులను పంపగా - మీరు మొదట

నివసించిన ఇంటి యజమానుడు మీరాడుకున్న మాటలు విని ఉండడం చేత ఆ వృత్తాంతం మీ తండ్రికి చెప్పాడట. దాంతో నిజం తెలిసి నీకోసం చాలా విచారిస్తూ నిన్ను వెదకి తెమ్మని నలుమూలలకీ దూతలను పంపాడట. నీ సవతి తల్లిని కారాగారంలో ఉంచి నిజం చెప్పమని నిర్బంధిస్తున్నాడట. కనక నీ వృత్తాంతం ఆయనకి చెప్పి ఇక్కడికి తీసుకొస్తాను" అన్నాడు.

నే నంగీకరించాను. ఆయన వెళ్ళి ఏం చెప్పాడో, మా తండ్రి దుఃఖిస్తూ నా వద్దకు వచ్చాడు. నా వృత్తాంతమంతా తెలుసుకున్నందువల్ల అతను నాతల్లిని చంపబోయాడు కాని - నేను వారించాను.

మీ కంఠంమీద కత్తిని చూడడంతోనే మూర్ఛపోయిన నాకు మీరే స్థితిలో ఉన్నారో తెలియలేదు. మీ క్షేమం తెలుసుకు రమ్మని దేశదేశాలకు దూతల్ని పంపినా సమాచారం దొరకలేదు. కొన్నాళ్ళయ్యాక మీ ముద్రికఉన్న ఉంగరం ఒకవైద్యు డమ్ముతూంటే రాజభటులు పట్టుకుని తీసుకువచ్చారు. అది మీ ఉంగరమే!

ఆ వైద్యుడు ఒకనాడు ఒక చెట్టుక్రింద కత్తివేటుకి మృతప్రాయుడిగా పడున్న పురుషుణ్ని బతికించిన వైనం చెప్పి ఆ ఉంగరం అతను కానుకగా ఇచ్చా డన్నాడు. అతని మాట నిజమే అని నిర్ధారించుకున్నాను. అంతలో మా తండ్రి చనిపోయారు. రాజ్యాన్ని నా స్వాధీనంచేసి, వయసు రాగానే మనవడికి పట్టాభిషేకం చెయ్యమని చివరిమాటగా చెప్పాడు.

అప్పటినుంచీ నేను రాజ్యపాలన చేస్తున్నాను. మీ వార్త తెలుసుకుందుకు - ఎవరేం వింత వస్తువుతెచ్చినా నా వద్దకు పంపేటట్లు ప్రకటన చేయించాను. కొన్ని నెలల కిందట ఒక బ్రాహ్మణుడు ఈ వీణను తెచ్చి - తనకి వీణా పాటవమున్నా దానిని శ్రుతిచేయలేక పోతున్నాననీ, మానవవీణలా లేదనీ ఒక బాటసారి తనకు అమ్మాడనీ - ఆవీణని నా వద్దకు పంపాడు. నేను దానిని పరిశీలించగా దానిమీద సన్నగా వీరప్రతాప

కుమార చంద్ర అని చెక్కబడి ఉంది దానితో అలా ప్రకటన చేయించాను. ఆ వీణే మళ్ళీ మీ దర్శనం చేయించింది.

మీ రాక కోసమే ఇన్ని ప్రయత్నాలు చేశాను. దీనిలో ఏ మాత్రమూ అసత్యం లేదు. నన్ను పవిత్రంగా నమ్మి స్వీకరించండి వీడిని గజం ఇచ్చింది కనక గజదత్తుడని మా తండ్రి పేరు పెట్టాడు"

"నిన్ను కాపాడిన బ్రాహ్మణుడెక్కడున్నాడు? అతని కేమిచ్చావు?" అని అడిగాడు విజయుడు

"అగ్రహారం ఇచ్చాను" అందామె. విజయు డతన్ని రప్పించి అతను కోరిందంతా ఇచ్చాడు.

విజయుడూ చంద్రుడూ తాము పడ్డ కష్టాలన్నీ ఆమెకు చెప్పారు. ఆ రాత్రి చంద్రుడు ఏకాంతంలో వీణమీద పాడి చారుమతిని రప్పించుకుని జరిగిందంతా చెప్పాడు. ఇకపై ఆ రాగాన్ని వీణమీదే కాక నోటితో పాడినా వస్తానం దామె. ఆమెను హేమకి చూపగా చాలా మన్నించింది. చారుమతి రెండు రోజులుండి గజదత్తు కి మంచికానుక లిచ్చి వెళ్ళింది.

రాజపుత్రులిద్దరూ మళ్ళీ ప్రయాణం చేసి తమదేశం చేరుకుని – తమవార్త గ్రామంలో ఎలాటి ప్రభావం చూపుతుందో తెలుసుకోవాలని ఊరికి దగ్గరలో – తమ సేనలతో బస చేశారు మారు వేషంలో వారు అంగడికి పోయి – " ఈదేశపు రాజు పేరేమిటి? సంతతి ఉందా?" అంటూ వివరా లడిగారు

ఆ కోమటి – "మా రాజుకున్న సంపద కుబేరుడికి కూడా లేదు కానీ వారినలుగురు కొడుకులూ కన్యకలను పెళ్ళిచేసుకుందుకని పధ్నాలుగేళ్ళ క్రిందట రాజ్యం విడిచి వెళ్ళారు. పెద్దవాడు కడపటివాడు తమ సొమ్ము హరించి చనిపోయారంటూ – రెండో కొడుకూ మూడోకొడుకూ కొన్ని నెలల క్రిందట తిరిగి వచ్చారు. తమ సోదరులు చనిపోయినట్లు ఒక చిన్న దానితో సాక్ష్య మిప్పించారు కాని వారి

మాట లెవ్వరూ నమ్మలేదు. వారు వీరికంటే రూపవంతులూ, గుణవంతులూ. రాజుపెద్ద వాడైపోయాడు. భానుడనే రెండవ కొడుక్కే రాజ్యమిస్తాడనుకుంటున్నారు. పుత్రశోకం ఆయన ఉత్సాహాన్నణచివేసింది" అంటూ పరిస్థితిని వివరించాడు.

రాజకుమారులు తమ విడిదికి పోయి మర్నాడు తమ రాకని తెలుపుతూ తండ్రికి వర్తమానం పంపారు. రాజు మహానందంగా మేళతాళాలతో వారిని కోటలోకి తీసుకువచ్చి వారి మాటలు విన్నాడు. వారి తల్లుల ఆనందం చెప్ప నలవికాదు.

మర్నాడు రాజు సభ ఏర్పాటు చేశాడు. దానికి అందరూ హాజరయ్యారు. ఆ సభలో రాజ పుత్రులిరువురూ తమ వృత్తాంతాలను వివరించి సోదరులు చేసిన ద్రోహకృత్యాలన్నీ చెప్పారు. రాజు అక్కడికక్కడే తన రాజ్యమంతటినీ తన పెద్ద కొడుకు విజయుడి అధీనం కావించాడు. నేరస్తులని విడవం నేరమని - రెండవ, మూడవ కొడుకులను కోటముందు ఉన్న స్థంబాలకు కట్టి వారానికొకసారి పన్నెండు దెబ్బలు కొట్టి ముఖంమీద ఉమ్మేటట్లూ, వారితోపాటు రుచిరమొహంమీద కూడా ఉమ్మేటట్లూ శిక్షవిధించాడు. వారి అనంతరమూ వారి విగ్రహాలను సంవత్సరానికొకసారి అలా చేస్తుంటారు. ఈ నగరమే ఆ సింధుబాయిది. చాలా కాలమైనా ఆ సంతతి వారు నేటికీ ఇలా చేస్తున్నారు".

ఇది వీరి వృత్తాంతం..." అని ముగించాడు మణిసిద్ధుడు.



# కాశీ మజిలీ కథలు

## 27. వ మజిలీ

గురు శిష్యులిద్దరూ మజిలీ చేసిన ప్రాంతంలో ఒక తటాకముంది. దాని దగ్గరగా ఒక మంటపం ఉంది. దానిలో మూడు శిలావిగ్రహా లున్నాయి. వాటిలో ఒకదాని ముఖంమీద 'అంతామహావిచిత్రం' అనీ, రెండవదాని భుజాలమీద 'దైవయత్నం' అనీ మూడోదానిశరీరం మీద 'ఎవరి కెవరూ లేరు' అనీ చెక్కబడి వున్నాయి.

ఆ విగ్రహాలకు ఎదురుగా ఒకస్త్రీ విగ్రహం ఉంది దాని భుజాలమీద 'విరాగిణి' అని ఉంది. అది చదివిన గోపాలుడు వాటి వెనుకఉన్న కథని చెప్పమని గురువుగార్ని అడిగాడు.

## దేవశర్మకథ

ఆంధ్రదేశంలో మణిభద్రమనే అగ్రహారంలో దేవశర్మ అనే ఉత్తమ బ్రాహ్మణు డుండేవాడు. వయసు మీరినా సంతానం కలగలేదు. దాంతో వైరాగ్యం చెంది అతడు అహర్నిశలూ హరిభజన చేసుకోసాగాడు.

అతని భార్య మిత్రవింద, భర్త ఇంటికి రావడంతోటే కాళ్ళు కడిగి నీళ్ళు నెత్తిమీద జల్లుకునేది. భర్తకు భక్తితో సకల ఉపచారాలూ చేసేది.

అందువల్ల అమె నతడు పతివ్రతా తిలకంగా భావించేవాడు.

ఒకనా డిద్దరు బ్రాహ్మణులు భోజనం కోసం వచ్చి – తలుపులు మూసి ఉండడం వల్ల తలుపు తీయమని అరచి .. ఆమె తలుపు తీశాక "అమ్మా! మేం పరదేశీయులం ఈ పూట మా కింత భోజనం పెడతావా?" అని అడిగారు. ఆమె ఏమీ మాట్లాడకుండా లోపలికి పోయింది. "ఏమమ్మా

మాట్లాడవు? పొమ్మంటావా?" అని వారడిగినా మాట్లాడక, వారి ముఖం చూడక లోపలికి పోయి తలుపేసుకుంది.

వారక్కడి నుంచి పోయి - కొంతదూరంలో గిలకలాగుతున్న దేవశర్మను చూసి - "అయ్యా! మేము బ్రాహ్మణులం అన్నంకోసం ఆ యింటికి పోయాం. ఆ మహాపుణ్యాత్మురాలు ఉందనీ చెప్పక, లేదనీ చెప్పక మొఖం మీదే తలుపేసుకుంది. మే మేమైనా శిటులమా? అలా సిగ్గుపడడానికి?" అన్నారు.

దేవశర్మ సిగ్గుపడుతూ - "ఆమె నాభార్యే! మహాపతివ్రత నేను ఇంటలేని సమయంలో పరులను చూడదు, వారితో మాట్లాడదు. మీరు నిస్సంశయంగా భోజనానికి రావచ్చు. ఇక్కడ స్నానం చేయండి" అన్నాడు.

వారు స్నాన సంధ్యలు పూర్తిచేసుకుని దేవశర్మతో వెళ్ళారు.

వాడుక ప్రకారం మిత్రవింద భర్త కెదురొచ్చి అతని పాదాలు కడిగి ఆనీళ్ళు తలమీద చల్లుకుంది. భర్తకీ అతిథులకీ చక్కని భోజనం వడ్డించింది. వారు సాలగ్రామ తీర్థం పుచ్చుకోమని సైగ చేయగా- "నాధా! వీరు నా వ్రతమెరుగక నన్నూరికే పలకరిస్తున్నారు. నేను ప్రాణనాధుని పాద తీర్థం తప్ప ఇతర తీర్థాలు పుచ్చుకోను, ఇతరులను చూడను మాట్లాడను - అని చెప్పండి" అంది.

వడ్డించేటప్పుడు కూడా పెడమొహంగానే వడ్డించింది. వారిలో సోమభట్టనే బ్రాహ్మణుడు - "అయ్యా! మేమనేక దేశాలు తిరిగాం. శాస్త్రాలు చదివాం. ఎందరో పతివ్రతలనీ చూశాం. కాని మీ సతీమణి వంటి సాధ్వీమణిని చూడలేదు. బ్రాహ్మణారాధనము, దేవతారాధనమూ కూడా పతివ్రతకు నింద్యమే అని చెబుతోంది. ద్రౌపది, సీత, రుక్మిణి వంటి పతివ్రతలు బ్రాహ్మణులని పూజింపలేదా? దేవతా తీర్థాలు తీసుకోలేదా? ఈమెది అపూర్వవ్రతం" అని ఆక్షేపించాడు.

"అయ్యా! నేనేం చేసేది! నేనెంత చెప్పినా వినదు. అరుంధతిలా ప్రవర్తించాలని ఉందట. పోనివ్వండి ఎవరివ్రతం వారిది" అని అతని కోపం చల్లార్చేడు.

అతను రెండవ బ్రాహ్మణునితో రహస్యంగా – "ఈ ఇల్లాలి చర్యలు వింతగా ఉన్నాయి. ఇది–కులటలలో మొదటిది దీని టక్కులన్నీ అమాయకపు బ్రాహ్మడు నమ్ముతున్నాడు నిజమైన పతివ్రతకు ఇన్ని నియమాలుండవు. కొన్నాళ్ళిక్కడుండి దీని దుండగాలు పట్టుకుని మగని కప్పగించి పోదాం" అన్నాడు.

అందుకు అతను కూడా అంగీకరించాడు. వాళ్ళక్కడ బోజనం చేయక మరో చోట నివసిస్తూ...ఆ ప్రాంతంలోనే తిరుగుతూ ఆ ఇంటిగుట్టంతా రహస్యంగా గ్రహించ సాగారు.

ఒకనాడు జాము పొద్దెక్కాక వారు నీళ్ళు తోడుతున్న దేవశర్మ వద్దకు వెళ్ళి – "అయ్యా! మాకు నోరెండిపోతోంది. ఈ నీరు పనికిరాదు. లోనికి పోయి మజ్జిగ తెచ్చి మా ప్రాణం నిలబెట్టండి" అని ప్రార్థించారు.

"దీనికింత ప్రాధేయపడాలా? ఇప్పుడే తెస్తాను" అని దేవశర్మ ఇంటికి వెళ్ళాడు. తలుపులు మూసి ఉన్నాయి. పైనుంచి తీయగలిగిన గడియ కల తలుపు తీసుకుని లోపలికి పోయాడు. వంటింట్లో ఒక మూల వంటవుతూనే ఉంది. మరొక మూలగా మిత్ర వింద పెద్ద పాలెకాపుతో రతిక్రీడలో తేలుతూంది.

"భయంలేదు. మీదొర అప్పుడే రాడు. నేను సమయం చెబుతాలే. ఇవేళ పరదేశు లెవరూ రాకపోడం మన అదృష్టం. నిన్నెందుకు రాలేదు?" అని గోముగా అడిగింది మిత్రవింద

దేవశర్మ కళ్ళారా ఆమె దుష్కార్యాన్ని చూసి, చెవులారా ఆ మాటలు విని...నీవల్ల ఎందరో బ్రాహ్మణుల కపవిత్రాన్నం పెట్టానే! పాపం మూటగట్టుకున్నానే. ఛీ! ఇంక ఈ సంసారం నా కెందుకు?' అనుకుంటూ 'ఎంత చిత్రం...ఎంత చిత్రం' అని గొణుక్కుంటూ ఎక్కడికో పోతూండగా ఆ బ్రాహ్మణులు "ఏమయ్యా! దాహం ఏదీ?" అని అడిగారు.

దేవశర్మ జవాబివ్వక–'ఎంత చిత్రం ఎంత చిత్రం' అనే మాటనే రామనామ స్మరణలా ఉచ్చరిస్తూ–పోయి సాయంకాలానికి మరో ఊరు చేరాడు. ఎవరు అతన్ని పలుకరించినా 'ఎంత చిత్రం–ఎంత చిత్రం'

అనే మాటే జబాబు. అతనికి పిచ్చెక్కిందని ఆ వూరి బ్రాహ్మణు లతన్ని తమింటికి తీసుకుపోయి భోజనం పెడుతూండేవారు.

ఒకనాడు దేవశర్మ గ్రామంలో పడుకోక స్మశానాని కవతల ఒక శూన్యదేవాలయం పక్కన పడుకుని దేవుణ్ని ద్యానించుకో సాగాడు. కొంతసేపటి కొక పురుషుడు చక్కగా అలంకరించుకుని - గుడిలోకి వెళ్ళాడు. మరికొంత సేపటికి ఒక అందగత్తె దీపం పట్టుకుని ఏవో సామగ్రులతో గుడిలోకి వెళ్ళి తలుపేసుకుంది. దేవశర్మకు వారి మాటలు వినపడసాగాయి.

ఆ సుందరి ఒకనాడు చక్కగా అలంకరించుకుని - వీధి గుమ్మంలో వయ్యారంగా నిలబడి అత న్నాకర్షించింది. ఆమె అతనిపట్లా అతనామె పట్లా ఆకర్షితులయ్యారు. అది ప్రథమావస్థ. వాళ్ళకి మన్మథ బాధ పెరిగిపోయింది.ఆమె అరటి చెట్టుని కౌగలించుకుని తాపం తీర్చుకుందుకు ప్రయత్నించేది.

ఒక జోగిని ముష్టికై వచ్చి ఆమె బాధను కనుక్కుని ఒక ఉపాయం చెప్పింది. దాని ప్రకారం ఆమె బాధ నటించింది. భర్త మందు లిప్పించినా అది తగ్గలేదు. ఒకనాటి రాత్రి ఆమె ఏడవడం మొదలు పెట్టింది. వెర్రికేకలు వేయసాగింది అప్పుడు ఆమెకు భూతం పట్టిందని భూత వైద్యులను పిలిపించాడు ఆమెభర్త ఆమె వారిని తోసిపొమ్మంది. అప్పుడా ప్రియుడే భూత వైద్యుడిగా వచ్చి - 'అర్ధరాత్రి చక్కగా అలంకరించుకుని గండదీపం నెత్తిన పెట్టుకుని ఒక్కతే ఊరి బయట నున్న చండికాలయానికి పోయి యక్షిణికి బలిమ్మని చెప్పాడు. భూతం వదలదన్న భయంతో ఆమె భర్త అలాగే చేశాడు. ఆమె గుడికి వచ్చి ప్రియుడితో మదనకేళి సాగించింది. "మూడు రాత్రులేనా అలా రమ్మని చెప్పవలసింది" అందామె. తెల్లవారబోతూంటే మదన కేళి చిహ్నాలు తుడుచుకుని... బట్టలు కట్టుకుని ఇంటికి పోయింది. ప్రియుడు కూడా వెళ్ళిపోయాడు.

అక్కడి కొచ్చినా నీచ కర్మలు కంటపడినందుకు దేవశర్మ చాలాసేపు విచారించాడు. 'స్త్రీలలో పతివ్రతలే లేరా? - పాపకార్యాలే

నాకంట పడడం నాకర్మమా . .అని విచారిస్తూంటే – ఒక బ్రాహ్మణుడు సంతర్పణ చేస్తూ అతన్ని భోజనానికి పిలుచుకుపోయాడు.

అక్కడ "భూతాలులేవంటారు. ఈ బ్రాహ్మణ పుత్రికను ఎంత దిట్టమైన భూతం పట్టింది! ఎన్ని కష్టాలు పెట్టింది. ఎన్నడూ తోడులేక వీధిలో కెళ్ళడానికే భయపడిన చిన్నది – అర్ధరాత్రి ఒంటరిగా ఊరిచివరి ఆలయానికి వెళ్ళింది! ఆ భూతం తెల్లవార్లూ చిక్కులు పెట్టి వదల్లేక వదల్లేక వదిలిందట. ఆమె ఎంతో గుణవంతురాలు. భూతం వదిలిందనే ఈశాంతి" అంటూ వాళ్ళు మాట్లాడుకోడం విని... దేవశర్మ. . తానే కాక లోకమంతా మోసపోతూందని – "ఎంతవిచిత్రం..ఎంతవిచిత్రం ." అనడం మొదలు పెట్టాడు

ఆ వూరువదలి – మరోవూరుపోయి ఒక పశువుల సాలలో పడుకుని ఉండగా అక్కడున్న ఇద్దరి మాటల్లో అతని కొక విషయం తెలిసింది.

తమ దేశంలో కరువువచ్చి మరో దేశం పోతూ ఒక దంపతలు అరణ్యంలో చెట్టుకింద బస చేశారు. అప్పటికే అక్కడ కొందరు బాట సారులున్నారు. భర్త భోజనపదార్థాలు తేవడానికి పోగా భార్య ఆ బాటసారుల్లోని కాళ్ళు చేతులు లేని అధముణ్ని వరించింది. తన అభిప్రాయం వాడికి చెప్పింది.

ఇంతలో భర్త రాగా నీరు తెమ్మని నూతికి పంపి – అతను నీరు తోడుతూంటే నూతిలోకి తోసేసి ఆ ప్రియుడిని భుజాలమీద కెక్కించుకుని ఊరిలోకి వచ్చి అతను తన మగడని చెప్పసాగింది. అలాటి భర్తను సేవిస్తున్న అమె పాతివ్రత్యాన్ని మెచ్చుకుంటూ ప్రజలందరూ నూకలూ కోకలూ ఇవ్వసాగారు.

నూతిలో పడిన ఆ మగని నెవరో రక్షించగా – అతను భార్యని వెదుక్కుంటూ దేశాలు తిరగ సాగాడు ఒకచోట – కుంటివాడిని మోస్తున్న తనభార్యని చూసి పలకరించగా ఆ వంచకి అతనే తనకాలు చేతులు నరికిన వాడని ప్రియుని చేత చెప్పించి – రాజుచేత నమ్మించి మగడిని శిక్షింపజేసిందట.

అది విన్న దేవశర్మ ఉదయం ఆ కుష్ఠురోగిని భుజాల మీద కెక్కించుకుని సంతోషంగా ఆకుంటివాడితో మాట్లాడుతున్న ఆమెను చూసి – ఇది అంతకంటే విచిత్రంగా ఉందే!, అనుకుని – 'అంతకన్న విచిత్రం. అంతకన్న విచిత్రం. అంతకన్న విచిత్రం అనుకుంటూ ఆ పాపపు స్థలంలో ఉండలేక మరోవూరు పోయి ఒక గుర్రాల సాలలో పడుకున్నాడు. కాని అతనికి నిద్ర పట్టలేదు.

అర్ధరాత్రి అక్కడికి మెరుపు తీగెలాటి ఒక యువతి పంచభక్ష్యపరమాన్నాలు పట్టుకు వచ్చింది. గుర్రాల కాపరిని మెల్లగా పిలిచింది. వాడు లేచి – "ఓసి ముండా! ఇంతాలస్యం చేశావేమే? నేనాకలితో చస్తున్నాను" అంటూ ఆమె మూతిమీద ఒక గుద్దు గుద్దేడు. అంతే ఆమె పళ్ళు రాలిపోయాయి.

వాటి నేరుకుంటూ "ఇలా కోపగిస్తే నేనేం చేసేది. పళ్ళన్నీ రాలగొట్టావు. రాజు కేమని చెప్పుకునేది? మగనాలిని కదా... రాజుని నిద్రపుచ్చి రావాలి. నీ కోసం తెచ్చిన భక్ష్యాలు గుర్రపు లద్దెలో పడిపోయాయి. చూసి తిను నువ్వు కొట్టావని కోపం లేదు బోసి నోటి మాటలకే ఆలోచిస్తున్నాను. సర్లే. ఏదో బొంకి ఈ నేరం రాజుమీదకే తోస్తాను" అంటూ తాను తెచ్చినవి వాడిచేత తినిపించి – వాడితో కొంతసేపు భోగించి ఇంటికి పోయింది.

అదంతా చూసిన దేవశర్మ ముక్కుమీద వేలేసుకున్నాడు. మర్నాడు వీధిలోంచి పోతూంటే – "రాత్రి పట్టపు రాజు భార్యతో సరసమాడుతూ అతి కోమలమైన ఆమె బుగ్గమీద సరసంగా వేలుతో పొడవగా ఆమె దంతాలన్నీ రాలిపోయాయి. ఆదంతాలు అతికిన వారికి రాజుగారు మంచి కానుకలిస్తా రొహో." అంటూ చాటింపు వినపడింది.

ఆ చాటింపు విని – ఆ హాహా! లోకమంతా విచిత్రంగా ఉంది. అంతా విచిత్రమే...అంతా విచిత్రమే...అంతా విచిత్రమే...అని గొణుక్కుంటూ అప్పుడే మరోవూరు పోయాడు.

అక్కడ – నడివీధిలోని దేవాలయం అరుగుమీద కొందరు బ్రాహ్మణులు చేరి మాట్లాడు కుంటున్నారు.

"ఇంత వరకూ దైవయత్నం గాడితో వేగుతూంటే .. అదిచాలనట్లు - అంతా విచిత్రమే గాడొక డొచ్చి చేరాడట వాడికి కూడా మనం భోజనం పెట్టాలి ఓ నువ్వూళ్ళో లేవు కదా. వివరంగా చెబుతాను

నాలుగు రోజుల కిందట మనూరు చేరిన అంతా విచిత్రమే గాడు దైవయత్నం గాడిలాగే ఎవరితోనూ మాట్లాడడు వాడు తిండిలేక పడుండడం చూసిన సభాపతి తనింటికి తీసుకుపోయి బోజనం పెట్టాడట. తరవాత వెర్రాడికి - వంతు వేసుకుని బోజనం పెట్టమని పత్రిక పంపాడు.

అన్నట్లు దైవయత్నంగాడి విషయంలో తగవొచ్చింది. అగ్నిభట్టు వరుణభట్టు ఆస్తుల పంపకాలు చేసుకున్నారు. ఆబ్దికాలు అగ్నిభట్టు పెట్టాలనీ దైవయత్నంగాడి భోజనం వరుణభట్టు పెట్టాలని ఒప్పందం. కాని...ఆబ్దికాలు ఏడాదికొకసారే .దైవయత్నంగాడి భోజనం వారానికి రెండు సార్లు. కనక తమకి నష్టం అని వరుణభట్టు పెళ్ళాం అతన్ని భోజనానికి పిలవనిచ్చింది కాదుట అది సభాపతికి తెలిసి కులంలోంచి వెలేస్తానని మందలించాడు.

ఇప్పటికే తగువులు పడుతూంటే ఈ అంతావిచిత్రమే గాడిని ఎలా పోషిస్తారో?"

"అంతావిచిత్రమే గాడంటే మొన్న దేవాలయంలో కూర్చున్న వాడేనా? అతన్ని నే నెరుగుదును. మాణిభద్రాగ్రహారం మంచి అన్నదాత పాపం, వెర్రెత్తి తిరుగుతున్నాడు కాబోలు. మార్తాండా. మన మావేళ భోజనానికి వెళ్ళలేదూ ? అతనే."

"ఇంటికి దగ్గరలోని తోటలో దాహం ఇచ్చాడు కదూ. అతని భార్య బంగారు బొమ్మలా ఉంటుంది "

'అతని భార్య మాటెందుకూ?"

"అహా. ఆమె మహాపతివ్రత అని, అతనికైతే మన మందరమూ భోజనం పెట్టవలసిందే. అంతా విచిత్రమే అనుమాట కర్థమేమిటో"

"అత నుద్దేశ మేమిటో ఎవరికి తెలుస్తుంది?"

"పిచ్చివాళ్ళ మాటల కర్థమేమిటి? దైవయత్నాని కేమర్థమో దీనికీ అదే."

అలా మాట్లాడుకుని వాళ్ళు వెళ్ళిపోయారు పౌరులు వంతులు వేసుకుని దేవశర్మకి కూడా బోజనం పెట్టసాగారు వాళ్ళిద్దరూ ఒకే ఇంట కలసిభోజనం చేసినప్పుడు కూడా ఒకరితో ఒకరు మాట్లాడుకోక... స్మశానవాటికలు, చండికాలయాలు మొదలైన నిర్జన ప్రదేశాల్లో పడుకునేవారు. ఏదిపెట్టినా తింటారు. ఏం చెప్పినా చేస్తారు.

ఒక దేవాలయంలో ఒకరాత్రి పడుకుని ఉండగా, మబ్బు పట్టి, అంతా అంధకార మైంది. అక్కడికి ఒక జంట వచ్చి మాట్లాడుకోసాగారు

"మూడు సార్లు వస్తానని రాలేదేం?"

"అయ్యో. నేను పడ్డ పాట్లు నీకేం తెలుసు? ఒక మాటు తోటలోని పాడు పడిన చావడిలోకి రాగా అక్కడ పడుకున్నది నువ్వనుకుని లేపాను. వాడు 'దైవయత్న'మంటూ లేచాడు. కొంతసేపు ఆగి...వాడుపడుకున్నాక, మరో మూల నిద్రపోతున్నది నువ్వనుకుని తట్టాను. అంతావిచిత్రమే అంటూ వాడు జపం మొదలెట్టాడు."

"అయ్యో! మంచి అవకాశం పోయింది. ఈ పాపాత్ములు మనపాలిట యమదూత లయ్యారు. తరవాత?" "ఏముంది? ఇంటికి పోయి ఏడుస్తూ పడుకున్నాను." తెల్లవారకముందే నా మగడొచ్చాడు. ఆవేళ ఆ వెర్రివెధవలకి మా ఇంట్లో భోజనం. మూడోసారి – అమ్మవారి గుడిలోకి రాగా అక్కడా ఆ వెధవలే ఉన్నారు."

"చూడబోతే వీళ్ళకి మనసంకేతాలు ముదుగా తెలిసి పోతున్నట్లున్నాయి. వీళ్ళపని పట్టాలి. పాడుగోడలలోకి రాలేదా?"

"రాకేం? వచ్చాను. కిందేముందో చూడకుండా గోడదూకేసరికి అంతా విచిత్రమే గాడికి నాకాలు తగిలి 'అంతా విచిత్రమే' అని అరిచాడు ఆ మూలనుంచి 'దైవయత్నం' అంటూ వాడూ అరిచాడు. దాంతో చుట్టుపక్కల వాళ్ళు లేచారు తప్పించుకుని బయటపడేసరికి తలప్రాణం

తోక్కొచ్చింది. నీజాడ ఒక్కసారేనా కనపడ లేదేం?" అని అడిగింది స్త్రీ.
"ఏం చెప్పేది? నేను బయలుదేరేసరికి - ఒకనాడు పిల్లి. రెండో మాటు ఒంటి బ్రాహ్మడు, మూడోసారి తుమ్ము. దుశ్శకునాలని వెనక్కివెళ్ళి మళ్ళీ బయలు దేరేసరికి తెలిసిన వాళ్ళడ్డంపడి మాట్లాడ్డం! ఆ నీచు లిద్దరి పనీ రేపు పడతాను"

"నేనే వాళ్ళపని పట్టాలని మా ఇంటిలో వారంనాడు అన్నంలో విషం కలిపాను. కాని వాళ్ళు ఆపోశనం పట్టేంతలో ఎక్కడినుంచో మాయదారి కుక్కవచ్చి విస్తళ్ళు ముట్టింది. నేను ముట్టలేదని చెప్పినా వినక నా మగడు మళ్ళీ విస్తళ్ళు వేయించాడు. మళ్ళీ కలపడానికి విషం లేకపోయింది."

"వాళ్ళసంగతి రేపు చూద్దాం. మాటలతోనే కాలం గడిచిపోతూంది."

"అక్కడెవరో ఉన్నట్లున్నారు... చూడు"

"అయ్యో! ఆ ముండాకొడుకులే."

"వీళ్ళుకాక ఈ పెంటలో పడుకునే దెవరు?"

"వాళ్ళు మనమాటలు విన్నారేమో?"

"వింటే మాత్రం ఆ పిచ్చి వెధవలు ఏం చేయగలరులే"

ఆ మాటలువిన్న దేవశర్మ అంతా మహావిచిత్రం అనీ దైవయత్నం - దైవయత్నమనీ మూడేసి సార్లు పలించి ఊరుకున్నారు.

వాళ్ళిద్దరూ జడుసుకుని పారిపోయారు.

ఆ వూరిలోని జారిణులకు వారి ఉనికి కంటకమైంది.

ఆ మాటలను నీలాటిరేవులోవిన్న ఆ ఇద్దరూ ఒకనా దర్ధరాత్రి ఎవరికీ తెలియకుండా ఊరువదిలి - అరణ్యమార్గంలో పోయి - నాలుగు రోజులయ్యాక సామంతమనే నగరం చేరారు"

అంతవరకూ చెప్పి - మీదటి కథను మరుసటి మజిలీలో చెప్పాడు.



# కాశీ మజిలీ కథలు

## 28. వ మజిలీ

సౌనుమంత నగరంలో – కొన్నాళ్ళ కిందట – 'ఎవరి కెవరూ లేరు, ఎవరి కెవరూలేరు' – అనే పిచ్చి, వాడొక డొచ్చాడు. అతనిని బిచ్చగాడని – పిల్లలు – ఎవరి కెవరూ లేరని వెక్కిరిస్తూంటారు.

అతను జనంలేనిచోట నివసిస్తూ ఎవరేనా ఇస్తే తిని ఆకలి తీర్చుకుంటాడు. దేవశర్మ, దైవయత్నం ఆ వూరుచేరిన మూడోరోజునే అతని నొక దేవాలయంలో కలుసుకున్నారు. ముగ్గురూ ఒకేచోట కలసి ఉండేవారు. వాళ్ళమాటలకు – అవివేకులు పిచ్చివాళ్ళనీ, వివేకులు జ్ఞానులనీ వారిగురించి భావించేవారు. ఒకేచోట ఉన్నా వాళ్ళు ముగ్గురూ ఒకరి నొకరు పలకరించుకునే వారు కాదు.

## మాలతి కథ

వాళ్ళు ముగ్గురూ ఒకనాడు దేవాలయంలో నిద్రపోతూంటే – ఒక దంపతులు పదహారేళ్ళ చక్కని చిన్నదాన్ని పురోహితుడితో కూడా తీసుకొచ్చి గుడిలో నాలుగుమూలలా వెదకి... ఒకచోట పడుకున్న దైవయత్నాన్ని లేపి కూర్చోబెట్టారు. మంత్రాలు చదువుతూండగా – అతన్ని, పీటలపై ఆ చిన్నదాని పక్కన కూర్చోబెట్టి వధూవరులచేత కొత్తబట్టలూ నగలూ ధరింపజేసారు. అతనిచే ఆమెకు మంగళసూత్రం కట్టించి, తలంబ్రాలు పోయించి... వివాహంచేసి... అతనికి ఆహారపదార్థా లిచ్చి – తెల్లవారకముందే ఆమెను తీసుకుని వెళ్ళిపోయారు.

మర్నా డుదయం కొత్త బట్టలతో నగలతో ఉన్న దైవయత్నాన్ని చూసి పురజను లాశ్చర్యపోయారు. ఆ వేళ తమని భోజనానికి పిలిచిన

బ్రాహ్మణుడికి తన వస్త్రాలూ నగలూ ఇచ్చేసి, సాయంకాలం బయలుదేరి ఉత్తర దిశగా ప్రయాణమైన దైవయత్నంతో మిగిలిన ఇద్దరూ కూడా బయలుదేరారు. కొన్ని రోజులకు వారు మహారణ్యంలోని ఒక పెద్ద మర్రిచెట్టుని చూశారు.

అదిచాలా పెద్దది దానిమీద లక్షలాది జనం ఉండవచ్చు. క్రూరజంతువులకీ, భూతపిశాచాలకీ అవి నివాసయోగ్యం. వారు ఊడలు పట్టుకొని కొమ్మపైకెక్కి పడుకుని ఆప్రాంత విశేషాలు చూడసాగారు.

ఇంతలో ఇద్దరు దొంగ లొక బంగారు గంపను మోసుకొచ్చి దింపి - మాట్లాడుకో సాగారు.

"ఈ చిన్నది నిద్రపోతున్నట్లుంది. ఎత్తునుంచి పడడంవల్ల అలసిపోయుంటుంది."

"కావచ్చు. స్థూలజంఘా! నేను భార్యలేని వాడిని కదా. నగలూ అవీ మీరు తీసుకుని దీనిని నాకొదిలేయండి."

"అయోముఖా! ఇప్పుడు నేనేం చెప్పగలను? శంబరాక్షుడి ఆజ్ఞ లేకుండా మనమీగంప తెచ్చేశాం. అతనింకా ఎందుకురాలేదో? దీనిని తొర్రలోఉంచి వెళ్దాం, పద."

"తెలివొస్తే పారిపోతుంది. నేనిక్కడుంటాను. నువ్వెళ్ళిరా"

"నీ ఎత్తు నాకు తెలుసు. పోతే ఇద్దరమూ పోవాలి"

"నేను రాలేను. నీకంటే శంబరాక్షుడే మంచివాడు. ఈమెను నాకోసమే తెచ్చుంటాడు."

"వాడొచ్చాక నీయిష్టం"

"వాడు చిక్కిపోయాడో, మనకి చాలా ప్రమాదం"

"ఒక్కసారి ఆ పెట్టి మూత తెరు"

"ఆ చిన్నదాని చెక్కిలి ఒక్కసారి ముద్దు పెట్టుకుంటాను"

"ఇది ఉమ్మడి సొత్తు. ఒక్కడే ముట్టకూడదు"

"వాడు వచ్చాక నీ ఇష్టం"

"వాడక్కడ చస్తే?"

"పాడు కూతలు కుయ్యకు. వాడుచస్తే నువ్వు మాత్రం బతుకుతావా?"

"కాకపోతే ఏమిటి? ఇదేమీ నీపెళ్ళాం కాదు. నాకూ మూడోవంతు అధికారముంది. కావాలంటే నువ్వూ ఒకసారి ముద్దెట్టుకో. వాడీ గంపనెత్తుకు పొమ్మని మనకి చెప్పలేదు. వాడి ఆజ్ఞ ఎందుకు? దీనిని వాడే దింపాడో మరెవడేనా దింపాడో?"

"నిజమే. మనం తొందరపడి వచ్చాం. అ...ఏదో సవారీ మూలుగు వినపడుతోంది. చూడు. ఎవరేనా వొస్తున్నారేమో."

"నీ పనయిందిలే. వెయ్యి కాగడాలతో మహారాజుగా రిటు వస్తున్నారు. శంబరాక్షుడు పట్టుబడి మన ఆచూకీ చెప్పుంటాడు. పారిపోదాం పద" అంటూ చెట్టుదిగి ఆ 'పెట్టె నొక తొఱ్ఱలో ఉంచి ఇద్దరూ పారిపోయారు.

అంతలో – వేలకి వేలు కొరివి దయ్యాలు వెంటరాగా భూతరాజు భైరవుడితో ముచ్చటిస్తూ అక్కడి కొచ్చి ఎముకల సింహాసనం మీద కూర్చున్నాడు.

భూతరాజు : భైరవా! మనం ఎన్నో స్మశానాలు చూశాం కాని ఇంత చక్కనిది మరేదీ లేదు సుమా!

భైరవుడు : "అందుకే కదా భేతాళుడు దీన్ని వదలకుండా ఉన్నాడు!"

భూతరాజు : "అతను మనకి ఎదురు రాలేదేం?"

భైరవుడు : "నేను రాసిన ఉత్తరం అందినట్లు కూడా రాసాడు. ఎందుకు రాలేదో మరి?"

భూతరాజు : "అతను రాసిన ఉత్తరం చదువు"

భైరవుడు · నా నివాసానికి దేవరవారు దయచేసే దినమునకు వయసులో ఉండి పెళ్ళికాని క్షత్రియ కన్య కుత్తుక నులిమిన పచ్చినెత్తురుతో కాళికాదేవిని తృప్తిపరచదలచి, అట్టి యువతిని తెచ్చి సిద్ధముగా ఉంచమని

మీరు రాసిన ప్రకారం సిద్ధంచేసి మీ అనుగ్రహానికి పాత్రుడనగుదునని విన్నవించుకుంటూ...మీ పాదసేవకుడు - భేతాళుడు.

**భూతరాజు** : ఇలా రాసి-మరి అత నెందుకు రాలేదు? తెలుసుకో.

పలల ప్రియుడు: బేతాళ దూతలు ఎక్కడున్నారు? (అరుస్తాడు)

**తామ్రకేశుడు** : మేం బేతాళుడి మంత్రులం. నాపేరు తామ్రకేశుడు. వీడు తుందిలోదరుడు. బేతాళుడు విక్రమార్క మహారాజుగార్కి తపస్సువల్ల అతనికి అధీనుడై పోయాడు-అని దేవరకు తెలిసే ఉంటుంది. ఆయన తలచినప్పుడు బేతాళుడు వెళ్ళక తప్పదు. భూపాలదేవ చక్రవర్తిగారి మంత్రి విజయవర్ధనుడు సామంతుల పరిపాలన ఎట్లుందో చూడడానికి దేశయాత్ర చేస్తూ ఉజ్జయినికి వస్తున్నట్లు విక్రమార్కులవారికి రాశారట. ఆ సన్నాహం చూడడానికి ఆయన బేతాళుని తలుచుకున్నారు. వెళ్తూ మీరాక తలుచుకొని బాధపడ్డారు.

**భూతరాజు** : పరాధీను డేం చెయ్యగలడు? తరువాత...?

**తామ్రకేశుడు** : ఒకనాడు చేసే ఉత్సవాలు మరోనాడు చెయ్యకుండా ఆరునెలలు చెయ్యాలట అందుచేత బేతాళుడికి తీరికే లేకపోయింది. ఐనా స్వామికార్యం పట్ల భక్తితో ఎలాగో తెరిపి చేసుకుని మాకు కొన్ని రహస్యాలు చెప్పి పంపాడు.

**భూతరాజు** : అవి మాకు చెప్పవచ్చునా?

**తామ్రకేశుడు** : దేవరకి చెప్పకూడని రహస్యా లుంటాయా? వినండి. ఇక్కడికి దగ్గరలో సానుమంతం అనే నగరాన్ని మందపాలుడనే రాజు పాలిస్తున్నాడు. అతనికి మాలతి అనేకూతురుంది ఆమె అత్యంత రూపసి. ఆమెను ఇంద్రదత్తుడనే రాజకుమారుడికిచ్చి వివాహం చేయడానికి నిశ్చయించాడు. ఆవివాహం నేడే. ఆమెను గౌరీపూజకి కూర్చోబెట్టే సమయంలో శాంబవీ మోహంలో పడవేసి తీసుకెళ్ళి దేవర కప్పగించండని కొన్ని మంత్రాలు చెప్పాడు ఇదే ఆ రహస్యం

**భూతరాజు** : భేతాళుడు మంచి విశ్వాసపరుడు తరువాత?

తామ్రకేశుడు : అంతా సవ్యంగానే జరిపాను. ఆమె నెత్తుకుపోయి కోటదగ్గరలో ఒకచో టుంచి తుందిలోదరుడు అనుకున్నట్లు చేస్తున్నాడో లేదో అని చూడ్డానికి మళ్ళీలోపలికి వెళ్ళాను. అతను నేను చెప్పినట్లే మాలతి రూపంలో కూర్చుని – వారు చెప్పినట్లు చేస్తూ వివాహానంతరం గదిలోకి పోయాడు. నేను వచ్చి చూడగా మాలతి అక్కడ లేదు. లేచిపారిపోయిందను కోడానికి సూర్యోదయమైతే తప్ప ఆమెకు తెలివి రాదు. అది దేవమాయఅనుకుంటూ విచారంగా వస్తూంటే – ఈ చెట్టుదగ్గరే తుందిలోదరుడు నన్ను కలుసుకున్నాడు. అతను గదిలో ప్రవేశించాక, పరిహాసమాడ బోయిన ఇంద్రదత్తుని శరీరంమీద నఖదంత క్షతములు లోతుగా నాటించే సరికిఅతను దెయ్యం దెయ్యం అని అరవబోయాడట. అతని నోరు నొక్కి – మహారణ్య మధ్యంలో పారేశాడట. మాలతి జాడ తెలియదన్నాడు. మీ దాసులని క్షమించండి. పొరపాటు జరిగింది."

అంతలో తెల్లవారబోతూంది. భూతరాజు తనబలగంతో అక్కిడనుంచి వెళ్ళి పోయాడు.

వాళ్ళు ముగ్గురూ చెట్టుకొమ్మ పైనుంచి చూస్తున్నారు. మాలతికి తెలివొచ్చి అరవగానే వాళ్ళామెను చెట్టుతొర్రలోంచి గంపతోసహా నేలమీదకి దింపారు.

ఆమె – "మీ రెవరు?" అని అడగ్గా దైవాయత్తం, అంతా మహాచిత్రం,ఎవరికెవరూ లేరు – అనీ చెప్పారు.

ఆమె వారే తన నెత్తుకు వచ్చా రనుకుంది.

అంతలో ఆమెను వెదుకుతున్న రాజభటు లక్కడికి వచ్చారు. ఆమె కనిపించిందని రాజుకి కబురంపారు.

పుత్రికను చూసి రాజు సంతోషించి – ఇక్కడి కెలా వచ్చావు? ఈ కొమ్మల్లో దాగున్న ముగ్గురూ ఎవరు?" అని అడిగాడు. "గౌరీపూజకు గంపలో కూర్చోడమే నాకు తెలుసు. తరవా తేం జరిగిందో తెలియదు. ఉదయానికి గంపతోసహా చెట్టు తొర్రలో ఉన్నాను. వీరు నన్ను దింపారు.

వారెవరని రాజు అడిగితే - దైవాయత్తమని ఒకరూ, అంతా మహావిచిత్రం అని ఒకరూ ఎవరికెవరూ లేరని ఒకరూ చెప్పారు మీరేమో నాకు వివాహమైనట్లూ గదిలోకి పోయిన తరువాత వేకువజామున మేము కనపడినట్లూ చెబుతున్నారు. అదెంత నిజమో మీరే ఆలోచించుకోండి అందామె.

వారు చాలా ఆశ్చర్యపడి - "ఇదంతా తరవాత చూద్దాం. ఈ ముగ్గురూ వెర్రి వాళ్ళలా నటించిన తస్కరులై ఉండవచ్చు. పెళ్ళిసందడిలో ఎలాగో మోసగించి మిమ్మల్ని తెచ్చుంటారు. మీ భర్తనికూడా ఎక్కడో దాచుంటారు" అంటూ "వాళ్ళు ముగ్గుర్నీ రెక్కలు విరిచికట్టి ఊళ్ళోకి తీసుకురండి-" అని భటుల కాజ్ఞాపించి రాజు తనపరివారంతో కోటలోకి వెళ్ళిపోయాడు.

రాజు ఎన్నివిధాలుగా అడిగినా వారి మాటే తప్ప మరేమీ చెప్పక పోడంతో వాళ్ళని కారాగారంలో పడెయ్యమన్నాడు.

సఖులు తాను ఏవేవో చేసిందంటారు కాని మాలతి కవేవీ నిజం కాదని తెలుసు. తల్లి తండ్రులతో చెప్పగా - "గంపలోనే ఉండడంవల్ల వివాహకృత్యా లసత్యాలే అయి ఉండవచ్చు కాని - మేము చేతులతో కన్యాదానం చేశామే! ఆ ముగ్గురికీ దీనిలోని రహస్యం తెలిసుండవచ్చు. ఇంకవారిని ఉరితీయమంటాను" అన్నాడు రాజు.

"తండ్రీ. వారు దొంగ లయివుండరు అంతర్ముఖులై ఉండవచ్చు. వారు నన్ను తొర్రలతోంచి బయటకు తీశారే కాని ఏవిధమయిన అపకారమూ చెయ్యలేదు '

"వీళ్ళు నిన్ను తీసుకుపోడానికి కారణం లేకపోలేదు ఆ మధ్య నీకు కపట వివాహం కావించినది వీరిలో ఒకడితోనే" అన్నాడు రాజు.

"కపట వివాహ మంటే ఏమిటి? ఆ మధ్య గూఢంగా దేవతా సపర్య చేయాలని రాత్రివేళ గుడికి తీసుకుపోయి చేయించారు అదేనా? అలా ఎందుకు చేశారు?" అడిగింది మాలతి.

"నీ జాతకం ప్రకారం నీకు పెళ్ళిరోజునే మగడు చనిపోతాడనీ, రెండోవివాహం జరుగుతుందనీ చెప్పారు. అందుకని మొన్న నీకు ముందుగా కపట వివాహం చేయించాం

రెండోవివాహం వల్ల లభించిన పతి సార్వభౌము డౌతాడని కూడా చెప్పారు. నిన్న ఈవిషయం ఒక బ్రాహ్మణ పండితునితో చర్చించగా - మొదటచదివినవానికి భాష తెలియక అలా చెప్పాడనీ, మొదటి వివాహ భర్తే చక్రవర్తి అవుతాడనీ - రెండోసారి పెళ్ళాడ్డానికి ప్రయత్నించిన వాడు పరలోకగతు డౌతాడనీ చెప్పాడు. రెండూ అబద్ధాలే అయ్యాయి. వెర్రివాడు చక్రవర్తెలా కాగలడు? ఇప్పుడేం చెయ్యడానికీ తోచడం లేదు" అని విచారించాడు రాజు.

"తండ్రీ! రాజే కూడని పని చేస్తే ఎలా? స్త్రీకి పునర్వివాహం శాస్త్ర సమ్మతం కాదుకదా. ఆ వేళ జరిగినది పెళ్ళని తెలియక కాని...తెలిస్తే పరమేశ్వరు డొచ్చినా మళ్ళీ పెళ్ళికి కూర్చొనే దాన్నా? ఆ ముగ్గురిలో ఎవరితో వివాహం చేశావో చెప్పు. అతనే నాపతి" అందామె.

"నీమాట నిజమే. నాబుద్ధే వక్రించింది. గతించినదానికి వగచి లాభంలేదు. ఆ రాత్రి చీకటిలో లేపుటచే ఎవరో గుర్తుపట్టలేను. వాళ్ళనే అడుగుదాం" అంటూ వాళ్ళని సగౌరవంగా రప్పించి - బట్టలూ నగలూయిచ్చి - "అయ్యా! మీ శాంతస్వభావం తెలుసుకోలేక నిష్కారణంగా మిమ్మల్ని బాధించాను. నా అపరాధం మన్నించండి. మొన్నరాత్రి దేవాలయంలో మీలో ఎవరితో నాపుత్రిక వివాహం జరిపించానో చెప్పండి. నాకూతురి కతనే భర్తవుతాడు" అన్నాడు.

వారు - వాడుక మాట తప్ప మరేమీ చెప్పలేదు. రాజెంత ప్రయత్నించినా వాళ్ళచేత చెప్పించలేక పోయాడు. విసిగిపోయి వారిని వదిలేశాడు. వారెక్కడికో వెళ్ళిపోయారు.

అప్పుడు మాలతి - స్త్రీకి పతియే దైవం. పతి ఎవరో తెలియదు. అత నడవుల పాలై తిరుగుతూంటే నేను రాజభోగాలను అనుభవించకూడదు. ఎప్పటికైనా తెలియక పోతుందా - అనుకుంటూ తల్లితండ్రులు కాదన్నా వినకుండా నార చీర కట్టుకుని విరాగిణి అని పేరు పెట్టుకుని వారిని వెదుకుతూ వెళ్ళింది."

తరవాయి కథ తరవాత మజిలీలో చెప్పాడు మణిసిద్ధుడు.

# కాశీ మజిలీ కథలు

## 29. వ మజిలీ

### మాలతి కథ

విరాగిణి అరణ్యంలో వెళ్తూండగా ఒక బ్రాహ్మణు డెదురు పడ్డాడు. ఆయనకు నమస్కరించి - "అయ్యా! మీరు తరచుగా దేశాటనం చేసేవారిలా కనిపిస్తున్నారు. ఎక్కడేనా ముగ్గురు వెర్రివాళ్ళు కనిపించారా?" అని అడిగింది.

"అమ్మా! ఈ ప్రాంతంలోని గ్రామంలో ఎవరో ముగ్గురున్నారు. మందపాల మహారాజుగార్రి అంతఃపురానికి ద్రోహం చేశారని చెరసాలలో పెట్టగా - తప్పించుకు పోయారట. వారిని వెర్రివాళ్ళని కొందరూ, కాదని కొందరూ అంటున్నారు. నువ్వడిగినది వారే అయివుండవచ్చు. నువ్వెందుకిలా చిన్న వయసులోనే కాషాయ వస్త్రాలు కట్టుకుని తిరుగుతున్నావు?" అన్నా డా బ్రాహ్మణుడు.

ఆమె "నేనొక జోగురాలను" అని వేగంగా పోయి సాయంకాలాని కా గ్రామం చేరగా వారొక చావడిలో పడవెయ్యబడి ఉన్నారు. ఆమె పలకరించినా వారేమీ మాట్లాడ లేదు.

కావలి ఉన్న తలారు లా విషయం అధికారులకి చెప్పి - వారిని వచ్చి చూడమన్నారు. అధికారు లామెను

"నువ్వెవరివి? ఎందుకొచ్చావు? వీళ్ళు నీ కాప్తులా?" అని అడిగారు ఆమె జవాబు చెప్పలేదు. అప్పుడు వారికి కోపం వచ్చి - "దొంగలు మర్యాదగా నిజం చెప్పరు. దండిస్తేనే నోరు విప్పుతారు" అని శిక్షించబోతూంటే మందపాలుడి దూతలు వచ్చి - "వీరు దొంగలు కారు. అవధూతలు. వీరిని బాధించకూడదు. ఇదిగో రాజశాసనం" అంటూ

శాసనం చూపించారు. ఆ అధికారులు వీరికి బంధవిముక్తి చేసి భోజనం పెట్టి మరో వూరికి పంపేశారు.

వాళ్ళు నలుగురూ ఒకరి వెనుక ఒకరు నడుస్తూంటే – భూపాలదేవ మహారాజుగారి మంత్రిని సాగనంపి వస్తున్న భట్టి, విక్రమార్కుడు తారసిల్లి "మీరెవరు? ఎక్కడికి పోతున్నారు?" అని అడగ్గా వారు ముగ్గురూ వాడుక మాటలే పలికారు. మాలతి మౌనం దాల్చింది.

విక్రమార్కుడు – "భట్టీ. వీరి నెరుగనివారు పిచ్చివా ళ్ళనుకోవచ్చు. కాని వీరిమాటలు, వేషాలు వైరాగ్యోదయం సూచిస్తున్నాయి. ఆ మాటలకు వెనుక కారణ మేదో తెలుసుకోకుండా మనం ఇంటికి వెళ్ళొద్దు" అన్నాడు.

అక్కడి నుంచి వారితో పాటే దేశాటనం చేయసాగారు. ఒకనాడు – "సాధ్వీ! నేను విక్రమార్కుడిని. వింతలు చూసే నెపంతో దేశాటనం చేస్తూంటాను. నువ్వెరివి? వీ రెవరు? మీ వైరాగ్యలకు కారణ మేమిటి? నిజం చెప్పు" అని అనునయంగా అడిగాడు.

"నేనెవరితోనూ మాట్లాడనని నియమం పెట్టుకున్నా, మీపేరువిని – మాట్లాడుతున్నాను" అంటూ తన వృత్తాంతం చెప్పి – "వీరిలో నా పతి ఎవరో నిరూపించి – నీ పుత్రికవంటి న న్నుద్ధరించు" అని అతని పాదాలమీద పడింది. అత నామెకు ధైర్యం చెప్పి, వారి చర్యలు రహస్యంగా పరిశీలిస్తూ కొన్నాళ్ళు వాళ్ళవెంట తిరిగాడు.

ఆపిచ్చివాళ్ళు జయంతమనే పట్నంలో ఉండగా కొందరు విటుల సంభాషణలు వినపడ్డాయి. శృంగారశేఖరుడు, వీరభద్రుడు, మయూరుడు, విచక్షణుడు అనేవాళ్ళు – రాజుకి సంతతి లేకుండా అకాలమృత్యువు కబళించడం, మంత్రి దేశయాత్రకు రావడం వల్ల ఏనుగు పూలదండ వేసిన వాడే రాజవుతాడనీ, తమ నలుగురిలో ఎవరు రాజైనా రాజ్యాన్ని సమానంగా పంచుకుందుకు పత్రం రాసుకున్నారనీ...వాళ్ళు రాజ్యంరాగానే వేశ్యలనూ శృంగారాన్ని అభివృద్ధి చేయడం, వితంతువులకి

పునర్వివాహాలు మొదలైన కార్యక్రమాలు చేపట్టా లనుకుంటున్నారనీ... ఏనుగు తమలో ఒకరి మెడలో పూలదండ వేస్తుందని ఆశపడుతున్నారనీ విక్రమార్కుడు గ్రహించాడు.

కాని కొంచెం సేపటిలోనే - పట్టపుటేనుగు దైవాయత్తమంటూ తిరిగే పిచ్చివాడి మెడలో జయమాలవేసిందనీ, అతను దైవాయెత్తం అంటూ ఏనుగుపై కెక్కడం లేదనీ విని - భట్టితో విక్రమార్కు డక్కడికి వెళ్ళాడు. అంతలో విజయవర్ధను డేనుగు మీద అక్కడికి వచ్చి ఉన్మత్తులతో తిరుగుతున్న అతని చరిత్ర విని - సంతోషంగా చేతులు జోడించి దైవాయత్తం ఎదుట నిలబడి - 'జగమంతా దైవాయత్తమనీ, భూమ్మీద ఎవరి కెవరూ లేరనీ, సంసారసాగరం మహావిచిత్ర మనీ - పద్యం చదవగా - దైవాయత్తం నిద్రలోంచి మేల్కొన్నట్లు తలెత్తి - "విజయవర్ధనుడా! ఎన్నాళ్ళకు చూశాను! మనప్రజలందరూ సుఖమేనా?" అంటూ అడిగాడు.

"మీరు లేని కొరత ప్రజలని పీడిస్తూంది" అన్నాడతను

"ఇతను భూపాల చక్రవర్తి సుమీ!" అన్నాడు విక్రమార్కుడు. భట్టితో. "మాలతి వరించినవాడితడే ఔను. ఆ దైవజ్ఞుడు నిజంగా దైవజ్ఞుడే" అన్నాడు భట్టి.

"దేవా! పడిన కష్టాలు చాలు. ఇంక ఆలస్యం చేయకండి రాజ్యపాలన చేపట్టండి" అని విజయవర్ధను డనగా ఆ ముగ్గురినీ కూడా ఏనుగు మీదెక్కించమని సైగ చేసి ... అంతలో భట్టి విక్రమార్కులు కనిపించగా వారిని కూడా ఎక్కించుకుని ఊరేగి కోటలోకి వెళ్ళారు

తరువాత విక్రమార్కుడు విజయవర్ధనుడితో - "భూపాల చక్రవర్తి అలా సంచరించడానికి కారణ మేమిటో తెలుసుకోవాలని కుతూహలంగా ఉంది" అన్నాడు.

విజయవర్ధను డతని అనుమతి తీసుకుని ఇలాచెప్పసాగాడు.



# భూపాలదేవమహారాజు కథ

భూపాలదేవుడు యౌవనంలో ఉండి కూడా వివాహాని కంగీకరించక యువతుల దుష్కృత్యాల నెత్తి చూపుతుండేవాడు. నేను ఆయనని వివాహాని కొప్పించాలని ఎన్నో ప్రయత్నాలు చేసి – విసిగి – దైవసంకల్ప ముంటే మీరు తప్పించుకో లేరన్నాను. పురుష సంకల్పం లేనప్పుడు దైవ సంకల్పం ఏం చెయ్యగలదని వాదించారు వారు.

ఒకనాడు మా దేవాలయం లోకి మహాయోగి ఒకరు రాగా నేను రాజుని బలవంతంగా వారివద్దకు తీసుకెళ్ళి – "మా మహారాజుగారికి దైవసంకల్పం కంటే పురుష సంకల్పమే ప్రధానమన్న ఉద్దేశం బలంగా నాటుకు పోయింది. ఆయన మనసు మార్చ"మని ప్రార్థించాను. ఆయనేదో పద్యరూపంలో చెప్పినా రాజతనినే మతిలేని వాడన్నాడు.

మర్నాటి నుంచీ రాజు కనిపించలేదు, ఆ యోగీ కనిపించలేదు.. కాని ఆగుట్టు దాచి రాజున్నట్లే రాజ్యపాలన చేస్తూ – దేశాటనం కూడా చేయసాగాను ఒక క్షేత్రంలో ఆ యతీంద్రులు కనిపించగా అతని పాదాలమీద పడి మారాజుగారి గురించి తెలియ జేయమన్నాను. ఆయన "మీరాజు వెర్రివాడై తిరుగుతున్నాడు. కొన్ని రోజుల్లో కనపడతాడు. అతనని నీకు తోచినప్పు డానాడు నేను చదివిన పద్యం చదువు – పూర్వ స్మృతి వస్తుంది" అని చెప్పాడు.

అప్పటి నుంచీ వెర్రివాళ్ళు కనపడితే చూసి కానుకలివ్వడం మీకూ తెలుసు. మీ గ్రామంలో అలా ఇవ్వడం మీకు జ్ఞాపకముండే ఉంటుంది. తరువాత దైవవశాన ఇక్కడ మారాజుగారిని కలుసుకున్నాను. ఆపైన మీకు తెలిసిందే."-

చక్రవర్తి కథ కూడా వినాలని విక్రమార్కుడు తన అభిలాష తెలియజేశాడు.

అప్పుడు చక్రవర్తి – "ఆవేళ యోగితో వాదించి ఇంటికి పోయి – కంటికి నిద్రరాక సత్యాసత్యాలను తర్కిస్తూంటే నేను పడుకున్న

మంచానికి దగ్గరలో ఎవరో ఒకవీరపురుషుడు వచ్చి అట్టహాసం చేస్తూ నాచేయిపట్టుకుని వేగంగా ఎక్కడికో లాక్కుపో సాగాడు. నేను విడిపించుకోలేనట్లు పట్టుకుని వాయువేగంతో నదులూ పట్నాలూ అరణ్యాలూ దాటించి వెలుగొచ్చేసరికి ఒకతోటలో వదిలిపోయాడు. దానితో నన్నీడ్చుకువచ్చింది దైవశక్తి అని నమ్మి - అప్పటినుంచి దైవాయత్తం అనేమాట తప్ప మరేదీ పలక కూడదని నిశ్చయం చేసుకుని వెర్రివాడినై అనేక గ్రామాలు తిరిగాను. కొన్నాళ్ళకు వీరిద్దరూ నాకు తోడయ్యారు. మేమొక దేవాలయంలో ఉండగా ఒకరాత్రి ఒక చిన్నదానిని ఎవరో తీసుకొచ్చి నన్ను లేపి కూర్చోబెట్టి వివాహం చేశారు. వారేం చెబితే అది చేశాను" అని తన వృత్తాంతం ముగించాడు. విక్రమార్కుడు కోరగా దేవశర్మ తన కథ చెప్పాడు. తరవాత మిగిలినవాడు తన కథని వివరించాడు.

## నవకుబేరుని కథ

"నా కాపరం కాంచీపురం వైశ్యుడిని. నన్ను నవకుబేరు డంటారు. నాకు పదిమంది కొడుకులూ ఐదుగురు పుత్రికలూ జన్మించారు. వాళ్ళందరికీ వివాహాలు చేసి అందరినీ ఇంట్లోనే ఉంచుకుని వ్యవహారాలు నేర్పుతూ ఎంతోధనం సంపాదించాను. నా సంతానం, సంపదా కూడా చాలా వృద్ధి చెందాయి. నే నతి లుబ్ధుడిని.

ఒకరోజొక బైరాగి వచ్చి ఆ పూట భోజనం అడిగాడు. నేతన్ని పరిచాకులతో గెంటించాను. అతను సాయంకాలంవరకూ మావీధిలోనే కూర్చున్నాడు.

స్వయంపాకం ఇస్తే కాని కదలనని అతనూ, చచ్చినా ఇవ్వనని నేనూ పంతంపట్టి కూర్చున్నాం. అతను శపిస్తాడని మావాళ్ళు భయపెట్టినా నేను లొంగలేదు. అప్పుడతను విసిగి ఎక్కడికో పోయాడు.

నేను భూమిని జయించినంత ఆనందంతో వీధి తలుపులు తెరిపించాను. కాని అతను మర్నాడే మళ్ళీ వచ్చి కూర్చున్నాడు. మేము ఏవైపు మసలుతామో అటువైపే వచ్చి కూర్చునేవాడు. నాకోసం వ్యాపార నిమిత్తం ఎందరో వస్తూంటారు. అన్నితలుపులూ మూసుకుని ఎలా కూర్చోగలను? "మళ్ళీ ఎందుకొచ్చావు?" అని రాయబారం పంపాను.

"నాకు స్వయంపాకం అక్కర్లేదు. నీతో కొన్ని విషయాలు మాట్లాడాలి" అన్నాడతను.

"ఆరు నెలలు పోయాక అవకాశమిస్తాను" అన్నాను.

అత నారు నెలలకి రాగా – మరి రెండునెల లన్నాను. అప్పుడు రాగా మరొక నెల అన్నాను. అలా ఎప్పటికప్పుడు గడువులు దాటిస్తూ ఏడాది గడిపాను. ఎప్పటి కప్పుడే అతను సిద్ధమయ్యేవాడు.

అతను వేదాంతం చెబితే దానికి వ్యతిరేకంగా నేను చెప్పాను. అప్పు డతను తనచేతిని నా తల మీ దుంచి నా మనసుని మెత్తపరచి – నా చెవిలో ఒకలా చేస్తే నిజం గ్రహిస్తావని చెప్పి – ఉపదేశమిచ్చాడు.

ఒకనాటిరాత్రి – భోజనం చేశాక నా భార్యని పిలిచి – "నేను చనిపోబోతున్నాను. నా ప్రాణాలు నిలిచేటట్లు లేవు. ఐహికమే తప్ప ఆముష్మికం చూసుకోలేదు. మరో ఏడాది బతికితే అది చూసుకునేవాణ్ని." అన్నాను.

వాళ్ళు హాహాకారాలు చేస్తూ తెల్లవారే వరకూ చికిత్సలు చేయించారు. యోగి నేర్పినట్లు నేను ఊపిరిబిగబట్టి ఉండగా – ఆ యోగివచ్చి – పంచదార కలిపిన పాలుతెచ్చి నా దగ్గరనిలబడి – "ఇతను కాలధర్మం చెందాడు. విచారించి ప్రయోజనం లేదు. ఇతనితో మీకు ఎక్కువ కార్యముంటే చెప్పండి. ఈ సిద్ధౌషధంతో బతికిస్తాను" అన్నాడు.

అందరూ – "అతనితోనే మా జీవితం బతికించండి" అన్నారు. "ఇతని కాయువు తీరింది. కనుక చనిపోయాడు. ఈ సిద్ధౌషధం ఎవరు పుచ్చుకుంటారో వారు మరణించి వారి ఆయువు ఇతనికి చేరుతుంది. మీలో ఒక్కరు తాగినా ఇతను జీవిస్తాడు" అన్నాడు యోగి.

ఆ మాటలు విన్నాక ఒక్కరూ ముందుకు రాలేదు. ఆ యోగి నా భార్యకు పతివ్రతా ధర్మం చెప్పబోగా - ఆమె "నేను చచ్చాక ఎవరుంటే నాకేమిటి? నీవైద్యం చాల్లే" అని అవతలికి జారుకుంది. ఎన్నిసార్ల డిగినా ఎవరూ ముందుకి రాలేదు.

అప్పు డాయోగి - "ఇందరు ప్రాణబంధువులుండి కూడా ఒక్కరైనా వీని ప్రాణం కాపాడలేదు. మీకొరకు ఇతను చేయరాని పనులు చేశాడు. దానధర్మాలనే మాట కూడా ఎరగడు. ఇలాటి లుబ్ధుడికి చివరకు జరిగింది ఇది. నాకత నేమీ ఇవ్వకపోయినా సంవత్సరం నుంచీ అతనితో నాకున్న పరిచయం పురస్కరించుకుని - ఈ సిద్ధౌషధం నేను తాగి అతనికి నా ఆయువిస్తాను" అంటూ అతనది తాగి నన్ను తట్టాడు. నేను విరక్తిగా లేచాను.

నా బంధువులు నన్ను పట్టుకుని ఏడవబోగా - "ఎందు కీ దొంగ ఏడుపులు? ఈ మహానుభావుడివల్ల నిజం తెలుసుకున్నాను. ఎవరి కెవరూ లేరు - ఇదంతా వట్టిది! అంటూ నా బంధువు లందరినీ వదిలి నా ధనమంతా పండితులకు పంచిపెట్టి - ఆ యోగితో దేశాటనం చేయాలనుకున్నాను.

కాని అతను నాకు తెలియకుండా ఎక్కడికో వెళ్ళిపోయాడు. ఎవరికెవరూ లేరనే మాట తప్ప మరొకటి పలకక.. వెర్రివాడినై దేశాలు తిరుగుతూ వీరూ నావంటి వారేకదా అని వీరితో తిరగసాగాను. తరవాత కథ మీకు తెలిసిందే"

ఆ చరిత్రలు విన్న చక్రవర్తి - "ఆ మహాయోగి తన మాటను పద్యంలో చదివినట్లే ప్రత్యక్షంగా నాకిలా చూపాడు. విజయవర్ధనా! వీరిద్దరూ నాకత్యంత ఆప్తులు దేవశర్మను ఈ రాజ్యానికి రాజుగా చేసి వర్తకుణ్ణి అతనికి మంత్రిగా చెయ్యి. శ్రోత్రియ బ్రాహ్మణ పుత్రికను దేవశర్మ కిచ్చి వివాహం చెయ్యి" అన్నాడు.

విక్రమార్కుడు "దేవర ఆనతి ఎంతో ఉచితంగా ఉంది. దేవరా! మాలతిని మీ రింతకుమునుపే వివాహమాడినా అది రహస్యంగానే

ఉండిపోయింది. ఇప్పుడు ప్రఖ్యాతంగా వివాహమహోత్సవం జరిపితే ఎంతో బాగుంటుంది" అన్నాడు. మంత్రి కూడా అలాగే కోరాడు

అంతలో ఆ వార్త విని మందపాల మహారాజు సకుటుంబంగా అక్కడికి వచ్చి చాలాసంతోషించి – చక్రవర్తి గారిని తన గ్రామానికి రమ్మని ఆహ్వానించాడు. భూపాలమహారాజు దేవశర్మను నవకుబేరునితో ఆ రాజ్యంలో నిలిపి – మందపాలుని గ్రామం వెళ్ళి – మాలతిని పెళ్ళాడి – ఆమెతో తన గ్రామానికి పోయి విజయవర్ధనుడితో చిరకాలం రాజ్యం పాలించాడు.

విక్రమార్కుడు, భట్టి ఉజ్జయినికి పోతూ ఒకనాడక్కడ ఆగి – తటాకం సమీపంలో మార్గస్థులు విశ్రమించడానికి మంటపం కట్టించి ఆ పుణ్యాత్ముల విగ్రహా లిక్కడ స్థాపించి వాటిపై ఆ పేర్లు రాయించాడు. జాతి ననుసరించి – బ్రాహ్మణునకు ముఖం మీదా – క్షత్రియుడికి భుజాల మీదా వైశ్యుడికి తొడల మీదా పేరులు రాయబడ్డాయి"

ఆ విగ్రహాల వృత్తాంతం ఇదే! – అని చెప్పి మణిసిద్ధుడు శిష్యుడితో కూడా తదుపరి మజిలీకి ప్రయాణం సాగించాడు.

*3వ భాగం సమాప్తం.*



# కాశీ మజిలీ కథలు

## 30. వ మజిలీ

## 4 వ భాగం

గ్రామం నాలుగుమూలలా తిరిగివచ్చిన గోపాలుడు –"స్వామీ! మనం ఇల్లువదిలొచ్చాక ఇంత పాడు మజిలీ ఎక్కడాచేయలేదు. మిమ్మల్నడిగేదాని కిక్కడ విశేషమే కనపడలేదు. ఇవాళ పుణ్యదినం. కాశీవిశేషాలు చెప్పండి" అన్నాడు.

మణిసిద్ధుడు సంతోషించి విశ్వేశ్వర మాహాత్మ్యం, అభిషేక ప్రభావం, పూజామహిమల గురించి చెప్పాడు. "స్వామీ! చేతులారా విశ్వేశ్వరుణ్నర్చించే భాగ్యం నా కీ జన్మలో లబించదు కదా" "పంచములు తప్ప తక్కిన వారందరూ విశ్వేశ్వర మహాలింగానికి స్వయంగా అభిషేకం చేయవచ్చు"

"నిజమా స్వామీ! మా గ్రామంలో – నేనూ మరికొందరు గోపాలురూ పశువులను మేపుతుండగా పెద్ద పెద్ద వడగళ్ళతో గాలివాన వచ్చింది. రక్షణకోసం దగ్గరలోని శివాలయంలోకి పరుగెత్తి ఆరాత్రి అక్కడే ఉన్నాం. మేమా లింగాన్ని తాకామని అర్చకుడు నాలుగురోజులు నైవేద్యాలు మానిపించి పెద్ద బాపనుల్ని రప్పించి మూడు రోజులపాటు మంత్రాలు చదివి పెద్దసంతర్పణ చేశారు.

"అయ్యా! పల్లెటూరి గుడి లింగానికే ఇంత పట్టింపులుంటే- ముల్లోకాల్లోనూ ప్రసిద్ధి పొందిన విశ్వేశ్వర లింగాని కలాటి నియమా లెందుకు లేవు? ఏదో కారణంఉండి ఉండకపోదు. అదేమిటో చెప్పండి" అన్నాడు గోపాలుడు.

సిద్ధుడు మణిని ముందుంచుకుని ధ్యానంచేశాడు "గోపా! నీపుణ్యం మంచిది. నీ ప్రశ్న ఊరికే పోలేదు మంచి కదవినే అవకాశం లభించింది" అంటూ చెప్పసాగాడు.

# పండిత రాయల కథ

**కా**శీపురంలో పండితభట్టు అనే బ్రాహ్మణుడుండేవాడు. మహాపండితుడైన అతనికి మహా మహోపాధ్యాయ అనే బిరుదు ఉండేది. కాశీ సభాపతి అని కూడా పిలిచేవారు అతని నెందరో రాజులు, సామంతులు దర్శనం చేసుకుని సన్మానించే వారు. అతను కొద్దికాలంలోనే చాలా ధనవంతు డయ్యాడు.అతనికి పుత్రుడు జన్మించగా ఆబిడ్డకి విశ్వనాధుడని పేరు పెట్టి ఉదారంగా చాలా దానధర్మాలు చేశాడు. ఐదవయేట విద్యాభ్యాసంచేసి గురుకులానికి పంపగా ఏడవ యేటికే అనేక శాస్త్రాలలో ఆరితేరాడు.విశ్వనాధునికి ఒక్కసారి వింటే చాలు ఏదైనా పట్టుబడేది. చక్కని రూపంకల, పాండిత్యం కలిగిన పుత్రుడికి ఉపనయనం చెయ్యమని ప్రయత్నం మొదలుపెట్టేసరికి ఆ పిల్లవాడు మరణించాడు. ఆబాలుడి మరణానికి తల్లి తండ్రులేకాక కాశీపురంలోని అందరూ ఎంతో విచారించారు. పండితభట్టు ఏలాగో ఆ విచారాన్ని మరచి మళ్లీ తనశాస్త్రపారాలు కొనసాగించాడు.

అతని భార్య మళ్ళీ గర్భవతై కొడుకుని కంది. ఆ పిల్లవాడు అచ్చుగుద్దినట్లు మొదటివాడిలాగే ఉన్నాడు. వాడికీ విశ్వనాథుడనే పేరుపెట్టి ముద్దుగా పెంచుతూ వయస్సు రాగానే ఉపనయనం చేయబోయాడు అప్పు డా బాలుడు కూడా అకాలమరణం చెందాడు ఆ తల్లితండ్రుల శోకం చెప్పడానికి వీల్లేదు. వాళ్ళకి వైరాగ్యం కలిగింది. కానీ .. మళ్ళీ వాళ్ళకి మరొక కొడుకు పుట్టి ఉపనయన వయస్సులో మరణించాడు. పుత్రశోకం అలవాటైపోయిన ఆ దంపతులు ఎక్కువ విచారించలేదు. ఏడుగురు కొడుకులు అలా అకాలమరణం చెందడం

చూసి పండితభట్టు దానాలూ, హోమాలూ అవీ ఎన్నో చేయించాడు. కాని ఉపయోగం లేక పోయింది.

ఎనిమిదోసారి గర్భం దాల్చినప్పుడు పండితభట్టు భార్య భర్తని పట్టుకుని గోలుగోలున ఏడుస్తూ – "ఏడుగురు పుత్రుల్ని కని యముడి కప్పగించాం. కొడుకులు పుట్టడమెందుకు, చనిపోవడ మెందుకు? ఈ బాధ నేను భరించలేను. గర్భాన్ని తీయించేసే మార్గం ఆలోచించండి" అంది. కాని – అతను భ్రూణహత్యకు అంగీకరించలేదు. అది మహాపాపం అన్నాడు. ప్రారబ్ధకర్మాన్ని అనుభవించవలసిందే అన్నాడు.

కాని....ఆమె మాత్రం మళ్ళీ పుత్రశోకం అనుభవించలేక గర్భవిచ్ఛిత్తికి మార్గాలు వెదుకుతూనే ఉంది. అప్పుడు ఒక ప్రాతః కాలంలో... తన భాషలో దీవెనలు చదువుతూ ఒక ఫకీరు భిక్షకోసం వాళ్ళింటికి వచ్చాడు. రంగురంగుల పూసలపేరులు మెడలో ధరించి పొడవైన అంగీలో అతన్ని చూసినవారికి మహత్తు కలవాడనిపించక మానదు. ఆ ఫకీర్ని చూసిన ఆ ఇల్లాలు గర్భవిచ్ఛిత్తికేమైనా మార్గం చెబుతాడని దాసీ దానితో కబురు పంపింది.

ఆమాట విని ఫకీరు – "మేము ద్రోహపు పనులు చేసేవాళ్ళం కాము. మీ యజమానురాలి కలాటి అవసరమే మొచ్చింది?" అని అడిగాడు. ఆ దాసీది వారి వృత్తాంతం చెప్పగా అతను జాలిపడి – "మీ యజమానురాలిని తీసుకురా. పరీక్షించి రక్షరే కిస్తాను. ఈ సారిపుట్టే పుత్రుడు తప్పకుండా జీవిస్తాడు" అన్నాడు.

ఎంతో ఆశగా వచ్చిందా ఇల్లాలు. ఆమెను తనభాషలో దీవించి... "ఈ పూసలపేరు ఎప్పుడూ నీ నడుముకి కట్టిఉంచుకో. పుత్రుడు పుట్టాక వాడిమెడలో వెయ్యి. వాడికి ఫకీరనే పేరుపెట్టు. రెండుపూటలా మసీదుకు తీసుకుపోయి అక్కడ నమాజు చేసే యవనవృద్ధుల చేత దీవెనలిప్పిస్తూ ఖురాన్ నేర్పించు. అలా చేశావో నీ కొడుకు నిశ్చయంగా జీవిస్తాడు" అంటూ పూసలపే రిచ్చాడు. ఆమె

అతని కెన్నో కృతజ్ఞతలు తెలిపింది. తనభర్త తేలికగా తీసుకున్నా ఆమె ఆ ఫకీరు చెప్పినవాటిని విధిగా పాటించింది. కొడుకు పుట్టాక ఆ పూసలపేరుతో పాటు మహమ్మదీయ బాలురికి పెట్టు నగలు వేసింది.

పండితభట్టు మసీదులోగల పెద్దలకి కూడా మంచి కానుక లివ్వడంతో వాళ్ళతన్ని దీవిస్తూ లాలిస్తుండేవారు. చిన్న ఫకీరుని తండ్రి యవన గురువు వద్దకు విద్యకై పగటి పూట పంపుతూండేవారు రాత్రిపూట ఇంట్లో కావ్య, నాటక తర్క వ్యాకరణం పారాలు జరుగుతాయి కనుక వినడంవల్లనే వాటిలో ప్రజ్ఞసంపాదించేవాడు.

ఫకీరుకి రెండు మూడు రోజులలో ఏడేళ్ళు నిండుతాయనే సరికి తల్లితండ్రులక్కి భయం పట్టుకుంది. కాని... వారి మాటలు విని అతను తనకేమీ భయంలేదని ధైర్యం చెప్పాడు. పదిరోజుల వరకూ పండితభట్టు - యవనుల దీవెనలే తనకొడుక్కి జీవిత మిచ్చాయంటూ వారికే కానుకలిస్తూ వాళ్ళని పొగిడాడు. ఎనిమిదో యేట ఉపనయనం చేసినా మసీదుకి పంపడం మానలేదు. వారి విద్యే చెప్పిస్తూ... ఇంటిదగ్గర వేదం చెప్పడానికొక పండితుణ్ని నియమించాడు కత్తి విద్య నేర్చుకుంటానని చిన్న ఫకీరు ముచ్చటపడితే అదికూడా నేర్పించాడు. ఏదయినా ఇట్టే నేర్చుకోగల చిన్న ఫకీరు పదహారేళ్ళు వచ్చేసరికి అన్నిటిలోనూ అగ్రగణ్యుడయ్యాడు.

చిన్నఫకీరు రూపం బట్టీ విద్యల్ని బట్టీ ప్రజలు ఎన్నెన్నో పేర్లతో పిలచేవారు. శూరులు పండిత రాయలని పిలిచేవారు. అతను తరచుగా యనవ దుస్తులు వేసుకుని యవనప్రభువులా కనిపించేవాడు. అతనికి తల్లితండ్రులు వివాహం చేద్దామనుకున్నా అతని మనసు వీరరసం వేపే తప్ప శృంగార రసం వేపు మొగ్గకపోడంతో తమ ఉద్దేశాన్ని వాయిదా వేసుకున్నారు.

ఒకరోజతను మసీదులో యవనమతానకీ హిందూమతానికీ కల తారతమ్యం గురించి అతిచక్కగ విశదీకరించే ఉపన్యాసం చేసేసరికి

మసీదు పెద్ద అతన్ని ఢిల్లీ పాదుషా వద్దకు పంపుతానన్నాడు. అదేక్షణంలో ఢిల్లీనుండి ధనంతోపాటు – ఉత్తరం తెచ్చి ఇచ్చారు. పెద్ద ఫకీరు ఆ ఉత్తరం చదివాడు. దానిసారాంశం... పాదుషాగారికి లవంగి అనే కూతురుంది. ఆమె వయసు పదహారేళ్ళు ఈ మధ్యే కాశీఖండం అనే గ్రంధం చదివింది. చిన్నప్పటినుంచీ హిందూమతమంటే అభిమానం. అందుచేత ఆ విద్యల్లోనే కృషిచేసింది. రేపు రాబోయే శివరాత్రికి కాశీవచ్చి విశ్వేశ్వరుడికి స్వయంగా అభిషేకం చేస్తుందట. పాదుషాగారికి ఏడుగురు కూతుళ్ళుపుట్టి – ఏడేళ్ళు నిండడంతోనే చనిపోతూండేవారు. లవంగి ఎనిమిదో సంతానం. ఒక్కతే ఉంది. అందుచేత పాదుషాకీమె మీద ఎంతో అభిమానం. ఆమెకోరిందంటే ఎలాగేనా చేసి తీరతారు. హిందువుల అభిప్రాయం కనుక్కుని రాయమన్నారు.

పెద్దఫకీరు – "ఉత్తరం విన్నావు కదా. ఈ వూళ్ళో మీతండ్రే అన్నిటికీ సమర్థుడు. బలవంతంగా అయినా ఆకార్యం జరిపించక మానమన్న వాక్యానికర్థం తెలుసుకున్నా వనుకుంటాను. మీ తండ్రి అభిప్రాయం తెలుసుకురా" అన్నాడు వీరుడితో.

"ఏమిటీ! హిందూదేవాలయంలోకి వచ్చి యవన పుత్రిక అభిషేకం చేస్తుందా! చాల్చాలు. ఇందుకు మా మతస్థు లొప్పుకోరు. మా మతంలో ఇతర మతాలవారిని కలుపుకుందుకు శాస్త్రాలు సమ్మతించవు. బలాత్కారంగా జరిపించడానికి పాదుషా ఒక్కడే వీరుడా? ఇక్కడ బలవంతులు లేరా?" అన్నాడు వీరుడు.

పెద్ద పకీరు పాదుషాబలం గురించి చెప్పి – వీరుణ్ని వెళ్ళి తండ్రిని కనుక్కు రమ్మన్నాడు. పాదుషాగారి శాసనం విని పండితభట్టు ఊరిలోని పెద్ద లందరినీ కలిసి – కాశీరాజుగారి దగ్గరకు వెళ్ళి విషయం వివరించగా రాజుగారు మర్నాడు విశ్వేశ్వరుడి దేవాలయంలో సభ చేశారు. అక్కడ తలొకరూ తలో అభిప్రాయం వెలిబుచ్చారు. "పాదుషావారు మనందరికీ చక్రవర్తి. వారి అధీనంలో అనేక లక్షల సైన్యముంది. నేను వారికెదురు నిలవలేను. వారిశాసనం ధిక్కరించలేను. కనుక ప్రార్థనా పత్రికపంపుదాం" అన్నారు కాశీరాజుగారు. అప్పుడు వీరుడు లేచి –

"విశ్వేశ్వర లింగం హిందూమతస్తు లందరికీ ప్రాణం" దాన్ని కాపాడుకోడం హిందూ దేశానికంతటికీ ఆవశ్యకమే. పాదుషా అని భయపడకండి అతనికి మనలో ఒక్కడి బలంలేదని నమ్మండి. మనమందరం ఏకమైతే పదిమందిపాదుషాలు కూడా మనల్నేమీ చెయ్యలేరు. మనరాజుగారికి పాదుషాగారంటే భయం ఆయనతో పనిలేదు. వారి రెండు లక్షల సైన్యాన్నీ నా అధీనంచేస్తే శివరాత్రినాడు పాదుషాగారి సైన్యాన్ని మనవూరి పొలిమేరలకయినా రానివ్వను. అతను ప్రార్థనలకి లొంగేవాడు కాదని అతని ఉత్తరమే చెబుతూంది" అన్నాడు.

ఆ మాటలకందరకూ వీరావేశం వచ్చి – "పాదుషా గారి కూతురుని గుడిలో ప్రవేశించనివ్వం" అన్నారు. రాజుకి కూడా రోషమొచ్చి – "మీరందరూ వీరులూ, నేను పిరికి వాడినీనా! ఈ వీరుడికి సర్వసేనాధిపత్యం ఇస్తున్నాను. అతనిష్టమొచ్చినట్లు చెయ్యొచ్చు యుద్ధమే వొస్తే – నేను సహాయకుడిగా ఉంటాను'' అన్నాడు. దానితో సభముగిసింది.

అది విని ఫకీరు తలపంకించి అప్పుడే వజీరుకి జవాబు రాసిపంపేశాడు.

కాశీపురానికి నాలుగు క్రోసుల దూరంలో పాదుషాగారి అధీనంలో ఉన్న హుస్సేన్ బాద్ అనే కోటలో లవంగి పదివేలసైన్యంతో దిగుతుందనీ...శివరాత్రినాడు గంగాస్నానం చేసి లింగాని కభిషేకం చేస్తుందనీ, అడ్డమొచ్చిన వాళ్ళని చంపెయ్యమనీ పాదుషా ఆజ్ఞ అనీ...అందుకు సహాయం చెయ్యమనీ రహస్యంగా రాసినా పకీర్లు వీరుడిమీదే విశ్వాసం ఉంచారు.

వీరుడది తెలిసి కాశీరాజు వద్ద లక్షసైన్యం మాత్రమే తీసుకుని శివరాత్రికి ముందే పట్నం చుట్టూ, వీధులమొదటా, దేవాలయ ద్వారాల్లోనూ కాపుపెట్టి – చక్రవ్యూహం పన్ని తాను గుర్రమెక్కి అన్నిచోట్లా తిరగసాగాడు. ఇది తెలియని వజీరు – పదివేలసైన్యంతో లవంగిని హుసేన్‌బాద్ కోటలోకి పంపాడు.

# లవంగి కథ

యవన సేనానాయకుడు తన సైన్యాన్నంతటనీ హుసేన్‌బాద్ చుట్టూ నిలబెట్టి కాశీ విశేషాలను తెలుసుకురాడానికి వేగుల్ని పంపాడు. వారు తెచ్చిన సమాచారం విని - వారిబలం తమబలం కంటె అధికంగా ఉందనీ, అదనపు సైన్యం వచ్చే సరి కాలస్య మౌతుందనీ, కర్తవ్యం తెలపమనీ రాజకుమార్తెకు ఉత్తరం పంపాడు. అది చదివి - 'ఈ పాడు జన్మకి గంగాస్నానం, విశ్వనాధ దర్శనం ప్రాప్తిలేనట్లు ఈ కులంలో ఎందుకు పుట్టాను?' అని లవంగి విచారిస్తుంటే సంగీత చంద్రిక - "నిన్నెలాగయినా రేపు గంగాస్నానం చేయించి విశ్వనాధుని ఆలయానికి తీసుకెళ్తాం. కుందలతిలక ప్రొద్దున్నే కాశీపురం వెళ్ళింది. అక్కడి రహస్యాలు తెలుసుకురాగలదు" అంటూండగానే ఆమె అక్కడికి వచ్చి -

"నేను మారువేషంలో కాశీపురం వెళ్ళాను. కావలివాళ్ళ అనుమతి లేకుండా చీమయినా దూరడానికి వీల్లేదు. పట్నం చుట్టూ రాజభటులున్నారు. యాత్రకోసం వచ్చిన హిందువులు నిరాటంకంగా పోవచ్చు. దారులలో పరీక్షిస్తూంటారు. నీ వేష భాషలు, స్వభావం కూడా హిందువులవే. మేమిద్దరం ఎలాగా హిందువులమే. కనక మనం మగ వేషాలలో హిందువులమని వెళ్ళవచ్చు" అంది. లవంగి సంతోషించింది. "కాని...ఎవరికీ తెలియకుండా కోటలోకి రాకపోకలు జరపడం ఎలా? అని సందేహం వెలిబుచ్చింది. చెలికత్తె లిద్దరూ ఆ ప్రాకారం చుట్టూ పరిశీలిస్తూ తిరిగితిరిగి - శత్రువులు కోట ముట్టడిస్తే తప్పించుకు పోయేందుకు కల రహస్యమార్గం ఒక దానిని కనుక్కున్నారు.

లవంగికి పట్టు బట్టలు కట్టి పురుషవేషం వేసి - తమంతః పురంలోకి ఇతరులు రాకుండా నియమించి "తెల్లవారుఝామునే ఆ పాతాళ మార్గంలో దివిటీలు పట్టుకుని నడవసాగారు. కొంతసేపు నడిచాక అడ్డంగా తలుపు కనపడింది. దానిని తెరిచి ముందుకి పోగా ఒక

మెట్టమీదకి చేరుకున్నారు. అక్కడినుంచి కొంతదూరం నడిచాక కోసెడుదూరంలో కాశీపట్నం కనిపించింది.

తెల్లవారుతున్న ఆ సమయంలో లవంగి భక్తిశ్రద్ధలతో చేతులు జోడించి కాశీ పట్నాన్ని స్తోత్రం చేస్తూ... కాశీ ఖండంలోని విశేషాలను చెలులకు చెబుతూ కాశీ వెళ్ళే యాత్రికులలో కలసిపోయింది. పురద్వారం దగ్గర రక్షక పురుషు లడగగా – "ఇతనొక రాజకుమారుడు యాత్రకి వచ్చాడు. పరిజనం వెనక వస్తూంది. వేళయి పోతూందని ముందుగా నడచి వస్తున్నాడు" అని చెప్పారు.

లవంగి గంగలో ప్రవేశించింది. స్నానం చేసి వస్త్రాలు దరించి విశ్వనాధాలయానికి వెళ్తుంటే – "పాదుషాగా లవంగి గుళ్ళో ప్రవేశిస్తుందనీ... వూళ్ళో వాళ్ళందరినీ కత్తులు పట్టుకు సిద్ధంగా ఉండమని ఊరేగింపు వెయ్యాలనీ–" తలారులు చెప్పకోడం వినిపించింది. వారు చాలా వరకూ వెళ్ళగలిగారు. కాని... గర్భాలయం ముందు కాపుగా నిలుచున్నది వీరుడు. లవంగి చెలికత్తెలతో సహా ద్వారం దాటబోతూంటే – ఆమెచేయి పట్టుకుని – "యవనుడిలా పాగాతో స్వామి వద్దకు వెళ్తున్నావేమిటి?" అని అడ్డాడు.

ఆ మాటలకు – పురుషవేషంలో ఉన్న చెలికత్తెలు "అయ్యా! ఇతను నేపాళదేశ రాజకుమారుడు. తలపాగా, అంగీ లేకుండా మే మేపనీ చెయ్యం. మమ్మల్ని పోనివ్వండి" అని వినయంగా ప్రార్ధించారు. అతని స్పర్శకు లవంగి వివశువై అతని ముఖం చూస్తూ ఉండిపోయింది.

"ఇష్టమైతే అంగీ, తలపాగా తీసి లోపలికి పొండి. లేకపోతే అక్కడే నిలబడండి" అన్నాడతను. లవంగి అతని నుంచి చేయి విడిపించుకుని "నావేషం యవన వేషంలా ఉందన్నారు. మరి మీవేషం ఎలా ఉందో? ఈ వేషంలో మీరిక్కడున్నారేం?" అని అడిగింది ధైర్యంగా.

"నేను బ్రాహ్మణుడినే అయినా ద్వారం కాస్తున్నాను కనుక ఈ వేషం ధరించాను. నే నీవేషంలో లోపలికి పోను –" అని చెప్పాడు.

"ఇక్కడి బ్రహ్మణులకి శాస్త్రములు, వేదములు, యజ్ఞములు కంటె సేవకావృత్తే ఎక్కువ కాబోలు" అని ఎత్తిపొడిచింది. "నేను సేవకుడిని కాను. వీరుడిని. లవంగి అనే యవనురాలు బలాత్కారంగా ఆలయంలో ప్రవేశిస్తుందంటే నే నీద్వారం కాస్తున్ననంతే. మీకు శాస్త్రాలు తెలిస్తే - మీ ఇష్టమొచ్చినదానిలో అడగండి" అన్నాడతను

"బ్రాహ్మణులకి పౌరుషం తగునా?"

"పరశురాముడు బ్రాహ్మణుడు కాదా? అతను వీరుడు కాలేదా?"

అలాగ వాళ్ళిద్దరికీ కొంచెం సేపు పురాణశాస్త్రాల్లో ప్రసంగం జరిగాక తనదేపై చేయిగా ఉన్నా - "యాత్రికులు నిలబడిపోయారు. మీతో మాట్లాడాలనీ ఉంది. మళ్ళీ మీరు దర్శనమిస్తే ప్రసంగిద్దాం" అన్నాడు వీరుడు.

ఆమె అక్కడినుంచే విశ్వేశ్వరుణ్ణి స్తుతించింది.

"మీరు స్త్రీలా చదివారేం?" అని అడిగాడు వీరుడు.

"ఈ స్తోత్రం రాసినది స్త్రీ" అందామె. అక్కడినుంచి తొందరగా బయటకు వచ్చేశారు వాళ్ళు.

తరువాత కథ ముప్పయ్యయిదవ మజిలీలో చెప్పాడు మణిసిద్ధుడు.



# కాశీ మజిలీ కథలు

## 31. వ మజిలీ

గోపా. లవంగి అంతఃపురానికి వచ్చి భోజనం చేశాక ఒక రహస్య ప్రదేశంలో కూర్చుని చెలులతో ముచ్చ ట్లాడసాగింది.

*లవంగి* . మీదయవల్ల విశ్వేశ్వరుణ్ణి కళ్ళారా చూడగలిగాను.

*కుందలతిలక* : నీచేత విశ్వేశ్వర లింగాని కభిషేకం చేయించలేక పోయామని మేం సిగ్గుపడుతున్నాం. ఆ గుమ్మం దగ్గరున్న బ్రాహ్మణ కుమారుడు చాలా అసాధ్యుడు ఏం చేయగలం?

*లవంగి* : అతను నా చెయ్యి పట్టుకునేసరికి వొణుకొచ్చింది సుమీ! మనం ఆడవాళ్ళమని అతని కనుమానం తగిలినట్లుంది. అదీకాక నేను మరచిపోయి స్తుతి శ్లోకాలలో స్త్రీలింగం వాడాను.

*సంగీత చంద్రిక*: అతని రూపం అతిమనోహరం. నువ్వాయనతో ప్రసంగించావుకదా? విద్యల్లో?

*లవంగి* · విద్యల్లో బృహస్పతి వంటివాడే! అతను - యువతుల పాటిటి మన్మధుడే అని చెప్పాలి.

*కుందలతిలక* : అతను విశ్వేశ్వరసాక్షిగా నీపాణిగ్రహణం చేశాడు.

*లవంగి* అదేమిటో కాని అతన్ని చూసింది మొదలు నా హృదయంలో ఏదో . .తియ్యని ...బాధ. అతనెవరో తెలియక పోయినా...ఒక్కసారే చూసినా మనసునిండా మన్మధ భావాలు నిండిపోతున్నాయ్. కాని . ఇది సాధ్యమౌతుందా?

*సంగీత చంద్రిక* నిద్రపో రేపాలోచిద్దాం.

కాశీపట్నంలో... మసీదు పకీరులు వీరుడి మీద ప్రేమకొద్దీ - యవనసేనలోకి వెళ్ళి అక్కడి విశేషాలు ప్రతిరోజు సాయంత్రం అతనికి చెబుతున్నారు. శివరాత్రి నాటి సాయంకాలం లవంగి గుడికి రాదనీ,

రెండు మూడు రోజులలో రాజధాని నుంచి కూడా వచ్చి - సేన ఊరిమీద పడుతుందనీ చెప్పారు. వీరుడు సేనలన్నిటినీ సిద్ధం చేసుకుని....ఇంటి కెళ్ళి విశ్రాంతి తీసుకుంటూ....

లవంగి రాకుండా కాపాడాననుకున్నాను కానీ దానిపని అది చేసుకునే పోయింది. నేనే మోసపోయాను. మగాడి చెయ్యి అంత సుకుమారంగా ఉండదు. చూపులని బట్టికాని కళ్ళలోని కాటుక ఆనవాళ్ళ బట్టిగాని గుర్తించలేక పోయాను. స్తుతి శ్లోకా లద్భుతంగా గానం చేసింది. అందువల్లే హిందూ మతాభిమాని అయింది. అలాటిది గుడిలో ప్రవేశించినా తప్పులేదు, స్వామి కభిషేకం చేసినా తప్పులేదు. ఆమెను తలుచుకుంటూంటే నా హృదయం వివశమౌతుంది. ఆమె చూపుల్లో నాపై అనురాగం ఉట్టిపడినట్లే అనిపించింది..

అనుకుని...అంతలోనే కర్తవ్యం గుర్తు తెచ్చుకున్నాడు.

మర్నాడు రాజుగారికి పత్రం రాసి సైన్యం రప్పించుకుని కీలక ప్రదేశాల్లో కాపు పెట్టి పట్నాన్ని కాపాడసాగాడు. కుందలతిలక మారువేషంలో కాశీపట్నం వచ్చి వీరుడి వృత్తాంతమంతా తెలుసుకుని లవంగికి చెప్పింది. తురక దేవతల ఆరాదన వల్ల జీవించి ఉండడం వల్ల ఆ వేషంలో ఉన్నాడు. విద్యలోనే కాక పరాక్రమంలో కూడా అసామాన్యుడే - అంటూ వివరించింది.

మర్నాడు వజీరు మరికొంత సైన్యంతో అక్కడికి వచ్చి తరువాత దినం కాశీపురం మీద పడి పోరాటం సలుపు తారని విని లవంగి వీరుడి గురించి దైవాన్ని ప్రార్థించింది.

వజీరు వచ్చి హుస్సేన్ బాద్‌లో దిగాడని విని - కాశీపురంలోని మసీదు ఫకీర్లు అతన్ని చూడడానికి వెళ్ళారు. గౌరవ మర్యాదలయ్యాక - "ఇక్కడి హిందువులింత కావరించి ఉన్నారేం? పాదుషా శాసనమంటే నవ్వులాటగా ఉందా? వీరెవరి దన్ను చూసుకుని ఇలాటి పనికి దిగారు?" అని అడిగాడు.

"కాశీరాజు మీకు భయపడి సహాయము రానన్నాడు. దేశానికంతటికీ ఆ లింగం ప్రాణం వంటిది కనుక హిందువులంతా ఏకమయ్యారు కాశీరాజు అంగీకారంతో నిమిత్తం లేకుండానే సైన్యమంతా వచ్చి పట్నాన్ని కాపుకాస్తూంది. హిందువులు - పిల్లలు, స్త్రీలు మొదలు అందరూ యుద్ధానికి సిద్ధంగా ఉన్నారు. ఒకరిప్రోత్సాహం అక్కరలేదు" అని చెప్పారు ఫకీర్లు. "సరే" అని మీసాలు దువ్వుతూ - "చూస్తాను" అని హుంకరించాడు వజీరు.ఫకీరు లక్కడి రహస్యాలు తెలుసుకుని వీరుడికి రహస్యంగా అందించారు. "పాదుషా చాలా సైన్యంతో వచ్చి ఉన్నాడు. ఎల్లుండి ఉవ్వెత్తున పట్నం మీద పడిపోతాడు. రేపు ప్రొద్దున్న లవంగిని ఢిల్లీ పంపేస్తాడు. ఆమె వెళ్ళడానికి సమ్మతించలేదు కానీ, స్త్రీలుండ కూడదని ఎలాగో ప్రయాణాని కొప్పించారు. కొంచెం సైన్యాన్ని సహాయంగా ఇచ్చి పల్లకీ మీద పంపుతారట. ఇవే విశేషాలు. తరవాతేం చెయ్యాలో ఆలోచించుకో" అన్నారు.

వీరుడు మర్నాడు కొందరు రాజభటులని సహాయంగా తీసుకుని లవంగి వెళ్ళేతోవలో కాచుకుని ఉన్నాడు. పల్లకీ బోయీల కంఠధ్వని వినగానే పులిలా - ఆ సైన్యం మీద కురికి - చెలికత్తెలతో కూడా ఆ పల్లకీని దారిమళ్ళించి కాశీపురానికి తీసుకుపోయి - ముందే ఏర్పాటు చేసిన అంతఃపురంలో వారినుంచి కాపాడసాగాడు. అదంతా వీరుడే చేయించాడని తెలిసి లవంగి ఆతిద్యంలా భావించింది. తన తండ్రి వల్ల వీరుడి కేం ముప్పొస్తుందో అని ఆమె భయపడసాగింది.

వీరుడు రణభేరి మ్రోగించాడు. తమకి కూడా ఆజ్ఞ ఇమ్మని యవన సైనికులు వజీరుని కోరారు. అత ననుమతించేంతలో రాజపుత్రికతో వెళ్ళిన భటులు వచ్చి శత్రువులామెను చెరపట్టుకు పోయిన విషయం చెప్పారు. దానితో మంత్రికి మతిపోయింది. పాదుషా ఆజ్ఞలేకుండా రాజకుమార్తెను వెనక్కి పంపినందుకు ఆయన తనకి శిరచ్ఛేదం చేయడంమానడని భయపడ్డాడు.

"మా కాజ్ఞ ఇవ్వండి. శత్రువులను సంహరించి రాజపుత్రికను వెదికి తీసుకొస్తాం " అన్నాడు సేనాధిపతి తమశౌర్యం ప్రకటిస్తూ.

"అంతవరకూ ఆమెను శత్రువులు బతకనిస్తారా! సామోపాయంతోనే కార్యం చక్కబరచుకోవాలి. అంతా ఐపోతే యిక చేయగలిగే దేముంది? ప్రస్తుతానికి యుద్ధం ఆపండి. రహస్యంగా ఊరిలోకి వెళ్ళి ఆమె జాడ తెలుసుకుందుకు వేగుల్ని నియమించండి. తెలుసుకుని వచ్చిన వారికి మంచికానుక లిస్తామని చెప్పండి" అన్నాడు.

గూఢచారుల వలన వీరుడు యవనులు యుద్ధం మానుకున్నారని విని చాలా సంతోషిస్తూ...కీలక ప్రదేశాలను రక్షించుకోవలసిందిగా తన వారికి జాగ్రత్త చెప్పాడు. మర్నాడు ఆడవేషంలో ద్వారపాలకులకు వీరుడు పంపాడని చెప్పి లవంగి ఉన్న అంతఃపురానికి వెళ్ళాడు. ఆ మేడకి దూరంగానే ఉండి కుందలతిలకను చేతి సంజ్ఞతో పిలిచి ఒక ఉత్తరం ఇచ్చి లవంగికి పంపాడు.

అది చదివి – "సఖీ! వీరుడి చెల్లెలట మల్లిక... మనతో మాట్లాడ్డానికి వచ్చిందట. వారు మనని గౌరవించారే కాని ఏవిధమయిన అవమానమూ చెయ్యలేదు కదా. ప్రవేశపెట్టు" అంది లవంగి సఖితో. ఆమె వెళ్ళి మల్లికని సగౌరవంగా తీసుకు వచ్చి కూర్చో బెట్టింది.

లవంగి మల్లిక నుంచి వివరాలు రాబట్టింది. ఊరిలో లవంగి గురించి ప్రత్యేకంగా చెప్పుకుంటూ ఉండడంచేత చూడా లనిపించి వచ్చిందనీ తాను వీరుడి చెల్లెలి ననీ చెప్పింది. తరవాత లవంగికీ ఆమెకి శాస్త్ర చర్చ జరిగింది. ఇద్దరూ సన్నిహితులయ్యారు. అప్పుడు మల్లిక "యవనకులంలో పుట్టిన నీకు హిందు విద్యలలో అభిలాషెందుకు కలిగింది? హిందూ దేవతల నారాధించడాని క్కడి కెందుకువచ్చావు? ఆ వృత్తాంతం చెప్పు" అని అడిగింది.

లవంగి – "మా తల్లికి ఏడుగురు పుత్రికలు జన్మించారు. కాని ప్రతివాళ్ళూ ఏడు సంవత్సరాలు నిండడంతోటే మరణించేవారు. ఎనిమిదోమారు మాతల్లి గర్భం దాల్చినప్పుడు చాలా దుఃఖిస్తూ గర్భ విచ్ఛిత్తి చేసుకునే ఉద్దేశ్యంతో అలాటి ఓషధి ఎవరినైనా అడిగి తెమ్మని తన పరిచారికని పంపింది. ఆ దాది తనకి తెలిసిన ఒక బ్రాహ్మణుడిని అడిగింది.

అత నటువంటి పని చెయ్యడాని కంగీకరించక అసలుకారణం తెలుసుకుని మంత్రాక్షత లిచ్చి సంతానం నిలబడేటట్లు చేయగలనని శపథం చేశాడు. దాది అతని మాటలు మా తల్లికి చెప్పగా అతనిని రప్పించి తానేం చెయ్యాలో అడిగింది.

"పిల్లపుట్టింది మొదలు హిందూ దేవాలయాల్లో ఉత్సవాలు చేయిస్తూ బ్రహ్మణుల చేత జపాలూ మంత్రాలూ చేయిస్తూ ఉండాలి. హిందూ విద్య చెప్పించాలి" అన్నాడా విప్రుడు. మా తండ్రిగారి అనుమతితో ఆమె అలాగే చేసింది. నేను పుట్టిన పదిరోజుల్లో జాతక కర్మలు మొదలయినవి చేసి నన్ను బ్రాహ్మణుని ఇంటిలోనే పెంచసాగారు. ఏడేళ్ళు నిండేవరకూ నన్ను మా తల్లి తండ్రులు కన్నెత్తయినా చూడలేదు.

నేను హిందూ విద్యలే చదువుకున్నాను. గండం గడిచాక బ్రాహ్మణుల కనేక దానధర్మాలు చేసి నాకు వేదశాస్త్రాలే చెప్పించారు. అందుచేత నా కవే ప్రియ మయ్యాయి. ఈ మధ్యనే కాశీమహిమ చదివాను. అందుచేత కాశీవిశ్వేశ్వరుణ్ణి చూడాలని ఈ ప్రయాణం పెట్టుకుని వచ్చాను" అంటూ వివరంగా తనకథ చెప్పింది.

ఆ మాటలు విని మల్లిక ఆశ్చర్యపోయి – 'నీ కథ అచ్చం మా అన్న కథలాగే ఉంది. అతనికీ నీకూ పూర్వజన్మ సంబంధమేదేనా ఉందేమో" అంది.

"అందుకే కాబోలు మీ అన్నపేరు వినగానే నామనసు కేదో ఆనందం కలుగుతూంటుంది. ఇప్పుడు మీ అన్న చాలా పెద్దవారితో పగ తెచ్చిపెట్టుకున్నాడు. అదీకాక నన్ను చెరపట్టిన వానిని మా తండ్రి భూమి మీద నిలవనిస్తాడా? అయినా... బ్రాహ్మణులకి పౌరుష మేమిటి? ఇప్పటికేనా తప్పించుకుంటే బాగుంటుందేమో." అంది లవంగి.

" ఈ మాట నేను చాలాసార్లు చెప్పాను. కాని... వాడు వినడే! యుద్ధం అంటాడు. కాని..నువ్వంటే మాత్రం వాడికి చాలాఇష్టం అని మాటల ద్వారా గ్రహించాను."

"ఎక్కడైనా నా ప్రసక్తి అతను తెచ్చాడా! నామీద ఇష్టమని ఎలా గ్రహించావు?" అని ఆత్రంగా అడిగిందామె.

" ఈ ముప్పుకి మూలకారణం నువ్వేఅని ఎవరో నిందించారు. అతనందు కొప్పుకోక నీ పాండిత్యాన్ని పొగిడి మీ తండ్రిని దూషించాడు. నీ రూపాన్ని కూడా ఎందుకో పొగిడాడు. నేనిక వెళ్తాను శలవిస్తావా?"

"నీ మాటలతో నా దుఃఖం అంతా మరిచి పోయాను. చెరపట్టినా అవమాన పరచకుండా నన్ను గౌరవంగా కాపాడుతున్న మీ అన్న కనేక నమస్కారాలని చెప్పు. ఈ పగవదిలి స్నేహ పూర్వకంగా ఉంటూ ఈ ఆపద గట్టెక్కమను. దయచూడమని చెప్పు" అంటూ లవంగి కులాచారం పాటిస్తూ మల్లిక చెక్కిళ్ళు ముద్దుపెట్టుకుంది. అత నాసుఖానికి పరవశించి పోయాడు. "ఈ చెరకి భయపడి చెప్పడం కాదు అతని మేలు కోసమే చెబుతున్నాను ఈ ముప్పుదాటితే మా తండ్రికి చెప్పి ఆయనను నా వద్ద పండితునిగా ఉంచుకోగలనని మీ అన్నగారికి మరీమరీ చెప్పు" అని సాగ నంపింది.

ఆమె వెళ్ళాక కుందలతిలకతో.. "మల్లిక ఎవరో తెలుసా? వీరుడే! వెళ్ళబోతున్నప్పుడు తెలిసింది. ఇలా ఆడవేషంలో వచ్చి మమ్మల్ని మోసం చేస్తావా అంటే ఏం చెప్పబోయేవాడో? అయ్యో! నేను నా మన సతనికి స్పష్టంగా చెప్పలేదు" అంటూ విచారించింది. "ఫరవాలేదులే. తెల్లవారకపోదు. ఇకమీదట మన్మధుడే వ్యవహారాలు చక్కబెడతాడు విచారించకు" అంది కుందలతిలక.

మర్నాడు ఫకీరులు వీరుడి దగ్గర కొచ్చారు. "నీ శౌర్యం చాలా ప్రశంసించదగింది. రాజపుత్రికనే చెరపట్టి తెచ్చావటగా! మంత్రి తలక్రిందులై పోతున్నాడు. ఆమెను నువ్వు చంపుతావేమో అని భయపడి పోతున్నాడు. పాదుషా తనకి శిరచ్ఛేదం చేయిస్తాడని హడలిపోతున్నాడు. సంధికిదే సమయం. రాజపుత్రికను సజీవంగా అప్పగిస్తే మన నిబంధనలకు అంగీకరిస్తాడట. మాతో చెప్పాడు. పాముని చేతితో పట్టుకోకూడదు. లవంగిని తీసుకుపోయి అప్పగించు. మంత్రితో మాట్లాడవలసిన మాటలు చెప్పు. మేంఅడిగివస్తాం. నువ్వు మా కాప్పుడివని మంత్రి ఎరుగడు" అన్నారు. "మీరు పదే పదే చెబుతూంటే వినకపోడం కృతఘ్నుతగా ఉంటుంది. పాదుషాభయం నాకు లేదు.

కాని మీ ఆజ్ఞ చొప్పున నడుస్తాను. ఎప్పుడూ కాశీపురం మీద దండెత్తకుండా ఉండేటట్లూ, హిందు దైవాలని నిందించకుండా ఉండేటట్లూ ప్రమాణ పత్రిక వ్రాసిమ్మనండి ఈ తప్పుని క్షమించమని కోరండి. అలా అయితే లవంగి నప్పగిస్తాను. లేదా జరగవలసింది జరుగుతుంది" అన్నాడు.

ఫకీరులు వజీరు వద్దకు వెళ్ళి – "స్వామీ! మేము హిందువులవద్ద కెళ్ళి సంధి మాటలు చెప్పాం లవంగిని బలియివ్వడానికి సిద్ధంగా ఉన్నారు వాళ్ళు. ఎక్కడ దాచారో తెలియదు. వాళ్ళలో అందరికందరూ అధికారులే. అందరినీ బతిమాలుకుని ఎలాగో రెండు గడియలు వ్యవధికోరివచ్చాం. వాళ్ళు కోరిన నిబంధనలకు అంగీకరించాం. మీరు వేగంగా పత్రిక రాసిస్తే పోవాలి" అన్నారు. లవంగి వస్తే చాలని వారు చెప్పినట్లు రాసి వారిచేతికే ఆ పత్రిక నిచ్చి పంపాడు.

ఫకీరు లా పత్రికను తీసుకుపోయి పౌరులందరినీ పిలిచి సభచేసి – చదివి వినిపించారు. హిందువులందరూ వీరుణ్ని ఎంతగానో పొగిడారు. ఆ పత్రిక తీసుకుని వీరుడు అప్పటి కప్పుడే రాజపుత్రికను పల్లకీ మీద మేళతాళాలతో హుస్సేన్‌బాద్ కోటలోకి పంపించాడు. ఆమె రావడం చూసి మంత్రి పునర్జన్మెత్తినట్లే భావించుకుని తమసేనలకు యుద్ధ విరమణ ఆజ్ఞలనిచ్చి – ప్రయాణ సన్నాహాలలో ఉండగా – పాదుషావారివద్ద నుండి ఒక జాబు వచ్చింది.

ఆ పత్రికను విప్పి చదవగా – "నువ్వు మా ఆజ్ఞలేకుండా మా ప్రాణ సమానమైన లవంగి నిక్కడికి పంపడం తప్పు పంపినా తగినంత సేనలను సహాయమివ్వకుండా పంపడం రెండో తప్పు హిందువులామెని తీసుకుపోయాక నువ్వేం చేశావో తెలియ జేయకపోడం మూడోతప్పు. ఈ మూడు తప్పులకీ నిన్ను ఉద్యోగం నుంచి తొలగిస్తూ ఈ ఆజ్ఞను పంపుతున్నాం. నీ సమాధానం విన్నాక తగిన శిక్ష విధిస్తాం. మే మేకోరిక తీర్చడానికంత సన్నాహం చేశామో దానిని శత్రువుల పాలు చేశావు. సకలసైన్యంతో మే మక్కడికి వస్తున్నాం. హిందువుల నందరినీ చంపిపారేస్తాం. కాశీపట్నాన్ని నామరూపాలు లేకుండా చేస్తాం" అని ఉంది.

మంత్రి దుఃఖిస్తూ ఆ పత్రికని రాజపుత్రిక వద్దకు పంపి తన కుపకారం చేయమని వేడుకున్నాడు. రాజపుత్రిక దాన్ని చదివి మంత్రిమీద జాలిపడి – చేయగలిగిన సాయమంతా చేస్తానని సమాధానం పంపింది. మరునాడు ఉదయం నేలపట్టినంత సైన్యంతో పాదుషా ఆ కోటకు వచ్చాడు.

లవంగి తెరచాటునుంచే తండ్రితో మాట్లాడింది. వీరుడి మీది అభిమానంతో తన బందీవృత్తాంతం కొంచెమైన ప్రస్తావించలేదు. పాదుషా అంతలోనే ఆ విషయం వదిలి తెల్లవారగానే యుద్ధం ప్రారంభించేటట్లు ఆజ్ఞయిచ్చాడు.

ఫకీరులవల్ల చక్రవర్తి ప్రయత్నం తెలుసుకుని – వీరుడు తన బలాలను సమీకరించుకుని చక్రవర్తి సేనలకు తన సేనల నెదురు నడిపించాడు. ఎక్కడ చూసినా తానే ఔతూ...గుర్రం మీద తిరుగుతూ యుద్ధం చేస్తూ యవనసైన్యాన్ని కాశీపురం దరిదాపుల్లోకి రాకుండా కోసెడు దూరం తిప్పికొట్టాడు. రెండు సైన్యాలకీ ఘోరమైన యుద్ధం జరిగింది. సాయంకాల మయ్యేసరికి వీరుడు తన సేనలతో యవనసేనను హుస్సేన్‌బాద్ కోటకి గెంటేశాడు. హిందుసైన్యంలో జయజయ ధ్వానాలు చెలరేగాయి. వీరుడు తన సేనలను మళ్ళీ కాశీపురం తీసుకుపోయాడు.

పాదుషా తన సేనాధిపతుల నాక్షేపించి మర్నాడు కొత్త సైన్యాన్ని నియోగించమన్నాడు. తమ సేనను రెండు భాగాలు చేసి కాశీనగరాని కుత్తర దక్షిణాలు రెండువేపులా ఒకేసారి ముట్టడించాయి యవనసైన్యాలు. వీరుడు తన దళాలను ఉత్తరదిశగా పంపి తాను కొన్ని దళాలతో దక్షిణదిశగా వెళ్ళి యుద్ధం చేసి ఆసేనలన్నిటినీ హతమార్చాడు. అంతలో ఉత్తరదిశలో హిందుసైన్యం కంటె యవన సైన్యంది పైచేయిగా ఉందనీ, తమ సైన్యం వారి నెదిరించలేకపోతూందనీ,యవనసైన్యం నగరంలో ప్రవేశిస్తూందనీ తెలిసి వేగంగా అక్కడికి వచ్చి శత్రుసైన్యాలను ఎదురొడ్డి, తన సైన్యాన్ని మళ్ళీ నిలబెట్టి వారిని వెనక్కి తరిమేశాడు.

ఆ రాత్రి యవన సేనానాయకు లందరూ సమావేశమై "వీరుడు గుర్రమెక్కి యుద్ధం చేస్తున్నంతసేపు భూమంతా ఏకమైవచ్చినా అతన్ని

గెలవలేరు అతను గుర్రంమీంచి నేలమీదపడే ఉపాయం ఆలోచించాలి. ఇది - రోహిలాలు చేయగలరు వాళ్ళు ఉచ్చుతాళ్ళతో యుద్ధం చేస్తారు కదా. ఆ తాళ్ళని యుద్ధభూమిలో అక్క డక్కడ కట్టిస్తే వీరుడి గుర్రపు పాదాలకవి తగులుకుని వీరుడితో సహ నేలకూలుతుంది. అప్పుడతన్ని పట్టుకోవచ్చు" అని పన్నాగం పన్నారు ఆ రాత్రే రోహిలులు రణభూమిలో శంకులు పాతివాటి కుచ్చుతాళ్ళు కట్టసాగారు.

ఆ వేళ పకీరులు యవనసేవలోకి రాడానికి అవకాశం చిక్కక ఈ విషయం వీరుడికి తెలియలేదు యవనసేనలు ఒక్కసారిగా కాశీపురం నడిభాగం మీద పడదలుచు కున్నారు వీరుడు తన బలగంతో వాళ్ళ నెదిరించాడు అతను తన గుర్రాన్నతి వేగంగా నడిపిస్తూంటే దానికాలికి ఉచ్చుతాడు తగులుకుని అది నేల కూలిపోయింది. వీరుడు పదిగజాల అవతలకు ఎగిరి పడ్డాడు అక్కడ కాచుకుని వున్న యవన వీరులు తటాలున అతన్ని పట్టుకుని బంధించారు. అతన్నోక బందీ గృహంలో పెట్టారు. తరవాత వారికి విజయం అతి తేలికయి పోయింది

కాని .. అప్పటికే చీకటి పడడంతో మర్నాడు దోచుకుందామని శిబిరాలకు వెళ్ళిపోయారు. వీరుడు పట్టుబడడం, బలాలు పారిపోడం, మర్నాడు శత్రుసైనికులు దొచుకోబోతున్నారని తెలియడం ..వీటితో కాశీపుర ప్రజలు విచారిస్తూ... దేవాలయాలు మూసి వేసి, ధనందాచుకుని,ఇళ్ళకి తాళాలు పెట్టి, చాలామంది గంగానదిదాటి వెళ్ళిపోయారు. పండితభట్టు కొడుకు శత్రువులకు పట్టు పడ్డాడని తెలిసి, విచారం పట్టలేక, చనిపోడానికి అక్కడ తిరుగుతూ.... తన కొడుకు నేం చేశారో తెలుసుకుందుకు ప్రయత్నించ సాగాడు.

లవంగి యుద్ధ విశేషాలు తెలుసుకుంటూనే ఉంది. వీరుడు బందీగృహంలో పెట్టబడడం విని పరితపిస్తూ కుందలతిలకతో..."అతను మనం చెరసాలలో ఉన్నప్పు డెలాటి ఉపచారాలు చేశాడో గుర్తుందా? అందుకు మనం ప్రత్యుపకారం చేయాలి. కారాగృహం ఎక్కడుందో తెలుసుకుని రాత్రి ఎలాగేనా అతన్ని దాటి వెయ్యాలి. ముం దతన్నెక్కడ

దాచారో తెలుసుకురా" అంది. "అదంతా నేను చూసే వస్తున్నాను. మనమేడ కింద గదిలోనే అతన్ని దాచారు. గదికి తాళం వెయ్యబడి ఉంది తప్పకాపలా ఎవరూ లేరు. సింహద్వారంలోనే భటులున్నారు. ఆ తాళం విడగొట్టి అతన్ని తీసుకురావాలి. నీ అనుమతి కోసమే చూస్తున్నాను" అందామె.

"అయ్యో! ఆ పుణ్యాత్ముడు చీకటి గదిలో ఏంబాధ పడుతున్నాడో! త్వరగా తీసుకురా." అంది లవంగి. చెలికత్తె లిద్దరూ తగిన సాధనాలతో వెళ్ళి - తాళం పగలగొట్టి ఆ గదిలోకి వెళ్ళేసరికి - వీరుడు - విశ్వేశ్వరుణ్ణి ధ్యానిస్తూ - "స్వామీ! నేను నిమిత్తం తురకలతో పోరాడాను. నువ్వేమో నామీద కనికరంలేకుండా ఈ కారాగృహంలో పెట్టించావు!నువ్వింత కృతఘ్నుడి వనుకోలేదు. అందరూ వద్దంటున్నా నే నొక్కడినే నీకోసం ఇంత గొడవ తెచ్చుకున్నాను. పులిమీసాలు పట్టుకుని ఉయ్యాల లూగాలని ప్రయత్నించాను. నీదయ తెలిసిందిగా...మరో దారి చూసుకుంటాలే..." అంటూంటే - లవంగి చెలికత్తెలు దీపం పట్టుకు రావడం కనిపించింది.

"మేము లవంగి చెలికత్తెలం. ఆమె మీ ఆపద విని చాలా పరితపిస్తూ మమ్మల్ని మీ వద్దకు పంపింది. ఆమె అంతఃపురానికి పోదాం, రండి" అన్నారు. అతను సంతోషంగా వారివెంట బయలు దేరాడు. వారతన్ని అంతఃపురానికి తీసుకెళ్ళి ఒకగదిలో శయ్యమీద కూర్చోబెట్టి ఉపచారాలు చేయసాగారు. "ఆహా! పరమేశ్వరుడి అనుగ్రహానికి మేరలేదు కదా! ఇప్పటిదాకా అతను దయలేని వాడని నిందించాను. కాని...ఎలా సంభవింపజేశాడో కదా! ఈ అంతః పుర మెక్కడ, అబందీగృహం ఎక్కడ! ఎంత చోద్యం!" అని మనసులో అనుకుని - "సుందరీమణులారా! నాయందు మీ రాజపుత్రిక కింత దయెందుకు కలిగిందో! ఆ పుణ్యాత్మురాలిని చూడాలని వేడుకగా ఉంది - " అన్నాడు.

" ఈ తెరచాటునే ఉంది. సిగ్గుతో మీ ఎదుటకు రావడం లేదు. ఆమెకు మీరు చేసిన ఉపచారాల ముం ది దేపాటి? అది మొదలు ఎప్పుడూ మీ మాటే చెబుతూ మిమ్మల్నే పొగడుతూంటుంది. మిమ్మల్ని

చూడాలని ఎంతోకోరికతో ఉంది. దైవమిలా కూర్చాడు" అని – ఆమె వేపు తిరిగి – "సఖీ! ఇటురా! దాక్కుంటావేం? నువ్వనుకున్న పని చేసి కృతజ్ఞత తెలుపుకో" అని ఆమె చెలికత్తెలు అన్నారు.

అప్పు డామె చేతిలో పూలమాలతో తలవంచుకుని వచ్చి అతనికి దగ్గరగా నిలబడింది ఆమె రూపానికే అతను ముగ్ధుడై పోయాడు. జరుగుతున్న దంతా అతని కేదో ఇంద్రజాలంలా ఉంది.

"అయ్యా! మా రాకుమార్తె ఈ పుష్పమాలికను మీ మెడలో వేసి కృతజ్ఞత తెలపాలని కోరుకుంటూంది. మరోలా భావించకండి" అన్నారు వాళ్ళు.

అందు కతను – "మీ రదేమాట పదేపదే అంటున్నారు. ఆమెకు నేనేమీ చేయ్యలేదు. ఇప్పు డామె చేస్తున్న దానికి బదులుగా వెయ్యి జన్మలెత్తినా ఏమీ చెయ్యలేను. నేననవలసిన మాటలు మీరంటున్నారు" అన్నాడు.

కుందలతిలక – " మీఇద్దరి కృతజ్ఞతా భావమూ సమంగానే ఉంది కానీ...ఆమె అభిలాష తీర్చుకున్నాక మీ కేదిష్టమయితే అది చెయ్యండి అది మాకూ ఇష్టమే ఔతుంది" అంది.

లవంగి అతని మెడలో హారం వేసేసరికి సంగీత చంద్రిక మరొక హారం అతని కందించి "అయ్యా! మీ అభిలాషమాత్రం ఎందుకు తీరకపోవాలి? మీరూ బదులు తీర్చుకోవలసిందే" అంటూ అతనిచేత ఆమె మెడలో దండ వేయించింది అతను తనను తాను మరచిపోయాడు. చెలికత్తెలు వారిని ఏకాంతంలో వదిలి అవతలకి వెళ్ళిపోయారు.

ఆ తర్వాతవాళ్ళు మదనకేళిలో తేలి . వివశులై ఆమె అతని గుండెల మీద నిద్రపోయింది అతను నిద్రపోక తెలివితెచ్చుకుని... 'ఎంతపనిచేశాను! తురక లమ్మాయి శివలింగాన్ని ముట్టకోకుండా కట్టడి చేస్తానని పౌరు లనందరినీ సిద్ధంచేసి పాదుషాకు శత్రువులని చేసాను. వాళ్ళని వదిలేసి నే నిక్కడ కులం చెడగొట్టుకున్నాను! నన్ను నమ్ముకుని వాళ్ళెన్ని కష్టాలు పడుతున్నారో నేను పెళ్ళి కొడుకై సుఖా లనుభవిస్తున్నాను

ఎంత ద్రోహినయ్యాను. సరే కర్మ నెవరూ తప్పించలేరు. ఇప్పు డీమె అంతఃపుర రహస్యాలన్నీ చెప్పింది కదా" అనుకుంటూ లేచి ఆమె చెప్పిన ద్రావకాన్ని పట్టుకుని పాదుషాగారి మేడకి పోయి అతని ముక్కుదగ్గర ఆ ఒషధిని వాసన చూపి...అతడు వివశుడవగా ఎత్తుకుని రహస్య మార్గంలో వేగంగా కాశీపురం వెళ్ళిపోయాడు.

ఉదయం నిద్రలేచిన లవంగికి తనపక్కన వీరుడు కనపడక ఆశ్చర్యపోయి అదో కలగా భావించి ఆ కల మళ్ళీ రావాలని నిద్రపోయింది. అంతలో చెలికత్తెలు వచ్చి లేపారు. ఆమె తనకు కల వచ్చిందంటూ చెప్పింది. అది కల కాదనీ, నిజంగా జరిగిందనీ వాళ్ళు చెప్పేసరికి - వీరుణ్ని వెదకమంది

వాళ్ళు వెదికి వచ్చి - " అతనెక్కడా లేడు. రహస్యమార్గం కాని చెప్పేవా? పాదుషాగారు అంతఃపురంలోనూ లేరు, వీధిలోకీ వెళ్ళలేదుట. మనమేడకి వచ్చారేమో అనుకుంటున్నారట. ఇదేం చిత్రం?" అన్నారు వాళ్ళు

అప్పుడు లవంగి. "సఖులారా! నేను పొరపాటే చేశాను. ప్రియుడితో - శివరాత్రి నాడు నేనొచ్చిన గుప్తమార్గం గురించి ప్రసంగవశంలో చెప్పాను. అతను మెత్తగా మాట్లాడుతూ ఈ కోటలోని రహస్యాలన్నీ తెలుసుకున్నాడు. నా తండ్రి నిద్రపోయే స్థలం వివరాలు నా నుంచి రాబట్టాడు. అయ్యో! చక్రవర్తిని ఎత్తుకు పోలేదు కద?" అంది కంగారుగా.

"ఎవరేనా రహస్యాలు బయలుపరచుకుంటారా? నీ తెలివితేట లేమయ్యాయ్? అతనెంత బలవంతుడైనా రాజుకి మెలకువ రాకుండా ఎత్తుకు పోగలడా?" అంది కుందలతిలక.

"అయ్యో! మత్తు కలిగించు ద్రావకరండాన్నీ బల్లమీద చూసి - అత నదేమిటని అడిగాడు. నేను వివరంగా చెప్పాను. అది ఇప్పు డిక్కడ కనిపించడం లేదు" అంది లవంగి. దానితో వీరుడు చక్రవర్తికి మత్తు కలిగించి ఎత్తుకు పోయాడని అర్థమైంది.

సేనలన్నీ రాజదర్శనం కోసం వచ్చాయి. ఇవాళ కాశీపురం దోచుకుందామని కాబోలు. ఏం జరిగిందో చూశారు కదా! అతనికి దైవబలముంది. మనవాళ్ళేమీ చెయ్యలేరు. అంతా తలుచుకుంటూంటే నాకు నవ్వొస్తూంది. తురకలకి మంచి ప్రాయశ్చిత్తం జరిగింది" అంటూ నవ్వుతున్న లవంగిని చూసి – "అమ్మా! నీకు కులుకే మరి. మగ దనగానే అంత ఎక్కువ కాబోలు. తండ్రిని చెరపట్టి తీసుకు పోయాడన్న చింత లేనేలేదు. ఎంత కఠినాత్మురాలివి!" అని చెలు లామె నాక్షేపించి –

"కాశీపురం కొల్లగొట్టడానికి సెలవిమ్మని భటులు సందేశం పంపుతున్నారు. ఈ రహస్యం తెలిస్తే అన్ని విధాలా ప్రమాదమే కనుక దాచి తీరాలి. చక్రవర్తిగారు శరీరంలో స్వస్థత లేక కుమార్తె మేడలో ఉంటున్నారు. హిందుదేవతలను పరాభవించబట్టే ఆ సంకటం కలిగిందని భావిస్తున్నారు. అందుచేత మళ్ళీ మా ఆజ్ఞ అయ్యేవరకూ యుద్ధకార్యక్రమాలు చేపట్టవద్దు. హిందువులనీ వారిదైవాలనీ ముట్టవొద్దు. చక్రవర్తిగా రిప్పుడెవరికీ దర్శనమివ్వరు – అని రాజకుమార్తె సెలవిచ్చిందని మేము రాజపురుషులతో చెబుతాం. మిగిలింది తరవాత ఆలోచిద్దాం" అని అపాయంలో ఉపాయం చెప్పారు.

వాళ్ళ బుద్ధి బలానికి లవంగి చాలా సంతోషించి అలా చేయడానికి అంగీకరించింది. తరవాత వాళ్ళు సేనాపతికి చెప్పి పాదుషా ఉన్న తావు కనుక్కుందుకు రహస్యంగా కాశీపురం వెళ్ళారు.

వీరుడు చక్రవర్తి నెత్తుకుపోయి కాశీపురంలో – శత్రువులు చొరలేని ఒక గుహలో ఉంచాడు. 'వందే కాశీం, గుహాం గంగా' అని నిత్యమూ చెప్పబడే గుహే అది. రోజూ చూసే వాళ్ళకే అది అగమ్యంగా ఉంటుంది. చుట్టూ భటులని కాపుంచి...భోజనాది సదుపాయాలు సగౌరవంగా జరిగేటట్లు ఏర్పాటు చేసి, చెల్లా చెదురైన తన బలాలని మళ్ళీ రప్పించి ఉత్సాహం కలిగించి... ఊరి హద్దులలో కాపుపెట్టాడు. పారిపోయిన పౌరులందరూ వీరుడు తిరిగి వచ్చేశాడని విని – మళ్ళీ పట్నం చేరుకున్నారు.

# ఢిల్లీ పాదుషాగారి కథ

జాము పొద్దెక్కాక కాని మందుపట్టు వదల లేదు చక్రవర్తికి. వీరుడు నియోగించిన పరిచారకులు రాజోపచారాలు చేయసాగారు. ఆకలిగా ఉందంటే బంగారు పాత్రల్లో పదార్థాలందించారు అప్పుడతను నలుమూలలా చూసి – "నేనీ చీకటింట్లో ఎందుకున్నాను? మా సౌధం నుంచి ఇక్కడికెలా వచ్చాను? మావాళ్ళేరీ? యుద్ధం జరుగుతోందా?" అని అడిగాడు.

పరిచారకులేమీ మాట్లాడలేదు. "మీకింత కావరమేంటి? నామాటలు వినపడలేదా? మిమ్మల్ని దండించగలను." అని కనులెర్రజేసేసరికి వీరభటులు నవ్వుతూ – "మేం మీ పరిచారకులం కాం. స్వామిభక్తులం విశ్వనాథ భక్తులగు హిందువులని నువ్వు పీడించావు కనక అతనే నిన్నీ చెరసాలలో పెట్టించాడు. ఇక నీకు రాజ్య మెక్కడిది? చచ్చినట్లు పడుండు లేదా పెడరెక్కలు కట్టించగలం కనికరించి భోజనం పెట్టాం. హిందూదేవతలు యవన దైవముల వంటివాళ్ళు కారు. అణకువ కలిగి ఉండు – " అని బదులు చెప్పారు.ఆ మాటలు విని అతను భయపడ్డాడు. "అయ్యో! భూమండల మంతా పరిపాలించే అధికారం కలిగి న్యాయాన్యాయాలు విమర్శిస్తూ ప్రజలను పాలిస్తున్న నేను నిరపరాధులైన హిందువులనీ, వారిదేవాలయాలనీ భగ్నం చేయాలని ప్రయత్నించాను. దీనికి మూలం నాకూతురు. ఆ నిర్భాగ్యురా లిలాంటి దిక్కుమాలిన కోరిక కోరద మెందుకు? కోరడం తోటే నేనంత ప్రయత్నం చేయడమెందుకు? మతాంతర దైవాలని ఆరాధించే టప్పుడే దానిని దండించవలసింది తప్పు చేశాను. ఇప్పుడేం చెయ్యాలి? ఇది ఏ దేశమో తెలియదు. ఐశ్వర్యమంతా నాశనం చేసుకున్నాను" అని పరిపరివిధాల పశ్చాత్తాప పడుతూ "దూతలారా! మీరు నన్నిప్పుడేం చేస్తారు మీ ఉద్దేశమేమిటి? ఇది ఏ దేశం? నాయందు దయుంచి చెప్పండి" అని అడిగాడు

"ఇది నరకం నీవంటి పాపాత్ములని భగవంతు డిలాటి నరకాల్లో పడేసి కొంతకాలం వేధిస్తాడు. ఆయనకి దయకలిగితే మళ్ళీ

వెనకటి అధికార సంపద లిస్తాడు. లేకపోతే ఫకీరుని చేసి వదిలేస్తాడు. దేవుడి అభిప్రాయం ఎవరికీ తెలియదు. నువ్వు ప్రతిరోజూ మా దేవుణ్ని ప్రార్థిస్తూండు. నీకష్టాలు తీరతాయి. ఆయన సెలవు ప్రకారమే నీ దగ్గర మేమున్నాం" అని చెప్పారు వాళ్ళు.

అది మొదలు చక్రవర్తి విశ్వనాధుడిని ఆరాధిస్తూ తనని విడచిపెట్టమని దూతలని ప్రార్థిస్తూ...వారి ఉపచారా లందుకుంటూ విచారంగా ఒక నెలరోజులు గడిపాడు.

వీరుడు చక్రవర్తిని బందీగా తెచ్చినరోజునే సాయంకాలం ఫకీర్లు వచ్చి మాట్లాడారు రాజపుత్రిక ఆజ్ఞ గురించి చెప్పారు. అతను తప్పించుకున్న విధం తెలియక యవనులు తలకొట్టుకుంటున్నారనీ, రాజపుత్రిక యుద్ధం చేయవద్దందనీ అన్నీ చెప్పారు. వీరుడు వారికేవో చెప్పి సంతోషం కలగజేశాడు.

కుందలతిలక, సంగీతచంద్రికలు వీరుణ్ని పట్టుకున్నా అతను పదిమందిలో ఉండడంవల్ల మాట్లాడే వీలు చిక్కలేదు. అతనూ వారెవరో ఎరుగనట్లే తప్పించుకు పోయాడు.

అలా కొన్ని రోజులు గడిచాక ఒకనాడు కుందల తిలక మగవేషంలో వచ్చి...ఎక్కడికో పోతున్న వీరుడి గుర్రపు కళ్ళెం పట్టుకుని – "స్వామీ! మా అప్తునొకరిని మాయచేసి ఎవరో చెరపట్టుకు పోయారు. ఆ ఆపదను మీరు తీర్చాలి. మీరు పరమ దయాళువని మీ ఆశ్రయం కోరి...నాలుగు రోజులనుంచీ తిరుగుతున్నాను." అంది వినయంగా. అతను నవ్వుతూ... "మీ అప్తు డెవరు? అత న్నెందుకు చెరపట్టారు?" అని .. ప్రశ్నించాడు

"అదంతా రహస్యంగా చెప్పాలి" అంది పురుషవేషంలో ఉన్న కుందలతిలక.

అతను గుర్రం దిగి దగ్గరలోని ఇంట్లోకి తీసుకెళ్ళాడు. అప్పుడామె నవ్వుతూ... "ఆర్యా! మమ్మల్ని మరచి పోయారా? నేను లవంగి చెలికత్తెను. మా రాకుమార్తెని విరహాగ్ని పాలు చేసి వదిలేశారు.

ఆమె తండ్రి మాటకూడా మరచి మిమ్మల్నే స్మరించుకుంటూంది. మీరొక సారి వచ్చి చూడక పోతే ఆమె ప్రాణాలు నిలవవు. మా చక్రవర్తిని ఏంచేసారు? ఎప్పటికైనా వదులుతారా? ఈ రహస్యం ఎన్నాళ్ళు కప్పిపుచ్చి ఉంచం? మా కేదైనా ఉపాయం చెప్పండి" అంటూ రాకుమార్తె రాసిన ఉత్తర మందించింది. అది చదివి ఆమె విరహాన్ని గ్రహించి ఆమె నూరడిస్తూ "రాచకార్యాలవల్ల రాలేక పోయాను. ఈ రాత్రే వచ్చి మాట్లాడతానని చెప్పు" అని జవాబురాసిచ్చి ఆమెను పంపాడు. కాని అతనిలో కులమతభ్రష్టత్వం గురించి సంఘర్షణ రేగింది... ఒక వేపు పాపభీతి. మరొక వేపు మదన తాపం. చివరి కతను లవంగి వద్దకు వెళ్ళకుండా ఉండలేక పోయాడు.

*వీరుడు* : తరుణీ! నీ ఉపచారాలు నన్ను మొహమాట పెడుతున్నాయి. నన్నింతటితో వదలిపెట్టు. విద్వాంసుడిని, లోకం నిందించే పనులు చేయకూడదు కదా!

*లవంగి* : లోకం అంగీకరించని పనులు చేయకూడదు. కాని నువ్వటువంటి వేమీ చెయ్యడం లేదే!

*వీరుడు* : పరస్త్రీ గమనం పాతకం కదా. ఆ పాపం నన్నంటుతుంది కాదూ?

*లవంగి* : నేను పరస్త్రీనా! మీ అభిప్రాయం సరైంది కాదు. నే నేమైనా వెలయాల్ని అనుకుంటున్నారా! మీరే జాగ్రత్తగా ఆలోచించండి. విశ్వేశ్వరుడి సాక్షిగా నా పాణిగ్రహణం చేయలేదా? అప్పుడే త్రికరణ శుద్ధిగా మిమ్మల్ని భర్తగా భావించాను. అందుకే మీ కోసం ఇన్నిపాట్లు పడుతున్నాను.

*వీరుడు* : బ్రాహ్మణులు తురకలను పెళ్ళాడినట్లు ఏ పురాణంలోనూ చెప్పబడలేదు.

*లవంగి* : పంచములను తప్ప తక్కిన సర్వవర్ణాల వార్నీ బ్రాహ్మలు వివాహం చేసుకొనవచ్చునని హిందూధర్మశాస్త్రం చెబుతోంది. యవనులు వారిలో చేరుతారు. తప్పక చేరుతారు, అంటూ అతన్ని ఆమె కౌగలించుకొబోయింది. అతను ఎక్కువసేపు నిగ్రహం పాటించలేక ఏమైతే కానీ అంటూ ఆమెతో తనివితీరా సుఖించి తెల్లవారక ముందే కాశీపురం వెళ్ళాడు.

అతని రాకకోసం ఎదురు చూస్తున్న పరిచారకులను చూసి –

"చక్రవర్తి సుఖంగా ఉన్నాడా? రాజోపచారాలు చేస్తున్నారా? ఏమంటున్నాడు? ఇప్పటి కేనా హిందువుల దైవాలు నోరుకలవారని ఒప్పుకుని పశ్చాత్తాప పడుతున్నాడా? మీ రెందుకిలా వచ్చారు?" అని వీరుడు ప్రశ్నించాడు.

"స్వామీ! బోనులో పెట్టిన సింహం ఏమి చేయగలదు? మొదట తనక్కడ ఉండడం గురించి చాలా విచారించి మమ్మల్నడిగాడు. మేమది నరక మనీ, దేవతాద్రోహం చేశాడు కనుక అక్కడ పడేశామనీ,మేం స్వామిభక్తులమనీ చెప్పాం అప్పటి నుండీ మాతో వినయంగా ప్రవర్తిస్తూ మా ఉపచారాలు స్వీకరిస్తూ తనని తన దేశానికి పంపమని ప్రార్థిస్తున్నాడు. ఇంకెన్నడూ హిందూ దేవతల జోలికి రాడట. విశ్వనాధుడికి కొన్ని గ్రామాలు కానుకగా ఇస్తాడట. అలాపత్రం రాసిచ్చాడు. మే మేంచెబితే అది చేస్తూ సలాములు చేస్తున్నాడు. మేము మరి కొన్ని దినాలు పోనిమ్మని చెబుతూ వస్తున్నాం. ఇప్పటికి నెలకావస్తోంది. మీ ఆజ్ఞ ఏదయితే అలా చేస్తాం" అన్నారు వాళ్ళు

ఒకనాడు రాత్రి మంచి సమయం చూసి వీరుడు మునపటి ద్రావకంతో చక్రవర్తికి మత్తు కలగజేసి పూర్వంలాగే రహస్యంగా ఎవరికీ తెలియకుండా రహస్యమార్గంలో లవంగి అంతఃపురానికి తీసుకుపోయి పడుకో బెట్టి లవంగితో కొంతసేపు ముచ్చట్లాడి కాశీనగరం వచ్చేశాడు.

పాదుషా చక్రవర్తి ఉదయిం లేచి కళ్ళు తెరిచాడు తానున్న గుహకా దనిపించింది. స్వామి భక్తులకు దానపత్రిక రాసిచ్చాడు కనక బందికానా నుంచి విముక్తి లభించిందను కున్నాడు. ఇది తన అంతః పురంకావచ్చునుకుంటూ – "ఎవరక్కడ?" అని పిలవగా కుందలతిలక, సంగీతచంద్రికలు వెళ్ళారు "ఈ భవన మెవరిది? మీరెవరి పరిచారికలు? నేనిక్కడి కెలా వచ్చాను? ఇంతకు మునుపెక్కడున్నాను?" అని అడిగాడు.

వారు చేతులు జోడించి – "స్వామీ! మీరు నెలకిందట పలవరించగా రాకుమార్తె ఇక్కడికి రప్పించి తల్పంమీద పడుకోబెట్టింది. అప్పటికిఇప్పుడే మీకు మెలకువ వచ్చింది. రాజకుమార్తె ఇన్నిరోజులూ

నిద్రాహారాలు మాని మీకోసం చింతిస్తూంది. ఈ పక్కనే నిలబడి ఉంది" అన్నారు వినయంగా.

చక్రవర్తి చాలా ఆశ్చర్యపోతూ "ఏం విచిత్రం! నా శరీరం ఇక్కడే ఉందని మీరు చెబుతున్నారు! జరిగినదంతా కలన్నమాట! కాని...అప్పుడది కలకాదనుకున్నానే! ఏది కలో ఏది మెలుకువో తేల్చుకోలేకపోతున్నానే! ఇంత విపరీతమైన కలలెప్పుడూ ఎరుగనే. సత్యం తెలుసుకోడం ఎలా? - అని ఆలోచిస్తూ.

పాదుషా : ఇన్నాళ్ళు ఒక గుహలో కొందరు పురుషుల చేత బంధించబడి ఉన్నానే! అదే నిజమై - ఇదే స్వప్నం కావచ్చు కదా? ఎలా ధృవపరచడం?

సఖులు : అయ్యో! అలా అంటున్నారేమిటి? ఇదిగో! మీ లవంగి! ఇది మీ అంతఃపురమే! కళ్ళు తెరిచి కూడా కల అనుకుంటున్నారు కదా!

పాదుషా : ఇవన్నీ నిజమే అని ఎలా నమ్మేది? అప్పుడూ ఇలాగే మోసపోయాను. కళ్ళతో చూసి, చేతులతో ముట్టుకుని...శరీరం గిల్లుకుని మరీ మరీ చూసుకున్నాను. అవన్నీ కలలు కాలేదూ? అలాగే ఇప్పుడూ కలలో మీరందరూ కనపడుతూ నాకు చెబుతూండొచ్చు కదా? నాకు మెదడు పనిచేయడం లేదు. మనస్సు చాంచల్యం చెందుతూంది. చూడండి. మొన్నగుహలో నెత్తి కొకరాయి తగిలి బొప్పి కట్టింది. అది కూడా కనపడుతూంది. మరిది కలెలాఔతుంది? ఇలా చూడండి. మొన్న పరిచారకుడు అంగీ అందిస్తూంటే క్రింద పడి ధూళి అంటుకుంది. ఆ మచ్చ సైతం కనపడుతూంది. ఇవన్నీ స్వప్నాలంటే ఎలా నమ్మగలను?

సఖులు : దేవరా! అవన్నీ కలలే. వాకిట్లోకి వచ్చిచూడండి, ఎండెలా కాస్తుందో !

పాదుషా : ఈ ఎండలూ బూటకాలే. ఇది వరకు చూశాను కదా. భటులు సేనాధిపతులు, యుద్ధానికి అజ్ఞయిమ్మనడం కూడా సత్యమనిపించడం లేదు. ఐనా..నాకు బోధిచ్చింది. అనవసరపు పనుల

జోలికి పోను. స్వామి భక్తులకు నేనుదానపట్టారాసిచ్చేశాను. మనం యుద్ధం విరమించి ఇంటికి పోవలసిందే. అయ్యో! మళ్ళీ భ్రాంతిలో పడిపోతున్నాను. ఈ మాటలన్నీ కూడా కలలోనివే. సరే మీరు చెప్పినట్లు సభ తీర్చి అక్కడే విచారిస్తాను ..

చక్రవర్తి తన రహస్యం ఎవరికీ చెప్పకుండాసభాభవనానికి

వెళ్ళి... యుద్ధం వద్దని చెప్పి.. ఆరాత్రే ప్రయాణమై ఢిల్లీ వెళ్ళిపోయాడు.

తరువాత కాశీపుర ప్రజలు కాశీరాజుని అగ్రాసనాధిపతిని చేస్తూ సభచేశారు. ఆ సభలో పండిత రాయలకు మహావీరుడనే బిరుదిచ్చి అతను పాదుషా చక్రవర్తిని చెరపట్టి పుచ్చుకొన్న పత్రిక చదివి అతని నెన్నో విధాల పొగిడారు.

అంతేకాకుండా విశ్వేశ్వర మహాలింగాన్ని పంచములు తప్ప మరెవరూ ముట్టుకున్నా తప్పు ఉండనట్లుగా ఆ లింగానికి మహాదీక్షా తంత్రం గావించి యజ్ఞం చేశారు. అప్పటినుండి ఆ మహాలింగాని కన్ని జాతుల వారూ గర్భాలయంలోకి వెళ్ళి స్వయంగా అభిషేకాలూ అర్చనలూ చేయసాగారు. ఇదే ఈ లింగం వెనక వృత్తాంతం. నువ్వూ వెళ్ళి ఆ మహాలింగానికి నీ చేతులతో అర్చన చేసి కృతార్థుడి వవుదువుగానిలే" అని కథ ముగించాడు మణిసిద్ధుడు.

"మీ కటాక్షం ఉన్నాక నేను కృతార్థుడిని కాకేమౌతాను? అదలా ఉండనివ్వండి. లవంగి తండ్రితో వెళ్ళిందా? ఆమెను పండితరాయలు భార్యగా స్వీకరించాడా? బ్రాహ్మణులా వివాహాని కంగీకరించారా? - ఇవన్నీ చెప్పలేదు మీరు. నామీద దయతప్పిందా ఏం? సగం కథ చెప్పి ఊరుకోడం ఉచితం కాదుకదా. నన్ను పరీక్షిస్తున్నారేమో. తరువాతి కథ చెప్పండి" అన్నాడు గోపాలుడు

మణిసిద్ధుడు నవ్వుతూ - "నువ్విలా అడుగుతానని నాకు ముందే తెలుసు కథ మీద నీ సరదా నాకు తెలియనిదా? నువ్వు సులభంగా వదిలిపెడతావా? సరే. ఇప్పుడు పొద్దుపోయింది. చెప్పదలసిన కథేమో పెద్దదిగా ఉంది. పై మజిలీలో చెబుతాలే" అన్నాడు మణిసిద్ధుడు.



# కాశీ మజిలీ కథలు

## 32. వ మజిలీ

పండితభట్టు కొడుక్కి వివాహం చెయ్యాలని చాలా ప్రయత్నం చేశాడు కానీ పండితరాయలు లవంగి మీద అనురాగం కలిగి ఉండడంచేత పెళ్ళికి అంగీకరించలేదు. ఒకనా దతడు లవంగితో జరిపిన శృంగార విశేషాలు తలచుకుంటూ విరహంలో ఉండగా కుందలతిలక వచ్చి అతనికి నమస్కరించింది. అతను చాలా సంతోషిస్తూ - "లవంగి విశేషాలేమిటి? కుశలమా? అని అడిగాడు "రాచకార్యాలు చక్కబెట్టుకుని వెంటనే వస్తానని ఇంతవరకూ రాకుండా ఉండిపోయారు కదా. ఇక నా సఖురాలి క్షేమం ఏమని చెప్పేది? ప్రతిరోజూ మీరు వస్తారని కళ్ళు కాయలు కాచేలా ఎదురు చూస్తుంది. మీరు వచ్చి చూస్తే తెలుస్తుంది. అది అలా ఉండగా మరో ఉపద్రవం వచ్చి పడింది" "ఏమిటి?" ఆత్రంగా అడిగాడు పండితరాయలు.

"చక్రవర్తి ఇక్కడి నుంచి వచ్చింది మొదలు లవంగి మీద ఇష్టంలేక నిర్లిప్తంగా ఉంటున్నాడు. ఆమెగురించి తలచుకోడమే లేదు. మన రహస్యమార్గం గురించి శత్రువు లెవరో తెలియజేసినట్లున్నారు. దీనిని పరిశీలించి రమ్మని గూఢచారులని పంపాడు. అంతేకాక లవంగికి నెల తప్పింది నాలుగు మాసాలు గతించాయి. మా సఖులలో కలతలు పుట్టేయి. అంతఃపుర రహస్యాలు దాగవు. మీరు వేగం వచ్చి లవంగిని కాపాడుకోండి" అంది కుందలతిలక.

వీరుడు తలూపుతూ - "మీరు విచారించకండి. నేనొచ్చి మీ సఖి నూరడిస్తాను నా మనిషి అయిన లవంగి నవమానించడం చక్రవర్తి తరం కాదు. నేను ఢిల్లీ వస్తానని నీ సఖికి చెప్పు" అంటూ ఎన్ని విధాలుగానో చెప్పి ఆమెను పంపాడు.

మర్నాడు తల్లి తండ్రులకి తెలియకుండా డిల్లీ వెళ్ళాలను కున్నాడు. కాని... అదేరోజు కాశీపట్నంలో దశాశ్వమేధ ఘాట్‌లో ఒక విద్వత్సభ జరిగింది. దానికి పండితరాయలను పరీక్షకుడిగా కోరుకున్నారు. అది తప్పించుకుందుకు వీలు కాలేదు ఆ సభ పదిరోజులు సాగింది.

అప్పుడతను సామాన్యుడి వేషంలో డిల్లీ వెళ్ళి కుందలతిలక గుర్తు చెప్పిన ఉద్యాన వనానికి చేరుకున్నాడు అప్పటికి కొంచెం చీకటి పడుతూంది. ఎవరి నడిగితే ఏం ముప్పొస్తుందో అని అత నక్కడే తిరగసాగాడు. అలా తిరిగి తిరిగి కాళ్ళు పీకులు పెట్టగా ఆ ప్రాంతంలోని ఒక గృహస్తు అరుగుమీద కూర్చుని లవంగి జాడతెలుసుకోడం ఎలాగా అని ఆలోచించసాగాడు. ఆ ఇంట్లోని భార్యాభర్త లాడుకుంటున్న మాట లతనికి వినపడసాగాయి.

భార్య : చక్రవర్తి మిమ్మల్ని వాళ పిలిపించాడట. ఎందుకూ? పుత్రికకి వివాహ ప్రయత్నమా? నేను ఊరిలో లేకపోయాను కదా. నాకేమీ తెలియదు. విశేషమేమిటో చెప్పండి

భర్త : *(గద్గదికంగా) ఏం చెప్పేది? వింటేనే గుండె పగిలిపోతుంది.* రాజుల హృదయం రాతికంటె కఠినం హా! పెంచిన ప్రేమే మనల నింత బాధిస్తుందే! మరి రాజపత్ని ఎంత దుఃఖిస్తుందో! ఆ దుర్వార్త నీకు చెప్పలేక పోతున్నాను. చెప్పకుండా ఉండనూ లేక పోతున్నాను. మనసురాయి చేసుకో. దయమాలిన చక్రవర్తి అమ్మాయిని బలవంతంగా చంపించాడు. అందుకే నా హృదయం తల్లడిల్లి పోతూంది

భార్య : *హా! పుత్రికా! (అంటూ - గుండెలు బాదుకుంటూ మూర్ఛపోయింది)*

భర్త : *ఊరడిల్లు. నువ్వు చాలా వృద్ధురాలివి. దుఃఖం భరించలేవనే చెప్పడానికి సందేహించాను. విచారించి ప్రయోజనం లేదు. దానియోగం అలా ఉంది.*

భార్య : పుత్రికంటే చక్రవర్తికి ప్రాణమే కదా. అలాటి ఆమెనెందుకు చంపించాడు? ప్రేమంతా ఏమయింది? ఆమె కాశీపట్నం వెళ్ళడం వల్లే

అనేక చిక్కులు వచ్చి పడ్డాయి. అసలక్కడేం జరిగింది? వివరాలేవీ నాకు తెలియవు. మీరు చెప్పండి ( అని ఏడుస్తుంది).

భర్త : లవంగి కాశీపురంలో ఎవరినో వరించిందట. అక్కడేవేవో చేసిందట. వాటన్నిటినీ ఎవరో ఆకాశరామన్న ఉత్తరం రాసి పాదుషాకి తెలియజేశాడట. అతను గూఢచారులని హుసేన్‌బాద్ కోటలోకి పంపగా... వారా రహస్యాలన్నీ తెలుసుకుని... అక్కడ దొరికిన ఒక ఉత్తరం తెచ్చి ఇచ్చారట. అది – లవంగి వీరుడికి రాసిన ప్రణయలేఖ. మరి – పాదుషాకి కోపం రాదూ!

భార్య : కోపమెందుకు రావాలి? శకుంతల దుష్యంతుణ్ని గాంధర్వ వివాహం చేసుకోలేదూ?

భర్త : తురకలకంత సహనం ఉంటుందా. అదీకాక తండ్రిని చెరపట్టించి దేవతామహిమనీ, స్వప్నమనీ మోసం చేసిందట. రాజమాత చెప్పింది. నేను వెళ్ళేసరికామె శోకంలో మునిగి ఉంది. పుత్రిక చేసిన వన్నీ భార్యకి చెప్పి గర్భవతి అయిన ఆ నీచురాలిని చంపి అపకీర్తి పోగొట్టుకుంటానని పాదుషా చెప్పాడట.

భార్య : ఆ! ఆ అర్భకురాలు గర్భవతయిందా!

భర్త : అదే పెద్ద ముప్పయింది. ఆమె మగని నెంత ప్రార్థించినా అతనికి దయ వచ్చింది కాదు. పట్టమహిషి నన్ను పిలచి ఆ వార్త లవంగికి చెప్పి ఎక్కడికేనా పారిపొమ్మని చెప్పమంది. కన్న తీపి అలా ఉంటుంది కదా.

భార్య : ఆ తీపి, బాధా నావి కాని ఆమెవి కావు. మంచి ఉపాయమే చెప్పింది. మరి అలా ఎందుకు చెయ్యలేదూ?

భర్త : దేనికేనా మన కేం స్వతంత్రముంది? నేను వెంటనే లవంగికి చెప్పాను. కాని విన్నదికాదు. ఆమె ప్రియుడికి వార్త పంపిందట. అయినా అతని జాడేమీ తెలియరాలేదట. నామాటే వినిపించుకోలేదు. ఎంతగానో చెప్పాను. ప్రయోజనం లేకపోయింది. వలపు వివేకాన్ని నశింపజేస్తుంది

కదా ఆమె చెలికత్తెకి చెప్పాను. నా మాటవింటూనే అది నిశ్చేష్టురాలయింది. రహస్యం చెప్పాను కదా రాజేం చేస్తాడో అనే భయంతో నేను వచ్చేశాను మూడోనాడు మళ్ళీ వెళ్ళేసరికి లవంగి కనపడలేదు ఆరాతీయగా అంతకు ముందు అర్ధరాత్రి గూఢచారులు నిద్రపోతున్న లవంగిని చంపి కందకంలో అణగదొక్కారని ఒక దాది చెప్పింది

భార్య .. అయ్యో! (అని బిగ్గరగా ఏడిచింది) హరిహరీ. ఎలాటి దుర్వార్త విన్నాను!

ఏమండీ. మన లవంగికి తిలోదకా లివ్వాలి సుమండీ.

భర్త : పెంచినందుకా.

భార్య : కాదు. కన్నందుకే. దీన్లో ఒక రహస్యముంది వినండి మీ ఉపదేశం వల్లే కదా పెద్ద బీబీకి సంతానం నిలిచింది. ఆ శిశువు పుట్టడంతోటే మన దగ్గర పెంచడాని కిచ్చారు. మనపిల్లా, లవంగీ ఒకేలా ఉండేవారు గుర్తుందా? ఒకనాడు నూతిలోపడి బాలిక చనిపోయింది. చనిపోయింది మన పుత్రిక అని లోకానికి చెప్పాను. కాని నిజంగా చనిపోయింది రాజకుమార్తె ఎలాగేనా మనమ్మాయి సామ్రాజ్యపదవి అలంకరిస్తే అంతే చాలని అలా చెప్పాను ఇద్దరు పిల్లలూ ఒకేలా ఉండడం వల్ల ఎవరికీ అనుమానమేనా రాలేదు.

భర్త : ఓసి నిర్భాగ్యురాలా! సిరికాశించి వంశచ్ఛేదం చేశావా! అయ్యో! ఈపాటికి మనకి మనవడు కలిగేవాడు కదే. ఎంత పనిచేశావే! ( అని విచారించసాగాడు)

పండితరాయలు ఆసంభాషణ విని నిశ్చేష్టుడై పోయాడు. ' అయ్యో! లవంగీ! నావల్ల నువ్వు బలవన్మరణం చెందావా! నేనెంత కఠినుణ్ణి! నీవార్త విన్నాక కూడా వెంటనే వచ్చి రక్షించుకోలేక పోయాను! నాకోసం ఎన్ని కష్టాలు పడ్డావు! ఎన్ని ఉపాయాలు పన్నావు! నీ జాతి గురించి కూడా ఏకళంకమూ లేనట్లూ వీరి మాటల వల్ల బయటపడింది నీలాటి సద్గుణ సంపత్తి కలది నావంటి పాపాత్ముని కి దక్కుతుందా! నాకు పిచ్చెక్కి

పోతూంది. కాదు కాదు. ఇది మరణవికారం. అదేనా మంచిదే. నా ప్రేయసినిపరలోకంలో కలుసుకోవచ్చు. అయ్యో. నా ప్రాణమెంత కఠినం! ప్రేయసి మరణ వార్త వినికూడా పోవడంలేదు! అనుకుంటూ విరక్తిలో ..నిద్రపోక ....ఆ రాత్రే ఆ వూరు వదలి ఒక అరణ్యమార్గంలో పడి పోసాగాడు. అలా విరక్తితో అరణ్యాలలో తిరుగుతూ కనపడిన పక్షుల గురించి అనేక శ్లోకాలు రచించాడు వాటికే పండితరాయ శతకమనిపేరు.అతని కవిత్వం మదురాతిమధురమే తరవాత కథ విను -"

# భల్లూక దత్తుని కథ

పండితరాయలు అరణ్యంలో తిరుగుతూంటే ఒక కొండ కనపడింది. ఎండ ఎక్కువగా ఉండడం చేత - అలసట తీర్చుకుందు కా కొండకోనలో చల్లగా ఉంటుందని అటు వెళ్ళాడు. పళ్ళుతిని ఆకలినీ, సెలయేటి నీరు త్రాగి దాహాన్నీ తీర్చుకుని - విశ్రమించే స్థలం కోసం తిరుగు తూంటే ఒక గుహ కనిపించింది. అత నానందంగా దానిలో ప్రవేశించి లోపలికి కొంచెం దూరం పోయి ఒకరాతి మీద కూర్చుని గుహద్వారం వేపు చూస్తూ ఏదో ఆలోచిస్తుండగా - ఒక ఎలుగుబంటి చేతులతో తేనెపట్టు పట్టుకుని నోటితో ఈగల్ని తొలగిస్తూ అక్కడికి వచ్చింది. అతను కొంచెమైనా భయపడక అది తన దగ్గరకు రాగానే మోదడాని కొక రాతిగద సిద్ధం చేసుకున్నాడు. కాని - అది చీకట్లో అతన్ని చూడక ..ఒక గోడ దగ్గరగా పోయింది. ఆ గోడ కున్న గూటిలో లేత చిగుళ్ళతో అమర్చబడిన శయ్యపై ఒక శిశువు నిద్రపోతోంది. ఆ భల్లూకం ఆ గూటి దగ్గరకి పోయి శిశువుని ముట్టెతో ముట్టుకోగానే అది క్యారుమంటూ ఏడవసాగింది అది ఆ శిశువునోటిలో తాను తెచ్చిన తేనె పట్టుని పిండింది ఆకలి తీరిన శిశువు నవ్వసాగింది.

ఆ భల్లూకం శిశువునెత్తుకుని యిటూ అటూ కొంతసేపు తిప్పి - ముద్దాడి, మళ్ళీ ఆ గూటిలో పడుకోబెట్టి ఎక్కడికో పోయింది

పండితరాయలది చూసి చాలా ఆశ్చర్యపోయాడు. జంతువులు కూడా పిల్లల నెంత బాగా పెంచుతాయి! ఈ భల్లూక శిశువు మానవశిశువులా ఏడిచాడేమిటో . చిత్రం చూద్దాం. .అని ఆ గూటి దగ్గరకి పోయి ఆ పాపడినెత్తుకుని – 'ఆహా' వీడు మానవ శిశువు. వీడి కారుమాసాల వయసుంటుంది రూపము, లక్షణాలూ చూస్తే చక్రవర్తి కొడుకులా ఉన్నాడు. ఇక్కడికెలా తీసుకు రాబడ్డాడో! ఎలుగుబంటి వీడిని పెంచుతూందా... లేక అదే వీడిని కన్నదా? అనుకుంటూ ఆ పిల్లవాడిని మరీ మరీ పరీక్షించి మానవశిశువే అని నిశ్చయించాడు.

"ఈ ముద్దుల బాలుణ్ణి ఏతల్లి కన్నదో వాళ్ళిప్పుడెంత విచారిస్తున్నారో ఈ పిల్లవాడిక్కడే ఉంటే ఎప్పుడో ఒకనాడీ ఎలుగుబంటి కడతేర్చేస్తుందేమో? క్రూరమృగం మానవశిశువు కుపచారాలు చేయడం దైవకారణమే తప్ప మరొకటి కాదు వీడి నిక్కడి నుంచి తీసుకు పోడమే మంచిది" అని నిశ్చయించుకుని...ఆ పిల్లవాడి నెత్తుకుని వేగంగా కొండదిగి అరణ్యం దాటి సాయంకాలాని కొక పల్లె చేరుకున్నాడు.

ఆ రాత్రి పాలు యాచించి తెచ్చి – పిల్లవాడికి పట్టి – ముద్దు పెట్టుకుంటూ "దేముడు నాకిలాటి కొడుకు నివ్వక సన్యాసిని చేశాడు కదా. లవంగి జీవించి ఉంటే ఆమెకనిన శిశువు ఈ వయసులోనే ఉండేవాడు. పరమనిర్భాగ్యుణ్ణి" అనుకుంటూ పిల్లవాడిని పక్కలో వేసుకుని పడుకున్నాడు క్రమంగా అతని కాపిల్ల వాడిమీద అనురాగం పెరిగి పోసాగింది. వాడినాడిస్తూ లాలిస్తూ నవ్విస్తూ పలికిస్తూ ప్రాణం కంటె ఎక్కువగా చూసుకోసాగాడు వాడి సంరక్షణకోసం అడవుల వెంట తిరగడం మానేసి గ్రామాలలో తిరగసాగాడు. ఒకనాడత నా పిల్లవాడితో ఒకవూరు చేరి అక్కడున్న మసీదుకి వెళ్ళాడు. అక్కడ చాలామంది ఫకీర్లున్నారు.

వారిలోని ఒక వృద్ధ ఫకీరు – పండిత రాయలుని చూసి – "నిన్ను చూస్తూంటే చాలా విరక్తుడిలా కనిపిస్తున్నావు. ఉత్తమమైన ఆశ్రమం స్వీకరించికూడా ఈ పిల్లవాడినెందుకు వెంట పెట్టుకొచ్చావు? నీకేమౌతాడు?" అని అడిగాడు అందుకు పండితరాయలు "నావృత్తాంతం

చాలా అసహ్యమైంది. ఈ బాలు డొక కొండ గుహలో దొరికాడు. వీడెవడో తెలియదు. ఎలుగుబంటి వీడి కపకారం చేస్తుందేమో అని తీసుకు వచ్చాను భల్లూకదత్తుడని పిలుస్తున్నాను" అన్నాడు. ఈ అర్భకుడి వృత్తాంతం ఆశ్చర్యకరమైనదే. నువ్వు ఫకీరువై కూడా హిందూమత విషయం చర్చిస్తున్నావే! భల్లూకదత్తు డను పదం సంస్కృత భాష. నీకాపుర మెక్కడ? నీతల్లి తండ్రెలెవరు?" అని అడిగా డా ఫకీరు.

"నువ్వు వృద్ధుడివి. నీతో అబద్ధాలు చెప్పకూడదు" అంటూ తన వృత్తాంతం చెప్పిన పండితరాయలుని అతను కౌగలించుకుని - "నువ్వా. నేనే మీ తల్లికి మంత్రోపదేశం చేశాను మళ్ళీ ఆమెను చూడలేకపోయాను. బతికినా నువ్వు దుఃఖమే మిగుల్చుకుంటున్నావు. జరిగిన దానికి విచారించకు. చక్రవర్తి లవంగిని చంపించడం నువ్వు ప్రత్యక్షంగా చూశావా? లేక విన్నావా? నీమొహం చూస్తూంటే శుభలక్షణాలు కనపడుతున్నాయి. నీకు మంచే జరుగుతుంది" అన్నాడు.

ఆ మాటలకు పండితరాయలాశ్చర్యపడి.. "స్వామీ! నేను మీ కాప్తుడనే కదా లవంగిని చంపించాడని వినడమే తప్ప చూడలేదు. ఆమె బతికుందా? అంత అదృష్టం నాకు పడుతుందా? ఆమె ఎక్కడుంది? ఆమె కనపడాలే కాని నా బతుకు బ్రహ్మానంద సాగరమే. దయచేసి ఆ విషయం చెప్పండి" అని ప్రార్థించాడు

"అయ్యో! నేను నీ ముఖలక్షణాలను బట్టి అలా అన్నాను కానీ నేనామె గురించి ఏమీ ఎరుగను అప్రయత్నంగానే శుభాలు కలుగుతాయి. పండితుడివి, నీకు తెలియదా?" అని ఆ ప్రసంగం విరమించాడు.

పండితరాయలు పిల్లవాడితో కూడా అక్కడ కొన్నాళ్ళుండి తరవాత బయలుదేరి అనేక దేశాలు తిరుగుతూ హరిద్వారం చేరుకున్నాడు అప్పటికా బాలుడికి ఏడాది వయసొచ్చింది వాడి ముద్దుమాటలు, ఆటలతో అతను కాలక్షేపం చేయసాగాడు. ఒకనా డతను పిల్లవాడితో ఆడుకుంటూంటే కుందలతిలక అక్కడికి వచ్చి ఆశ్చర్యపడుతూ వాడి నెత్తుకుని ముద్దాడడం మొదలు పెట్టింది

'నన్ను నువ్వు గుర్తు పట్టావా! నీ సఖురాలేమైంది? నువ్వూ నాలాగే ఆమెకోసం వెదుకుతూ తిరుగుతున్నావు కాబోలు. నీ మాట విని వెంటనే బయలు దేరక పోవడం వల్ల ఇంత అనర్ధం జరిగింది" అంటూ అతను కన్నీరు కార్చాడు.

అప్పు డామె నవ్వుతూ - 'విచారింపకు మా సఖురాలు క్షేమంగా ఉంది కొడుకుని కంది. ఈ పిల్లవాడు మా స్నేహితురాలి కొడుకే" అంది. అతనాశ్చర్యపోతూ "నిజంగా లవంగి సుఖంగా ఉందా? ఎక్కడుంది? నువ్విక్కడి కెలా వచ్చావు? అని ప్రశ్నలు కురిపించాడు. ఆమె తన వృత్తాంతం వివరించసాగింది

## కుందల తిలక కథ

నేను మీ దగ్గర నుంచి బయలుదేరి ఢిల్లీకి పోయి లవంగి వున్న ఉద్యానవం చేరాను. కాని అక్కడ లవంగి కాని సంగీతచంద్రిక కాని నాకు కనపడలేదు అక్కడి వాళ్ళనుంచి పాదుషా వంగిని గర్భవతి అని కూడా సంశయించక చంపించాడని రహస్యంగా చెప్పారు. అది విని నేను హడలిపోయి మీవూరు వచ్చి మీ కోసం వాకబు చేశాను. మీజాడ తెలియక మీ తల్లితండ్రులు విచారిస్తున్నారని తెలిసింది.

ఏం చేయాలో తోచక దేశాటనం మొదలు పెట్టాను. కొన్ని నెలల తరవాత సంగీత చంద్రిక నీళ్ళు తెస్తూండగా చూశాను. లవంగితో పాటు చంపబడిన ఆమె అక్కడి కెలా వచ్చిందా అనుకుంటూ దాని ననుసరించాను. ఆమె ఒక బ్రాహ్మణుని ఇంట్లోకి వెళ్ళింది. అక్కడివారిని ఆమెను గురించి అడిగాను "ఆమె ఒక బాటసారి కాశీకి పోతూ యీవూళ్ళో బసచేసింది ఆమెతోపాటు ఒక చిన్నదుంది. మగవారు ముందు పోయారట. ఆ చిన్నదానికి మగశిశువుకలిగి రెండు నెలల కిందట జారిపోయాడట అందుకే కాబోలు ఎప్పుడూ విచారంగా ఉంటుంది. ఇంతకంటే మాకేమీ తెలియదు" అన్నారు వాళ్ళు. నేను

మెల్లగా లోపలికి వెళ్ళాను. లవంగి నన్ను గుర్తుపట్టి గొల్లున ఏడ్చింది. అప్పుడు నేను – "మీరు చనిపోయారని విరక్తితో నేను తిరుగుతున్నాను. మీరిక్కడి కెలా వచ్చారు? మీ వృత్తాంత మేమిటి?" అని అడిగాను. అప్పుడు కుందలతిలక చెప్పసాగింది.

"పాదుషా లవంగిని చంపించడానికి నిశ్చయించుకున్నాడని ఒక బ్రాహ్మణుడు మాకు చెప్పాడు. మేము విననట్లు నటించాం. లవంగి పడుకునే శయ్యమీద కృత్రిమ స్త్రీని పొందు పరచి – మేము రహస్యంగా ఉండి గమనించసాగాం. అర్ధరాత్రి భయంకర వేషాలలో రాజభటులు వచ్చి ఆ కృత్రిమ విగ్రహాన్ని ముక్కలుగా నికి పరుపుతో పాటు చుట్టి మోసుకుపోయి కందకంలో తొక్కి పోయారు.

"ఇక్కడుంటే మనకి ప్రాణహాని తప్పదు. మెల్లగా కాశీపుర్కి పోయి నీ భర్తను కలుసుకుందాం" అని ఆమెను తీసుకుని బయలు దేరాను. నాలుగు మాసాల గర్భంతో... చీకట్లో ...నాచేయి పట్టుకుని... ముసుగులో మొహం దాచుకుని ఆమె నడవసాగింది. తెల్లవారే సరికొక పల్లె చేరాం. ఆమె నడవలేక పోతూంది. ఆతోవలో బళ్ళూ అవీ వెళ్ళేవికావు. గర్భం ఎదిగే కొద్దీ ఆమెకు నడక మరింత కష్టమౌసాగింది. ఒకొక్కచోట పదేసి రోజులు కూడా ఉండిపోయేవాళ్ళం.

ఒకనా డొక అగ్రహారం చేరాం. అప్పటికి లవంగికి నెలలు నిండాయి. ఒక బ్రాహ్మణుని వేడుకొనగా వాళ్ళింట పురుడు పోసుకోడాని కంగీకరించాడు. మేము బ్రాహ్మణులమనీ, మా మగవారు కాశీలో ఉన్నారనీ, ఆమె నా తోబుట్టువనీ చెప్పాను. లవంగి అతిచక్కని బాలుణ్ణి ప్రసవించింది. రెండు నెల లక్కడ సుఖంగానే ఉన్నాం. వేగంగా కాశీ వెళ్ళిపోవాలని మాకుంది. కాని ఆమె నడవలేదు కదా! చివర కామె పోరు పడలేక – ఆ బ్రాహ్మణ కుటుంబానికి కృతజ్ఞతలు చెప్పి బయలుదేరాం.

అడవులే కాని గ్రామాలు లేని తోవలవి. నాల్గుగు రోజులు నడిచాం. ఆమె నాకు నూరు గజాలు వెనుకగా ఉండేది. పిల్లవాణ్నెత్తుకుని

పండితరాయలది చూసి చాలా ఆశ్చర్యపోయాడు. జంతువులు కూడా పిల్లల నెంత బాగా పెంచుతాయి! ఈ భల్లూక శిశువు మానవశిశువులా ఏడిచాడేమిటో . .చిత్రం చూద్దాం...అని ఆ గూటి దగ్గరకి పోయి ఆ పాపడినెత్తుకుని – 'అహో' వీడు మానవ శిశువు. వీడి కారుమాసాల వయసుంటుంది. రూపము, లక్షణాలూ చూస్తే చక్రవర్తి కొడుకులా ఉన్నాడు. ఇక్కడికెలా తీసుకు రాబడ్డాడో! ఎలుగుబంటి వీడిని పెంచుతూందా... లేక అదే వీడిని కన్నదా? అనుకుంటూ ఆ పిల్లవాడిని మరీ మరీ పరీక్షించి మానవశిశువే అని నిశ్చయించాడు.

"ఈ ముద్దుల బాలుణ్ని ఏతల్లి కన్నదో వాళ్ళిప్పుడెంత విచారిస్తున్నారో ఈ పిల్లవాడిక్కడే ఉంటే ఎప్పుడో ఒకనాడీ ఎలుగుబంటి కడతేర్చేస్తుందేమో? క్రూరమృగం మానవశిశువు కుపచారాలు చేయడం దైవకారణమే తప్ప మరొకటి కాదు. వీడి నిక్కడి నుంచి తీసుకు పోడమే మంచిది" అని నిశ్చయించుకుని...ఆ పిల్లవాడి నెత్తుకుని వేగంగా కొండదిగి అరణ్యం దాటి సాయంకాలాని కొక పల్లె చేరుకున్నాడు.

ఆ రాత్రి పాలు యాచించి తెచ్చి – పిల్లవాడికి పట్టి – ముద్దు పెట్టుకుంటూ "దేముడు నాకిలాటి కొడుకు నివ్వక సన్యాసిని చేశాడు కదా. లవంగి జీవించి ఉంటే ఆమెకనిన శిశువు ఈ వయసులోనే ఉండేవాడు. పరమనిర్భాగ్యుణ్ని" అనుకుంటూ పిల్లవాడిని పక్కలో వేసుకుని పడుకున్నాడు. క్రమంగా అతని కాపిల్ల వాడిమీద అనురాగం పెరిగి పోసాగింది వాడినాడిస్తూ లాలిస్తూ నవ్విస్తూ పలికిస్తూ ప్రాణం కంటె ఎక్కువగా చూసుకోసాగాడు. వాడి సంరక్షణకోసం అడవుల వెంట తిరగడం మానేసి గ్రామాలలో తిరగసాగాడు. ఒకనాడత నా పిల్లవాడితో ఒకవూరు చేరి అక్కడున్న మసీదుకి వెళ్ళాడు అక్కడ చాలామంది ఫకీర్లున్నారు

వారిలోని ఒక వృద్ధ ఫకీరు – పండిత రాయలుని చూసి – "నిన్ను చూస్తూంటే చాలా విరక్తుడిలా కనిపిస్తున్నావు. ఉత్తమమైన ఆశ్రమం స్వీకరించికూడా ఈ పిల్లవాడినెందుకు వెంట పెట్టుకొచ్చావు? నీకేమౌతాడు?" అని అడిగాడు. అందుకు పండితరాయలు "నావృత్తాంతం

చాలా అసహ్యమైంది. ఈ బాలు డొక కొండ గుహలో దొరికాడు. వీడెవడో తెలియదు. ఎలుగుబంటి వీడి కపకారం చేస్తుందేమో అని తీసుకు వచ్చాను భల్లూకదత్తుడని పిలుస్తున్నాను" అన్నాడు. ఈ అర్భకుడి వృత్తాంతం ఆశ్చర్యకరమైనదే! నువ్వు ఫకీరువై కూడా హిందూమత విషయం చర్చిస్తున్నావే! భల్లూకదత్తు డను పదం సంస్కృత భాష. నీకాపుర మెక్కడ? నీతల్లి తండ్రిలెవరు?" అని అడిగా డా ఫకీరు.

"నువ్వు వృద్ధుడివి. నీతో అబద్ధాలు చెప్పకూడదు" అంటూ తన వృత్తాంతం చెప్పిన పండితరాయలుని అతను కౌగలించుకుని - "నువ్వా. నేనే మీ తల్లికి మంత్రోపదేశం చేశాను మళ్ళీ ఆమెను చూడలేకపోయాను. బతికినా నువ్వు దుఃఖమే మిగుల్చుకుంటున్నావు. జరిగిన దానికి విచారించకు. చక్రవర్తి లవంగిని చంపించడం నువ్వు ప్రత్యక్షంగా చూశావా? లేక విన్నావా? నీమొహం చూస్తూంటే శుభలక్షణాలు కనపడుతున్నాయి. నీకు మంచే జరుగుతుంది" అన్నాడు.

ఆ మాటలకు పండితరాయలాశ్చర్యపడి.. "స్వామీ! నేను మీ కాప్తుడనే కదా. లవంగిని చంపించాడని వినడమే తప్ప చూడలేదు. ఆమె బతికుందా? అంత అదృష్టం నాకు పడుతుందా? ఆమె ఎక్కడుంది? ఆమె కనపడాలే కాని నా బతుకు బ్రహ్మానంద సాగరమే. దయచేసి ఆ విషయం చెప్పండి" అని ప్రార్థించాడు.

"అయ్యో! నేను నీ ముఖలక్షణాలను బట్టి అలా అన్నాను కానీ నేనామె గురించి ఏమీ ఎరుగను. అప్రయత్నంగానే శుభాలు కలుగుతాయి. పండితుడివి, నీకు తెలియదా?" అని ఆ ప్రసంగం విరమించాడు.

పండితరాయలు పిల్లవాడితో కూడా అక్కడ కొన్నాళ్ళుండి తరవాత బయలుదేరి అనేక దేశాలు తిరుగుతూ హరిద్వారం చేరుకున్నాడు. అప్పటికా బాలుడికి ఏడాది వయసొచ్చింది. వాడి ముద్దుమాటలు, ఆటలతో అతను కాలక్షేపం చేయసాగాడు. ఒకనా డతను పిల్లవాడితో ఆడుకుంటూంటే కుందలతిలక అక్కడికి వచ్చి ఆశ్చర్యపడుతూ వాడి నెత్తుకుని ముద్దాడడం మొదలు పెట్టింది.

'నన్ను నువ్వు గుర్తు పట్టావా! నీ సఖురాలేమైంది? నువ్వూ నాలాగే ఆమెకోసం వెదుకుతూ తిరుగుతున్నావు కాబోలు. నీ మాట విని వెంటనే బయలు దేరక పోవడం వల్ల ఇంత అనర్థం జరిగింది" అంటూ అతను కన్నీరు కార్చాడు.

అప్పు డామె నవ్వుతూ - 'విచారింపకు. మా సఖురాలు క్షేమంగా ఉంది. కొడుకుని కంది. ఈ పిల్లవాడు మా స్నేహితురాలి కొడుకే" అంది. అతనాశ్చర్యపోతూ "నిజంగా లవంగి సుఖంగా ఉందా? ఎక్కడుంది? నువ్విక్కడి కెలా వచ్చావు? అని ప్రశ్నలు కురిపించాడు. ఆమె తన వృత్తాంతం వివరించసాగింది.

## కుందల తిలక కథ

నేను మీ దగ్గర నుంచి బయలుదేరి ఢిల్లీకి పోయి లవంగి వున్న ఉద్యానవం చేరాను. కాని అక్కడ లవంగి కాని సంగీతచంద్రిక కాని నాకు కనపడలేదు. అక్కడి వాళ్ళనుంచి పాదుషా వంగిని గర్భవతి అని కూడా సంశయించక చంపించాడని రహస్యంగా చెప్పారు. అది విని నేను హడలిపోయి మీవూరు వచ్చి మీ కోసం వాకబు చేశాను. మీజాడ తెలియక మీ తల్లితండ్రులు విచారిస్తున్నారని తెలిసింది.

ఏం చేయాలో తోచక దేశాటనం మొదలు పెట్టాను. కొన్ని నెలల తరవాత సంగీత చంద్రిక నీళ్ళు తెస్తూండగా చూశాను. లవంగితో పాటు చంపబడిన ఆమె అక్కడి కెలా వచ్చిందా అనుకుంటూ దాని ననుసరించాను. ఆమె ఒక బ్రాహ్మణుని ఇంట్లోకి వెళ్ళింది. అక్కడివారిని ఆమెను గురించి అడిగాను. "ఆమె ఒక బాటసారి. కాశీకి పోతూ యీవూళ్ళో బసచేసింది. ఆమెతోపాటు ఒక చిన్నదుంది. మగవారు ముందు పోయారట. ఆ చిన్నదానికి మగశిశువుకలిగి రెండు నెలల కిందట జారిపోయాడట. అందుకే కాబోలు ఎప్పుడూ విచారంగా ఉంటుంది. ఇంతకంటే మాకేమీ తెలియదు" అన్నారు వాళ్ళు. నేను

మెల్లగా లోపలికి వెళ్ళాను. లవంగి నన్ను గుర్తుపట్టి గొల్లున ఏడ్చింది. అప్పుడు నేను – "మీరు చనిపోయారని విరక్తితో నేను తిరుగుతున్నాను. మీరిక్కడి కెలా వచ్చారు? మీ వృత్తాంత మేమిటి?" అని అడిగాను. అప్పుడు కుందలతిలక చెప్పసాగింది.

"పాదుషా లవంగిని చంపించడానికి నిశ్చయించుకున్నాడని ఒక బ్రాహ్మణుడు మాకు చెప్పాడు. మేము విననట్లు నటించాం. లవంగి పడుకునే శయ్యమీద కృత్రిమ స్త్రీని పొందు పరచి – మేము రహస్యంగా ఉండి గమనించసాగాం. అర్ధరాత్రి భయంకర వేషాలలో రాజభటులు వచ్చి ఆ కృత్రిమ విగ్రహాన్ని ముక్కలుగా నికి పరుపుతో పాటు చుట్టి మోసుకుపోయి కందకంలో తొక్కి పోయారు.

"ఇక్కడుంటే మనకి ప్రాణహాని తప్పదు. మెల్లగా కాశీపురి పోయి నీ భర్తను కలుసుకుందాం" అని ఆమెను తీసుకుని బయలు దేరాను. నాలుగు మాసాల గర్భంతో... చీకట్లో ...నాచేయి పట్టుకుని... ముసుగులో మొహం దాచుకుని ఆమె నడవసాగింది. తెల్లవారే సరికొక పల్లె చేరాం. ఆమె నడవలేక పోతూంది. ఆతోవలో బళ్ళూ అవీ వెళ్ళేవికావు. గర్భం ఎదిగే కొద్దీ ఆమెకు నడక మరింత కష్టమౌసాగింది. ఒకొక్కచోట పదేసి రోజులు కూడా ఉండిపోయేవాళ్ళం.

ఒకనా డొక అగ్రహారం చేరాం. అప్పటికి లవంగికి నెలలు నిండాయి. ఒక బ్రాహ్మణుని వేడుకొనగా వాళ్ళింట పురుడు పోసుకోడాని కంగీకరించాడు. మేము బ్రాహ్మణులమనీ, మా మగవారు కాశీలో ఉన్నారనీ, ఆమె నా తోబుట్టువనీ చెప్పాను. లవంగి అతిచక్కని బాలుణ్ణి ప్రసవించింది. రెండు నెల లక్కడ సుఖంగానే ఉన్నాం. వేగంగా కాశీ వెళ్ళిపోవాలని మాకుంది. కాని ఆమె నడవలేదు కదా! చివర కామె పోరు పడలేక – ఆ బ్రాహ్మణ కుటుంబానికి కృతజ్ఞతలు చెప్పి బయలుదేరాం.

అడవులే కాని గ్రామాలు లేని తోవలవి. నాల్గుగు రోజులు నడిచాం. ఆమె నాకు నూరు గజాలు వెనుకగా ఉండేది. పిల్లవాణ్నెత్తుకుని

నేను ముందు నడిచేదాన్ని. అలా నడుస్తుండగా.. ఒకనాడు మధ్యాహ్నం ఒక ఎలుగుబంటి బొబ్బలు పెడుతూ నామీద పడడానికి వచ్చింది. నేను కేకలు వేస్తూ "ఏం చెయ్యాలో తోచక పిల్లవాణ్ని చాటుగా నేలమీద పడుకోబెట్టి నేనొక మూలకి పారిపోయాను.

అప్పుడా భల్లూకం పిల్లవాడిని ఎత్తుకుని నన్ను వెక్కిరిస్తూ పక్కనున్న అరణ్యంలోకి పోయింది. నేను ఏడుస్తూ నిలబడిపోయాను. అంతలో లవంగి వచ్చి జరిగింది తెలుసుకుని తానూ బిగ్గరగా ఏడవసాగింది. నేనెలాగో ఆమె నూరడించాను. కాని. "భల్లూకం నన్ను చంపితే చంపనీ, నా ముద్దుల కొడుకుని దానిపాలు చెయ్యను" అంటూ అడవిలోకి పోడానికి సిద్ధమైన ఆమెను బలాత్కారంగా ఆపి... మాటలు చెబుతూ ఎలాగో నడిపించాను.

ఒకపల్లె చేరి – అక్కడ రెండు రోజులుండి కొన్నాళ్ళ కిక్కడికి చేరాం. లవంగి ఆరోగ్యం బాగులేక ఇక్కడుంటున్నాం" అని చెప్పి "కుందలతిలకా! నువ్వేం చేశావు? ఎక్కడెక్కడ తిరిగావు? వీరుడేమన్నాడు? అతనికి మా కథ తెలిసిందా?" అంటూ అడిగింది నేను నా వృత్తాంతం చెప్పాను. మీ జాడ తెలియక చింతించారు. మే మక్కడ పరో నాలుగు రోజులుండి మీ మాటలే చెప్పుకున్నాం. తనకోసం మీరెంతో ఆత్రత పడుతూంటారని లవంగి విచారించింది.

మేము మీ గురించి వెదుక్కుంటూ ఎన్నో గ్రామాలు తిరిగాం. ఒక వూరి మసీదులో ఫకీరు ప్రశ్న లడిగితే చెబుతాడని విని నేను పోయి ఆ మహాత్ముణ్ని మీ రెక్కడున్నారని ప్రశ్న అడిగాను ముఖ్యులే అడగాలని అతననగా లవంగిని అతని వద్దకు తీసుకుపోయాను.

ఆమె తన వృత్తాంతం చెప్పేసరికి – "ఆ బాలుడా! ఆ బాలుడు మీ బాలుడా! విచారించక్కర్లేదు. ఒక పుణ్యాత్ముడా బాలుణ్ణి రక్షించాడు. మొన్ననే అతనిక్కడి నుంచి ఎక్కడికో వెళ్ళి పోయాడు" అన్నాడు ఫకీరు. లవంగి అతని వివరా లడిగింది అతను వీరుడి వివరాలు చెప్పి అన్యకుల కాంతని వివాహమాడడం తండ్రి చంపించడం ....మొదలైన వన్నీ చెప్పి – "విరక్తుడై ఫకీర్లలో కలసి తిరుగుతున్నాడు. తరచుగా తీర్థయాత్రలు

చేస్తూంటాడు. కాబట్టి అలాటి చోట్ల వెదకండి, మీ కొడుకు దొరుకుతాడు. తరచుగా తీర్థయాత్రలు చేస్తుంటాడు కాబట్టి అలాటి చోట్ల వెదకండి, మీ కొడుకు దొరుకుతాడు" అన్నాడు.

అప్పుడు మేం ముగ్గురం ఆలోచించుకుని – "స్వామీ! నేను పోయి వెదికి ఆ బ్రాహ్మణుని కలుసుకుని బాలుణ్ని తీసుకొస్తాను. అంతవరకూ వీళ్ళిద్దరూ మీవద్ద ఉంటారు. దయచూచండి" అని నేను వారి నొప్పించి బయలుదేరి అనేక తీర్థాలు తిరిగాను. పట్నాలు తిరిగాను. శిఖరాలు ఎక్కాను. మీ దర్శనం కాలేదు. హరిద్వారానికే రెండు సార్లు వచ్చాను. సన్యాసులనీ, బైరాగులనీ, పకీరులనీ ఎందరినో పరికించాను. కొందరు ఫకీరుల వల్ల మీ జాడలు తెలుసుకుని ఇక్కడికి వచ్చాను. మిమ్మల్ని కలుసుకోగలిగాను. ఈ బాలుడు మీ పుత్రుడే. ముసలి ఫకీరు ద్వారా అంతా తెలిసింది. మీకు శుభం కలిగే సూచన లవుతున్నాయి. లవంగి మీ విరహతాపం భరించలేక పోతూంది. వేగంగా వచ్చి ఆమెని చూడండి" అంది కుందలతిలక.

ఆమె చెప్పింది విని పండిత రాయలకి ఆనందంతో గొంతు గద్గదిక మయింది. "ఇంత సంతోషవార్త చెప్పిన నీకు ఇవ్వడానికి నా దగ్గరేమీ లేదు. జీవితాంతం కృతజ్ఞుడినై ఉండడమే దీనికి ప్రతిఫలం. మొదటినుంచీ మీ రిద్దరూ మాకోసం కష్టాలు పడుతూనే ఉన్నారు. విధి చేసే విచిత్రాల కంతుండదు. మనిషి మాంసం తినే ఎలుగుబంటి బాలుడి నెత్తుకు పోయి పెంచడమా! నేనాగుహకే పోవడమా!" అంటూ బాలుడి నెత్తుకుని ఆమె వెంటనడిచి కొన్నిరోజులకి ఫకీరులున్న గ్రామానికి చేరాడు.

లవంగి నాశ్చర్యపరచదలచి ఆమె వారినొక చోట ఉంచి తానొక్కతే మసీదుకి పోయింది. కాని అక్కడెవరూ కనపడలేదు. అంతలో ఎవరో అక్కడికి రాగా వారి నడిగింది. "నువ్వెవరివి? లవంగి సఖురాలివా?" అని అడిగా డతను. లవంగి గుట్టు తెలిసి రాజ భటులామెను పరిమార్చలేదు కదా? ఏం ముప్పొచ్చిందో? – అని ఆమె భయపడుతూంటే – "నువ్వు సంశయించక్కర్లేదు. నీ వృత్తాంతమంతా నాకు తెలుసు. ఆ బ్రాహ్మణ కుమారుడు బాలుడితో కనిపించాడా? ఇక్కడికి

తీసుకొచ్చావా? నేను ముసలి ఫకీరు శిష్యుణ్ని మీ కోసమే నన్నిక్కడుంచాడు. మీకు శుభం కలుగుతుంది. నిజం చెప్పు" అన్నాడతను.
"నేను లవంగి సఖురాలినే. ఆ బ్రాహ్మణ కుమారుడు కొడుకునెత్తుకుని ఊరిబయట కూర్చున్నాడు వస్తారా?" అని అడిగింది కుందలతిలక. అతనప్పుడే అక్కడికి వెళ్ళి పండితరాయలను చూసి వినయంతో సలామ్ చేసి మసీదుకు తీసుకు వెళ్ళి ఇలా చెప్పసాగాడు.

## ముసలి ఫకీరు కథ

"అయ్యా! ఈమె మాగురువు గారి వద్ద నుంచి వెళ్ళాక లవంగి ఆకార విద్యా విశేషాలు తెలుసుకుని ఒకనా డామె వృత్తాంతాన్ని తరచి తరచి అడిగారు. ఆమె అంతా చెప్పి – "స్వామీ! నేను శాస్త్రం నిషేధించిన వేమీ చెయ్యలేదు. నా తండ్రికి నిష్కారణంగా కోపం వచ్చి అలా చేశాడు" అంది.

ముసలి ఫకీరు జాలిపడుతూ.. "చింతించకు నీ కష్టాలు తీరుస్తాను నీ మనోహరుడు నా కత్యంత ఆప్తుడు. అతనీ మూడు లోకాలూ ఏలగల సమర్థుడు. నువ్వని తెలియక పోయినా నీ కథని ముందే విన్నాను. నువ్వు చనిపోయావని విరక్తి చెందాడు కాని, నిన్ను కలుసుకుంటే అతను పాదుషాను యుద్ధంలో ఓడించి ఢిల్లీ రాజ్యం వశపరచుకోడా? ఐనా...మంచిగానే నేను కార్యం సాధిస్తాను. నేనొచ్చే వరకూ నువ్విక్కడే ఉండు మా శిష్యులు నిన్ను రక్షిస్తుంటారు" అని ఆయన నన్ను వెంట బెట్టుకుని ఢిల్లీకి వెళ్ళాడు.

మసీదులో ఫకీరులు – "పాదుషా దుఃఖసముద్రంలో మునిగి ఉన్నాడు ఎవరికీ దర్శన మివ్వడం లేదు. ఫకీరులకి దర్శనమిస్తాడు కానీ తిన్నగా మాట్లాడడు. కారణం ఎవరికీ చెప్పడు. కూతుర్ని చంపించి – పశ్చాత్తాపంతో అలా కుమిలి పోతున్నా డంటారు కొందరు. కాని అది రహస్యం కనక మాట్లాడ కూడదు. చక్రవర్తికి సంతోషం కలిగించిన ఫకీరుకి చాలా గౌరవం లభిస్తుందని వజీరు చెప్పాడు. కాని అది ఎవరి తరమూ కాకుండా ఉంది. అతని కూతురిని బతికిస్తే అలా

జరుగుతుందంటారు కోటలో.” అన్నారు మర్నాడు నన్ను వెంటబెట్టుకుని మా గురువుగారు పాదుషా వద్దకు వెళ్ళారు. ఆయన ఒకసారి తలపంకించి ఊరుకున్నాడు. కొంచెంసేపయ్యాక – “అన్యాయ కార్యాలు చేస్తే దుఃఖం కాక ఏం మిగులుతుంది? నువ్విక విచారించ నక్కర్లేదు. నీ శోకం నివారించడానికే నేను వచ్చాను. నీ మనసులోని విషయం – నువ్వు చెబుతావా, నన్ను చెప్పమంటావా?” అని అడిగారు. ఆయననే చెప్పమన్నారు పాదుషా.

“నిరపరాధి అయిన కూతురిని చంపించినందుకు విచారిస్తున్నావు. అది నిజమే. ఆమె ఏ నేరమూ చేయలేదు సర్వోత్తముడైన పురుషుణ్ని పతిగా వరించింది ఆమెను ధర్మమే రక్షించి బతికించి ఉంచింది నువ్వు తీసుకు రమ్మంటే తీసుకురాగలను – అన్నారు గురువు పాదుషా [illegible] ఆయన పాదాల మీద పడిపోయి – “నువ్వు భగవంతుడవి. [illegible] చంపించాను. క్రూరుణ్ని . పాపాత్ముణ్ని. నా కూతుర్ని దయచేయించండి” అంటూ వేడుకున్నాడు.

మా గురువుగారు లవంగిని తీసుకురాడానికి సేనలతో నన్ను పంపారు. నేనలాగే ఆమె నప్పగించాను. మీ రొస్తే తీసుకు రమ్మని నన్నిక్కడుంచారు. మీ రాకకోసం ఎదురు చూస్తూన్నాను. ఢిల్లీకి పోదాం పదండి” అన్నాడు.

అది విని పండితరాయలు “అయ్యా. లవంగి సుఖంగా ఉన్నందుకు చాలా సంతోషిస్తున్నాను. కాని నేను మాత్రం అక్కడికి రాను. చూడాలనుంటే లవంగి నెప్పటికేనా చూస్తాను. పాదుషా చక్రవర్తికి భయపడికాదు నేను బైరాగి వేషం వేసుకోడం, లవంగి నా వల్ల పరిమార్చబడిందని ఇక మా సామర్థ్యం చూస్తారు” అని చాలా కోపంతో పలికిన అతన్ని చూసి వాళ్ళిద్దరూ చాలా భయపడ్డారు.

కొంచెం సేపయ్యాక కుందలతిలకతో – “నువ్వెందుకు నాతో తిరుగుతావ్? నీ సఖురాలిని కలుసుకుని సుఖంగా ఉండు మాదారి మాది” అన్నాడు అప్పు డామె ఇలా అంది.

తీసుకొచ్చావా? నేను ముసలి ఫకీరు శిష్యుణ్ని మీ కోసమే నన్నిక్కడుంచాడు. మీకు శుభం కలుగుతుంది. నిజం చెప్పు" అన్నాడతను. "నేను లవంగి సఖురాలినే. ఆ బ్రాహ్మణ కుమారుదు కొడుకునెత్తుకుని ఊరిబయట కూర్చున్నాడు వస్తారా?" అని అడిగింది కుందలతిలక. అతనప్పుడే అక్కడికి వెళ్ళి పండితరాయలను చూసి వినయంతో సలామ్ చేసి మసీదుకు తీసుకు వెళ్ళి ఇలా చెప్పసాగాడు.

## ముసలి ఫకీరు కథ

"అయ్యా! ఈమె మాగురువు గారి వద్ద నుంచి వెళ్ళాక లవంగి ఆకార విద్యా విశేషాలు తెలుసుకుని ఒకనా డామె వృత్తాంతాన్ని తరచి తరచి అడిగారు. ఆమె అంతా చెప్పి - "స్వామీ! నేను శాస్త్రం నిషేధించిన వేమీ చెయ్యలేదు. నా తండ్రికి నిష్కారణంగా కోపం వచ్చి అలా చేశాడు" అంది.

ముసలి ఫకీరు జాలిపడుతూ..."చింతించకు నీ కష్టాలు తీరుస్తాను. నీ మనోహరుడు నా కత్యంత ఆప్తుడు. అతనీ మూడు లోకాలూ ఏలగల సమర్థుడు. నువ్వని తెలియక పోయినా నీ కథని ముందే విన్నాను. నువ్వు చనిపోయావని విరక్తి చెందాడు కాని, నిన్ను కలుసుకుంటే అతను పాదుషాను యుద్ధంలో ఓడించి ఢిల్లీ రాజ్యం వశపరచుకోడా? ఐనా...మంచిగానే నేను కార్యం సాధిస్తాను. నేనొచ్చే వరకూ నువ్విక్కడే ఉండు. మా శిష్యులు నిన్ను రక్షిస్తుంటారు" అని ఆయన నన్ను వెంట బెట్టుకుని ఢిల్లీకి వెళ్ళాడు.

మసీదులో ఫకీరులు - "పాదుషా దుఃఖసముద్రంలో మునిగి ఉన్నాడు. ఎవరికీ దర్శన మివ్వడం లేదు. ఫకీరులకి దర్శనమిస్తాడు కానీ తిన్నగా మాట్లాడడు. కారణం ఎవరికీ చెప్పడు. కూతుర్ని చంపించి - పశ్చాత్తాపంతో అలా కుమిలి పోతున్నా డంటారు కొందరు. కాని అది రహస్యం కనక మాట్లాడ కూడదు. చక్రవర్తికి సంతోషం కలిగించిన ఫకీరుకి చాలా గౌరవం లభిస్తుందని వజీరు చెప్పాడు. కాని అది ఎవరి తరమూ కాకుండా ఉంది. అతని కూతురిని బతికిస్తే అలా

జరుగుతుందంటారు కోటలో." అన్నారు. మర్నాడు నన్ను వెంటబెట్టుకుని మా గురువుగారు పాదుషా వద్దకు వెళ్ళారు. ఆయన ఒకసారి తలపంకించి ఊరుకున్నాడు. కొంచెంసేపయ్యాక - "అన్యాయ కార్యాలు చేస్తే దుఃఖం కాక ఏం మిగులుతుంది? నువ్వికఏచారించ నక్కర్లేదు. నీ శోకం నివారించడానికే నేను వచ్చాను. నీ మనసులోని విషయం - నువ్వు చెబుతావా, నన్ను చెప్పమంటావా?" అని అడిగారు. ఆయననే చెప్పమన్నారు పాదుషా.

"నిరపరాధి అయిన కూతురిని చంపించినందుకు విచారిస్తున్నావు. అది నిజమే. ఆమె ఏ నేరమూ చేయలేదు. సర్వోత్తముడైన పురుషుణ్ని పతిగా వరించింది. ఆమెను ధర్మమే రక్షించి బతికించి ఉంచింది. నువ్వు తీసుకు రమ్మంటే తీసుకురాగలను - అన్నారు గురువు. పాదుషా - "మహాత్మా! రక్షించండి" అంటూ ఆయన పాదాల మీద పడిపోయి - "నువ్వు భగవంతుడివి. కోపంలో - ప్రాణంలాటి కూతురిని చంపించాను. క్రూరుణ్ని... పాపాత్ముణ్ని. నా కూతుర్ని దయచేయించండి" అంటూ వేడుకున్నాడు.

మా గురువుగారు లవంగిని తీసుకురాడానికి సేనలతో నన్ను పంపారు. నేనలాగే ఆమె నప్పగించాను. మీ రొస్తే తీసుకు రమ్మని నన్నిక్కడుంచారు. మీ రాకకోసం ఎదురు చూస్తూన్నాను. ఢిల్లీకి పోదాం పదండి" అన్నాడు.

అది విని పండితరాయలు "అయ్యా! లవంగి సుఖంగా ఉన్నందుకు చాలా సంతోషిస్తున్నాను. కాని నేను మాత్రం అక్కడికి రాను. చూడాలనుంటే లవంగి నెప్పటికేనా చూస్తాను. పాదుషా చక్రవర్తికి భయపడికాదు నేను బైరాగి వేషం వేసుకోడం, లవంగి నా వల్ల పరిమార్చబడిందని. ఇక మా సామర్థ్యం చూస్తారు" అని చాలా కోపంతో పలికిన అతన్ని చూసి వాళ్ళిద్దరూ చాలా భయపడ్డారు.

కొంచెం సేపయ్యాక కుందలతిలకతో - "నువ్వెందుకు నాతో తిరుగుతావ్? నీ సఖురాలిని కలుసుకుని సుఖంగా ఉండు. మాదారి మాది" అన్నాడు. అప్పు డామె ఇలా అంది.

# పండితరాయల కథ

"అయ్యా! నేను మీ పాదసేవకురాలినై మీతో తిరుగు తూంటాను. మా సఖి చేసిన తప్పు మన్నించండి. అపరాధి అయిన తండ్రి పిలవగానే వెళ్ళిందని మీకు కోపం వచ్చింది. ఎలాగయినా స్త్రీకి పుట్టింటి మీద చాపల్యం పోదు. నేను వెళ్ళి తీసుకొస్తాను. అనుజ్ఞ ఇవ్వండి "ఆమె అలా బతిమాలే సరికి – "ఇప్పుడొద్దు అలాటి రోజు వొస్తుందిలే. చూస్తావు కదా" అన్నాడతను. ఆ మాటలన్నీ రాసి అతను గురువుకి పంపాడు. ఫకీరది తెలుసుకుని లవంగి వద్దకు పోయి "నీభర్తకు మనమీద కోపం వచ్చిందట. నువ్వు పుట్టింటికి వచ్చానని ఆక్షేపిస్తూ చక్రవర్తి మీద కత్తికడుతున్నాడని తెలిసింది. అతను తలుచుకుంటే ఎంత పనయినా చేయగలవాడే. అతని కోపాన్ని శాంతింప జెయ్యాలి. చక్రవర్తి అతని వద్దకు పోయి 'అపరాధం చేశాను, రక్షించు" అని ప్రార్థిస్తే కార్యం చక్కబడుతుంది. లేకపోతే చిక్కులు రావచ్చు. అతని గురించి తెలిసిన వాడిని కనక చెబుతున్నాను. నువ్వే ఆలోచించు" అన్నాడు.

తండ్రికి తనమీద మునపటికన్న ఎక్కువ ప్రేమ ఉందని... ఆమె వెళ్ళి "తండ్రీ! నీ అల్లుడు త్రిలోక పూజ్యుడు. పరాక్రమంలో ఇంద్రుడు, రూపంలో మన్మథుడు, బుద్ధిలో బృహస్పతి, సాధుశీలుడు, సత్యసంధుడు, ఉత్తమకుల సంజాతుడు. అలాటి గొప్పవాడు నీ కల్లుడవడమే చాలు. నీకు మనవడు కూడా లభించాడు. నువ్వు ద్రోహం చేసినా కూతుర్ని కనక నేను కోపగించక పిలవగానే వచ్చాను. కాని ఆయన అలా సరిపెట్టుకుంటాడా? నన్నాక్షేపిస్తూ నీమీద కత్తికట్టడానికి సిద్ధంగా ఉన్నాడట. ఎట్నించెటు వచ్చినా నాకేకద? పడిన బాధలు చాలు. నువ్వాయన వద్దకు వెళ్ళి బతిమాలి తీసుకురావాలి. అల్లు డలగడమూ, మామ తీర్చడమూ లోకాచారమే" అని చెప్పి అతనిని ఒప్పించింది.

పాదుషా చక్రవర్తి చతురంగ బలాలనూ, మంత్రి సామంతులనీ, ముసలిఫకీరునీ వెంటబెట్టుకుని పండితరాయలున్న గ్రామానికి వెళ్ళి

దూరంలోనే రథందిగి నడచి వెళ్ళి అతని పాదాలపై పడి - “మహాత్మా! నీ సామర్థ్యం తెలియక అనేక అపరాధాలు చేశాను. నువ్వు నాకల్లుడి వయ్యావు. ఈ బాలుడు నా మనవడు. సింహాసనం ఎక్కగలిగే అర్హుడు. నా తప్పులు క్షమించి మా ఇంటికి విచ్చెయ్యి” అని ప్రార్థించాడు. పండిత రాయ లేమీ అనలేక పోయాడు. చక్రవర్తి అందరినీ రథాలెక్కించి ఢిల్లీ తీసుకెళ్ళి గొప్ప సత్కారాలు చేశాడు. పండిత రాయలు లవంగిని కలుసుకుని - కుందలతిలక సంగీత చంద్రికల సహాయానికి పొగిడి... పదిరోజులు ఒక గడియలా గడిపాడు.

అంతలో కాశీపుర వాస్తవ్యుడైన పండితభట్టుగారి కుమారుడు పండితరాయలు పాదుషాగారి కూతురు లవంగిని పెళ్ళాడి, ఆమె వలన సంతానం కని కులం చెరుపు కున్నాడనే వార్త దేశమంతా వ్యాపించింది. అందుకు విచారిస్తూ పండిత భట్టు భార్యతో కూడా ఢిల్లీకి ప్రయాణమయ్యాడు కాని “పండితులు ఆక్షేపించి ప్రయాణాన్నాటంక పరిచారు. కొడుకుని చూడాలని ఉందని తల్లి అతనికి ఉత్తరం పంపగా కొడుకుని చక్రవర్తి వద్ద వదలి లవంగిని తీసుకుని సకల పరివారంతోనూ వచ్చి హుసేన్ బాద్ కోటలో బస చేసి వూళ్ళోని పండితులకి ఆహ్వానపత్రికలు పంపాడు. కాని వారతను సంభాషణార్హుడు కాడని తిరస్కరించారు. పండితరాయల తల్లి భర్తకి తెలియకుండా కొడుకు దగ్గరకి వచ్చింది. అతను భార్యతో కలసి ఎదురువచ్చి ఆమె పాదాలకు నమస్కరించాడు.

ఆమె వారిని దీవించి - “నాయనా! నిన్ను కన్నందుకు నాకు దుఃఖమే తప్పమరేమీలేదు. విద్యాగుణసంపన్నుడివై కులానికి ఖ్యాతి తెస్తావనుకుంటే నీ మూలంగానే మేం తల ఎత్తుకోలేక పోతున్నాం. బ్రాహ్మణుల్లో కన్యలు లేకపోయారనే ఈ తురక పడతిని పెళ్ళాడావా? దేవాలయంలో ప్రవేశించిందంటే ఒప్పుకోనంటూ ఎంతహడావిడి చేశావ్! ఆ నియమమంతా ఏం చేశావ్? మీ తండ్రి కెలాటి తలవంపులు తెచ్చావ్!” అంటూ కన్నీరు పెట్టుకుంది.

అప్పుడతనామెను లోపలికి తీసుకెళ్ళి కూర్చోబెట్టి - "ఈమె బ్రాహ్మణ యువతే కారణాంతరాల వల్ల యవనస్త్రీ అని పేరు పడింది. నేను అన్నిటికి విరక్తుడినై ఉన్నాను. నాకు కర్తృత్వం లేదు" అంటూ చెబుతూండగా అక్కడి కతని తండ్రి వచ్చాడు. "నాయనా! సంపదలనాశించి కులం చెడగొట్టుకుని నువ్వు రెండింటికీ చెడ్డావు. నీతో మాట్లాడితేనే నన్ను వెలివేస్తామన్నారు కాశీ పండితులు. అయినా నీ మీద మమకారం కొద్దీ అన్నిటికీ తెగించి వచ్చాను. నే నెటువంటి కొడుకును కన్నాను!" అని విచారించాడు.

"తండ్రీ! ఎక్కువ మాట లెందుకు. రేపు పొద్దున్న వూరిలోని పండితులందరినీ మణికర్ణికా ఘట్టానికి రప్పించు నేనక్కడికి వచ్చి పవిత్రుడినో అపవిత్రుడినో గంగామహాదేవినే చెప్పమంటాను. ఆమె నన్నపవిత్రుడని చెబితే - మీరందరూ చెప్పే ప్రాయశ్చిత్తానికి తలవంచుతాను" అన్న కొడుకు మాటల ప్రకారం మర్నాడు పొద్దున్న పండితులని మణికర్ణికాఘట్టానికి రప్పించాడు పండితభట్టు.

పండితరాయలు లవంగితో కలసి విశ్వేశ్వర దర్శనం చేసుకుని అనేక స్తోత్రాలు చదివి గంగాతీరానికి వెళ్ళి మణికర్ణికా ఘట్టంలో గంగకెదురుగా నిలబడి ధ్యానం చేశాడు "అంబా! నీ ధైర్యం చూసుకుని ఎందరినో తిరస్కరించాను. ఇప్పుడు పరీక్షాసమయం వచ్చింది. నువ్వు నన్ను రక్షించకతప్పదు. నువ్వు కాదంటే నేనింకెక్కడికి పోయి మొరపెట్టుకోగలను?" అంటూ అరవై స్తోత్రాలు రచించి చదివాడు. అతనొక్కొక్కస్తోత్రం చదువుతూంటే - గంగ ఉప్పొంగి ఒక్కొక్క మెట్టు ఎక్కసాగింది. అరవై స్తోత్రాలు ముగిసేసరికి గంగ దంపతుల మీద పూలవానలా కురిసి వారిని తనలో ఐక్యం చేసుకుని మళ్ళీ వెనక్కి వెళ్ళి ఎప్పట్లా నిండుగా ప్రవహించ సాగింది. అతని తల్లితండ్రులు విచారించి- అతను కారణ జన్ముడని సరిపెట్టుకుని విరక్తితో తపోవనానికి వెళ్ళిపోయారు పండిత రాయల ప్రభావాన్ని జనం ఎన్నో విధాల

చెప్పుకున్నారు. గంగలో లీనమై పండితరాయలు భార్యతో కూడా మానవ శరీరం వదిలి దివ్యదేహం పొంది పరమానందం అందుకున్నాడు

గోపా! ఇది వారి కథ. మనకి వేళవుతూంది కావడి బుజానికెత్తుకో" అన్నాడు మణిసిద్ధుడు. "గురువుగారూ! బలేకథ చెప్పారు చాలాబాగుంది. కానీ...చివర...వారు దివ్యదేహాలు ధరించారని చెప్పారు. అందువల్ల ప్రశ్నకవకాశం కలుగుతూంది. వారు - పూర్వ జన్మలో ఎవరు? అలా ఎందుకు పండితరాయలు, లవంగిగా జన్మించారు? ఆ వృత్తాంతం చెప్పండి" అని అడిగాడు గోపాలుడు. "నేను మరిచిపోయి అలా అన్నాను. దానికి కారణం ఏమీ లేదు" అని ఆయన తప్పించుకోబోయినా వాడు వదలలేదు.

"ఇప్పుడు కాదు. ముందు శివాలయం కనపడిన చోట జ్ఞాపకం చెయ్యి" అని బయలు దేరాడు



# కాశీ మజిలీ కథలు

## 33. వ మజిలీ

### రాతి మందసం కథ

అదొక సాధారణ గ్రామం. గోపాలుడు ఊళ్ళో తిరిగి ఏ విశేషమూ కనపడక దగ్గరలోని అడవికి వెళ్ళాడు. అక్కడొక వింత కనపడడంతో వేగంగా అయ్యవారి దగ్గర కొచ్చాడు. అతనికోసమే చూస్తున్న యతి – "రా...రా.... భోజనం చేశాక అడుగుదువు గాని. నీ మొహం చూస్తేనే తెలిసిపోతూందేదో విశేషముందని" అన్నాడు నవ్వుతూ.

"ఆలస్యమైతే చెప్పడం మరచిపోతాను. ఊరికి దగ్గర అడవిలో అద్భుతమైన రాతి పెట్టె కనపడింది. అది తెల్లని పాలరాతితో చేయబడింది నూరుగజాల పొడవు, ఏభైగజాల వెడల్పు, నలభై గజాల ఎత్తూ ఉందది. దానిమీద కెక్కడాని కెవరో వింతగా మెట్లు కట్టించారు. నేను పైకెక్కాను. మూత వేయబడి ఉంది. కాని ఒకచోట కన్నం పడి ఉంది. దానిలోకి చూస్తే పాతాళ బిలంలా కనిపించింది. వెయ్యి మందయినా దాని మూత తియ్యలేరు అది పెట్టెలాగే కనపడుతూంది. దాన్నెవరు వాడతారో? వాళ్ళెంత శరీరం కలవారో, దాని సంగ తడిగితే అక్కడ చాలాకాలం నుంచే ఉందనీ వారికేమీ తెలియదనీ చెప్పారు మీరే చెబుతారని వచ్చేశాను" అన్నాడు గోపాలుడు

# మహామాయ కథ

దేవదుర్గం అనే పట్నానికి రాజు బుధవర్మ. అతని భార్య కీర్తిమతి. ధర్మశీలుడు, దయామయుడు, సత్యసంధుడు అయిన బుధవర్మ ప్రజలను చక్కగా పాలించేవాడు. అతనికి సంతానం కలగడం ఆలస్యమయ్యేసరికి ప్రజలు విచారిస్తూ.యాత్రలు, వ్రతాలు మొదలైనవి చేయసాగారు.

దైవకృపవలన ఆ రాజుకి కాలక్రమంలో ఇద్దరు పుత్రులూ ఒక కుమార్తె కలిగారు. రాజువారికి బలభద్రుడు, కృష్ణుడు, సుభద్ర అని పేర్లు పెట్టాడు. వారిమధ్య ఒక్కొక్క సంవత్సరం తేడా ఉన్నా ఐదేళ్ళు వచ్చే వరకూ వాళ్ళు ముగ్గురూ ఒకేలా ఉండేవారు. ఎప్పుడూ చూసేవారికే వారెవరెవరో పోల్చుకోడం కష్టంగా ఉండేది.

రాజు వారికి విద్యామందిరం కట్టించి, ఉపాధ్యాయులను నియమించి వారికి కేవలం విద్యలేతప్ప ఇతర విషయాలు ఏవీ చెప్పవద్దనిశాస్త్ర విద్యలే నేర్పించసాగాడు. పదహారేళ్ళు వచ్చేసరికి వాళ్ళు ధనుర్వేదం, చిత్రలేఖనం, గణితం మొదలైన శాస్త్రాలలో పాండిత్యం సంపాదించారు. పండితులు వారి జ్ఞానాన్ని ప్రశంసించారు కాని - "లోకం తీరు తెలియక పోవడం కొరతగా ఉంది. లోకానుభవంలేని లోటు తీర్చవలసిందే" అన్నారు.

అప్పుడు రాజు వారిని చదువుమానిపించి - ప్రతిరోజు సాయంకాలం గుర్రపు బండిమీద పట్నంలోని వీధుల వెంట తిరిగి అక్కడి విశేషాలు గ్రహించమన్నాడు. వాటిని వివరించి చెప్పడానికి సమర్థులైన వారిని వారివెంట పంపసాగాడు. వాళ్ళ కంతవరకూ లోకంపోకడ ఏమీ తెలియక పోడంవలన ప్రతీదీ వింతగానే అనిపించేది.

వ్యాపారస్తుల గురించి తెలుసుకుని వారిని స్వలాభాపేక్ష కలవారని తోసి పుచ్చారు. విష్ణువు ఆలయం చూసి, గోపురం మంటపం అవీ నచ్చి ఇవి ఎవరిళ్ళని అడిగారు. వారిని లోపలికి తీసుకెళ్ళి విగ్రహం చూపిస్తే "మనని సృష్టించే భగవంతుడా! ఇక్కడుండి లోకాలన్నిటినీ రక్షిస్తాడా!" అని ఆశ్చర్యపోయారు

మర్నాడు శివాలయానికి వెళ్ళేసరికి అక్కడి పూజారులు శివుడే దేవుడన్నారు. "రేపు వైష్ణవులని పిలిపించి మా ముందు అబద్ధాలెందుకు చెప్పారో కనుక్కుంటాం మీరూ రండి" అన్నారు రాజకుమారులు అక్కడి నుంచి వస్తూంటే దుర్గగుడి కనిపించింది. ఆ గుడిలోని శాక్తేయులు ఆదిశక్తే అందరి కంటే గొప్పదన్నారు దానితో వారికి మతిపోయింది.

ఆ రాత్రి బుధవర్మ కొడుకులని ఏం విశేషాలు చూశారని అడిగాడు. వారు - విష్ణువు, శివుడు, దుర్గల ఆలయాలు చూసిన సంగతి చెప్పి - "పరస్పర భేదాలు మనుషులలోనేకాక దేవతలలో కూడా ఉన్నాయా? వారిలో ఎవరు చెప్పింది నిజం?" అని అడిగారు. "ఈ తగవు చిరకాలంనుంచీ ఉంది. దైవమాయామోహంలో మహర్షులే తేల్చలేక పోయారు ఎవరి కిష్టమయిన దైవాన్ని వారు కొలవడమే" అన్నాడు రాజు.

అందుకు వాళ్ళు "ఎవరికీ శక్యంకాని పనిని మేం శక్యం చేస్తాం. పట్టుదలతో సాధింపలేని పనుండదు. మేము మత బోధకులని రప్పించి నిగ్గు తేలుస్తాం" అన్నారు రాజుకూడా అందుకు అంగీకరించాడు.

మర్నాడు రాజకుమారులు పట్నంలో ఉన్న మత బోధకులందరినీ రప్పించి సభ చేశారు. విష్ణువు సర్వోత్తముడనే వారు వేదాలు శాస్త్రాలు తప్ప ప్రత్యక్షంగా నిదర్శనం చూపలేకపోయారు. శైవులు కూడా వెనకటి కథలే చెప్పారు తప్ప వారూ ప్రత్యక్షప్రమాణం చూపలేకపోయారు. అలాగే శాక్తేయులు కూడా ప్రత్యక్ష్య సాక్ష్యం చూపించలే మనడంతో రాజపుత్రులు ఏమతాన్నీ ప్రధానంగా నిర్ణయింపలేదు.

ఆ పనిని వారే సాదించుకొస్తే ప్రజ్ఞావంతులౌతామని మూడు మతాల వారు చెప్పిన దివ్యక్షేత్రాలకు పోయి అక్కడి మహత్యాలు చూసి ఏ మతం గొప్పదో తేల్చుకుందామని నిర్ణయించుకున్నారు.

"తండ్రికి చెబితే పోనివ్వడు మనం దేశాంతరం పోయి ఒక సంవత్సరంలో తిరిగివద్దాం. నువ్వు శివక్షేత్రాలకి వెళ్ళు. నేను విష్ణుక్షేత్రాలకి

వెళ్తాను. ఒకరు చెప్పింది నమ్మొద్దు. మనకై మనం గ్రహించాలి. నీ కిష్టమేనా?" అడిగాడు బలభద్రుడు.

"నీ ఇష్టం నా ఇష్టమే కాని ఈ రహస్యం మన చెల్లెలు సుభద్రకి మాత్రం చెప్పి పోవాలి. అది మనుపెప్పుడూ మనల్ని వదిలి ఉండలేదు. మనం కనిపించకపోతే ఏమైపోయామో అని విచారిస్తుంది" అన్నాడు కృష్ణుడు.

"ఔను" అంటూ అప్పుడే చెల్లి దగ్గరకు వెళ్ళి విషయం చెప్పగా – "నేనిక్కడ మిమ్మల్ని వదలి ఒంటరిగా ఉండలేను. తల్లితండ్రుల వద్దకంటే మీదగ్గరే నాముద్దు ఎక్కువ చెల్లుతుంది. అదీకాక నా జన్మ మాత్రం సార్ధకం చేసుకోవద్దా? దేశాటనానికి కూడదానిని తీసుకు వెళ్ళడం శ్రమ అనుకోకండి. మగవేషం వేసుకుని తిరుగుతాను నాకు కూడా ఒక పని అప్పగించండి" అని పట్టు పట్టింది సుభద్ర. శక్తి మహిమని తెలుసుకునే పని నావెు కప్పగించి – విలువగల రత్నాలూ ధనం సిద్ధం చేసుకొని...తండ్రికి తెలియకుండా మర్నాడే వాళ్ళు ముగ్గురూ బయలుదేరారు. కొంతదూరం ముగ్గురూ కలిసే వెళ్ళినా – ఆ క్షేత్రాలు నాలుగువేపులా ఉండడం వల్ల వాళ్ళు విడిపోయి ముగ్గురూ మూడు దిక్కులకీ పోయారు.

బలభద్రుడు ముందుగా వేంకటగిరికి వెళ్ళి అక్కడ పాపనాశనం, గోవర్ధనం మొదలైన తీర్థాలలో స్నానం చేసి వేంకటేశ్వరుని కొలిచి – అక్కడి అద్భుతాలన్నీ చూశాడు. కాని ఎక్కడా దైవశక్తి ఉన్నట్లనిపించలేదు. అక్కడి నుంచి కంచి తీర్థం వచ్చాడు. అక్కడి పుణ్య తీర్థాలు సేవించి వరదరాజస్వామి నర్చించి వైష్ణవులతో ప్రసంగాలు చేశాడు. అతనికేమీ నమ్మకం కలగలేదు. అక్కడ్డినుండి శ్రీరంగం వెళ్ళాడు. భూలోక వైకుంఠం అని ప్రసిద్ధి చెందిన ఆ దివ్యక్షేత్రంలో ఒక నెల ఉన్నాడు. కావేరీ నదిలో స్నానం చేస్తూ, శ్రీరంగనాయకుడిని సేవిస్తూ వైష్ణవులతో మాట్లాడుతూ ఆ మహిమలన్నీ చూశాడు. అలాగ అతను అనేక విష్ణుక్షేత్రాలు తిరిగాడు. కాని అతని మనసుకి నమ్మకంతోచలేదు. విష్ణు భక్తులను హేళన చేస్తూ,అతను ద్వారకకు వచ్చాడు అక్కడి విశేషాలు తెలుసుకుంటూంటే – "అక్కడ చనిపోయిన వారి ఎముకల మీద శంఖ

చక్ర గదల గుర్తులుంటాయి –" అని విన్నాడు. ఆ మాటల్లోని నిజమెంతో తెలుసుకుందామని అతను స్మశానానికి పోయి ఎముకలను పరీక్షిస్తూంటే – అదే దారిని కృష్ణుడు గుర్రమెక్కి వస్తున్నాడు.

తమ్ముణ్ని చూసిన సంతోషంలో బలభద్రుడతన్ని పిలిచాడు

ఇద్దరూ కుశల ప్రశ్నలు వేసుకున్నారు. అప్పుడు కృష్ణుడు – "ఈ స్మశానంలో కూర్చుని ఏం వెదుకుతున్నావు. ఎక్కడెక్కడ తిరిగావ్? ఊళ్ళోకి పోదాంరా. మన సుభద్రకూడా రాత్రికి ఇక్కడి కొస్తుంది" అన్నాడు

"విష్ణుక్షేత్రాలన్నీ తిరిగాను. ఎక్కడా దైవశక్తి ఏమీ కనపడలేదు. ఇక్కడ చచ్చిన వారి ఎముకలమీద శంఖ చక్ర గదల గుర్తులుంటాయంటే చూద్దామని వచ్చాను. ఇదిగో ఈ గీతలు చూడు. మామూలుగా ఎముకల మీదుండేగీతలే అనిపిస్తున్నాయి తప్ప నాకు శంఖచక్రాల్లా ఏమీ కనిపించడం లేదు."

"ఇవి గీతలే తప్ప మరేమీ కావు" అన్నాడు కృష్ణుడు ఇద్దరూ ఊళ్ళోకెళ్ళి ఒకచోట బసచేశారు. "నేను దేశమంతా తిరిగి శివక్షేత్రాలు చూశాను కాని ఎక్కడా ఏ మహాత్యం కనపళ్ళేదు. కాశీ పట్నంలో రెండు నెలలున్నాను. అక్కడచచ్చిపోయే వారి చెవులలో తారకేశ్వరుడు తారకమంత్రం ఉపదేశిస్తాడనీ అందుచేత కుడిచెవి పైకి వొస్తుందనీ చెప్పారు. పరీక్షించి చూశాను. జంతువులకలా వొస్తుంది. తరువాత ఒక చార్వాకుడు కనపడగా ఆ సిద్ధాంతి నడిగాను.

"అది దైవమహిమ కాదు. ఇక్కడ భూమిలో ఉండే వేడి మరణకాలంలో అవయవాలనలా బిగిస్తుందంతే" అని నా సందేహం తీర్చాడు. తరవాత హరిద్వారం వెళ్ళాను. ఆప్రదేశం బాగుంది కాని దైవశక్తి ఏమీ గోచరించలేదు అక్కడి నుంచి గంగోత్రికి వెళ్ళాను. మన సుభద్ర అక్కడే కనిపించింది. శక్తి క్షేత్రాలన్నీ చూసి వచ్చిందట. ఏ దైవశక్తీ కనపడలేదట. మేము నీ జాడ తెలుసుకుని ఇంటికి పోవాలని నిశ్చయించుకున్నాం. ఇది విష్ణుక్షేత్రం కదా ఇక్కడుంటావేమో అని వచ్చాం. దగ్గరలో శక్తి క్షేత్రం ఉందంటే చూసిరావడానికి వెళ్ళింది మన చెల్లెలు సుభద్ర"

అది విని బలభద్రుడు - "తమ్ముడూ! లేని దానికోసం వెదికి మనం వృధాగా శ్రమపడ్డాం. గొప్పపని చేసి పేరు సంపాదిద్దాం అనుకున్నాం. కాని అంతా అబద్ధం. దేముడనేవాడు లేడు. స్వభావం చేతనే ప్రపంచం సృష్టి స్థితి లయాల్ని పొందుతుంది. దీపం ఆరినట్లే మనిషి చస్తాడు. పునర్జన్మలు లేవు. సుఖమే స్వర్గం. దుఃఖమే నరకం. ఆనందమే ముక్తి. అని ఒక చార్వాక సిద్ధాంతి చెప్పాడు. అదే నిజంలా ఉంది. ఈ క్షేత్రాలన్నీ దేముడిపేరు చెప్పి డబ్బు లాగడానికే! నిజంగా దైవమనేవాడు లేడు. అవన్నీ కల్పితాలు" అన్నాడు. అంతలో సుభద్ర వచ్చి వారిని కలుసుకుంది. ఆ రాత్రి వాళ్ళు కబుర్లు చెప్పుకుంటూ గడిపేశారు.

మర్నాడు చీకటిపొద్దువేళ గుర్రాలెక్కి తూర్పుముఖంగా బయలుదేరారు. అప్పటికింకా చీకటిగా ఉండడంతో నక్షత్రాల గుర్తు చూసుకుని నడిపించసాగారు. ఎంత సేపు ప్రయాణించినా తెల్లవారలేదు! పైగా చీకటి మరింత గాఢమౌతోంది. గుర్రాలకి దారితెలియక తడబడసాగాయి. చీకటి చిక్కబడడమే తప్ప వెలుగు కనపడడం లేదు. ఇక తోవ కనిపించక గుర్రాలు నిలబడిపోయాయి. వాళ్ళు నడుద్దామంటే అంతా ముళ్ళమయం, పొదలమయం. ఎలాగో ఒకచోట కూర్చుని సూర్యుడి రాకకోసం ఎదురు చూడసాగారు. ఎంతసేపు ఆకాశంవేపు చూసినా వెలుగు జాడ కనపడిందికాదు.

అప్పుడు బలభద్రుడికి సందేహం వచ్చింది. "తమ్ముడా! చూడబోతే ఇది ప్రళయంలా ఉంది. మనం బయటుదేరి ఏడెనిమిది జాముల పైనే అయింది. కాని తెల్లవారడమంటూ కనపడదు. ఇది స్వప్నమూ కాదు."

"అన్నా! మనం నిద్రపోతే కదా స్వప్నం కావడానికి? ఇంతసేపు తెల్లవారకపోడం ఇంద్రజాలం తప్ప యదార్థం కాదు" అన్నాడు కృష్ణుడు. "ఇది ఇంద్రజాలం కాదు, స్వప్నమూ కాదు. దైవమాయ. మనం దేవుడు లేడనీ, వేదశాస్త్ర పురాణాలు అబద్ధాలనీ, పుణ్యతీర్థాలు కల్పనలనీ నాస్తికమతం అవలంబించాం. అందుచేత భగవంతుడు తన మాయని

చూపించడాన కిలాటి చీకటిలో పడేశాడు. కాకపోతే మనం ఎప్పుడేనా ఇంత సేపు ఇలాటి చీకటిని చూశామా? ఇప్పు డా మహానుభావుణ్ణి ప్రార్థించడం కంటె గత్యంతరం లేదు ' అంది సుభద్ర - ఆమె మాటలు నిజమే అనిపించి - వాళ్ళు అంతవరకూ భగవంతుని నిందించినందుకు పశ్చాత్తాపపడుతూ - దేముడిని ధ్యానిస్తూ స్తోత్రాలూ పద్యాలూ చదివారు. వాళ్ళు అలా చేతులెత్తి మొక్కుతూ ప్రార్థిస్తూంటే - ఆకాశంలో ఒక మెరుపు మెరిసింది దాని కాంతిలో - దగ్గరలోనే ఒక ఆలయం కనిపించింది.

బలభద్రుడు లేచి - "తమ్ముడా! దగ్గరలో ఒక దేవాలయం కనపడింది చూశావా? నేను వెళ్ళి అదెవరిదో కనుక్కు వస్తాను. వెలుతురొచ్చే వరకూ మన మక్కడ విశ్రమిద్దాం" అంటూ తడుముకుంటూ పదడుగులు వేశాడు. వెంటనే అతనొక బిలంలో పడిపోతూ "హా! కృష్ణుడా! హా సుభద్రా! చెల్లెలా! నేనీ గోతిలో పడిపోయి జారిపోతున్నా ఇక మీ కంటికి నేను కనపడను" అంటూ కేకలు వేశాడు కృష్ణుడు, సుభద్ర హాహాకారాలు చేసుకుంటూ పరుగెత్తివచ్చి అన్నపడిన గోతిలోనే పడిపోయారు. కాని - అన్నను వారు కలుసుకోలేకపోయారు.

## పాతాళ బిలం కథ

**బ**లభద్రుడు పాతాళబిలంలో పదిరోజులు స్మృతిలేని స్థితిలో జారిజారి చివరికొక కొండశిఖరం మీద పడ్డాడు శ్రమవలన అతనికి పూర్తిగా కాక కొంచెమే తెలివివచ్చింది. అక్కడ సోపానాలు బంగారంలా మెరుస్తున్నాయి. చెట్లకి చక్కని ఫలాలున్నాయి నిర్మలమైన నీరు పారుతూంది. చల్లగాలులు వీస్తున్నాయి. ఆ చల్లని గాలి తగిలేసరికి బలభద్రుడికి పూర్తిగా స్పృహవచ్చింది. ఆకలి తీరేలా ఆ పళ్ళుతిని... దాహం తీరేలా చల్లనినీరు తాగే సరికి అతనికి పూర్తిగా ఓపికొచ్చింది. అక్కడి వింతలు చూస్తూ - 'అయ్యా! బగవంతుడి మహిమ తెలుసుకోవడం అసాధ్యం పేరు సంపాదించేయ్యాలని - పెద్దలమాటలు కొట్టి పారేశాం.

రాయి అనేశాం. భగవంతుణ్ని అలా నిందించడం వల్లనే నన్ను నా బంధువులనుంచి దూరం చేసి ఈ పాతాళ లోకంలో పడేశాడు. తమ్ముడూ, చెల్లెలూ అయినా సుఖపడితే అంతేచాలు. గాఢాంధకార మయమై, ముళ్ళతోనిండిన ఆ ప్రదేశం నుంచి వెళ్ళగలిగారో లేదో? ఇక్కడ సూర్యుడు లేకపోయినా రత్నకాంతుల వల్ల పట్టపగలు లాగే ఉంది. ఈ శిఖరం కైలాసమో మేరుపర్వతమో అయివుంటుంది. కాకపోతే ఇక్కడున్న రాళ్ళన్నీ రత్నాలూ, భూమంతా బంగారంగానూ ఎందుకుంటుంది? స్వర్గమంటే ఇదే ఏమో! కాదు కాదు. స్వర్గం పైనుంటుంది. ఇదంతా నిజం కాదేమో భ్రమపడుతున్నానేమో దైవమాయేమో! ఏదయితేనేం, ఈకొండమీది విశేషాలు చూడాలి! అని నిర్ణయించు కున్నాడు.

అత నా ప్రాంతంలో తిరుగుతూంటే - ఆ కొండపక్క చాలావేగంగా గాలివీస్తూ పెద్ద శబ్దమయింది. ఆ గాలిలో ... త్రిశూలం ధరించినవారూ, విభూతి, రుద్రాక్ష మాలలు ధరించినవారూ అయిన మగవాళ్ళు కోటానుకోట్లమంది తాటాకుల్లా కొట్టుకుపోసాగారు. అది చూసి బలభద్రుడు చాలాఆశ్చర్యపోయాడు. 'ఈ గాలికి పర్వతాలే ఎగిరిపోతాయి కాని ఈ గాలి ఈ కొండని తాకకుండా పక్కనుంచి పోతూంది. దీనివేపు వచ్చిందంటే ఈ కొండా నేనూ దూదిపింజల్లా ఎగిరిపోతాం. ఇంక నేనేం బతుకుతాను? నన్నిక్కడ కూడా సుఖంగా ఉండనివ్వదు కాబోలు - అని అతను విచారిస్తూంటే, ఆ గాలి మరోవేపు వెళ్ళిపోతున్న ట్లనిపించింది. అతను ఆపద తొలిగినట్లు ఊపిరిపీల్చుకుని - మరొక వేపుకు పోయి అక్కడి విశేషాలు చూడసాగాడు.

అక్కడ రత్నాల పలకలతో ద్వారంకల గుహ ఒకటి కనిపించింది. అతను సాహసించి దానిలో ప్రవేశించాడు. అక్కడ అతనికెన్నో, వింతలు కనపడ్డాయి. ఎవరూ లేని చోట ఈ అలంకారాలేమిటో అనుకుంటూ అతను గుహలోపలికి నడిచాడు. అక్కడొక కళ్యాణ మండపం కనిపించింది. దానిస్తంబాలు రత్నాలతో నిర్మించబడ్డాయి. మంటపం మధ్యభాగంలో పెళ్ళి పీట వేయబడి ఉంది. దాని ముందర-పెళ్ళికి కావలసిన సామగ్రీ సిద్ధం చేయబడి ఉంది.

అక్కడున్న ఒక రత్నానికి - భూలోకంలో ఉన్న సంపదంతా కలిసినా సాటిరాదనుకున్నాడు. తనకళ్ళు ధన్యమయ్యాయని పొంగిపోయాడు. తమ్ముడూ, చెల్లెలూ కూడా ఉంటే ఎంత బాగుండు నను కున్నాడు. అంతలో మంగళ వాద్యాలు వినిపించాయి. పెళ్ళివారొచ్చి తనని చూస్తే శపిస్తారేమో అని శంకించినా .. తనేమీ కావాలని రాలేదు కదా... ఏం జరిగితే అదే జరగనీ అని సిద్ధపడి పోయాడు.

మంగళ వాద్యాలు మోగుతూంటే పల్లకీలో పెళ్ళికూతురిని తెచ్చి మంటపంలో దింపారు. ఆమె సౌందర్యం చూసి బలభద్రుడు మోహం ఆపుకోలేక – 'ఇటువంటి కన్యని పెళ్ళాడినవాడి జన్మము కదా జన్మము' అనుకున్నాడు. అంత సౌందర్యవతిని పెళ్ళాడే వరుడెంత అందగాడో అని చూస్తూండగా – పెళ్ళి కొడుకుని తీసుకు రమ్మని పురోహితుడు చెప్పగా – ఒక్కసారక్కడ – 'అతనే.. అతనే...' అని మాటలు వినిపించాయి. బలభద్రుడు తెల్లబోయి చూస్తూండగా – ఇద్దరు స్త్రీలతని వద్దకు వచ్చి చేతులు పట్టుకుని రా. నువ్వు పెళ్ళికొడుకువయ్యావు మంగళ స్నానాలు చేయిస్తాం" అనే సరి కతనేమీ మాట్లాడక వాళ్ళు చెప్పినట్లు చేయసాగాడు. పురోహితుడు పాణి గ్రహణం జరిపించేశాడు. ఆమె కంఠంలో మంగళసూత్రం కడుతూంటే అతనిలో కలిగిన ఆనందం అంతా ఇంతా కాదు.

తరువాత వధూవరులని ఒంటరిగా వదలి వాళ్ళంతా తప్పుకున్నారు అతని కామెను పలకరించడానికి నోరు పెగలలేదు. ఆమె చిటికెనవేలు పట్టుకుని – మంటపానికి దక్షిణంవేపుగా పదడుగులు వేశాడు. అక్కడొక చక్కని ఉద్యానవనం కనిపించింది. కొంత సేపందులో విహరించి... ఒకలతా మండపంలో కూర్చోబెట్టి – "నీపేరేమిటి? ఎవరమ్మాయివి? ఈలోకం ఏది? నీవృత్తాంతమేమిటి?" అని అడిగాడు. ఆమె అతనివేపు చూసి కళ్ళు వాల్చుకుందే తప్ప ఏమీ అనలేదు. ఆమెను మెల్లగా అనుకూలం చేసుకుందామని ఆమెను కౌగిట్లోకి తీసుకుని ముద్దు పెట్టుకోబోతూంటే – అప్పటి శబ్దం మళ్ళీ వినపడి అతను తుళ్ళి పడ్డాడు.

అతనికి దగ్గరలోనే ఉద్యానవనంలోనే ఒకమూల రయ్యిమని శబ్దం చేస్తూ గాలి బయలుదేరింది. దాన్ని చూసి అతను చాలా భయపడి ఆమెను మరొక ప్రక్కకు తీసుకు పోయాడు. కాని ఆ సుడిగాలి వారివేపు వచ్చి ఇద్దరినీ దూది పింజెలా ఎగరేసుకుపోయింది. కొంతసేపు ఆకాశంలో గిరగిర తిరిగి చివరకి మునపటి పట్నంలోనే పడ్డాడు. తెలివొచ్చి చూసి అత నాశ్చర్యపోయాడు.

అదంతా కల. గుర్రాలక్కడే ఉన్నాయి. సూర్యోదయ మౌతోంది. మహామాయలాటి కల అనుకుంటూ అతను గొంతెత్తి "తమ్ముడా! కృష్ణా!" అంటూ నాలుగు వేపులా తిరగసాగాడు. ఒక చెట్టుకింద పడుకున్న కృష్ణుడు కనిపించాడు. – బలభద్రుడు లేపగా – అతను లేచికూర్చుని – "హా! ప్రేయసీ!" అంటూ పలవరించసాగాడు.

"ఆ ప్రేయసి ఎవతె? కళ్ళు విప్పిచూడు. తెలివితెచ్చుకో. సుభద్రేది?" అంటూ అడగగా. ."ఎంత మోసం! ఎంత మోసం! అంతచక్కనిది నాలాటి అధముడికి దక్కుతుందా? ఏమిచక్కదనం!" అంటూ ఆ మాటలు వదలక పలవరించడంతో బలభద్రుడు అతన్ని గట్టిగా లేపాడు. కృష్ణుడు – "నేను కలను నిజమనుకుని భ్రమతో ఇలా అంటున్నాను. ఇలాటి వింతలెప్పుడూ చూసికాని వినికాని ఎరగను. దైవమాయంటే ఇదేఏమో! నిన్న రాత్రి నువ్వు పాతాళబిలంలో పడిపోయి నన్నూ సుభద్రనీ కేకవేశావు కదా. మేం పరుగెత్తుకొచ్చాం. మేము కూడా దానిలోనే పడ్డాం. కాని నువ్వేమై పోయావో మాకు తెలియదు. తరువాతేమైందో నాకు తెలియదు.

ఎన్నాళ్ళు ఆ బిలంలో జారానో? కళ్ళు తెరిచేసరికి ఒక చోట పడున్నాను. ఒంట్లో అలసటలాటి దేమీ లేదు. ఆకలీ లేదు. నిద్రలేచినట్లే ఉంది. సూర్యుడు కనపడకపోయినా వెలుతురుగానే ఉంది. ఒక పట్నం కనిపించింది. అదేమిటో చూద్దామని బయలు దేరాను.

ఆ పట్నంలోని మేడలను వర్ణించడం నా తరం కాదు. అన్నీ మణిమాణిక్యాలతో కట్టినవే. రాయి, కర్ర కనిపించనేలేదు. అది స్వర్గం కావచ్చు. ఆ మేడలలోంచి సంగీతం వినిపిస్తూంది. అక్కడందరూ

సుందరులే. నన్నెవరూ పలకరించలేదు. నేను పట్నంలోని నాలుగు మూలలూ తిరిగాను. ఒకమూల తిరుగుతూంటే -

అక్కడొక ప్రవాహం చాలా వేగంగా ప్రవహిస్తూంది దానిలో శంఖచక్రాలు గద విల్లులు, తులసిమాలలు ధరించిన వైష్ణవులు కొట్టుకుపోతున్నారు. ఆ ప్రవాహానికి మొదలూ తుదీ కనిపించడం లేదు. అది పొంగుతున్నట్లు కనిపించేసరికి భయపడుతూ మరోవేపు పారిపోయాను.

ఒక వీధిలో వెళ్తూంటే - ఒక మేడలోంచి మంగళవాద్యాలు వినిపించాయి. నేను లోపలికి తొంగి చూశాను. వివాహవేదిక సిద్ధం చేయబడి ఉంది. అందరూ పెళ్ళి కొడుకు వచ్చాడు, పెళ్ళి జరిపించండి" అని కేకవేస్తూ, నేనాశ్చర్యంగా చూస్తూంటే, నన్ను పట్టుకుని మంగళ స్నానాలు చేయించారు. పీటల మీద కూర్చోబెట్టారు. బంగారు బొమ్మలాటి కన్యను నా పక్కన కూర్చో బెట్టారు. నేనామెకు మంగళసూత్రం కట్టాను. ఉంగరాలు మర్చుకోడం, తలంబ్రాలు పోసుకోవడం .....అన్నీ జరిగాయి. మమ్మ ల్నేనుగు మీద కూర్చోబెట్టారు. మేమిద్దరమే మిగిలాం.

నేనామెను పలకరించాను. సిగ్గుతో మాట్లాడలేదు. కాని...మందహాసంతో తన అనుకూలతని తెలిపింది. నేను మోహంతో ఆమెను కౌగిలించుకో బోతూంటే... ఆ ఏనుగు ప్రవాహం దగ్గరకు తీసుకుపోయింది. మావటీడు లేని ఏనుగుని మేమేం చేయగలం. మేమెంత అదలించినా అది ఆగలేదు. ఆ ప్రవాహం ఆకాశమంతెత్తులేచి మమ్మల్ని ముంచేసింది నేను కొట్టుకుపోతూంటే ఒక పెద్ద చేప తోకతో నన్ను విసిరేసింది. నేనిక్కడి కొచ్చి పడ్డాను. ఆ అదురుకి కళ్ళు మూసుకుని ఉండగా నువ్వు నన్ను పిలిచావు. ఇది కలో నిజమో నువ్వే చెప్పు ఆమె ఉంగరం నావేలికే ఉంది-" అన్నాడు.

అతని చరిత్ర విని బలభద్రుడు ఆశ్చర్యం పట్టలేకపోయాడు, "తమ్ముడూ! ఇలాటి చిత్రాలు కథలలోనే విన్నాం. నా కథా నీ కథలాటిదే. అది అలా ఉంచు. మన చెల్లెలు సుభద్రేమైంది? మనకోసం ఈ పరిసరాల్లో తిరుగుతూందేమో?" అంటూ సుభద్రా! సుభద్రా! అని కేకలు వేయసాగాడు.

"ఇదుగో...ఇక్కడున్నాను. పాపాత్మురాలిని చావలేదు ఇటురండి" అన్నమాటలు వినపడడంతో వాళ్ళు అటు పోయి ఒక పొదరింట్లో ఉన్న ఆమెను చూసి ఎంతో సంతోషిస్తూ..."నీకోసమే బెంగెట్టుకున్నాం. నువ్వు కూడా పాతాళబిలంలో పడిపోయావు కదా ఎలా బయటకొచ్చావు? ఎక్కడికి పోయావు? ఏయే వింతలు చూశావు?" అంటూ అడిగారు.

ఆమె ఒకసారి కళ్ళు మూసుకుని – "అన్నలారా! మీ వెనకే నేనూ ఆ గోతిలో పడిపోయాను. మీరు కనపడలేదు. దిగజారి దిగజారి ఒక సరస్సులో పడి మునిగి అంతలో తేలాను. అది మానససరోవర మేమో. దానిలో స్నానం వల్ల నా శ్రమతీరిపోయింది. ఎంతో అందమైన ఆ తటాకం నుంచి బయటపడి చుట్టూ చూశాను. ఒకచోట అద్భుతమైన కాంతి కనపడింది. దాని కెదురుగా నడిచాను. ఒకఅగ్నిగుండం నుంచి బయలువెడలుతూ అగ్నిజ్వాల కనిపించింది. దాని జ్వాలలూ రవ్వలూ ఆకాశాని కంటుతున్నాయి. ఆ జ్వాలలో – ముగ్గురేసి పిల్లలని చంకలో పెట్టుకున్న స్త్రీలు వేలకొద్దీ – మిణుగురు పురుగుల్లా ఎగిరిపోతున్నారు. ఇంకా విచిత్రమేమిటంటే – ఆ అగ్ని గుండం ఒకచోట స్థిరంగా ఉండక నాలుగు మూలలా తిరుగుతోంది. దానిలో పడితే పర్వతమైనా సరే బూడిద కావలసిందే. అది నావేపు వస్తుందేమో అని భయపడి నేను మరొకవేపు వెళ్ళి పోయాను.

అక్కడ బంగారు మేడ కనిపించింది. రత్నాలు తాపితం చేసిన మహాద్భుతమైన మేడ అది. దానిలో ఎవరుంటారో చూద్దామని లోపలికి వెళ్ళాను. అక్కడ – హంసతూలికా తల్పంమీద ఒక యువకుడు నిద్రపోతున్నాడు. అతనెంత అందమైన వాడో చెప్పలేను. అతను కళ్ళు తెరిచి నన్ను చూశాడు. అన్నలైన మీకు చెప్పవలసిన మాటలు కావు. నాలో అతని చూపులు మదనవికారం కలిగించాయి. అతను శయ్యమీదకు రమ్మని సైగ చేశాడు. నేను సిగ్గుపడుతూ అతనికి దగ్గరగా వెళ్ళి నిలుచున్నాను. అతను నన్ను తల్పంమీదకు లాక్కుని వొళ్ళో కూర్చోబెట్టుకుని నన్ను ముద్దాడుతూ అతని ఉంగరం నా వేలికి తొడిగాడు. ఏదో మాట్లాడబోయేంతలో"...

సుభద్ర చెప్పడం ఆపేసి..."ఎంత కష్టం! ఇక తరవాత చెప్పలేను" అంటూ మూర్ఛపోయింది. వారామెను సేదతీర్చి - "చెల్లీ! నువ్వు చెప్పక్కర్లేదు" మాకు బోధ పడింది. మనం ముగ్గురమూ ఒకే రకపు అనుభవాలు పొందాం. ఇది యదార్థం కాదు. మహామాయ. దీనిగురించి విచారించక్కరలేదు. సుభద్రా! మీరలా ఆనందంగా ఉండగా ఆ అగ్నిజ్వాల మిమ్మల్ని తనలో లీనం చేసుకుంది. నువ్వందులోపడి ఇక్కడి కొచ్చావు. ఇదేగా నువ్వు చెప్పదలుచుకున్నది?" అని అడిగేసరి కామె చాలా ఆశ్చర్యపోయి - "మీకెలా తెలుసు?" అంది వాళ్ళు తమవృత్తాంతాలు చెప్పారు.

అప్పుడు సుభద్ర తలూపుతూ - 'ఇదే దైవమాయ. దీన్ని దేవతలు కూడా తెలుసుకోలేరు. మనమెలా తెలుసుకోగలం? మీ సందేహాలు తీరాయి కదా? బుద్ధిగా ఇంటికిపోదాం" అంది.

దైవమాయని తెలుసుకోడం తమ తరం కాదని వాళ్ళు నిశ్చయించుకుని - గుర్రాలెక్కి తమదేశం బయలుదేరి - సాయంకాలాని కొక పల్లె చేరారు.

తాము చూసిన విషయాలు మహామాయ అని తెలిసినా వ్యామోహం జయించలేక బలభద్రుడు తాను చూసిన పర్వతశిఖరం, మహామందిరం, కళ్యాణమంటపం, క్రీడావనం, తాను పెళ్ళాడిన కన్యను పటంలో చిత్రించి తమ్ముడికి చూపగా కృష్ణుడు తాను పెళ్ళాడిన కన్య, బంగారుమేడ, మదగజం, ప్రవాహం మొదలైనవి చిత్రించి ఆ పటాన్ని అన్నకు చూపాడు. సుభద్ర - తన భర్తనీ, ఆ మేడనీ, అగ్నిజ్వాలనీ పటంగీసి చూపించింది. ఆ పటాలు చూసి వాళ్ళెంతో ఆశ్చర్యపోయారు. వాళ్ళా పటాలనే పట్టుకుని పిచ్చివాళ్ళలా ఆ విషయాలే తలచుకుంటూ కొంత దూరం ప్రయాణించారు.

గోపా! వేళయిపోతూంది. మిగిలిన కథ పై మజిలీలో చెప్పుకుందాం" అని అక్కడి కాపాడు మణిసిద్ధుడు.

# కాశీ మజిలీ కథలు

## 34. వ మజిలీ

"గోపాలా! వాళ్ళు అలా గుర్రాలమీద తమదేశానికి ప్రయాణం చేస్తుంటే....ఒకనాటి సాయంత్రానికి మధుమంత మనే పట్నం చేరుకున్నారు. అక్కడ బాటసారులుండే సత్రంలో దిగారు. భోజనాలు చేసి సత్రపు అరుగు మీద ముగ్గురూ కూర్చున్నారు. వాళ్ళని చూసిన విద్యార్థులు "మిత్రమా! వీళ్ళ ఆకారాలు ముగ్గురివీ ఒకేలా ఉన్నాయి. ఎవరెవరో పోల్చుకోడం తల్లితండ్రులకేనా కష్టమే సుమా! కవలలు కాబోలు"

"లేకపోతే ఒకేలా ఎందుకుంటారు? వాళ్ళలో పెద్ద ఎవరో చెప్పుచూద్దాం.

"ఆ రత్నహారం మెడలో ధరించినవాడు పెద్దవాడిలా ఉన్నాడు. అతను ధరించడం వల్ల ఆ హారానికి గొప్పతనం వచ్చింది."

వాళ్ళ మాటలు బలభద్రుడు విన్నాడు.

వాడుక ప్రకారం తెల్లవారు జామునే లేచి ప్రయాణం కాబోయేసరికి బలభద్రుడు కనపడక సుభద్ర, కృష్ణుడు కంగారు పడ్డారు. చుట్టు ప్రక్కల గాలించినా అతని జాడ తెలియలేదు. ఎదురుపడిన వాళ్ళ నడుగుతూ పోతూంటే ఎవరో – "ఒక దాదారిన గుర్రంమీద పోతున్నాడు" అని చెప్పాడు. అతని మాటలు నమ్మి వాళ్ళిద్దరూ గుర్రాలమీద అటు వేపు వేగంగా వెళ్ళారు. కాని బలభద్రుడు కనిపించలేదు. ఆ దారి వారిని చంద్రకాంతమనే రాజధానికి తీసుకుపోయింది.

అక్కడ బలభద్రుడిని వెదుకుతూ పదిరోజులున్నారు. ఒకనాడు వీధిలో చాటింపు విని – తాము బస చేసిన ఇంటి ఇల్లాలితో – "అవ్వా! రేపు దివాణంలో జరగబోయే సభ దేనిగురించో తెలుసా?" అని అడిగాడు కృష్ణుడు.

"మా పట్టపురాజు కనకాంగదుడికి లేకలేక పుత్రిక కలిగింది సువర్ణ రేఖ రూపలావణ్యాలు అద్భుతమైనవి. ఆమెకు రాజు స్వయంవరం ప్రకటించాడు. దానికి వచ్చిన రాజకుమారులలో సువర్ణరేఖ అడిగిన ప్రశ్నకు తగిన సమాధానమిచ్చిన వానికి తనపుత్రికనీ, రాజ్యాన్నీ ఇస్తాడట" అని చెప్పిందామె.

మర్నాడు సుభద్రకి చెప్పకుండా కృష్ణుడాసభకి వెళ్ళాడు. ఎందరో రాజకుమారులు ఎన్నో దేశాల నుంచి వచ్చి సభలో కూర్చున్నారు రాజు వారిని చూసి – "నిన్నెందరికి తెలుసు?" అనే ప్రశ్నని వాళ్ళకి తెలియ జేశాడు. ఆ ప్రశ్నకు రుజువుతో సహా సమాధానం రాస్తే – తాము వ్రాసిన జవాబు మాటలరూపంలో అయినా ధ్రువపరచుకొనవచ్చు అని పత్రికలో ఉంది ప్రశ్నతో పాటు.

దానిలోని అంతరార్థం రాజకుమారులకి తెలియలేదు. అందరికంటె ఎక్కువమందికి తెలిసినవాడికి తన కూతురినివ్వాలని రాజు ఉద్దేశమైవుంటుందని అవసరమైతే తెలియనివారిని కూడా సాక్ష్యానికి తీసుకురావచ్చునని... కోటి అనీ... నాలుగు కోట్లమంది అనీ .తమసంఖ్య పైనుండాలని కొందరు పాతికకోట్లమందనీ – జవాబురాశారు కాని కృష్ణుడు మరోలా ఆలోచించాడు. 'నన్ననగా శరీరమనికాదు. మనస్సుని. నా మనసుని నేను తప్ప మరెవరెరగగలరు? 'కనక అవాక్యమే రాసి ఇవ్వాలని 'నన్ను నేను తప్ప మరెవరూ ఎరుగరు' అని రాసి ఇచ్చాడు.

కనకాంగదుడు అపత్రికలన్నీ పుచ్చుకుని చూసి వాళ్ళ నెగతాళి చేస్తూ – కృష్ణుడు రాసిన పత్రిక తీసి చదివి సంతోషించి ఇలా అన్నాడు. "రాజపుత్రులారా! తనమది తనకే సాక్షి. తనను తానే తెలుసుకోగలడు. ఇతరులు తెలుసుకోజాలరు. ఇదే సత్యం ఈ రాజకుమారుడు అదే రాశాడు. నా అభిప్రాయంకూడా అదే. మీలో ఎవరికీ ఈ ఉహ రాలేదు. నేనీ సమాధానమే రాసి ముద్రవేసి ఉంచాను. చూడండి" అంటూ ముద్రని విడదీసి పత్రిక తెరచి చదవగా దానిలో అచ్చం కృష్ణుడు రాసినట్లే ఉంది.

రాజకుమారులు సిగ్గుపడి ..... కృష్ణుని బుద్ధి బలాన్ని మెచ్చుకుని ఎవరి దేశాలకు వారు వెళ్ళిపోయారు రాజు కృష్ణుణ్ణి సత్కరించి

– అతని మెడలో పూలదండవేసి "నువ్వే నాఅల్లుడివి. నా రాజ్యాన్నీ పుత్రికనీ స్వీకరించు" అన్నాడు.

ఆ మాటలకు – "దేవా! మీరు నన్నందరిలో గౌరవించి బుద్ధిమంతుడిగా ప్రశంసించారు. అదే పదివేలు. నాకు వివాహంతో పనిలేదు. నే నాకోరికతో సమాధానం రాయలేదు. దైవవశం వల్ల ఇక్కడి కొచ్చానంతే" అన్నాడు కృష్ణుడు.

అతని మాటలు పట్టించుకోకుండా రాజు "అవన్నీ రేపు ఆలోచిద్దాం" అని అతన్ని సగౌరవంగా విడిదికి పంపాడు. కృష్ణు డా వృత్తాంతమంతా చెల్లి సుభద్రకి చెప్పి – "నాకు వీళ్ళు పెళ్ళి చేస్తారట! నా హృదయంలో ఉన్న ప్రియురాలిని కాక వేరొకరి నెలా వివాహం చేసుకునేది? నాకది ఇష్టంలేదు. మనదారిన మనం పోదాం పద. మన అన్న ఇక్కడ లేడు" అన్నాడు.

"వొద్దంటే బలవంతంగా కట్టిపెడతారా ఏంటి? రెండు రోజులాగి చూసిపోదాం" అందామె.

సువర్ణరేఖ అంతఃపురంలో తనప్రాణసఖి సునందతో – "ఎన్నిసార్లు నీకు చెప్పినా నా మాట మా తండ్రికి చెప్పావుకావు. ఇప్పుడేమైందో చూడు. దారిన పోయేవాడెవడో మా తండ్రి ప్రశ్నకి జవాబు చెప్పాడని, నన్నతని కిచ్చి వివాహం చేస్తారుట! ఎంత దారుణం!" అంది.

"కలలో ఎవరినో వరించావని ఇతరులని పెళ్ళాడ నంటే – అది పాటించదగిన మాట కాదు. పదివేల మందికి తోచని మాట చెప్పినవాడు సామాన్యు డౌతాడా? కలలో కనపడిన వారికోసం విచారిస్తే నలుగురూ నవ్విపోతారు" అంది సునంద.

"నవ్వితే నవ్వనీ. కలలో కనపడిన వాడని చులకనగా చూడకు. ఈ చిత్రపటం చూస్తే నీకు తెలుస్తుంది" అంటూ ఒక చిత్రపటం చూపించింది సువర్ణరేఖ.

"దీనిని నువ్వు రాసినప్పుడే చూశాను. దీనిలో ఉన్నవాడు చాలా అందగాడే. కాని ఏం చేయగలం? ఎండమావుల్లో నీరు ఎంత తియ్యగా

ఉంటే మాత్రం సంపాదించ గలమా? నీ మాట లలాగే ఉన్నాయి" అన్న సునందకు – " మునుపు బాణాసురుడి కూతురుఉష కోరగా చిత్రలేఖ అనిరుద్ధుడిని తీసుకురాలేదా? నాకిప్పుడు పెళ్ళికి తొందరేమీ లేదు మా తండ్రికి చెప్పిరా" అంది సువర్ణరేఖ.

"తొందరపడకు. ఆ రాజకుమారు డెలాటి వాడో చూసి – తగినవిధంగా. చేస్తాను" అంటూ సునంద ఆ సాయంత్రం కృష్ణుడున్న విడిదికి పోయి – అతనిని చాలా పరిశీలించి అతనివద్ద నున్న చిత్రపటాన్నెలాగో సంగ్రహించుకు వచ్చి, రాజకుమారితో – "నువ్వు కోరుకున్నదే ఔతుంది. ఎంత చిత్రం! కలలు నిజమౌతాయని అంగీకరించక తప్పదు. విధి విచిత్రఘటనల్ని కల్పిస్తూంటాడు" అంటూ తాను తెచ్చిన చిత్రపటం ఆమెకి చూపించింది.

"దీనిలో ఆశ్చర్యమేముంది? ఇది నా చిత్రపటం. దీన్ని ఎవరు రాశారు?" అని అడిగింది రాజకుమారి.

'నువ్వు కలలో వరించిన వాడే వచ్చి మీ తండ్రి ప్రశ్నకు తగిన సమాధానం రాశాడు. అతడు మానవ మాత్రుడు కాదు. నవమన్మధుడే! నువ్వన్నట్లే అతని వేలికి నీ ఉంగరముంది. ఈ చిత్రపటం పట్టుకుని నీ కోసం తలపోస్తున్నాడు."

అని సునంద చెప్పగానే – రాజకుమారి సంతోషం పట్టలేక – "నిజమేనా. నా ప్రాణవల్లభుడే వచ్చాడా? నువ్వు నిజంగా చూశావా?" అంది"

"అంతానిజమే" అని సునంద చెప్పగా – ఆమె తక్షణమే విరహ బాధ అనుభవించసాగింది అతనిని తొందరగా తీసుకురమ్మని సునందని మరీమరీ ప్రార్థించింది.

సునంద కృష్ణుని వద్దకు పోయి తనని పరిచయం చేసుకుని – అతను రాత్రి నిద్రపోతుండగా మత్తుమందు చల్లి ఇద్దరు చెలుల సాయంతో అతన్ని అంతఃపురానికి తీసుకొచ్చి సువర్ణరేఖ శయ్యమీద పడుకోబెట్టింది.

సువర్ణరేఖ అతన్ని కౌగలించుకుంది అతని మత్తు వదిలించమని కోరగా సునంద మరొక మందుచల్లి అతనికి తెలివి తెప్పించింది అతను కళ్ళుతెరిచి నాలుగు మూలలా చూసి - అది తన శయ్యకాదని గ్రహించి - అక్కడి విశేషాలన్నీ గమనించి - దాన్ని కలగా అనుకున్నాడు. అప్పటికలవంటిదే ఇది - ఇదిమరొక కల అనుకున్నాడు.

అంతలో సువర్ణరేఖ చాలా అందంగా తయారై వచ్చి అతన్ని కౌగిలించుకుంది. అతనామెను గుర్తుపట్టి 'మోహినీ! నువ్వాప్రవాహంలో కొట్టుకుపోయి ఎక్కడికి చేరావు? నన్నింత విరహానికి గురి చేయడం నీకు భావ్యమేనా?" అని అడగ్గా

"అప్పుడేం జరిగిందో నేను చెప్పలేను దైవం ఏం తలుచుకుంటే అది చెయ్యవలసిన వాళ్ళం కదా మళ్ళీ మనం కలుసుకున్నందుకు సంతోషించాలి" అందామె. వాళ్ళిద్దరూ మదన క్రీడల్లో తేలితేలి అలసి పోయి గాఢ నిద్రలోకి జారిపోయారు.

తెల్లవారబోతూంటే సునంద అతన్ని మళ్ళీ అతని నివాసానికి భద్రంగా చేర్చింది. కృష్ణుడు అలవాటుగా సూర్యోదయం కాకముందే మేలుకుని...రాత్రి జరిగిన దంతా కల అనుకున్నాడు. కాని వొంటిమీద చందనపు పూతలు. శ్రీగంధపు సువాసనలు - అతన్ని అయోమయంలో పడేశాయి.

"చెల్లీ! వింతలు మీద వింతలు కనపడుతున్నాయి. మొన్నటి చెలి కలలోకి వచ్చి ముచ్చట్లు జరిపించింది. నా శరీరం మీద గంధం చూడు... నేను పెళ్ళాడదలుచుకున్నది రాత్రి వచ్చింది. మనమిక్కడుంటే రాజు పెళ్ళి చెయ్యక మానదు. మనం రహస్యంగా పారిపోవాలి" అన్నాడు. వాళ్ళారాత్రి ఎవరికీ తెలియకుండా అరణ్యమార్గంలో నడిచిపోసాగాడు

అలా వెళ్తూంటే - "అన్నా. మన మనసులు పూర్వంలా మన అధీనంలో ఉండడంలేదు. ఎక్కడికిపోవాలో, ఎక్కడి నుంచి వస్తున్నామో

తెలియదు. మరచిపోయిన వస్తువుని వెదుకుతున్నట్లు తిరుగుతున్నాం. నీకేమైనా జ్ఞాపకముందా?" అని అడిగింది సుభద్ర.

"చెల్లీ! పాతాళబిలంలో పడింది మొదలు మన మతులు గతి తప్పాయి. ఒక్కొక్కప్పుడంతా జ్ఞాపకంవస్తుంది. అప్పుడు నీతో చెప్పాలనుకుంటాను. మళ్ళీ అంతలోనే మరచిపోతాను"

వాళ్ళా అడవిలో మర్నాడు సాయంకాలం వరకూ నడిచారు. వూరేదీ కనపళ్ళేదు. చీకటి పడుతూందని కృష్ణుడు వేగంగా నడవడంతో – సుభద్ర వెనకబడిపోయింది. ఒకచోట రెండు దారులు కనిపించాయి. అన్న ఏదారిన వెళ్ళాడో తెలియక ఆమె అక్కడ ఆగి – "అన్నా! అన్నా!" అని గట్టిగా పిలిచింది. కాని......రాత్రి జరిగినవి తలుచుకుంటూ నడుస్తున్న కృష్ణుడికా పిలుపు వినపడ లేదు. చాలాదూరం పోయేవరకూ చెల్లెలు వస్తూందో లేదో అనే ఆలోచనే అతడికి రాలేదు.

సుభద్ర అన్న ఏదారిని పోయాడో తెలుసుకోలేక దేముడు చూపిన తోవలో నడవసాగింది. అంతలో చీకటి పడిపోయింది. ఆమె గుండె దిటవు చేసుకుని దారి కనిపించినంతసేపు నడిచింది. కొంతసేపటికి చీకటి దట్టమైంది. నిద్రపోడానికి తగిన చోటుకోసం చూస్తుంటే ఒక పెద్ద రావిచెట్టు కనిపించింది. దానికింద ఆమె శరీరం వాల్చింది.

'మహారాజు కడుపున పుట్టిన నేనే ఇంటి దగ్గర సుఖంగా ఉండక అన్నలతో సమానంగా దైవమాయ తెలుసుకుంటా నంటూ దేశాటనాని కెందుకు బయలుదేరాలి? దైవం లేదని ఎందుకు నిందించాలి? దైవ మాయవల్లనే కదా పిచ్చివాళ్ళలా తిరుగుతున్నాం. అన్నదమ్ములను విడదీసి ఈ మహారణ్యంలో నన్నొంటరిగా పడేసిన ఆ పరమేశ్వరుడే నన్ను కాపాడాలి' అనుకుంటూ దేవుణ్ణి ధ్యానిస్తూ మగతగా నిద్రలోకి జారిపోయింది.



# బ్రహ్మరాక్షసుడి కథ

ఆ రావి మానుని చిరకాలంనుంచీ అయోముఖుడనే బ్రహ్మ రాక్షసుడు ఆశ్రయించుకుని ఉన్నాడు. వాడికి శివరాక్షసుడు, విష్ణురాక్షసుడు అనే ఇద్దరు దూతలున్నారు. వాళ్ళతో కలసి ఆ అరణ్యంలోని జంతువులన్నిటినీ తినేస్తూ ఉండడంతో ఆ అడవిలో జంతువులు, పశువులు, పక్షులు పేరుక్కూడా మిగల్లేదు. ఆ దారిని మనుషులెవరూ పోరు. ఆ రావిచెట్టుకి మూడు యోజనాల దూరం వరకూ జనుల నివాసాలేవీ లేవు. ఆ వేళ బ్రహ్మరాక్షసుడికంటె ముందొచ్చిన శివ విష్ణు రాక్షసులు ఇలా మాట్లాడుకోసాగారు.

*శివరాక్షసుడు* : అన్నా! మన యజమానుడింకా రాలేదే! ఆహారపదార్థాలు తెచ్చి ఉంచేవా?

*విష్ణురాక్షసుడు* : ఇదిగో! ఈ రాతి మందసాన్ని జంతుకళేబరాలతో నింపాను. నేను లేచిన వేళ మంచిదికాబట్టి మనుష్యమాంసం కూడా దొరికింది.

*శివరాక్షసుడు* : అలా అంటావేం?

*విష్ణురాక్షసుడు* : నేను ప్రతిరోజూ వీడితో పడే బాధలు అన్నీ ఇన్నీనా! రాత్రిలోగా రకరకాల జంతువులతో యీరాతి పెట్టె నింపాలి. దానిలో నరమాంసం తప్పకుండా ఉండాలట! నే నెక్కడ్నుంచి తెచ్చేది? అడవంతా కాళీ అయిపోయింది. మనుషులీ దారిన రాడం ఎప్పుడో మానేశారు. ఏవి లేకున్నా నాకు దెబ్బలేకదా. అన్నా! నాకొకటి చెప్పు. వాడు బ్రహ్మరాక్షసుడు. నేను విష్ణురాక్షసుణ్ణి. నువ్వు శివరాక్షసుడివి కదా. బ్రహ్మకంటే శివ విష్ణువులే ఎక్కువ. మరి మనం వీడికి సేవలు చేయడమేమిటీ?

*శివరాక్షసుడు* : త్రిమూర్తులలో బ్రహ్మ తక్కువ వాడైనా, రాక్షసుల్లో బ్రహ్మరాక్షసుడే ఎక్కువని భేతాళుడు శాసనం చేశాడు. అలా ఎందుకు చేశాడంటే... అతను అన్ని భూతప్రేత పిశాచ శాకినీ ఢాకినీ రాక్షస గణాలన్నిటికీ సార్వభౌముడు. ఎవరు సేవించాలి

ఎవరు సేవించబడాలి? అనే విషయాల్లో కొందరి మధ్యతగవులు వచ్చాయి. వాటిని పరిష్కరించడానికి అలాశాసనాలు చేశాడు

విష్ణురాక్షసుడు : అయ్యో! ఎంతమోసం! ఐతే మన జీవితమంతా వీడికి సేవలు చేస్తూ వుండవలసిందేనా? అయ్యో! నీ కీ కష్టం ఎలా తప్పుతుందో? వీడు తింటూంటేనే నొక్కొక్క మాంస ఖండం పేరూ చెబుతూ కల్లులో ముంచి నోటికందిస్తూండాలి. మధ్య మధ్య మనుష్యమాంసం నంజుకో బెడుతూండాలి. పెట్టెడు మాంసమూ వాడి పొట్టనపెట్టుకోవడమే కాని నా కొక్క ముక్కయినా మిగల్చడు. నా పనికంటే నీ పనే చాలానయం. నా కీ జీవితానికి దీన్నుంచి బయటి పడే మార్గం కనిపింటంలేదు.

శివరాక్షసుడు : నా పని మాత్రం సులువా? ప్రపంచంలోని భూత ప్రేత పిశాచాల వార్త లన్నిటినీ తెలుసుకుని వచ్చి చెబుతూండాలి. ఒక్క నిముషమైనా తీరిక ఉండదు. సేవకా వృత్తంటేనే బహుకష్టం.

విష్ణురాక్షసుడు : అయోముఖుడొస్తున్నాడు. ఇంకేమీ మాట్లాడకు అంటుండగానే అయోముఖుడు చెట్ల కొమ్మలు పెళపెళమని విరుగుతూండగా ఆకాశమార్గంలో వేగంగా వచ్చి చెట్టుమీద వాలాడు. విష్ణురాక్షసుడు వాడి కాళ్ళని రక్తంతో కడిగి, మనుషుల వెంట్రుకలతో చేసిన విసనకర్రలతో విసురుతూ సేవలు చేశాడు. ఆ రాక్షసుడు అలవాటుగా అక్కడున్న రాతి పలకమీద కూర్చుని మాట్లాడుతూండగా... రాతి మందసం కింద నున్న కొమ్మలు విరిగి – పెట్టెతో సహా నేల కూలాయి. ఆ పెట్టె సుభద్రకి పక్కనే పడింది. అదేమిటా అని చూసేసరికి దానిమీద కొండలాకూర్చున్న రాక్షసుడు కనపడ్డాడు. రాక్షసు డామెని చూశాడు. "ఓహోహో! ఎంతపుణ్యం! కుందేలు వంటింటికే వచ్చిపడింది. ఎన్ని మాంసాలైనా మనిషి మాంసానికి సాటొస్తాయా? – ఓరీ! నీవెవ్వడివి? ఈ కారడివి కెందుకొచ్చావు? నీకు నా నివాసం తెలియదు కాబోలు" అన్నాడు. అతను బ్రహ్మరాక్షసుడనీ, తన చావెలాగా తథ్యమే అని తెలిసి – "మహాత్మా! నా దేహం నీ కాహారంగా చేసి కృతార్థుడినౌదా మని ఈ అరణ్యంలో ప్రవేశించి మూడురోజులుగా ఈ వృక్షంకోసం

వెదుకుతున్నాను. ఇప్పటికి కనిపించింది. నన్ను తిని నీకోరిక తీర్చుకో" అంది ధైర్యంగా. "నీ మాటలు చాలా ఆశ్చర్యంగా ఉన్నాయి. ఎంత ఆపద వచ్చినా ఏ జీవిలోనూ జీవితాశ చావదు. నీ రూపం కూడా చిత్రంగానే ఉంది. ఇంతకీ నువ్వాడదానివా? మగాడివా? నీ వృత్తాంతం వినాలని మాకు సరదాగా ఉంది. ఇంకో రెండు గడియలు నీకాయు వుందిచెప్పు" అన్నాడు రాక్షసుడు "దేవా! నేనొక రాజకుమార్తెను ఇంటివద్ద ఉండక అన్నలతో దైవమహిమ తెలుసుకోవాలని దేశాటనం మొదలుపెట్టాను. అప్పటినుంచీ అన్నీ ఆపదలే. కష్టాలతో నావొళ్ళు కాయలు కాసింది. దానితో మరణమే సుఖమనిపించి చావడానికెన్నో ప్రయత్నాలు చేశాను. ఎవరో మీ గురించి చెప్పగా...నా శరీరం వృథా కాకుండా మీ కాకలి తీర్చ గలుగుతుందికదా! అదే పదివేలని వచ్చాను. స్త్రీగా దేశాటనం కష్టమని పురుషవేషం ధరించాను. పరోపకారం కోసమే మానవశరీరం. మీరు నన్ను వేగంగా తినేస్తే నన్ను తొందరగా స్వర్గానికి పంపిన మహాత్ములౌతారు" అంటూ తనగురించిచెప్పి...తినమని వేడుకొంది.

బ్రహ్మరాక్షసుడు నవ్వుతూ – "మేమెంత క్రూరాత్ములమైనా మాకు మాత్రం దయలేదనుకున్నావా? నిన్ను చూస్తే ఎందుకో జాలేస్తూంది. నాకోసం ఈ అరణ్యానికి వచ్చిన నువ్వు పూజ్యురాలివి. నిన్ను భక్షించడం తగదు. అందుచేత నీకభయ మిస్తున్నాను. నీ కేంకావాలో కోరుకో." అన్నాడు. "నా కీ దేహం మీద మమకారం లేదు. మరణమే శ్రేయస్కరం. నన్ను భక్షించడం వల్ల మీకు పుణ్యమేకాని పాపం ఏమాత్రంరాదు – " అని ఆమె' ఎంతచెప్పినా అయోముఖుడు వినలేదు.

"నాకింకా ఆయువుంది కాబోలు! కొంతసేపు వైరాగ్యం నటించి ఈ అరణ్యాన్ని దాటించమని వరం కోరతాను" అనుకుం దామె మనసులో.

అంతలో...'నీకేం వరం కావాలో ఆలోచించుకో" అని రాక్షసుడు చెట్టుపైకి పోయాడు. శివరాక్షసుడు. వైష్ణవ రాక్షసుడు క్రిందికి దిగి ఆమె వద్దకు వచ్చి, " మనుషుల్ని నిలువునా విరుచుకు తినేసే మా బ్రహ్మరాక్షసుడికి దయ కలగడమంటేనే నమ్మలేని విషయం. అతని బుద్ధి

స్థిరమైంది కాదు. నువ్వు బెట్టు చెయ్యకు. మొదటికే మోసమొస్తుంది. నీకు మరోసారి చెప్పి రమ్మన్నాడు" అన్నారు.

"ఐతే నన్నీ అరణ్యం దాటించి దేశాన్ని చేర్చండి" అంది సుభద్ర. "క్షణంలో నిన్నలా దింపుతాం. కాని మా మాట మరొకటి విను. మా దొర వచ్చి ఏం కావాలని అడిగితే ఈ రాతి బోషాణం కావాలని కోరుకో. మాకుపకారం చేసిన దాని వౌతావు" అన్నారు వాళ్ళు ఆ రాతి పెట్టెను మళ్ళీ చెట్టుమీదకి చేర్చేపీడా, దానిని నింపే బాధ తమకి తప్పుతాయని. "నేను కోరుకుంటాను. అతనిస్తాడు. కాని నేనెలా తీసుకెళ్ళగలనూ? వెయ్యిమందే నాకదపలేరే దీన్ని! ........." "అదంతా నీకెందుకు? మేమే మోసుకొచ్చి పారేస్తాం. మా ఏలికకి నీ మీ దెందుకో దయకలిగింది మేం చెప్పినట్లు చెప్పకుసుమా. ." అంటూ వెళ్ళి బ్రహ్మరాక్షసుణ్ణి తీసుకువచ్చారు. అతను "భయపడకు నీకేం కావాలో కోరుకో వెంటనే జరిపిస్తాను" అన్నాడు.

ఆమె నమస్కరించి "స్వామీ! మీరు పదే పదే వరమడగ మంటూంటే కాదనడం బాగుండదు నాకు దేని మీదా వాంఛలేదు. కాని...ఈ రాతి మందసం వల్లే తమ దర్శనమయింది కనక దీని మీద నాకు ప్రీతి కలుగుతూంది. దీనితో కూడా నన్నీ అరణ్యం దాటించే భారం మీదే" అంది వినయంగా. "ఈమె అసాధ్యమైన కోరిక కోరిందే! హిరణ్యకశిపుని ఆహారపేటిక అయినదీన్ని నేనెంతో శ్రమపడి సంపాదించాను. ఎన్నో తరాల తరవాత వచ్చింది. దీనిలో వేసిన మాంసం ఎన్నాళ్ళయినా తాజాగానే ఉంటుంది. సరే... మాటిచ్చాక కాదనలేను కదా" అనుకుని "కాంతా! నువ్వు కోరినట్లే ఇచ్చాను తీసుకుపో. దూతలారా! తెల్లవారక ముందే ఈమె నీ పెట్టెతో సహా పల్లెలో చేర్చిరండి" అని ఆజ్ఞాపించాడు. మళ్ళీ వెళ్ళి చెట్టు కొమ్మల్లోకివెళ్ళి కూర్చున్నాడు వాళ్ళిద్దరూ సుభద్ర నా పెట్టెమీద కూర్చోబెట్టి అవలీలగా మోసుకుపోయి అరణ్యానికి అవతలున్న పల్లెలో దింపి – "ఇక నీదారిన నువ్వు పో. మా దారిన మేం పోతాం" అన్నారు. అప్పు డామె " ఈ పెట్టెలో ఏముందో చూపిస్తారా?" అని అడిగింది. వాళ్ళు దాని మూత తీసి చూపించారు.

దానిలో రక్తం కారుతున్న నానావిధ జంతువుల కళేబరాలూ ఉన్నాయి. వాటి మధ్య ఒక చక్కని పురుషుడు స్పృహ తప్పి పడున్నాడు. అతన్ని చూసి – "అన్నలారా! ఇత నెవడు? ఇప్పుడు బయటకు తీసి వదిలి పెడితే బతుకుతాడేమో? మీరు నా కుపకారం చేస్తామన్నారు కదా" ఈ పని చేసిపెట్టండి. కనికరించి వీనిని వదలండి" అని ప్రార్థించింది. వాళ్ళతన్ని బయటకు తీసి విడిగా పడుకోబెట్టి – పెట్టెలో కల జంతుకళేబరాలన్నిటినీ కడుపునిండా తిని, రక్తంతో దాహం తీర్చుకుని ఆ పెట్టె నెత్తుకుని దూరదేశంలో పారవేసి తన ఏలిక దగ్గరకి పోయారు. ఆమె వూరిలోకి పోయి నలుగురినీ ప్రార్థించి వైద్యుల్ని తీసుకువచ్చి ఆ పురుషునికి చికిత్స చేయించింది. రెండు జాములు గడిచాక అతను కళ్ళు విప్పి చూశాడు. కొంతసేపటికి దాహమిమ్మని సంజ్ఞ చేశాడు. ఊరివారు అతనికి దాహంతోపాటు ఆహారం కూడా ఇచ్చారు. రెండు రోజులకతనికి పూర్తిగా స్పృహవచ్చింది. లేవడానికి శరీరంలోకి శక్తీ వచ్చింది. ఆ లోగానే ఆమె అతని ఉంగరం గుర్తుపట్టి ఎంతో ఆశ్చర్య పోయింది" ఆ ! ఇతనే నా మానస చోరుడు! మూడు రోజుల నుంచీ – ఎక్కడో చూసినట్లుందను కుంటున్నాను. అయ్యో! ఇతని కిలాటి అవస్తెందుకు రావాలి . ఒక్క నిమిషం దాటితే ఇతను చనిపోయుండేవాడు. దైవఘటన లెంత విచిత్రంగా ఉంటాయి! ఆ రాక్షసులు నన్నా రాతిపెట్టెను కోరమనకపోతే ఇతను బతికేవాడు కాదు" అనుకుని –

"అయ్యా! మీరెవరు? మీదే దేశం? బహ్మారాక్షనుడి కాహారమెందు కయ్యారు? మీ వృత్తాంతం ఏమిటి?" అని అడిగింది. తనకి సేవలు చేసిందన్న కృతజ్ఞతతో అతను తన కథని మెల్లగా చెప్పసాగాడు.



# సుగుణ సాగరుడి కథ

"నా జన్మభూమి కాశ్మీర దేశ రాజధాని విక్రమ నగరం. మా తండ్రి పేరు విక్రమ సేనుడు. నాపేరు సుగుణసాగరుడు. వేదశాస్త్రపురాణాలు చదివి చాలా భాషలు గ్రహించాను. చిన్నప్పటినుంచీ నాకు కొత్త విద్యలు నేర్చుకోవాలనే కోరిక. చిత్తరువులు రాయడంలో నేర్పరివని నలుగురూ అంటారు. నాకు మా తండ్రి వివాహం చేయబోగా నేను స్త్రీలపట్లా, సంసార జీవితం పట్లా విముఖతను తెలుపుతూ ఒక పద్యం రాసి పంపాను.

నాలో శృంగారం ఉదయించేలా ఉద్యానవనంలో నాకొక మేడకట్టించి దానిలో వారకాంతల నృత్యగాన ప్రసంగాలేర్పాటు చేశాడు. గ్రంథాలకాలక్షేపం కలిగించాడు. అయినా నా మనసు శృంగానంవైపు మళ్ళలేదు. అందువల్ల నా తండ్రి నా గురించి తరచు చింతిచేవాడు. ఇలా ఉండగా -

ఒకనాడు నాకొక చిత్రమైన కల వచ్చింది ఒక సుందరి నా దగ్గరగా వచ్చి నిలబడింది. ఆమెను శయ్యమీదకు చేర్చి ముద్దాడి, అధరామృతం పొందబోతూంటే - ఒక పెద్ద అగ్నిజ్వాల వచ్చి మమ్మల్ని ఎగరేసేసింది. తర్వాత ఆమె ఏమైందో తెలియలేదు. అది కల అనుకుందామంటే - మేం మార్చుకున్న ఉంగరం నా చేతివేలుకుంది. నేను మదన గ్రహపీడితుణ్ని అయ్యాను.

ఏం చెయ్యాలో తోచక ఒకనాడు పొద్దున్నే లేచి ఎవరకీ చెప్పకుండా ఎటోపోసాగాను. సాయంకాలమయ్యేసరికి అడవిలో తిరుగుతున్న నా దగ్గరకి కొండంత ఆకారంలో ఒక భూతం ఒకటి వచ్చి - లేడి పిల్లని వొడిసిపట్టుకున్నట్లు నన్ను పట్టుకుంది. నాకుభయంతో స్పృహ తప్పింది. తరవాతేం జరిగిందో నాకు తెలియలేదు. నీ వలన నాకా ఆపద తప్పింది కాబోలు. నాకంత ఉపకారం చేసిన - నీ గురించి తెలుసుకోవడం నాకు ఎంతో ముఖ్యం కదా" అని ఊరుకున్నాడు.

ఆ కథ వినగానే సుభద్ర ఆనందంపట్ట లేకపోయింది. అంతలో తేరుకుని అప్పుడే ఏమీమాట్లాడకుండా తన మనోహరు డతనే అని మరోమారు రూఢిగా నిశ్చయించుకుని. స్నేహితుడిలా దగ్గరకు తీసుకుని మృదువుగా కౌగలించుకుంది. అతను కూడా ఆమెను హృదయ పూర్వకంగా ఆలింగనం చేసుకున్నాడు.

సుభద్ర - పూర్వపు కథ చెప్పకుండా - తాను ఆ అరణ్యంలో ప్రవేశించడం ... బ్రహ్మరాక్షసుడు తనని చంపబోయి చివరకు వరమివ్వడం తను ఆ మందసం కోరుకోవడం .. వగైరావిషయాలన్నీ చెప్పింది.

సుగుణసాగరుడావృత్తాంతం విని చాలా ఆశ్చర్యపోతూ... మృత్యుముఖం నుంచి తనని తప్పించిన అతనిని తనదేశం తీసుకుపోయి ఎక్కువగా గౌరవించదలచి - సుభద్రతో కలసి స్వదేశానికి ప్రయాణం కట్టాడు.

# కృష్ణుని కథ

సుభద్రను వదిలి ముందరికి వెళ్ళిన కృష్ణుడికి కొంతసేపటి కామె మాట జ్ఞాపకం వచ్చింది. ఎంతో విచారిస్తూ...కొంత దూరం వెనక్కి వచ్చి అడవి ప్రతిధ్వనించేటట్లు అరిచి...ప్రయోజనం లేకపోగా... ఒక చెట్టుక్రింద కూర్చున్నాడు. అంతలో చీకటి పడింది. ఎటుపోవడానికీ దారి కనపడక అక్కడే ఒకచోట నేలమీద పడుకున్నాడు. తమ చరిత్రంతా తలుచుకుంటూ రాత్రంతా భారంగా గడిపాడు. అన్న మధుమంతంలోనే ఉన్నాడని బయలుదేరి కొన్నాళకక్కడికి చేరుకున్నాడు.

అతనాపట్నపు వీధుల్లో తిరుగుతూంటే రాజభటులు వంగి సలాములు చేయసాగారు. సామంతులు కుశల మడగగా పౌరులు వెంట వెంట తిరగసాగారు. అది అతనికి వింతగా అనిపించింది. అంతలో ముఖ్యమంత్రి వచ్చి - "మీరు పరదేశస్తుల్లా తిరుగుతున్నారేమిటి? మీరాక విని మీ మామగారు పరమ సంతోషంతో ఏనుగు మీదెక్కించి తీసుకురమ్మని నన్ను పంపారు. మమ్మల్ని మరచిపోయారా?" అని

అడిగేసరి కతను తెల్లబోయి "మామగారెవరు? మీమాటలేమీ అర్థం కావడం లేదు" అన్నాడు.

అప్పు డామంత్రి – "ఇది మధుమంత పట్నం. ఈ పట్నపు రాజుగారు మీ మామగారు. వారికూతురు రత్నమాలని మీరు వివాహమాడారు. నే నాయన మంత్రిని. ఇదే మీకు మాకు ఉన్న బంధుత్వం. నేను మీ మాయలకు లోబడను. వేగంపోదాంరండి" అన్నాడు.

"మీరు నన్నెవరిగానో భావిస్తున్నారు. మీరెవరో నాకు తెలియదు. నాకీ వైభవంతో పనిలేదు. వెళ్ళండి" అన్నాడు కృష్ణుడు. మంత్రి రాజు వద్దకు వెళ్ళాడు. "దేవా! అల్లుడుగారిని ప్రార్థించాను. ఆయన కెందుకో కోపం వచ్చింది. మొహమెరగని వారితోలా మాట్లాడారు. మీరు వెళ్ళి పిలిస్తే వస్తారేమో" అనగానే రాజుగారే బయలుదేరారు.

కృష్ణుడొక మఠంలో ఉండడం చూసి "అయ్యా! మేమేం తప్పు చేశాం? మా ఇంటికి రాక బైరాగిలా ఈ మఠాల వెంట తిరగడం ఏమిటి? రండి" అనేసరికి కృష్ణుడు వారు భ్రాంతి పడుతున్నారనీ తాను వారి అల్లుడు కాననీ చెప్పాడు. రాజు అల్లుడు తనకులాన్ని శంకిస్తున్నాడనీ, శత్రువు లెవరో నూరి పోశారనీ భావించాడు. కృష్ణుడు చిరాకు పడుతూ అక్కడి నుంచి పోబోతే అతని చేతులు పట్టుకుని – "నువ్వు కోపిస్తే మాత్రం పోనిస్తామా? మా తప్పులు మన్నించు–" అంటూ ఒక పల్లకీ ఎక్కించి బలాత్కారంగా కోటలోకి తీసుకుపోయాడు.

ఆనాటి సాయంకాలం రత్నమాల ఉండే అంతఃపురానికి తీసుకుపోయారు. ఆమె చక్కగా అలంకరించుకుని ఎదురొచ్చి కాళ్ళు కడగబోతే – అతను నిరాకరించాడు. ఆమె అతన్ని పరిశీలనగా చూసి – "నామీద మీ కెందుకు కోపం వొచ్చింది? నేనేం తప్పు చేశాను? మా తండ్రికి వేరొక అల్లుడున్నట్లు సూచించారట. అది నా హృదయంలో శూలమే కదా.!మీరు వెళ్ళింది మొదలు నిద్రాహారాలు మాని మీకోసమే చింతిస్తున్నాను. తప్పుచూపి దండించండి. ఊరికే కోపగిస్తే నేనేం చెయ్యగలను? అని అడిగింది.

"సాధ్వీ! నువ్వు నన్ను మునుపెన్నడేనా చూశావా? నన్నెప్పుడు పెళ్ళాడావు? ఈ కల్పనలు నాకు పిచ్చెక్కిస్తున్నాయి. నువ్వు నన్నెరిగిన గుర్తులేమేనా ఉంటే చెప్పు"

"ఆపూరి సత్రంలో నా చిత్రం ఉన్నప్పుడు మీరు చేసిన చర్యలు గుర్తున్నాయా?" అని అడిగింది. అప్పుడు పిచ్చివాడిలా పలవరించిన సంగతి జ్ఞాపకం లేదా?... అంటూ వివాహం వరకూ గుర్తుచేసినా అతను తానవేవీ ఎరగననడంతో ... రతిక్రీడానంతరం అతను చదివిన పద్యం గుర్తు చేసింది.

అతను చెవులు మూసుకుని "శివశివా! నాకేమీ జ్ఞాపకం లేదు. నువ్వెవరో నేనెరగను. నన్ను వదిలి నీ శీలం కాపాడుకో" అన్నాడు. ఆమె ఏడుస్తూ అతని పాదాలమీద వాలిపోయింది. అప్పుడతను "నువ్వు నాకు తల్లివే కాని భార్యవికావు. మీరు తెలియక మోస పోతున్నారు. పరస్త్రీ సంగమ పాపానికి నేనొడిగట్టను..." అంటూ ఆమె పాదాలమీద పడ్డాడు.

ఆమె చెలికత్తెలు వచ్చి ఇతనికి మతి చలించి ఇలా అంటున్నాడు. చికిత్స చేయించాలి. నెమ్మదిగా అతనికే తెలుస్తుంది" అంటూ రాజుగారి కప్పగించారు. వైద్యులతన్ని పరీక్షించి కొందరు పైత్యవికారమనీ, కొందరు పిచ్చనీ, కొందరు పైశాచిక లక్షణమనీ అతనికి చికిత్సలు చేయసాగారు.

## బలభద్రుడి కథ

మధుమంతం నగరంలో ఆవేళ రాత్రి సత్రంలో బసచేసి ఉండగా విద్యార్థులు పలికిన మాటలు విని అనుమానం కలిగిన బలభద్రుడు - తనవారికి తెలియకుండా వారివెంట వెళ్ళి "రత్నమాల గురించి మీరనుకున్న సాంకేతిక మేమిటో చెప్పండి" అని అడిగాడు. "రాజుగారి సత్రానికి వెళ్తే తెలుస్తుంది" అన్నారు వాళ్ళు. అతనా సత్రానికి

వెళ్ళగా – అక్కడ తను కళలో పెళ్ళాడిన స్త్రీ చిత్రంపటం కనిపించి అతను దుఃఖించాడు.

కావలివా రతణ్ని రాజువద్దకు తీసుకు పోగా అతను వానిని రత్నమాల దగ్గరకి పంపాడు. విషయం తెలియగానే వారికి వివాహం చేశాడు. కొన్నాళ్ళు సుఖంగా గడిపాక తనవారి మాట జ్ఞాపకం వచ్చి – ఎవరికీ చెప్పకుండా వారిని వెదుక్కుంటూ వెళ్ళిపోయాడు. ఒకనాటి ప్రాతఃకాలానికి చంద్రకాంతపురం చేరుకున్నాడు" అక్కడ బలభద్రుడికి కొందరు స్త్రీలు సంభాషించుకోడం వినిపించింది.

"రాజుగారి కూతురుకి పెళ్ళి కాకుండానే కడుపయింది. కలలో ఎవడినో పెళ్ళాడిందట. వాడే వచ్చి ఆయన ప్రశ్నకు సమాధానమిచ్చాడట. పెళ్ళి కాకుండానే ఒకరాత్రి వాడితో భోగించిందట. వాడేమో చెప్పకుండా పారిపోయాడట. రాజుగారు కూతురిమాట నమ్మి ధర్మశాస్త్రం కనుక్కుంటున్నారట"

"అచిన్నది..నాడుసువర్ణరేఖ మహాపతివ్రత...సుగుణవతి.. సత్యసంధురాలు..."

ఆ మాటలన్నీ బలభద్రుని చెవినపడ్డాయి. అతను ఊళ్ళోకి వెళ్ళేటప్పటికి సువర్ణరేఖ సఖురాలు సునంద అతనిని కృష్ణుడనుకుని – "రాజపుత్రా! నన్నెరుగుదువా?" అని అడిగింది. ఎరుగననేసరికి – "ఎప్పుడేనా ఈ వూరు వచ్చావా? రాజుగారి ప్రశ్నకు జవాబు చెప్పావా, లేదా?" అంటూ ప్రశ్నలు కురిపించింది. అతను అవేవీతనకి తెలియవన్నాడు. ఆమె ఇంకా వొత్తిడి చేయబోతూంటే విదిలించుకుని మరోవీధిలోకి వెళ్ళిపోయాడు.

రాజు తనదూతలని పంపి అతని నా స్థానానికి రప్పించుకుని సత్కారం చేసి... "స్వదేశానికి వెళ్ళొచ్చావా? ఆనాడే రాజ్యంతో కూడా నా పుత్రికని నీ అధీనం చేశాను కదా. ఆ రాత్రే నీవామెను కలిసావట ఆమె నీకోసం ఎంతో పరితపిస్తోంది" అన్నాడు.

బలభద్రుడు నిట్టూర్పు విడిచి – "మీమాటలు వింటూంటే నాకు మతిపోతూంది. ఇందాక కూడా ఒకామె ఇలాగే అంది. నేనింతకు మునుపు ఈవూరురానేలేదు. మీ ప్రశ్నేమిటో నాకు తెలియనే తెలియదు" అనేసరికి సునంద మునుపు తాను గీసిన చిత్రపటం తెచ్చింది. ఆ చిత్రానికీ అతని రూపుకీ తేడా లేనే లేదు.

రాజు అనుమతితో అతన్ని అంతఃపురానికి తీసుకెళ్ళి సువర్ణలేఖకి చూపించింది. ఆమె అతన్ని తనభర్తనుకుని ఎన్నో గుర్తులు చెప్పింది. కానీ అతనేమీ మాట్లాడలేదు. అంతలో ఆమెకు ప్రసవవేదన ప్రారంభమయ్యేసరికి ఆ హడావుడిలో అతను తప్పించుకుని అవతలకి పోయాడు.

ఆ రాత్రి సత్రం అరుగుమీద కొందరు బ్రాహ్మణులు రాజకుమార్తె విషయమే మాట్లాడుకోసాగారు. "రాజుగారి కూతురు వివాహం కాకుండానే తల్లి అయిందట. ఆ సంతానానికి అధికారం ఉంటుందా అని శాస్త్రం చూడడానికి వచ్చాను. భరతుడే దీనికి ప్రమాణం. దీనిని గాంధర్వవివాహ మంటారు"

"ఇక్కడ భర్తెవరు? వాళ్ళు చెప్తున్న పురుషుడు తనకేమీ తెలియదంటున్నాడు"

"ముహూర్తం దూరంగా ఉండడం వల్ల ఈ లోపునే వధూవరులు కలుసుకున్నారనీ, అతను చెప్పకుండా వెళ్ళిపోయాడనీ... ఆమె గర్భవతి అయింది కనుక శాస్త్రం చూడవలసిందనీ రాశారు"

"అతనెందుకు పారిపోయాడు? ఆమే మయినా భూతమా?"

"రాజకుమార్తెకు కుమారుడు ఉదయించాడు. రెండు గడియలయింది.

ఆ మాటలు చెవిన పడిన బలభద్రుడు చాలా ఆశ్చర్యపోతూ ... 'ఆమె చాలా ఉత్తమురాలిలా ఉంది. నన్ను పోలినవాడెవడో అవన్నీ చేసి ఉంటాడు. కొంప తీసి కృష్ణుడు కాదుకద? ఆ రాత చూస్తే తెలుస్తుంది' అనుకున్నాడు.

రాజు మర్నాడు సభచేసి - అందరు చూస్తుండగా బలభద్రుడికి ఆ పత్రిక చూపించి - "అ సమాధానం నువ్వురాసింది కాదా?" అని అడిగాడు. "అయ్యో ఇది రాసింది మా తమ్ముడు కృష్ణుడు. నాపేరు బలభద్రుడు. మా ఇద్దరికీ భేదమే ఉండదు" అన్నాడు. " మీ తమ్ము డెక్కడున్నాడు?" అని రాజు అడగ్గా తమ వృత్తాంతమంతా చెప్పి తమ్ముణ్ణి వెదికి తీసుకొస్తానని శపథం చేశాడు. కొన్ని రోజులయ్యాక అతను భార్యని చూడదలచి మధుమంతం వెళ్ళాడు. అక్కడ రాజభటులతన్ని పట్టుకుని - "ఎంతమోసం చేశావు! నీ వల్ల మేము చెరసాలలో ఉండవలసి వచ్చింది. ఎందరి కళ్ళు కప్పి పారిపోయావు!" అంటూ చేతికిసంకెళ్ళు తగిలించారు. అతనెంత చెప్పినా వినిపించుకోకుండా కారాగారంలో ఉంచారు. వైద్యులొచ్చి - "ఎక్కడికి పారిపోయావ్?" అంటూ అడిగేసరి కతను - "రాజుగారి అల్లుడనేనా లెక్క చెయ్యడం లేదే! మామగారితో చెప్పి ఏం చేయిస్తానో చూడండి" అన్నాడు. "ఇప్పటికేనా రాజుగా రల్లుడివని ఒప్పుకున్నావు! నీ పిచ్చి కుదిరినట్లే. "అని అతని సంకె ళ్ళూడదీయించి సగౌరవంగా కొలువుకి తీసుకెళ్ళి అతని పిచ్చి పోగొట్టామని చెప్పగా రాజతన్ని - "నువ్వు నాకేమౌతావ్? నీ పూర్వ వృత్తాంతం స్ఫురణకి వచ్చిందా?" అని ప్రశ్నించాడు. అతను - "నన్నలా అడుగుతారేం? అల్లుడిననేనా చూడకుండా చెరసాల్లో పెట్టించారు! నేను మీ అమ్మాయి రత్నమాలను వివాహమాడానుగా? మీ అల్లుడ్నికాదూ? అని అన్నాడు. రాజతన్ని రత్నమాల అంతఃపురానికి పంపాడు.

తన భర్త పిచ్చిపోయి స్వస్థత చెందినందుకు కామె ఎంతో సంతోషిస్తూ అతని కాళ్ళు కడిగి సాదరంగా ఆహ్వానించింది. "ఇప్పటికేనా నా మీద కనికరించారు. మీ ఉన్మత్తత కుదరకపోతే ఏమౌదునో" అనే సరి కతను "మా సోదరుల మాట గుర్తుకొచ్చి నీకు చెప్పకుండా వెళ్ళిపోయాను. మళ్ళీ ఇదే రావడం. నేనేమిటో చేశానంటావేంటి?" అని నిర్బంధించడంతో ఆమె అక్కడ కృష్ణుడు చేసిన వన్నీ చెప్పింది. ''అయ్యో! నా వృత్తాంతం చెప్పినా మీరు నాకు పిచ్చెక్కిందనుకుంటున్నారు. జరిగింది చెబుతా విను. ఆవేళ తెల్లవారు

జామున మావాళ్ళు కనపడక – వెదుక్కుంటూ పోయాను. పదిరోజులు గడిచిపోయాక చంద్రకాంతం అనే పట్నం చేరాను. ఆ రాజు నన్ను తన అల్లుడనీ, అతని కూతురు నన్ను భర్త అనీ భావించారు. మా తమ్ముడు కృష్ణుడిగా నన్ను పొరపాటు పడ్డారని వాళ్ళకి తెలియజెప్పి ఇక్కడికి రాగా రాజభటులు నన్ను పట్టుకుని కారాగారంలో పడేశారు" అంటూ వివరించాడు.

మర్నాడు తండ్రిని పిలిపించి – బలభద్రుడి వృత్తాంతమంతా చెప్పి అన్నతమ్ము లిద్దరూ ఒకే పోలికలతో ఉండడం వల్ల ఏర్పడిన పరిస్థితులను విశదంగా చెప్పింది. రాజు ఆ రాజకుమారుల సుగుణాలని పొగిడాడు. ఆ వార్త నగరమంతా వ్యాపించి అద్భుతంగా చెప్పుకున్నారు. పిచ్చి కుదిర్చామన్న వైద్యులని పరిహసించారు.

కొన్ని రోజులున్నాక బలభద్రుడు వీరుడి వేషం ధరించి గుర్రమెక్కి సోదరులను వెదకడానికి వెళ్తూ ఒకనాటి సాయంకాలానికి విక్రమ నగరం చేరుకున్నాడు.

రాజభటులడ్డం వచ్చి – "అయ్యా! ఇప్పుడు మా రాజకుమారుడి వివాహం జరుగుతూంది. గుర్రం మీద వీధులలో వెళ్ళుటకు లేదు. పాదచారులై వెళ్ళగలరు" అన్నారు. కాని అతను వారి మాటలు లెక్కచెయ్యక ముందుకి సాగిపోయాడు. అతను రాజ బంధువేమో అనుకుని ఎవరూ అడ్డగించే సాహసం చెయ్యలేదు. కొంతదూరం వెళ్ళేసరికి అక్కడ కోలాహలంగా ఉంది. బలభద్రుడు ఆరాతీయగా అక్కడ బందీగా ఉన్న కృష్ణుడు చెరసాలనుంచి తప్పించుకు వచ్చాడని తెలిసింది.

అన్న తమ్ములిద్దరూ ఒకరి నొకరు గుర్తు పట్టారు. ఆనందంతో కౌగలించుకున్నారు. భటులను సంహరించగా మరికొంత సైన్యాన్ని పంపాడు రాజు. వారందరినీ అన్నదమ్ము లిద్దరూ చంపేశారు. చివరకు పెళ్ళికొడుకే యుద్ధభూమికి రాగా అతనిని పట్టుకుని కట్టేశారు. సుగుణసాగరుడు పట్టుబడి పోయాడన్న వార్త విని పెళ్ళికూతురే స్వయంగా యుద్ధానికి సిద్ధమైవచ్చింది.

ఆ పోరెంతకీ తెమలక పోవడంతో... "సాధ్వీమణీ! నీకీ విద్య మా గురువే నేర్పినట్లుంది. నీ గురువెవరు? మీ తండ్రెవరు?" అని అడిగాడు. ఆమె తాను సుభద్ర అని చెప్పి - వారిని తన అన్నలుగా గుర్తించింది. ముగ్గురూ ఒకరినొకరు కౌగలించుకుని... కలుసుకున్నందుకు ఆనందించారు. అన్నలడగ్గా సుభద్ర తన కథ ఇలా చెప్పింది. బ్రహ్మరాక్షసుడి చేతిలో పడడం... అతని కనుగ్రహం కలగడం... సుగుణసాగరుణ్ని రక్షించడం... అతను తనని పురుషుడిగా భావించి ఎక్కువ గౌరవించడం కోసం తనదేశం తీసుకురావడం...బ్రహ్మ రాక్షసి చేతిలో చనిపోయాడనుకున్న తమ కొడుకు తిరిగి తనవల్ల దక్కాడని సుగుణసాగరుడి తల్లితండ్రులకి తను దైవంలాగా తోచడం చెప్పింది. "కొన్నాళ్ళయ్యాక ఇక గుట్టు నిలవలేక నా వృత్తాంతమంతా రాజకుమారుడికి చెప్పి అతని అభిప్రాయం అడిగాను. అతనెంతో సంతోషించి తన తల్లితండ్రులకి చెప్పాడు. వారు మరింత సంతోషంతో వివాహ సన్నాహాలు చేశారు. వివాహం జరిగి నాలుగు రోజులైంది. దైవయోగం వల్ల మీరిక్కడికి వచ్చారు. దైవమాయని తెలుసుకోవడం ఎవరితరం కాదు. చిన్నతనం కొద్దీ తెలియక అలాంటి పనికి పూనుకున్నాం. అందుకు దైవం ఇన్ని చిత్రాల్ని చూపెట్టాడు" అంటూ ఆ కథంతా చెప్పింది.

సుగుణసాగరుణ్ణి బలభద్రుడూ, కృష్ణుడూ బంధవిముక్తుణ్ణి చేసి ఎంతో గౌరవించిం...తమ కథలు చెప్పారు. అతను వారిని తండ్రి వద్దకు తీసుకువెళ్ళి వృత్తాంతమంతా చెప్పాడు. సుభద్ర వల్లనే తమ కులం బలం కూడా నిలిచాయని అతను ఆమెను ఎంతగానో పొగిడాడు. వివాహ కార్యక్రమాల్లో మిగిలిన ఉత్సవాలను కూడా జరిపించి... బలభద్ర, కృష్ణుల భార్యలను కూడా అక్కడికి రప్పించారు. కొన్నాళ్ళక్కడ ఆనందంగా గడిపి - తమ తల్లితండ్రులు విచారిస్తూంటారని, సుగుణసాగరుడిని తోడు చేసుకుని చతురంగ బలాలతోనూ దేవదుర్గ పురానికి వెళ్ళారు.

బుధవర్మ పుత్రుల జాడ తెలియక చింత పడుతూ భార్యతో సహా, సదాశివయోగి అనే యతీశ్వరుడి వద్ద తత్వోపదేశం పొంది

వైరాగ్యంతో కాలక్షేపం చేస్తున్నాడు. తనబిడ్డలు ఘనవైభవంతో తిరిగివచ్చారని విని బ్రహ్మానందంతో వారికెదురు వెళ్ళాడు. వాళ్ళందరూ అతని పాదాల మీద పడి నమస్కరించారు.

గ్రామం విడచినది మొదలు అంతవరకు జరిగిన కథంతటినీ పూసగుచ్చినట్లు తల్లితండ్రులకే కాక పౌరులందరికీ కూడా చెప్పి దైవమాయ నెవరూ అతిక్రమించలేరని సిద్ధాంత పరిచారు..

బుధవర్మ తనకుమారుల చరిత్ర విని తన గురువైన సదా శివయోగిని రప్పించి పుత్రుల నతని పాదాల మీద పడవేసి " నా పుత్రులైన వీరు హరిహరశక్తి దేవతల తారతమ్యం తెలుసుకోవాలని నాకు తెలియకుండా తీర్థయాత్రలు చేశారు. తమకేమీ మహిమ కనపడలేదని దైవాన్ని నిందించారట. ఒకబిలంలో పడి...ముగ్గురూ మూడు వింతలు చూశారట. అదలా ఉండనివ్వండి. ప్రవాహంలో శంఖచక్రాలు ధరించిన వైష్ణవులు వేల కొద్దీ, పెనుగాలిలో త్రిశూలధారులైన మహేశ్వరు లసంఖ్యాకంగా కొట్టుకు పోవడమూ, మహాగ్నిజ్వాలలో మహాశక్తులు ముగ్గురూ బిడ్డలని చంకనపెట్టుకునీ కనిపించడంలో సాంకేతిక మేమిటో అర్థమేమిటో తెలియజెప్పండి" అని ప్రార్థించాడు. "యదార్థన్నన్వేషిస్తూన్న నీ పుత్రులందు భగవంతుడి కనుగ్రహం కలిగి సత్యం చూపించాడు. పరమాత్మ తత్వమే నిత్యమైనది. హరిహరాది రూప కల్పనలు యదార్థం కావు. మనుషులలాగే వారూ కాలన్ననుసరించి పోతారు. ప్రపంచం స్వప్నప్రాయమని తెలపడానికే వారికా విచిత్ర అనుభవాలు. నీ పుత్రులు కడుపవిత్రులు" అంటూ ఆ యోగివారికి అద్వైత తత్వమహత్యం ఉపదేశించాడు.

గోపా! నువ్వు చూసిన పాషాణపేటిక సుభద్రని కరుణించి రాక్షసుడిచ్చిన బ్రహ్మరాక్షసుడి భోజనపాత్ర. ఆనాడు శివ విష్ణు రాక్షసులు విసిరివేయగా ఇక్కడి కొచ్చి పడింది.కథఐపోయింది, పద.. బయలు దేరుదాం" అన్నాడు మణిసిద్ధుడు.



# కాశీ మజిలీ కథలు

## 35. వ మజిలీ

గోపాలుడు వింతలని చూసేందుకు అరణ్యంలోకి వెళ్ళి తిరుగుతూంటే రెండు బారల దంతం ఒకటి కనిపించింది. దానిని వాడు గదలా భుజం మీద వేసుకుని గురువుగారి దగ్గరకు వచ్చాడు. ఆయనకి నమస్కరించి ఆ దంతాన్నాయన ముందు పెట్టి – "అయ్యగారూ! ఇది కర్రకాదు. రాయి కాదు. లోహమూ కాదు. చూడబోతే యిది పంటిలా ఉంది. ఇంత దంతం కలిగిన ఆ జంతు వెంత ఉండి ఉండాలి? దీనికధేమిటో తెలుసుకోవాలని నాకేకాదు, మీకూ సరదాగానే ఉండి ఉంటుంది. మణి నడిగి నాకు చెప్పండి" అన్నారు. ఆ దంతాన్ని చూసి సిద్ధుడు కూడా చాలా ఆశ్చర్యపోయాడు భోజనం అయ్యాక ఒక చోట కూర్చుని మణిని పూజించి ఆదంతం వెనుక కథని చెప్పడం మొదలుపెట్టాడు. గోపాలుడు చెవులురిక్కించి వినసాగాడు.

## కీర్తికేతుని కథ

ఈ భూమిమీద సకల సంపదలూ కలిగి ఉజ్జయినీ పురం చాలా ప్రసిద్ధి చెందింది విక్రమార్కుడు పాలించిన రాజ్యం అది. అతని తరవాత మంత్రులు కీర్తికేతుడనే వానికి పట్టాభిషేకం చేశారు. అతనికి తండ్రి గుణాలేమీ రాలేదు పూర్వాచారాల నాక్షేపించేవాడు. సింహాసనం ఎక్కిన కొన్ని రోజులకి మంత్రులని పిలిచి – " మనదేశం వైశాల్యమెంత? ఆదాయమెంత? వ్యయమెంత? ఖజానాలో నిలవెంతుంది? మనం చెయ్యవలసిన పనులేమిటి? వివరంగా చెప్పండి" అన్నాడు. వాళ్ళు ఒకళ్ళతో ఒకళ్ళాలోచించుకుని – "మనదే శపటమిదుగో చాలా చిన్నది.

దేశంలో సగం అగ్రహారాలకీ, దేవాలయాలకీ, సత్రాలకీ చెందింది. మిగిలిన భూమినుంచి వచ్చే అదాయం స్వల్పం. ఖర్చుకి పరిమితి లేదు. ఆ మహారాజు గడియలోనే కోట్లకొద్దీ ధనం పంచిపెట్టేవాడు" అంటూ విక్రమార్కుడి దానగుణం చెప్పి – "ఇతర దేశాలలో స్థాపించిన సత్రాలకి కూడా మనం ధనం పంపుతూండాలి. దానశాసనా లివిగో. వీటిలో ఆ వివరాలున్నాయి" అన్నారు.

"మా తండ్రి అలా రాజ్యం చేశాడా! ఇదంతా మీ నిర్వాకమే అయివుంటుంది. ప్రభుత్వం నడిచేదేధనంతో! ధనం లేనిదే ఏం సాధ్యమౌతుంది? పరిపాలనంటే దానధర్మాలా! ఎవరేనా పొగిడేసరికి డబ్బిచ్చెయ్యడమే?... నేను మా తండ్రిలా స్తోత్రాల కుబ్బిపోను. ఐహిక సుఖం చెడగొట్టుకోడం నా ఉద్దేశం కాదు. మా తండ్రి వొట్టి వెర్రివాడు. కోశాగారమంతా కాళీ చేశాడు. బ్రాహ్మణులు ఏ వృత్తీ చెయ్యక దానధర్మాలనీ, దేవాలయాలనీ, సత్రాలనీ పీడించి డబ్బుచేసుకుంటారు. ఇక మీదట అవేవీ చెల్లవు. అగ్రహారాలకి కూడా పన్నులు కట్టవలసిందే. సత్కారాలు ఆపెయ్యండి. రేపటినుంచి కొత్త శాసనాలమలు పరచండి" అని ఆజ్ఞాపించి కీర్తికేతుడు అంతఃపురానికి వెళ్ళిపోయాడు.

తమకెంత మాత్రమూ ఇష్టంలేకున్నా మంత్రులు కొత్తశాసనాలని మర్నాటి నుంచే అమలులో పెట్టారు. ఆ వార్త దాసీద్వారా కీర్తికేతుడి పట్టమహిషి చారుమతికి చేరింది. ఆమె చాలా పరితపించి – "అయ్యో! దేవతల పూజలు జరగని రాజ్యం రాజ్యమా! మీ తండ్రి వంటి ఉత్తముడికి జన్మించిన మీలో ఈనికృష్టగుణాలెలా వచ్చాయి? మీరొక్కరే రాజ్యం చేస్తున్నారా? సత్రాలు, దేవాలయాలు మూయించారా! అగ్రహారాలకు పన్నులా! వొద్దు. ఈ పనులు మానిపించి..ధర్మకార్యాలు యధా ప్రకారం జరిపించేటట్లు చూడండి" అని భర్తని ప్రార్థించింది.

అందు కతను అంగీకరింపక – "నువ్వు నాకేమీ చెప్పకు. డబ్బులేనిదే ఏపనీ జరగదు" అనేశాడు. "పెరటిలో కల్పవృక్షం ఉంది మూడుతరాలదాకా అది కోరినంత ఇస్తుంది. దేవతాపూజలు మానిపించడం ఎందుకూ?"

"దానిని కొమ్ములుగా విరిచిదానం చేసే అవకాశం లేక మిగిల్చాడు కాబోలు నా తండ్రి ఆ ధనాన్ని రాజ్యాంగ విషయంలో వినియోగించాలి కాని దానధర్మాలకి కాదు. ఐనా ఆడవాళ్ళకి రాజ్యవ్యవహారాలేమిటి?" అని ఈసడించగా ఆమె తనని తాను నిందించుకుంటూ లోపలికి పోయింది కీర్తికేతుడు తన నివాసానికి వెళ్ళి పోయాడు

# విజయ భాస్కరుడి కథ

పదహారేళ్ళ వయసు కల ఆ బాలుడు బడినుంచి ఇంటికి వచ్చి ధ్యానంలో ఉన్న చారుమతిని చూసి – 'అమ్మా. నేను ప్రతిరోజూ బడినుంచి వచ్చేసరికి చేతులు చాచి ఎత్తుకుని ముద్దు పెట్టుకునేదానివి. ఇవాళేమీ అలా ఉండిపోయావు?" అని అడిగాడు. ఆమె అతన్ని దగ్గరగా తీసుకుని – 'ఏం చెప్పేదినాయనా? మీ తాత ఎంతో ప్రసిద్ధుడు. అటువంటి వాడి కడుపునపుట్టిన మీతండ్రి విపరీత మనస్తత్వం కలవాడయ్యాడే అని విచారిస్తున్నాను" అంటూ ఆ విషయమంతా చెప్పింది.

ధర్మశీలి అయిన ఆ బాలుడు అంతా విని – "అమ్మా! నేను కొంచెం పెద్దవాడి నయ్యాక మా తాతగారిలా చాలాపేరు సంపాదించి నీకు సంతోషం కలగచేస్తాను" అన్నాడు. ఆ మాటలకు తల్లి చాలా సంతోషించింది.

ఒక పక్క కీర్తికేతుడు కల్పవృక్షాన్ని ప్రార్థిస్తూ భాండాగారాన్ని నింపుతూంటే. .ప్రజల దీనమయిన మొరలు వినలేని చారుమతి ఖజానా నుంచి రహస్యంగా ధనం తీసుకుని కుమారునికిస్తూ పాఠశాలకి వెళ్ళేటప్పుడు నిరుపేదలకి పంచి పెట్టిస్తూండేది. అందుచేత రాజకుమారుడు బడికెళ్ళే దారిలో ఎప్పుడూ అనేకమంది దరిద్రులు మూగి ఉండేవారు. తల్లితో చెప్పీ చెప్పకా అతను దోసిళ్ళ కొద్దీ ధనం దానం చేస్తూంటే – చూసేవారు – విక్రమార్కుడి ఖ్యాతి ఇతనే నిలపగలడని పొగిడేవారు. క్రమంగా అతనికి వితరణ గుణం వ్యసనమైపోయి – బడి కూడా మానేసి. రహస్యంగా డబ్బు తెచ్చి పంచు 'ూండేవాడు

కొన్నాళ్ళు గడిచాక కీర్తికేతుడు బొక్కసంలో ద్రవ్యం తక్కువ తుండడం గమనించి కావలివాళ్ళని నిలదియ్యగా వారు నిజం చెప్పారు. 'తల్లి చెడు బోధవల్ల కదా ఇంటిదొంగ తయారయ్యాడు? ఆమెకు తగినశాస్తి చేస్తా'నని – విజయభాస్కరుడు దానమిచ్చే సమయానికి అక్కడికి వెళ్ళి – దానం తీసుకున్న వారినీ, ఇచ్చిన కొడుకునీ కూడా కింకరులచేత పట్టించి... ధారపోసిన ధనరాశిని చూస్తూ... 'ఇంత సొమ్ము ప్రతిరోజూ ప్రజలపాలు చేస్తున్న వీడు నాకు శత్రువు కాక కొడుకా? తండ్రి చెరిపిన రాజ్యాన్ని నిలబెట్టుకుంటున్నాననుకుంటూ సంతోషిస్తూ, ఈ నీచుడి పనులు గమనించలేక పోయాను. వీడి తల్లే వీడిచేత ఇలా చేయిస్తూంది. వీళ్ళు నా కాప్తులు కారు. వీళ్ళని శిక్షించాలి' అనుకుంటూ కొలువుకువచ్చి మంత్రులతో ఆలోచనలు జరుపుతూండగా –

అక్కడికి కొందరు వచ్చి "స్వామీ! నమస్కారం మేము కల్పవృక్షానికి కావలి వాళ్ళం. ఇంతకు మునుపే యువరాజుగారొచ్చి కల్పవృక్షానికి నమస్కరిస్తూ ఒక పద్యం చదివారు. దానితో ఆ వృక్షం రివ్వున ఆకాశానికెగిరి మాయమై పోయింది. దాని స్థానంలో గొయ్యి తప్ప మరేమీ లేదు" అన్నారు. ఆమాట వింటూనే – "క్రూరాత్ముడా! వంశనాశకా! ఎంత పని చేశావురా!" అంటూ కీర్తికేతుడు మూర్ఛ పోయాడు. అతను కల్పవృక్షంతో ఎన్నో లాభాలు పొందాలను కున్నాడు. అవన్నీ భంగంకావడంవల్ల అతనిశోకం అంతా ఇంతాకాదు.

తెలివిరాగానే ..., "నాకెంతో అపకారం చేసిన భార్యాపుత్రులని మహారణ్యానికి తీసుకుపోయి వధించిరండి. వాళ్ళ రక్తం కళ్ళచూసేవరకూ నేను భోజనం ముట్టను. నా ఆజ్ఞకి కొంచెమేనా వ్యతిరేకంగా జరిగిందో మిమ్మల్ని సకుటుంబంగా నాశనం చేస్తాను–" అని గదిలోకి వెళ్ళిపోయాడు.

భటులు అంతఃపురానికి వెళ్ళి కొడుకుతో ముచ్చట లాడుకుందున్న చారుమతితో రాజశాసనాన్ని చెప్పలేక చెప్పలేక చెప్పారు. "మంత్రులూ.. హితులూ పురోహితులూ.. ఎవరూ వారి మాట కద్దు చెప్పలేక పోయారమ్మా" అని తలవంచుకున్నారు. ఆ మాటలు విని చారుమతి మూర్ఛపోయింది. ఆమెను సేద తీర్చి ఆమె కుమారుడు వైరాగ్యాన్ని

కలిగించే శ్లోకాలు కొన్ని చెప్పాడు. ఆమె దుఃఖం తగ్గింది అర్ధరాత్రి ... ఎవరికీ తెలియకుండా... రాజభటులు వాళ్ళ నడవిలోకి తీసుకెళ్ళి రాజశాసనం పూర్తిగా చదివి వినిపించారు.

"నా ముద్దుల కొడుకు మరణం నేను నాకళ్ళతో చూడలేను. నన్ను ముందు వధించండి" అంటూ కొడుకు తలని ముద్దాడి "ఇదే చివరి ముద్దు నాయనా. నిన్ను చూసే భాగ్యం నాకిక లేదు. అయ్యో! నీసుగుణాలు మీ తండ్రి కెంత విపరీతంగా తోచాయి! మనం పూర్వ జన్మలో ఎంతో పాపం చేసి ఉంటాం. మీతాత ఉంటే నీ సుగుణాల కెంత మెచ్చుకునేవాడో. ఎంతగారాబం చేసేవాడో అని దుఃఖిస్తూంటే "కానున్నది కాకమానదు. విచారించకు..." అని తల్లికి ధైర్యం చెప్పి - "మీ కర్తవ్యం నెరవేర్చుకొండి" అని విజయభాస్కరుడు భటులకి చెప్పాడు.

"ముందు నన్ను చంపండి" అని తల చాపింది చారుమతి. వాళ్ళు కత్తులు తీసి నరక బోతూంటే - గాండ్రు మంటూ బెబ్బులి అరుపు వినిపించింది. వాళ్ళు అదిరి పడి అటూ ఇటూ చూసేంతలో ఆ బెబ్బులి వచ్చి వారి మీద పడింది రాజకుమారుడా పులిని బడితెతో మోదినా అతనిని పట్టించుకోక - వారిని చంపి ఎటోపోయింది. అప్పుడతను తల్లితో - "అమ్మా! ఈ చిత్రం చూశావా? మనల్ని చంపవలసిన - వారినే దేముడు చంపేశాడు! ఆయుశ్శేషం ఉంటే ఎవరూ ఏమీ చెయ్యలేదు" అన్నాడు. ఆమె అతని జ్ఞానానికి చాలా సంతోషించింది. అతను క్రూరమృగాల నుండి రక్షించుకుందుకు భటుడి కత్తొకటి తీసుకుని అడవిలో ఒక తోవన వెళ్ళసాగాడు మధ్యాహ్నం వరకూ నడచినా గ్రామమేదీ కనపడలేదు ఆకలి, దాహంతో తల్లి పడుతున్న అవస్థని చూసి పళ్ళుకోసుకొచ్చి తల్లికిచ్చి తానుకూడా తిన్నాడు అప్పుడామె - "నాయనా! నేనీరాత్రి ఇక్కడే ఉండిపోతాను ఏమృగమో తినేస్తుంది. దాంతో కష్టాలు గట్టెక్కుతాయి నువ్వు వేగంగా అడవి దాటి పోయి ఎక్కడేనా జీవించు గుణం కలవాడికి జీవనం దొరక్కమానదు. కలలోకూడా ఎవరికీ అపకారం తలపెట్టకు. భూతదయ కలిగి ఉండు. మీతాత చరిత్ర చదువుకో. నాకాళ్ళు బొబ్బలెక్కాయి. ఇంక నేనునడవలేను" అంది.

"అమ్మా నువ్వలా దీనంగా మాట్లాడకు. నేనుండగా నీకేంలోటు? ఇవాళ కాకపోతే రేపు ప్రయాణం చేద్దాం. కాకుంటే కొన్నాళ్ళిక్కడే ఉందాం" అంటూ తల్లిపాదాలొత్త సాగాడు. అతనిచేత ఉపచారాలు చేయించుకుంటున్నందు కామె విచారించింది.

ఎండ తగ్గగానే కొంత దూరం నడిచారు. చీకటి పడబోతూంటే అక్కడొక పొదరిల్లు బాగుచేసి దానిలో తన తల్లితో విశ్రమించాడు. ఆమె కొడుక్కి విక్రమార్కుడి కథలు చెబుతూ నిద్రపోయింది. రాజకుమారుడు మాత్రం నిద్రపోకుండా కాపలా కాయసాగాడు.

# పాతాళ గృహం కథ

అప్పుడు - కొందరు మనుష లా దారిన వస్తున్నట్లలికి డయింది. విజయభాస్కరుడు కదలకుండా అణగి ఉండి వాళ్ళని గమనించ సాగాడు. పదిమంది మనుషులు పన్నెండేళ్ళ పిల్లనెత్తుకుని ధనం సంచులు నెత్తిమీద పెట్టుకుని...అక్కడికి దగ్గరగా వచ్చి - "ఇదే ..ఇదే.." అన్నారు, మూటలు దింపుకుంటూ ఒక చెట్టు మొదలు నున్న తలుపులాగారు. ఆ మూటల్నీ, చిన్నదాన్నీ ఎత్తుకుని ఆ ద్వారంలోంచి లోపలికి పోయారు.

వీరు దొంగలు కావచ్చును. ఎవరి ఇల్లో దోచి ఉంటారు. ఆ గృహస్థుడెంత విచారిస్తున్నాడో? వీళ్ళు తలుపు తీస్తూ కొట్టిన అగ్గిరాయి వెలుగులో ఒకడి భుజంమీద నిద్రపోతున్న ఒక బాలిక ముఖం కనిపించింది. ఆమెవరో? పాపం-వీళ్ళగుట్టు తెలుసుకుందాం' అనుకుని ఆ చెట్టు దగ్గరగాపోయి ద్వారంలోంచి తొంగి చూశాడు. లోపలికి మెట్లు కనిపించాయి వెళ్దామనుకుంటూంటే వాళ్ళు వెనుతిరిగి వస్తున్నట్లు మాటలు వినపడ్డాయి అతను దాక్కున్నాడు. వాళ్ళంతా బయట కొచ్చారు కానీ బాలిక మాత్రంలేదు. తలుపులు వేస్తూ "కజ్జలముఖా! మన శక్తివంటి దేవ తెక్కడా ఉండదు దండం పెట్టుకెళ్ళామో కన్నం పారిందే. రాజుగారి కోటలో కన్న మెయ్యడమంటే సామాన్యమా! ఔ నౌరే ... ఆ పిల్ల ఎలా దొరికిందిరా నీకు?'

"లోహజంఘా ఇదీ శక్తి మహిమే రాజుగారి మంచంపక్క బంగారు ఉయ్యాలలో నిద్రపోతూందిరా మొన్న బలిస్తామని దండం పెట్టుకున్న మాట జ్ఞాపకం వచ్చి ఎత్తుకొచ్చేశాను తామ్రకేశుడేమో ఆ పిల్లని తనకొడుక్కి చేసుకుంటానంటున్నాడు అమ్మవారికి కోపంరాదూ?"

"ఇప్పుడే బలిచ్చేస్తే బాగుండేది మనం డబ్బు ఎత్తుకుని మళ్ళీ వచ్చేటప్పటికి అర్ధరాత్రవుతుంది సర్లే రాగానే బలిచ్చేస్తే సరి. ఎవరికీ ఎలా టూహలూ పుట్టవు' అన్నాడు.

ఆ మాటల ద్వారా విషయం కొంతవరకూ అర్థమైన విజయభాస్కరుడు ఆ బాలికను కాపాడాలని నిశ్చయించుకుని లోపలికి వెళ్ళాడు. అక్కడెన్నో గదులున్నాయి. అక్కడక్కడ బంగారం వెండీ, రత్నాలూ రాసులుగా పోయబడి ఉన్నాయి. అక్కడ రత్నాల కాంతులే దీపాల్లా వెలుగు నిస్తున్నాయి. లోపలిగదుల్లో చోరుల కుటుంబాలున్నట్లు అలికిడి వినపడింది. అతను నాలుగు మూలలా వెదుకుతూ అమ్మవారి ఆలయం గుర్తుపట్టి లోపలికి వెళ్ళాడు

అక్కడ - చూసేవారికి భయం పుట్టించే ఒకమహాశక్తి విగ్రహం ఉంది. ఆ ఆలయంలో మంటపంలో బంగారు గొలుసులతో పాదాలు కట్టివేయబడి . నేలమీద పరచిన రత్న కంబళిపై ఒక చక్కని చిన్నదిఉంది. అలాటి బాలికను బలితీసుకునే శక్తిమీద అతనికి గౌరవం నశించి కోపమొచ్చింది దేవికంఠం నరకడానికి కత్తి దూసాడు అప్పుడాదేవి.. "వద్దు వద్దు దేవతా ద్రోహం చెయ్యకు నీ సాహసానికి మెచ్చాను. ఇకపై బలు లంగీకరించక కందమూల ఫలాలే స్వీకరిస్తాను శాంతించు - " అంది

అతను కత్తి నేలమీద పారేసి చేతులు జోడించి - "త్రిలోక పూజ్యురాలవి నే నపరాధం చేశాను. దేవీ నిన్ను శిక్షించడానికి నేనెంతటి వాడిని? ఇకనుంచి బలులంగీకరించనని నాకు వరమివ్వు మృగమాంసం నీకు తగదు కదా" అన్నాడు.

"వరమిచ్చాను' అన్నమాట వినిపించి - ఖడ్గంతో ఆ బాలిక గొలుసులు తెంచి - వేగంగా తనతో రమ్మన్నాడు వాళ్ళు నేలమీదకి చేరేటప్పటికి తెల్లవారింది

ఆలోపల చారుమతి మేలుకొని కొడుకు కనిపించక భయపడుతూ నాలుగు వేపులా వెదుకుతూ బిగ్గరగా పిలవసాగింది. అతను ఆమెను కలుసుకున్నాడు. ఆమెకుదుదటపడి – "ఈ బాలికెవరు?" అని అడిగిం దాశ్చర్యంగా అతను జరిగినదంతా చెప్పాడు.

ఆమె – "అమ్మా నాపేరు కలభాషిణి. మహారాష్ట్ర దేశాధిపతి చంద్రగుప్త మహారాజు కూతుర్ని మా తల్లిపేరు సౌగంధిక. మా రాజధాని చంద్రప్రస్థం రాత్రి రత్నపు టుయ్యాలలో పడుకొన్నాను. ఇక్కడ కెలా వచ్చానో తెలియదు. మీ మాటలవల్ల దొంగలచే తీసుకు రాబడ్డానని తెలుస్తూంది. మీరెవరు?" అని అడిగింది.

"మేము మార్గస్తులం వీడు నా కొడుకు. నిన్ను నీ తల్లి తండ్రుల కప్పగిస్తాం. భయపడకు" అని ధైర్యం చెప్పింది. వాళ్ళు దొంగలు పోయిన దారి వదిలి దక్షిణ దిశగా నడవసాగారు కొన్ని రోజులు ప్రయాణం చేశాక మొదట కనపడిన ఒక పల్లెలోని వారిని చంద్రప్రస్థానికి మార్గంఅడిగి కొన్నాళ్ళకి ఆ పట్నం చేరారు.

అప్పటికి చాలా దూరం నడిచి రావడం వల్ల అలసి పోయారు. చీకటి కూడా పడుతోంది ఇక నడవలేక ఒక బ్రాహ్మణుని ఇంటి అరుగుమీద పడుకున్నారు విజయ భాస్కరుడు మాత్రం మేలుకుని ఉండి కాపలా కాయసాగాడు ఆ ఇంటి బ్రాహ్మణుడు, అతని భార్య ఇలా వాదించుకోసాగారు.

## నిగమశర్మ కథ

భార్య ఏమండీ మనకి డెబ్బయ్యేళ్ళు వొచ్చాయి. ఇంటినిండా సంతానం కనిపారేశాంఒక్కళ్ళకీ పెళ్ళి కాలేదు. ఇంట్లో ఏమీ లేదు. రోజు గడవడం కష్టంగాఉంది మీరు వీధిలోకి పోయి సంపాదించుకురాకుండా ఆడదానిలా నా ఎదురుగా కూర్చుని కబుర్లు చెప్తారు. కాపరం ఎలాగడుస్తుందీ?

బ్రాహ్మణుడు . నువ్వు కొడుకులనేమీ అనవు. ఎప్పుడూ నన్నే కొరుక్కుతింటావు ఒక్కడికీ చదువుసంధ్యలబ్బలేదు. ఊరిమీద పడి తిరుగుతారు. నేనేం చేసేది? ఒంటిరెక్కమీద ఎన్నాళ్ళీడ్చుకు రాగలను? తిండానికి తిండుంటేనూ పెళ్ళి మాట. నీ మూలంగానే వాళ్ళంతా నిర్భాగ్యులై పోయారు

భార్య : వాళ్ళని తిట్టడంకంటె మీకు మరేమీ చేతకాదు తెల్లారితే తద్దినం పిల్లకి పురిటిదినాలు చేతిలో ఒక్కకాసేనా లేదు. ఈ సంసారం ఎలా తరించాలో తెలియదు

బ్రాహ్మణుడు : నన్నేంచెయ్యమంటావు? నా శక్తికొద్దీ తిరిగి ముష్టెత్తు కొస్తూనే ఉన్నాను. ఒక్కడెంత మందిని పోషించగలడు? ఒకప్పుడంటే వితరణ గుణసాగరుడయిన విక్రమార్కమహారాజుగారుండే వారు కనక బాగుండేది. ఇప్పుడలా ఇచ్చేవారెవరూ లేరు.

భార్య : ఆయనకి పిల్లలు లేరా?

బ్రాహ్మణుడు : లేకేం! ఉన్నాడు – ఓ పరమనిర్భాగ్యుడు. ఆయన సంగతి తెలియక యాచించబోతే పట్టించి చెరసాలలో పెట్టించాడట. నేను వెళ్ళినా అంతే ఔతుంది భార్యపుత్రులు మంచివారనీ, దానగుణశీలురనీ ఆ పాపాత్ముడు వాళ్ళనే చంపించేశాడట. అంతలోభీ, దుర్మార్గుడూనూ!

ఆ మాటలు వింటున్న విజయభాస్కరుడు వాళ్ళ దారిద్ర్యానికి మిక్కిలి విచారించి – అయ్యో! ఆ చోరుల ఇళ్ళలోంచి కొంత ధనం తీసుకొచ్చుంటే బాగుండేది ఇప్పుడు వీళ్ళకి నేనేం సాయం చేయగల్ను? – అంటూ పరితపించాడు

మర్నాడు తల్లితో ఆ విషయం చెబుతూండగా – వీధిలో చాటింపు వినపడింది

"మా పట్నపు రాజుగారి కోటలో కొన్ని రోజుల కిందట దొంగలు పడి చాలా ధనంతో పాటు వారమ్మాయి పన్నెండేళ్ళ కలభాషిణిని కూడా ఎత్తుకు పోయారు ఆమెను తీసుకు రాగలిగిన వాడికి పుత్రికతో

పాటు రాజ్యం కూడా ఇస్తారు రాజుగారు” అంటూ చెప్పాడు తలారి విని చాటింపు విని అతను తల్లి అంగీకారం తీసుకుని ఆ బ్రాహ్మణుడి చెవిలో ఏదో చెప్పాడు.

అతనెంతో సంతోషించి రాజకుమారుడి ఔదార్యాన్ని పొగిడి పెద్దకొడుకుని పిలిచి ఏం చేయాలో చెప్పాడు నిగమశర్మ పేరుగల ఆ బ్రాహ్మణ కుమారుడు తండ్రి మాటలు విని ఎగిరి గంతులేసి - అప్పుడే మంచి దుస్తులు ధరించి “రాజపుత్రిక నొక పల్లకీ మీద కూర్చోబెట్టి విజయభాస్కరు డిచ్చిన కత్తిపట్టుకుని నడుస్తూ దొంగల్ని చంపి రాజపుత్రికని తెచ్చానంటూ గట్టిగా అరుస్తూ అందరికీ వింతగా కనిపిస్తూ చంద్రగుప్తుడి ఆ స్థానానికి వెళ్ళాడు.

చారులవల్ల ఆ విషయం విన్న మహారాజు అతనికెదురొచ్చి . పల్లకీలోని పుత్రికని కౌగలించుకుని పరామర్శించి అంతఃపురానికి పంపాడు. నిగమశర్మనెంతో గౌరవించి - “ విప్రకుమారా! నీపేరేమిటి? నివాసమెక్కడ? ఈ బాలికనెక్కడ చూశావు? దొంగలేమయ్యారు? దొంగిలించిన వస్తువులేమయ్యాయి? దొంగలనెలా ఓడించావు? అన్నీ చెప్పి నా కానందం కలగజెయ్యి” అన్నాడు రాజు.

“దేవా! నేను ఉత్తర దేశం నుంచి వస్తూంటే ఒక అరణ్యంలో కొందరు దొంగలు నాకెదురు పడ్డారు. వారిలో ఒకడు బాలికనెత్తుకుని ఉండగా మిగిలినవాళ్ళ నెత్తిమీద ధనం మూటలున్నాయి. వాళ్ళని చూసి నేనట్టహాసం చేస్తూ - “మీరెవరు? ఎక్కడికి పోతున్నారు? నిలవండి” అని గద్దించాను నా గద్దింపుకు వాళ్ళు జడిసి ఈ బాలికను దింపి - తలోదారికి పారిపోయారు. నేను బాలికనెత్తుకుని వచ్చాను. నాపేరు నిగమశర్మ. నాకాపరం ఈ పురమే” అన్నాడు.

రాజుకు అతని మాటలు సందేహాలు రేకెత్తించాయి. “అయ్యా! నీ కీఖడ్గమెక్కడిది? నువ్వు సాము చేయగలవా? కదురు తిప్పగలవా?” అని అడిగాడు. ఒకడిని చూసిపదిమంది దొంగలు పారిపోడమేమిటా అని

“సాము చేయలేనుకాని . జంధ్యం వడుకుతాను కనుక కదురుతిప్పగలను - ’ అన్నాడు నిగమశర్మ ’ ఆ దొంగలో ఒకడు బెదిరి ఈ కత్తిని పారేశాడు ’

రాజు నవ్వి "కదురంటే జంధ్యాల కదురే కాదు. బాకు. కత్తిమీద 'విక్రమాదిత్య' అని పేరుంది. ఇది దొంగల దగ్గరుండేది కాదు. దీని విషయం తెలుసుకుని తరవాత కబురు చేస్తాం. ఇప్పటికింటికి వెళ్ళండి" అంటూ కొంత పారితోషికం ఇచ్చి అతన్ని పంపేశాడు. అతను వీధిలో వస్తూంటే – "పిండాలు తినేవాడికి, ఇల్లిల్లూ తిరిగి ముష్టెత్తేవాడికి, సంతర్పణ నీళ్ళు మోసేవాడికి – ఎలాటి దశ పట్టింది! నిన్నకాక మొన్ననే సత్రంలో చూశాను" అని నలుగురూ అంటూంటే – సిగ్గుపడుతూ ఇల్లు చేరుకున్నాడు.

తల్లితండ్రులెదురొచ్చి.. "నాయనా! మాకేం తెచ్చావ్? రాజకుమార్తెతో నీ పెళ్ళెప్పుడు? నీకు పట్టాభిషేకం ఎప్పుడు చేస్తారు? నువ్వు పీటల మీదకూర్చుని నీ భార్యతో ఉండగా చూడాలని వేడుకగా ఉంది" అంటూంటే అతను వారిని లోపలకి తీసుకుపోయి రాజుగారిచ్చిన ధనం చూపించి– రాజుగారు నాతో గౌరవంగానే మాట్టాడారు. కాని... పిల్లనివ్వడానికెందుకో సందేహపడినట్లనిపించింది. నామాటలు కొంచెం తడబడ్డాయి. పిల్లనిచ్చేవాడైతే నన్ను భోజనం చేయకుండా వెళ్ళనిస్తాడా? రాజునిజం తెలుసుకుందుకు ప్రయత్నించక మానడు. మనగుట్టు తెలిస్తే ప్రమాదం. వీళ్ళని చూస్తే అనుమానిస్తాడు. రాజ్యలోభంతో వీరికి ఆశ పుట్టక మానదు. కనక మనం వీళ్ళని కడ తేరిస్తే రాజ్యలక్ష్మి మనని వరిస్తుంది. అందు కుపాయం ఆలోచించండి" అన్నాడు.

ఆ మాటలకు బ్రాహ్మణుడు చెవులు మూసుకుని – "శివశివా! ఎంత మాటన్నావురా? మన కుపకారం చేసిన వారికి ద్రోహమెలా తలపెట్టగలం? వారికి ఆశే ఉంటే మనకెందుకు చెబుతారు? నీ ఆలోచనకు నేనంగీకరించను" అన్నాడు.

అప్పుడా బ్రాహ్మణి. " ఏ సమయాని కే బుద్ధి పుడుతుందో ఎవరు చెప్పగలరు? వీళ్ళుంటే నిజం ఎప్పటికేనా తెలియక మానదు. మనపెరట్లో వున్న నూతిలో వీళ్ళని తోసేస్తే బ్రహ్మకేనా తెలియదు. రాజ్యలోభంతో ఎవరెవరు ఎంత పనులు చేశారో పురాణాల్లో, చదవలేదూ?" అంది – ఉపాయం చెబుతూ ఆ మాటలు వినిలేక బ్రాహ్మణు డెక్కడికో పోయాడు.

మర్నాటి సాయంత్రం బ్రాహ్మణి విజయభాస్కరుడిని పిలిచి – 'నాయనా అవతలిదొడ్డి నూతిలో చేదపడిపోయింది. తీసిపెడతావా? అని అడిగింది. అతనలాగే అనడంతో ఆమె అత న్నానూతి దగ్గరకి తీసుకు పోయింది అతను నూతిలోకి వొంగి చూస్తుండగా అతని రెండు పాదాలూ ఎత్తి నూతిలోకి తోసేసింది. అతని తల్లి వద్దకు వెళ్ళి – అమ్మా! మీ పిల్లవాడు చేద తీయబోయి కాలు జారినూతిలో పడిపోయాడు నాకేమీ తోచడంలేదు రా" అనే సరి కామె గుండెలు బాదుకుంటూ నూతి దగ్గర కొచ్చి లోపలికి చూస్తూంటే ఆమె పాదాలు పట్టుకుని నూతిలోకి తోసేసింది పెరటి తలుపు వేసేసి ఇక తను గుట్టు చెప్పేవారెవరూ లేరని కలభాషిణితో కూడా రాజ్యం తమకి అధీనమౌతుందనీ ఆనందిస్తూ తరవాత చేయదగిన పను లాలోచించసాగింది

రాజపుత్రుడు నూతిలో పడినాములగక ఒక మర్రిమొక్కను పట్టుకుని నూతిగోడను చేరి నిలబడి ఉన్నాడు. అంతలో – తన తల్లి పడిన సంగతి గ్రహించి ఆమెను పట్టుకుని లేవనెత్తి – "నువ్వేమీ భయపడకు. మనం రాజుతో నిజం చెబుతామని వీరిలా చేశారు. ఆయువుంటే ఎలాగేనా బతుకుతాం" అని ధైర్యం చెప్పాడు

నిగమశర్మని పంపివేసిన తరువాత చంద్రగుప్తుడు అంతః పురానికి వెళ్ళి కూతురిని పలకరించి – 'అమ్మా! దొంగలు నిన్నెక్కడికి తీసుకుపోయారు? ఎవరు విడిపించారు? నీ వెంట వచ్చిన బ్రాహ్మణ కుమారుడే నిన్ను విడిపించానంటున్నాడు నిజమేనా? అని అడిగేసరికి ఆమె ఆ తల్లీ కొడుకులగురించి చెప్పి – వారు తమ వివరాలు చెప్పలేదంది "ఆ బ్రాహ్మణులు వారిని మోసం చేసుంటా రనిపిస్తుంది. రేపు పొద్దున్న వారిల్లు పరీక్షించి వస్తాను" అన్నాడు రాజు.

ఉదయం మంత్రినీ సామంతులనీ పరివారాన్నీ వెంటబెట్టుకుని ఆ బ్రాహ్మణుడి ఇంటికి వెళ్ళగా తనకుమారుడికి పుత్రికనిచ్చే ఉద్దేశ్యంతో రాజు వచ్చాడని తలచి ... మాకు రాజ్యం వచ్చిన తరువాత మీకు చాలా ఉపకారం చేస్తాం – అంటూ యిరుగు పొరుగుల నుంచి బట్టలూ అలంకారాలూ అరువు తెచ్చుకుని అలంకరించుకుని కూర్చున్నారు. వాళ్ళు వచ్చి పిలిస్తే కాని ఎదురు పడకుండా బెట్టు చేయాలనుకున్నారు

నిగమశర్మని తీసుకు రమ్మని వారింటి ముందు నిలుచున్న రాజు పరిచారకుణ్ణి పంపాడు. బ్రాహ్మణి – "రాజు గారొచ్చి పిలిస్తే కాని అల్లుడు రాడట" అంది "పెళ్ళయ్యాక బెట్టుచెయ్యవచ్చు ఇప్పటికి రమ్మను లేకపోతే శిక్షిస్తానని చెప్పు' అని మళ్ళీ కబురు పంపించాడు రాజు. ఆ మాటలకు భయపడి పరుగెత్తు కొచ్చిన నిగమశర్మని మీ ఇంటికొక స్త్రీ, ఆమె కొడుకు వచ్చారట వారెక్కడున్నారు?" అని అడిగాడు. అతను తడబడుతూ "నాకు తెలియదు మా అమ్మ నడగండి" అన్నాడు. రాజు అడిగితే ఆమె తడబడుతూ – "వారెవరో మేమెరగం ' అంది. ఆతడబాటుని చూసి రాజనుమానించి వారింటిని శోధించగా నూతిలో నీటిపై ఇరువురి ముఖాలు కనిపించాయి. వారిని పైకి తీయించి – వీరెవరు? మీ నూతిలో ఎలా పడ్డారు?" అని అడిగాడు రాజు

బ్రాహ్మణి తనకి తెలియదంది

అప్పుడు రాజు అతనినే అడిగాడు ––మీరెవరు? ఇక్కడి కెప్పుడు వచ్చారు? మిమ్మల్నీ నూతిలో ఎవరు పడతోశారు? నిజం చెప్పు" అని అడిగాడు

అప్పటికే నిగమశర్మ, అతని తల్లి భయంతో వణికి పోతూంటే చూసి జాలిపడి "మేం మార్గస్థులం మమ్మల్నెవరూ తోయలేదు నేలజారి నేను పడగా నాకోసం ఆమె పడింది" అన్నాడు.

'మహారణ్యంలో కలభాషిణిని రక్షించినది నువ్వుకాదూ?"

"నాకా వృత్తాంతం కానీ కలభాషిణి కానీ తెలియదు."

రాజెన్నిసార్లడిగినా అతనంతే చెప్పాడు మర్నాడు విచారిస్తుండగా రాజు పరివారాలతో "అమ్మా కలభాషిణి తండ్రితో అంతా చెప్పింది కాబోలు అతను గుచ్చి గుచ్చి అడిగాడు. మనం నిజం చెబితే నిగమశర్మని పిల్లనివ్వకపోడమే కాక శిక్షిస్తాడు. వీరికి మనం ఉపకారం చేయదలచుకున్నాం. అపకారమెలా చేస్తాం? దోషం వారిది కాదు. దారిద్ర్యానిది. మనంఇక్కడుండకూడదు మరోవూరికి పోదాం. రాజుగారతనికేదేనా ఉపకారం చేస్తారు" అని అతను తల్లితో తెల్లవారు జామునే మరోవూరికి వెళ్ళి పోయాడు

కొద్దిరోజుల తరువాత నిగమశర్మ రాజువద్దకు వెళ్ళి – "దేవా నేను మీ పుత్రికను తెచ్చి అప్పగించాను. మీరు ప్రకటించిన ప్రకారం జరిపించాలి ప్రభువులే మాట తప్పితే ప్రజలేం చెయ్యగలరు? అన్నాడు అందుకు రాజు. 'నీ మాటలు అసందర్భంగాఉన్నాయి. ఒక్కడిని చూసి పదిమంది పారిపోవడం లోకవిరుద్ధం. అదీకాక మా అమ్మాయి తనని రక్షించినవాడివి నువ్వు కావంటూంది' అన్నాడు.

"నేను బ్రాహ్మణ పుత్రుడినని నన్ను పెళ్ళాడ్డాం ఇష్టంలేక అలా అంటూందేమో! ఆ చిన్న వాడిని మీరడిగారు కదా, అంగీకరించాడా?" అని ప్రశ్నించే సరికి రాజు తన కుమార్తె వద్దకు వెళ్ళి – జరిగింది చెప్పాడు "నేను నీతో అబద్ధమాడతానా తండ్రీ? ఆ తల్లీకొడుకులతో నాలుగు రోజులు ప్రయాణం చేశాను వారికి కల భూతదయ అపారం. ఆ ఇంటి బ్రాహ్మణుని దరిద్రం తీర్చడానికి ఏమైనా చేయాలని కొడుకు తల్లితో చెబుతూండగా నేను విన్నాను. తరవాత వారు కనపడలేదు" అందామె.

నిజం తెలుసుకోడానికి రాజు చారులను నియమించాడు. 'నేనామెకు తగనివాడినని రాజు తనకుమార్తె చేత అబద్ధాలాడిస్తున్నాడు" అని నిగమశర్మ ప్రచారం చేస్తుంటే ప్రజలు అది నమ్మి రాజుని నిందించ సాగారు. అది అలా ఉండగా.

ఆ రాత్రి తిరిగి వచ్చిన దొంగలకి బాలికజాడ కనపడలేదు. కనపడిన గుర్తులని చూసి – మన గుట్టు ఎవరికో తెలిసిపోయింది. ధనం ముట్టకుండా బాలికనే తీసకుపోయారంటే ఆ బాలిక బంధువై ఉంటాడు వాడిని అంతమొందిచక పోతే మనరహస్యం బయటపడిపోకమానదని – వారంతా భిక్షుకులవేషం వేసుకుని రాజధాని వీధుల్లో తిరుగుతూంటే – నిగమశర్మ దొంగలనుంచి కూతురిని తప్పించి తీసుకొచ్చినా రాజతని మాటప్రకారం ఆమెనూ అర్ధరాజ్యాన్నీ ఇవ్వకమాట తప్పాడు – అని ప్రజలనుకోడం విని – వారతని వద్దకు పోయి –

"రాజుగా రమ్మాయిని రక్షించితేగా రాజుమాటతప్పితే ఎందు కూరుకున్నావు?" అని అడిగారు.

'ఊరుకోలేదు. కొన్ని రోజులు చూస్తానంతే" అన్నాడతను. "ఆ దొంగల నివాసమేది? వారెక్కడ కనిపించారు?' అని వారడగ్గా "అది చాలా పెద్ద కథ నాకిప్పుడు చెప్పడానికి తీరుబడి లేదు' అంటూ అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు. తమగుట్టు తెలుసుకున్నది వాడే అని... వాడిని సకుటుంబంగా తీసుకు పోయి అమ్మవారికి బలివ్వాలని నిశ్చయించుకుని ఆరాత్రే వాళ్ళందరినీ ఎత్తుకుపోయి మహాశక్తి ముందుపడేసి– "ఓరీ మా గుట్టు తెలుసుకొని మా ఇంటనున్న చిన్న దాన్నెత్తుకు పోయావు. దేవత ఆహారం చెడగొట్టిన పాపం ఊరికే పోతుందా? మిమ్మల్నందరినీ బలిస్తున్నాం. మీ ఇష్టదైవాన్ని తలుచుకోండి" అని కత్తులెత్తే సరికి నిగమశర్మ గడగడ వణికిపోతూ – "నేనేమీ ఎరగను ఒక చిన్నవాడు ఆమెను మా ఇంటికి తీసుకొచ్చి రాజుగారి కప్పగించ మన్నాడు. ధనాశతో నేనే తీసుకువచ్చినట్లు బొంకాను. ఆమె తండ్రితో నిజం చెప్పడం వలన రాజుకి అనుమానం కలిగి నామాటలు నమ్మలేదు ఇది నిజం మేంనిరపరాధులం మమ్మల్ని చంపకండి రక్షించండి" అంటూ దీనంగా ప్రార్థించాడు.

అంతలో – "వద్దొద్దు. వీరిని చంపకండి నేనికనుంచి మాంసం స్వీకరింపను కందమూలాలే భుజిస్తాను. నా ఎదుట జీవహింస చేయకూడదు" అని మహాశక్తి కూడా పలికింది దొంగలు కత్తులు పడేసి – "మా తల్లికి దయకలిగి మీరు బతికి పోయారు. మిమ్మల్నిక్కడి నుంచి కదలనివ్వక పశువుల్లా కట్టేసి మేపుతూంటాం మంచి వాళ్ళని బాధించిన పాపం ఊరికే పోదు" అన్నారు

అంతవరకూ చెప్పి – తరువాత కథను మరుసటి మజిలీలో చెబుతానన్నాడు మణిసిద్ధుడు.



# కాశీ మజిలీ కథలు

## 36. వ మజిలీ

గోపాలా విజయభాస్కరుడు తల్లితో చంద్రప్రస్థనగరం వదిలి అరణ్య మార్గంలో నడిచి నడిచి కొన్నాళ్ళకి చిత్ర కూటమనే అగ్రహారం చేరుకున్నాడు. అక్కడ - విద్యాధికులయిన బ్రహ్మణులెందరో ఉన్నారు అలసి సొలసిన రాకుమారుడు ఒక ఇంటి వారిని ఆతిధ్యం కోరగా వారు ఆహ్వానించి, ఆదరించి చెరువు చూబెట్టడానికి తమ కొడుకు గుణసాగరుడనే వాడిని పంపారు.

చారుమతి నా ఇల్లాలు లోపలికి తీసుకెళ్ళి కూర్చో బెట్టింది. ఆమె అడగ్గా. "నా కెనమండుగురు మగపిల్లలు భర్త గ్రామాంతరం వెళ్ళారు తొందరలోనే వస్తారు. మాకు భిక్షమే వృత్తి, ఈ అగ్రహారంలో మేమే పేదవాళ్ళం. పూర్వం ఒకప్పుడు విక్రమార్క మహారాజు దేశాటనం చేస్తూ ఇక్కడికొచ్చి ఒక విప్రుడింట్లో భోంచేసి వారి ఆతిధ్యానికి సంతోషించి ఈ అగ్రహారం వారికిచ్చారు ఆ పుణ్యాత్ము డిచ్చిన వేళమంచిదై వూరు పెరిగింది. దీని పేరు చిత్రకూటం అంటారు' అంది ఆ ఇల్లాలు. స్నానంచేసి వచ్చి, తల్లితో భోంచేశాక రహస్యంగా "అమ్మా! ఈ అగ్రహారం మా తాత ఇచ్చిందేనట వీరి కుటుంబంమాత్రమే పేదదట నన్నుచెరువుకితీసుకెళ్ళిన గుణసాగరుడి కేడుగు రన్న దమ్ములట అన్న తమ్ములందరూ వాడిని కొడుతూంటారట మనతో వచ్చేస్తానంటున్నాడు మా తాతకి రాజ్యముంది కనక అగ్రహారం ఇచ్చాడు. నాకంతకంటె ఎక్కువివ్వాలనుంది. కాని డబ్బులేనివాడిని" అని విచారించాడు. "కాలమెప్పుడూ ఒకేలా ఉండిపోదు. నీకు మంచిరోజులు రాగానే వీరిని జ్ఞాపకం ఉంచుకుని ఉపకారం చేద్దువుగానిలే" అని తల్లి ఊరడించింది.

ఆ రాత్రి ఇంటియజమాని వచ్చి వారెవరని అడగ్గా .. ఇల్లాలు చెప్పింది "ఊళ్ళో అందరు భాగ్యవంతులుండగా మనమే కనపడ్డామా"

"పోన్లెండి ఇంతకంటె దరిద్రమేమీ రాదు. వీళ్ళు చాలా మంచివారు. ఔనూ...మీరు మధ్యాహ్నానికే వస్తానన్నారు కదా... రాలేదేం?"

"కొండవీటిలోనే ఉన్నాను. బయలుదేరబోతూండగా కొందరు రాజభటులు నవరత్నాలు పొదిగిన బంగారు విగ్రహాన్ని వాయిద్యంతో ఊరేగిస్తున్నారు అవింత చూస్తూ ఆగిపోయాను –' అన్నాడు, భర్త

"ఆ విగ్రహం వెనక కథేమిటో?" అని ఆ ఇల్లాలడగ్గా – అతను చెప్పడం మొదలు పెట్టాడు.

## చంద్రావలోకుడి కథ

ఇక్కడికి దగ్గరలోనే రత్నకూటమనే నగరముంది. దానిని చంద్రావలోకు డనే రాజు పాలించేవాడు. రూపంలో విద్యల్లో శౌర్యంలో అతనికి సాటిఎవరూ లేరు. అతనికి ఎక్కువ మంది భార్యలే ఉన్నా ఒక్కరూ అతని మనసును అర్థం చేసుకోలేకపోయారు. అదొక్కటే ఆ రాజుగారికి చింత.

అతనొకనాడు వేటకెళ్ళాడు కొన్నిజంతువులని సంహరించాక అతను గుర్రాన్నదిలించగా – అది అమితవేగంతో పరుగెత్తి అతన్ని మరో అరణ్యంలోకి తీసుకు పోయింది రాజు ఎలాగో ఆ గుర్రం మీద నిలవగలిగాడు అది ఆగిన కొంతసేపటికి కళ్ళు తెరవగా అక్కడ మనోహరమైన సరస్సొకటి కనిపించింది. అతను గుర్రానికి నీళ్ళు తాగించి తను స్నానం చేసి నీళ్ళు తాగి అలసట తీర్చుకుని చుట్టు పక్కల తిరుగుతూంటే ఒక చక్కని స్త్రీ కనిపించి అతనికి భావమోహం కలిగించింది. అత నామెను సమీపించి మృదువుగా పలకరించాడు. ఆమెకూడా అతని సౌందర్యానికి ముగ్ధురాలయినా .. నెమ్మదిగా అక్కడినుంచి తప్పుకోబోయింది. కాని అతను ఆ అరణ్యంలో ఒంటరిగా ఉన్న ఆమె వృత్తాంతం తెలుపమని కోరాడు

అతని మృదువైన మాట కామె చాలా సంతోషించి – "నేను మేనక అనే అప్సరస కూతుర్ని నా పేరు ఇందీవరప్రభ ఆ దేవకాంత నన్ను కని అడవిలో వదలి స్వర్గానికి వెళ్ళిపోయింది దేవవ్రతుడనే సిద్ధుడు నన్ను చూసి జాలిపడి తన ఆశ్రమానికి తీసుకుపోయి పెంచాడు ఇక్కడికి స్నానం చేద్దామని వచ్చాను. నన్ను పెంచిన సిద్ధుడి ఆశ్రమం ఇక్కడికి దగ్గరే' అంది

అతను ఆమెతో ఆశ్రమానికి వెళ్ళి సిద్ధుడికి మొక్కాడు. "రాజా ఏ ప్రాణికైనా మృత్యువంటే భయమే నీ శౌర్యాన్ని దీనజనరక్షణ కుపయోగించు. వేట వలన పాండు రాజెన్ని కష్టాలు పడ్డాడో తెలియదా? ప్రజలు సుఖపడేలా రాజ్యపాలన చెయ్యి" అంటూ హితోపదేశం చేసేసరికి రాజు అతను చెప్పినట్లే నడచుకుంటానని వాగ్దానం చేశాడు

" నువ్వు ప్రాణుల కభయమిచ్చావు కనుక నీమీద నాకు అనుగ్రహం కలిగింది. ఏదేనా వరం కోరుకో" అని అన్న సిద్ధుడితో – "ఇందీవరప్రభను నాకిచ్చి వివాహం చెయ్యండి. అంతకంటె నాకిం కే కోరికా లేదు" అని విన్నవించాడు రాజు స్నానం చేసి రమ్మని. . రాజు రాగానే ఆమెను అతని అధీనం చేశాడు సిద్ధుడు భార్యను గుర్రం మీదెక్కించుకుని తన రాజధానికి ప్రయాణమయ్యాడు. తోవలోనే చీకటి పడింది. ఒక చెట్టుక్రింద ఆగి ..అక్కడ పూలతోశయ్యను ఏర్పాటు చేసుకుంటూంటే పండు వెన్నెల పాలవెల్లిలావొచ్చివాలింది మనోహరమైన ఆ వెన్నెలరాత్రి కొత్త భార్యతో మనసు తీరా సుఖించి – ఉదయం వెళ్ళబోతూంటే

ఆ రావిచెట్టు మొదలు నుంచి ఒక కంచు కంఠం వినిపించింది. "ఓరీ! పాపాత్మా! నేను బేతాళుని ప్రధాన కింకరుడిని, జ్వాలాముఖుడనే బ్రహ్మరాక్షసుడిని ఈ రావిచెట్టు నా నివాసం దీని దగ్గరకి రావడానికి దేవతలే భయపడుతూంటారు అలాటిది – నువ్వు నా నివాసానికి రావడమే కాక స్త్రీతో సంగమించావు ఇంతకంటె అపరాధం ఉండదు.

రాత్రి నువ్వు చేసిన అవినయానికి ఫలంఅనుభవిస్తావు చూడు కామంతో కన్నుకానని నీ హృదయం ఛేదించి రక్తం తాగుతాను

రాజు గజగజ వణికిపోతూ "మహాత్మా. నేను తెలియక చేసిన తప్పు క్షమించు. నీ అతిధిగా వచ్చాను నిన్నే శరణు జొచ్చాను. అభయమిచ్చిన వాడందరికంటే అత్యధికుడని శాస్త్రాలు చెబుతాయి కదా. నువ్వేం కోరితే అది చేస్తాను నన్ననుగ్రహించు." అంటూ ఎన్నో విధాల ప్రార్ధించే సరికి బ్రహ్మరాక్షసుడు కొంచెం శాంతించి.

"రాజా! నీ వినయం మాకు అనుగ్రహం కలిగించింది. పదహారేళ్ళ వయసు కలిగి వివేకవంతుడైన బ్రాహ్మణ కుమారుణ్ని తీసుకురా. వాని చేతులు తల్లి, కాళ్ళు తండ్రి పట్టుకుని ఉండగా అతని శరీరం నరికి నా కర్పించాలి ఇది నేటి కిరవయ్యవ నాడు జరగాలి. తప్పావో, నిన్ను పుత్రమిత్ర కళత్రాదులతో సహా నాశనం చేస్తాను సుమీ! వేగంగా పో'. అని అంతర్ధానమైపోయాడు

అప్పుడా రాజు – 'అయ్యో! ఈ వేటకి నేనెందుకురావాలి? వచ్చానే అనుకో ఆ చిన్నదాన్నెందుకు చూడాలి? చూచినా కోరడ మెందుకు? కోరినా ఇంటికి పోయే లోగానే తొందరపడడ మెందుకు? పాండురాజులాగే శాపదగ్ధుడిని అయ్యాను కదా. రాక్షసుడు కోరిన బ్రాహ్మణకుమారుడు నాకెలా లభిస్తాడు? ఇది నా మరణానికే వచ్చింది. కానియ్. . ఏం చెయగలను?" అంటూ పరిపరివిధాల పశ్చాత్తాపపడుతూ భార్యతో గుర్రమెక్కి వేగంగా తన వూరు పోయాడు

నూతన వధువుతో వచ్చిన చంద్రావలోకుడిని చూసి మంత్రులు, పౌరులు, సామంతులు, మొదలైన వారు ఎంతో సంతోషిస్తూ సంబరాలు జరిపారు. కాని అవేవీ అతనికి సంతోషం కలిగించలేదు. మర్నాడు రాజు మంత్రులకి తన వృత్తాంతమంతా చెప్పి దుఃఖించగా వారిలో ఉన్న సుమతి అనే ప్రధాని రాజు నోదార్చుతూ. .

# హేమ విగ్రహం కథ

"దేవా. ధనానికి సాధ్యంకాని దేదీ ఉండదు. తగిన డబ్బు ఖర్చుపెడితే అలాటి బ్రాహ్మణ పుత్రులు వందమందిని తేవచ్చు" అంటూ రాజు అనుమతితో బంగారపు పనివారిని రప్పించి నూరు బారువుల బంగారంతో ఒక విగ్రహం చేయించి దానిలో నవరత్నాలు పొదిగింపజేశాడు. అ విగ్రహం చూసేవారి కళ్ళకి మిరుమిట్లు కలిగిస్తోంది

ఆ విగ్రహం కుడిచేతిలో ఒక దానపట్టా రాసి ఉంచారు. తనకుమారుణ్ని బ్రహ్మరాక్షసుడికి బలియిచ్చే వారికి నూరు గ్రామాలతో పాటు ఈ బంగారు విగ్రహాన్ని కూడా ఇవ్వగలమని వ్రాయబడిందా దానపట్టాలో దానిని అగ్రహారాల్లో ఊరేగించమని నియమించారు. ఆ మాటలే డప్పువాయిస్తూ చెబుతున్నాడు. నిన్న ఆ గ్రహారంలో ఇదంతా వినివచ్చాను అక్కడెవరూ తన కొడుకుని బలివ్వడాని కంగీకరించలేదు. మనవూరు రమ్మని చెప్పాను రేపిక్కడికి వస్తారు. నువ్వూ చూడొచ్చు" అన్నాడు భర్త

అప్పుడామె "మంత్రి ఆలోచన బాగానే ఉంది కాని డబ్బు కోసం ఎవరేనా కొడుకుని చంపుకుంటారా? ఏమో లోకంలో ఎలాటివారేనా ఉండొచ్చు" అంది

'ఒకమాట చెబుతాను కోపగించవు కదా?నా కరవయ్యేళ్ళు వచ్చాయి కాని సుఖమనే దెరగను. పాపం, నువ్వూ నాతోపాటే దరిద్రపుకాపరం చేస్తూ . సుఖపడిఎరగవు పుణ్యాత్ములంటే ధనవంతులే సుమా. నూరుగ్రామాలంటే ఈ రాజ్యంలో నాలుగోవంతు. అంత ఐశ్వర్యం పూర్వజన్మపుణ్యం కాకపోతే లభిస్తుందా? ఏమంటావు? ఆమె అతని ఉద్దేశ్యం అర్థంచేసుకోక – "నిజమే అంత భాగ్యం పట్టడం అరుదే" అంది "పుత్రుడంటే పూర్వ జన్మలోని శత్రువే ఇలా పుడుతూంటారు. అందులోనూ మన గుణసాగరుడిలాటివాడు పరమశత్రువు రామ రామ. ఒక్కముక్కైనా రాదుకదా? చెప్పుకుందుకు సిగ్గు . ' "అదివాడి కర్మ మనమేం చెయ్యగలం పోనీండి."

"అది కాదే. నా ఉద్దేశం నీకు అర్థంకాలేదూ? మనపశువుని వాళ్ళకిద్దామా అని.. "

"వాళ్ళకి కావలసింది మనిషి కదా? పశువు కాదుకదా?"

"పశువంటే మన గుణసాగరుడేనే "

"అయ్యో. అలా మాట్లాడ్డానికి మీకు నోరెలా వచ్చింది? దబ్బేం చేసుకుంటారు? ఎవరికోసం? ఎవరూ వినలేదు కదా '

తల్లితండ్రుల మాటలు విన్న గుణసాగరుడు ఏడుస్తూనే గడిపాడు రాత్రంతా తెల్ల వారాక విజయభాస్కరుణ్ని దూరంగా తీసుకుపోయి అంతా చెప్పి – "నన్ను బలవంతంగా చంపేస్తారు. నీతో నన్ను తీసుకుపో పారిపోదాం' అన్నాడు

"విచారించకు భయపడకు. నేను నీకు అభయమిచ్చాను కదా? నీ బదులు నేను బ్రహ్మరాక్షసుడి కాహారంఅవుతాను"

"ఎలాగైనా మా నాన్నమాటే చెల్లుతుంది నన్ను బలిస్తారు. నువ్వు మాత్రం నాలాటి వాడివి కావా? మీ తల్లి వింటే శోకించదా?"

నేను ఆడితప్పేవాడిని కాను. అంతకంటే ఏమీపాపం ఉండదు మాఅమ్మకీ విషయం చెప్పనే వద్దు. ఆ రాజుకి భూతదయ అనేది లేదు" అన్నాడు.

మర్నాడు ఆ సువర్ణవిగ్రహం అగ్రహారానికి రానేవచ్చింది. దేవభట్టు తనభార్యకి బంగారంతో చేసిన బొమ్మని చూపాడు. గుణసాగరుడు తండ్రితో విజయభాస్కరుడి మాటలు చెప్పి – "దీని వలన వచ్చే దాంట్లో సగభాగం నా కివ్వాలి" అన్నాడు విజయభాస్కరుడినే కొడుకుగా చూపించి . రాజభటులు చెప్పినట్లు వెళ్ళడానికి దేవభట్టు అంగీకరించాడు. రాజభటులు ఒడంబడిక పత్రికలు రాయించి పుచ్చుకున్నారు.

దేవభట్టు భార్య చారుమతిని మార్గాయాసం తీరేవరకూ తమయింట్లోనే ఉండమంది. వాళ్ళు హేమకూట నగరానికి బయలు

దేరుతూంటే – రాజధానికి వెళ్ళి వింతలు చూసొస్తానని రాజకుమారుడు కూడా బయలు దేరాడు. తల్లి వద్దన్నా ఎలాగో ఒప్పించాడు. ఆమె తనకొడుకు దుడుకువాడంటూ ఎన్నో జాగ్రత్తలు చెప్పి దేవభట్టు భార్య కప్పగించింది.

చంద్రావలోకుని ఆస్థానానికి వెళ్ళి దేవభట్టు తనని పరిచయం చేసుకుని – బాలుడిని చూపాడు. 'చక్రవర్తి కడుపున పుట్టించక పేద బ్రాహ్మణుడి ఇంట ఇలాటి వాడిని పుట్టించాడా దేముడు! ద్రవ్యంకోసం కదా ఇలాటి నీచానికి దిగజారారు!...' ఐనా నాకవన్నీ ఎందుకనుకుంటూ రాజు విజయభాస్కరుడికి స్నానం మొదలైనవి చేయించి...బ్రాహ్మణ దంపతులతో సహా రాక్షసుడివద్దకు ఏనుగు మీద తీసుకెళ్ళాడు. ఆ రావిచెట్టు మొదట్లో వేదిక, మంత్రాగ్ని ఏర్పాటు చేయగా రాక్షసుడు వచ్చి నిలబడ్డాడు

"మహాత్మా! మీతో చెప్పినట్లే తీసుకువచ్చాను. ఈ బాలుణ్ణి బలితీసుకుని నన్ను కృతార్థుణ్ని చేయండి" అంటూ రాజు జ్వాలాముఖికి వంగి నమస్కరించాడు. అతనంగీకారంగా తలవూపాడు. బ్రాహ్మణ దంపతులు ఆ బాలుడి చేతులు ఒకరూ పాదాలుఒకరు పట్టుకోగా రాజు కత్తితో నరక బోతూంటే – "ఆగు! వొద్దు" అని అరిచి – ఆపి... ఈ పిల్లాడి తల్లితండ్రులు వీరు కాదేమో అని అనుమానంగా ఉంది. కొడుకే అయితే వీళ్ళ ముఖాల్లో కొంచెమైనా విచారం కనిపించదేం?" అని అడిగాడు దేవభట్టు "మాకుమారుడే" అనడంలో తడబాటును గ్రహించిన జ్వాలాముఖుడు – "చిన్నవాడా! మరణసమయంలో అసత్యమాడితే ఉత్తమలోకాలు ప్రాప్తించవు. కనుక నిజం చెప్పు. నువ్వెవరి కొడుకువి? మీవారెవరు?" అంటూ బాలుణ్ణే అడిగాడు. "అబద్ధమాడవలసిన అవసరం నాకేమిటి? నేను కీర్తికేతుడనే రాజు కొడుకుని. మా తాతపేరు విక్రమార్కుడు. మాకాపరం ఉజ్జయిని. వీరు నన్నేమీ బలవంతం చెయ్యలేదు. నేను బుద్ధి పూర్వకంగానే అంగీకరించాను" అని అతను చెప్పగా –

'ఏమీ నువ్వు విక్రమార్కుడి మనవడివా ఎంతసుదినం. మా ప్రభువు భేతాళుడు మీ తాతకు కింకరుడే కనుక నేను నీకు దాసుడిని వీళ్ళు నిన్నెలా వెదికి తెచ్చారు? అబద్ధం చెప్పిన రాజు నిప్పుడే అంతమొందిస్తా' నంటూ జ్వాలాముఖుడు నాలుక చప్పరించగా –

రాజుకుమారుడు – " ఈ కపట మేమీ రాజెరుగడు ఈ దంపతులకి – భోజనం చేసిన విశ్వాసంతో నేనే బోధించాను. వీరి తప్పేమీలేదు మాకు పరమాప్తుడైన భేతాళుడికి మీరు సేవకులు. మీకోసం దేహం అర్పించడం మాకు సంతోషమే అన్నాడు

"నా దగ్గర అలాటి మాటలనకూడదు సాహస వితరణాదిగుణాల్లో నువ్వు మీ తాతను మించిపోయావు భూత దయాపరుడువి నీ గుణాల్ని మెచ్చి నీకు వరమివ్వాలను కుంటున్నాను. నీ కోరిక చెప్పు" అన్నాడు జ్వాలాముఖుడు

"స్వామీ నాకే కోరికా లేదు భూతదయని మించిన వ్రతం లేదు. మీరికనుండి జీవహింస చేయకుండా ఉండేవరం నాకోరిక" –అన్నాడు రాజకుమారుడు ఆ మాటలతో జ్వాలాముఖుడికి పూర్వజన్మ స్మృతి కలిగింది. 'పుత్రా. నువ్వు మహానుభావుడివి నీ దర్శనంతోనే నా పాపాలన్నీ పటాపంచలయ్యాయి ఇకనుంచి జీవహింస చెయ్యను. నీ పాదారేణువు నాశిరస్సుకి సోకించు శాపవిముక్తుడినై పవిత్రుడిని అవుతాను. అని. రాజపుత్రు డలా చేయగానే అంతర్ధానమైపోయాడు.

చంద్రావలోకుడు రాజపుత్రుణ్ని కౌగలించుకుని . "నువ్వు విక్రమార్కుడి మనవడివా నీ రూపం చూడగానే రాజపుత్రుడివేమో అని అనుమానం కలిగింది ఈ బ్రాహ్మణుడెంతమోసం చేశాడు. నీ వల్ల నాకు బ్రహ్మహత్యాపాతకం తప్పింది" అంటూ ప్రశంసిస్తూ ఏనుగెక్కించుకుని పట్నంలో తీసుకెళ్ళి పెద్ద ఉత్సవం చేశాడు తనని పునర్జన్మెత్తి నట్లుగా భావించి – విజయభాస్కరుడి కోరిక ప్రకారం దేవభట్టుకి నూరుగ్రామాలిచ్చి సగౌరవంగా అగ్రహారానికి పంపాడు రాజపుత్రుడికర్థరాజ్యం ఇస్తానన్నా అతనంగీకరించక తల్లిని చూడాలంటూ అగ్రహారం వెళ్ళిపోయాడు.

విజయభాస్కరరుడు రాజధానికి వెళ్ళాక ఇరుగుపొరుగువారు చారుమతి దగ్గరకు వచ్చి - ఆ ఇంటి వారు ధనాశకొద్దీ ఆమె కొడుకుని రాక్షసుడికి బలివ్వడానికి తీసుకెళ్ళిన వృత్తాంతం చెప్పారు. ఆమెవింటూనే మూర్ఛపోయి తెలివివచ్చాక ..'అయ్యో కుమారా. ఎంత మోసం చేశావు! నన్ను గడ్డం పట్టుకుని బతిమాలితే ఏమో అనుకున్నాను ఆ బ్రహ్మరాక్షసుడి కోరల్ని నీ సుకుమారమయిన శరీరం ఎలా ఓర్చగలదు?" అంటూ దుః ఖిస్తూంటే - "అమ్మా!" అంటూ వచ్చాడు కొడుకు

కొడుకుని చూసాక ఆమె ఆనందానికి హద్దులు లేవు. అతన్ని ముద్దుపెట్టుకుని - తన దుఃఖం చెప్పుకోగా అతను జరిగిందంతా చెప్పి - "విధిమరణం విధించితే ఎక్కడున్నా తప్పదు. లేకపోతే ఎక్కడున్నా భయంలేదు. ఇదే దేవరహస్యం. సరే మన వృత్తాంతం ఇక్కడందరికీ తెలిసిపోయింది ఇక మనంఇక్కడుండకూడదు" అంటూ దేవభట్టు తిరిగి వొచ్చేలోగానే వాళ్ళు మరోచోటికి బయలుదేరారు.

తోవలో ఆమె - "ఎన్ని కష్టాలేనా పడొచ్చుకానీ నడవడం మాత్రం చాలా కష్టం. ఎక్కడో ఒకచోట నివసిస్తూ పొట్టపోసుకోలేమా?" అంది అందుకతను "మంచిరాజుని చూసి కొలువులో చేరతాను అప్పుడు నీకు నడకుండదు" అన్నాడు పరిచారకుల సేవలందుకున్న నువ్వు చాలాకష్టమైన సేవకవృత్తి చెయ్యడమా అని విచారించిం దామె

కొన్నాళ్ళు ప్రయాణం చేసి వాళ్ళు శోభావతి అనే పట్నం చేరారు. అ ఘట్నపురాజు మంచివాడని తెలుసుకుని.. తల్లి అనుమతితో... తగిన వేషం ధరించి , మర్నాడతని ఆస్థానానికి వెళ్ళాడు. రాజతన్ని ఆశ్చర్యంగా చూసి.. 'నీవెవరి కుమారిడివి? నీ వాసమేది? ఇక్కడికి ఎందుకువచ్చావు?" అంటూ ప్రశ్నించాడు

"నేను క్షత్రియజాతి వాడిని. ఒక కారణం వల్ల తండ్రికి దూరమై తల్లితో వచ్చాను. నా పేరు విజయభాస్కరుడు. జీవనాధారం వెదుకుతూ వచ్చాను నీచపుపనులకి నాబుద్ధి అంగీకరింపదు మీరు మంచివారని విని వచ్చాను నెలకి నూరు మాడలిస్తే మీ కొలువులో ఉండి మీరు చెప్పిన పనులు నమ్మకంగా చేస్తాను" అన్నాడతను. రాజతని మాటలకి

సంతోషించి అప్పటికప్పుడే అధికార పత్రాన్నిచ్చి - చేయవలసిన పనులు మర్నాడు చెబుతానన్నాడు. అతనింటికి వెళ్ళి తల్లికి ఆసంగతి చెప్పాడు మర్నాటి నుంచీ సభకి వెళ్ళసాగాడు. రాజు అతని కే పని చెప్పడమో తేల్చుకోలేక - ఊరికే ఆ స్థానంలో కూర్చోమన్నాడు కొన్ని రోజులలాగడిచాయి

## మంజువాణి కథ

రాజు అతని ముఖలక్షణాలు పరీక్షిస్తూ - నమ్మకస్తుడూ, సత్యసంధుడూ అని నిశ్చయించి అంతఃపురాన్ని కాపుకాయ మని నియమించాడు. రాజపుత్రుడు రాజుచెప్పినట్లే కత్తిపట్టుకుని తిరుగుతూ రాత్రంతా అంతఃపురాన్ని రక్షిస్తూండేవాడు. అతని ఆజ్ఞా లేకుండా చీమైనా వెళ్ళడానికి వీల్లేదు.

ఆ రాజుగారి మూడోభార్య మంజువాణి సుముఖుడనే మంత్రిని వరించింది. రాజుగారొక్కక్క భార్య దగ్గరికీ మూడు రోజుల కొకసారి వెళ్తుంటారు. రాజుగారు రాని రాత్రులు సుముఖుడు రహస్యంగా మంజువాణి అంతఃపురానికి వెళ్ళేవాడు. కాని . రాజపుత్రుడు కాపుండడంతో మునపటిలా ఆమేడకి వెళ్ళడానికి వీలుపడడం లేదు. ఎప్పుడు చూసినా కత్తిపట్టుకుని అత నటూ ఇటూ తిరుగుతూనే ఉంటాడు.

చాలా ఆలోచించి.. ఒకనాడు మంత్రి దాసీవేషం వేసుకుని మొదటి జాము రాత్రిలోనే "నేను మంజువాణి స్నేహితురాలిని. ఆమె పుట్టింటికి వెళ్ళివచ్చాను. ఆమెతో కొన్ని వార్తలు చెప్పాలి.లోపలికి పోనివ్వండి" అంటూ వేడుకొని నిదర్శనంగా కొన్ని పత్రికలు చూపింది? అతను నమ్మి ఆమెను లోపలికి పోనిచ్చాడు మంత్రి ఆనందిస్తూ లోపలికి పోయి విరహవేదనతో బాధపడుతున్న మంజువాణికి తాను పడిన కష్టాలన్నీ చెబుతూ రాత్రి గడిపాడు. వేకువనే మారువేషంలో బయటకు పోడానికి రాజపుత్రు డంగీకరింపక - "సూర్యోదయం అయ్యాక కాని నిన్ను బయటకు పోనివ్వను" అన్నాడు అప్పుడామె మంజువాణికి చెప్పగా

ఆమెవచ్చి "నేను రాజపత్ని మంజువాణిని. నామాట కొంచెం పాటించు" అని మృదువుగా చెప్పగా అత నామెను వెళ్ళనిచ్చాడు.

మంజువాణి అతన్ని చూస్తూనే మోహించి - ఇంతటి రూపవంతుడిని సేవకుడిగా చేసిన దేవుడు నిందాపాత్రుడే ఇతన్ని చూసి ఏ స్త్రీ వ్యామోహం చెందదు! పాలకుండకు పిల్లిని కాపలా పెట్టినట్లు ఇలాటి అందగాడిని అంతఃపురానికి కాపుపెట్టిన రాజుకంటె మూర్ఖుడు మరెవడుంటాడు? - అనుకుంటూ ఓరచూపులతో అతన్ని చూస్తూ.. "నీవెవరికొడుకువి? పేరేమిటి? పెళ్ళయిందా? నీ భార్య నీ అందానికి తగినదేనా?" అంటూ అన్ని వివరాలూ అడిగింది.

అతను తలదించుకుని - "అమ్మా! నేనొక పేదకుటుంబంలో పుట్టిన వాడిని. విజయభాస్కరుడంటారు నేనే సేవకుడినై ఉండగా పెళ్ళి చేసుకుని భార్యనెలా పోషించగలను?" అన్నాడు.

అప్పుడు ఆమెనవ్వుతూ - "అయ్యో! అమ్మాఅని పిలవడానికి నేను పెద్ద వయసున్న దాన్నే మీకాను. రాజుగారి ముచ్చటగా మూడో భార్యని. నీకు పెళ్ళి కాలేదని విచారం కలుగుతూంది. నీ యౌవనాన్ని వృధా చేయడం న్యాయమేనా? సేవకుడివి కావడం వల్ల పెళ్ళిమానేశావా! అబద్ధం ఆడడం లేదుకదా? ఔన్లే! నీ అందానికి తగినది దొరక్క పెళ్ళిమానేసుంటావు" అంది అబద్ధం ఆడేవాణ్నికాదు. తెల్లవారింది. లోపలికి వెళ్ళండి" అన్నాడతను.

మరునాడు రాత్రి కూడా మంజువాణి అతన్ని ఎన్నోవిధాలుగా మోహపరవశుణ్ని చేయబోయింది. కాని అతను రవ్వంతకూడా చలించక ఆమెను లోపలికి వెళ్ళిపొమ్మన్నాడు ఆమె లోపలికి పోయి మదనమంజరిక అనే సఖురాలికి తన మనసులోని గాఢమైన కోరిక తెలిపి - "అతనికి సౌందర్యమే తప్ప రసికత లేదు. సిగ్గువిడచి వెల్లడించాను అయినా అతని హృదయం కరగలేదు. నువ్వు చాలా తెలివైనదానివి కదా! ఎలాగేనా అతన్ని నాకు సమకూర్చు" అని కోరింది.

"సఖీ! ఇంత బేలతన మెందుకు? మాటలకు వశంకాని వారు క్రియలకు లోబడతారు. తటాలున కౌగలించుకుంటే కాదనడాని

కతనేమైనా శుకుడా? భీష్ముడా? హనుమంతుడా?" అంటూ ఏం చెయ్యాలో ఉపదేశించిం దామె

మర్నాడు రాత్రి మంజువాణి చక్కగా అలంకరించుకుని - "నువ్వు చాలాదయాళువు అని అందరూ చెబుతున్నారు మదన బాధతో నీ పాదాలను శరణు వేడుతున్నాను. కౌగిలిచ్చి కాపాడు అతన్ని కౌగలించుకుంది.

అతను కౌగిలి విడిపించుకుని చాలా కోపంతో - 'ద్రోహురాలా! ఏం పనిచేశావు స్త్రీలకు శీలం లేకపోతే శిక్షార్హులు రాజు భార్యవై నీచకృత్యం తలపెట్టావు. నిన్ను శిక్షిస్తాను. చూడు" అని కత్తి దూసేసరికి-"చంపు నీ దయాగుణం అంతే అనుకుంటాను" అందామె

అతను కత్తి పారేసి - 'ఛీ! ఈ రాజు నన్ను తగని చోట నియమించాడు. ఇక్క దుండకూడదు" అని పోతూంటే మంజువాణి ఆ కత్తితీసుకుని అతనిమీదకి విసిరింది. ఆ కత్తి - రాజకుమారుడు ఏమరచి ఉంటే లోపలికి జారుకుందామని ఆడవేషంలో పొంచి ఉన్న మంత్రికి తగిలి అతని కంఠం నరికింది అది ఎరుగని రాజకుమారుడు తిన్నగా తనింటికి పోయాడు

జరిగింది దాసీవల్ల తెలుసుకున్న మంజువాణి భయపడుతూ ఆ ఆపద గట్టెక్కించమని మదనమంజరికని వేడుకొంది. ఆమె రాణి చేయవలసింది బోధించి తాను మంత్రి శవాన్ని మూటకట్టి తీసుకుపోయి కందకంలో పారేసింది తెల్లవారే సమయం అవుతూంటే మంజువాణి కేకలు వేస్తూ శరీరంగీరుకుని జుట్టువిరబోసుకుని ఏడవసాగింది అది విని రెండవ భార్య అంతఃపురం నుంచి రా జక్కడికి పరుగున వచ్చి ఆమె ఆకారాన్ని చూసి అదిరిపడి ఏం జరిగిం దని అడిగాడు.

మంజువాణి కొంతసేపు శోకం నటించి . 'పడుచు వాళ్ళని అంతఃపురంలో కాపుపెడతారా? అయ్యో. ఆ క్రూరాత్ముడేం చేశాడో చూశారా? మీరురాని సమయం చూసి దొంగలా వచ్చి ముచ్చటలాడుతూ నన్ను వలచానన్నాడు నేను భయపడి లోపలికి పోయేంతలో నా చెయ్యి

పట్టుకున్నాడు నా కేకలు విని సఖురాలు విడిపించింది అంతలో వాడు పారిపోయాడు. ఆ విషయం మంత్రికి చెప్పమని దాదిని పంపగా .. అతను లేచి వాడిని తరుముకు వెళ్ళాడు" అని చెప్పింది

రాజు కోపంతో మండిపడుతూ మదన మంజరిని అడగ్గా ఆమె కూడా అలాగే చెప్పింది. 'అత నుత్తముడని నమ్మడం నాదే తప్పు ఇప్పుడేం అనుకుని ఏం లాభం? అని రాజు విచారిస్తుంటే దాదివచ్చి – "మంత్రినెవరో చంపి కందకంలో పారేశారు" అని చెప్పింది

రాజుపోయి చూశాడు ఆ పని రాజపుత్రుడే చేసినట్లు నిశ్చయించిన రాజు తిన్నగా అత నింటికి వెళ్ళాడు

అదే సమయంలో – "అమ్మా. మనమిక్కడ ఉండరాదు. మరోదేశానికి పోదాం, రా ' అంటున్నాడు రాజకుమారుడు

"రాజు చాలా ధర్మాతుడని చెప్పేవాడివే. కొలువుమానే అవసరం ఏమొచ్చింది?" అడిగిందామె.

"అది నా ప్రారబ్ధం" అన్న రాజకుమారుడి మాటలు రాజు చెవినపడి అతన్నపరాధిగా నిర్ణయించి తటాలున లోపలికి పోయాడు. రాజకుమారుడు ఆశ్చర్యపడుతూ లేని నమస్కరించాడు

"నిన్ను మేంఅంతఃపురంలో కాపుపెట్టగా మా అనుమతి లేకుండా యిక్కడి కెందుకొచ్చావో చెప్పు" అడిగాడు రాజు

"నాదితప్పే శిక్షించండి" "నువ్వు చేసిన తప్పు అదొక్కటే కాదు.. చాలా ఉన్నాయి సభకిరా విచారణ జరువుతాను' అతను రాజువెంటనడిచాడు రాజతనికి మంత్రి శరీరాన్ని చూపించాడు." వీని నిలా ఎవరుచంపారో ఎరుగుదువా?"

"దేముడికే తెలియాలి." అప్పుడు మంజువాణి సఖురాలు మదనమంజరికను రప్పించి – "రాత్రి ఇతనేం చేశాడో చెప్పు" అని అడిగాడు. ఆమె వెనకటి కథే చెప్పింది రాజకుమారుడు మంజువాణిని

బలాత్కరించాడనీ. మంత్రికి చెప్పగా అతనిని నరికి కందకంలో పడేశాడట అని చెప్పింది.

రాజు. "దీనికేం చెబుతావ్?' అని అతన్నడిగాడు. 'యదార్థం చెప్పినా రాజు నమ్మడు. ఒకవేళ నమ్మితే – మంజువాణిని చంపేస్తాడు. భార్యా భర్తలకి వియోగం కలిగించిన వాడినౌతాను. స్త్రీలు ఎలాటి సాహసమైనా చేయగలరు" అనుకుంటూ మౌనంగా ఉండిపోయాడు. " ఈ అపరాధమూ, మంత్రిని హత్యా – నువ్వే చేశావా?" అని రాజు నిలదియ్యడంతో – "నేనే" అనేశాడు.

రాజతన్ని నానావిధాలుగా నిందించి.. అతనికేం శిక్ష విధించాలని సభనడిగాడు

"అతని శరీరం ముక్కలుగా నరికి ఉప్పుపాతర వేయాలి" అని చెప్పారు న్యాయశాస్త్రవేత్తలు. రాజు ఆలోచనలో పడ్డాడు. ఇతని ముఖంలో అపరాధ భావం ఎక్కడా కనిపించదు. ఉప్పుపాతరేస్తామన్నా ఉలికిపాటు లేదు. ఇతను దోషికా దేమో?" అనుకుని..ఉరిశిక్షకు బదులు ద్వీపాంతరవాస శిక్ష విధించి అంతఃపురానికి వెళ్ళిపోయాడు.

చారుమతి అలాటి అపవా దెందుకొచ్చిందని అడిగింది. "పూర్వజన్మ కృతం ఎవరెక్కడ ఏం అనుభవించాలో దానిని అనుభవింప జేస్తాడు దైవం నాకోసం చింతించకు నేను పోడాని కాజ్ఞ ఇవ్వు–" అన్నాడతను. రాజభటులతనికి సంకెళ్ళువేసి తీసుకుపోతూంటే ప్రజలు, అతనివద్ద నిత్యమూ సహాయం పొందే పేదలూ ఎంతో దుఃఖించారు.



# యశస్కరుడి కథ

రాజపుత్రుడికి అలాటి శిక్ష విధించినా యశస్కరుడు విచారంతో వేగిపోసాగాడు తనుచేసింది సరైంది కాదేమో అన్న అనుమానం అతన్ని దొలుస్తూంటే - ప్రజలు తనగురిం చేమనుకుంటున్నారో తెలుసుకుందామని మారువేషం వేసుకుని వీధుల్లో తిరగసాగాడు. అప్పుడొక ఇంట్లోంచి భార్యాభర్తల మధ్య జరుగుతున్న సంభాషణ వినపడింది.

భార్య · ఇందాకా శిక్ష పడిన చిన్నవాడిని చూశారా? ఎంత చక్కగా ఉన్నాడో. ద్వీపాంతరానికి తీసుకు పోతున్నారట కదా అక్కడ అతన్ని చంపుతారా ఏమిటి?

భర్త . వాడిని చూసి జాలిపడుతున్నావా! వాడు చేసిన దుర్మార్గానికి శిక్షచాలదనే నా అభిప్రాయం. ద్వీపాంతరంలో కొన్నాళ్ళువుంచి - తరువాత చంపేస్తారుట.

భార్య · అతనా నేరం చేసాడనే అనుకుంటున్నారా మీరు? లేదు. రాజు నిజం తెల్సుకోలేకపోయాడు.

భర్త · నీ మాటలాశ్చర్యంగా ఉన్నాయి. అబద్ధమని నువ్వెలా చెప్పగలవు?

భార్య నిజం దాగుతుందా? - ప్రధానికీ మంజువాణికీ అక్రమ సంబంధముందనే సంగతి మీకు మాత్రం తెలియదా?

భర్త నాకు తెలియదు. ఓహో! . . తరవాత?

భార్య అతను రావడం చూసి ఆ చిన్నవాడు మంత్రిని నరికి ఉంటాడు. ఆ పనిని ఇతనిమీద తోసేశారు కాకపోతే - ఇంటిదగ్గరున్న మంత్రెందుకు చావాలి? అదీకాక అపరాధం అంతఃపురంలో జరిగితే ఎక్కడో ఉన్న మంత్రికి కబురు చెయ్యడమేమిటి?

భర్త · నిజమే. ఇది అసందర్భంగానే ఉంది సుమా. కాని ఆ చిన్నవాడు నేరం చేసినట్టు ఒప్పేసుకున్నాడే

భార్య : అతను చాలాగుణవంతుడు. నాకొక ఆలోచన కలుగుతూంది. వాడు కడుచక్కని వాడు. రాజుగారి చిన్న భార్య వాడిని చూసి మోహించుంటుంది. వీడు సమ్మతించక పోడంతో ఇలా చేసుంటుంది.

భర్త : అబ్బా! ఎన్ని ఆలోచనలు చేస్తున్నావు! నీకు ధర్మాధికారమిస్తే బాగా తీర్పులు చెప్పేదానివి.

భార్య : ఆ అధికార మిప్పించి చూడండి. నిముషంలో నిజం చెప్పించకపోతే అడగండి.

భర్త : (పరిహాసంగా) రేపు రాజుతో చెబుతాలే. జీత మెంత కావాలి?

రాజాయిల్లు గుర్తు పెట్టుకుని మరోవీధికి పోయాడు.

చారుమతి – "ఇతరులని రక్షించడానికి తనప్రాణాలే విడుచువాడు మంత్రినెందుకు చంపుతాడు? స్త్రీలను కన్నతల్లుల్లా చూసేవాడు రాజపత్నిని కోరడమేమిటి? కలలో కూడా అబద్ధమాడనివాడు. దీనుల దైన్యం చూడలేనివాడు. అలాటి నా కొడుకుని...అతనేమిటో తెలుసుకోలేక కఠిన శిక్షకు గురిచేశాడు! కర్మసూత్రం ఎలాంటిది!" అని కొడుకు గురించి విచారించడం విన్నాడు.

మర్నాడు చారుమతి నివసించే ఇంటి యజమానిని సకుటుంబంగా పిలిపించి ఆ చిన్నవాడి గురించి వారికి తెలిసిన గుణాలు చెప్పమన్నాడు.

"వారి చర్యలు చూస్తే రాజకుటుంబంలోని వాళ్ళనిపిస్తారు. అతని సుగుణా లిన్నీ అన్నీ అని చెప్పలేం. జీతాన్ని అర్థులకి పంచిపెట్టడమే కాని తనకై వినియోగించుకునే వాడు కాదు. చీమను తొక్కినా బ్రహ్మహత్య చేసినంత బాధపడిపోయేవాడు. పరస్త్రీలను కన్నెత్తి చూసేవాడు కాదు అనడానికి నిదర్శనం – మా కుతుళ్ళూ కోడళ్ళూ అతన్ని అంధుడని పరిహాసం చేస్తూండడమే. సేవకవృత్తిలో ఉండడంవల్ల పేరు ప్రతిష్ఠలు రాలేదు కాని రాజ్యమే ఉంటే బలి, శిబి, విక్రమార్కులను మించిన ధర్మాత్ముడని ప్రసిద్ధి చెందేవాడే. అతని భూతదయ అపారం. ఏడాదిగా మేమతన్ని ఎరుగుదుం" అన్నారు వారు.

రాజెంతో పశ్చాత్తాపపడి వారిని పంపించి రాత్రి భర్తతో వాదించిన స్త్రీని పిలిపించి "అమ్మా! నిన్నరాత్రి నువ్వు నీ భర్తతో ఆడిన మాటలు విన్నాను నేను తప్పు శిక్షే విధించానా చిన్నవాడికి. నీకిప్పుడు దర్మాదికారమిస్తున్నాను. నిజానిజాలు తెలుసుకుని అపరాధులని దండించి నన్ను పాపం నుంచి తప్పించు. నిజంతేలిస్తే అతన్ని వెనక్కి రప్పిస్తాను" అన్నాడు.

ఆమె రాజుకి నమస్కరించి – "దేవా! ధర్మస్వరూపులైన మీకంటె ఎక్కువ దర్మ నిర్ణయం చేయగలనా? ఇంట్లో అనుకున్న మాటలకి సభలో స్థానమా! ఐనా మీరు నన్ను పెద్ద చేసి మన్నిస్తున్నారు కనుక నాశక్తిమేరకు ప్రయత్నించి నిజం తేలుస్తాను" అని అధికారపత్రిక తీసుకుంది.

ఆమె అప్పటికప్పుడే మంజువాణి అంతఃపురానికి వెళ్ళి గదులన్నీ వెదుకగా సుముఖుడు రాసిన ఉత్తరాలు లభించాయి. తరవాత మంజువాణిని తర్కపూర్వకంగా ప్రశ్నించే సరికి పరస్పరవిరుద్ధమైన విషయాలు బయటపడ్డాయి. తాను చెప్పింది తప్పని ఆమె చేతే ఒప్పించింది మదనమంజరికనీ, దాని చెల్లెలినీ తర్కించి సాక్ష్యం పుచ్చుకుంది. వాళ్ళొకరి మాటొకరికి సరిపడలేదు.

అందరిని రాజు ఎదుట హాజరు పరచి వారినోటనే నిజం, చెప్పించింది. అది విని రాజునేలకూలిపోయాడు "అయ్యో. దయాళువు ధర్మశీలి అయిన నీలాటి సజ్జనుడిని – నీచుడ్నై నేనెంత అగౌరవపరిచాను! నిన్నెన్ని విధాల నిందించాను. ఉరిశిక్ష విధిస్తానన్నా నీ ముఖంలో చిరునవ్వు మాయలేదు! నీలాటి ధర్మస్వరూపుణ్ని శిక్షించిన నేను మూఢుడ్ని. ద్రోహిని. క్రూరుణ్ని. పాపిని నా కీనరకం చాలదు. బలవంతంగా చనిపోతాను. నా కళేబరాన్ని గెద్దలు కూడా ముట్టవు. ఆ అధమురాలి నిప్పుడేం చేయాలో తోచడంలేదు, నువ్వప్పుడే నిజం చెబితే దానినుప్పు పాతర వేయించక పోదునా?..

అంటూ పిచ్చివాడిలా విలపిస్తూంటే – సామంతులందరూ అతని నోదారుస్తూ విజయభాస్కరుణ్ని తక్షణం తీసుకురమ్మని కొందరు రాజభటులని పంపి ఆవార్త రాజుకి చెప్పారు. రాజు క్రోధంతో

మంజువాణిని చంపించి ఉప్పుపాతరేయించి చారుమతి వద్దకు వెళ్ళి నమస్కరించి - అమ్మా నేను నీకుమారుణ్ణి నిష్కారణంగా శిక్షించిన పాపాత్ముణ్ణి నాతప్పులు మన్నించి నువ్వు నా ఇంటికి వచ్చి రక్షించు. నారాజ్యమంతా నీపుత్రునికిచ్చేశాను అతన్ని తీసుకురావడానికి దూతలతని పంపాను తొందరగానే వస్తాడు నీయిష్టమొచ్చినట్లు ధనం అర్హులకి పంచు నేను నీపాదసేవకుడినై ఉంటాను అని బతిమాలాడు

కుమారుడు వచ్చేవరకూ కోటలోనికి రాడానికి చారుమతి అంగీకరింపలేదు. విజయభాస్కరుడి రాకకోసం ఎదురుచూస్తున్న రాజువద్దకు దూతలువచ్చి - దేవా మేమాచిన్నవానిని ఓడెక్కించి ద్వీపాంతరానికి తీస్కుకుపోతూండగా సముద్రంలో ఒకచోట లోహ ధ్వజం బయటకు వచ్చింది. దానినిచూసి నావికులు తొందరపడుతూ-ఇప్పుడు గాలివాన వొస్తుంది పడవ లోహధ్వజానికి కొట్టుకుని మునిగి పోతుంది. ఎవరో ఒకరు బలిగా సముద్రంలో పడితే ప్రమాదం తప్పుతుంది. లేదా అందరం మరణిస్తాం - అన్నారు పరోపకార పరాయణులెవరేనా ఉంటే ముందుకి రండన్నారు ఎవరూ ముందుకి రాలేదు కాని ఆవార్త విన్న విజయభాస్కరుడు - మీరందరూ సంతోషంగా ఉండండి నేను సముద్రాలలో దూకి మిమ్మల్ని రక్షిస్తాను - అంటూ చేతులు జోడించి సముద్రంలో దుమికి మునిగిపోయాడు

అప్పటికి ఆ గాలివాన తేలిపోయింది కావలసిన కార్యం గంధర్వులే తీర్చారులే అనుకుంటూ మేము తిరిగివచ్చాం అని చెప్పారు

ఆ మాటలకి యశస్కరుడు గోరు చుట్టు మీద రోకటి పోటు పడ్డట్లే బాధపడుతూ - 'మేము పంపిన దూతలు మీకు కనపడలేదా?" అని అడిగాడు వారు లేదన్నారు రాజు శోకానికి మితిలేక పోయింది. మంత్రు లతనికి వైరాగ్యపు మాటలు చెప్పి శాంత పరిచారు. అతను చారుమతికి అత్యధిక ధనం పంపినా ఆమె తీసుకోకుండా కొడుకు రాకకోసం ఎదురుచూస్తూ కాలక్షేపం చేయసాగింది

రాజు 'విరక్తితో రోజులు గడుపుతూండగా ఒకనా డిద్దరు దూతలు ఏదో పత్రిక తీసుకొచ్చి ఇచ్చారు దానిలో - మహారాజా

నీకు లేకలేక ఒక పుత్రిక కలిగింది. దానికి పన్నెండేళ్ళ వయసులో దొంగలెత్తుకు పోయి అమ్మవారికి బలివ్వబోతూంటే - ఒక రాజకుమారుడు మావూరికి తీసుకొచ్చి ఓ బ్రాహ్మణు డింట్లో విడిచి వెళ్ళిపోయాడు, బ్రాహ్మణ కుమారుడు తానే మా బాలికను దొంగలనుంచి రక్షించాననీ తనకిచ్చి పెళ్ళిచేయమనీ కోరాడు. అతని మాటలలో అనుమానం కలిగి - ప్రతిజ్ఞ భంగమైనా, , నిజం తెలుసుకుందుకు నిరీక్షించసాగాను. అంతలో ఆ దొంగలతన్ని సకుటుంబంగా ఎక్కడికో తీసుకుపోయారు తండ్రిమాత్రం మిగలగా అతనొచ్చి నాకు నిజం చెప్పాడు. నేను సంతోషించి - ఆ చిన్నవాడి గుర్తులు చెప్పి వెదకి తీసుకురమ్మని అనేక దేశాలకు దూతల్ని పంపాను. వారిజాడేమీ ఇంతవరకూ తెలియరాలేదు.

ఆ చిన్నవాడు మీ ఆస్థానంలో కొలువు చేస్తున్నాడని తెలిసింది. మా అమ్మాయి కలభాషిణి వానినే కాని పెండ్లాడనని శపథం చేసుకుంది. అతని పేరు భాస్కరుడని విన్నాం. అతను సకల సుగుణాలకీ నిలయమని తెలిసింది అతను నా అల్లుడు కనుక ఈ పత్రికచూసిన తక్షణం వాని తల్లితో కూడా ఏనుగుమీద ఇక్కడికి పంపమని కోరుతున్నాను ఇట్లు విధేయుడు" అని ఉంది.

అది చదివేసరికి యశస్కరుడి బాధ మరీఎక్కువై పోయింది. 'అంత మంచివాడిని అలా శిక్షించాను. ఇప్పుడీ ఉత్తరానికేమని బదులిచ్చేది? ఈ విషయం వింటే కలభాషిణీ పెళ్ళాడదు. పురుషహత్య, స్త్రీహత్య, బ్రహ్మహత్య - మూడు చుట్టుకున్నాయి. ఇంకా బతకడ మెందుకు? - అనుకుని రాజ్యాన్ని మంత్రుల అధీనం చేసి తాను తీర్థాటనానికి .... పోయేడు. పత్రిక తెచ్చిన దూతలు భాస్కరుడి గురించి ప్రజల వలన తెలుసుకుని వెళ్ళి తమ రాజుకి చెప్పారు"

అప్పటికే వేళ దాటిపోవడం వల్ల తరవాత మజిలీలో మిగిలిన కద చెప్పాడు మణిసిద్ధుడు.



# కాశీ మజిలీ కథలు

## 37. వ మజిలీ

### హేమప్రభ కథ

పరోపకారం కోసం భాస్కరుడు సముద్రంలో కురికాక కొంతసేపటికి కళ్ళు తెరచిచూశాడు. మణులతో ప్రకాశిస్తున్న స్థంబాలున్న ఒక దివ్య మందిరంలో – కూరల తట్టలో ఉన్నట్లు గమనించి – లేచి నాలుగు మూలలా చూశాడు. ఇదేమిచోద్యం? నేను సముద్రంలో పడిములిగాను కదా. ఈ మందిరమేంటి? ఇంద్రజాలమా? కలా? ఇక్కడ చూస్తే స్వర్గంలా ఉంది. నేను చనిపోయి స్వర్గానికొచ్చానా? కాని నాదేహం పూర్వంలాగే ఉందే ఇక్కడి విశేషాలు చూద్దాం" అని ఆశ్చర్యపోతూ కొంతదూరం తిరిగాడు

ఎవరో భయంకరాకారంతో అటు రావడం కనిపించింది. దాని ముక్కూమొహమూ చాలా వికృతంగా ఉన్నాయి నోరు గుహలా తెరచుకుని ఉంది నాలుక మంటలా వేలాడుతూంది. చూడడానికి చాలా భయం కొల్పుతోంది పురాణాల్లో వర్ణించే రాక్షసస్త్రీలా ఉంది. స్వర్గంలో రాక్షసేమిటో? దీని కంట పడ్డానంటే కబళంలా నోట్లో వేసుకుంటుంది. దాక్కుంటాను–' అనుకుంటూ ఒక మూలన నక్కాడు.

ఆ రాక్షసి నిప్పులు క్రక్కుకుంటూ వచ్చి అక్కడొక పీఠం మీద కూర్చుని ' అయోముఖీ. ఎక్కడున్నావు? ఆహారం సిద్ధం చేశావా?" అని అడిగింది. అయోముఖి వచ్చి – అంతా సిద్ధం చేశాను. కానీ. . ' అని ఆగింది.

మనుష్యమాంసం వచ్చిందా? లోహధ్వజం విడవడం మరిచావా ఏం?"

"లోహధ్వజాన్ని ఎప్పటిలాగే వదిలాను ఇదివరకంతా వలలో చేపపడ్డట్లు కూరల తట్టలో శవం పడేది ఒక్కొక్కప్పుడు వేలకొద్దీ కూడా పడేవారు. దానిగురి తప్పిందేమో ఇవాళ మానవశవం పడనేలేదు."

"మయుడిచ్చిన వరం తప్పడమా. నువ్వేఏదో కపటం చేసుంటావు వెయ్యి సంవత్సరాలనుంచీ జరుగుతూ వొస్తున్నది ఇవాళెందుకు జరుగదు? నిజం చెప్పు "

"నేనేమీ ఎరుగను" అని ప్రమాణం చేసిం దయోముఖి. అప్పుడా రాక్షసి – "శూలనఖను రమ్మను" అంది. ఆమె దానిని తీసుకువచ్చాక – "నువ్వెళ్ళి నా మనమరాలిని తీసుకురా" అంది. అది వెళ్ళొచ్చి – "ఆమె ఉద్యానవనంలో సఖులతో ఆడుతోంది. నా మాటలు వినిపించుకోలేదు గట్టిగా పిలిచానని సఖులచే మొత్తించింది ' అంది. "వృద్ధుల మాటలు పిల్లలు వినిపించుకోరుకదా. పెంచానన్న విశ్వాసమేనా లేదు నా మాటకు దేవేంద్రుడు సైతం భయపడతాడు. నా ఆహారం గురించి కూడా పట్టించుకోదు. అయోముఖీ. నువ్వేనా వెళ్ళి దాని పెట్టెలో నాజాతకముండే పుస్తకం ఉంటుంది తెస్తావా?" అని అడిగింది ఆ రాక్షసి అది వెళ్ళొచ్చి 'అక్కా! ఇప్పుడు మనహేమప్రభ పెళ్ళాట లాడుతూ మాట్లాడింది కాదు. వేళదాటిపోతూంది. నువ్వు భోంచెయ్ తరవాత తీసుకొస్తాను" అంది రాక్షసి భుజిస్తూంటే – "అమ్మా! హేమప్రభకి మంచి వయసువచ్చింది వివాహం చెయ్యలేదేమిటీ? సఖురాళ్ళకి వధూవరుల వేషాలేసి వివాహం చేస్తూ ముచ్చటగా పాడుతూంది ఇదే మంచి సమయం. తల్లివేనా తండ్రివేనా నువ్వే కదా ఆమెకి? అంది.

అప్పుడు రాక్షసి ఇలా అంది "ఏ పనిలోనూ అదినాతో కలసిరాదు ఎప్పుడూ రాక్షసజాతిని నిందిస్తుంది మనుషులనో దేవతలనో పెళ్ళాడుతుందట మనుషులు మన కాహారం, దేవతలు మనకి శత్రువులు అని ఎంత చెప్పినా వినిపించుకోదు లేకపోతే ఈపాటికి ఒక గొప్ప రాక్షసుడికి కట్టబెట్టుండకపోదునా? దాని కర్మం అలా ఉంది పెంచిన ప్రేమ కొద్దీ విచారించడం . చిన్న కళ్ళు . చిన్నముక్కు . చిన్ననోరు .. చిన్న పళ్ళు కలిగి మనుషు లేమందంగా ఉంటారో తెలియదు–"

"నీ మనవరాలు మనుషులని పోలిందేం? నాకూతురికీ ఈపాడుపోలికే వచ్చింది అది విద్యాదరుణ్ణి వరించి దీన్ని కంది అంచేత దేవతల పోలిక వచ్చింది కాని నేను బతికుండగా ఇతర జాతివారికిచ్చి పెళ్ళి చెయ్యను అప్పుడు పరిచారిక లామెను తీసుకుపోయి శయ్యమీద పడుకోబెట్టాడు అప్పుడు ఆమె చెప్పగా అయోముఖి వెళ్ళి ఆ చిన్నదాన్ని బతిమాలి ఆ పుస్తకం తెచ్చింది

జ్వాలాముఖి పడుకుని ' ఈ జాతకాన్ని నాకు మయుడు రాసిచ్చాడు దాని ప్రకారం ఫలాలు కనపడుతున్నాయి నవగ్రహాల దశలు నాకిరవై సార్లు తిరిగాయి వీటినొక సారి చక్కగా చదివివినిపించు" అంది ఆమెకు దృష్టి ఆనదనీ – హేమప్రభకి తప్ప మరెవరికీ ఆభాష తెలియదని చెప్పడంతో ఆమె హేమప్రభను పిలవగా హేమప్రభ కాంతిమంజరి అనే సఖిని పంపింది

ఆమె ఆపుస్తకంలోని పలాలని వరసగా చదివింది అది కావించిన కోట్లకొలదీ జీవహింసలు అప్పుడు తెలిశాం ౨ అంతేకాక లోహధ్వజం వలన వచ్చిన మానవుడు తనకి కనపడినప్పుడు మరణం సంభవిస్తుందని తెలిసింది దానితో హడిలిపోయి ఈ అనుమానంతోనే నేను జాతకం తెమ్మన్నాను నాకు మరణం రానున్నది కాబోలు నన్నెలా కాపాడతా వయోముఖీ? కాంతిమంజరీ ఇకచాలు, నువ్వుపోయి మా హేమప్రభనిటు రమ్మను" అంది దుఃఖిస్తూ 'లోహధ్వజం వల్ల వచ్చిన మానవుడు కనపడినప్పుడు కదా నువ్వు భయపడవలసింది? ఇప్పు డలాటివాడు రాందే చింతదేనికీ? అదెప్పుడో తప్ప ఇప్పుడు కాదు ' అని ఓదార్చింది కాంతిమంజరి

రహస్య స్థలంలో ఉండి అదంతా విన్న విజయభాస్కరుడికి అది స్వర్గంకాదని మయుడు సముద్ర మధ్యంలో ఈ గృహం నిర్మించి దీని కిచ్చాడనీ తెలిసింది ఎన్ని కోట్ల జీవులనో పొట్టబెట్టుకున్న ఈ రాక్షసి తనకి మారకం వచ్చిందని ఎంత ఏడుస్తూందో ఆ ప్రాణాలు తన ప్రాణంలాటివి కావు కాబోలు ఇప్పు డిది నిద్రపోతూంది. పరిచారికలు దూరంగా పోయారు దీన్ని చంపితే లోకోపకారం అవుతుంది కాని,

సాధనం ఏదీ కనిపించడం లేదే మందిరం నాలుగుమూలలా తిరిగి చూద్దాం - అని వెళ్ళగా వంటశాల కనిపించింది. దానిలో మాంసం రక్తం అంటుకున్న కత్తిఒకటి కనిపించింది.

దానిని పట్టుకుని అతను మళ్ళీ రాక్షసి పడుకున్న మందిరం లోకి వచ్చి - "పాపాత్మురాలా దయలేకుండా కోట్లకొద్దీ ప్రాణాలని ఈ కత్తితో తీసుకున్నావు ఇప్పుడీ కత్తి నీపాలిటి కూడా మృత్యువే! లే లే" అంటూ అది లేచి చూసేంతలో దాని తలను నరికేసి శరీరంనుంచి వేరు చేశాడు తరవాత ఆ గదికి గొళ్ళెంపెట్టి అక్కడి విశేషాలు చూస్తూ పోతూండగా ఒకచోట పార్వతీదేవి మందిరం కన్నులపండగ్గా కనిపించింది అతనాశ్చర్యపోతూ ఆ దేవికి మొక్కి స్తుతిస్తూంటే ఎవరో వస్తున్న అలికిడై ఒక మూల దాగున్నాడు

అప్పు డమ్మవారి పక్కనున్న కవాటం తెరచుకుని ఒకచక్కని చిన్నది సఖులతో కూడి అక్కడికి వచ్చి సంగీతం మేళవించి అమ్మవారిని కీర్తిస్తూ చక్కగా పాడింది.

తరువాత కాంతిమంజరి లేచి - "కాత్యాయనీ మహాదేవీ. ఎన్నాళ్ళనుంచో నా సఖురాలు నీ పాదసేవ చేస్తూంది ఎప్పటికి నీ కనుగ్రహం కలిగి దానికి తగిన మగడిని కూర్చెదవో కదా" అని ప్రార్థించింది. అందుకు హేమప్రభ - "సఖీ. మా రాక్షసి బతికుండగా నాకు వివాహం కాదు వెర్రిపడకు" అంది. 'అన్నట్లు ఇందాక మీ అవ్వ నాచేత జాతకం చదివించుకుని మారకం వచ్చిందని విచారిస్తూ నిన్ను తీసుకురమ్మంది. "పాపం వెళ్ళిచూద్దామా?పద" అంటూ కదిలిం దామె.

ఆమెను చూసి రాజకుమారుడు మోహపరవశుడయ్యాడు. ఆమె అంగీకరిస్తే పెళ్ళి చేసుకుని గృహస్థ జీవితం గడుపుతాను . అనుకున్నాడు మనసులో.

హేమప్రభ సఖులతో వెళ్ళి - చచ్చివున్న రాక్షసిని చూసి - ఇంక నాకు దిక్కెవరు? ఎలా బతుకుతాను? ఏం చేయగలను?' అంటూ శోకించింది.

పాపం నిన్ను చూపించమని అడిగింది తనకి మరణం సమీపించిందని తెలుసును సుమీ! దీని నిలా నరికిన వారెవరో తెలుసుకోవాలి మననేం చేస్తారో? హేమా నువ్వు ధైర్యంగా ఉండి, ఏం చెయ్యాలో ఆలోచించు అంది కాంతిమంజరి ఆమె చెప్పడంతో – రాక్షసిని చంపిన వారికోసం వాళ్ళు నాలుగు మూలలా వెతకసాగారు ఆ మాటలు విని భాస్కరుడు అమ్మవారి చాటుకు పోయి దాక్కున్నాడు

తరవాత పక్కనున్న గుమ్మం తెరుచుకుని ఉద్యానవనంలోకి వెళ్ళాడు ఆ ఉద్యానవనం చాలా అందంగా ఉంది ఎన్నోరకాల మొక్కలూ తీగెలూ పూలతో అద్భుతంగా ఉంది అతనక్కడ విహరిస్తూంటే హేమప్రభ సఖులతో స్నానం చేయడాని కొక సరస్సుకొచ్చి ఆ ప్రాంతంలో రాజకుమారుణ్ని చూసి సంతోషం, ఆశ్చర్యం విచారం అన్నిటికీ లోనయింది " ఆ చెట్టు దగ్గర పువ్వులు కోస్తున్న పురుషుణ్ణి చూశావా? వసంతుడే అయివుంటాడు నువ్వెళ్ళి అతని వృత్తాంతం కనుక్కురా' అని కాంతిమంజరిని పంపింది.

ఆమె అతని వద్దకు వెళ్ళి నమస్కరించి – ు కు స్వాగతం నువ్వు మన్మధుడివా? జయంతుడివా? ఈ రహస్య గృహా, కెలా వచ్చావు? నీపేరేమిటి?" అని అడిగింది అతను ఆ ప్రశ్నలన్నిటికీ జవాబులు చెప్పాడు "వృద్ధరాక్షసిని సంహరించింది నువ్వేనా?" అని ఆమె అడగ్గా అతనొప్పుకున్నాడు లోక కంటకురాలు కనుక చంపానన్నాడు

ఆమె హేమప్రభవద్దకు పోయి – అంతా చెప్పి .' విక్రమార్కుడి మనవ డితను ధర్మాత్ముడు సాహసి, వితరణపరుడూ అయిన విక్రమార్కుడు దేవతలకి కూడా ఆశ్చర్యం కలిగించేవాడు – ఇతనిపేరు విజయభాస్కరుడు అతిచక్కనివాడు లోహధ్వజం వల్ల ఇక్కడికి రప్పించబడ్డాడు అన్నట్లు మీ అవ్వ జాతకంలో ఆమెకు కుమారుడే నీకు మనోహరు డౌతాడని ఇందాకే చదివాను అది ఆమెకు చెప్పకుండా దాటించాననుకో బ్రహ్మనీ కోసమే ఇతని నిక్కడికి తీసుకువచ్చాడని పిస్తూంది" అంది హేమప్రభ నవ్వుతూ – 'నీకానమ్మకముంటే కార్యం సానుకూలం చెయ్యి' అంది కాంతిమంజరి ఆమెను వెంటపెట్టుకుని అతని దగ్గరకి వెళ్ళి అత న్నామెకు పరిచయం చేసి –

ఈమె హేమప్రభ విద్యాధర చక్రవర్తి అయిన విశ్వావసుని మనమరాలు దేవవ్రతుడి కూతురు. తల్లిని బట్టి రాక్షస జాతికి చెందినా దీని గుణాలలాంటివి కావు నువ్వు పూజనీయుడివి కనక మాగృహానికి రావాలి' అంది వారిద్దరిచేతా ఒకరి కొకరికి దండలు వేయించింది సఖులు పూలుజల్లుతూ వధూవరుల నాశీర్వదించారు. వారి వివాహపద్ధతి అదే అని చెప్పారు అదే సమయంలో చెట్లనుంచి పూలు వారిమీద అక్షతల్లా పడ్డాయి. వాళ్ళిద్దరినీ ఏకాంతానికి వదిలి సఖులందరూ వెళ్ళిపోయారు

కొన్ని రోజులు ఆనందంగా గడిపాక - 'నేనెన్నాళ్ళిలా ఊరికే ఉండేది? భూలోకానికెళ్ళే తోవ చూపిస్తానని రోజూ ఊరిస్తున్నావు నాతల్లి నాకోసం ఎంత బెంగపెట్టుకుందో ఆమెను చూడాలికదా' అన్నాడు భాస్కరుడు హేమప్రభ నవ్వుతూ - 'నాతల్లిమాత్రం అలాగకాదా? నిష్కారణంగా దానినెందుకు చంపావ్?' అంది నీ తల్లి లోకకంటకు రాలని'

"పరిహాసాలకేంగాని నాకు మాలోకాని కెళ్ళే మార్గం చెప్పు" అని వత్తిడి చేశాడతను.

ఒకరో జతని కొక రత్న కంకణంఇచ్చి సరస్సు వద్దకు తీసుకెళ్ళి "ఎక్కడికి పోవాలో మనసులో తలుచుకుంటూ దీనిలో మునుగు. అక్కడికి వెళ్తావు అలాగే ఈ కంకణం చేతిలో ఉంచుకుని ఇక్కడికి రావాలనుకుని ఏ చెరువులో మునిగినా నువ్వు ఇక్కడి కొస్తావు. ఈ కంకణం మరిచి పోకుసుమా మీ తల్లిని చూసి వారంలోపుగా రాకపోతే నేనే విరహంతో బాధపడతాను" అంటూ ముద్దు పెట్టుకుని సాగనంపింది అతను కొన్ని రత్నాలు మూటకట్టుకుని - శోభావతీ పురానికి వెళ్ళాలని తలుచుకుని చెరువులో మునిగి లేచేసరికి . . ఆ పట్నం కన్నులపండగ్గా కనిపించింది యశస్కరుడి గురించి వాకబు చేయగా తనకోసం పశ్చాత్తాప పడుతూ విరక్తితో తీర్థాటనానికి వెళ్ళిపోయినట్లు తెలిసింది. తల్లికోసం వెళ్ళగా పుత్రశోకంతో మనసు చెదిరి ఎక్కడికో వెళ్ళిపోయిందని తెలియవచ్చింది రాజకుమారుడు చాలా విచారిస్తూ వారి జాడతెలుసుకోవాలని వూళ్ళు తిరిగి తిరిగి ఒకనాడు సాయంకాలానికి కలభాషిణి ఉన్న చంద్రప్రస్థపురం చేరుకుని అక్కడ ఒక దేవాలయంలో పడుకుని దీర్ఘంగా ఆలోచించ సాగాడు

# కలభాషిణి కథ

అంతలో అక్కడికి ఒక స్త్రీ వచ్చి అతని వీపు తడుతూ - "మదనకేతనా. లే లే రాజపుత్రికని గోడదాటించి వచ్చాను మేము శ్రీశైలానికి పోతున్నాం నువ్వు మమ్మల్ని పై మజిలీలో కలుసుకో. పని సక్రమంగా చేసినందుకు నాకివ్వవలసిన పారితోషికం తీసుకురావాలి సుమీ నిలవడానికి వ్యవధి లేదు పోతున్నాను' అంటూ వెళ్ళిపోయింది "కలభాషిణి ఒక్కతెనే నిలబెట్టాను" అంది వెళ్ళిపోతూ

భాస్కరుడికాశ్చర్యంవేసింది ఇదెవరో? నన్ను చూసి మదన కేతను డనుకుని మాట్లాడింది వాళ్ళకేదో సంకేతముంది కాబోలు రాజపుత్రికను గోడ దాటించి వచ్చానంది బహుశా జారకృత్యమేమో! లోకంలో వింతలకి కొదువేమిటి? అనుకుంటూ అక్కడే పడుకున్నాడు

అప్పుడు మరొక యువకుడు తన స్నేహితుడితో ఆ ప్రాంతంలో తిరుగుతూ - "ఆ దాసీముండమాటవిని ఈ అర్ధరాత్రి పాడు దేవాలయానికి వచ్చి మోసపోయాం పాదరక్షలయినా వేసుకోలేదు. ఈ గడ్డిలో ఏ పామయినా కరిస్తే సరదా తీరిపోతుంది. ఇకరాదు పోదాంపద అదీకాక రాజపుత్రికకి ఎల్లుండి వివాహ మహోత్సవమట. నువ్వు దాసిదాని మాట ఎలా నమ్మావు?" అన్నాడు

"నీకు నేనంతా చెప్పలేదు. ఈ రాజపుత్రిక కలభాషిణి సౌందర్యం ఇంతని చెప్పడం నాకే కాదు నన్ను పుట్టించిన బ్రహ్మాతరం కూడా కాదు ఆమె ఉద్యాన వనానికి వెళ్తొంటే చూశానంతే అప్పటినుంచి నా అవస్థ చెప్పడానికి శక్యంకాదు. ఆ చిన్నదానికి పూబోడి అనే దాసుంది నేను దాని నాశ్రయించాను అది ఆమెకు ప్రాణసఖురాలు నానుంచి చాలా లంచం తిని ఆమెతో నన్ను జతపరుస్తానని సంవత్సరం నుంచీ ఊహల్లో తిప్పుతూంది

కలభాషణి వెనుకటి వృత్తాంతం నువ్వు వినే ఉంటావు ఆమె వరించిన చిన్నవాడు సముద్రంలో పడ్డట్లు కబురు తెల్పింది. మహారాజు మరో సంబంధం కుదుర్చుతానన్నా ఆమె ఇష్టపడలేదట ఇప్పుడు బలవంతంగా పెళ్ళి చేయడానికి నిశ్చయించారట. ఆ సంగతి తెలిసి

ఆమె పూబోడితో రహస్యంగా శ్రీశైలం వెళ్ళిపోడానికి నిశ్చయించుకుని – ఈరాత్రే ప్రయాణం పెట్టుకుందట. వెళ్ళేటప్పుడు నాకు వచ్చి చెబుతానంది దాసి అందుచేత ఎలాగేనా రాక మానదు. కొంచెంసే పొగు. నేను దానికి మంచి కాను కిస్తానన్నాను'

"మదనకేతనా! నువ్వు వెర్రిగా ఆలోచిస్తున్నట్లుంది. దీనిలో నీకు వచ్చే లాభమేమిటి? రాజపుత్రిక చరిత్ర వింటే శీలవంతురా లనిపిస్తూంది రెండవవానిని పెళ్ళాడకూడదని శ్రీశైలం పోతూందేమో! అలాటి దానిని నీకు కూరుస్తానంటే నువ్వెలా నమ్మావు? చక్రవర్తి కొడుకు కంటే నువ్వెక్కువ వాడివి కావు కదా! ఆ దాసి మాటలు నమ్మడం అవివేకం '

"మిత్రుడా! నామాట విను కలభాషిణి ఒంటరిగా ప్రయాణం చేస్తుంది కదా. దారిలో కలుసుకుని పరిచయం చేసుకుని తియ్యని మాటలతో ఆమె ప్రేమని పొందుతాను. ఈ మధ్య నేను కొక్కోకం సంపాదించి అంతా బాగా చదివాను. దానిలో చాలా చమత్కారాలున్నాయి అదీకాక నా అందం చూశాక ఏ స్త్రీ నన్ను వరించకుండా ఉండగలదు? పదిరోజులు పరపురుషుడితో ఏకాంతంగా గడపవలసి వస్తే అరుంధతికేనా మనసు చలింపక మానదు. కావాలంటే అలా నూరుశ్లోకాలు చదువుతాను ఇదంతా ఆలోచించే నేనా పూబోడితో చెప్పాను. వేళదాటిపోయింది. ప్రయాణం వాయిదా పడిందేమో"

"కాముకుల స్వభావం ఇలాగే ఉంటుంది. నా మాటలు నీ బుర్రకెక్కవు నీయిష్టం వచ్చినట్లు కానియ్. నాకు నిద్ర వస్తోంది పోతాను" అని అతను వెళ్ళిపోయాడు. మరికొంత సేపు చూసి మదనకేతనుడు కూడా వెళ్ళిపోయాడు

ఆ మాటల విన్న విజయభాస్కరుడికి కలభాషిణంటే తాను దొంగలనుంచి విడిపించినదే అని అర్థమయింది 'ఆ బాలికను బ్రాహ్మణ పుత్రుడికిచ్చి పెళ్ళి చెయ్యలేదా? ఎందుకు? నా వృత్తాంత మెలా తెలిసింది. మరొకరిని పెళ్ళాడక పారిపోడమేమిటి?" అనుకుంటూ పూబోడి చెప్పిన గ్రామాలపేర్లు జ్ఞాపకం ఉంచుకుని ఆ తోవలోనే ప్రయాణించి నాలుగురోజులకి వాళ్ళని కలుసుకున్నాడు

పూబోడి మదనకేతనుడితో మాట్లాడుతూండడం చూసి - వారే అని గ్రహించి వార్ని రహస్యంగా అనుసరించ సాగాడు జటలు నారబట్టలు ధరించినా కలభాషిని చాలా అందంగా ఉందనుకున్నాడు ఆమె శీలాన్ని పరీక్షించాలని నిర్ణయించుకున్నాడు వాళ్ళవెనుకే తనూ వెళ్ళసాగాడు

ఒకనాడు కలభాషిణి - 'పూబోడీ అతనెవరు? నువ్వు తరచుగా మాట్లాడుతున్నావు ఎరిగినవాడా? మనవెంట వస్తున్నాడేం?' అని అడిగింది

"ఇతను బ్రాహ్మణకుమారుడు శ్రీశైలం వెళ్తున్నాడు దారిలోనే పరిచయమయ్యాడు మంచివాడు, మనకి సహాయంగా ఉంటాడని మాట్లాడుతున్నాను' అంది అతను నక్కవినయం చూపుతూ పరిచయం చేసుకుంటూ పురాణకథలు చెబుతూ. .వాళ్ళతో పాటు ప్రయాణం చేయసాగాడు. శ్రీశైల ప్రాంతంలోని అడవిలో ఉండగా ఒకరాత్రి మదనకేతనుడు పూబోడిని దగ్గరలేకుండా చేసి కలభాషిణితో పురాణ గోష్టి చేస్తూ . "నీతో ఒకమాట చెప్పదలుచుకున్నాను, విను యౌవనం చంచలమైంది నువ్విప్పుడు పూర్ణయౌవనంలో ఉన్నావు నీ రూపం అత్యంత మనోహరం ఇలాటి వయసులో వివాహం చేసుకుని సుఖపడక యోగినివై తిరుగుతున్నావేం? స్వర్గంలో మాత్రం శృంగార చేష్టలూ యౌవన విలాసాలూ తప్ప ఏమున్నాయి? నేను రసికుడిని నన్నంగీకరిస్తే స్వర్గ సౌఖ్యాలన్నీ నీకిక్కడే చూపిస్తాను అన్నాడు ఆమె పూబోడిని పిలిచింది అది ఆ ప్రాంతంలోనే ఉండికూడా పలికింది కాదు

అప్పుడతను, "నామాటకి బదులు చెప్పవేం? నిన్ను ఉద్యానవనంలో చూసింది మొదలు నాలో మదన వేదన మొదలయింది. నేటికి సమయం చిక్కింది మర్యాదగా అంగీకరించకపోతే బలాత్కారంగా అయినా నాకోరిక తీర్చుకోకమానను' అన్నాడు "ఛీ నీచాత్మా! నా మనోహరుడు భాస్కరుడు పరలోకం గతించగా నేను మరొకరిని వరిస్తావా? ఇలాటి ఊహతోనా నావెంట తిరుగుతున్నావు. పో ' అని అతన్ని ఆమె కసిరి వేసింది

"నీకడ్డు పడేవారెవరో చూస్తాను" అంటూ అత నామె జుత్తుపట్టుకుని ముఖం మీద ముద్దు పెట్టుకో బోగా ఆమె విదిలించేస్తూ పూబోడికోసం కేకలు వేసింది అది రాలేదు కాని చెట్టు చాటునుంచి అంతావింటున్న భాస్కరుడు కత్తితో అక్కడికి వచ్చాడు. అతన్ని చూడ్డంతోనే మదనకేతనుడు పారిపోయాడు.

ఏమీ ఎరగనట్టు అప్పుడొచ్చింది పూబోడి. "అమ్మా! ఏమయింది? ఎందుకు భయపడి పిలిచావు?"

కలభాషిణి మదనకేతనుడు చేసిన దుండగమూ పుణ్యాత్ముడు రక్షించిందీ చెప్పి భాస్కరుడిని పొగిడింది పూబోడి ఆమె నోదార్చింది. రాజపుత్రు డామె సౌశీల్యానికి చాలా సంతోషించాడు తన గురించి అప్పుడు చెప్పడం సమంజసం కాదని భావించి.. వారితో శ్రీశైలం వేపు నడిచాడు. కాని ఒకచోట కాళ్ళుపొక్కులెక్కి నడవలేకపోతున్న వృద్ధురాలికి చేయూత నివ్వడంతో నడక వేగం మందగించి చివరివరకూ వారి ననుసరించడానికి వీలుకాలేదు.

శ్రీశైలంలో మహాశివరాత్రినాడు పాతాళగంగలో స్నానం చేసి .శ్రీమల్లికార్జున లింగా న్నభిషేకించి . కోట తీర్థప్రాంతంలోని మంటపంలో సద్గోష్ఠి చేస్తున్న పరివ్రాజకులకు తాను తెచ్చిన రత్నాలు పంచిపెట్టాడు వారు అన్ని ధర్మాల్లోకీ – భయపడిన వారిని రక్షించడమే పరమ ధర్మమని ప్రవచించారు.

అంతలో కోట తీర్థంలో చప్పుడు వినిపించగా ఎవరో ఆ నూతిలో పడ్డారని పెద్దగా అరిచారు ఆ నుయ్యి చాలా లోతుగా ఉంది రాజపుత్రుడు ధైర్యంగా దానిలోకి దిగి పడ్డవారినిపైకి తీశారు. అప్పు డాజోగురాలు కళ్ళు తెరిచి "హా పుత్రా భాస్కరా గుణనిధీ. నువ్వన్నట్లే అకాలంలో మరణం రాదుకదా నువ్వు పరలోకగతుడి వయ్యావని వినికూడా ఈ ప్రాణాలు నన్ను వదలడం లేదు. నేనేం చేసేది? నాకు దిక్కెవరు?" అంటూ విలపించ సాగింది

ఆమె రోదనం విని ఒక విరాగి ఆమె ముందుకు వచ్చి – 'అమ్మా! నువ్వు భాస్కరుడి తల్లివని తెలుసుకున్నాను. ఆ పుణ్యాత్ముణ్ణి

చంపించిన ద్రోహిని నేనే ఆ పరిహారానికే రాజ్యం వదిలి విరక్తుడినై తీర్థాలు తిరుగుతున్నాను ఏం చేసినా నా హృదయ తాపం చల్లారడం లేదు నీదయ ప్రసరిస్తే చల్లారుతుందేమో నా రాజ్యమంతా నీకిచ్చేశాను నీ ఇష్టమొచ్చినట్లు పంచిపెట్టుకో నన్ను నీకుమారుడిగా భావించు ' అని ప్రార్థించాడు అప్పుడు భాస్కరుడు వాళ్ళిద్దర్నీ గుర్తుపట్టి తనని తానే తెలుపుకుంటూ ఆనందం పట్టలేకపోయాడు చారుమతి ఆ ఇది కలకాదు కదా తండ్రీ నువ్వు సముద్రంలో మునిగిపోయావని విన్నాను అది అసత్యమా?" అంటూ అతన్ని కౌగలించుకుని ఆనంద భాష్పాలు కార్చింది.

"సముద్రంలో మునిగినా కొండమీంచి పడినా అగ్నిలో దూకినా అకాలంలో మృత్యువురాదుకదా? అది తెలుసుకుంటే విచారమే ఉండదు రాజా నాకోసం కదా నువ్వు విరక్తుడి వయ్యావు? నేను సుఖంగానే ఉన్నాను కనక నువ్వింక వెళ్ళి రాజ్యం చేసుకో' అన్నాడు భాస్కరుడు

'నిష్కారణంగా నిన్ను దండించిన నాకిక రాజ్యార్హ తెక్కడుంది? ఆ రాజ్యం నీదేకాని నాదికాదు అంతేకాదు నువ్వొక రాజపుత్రికను చోరులనుండి రక్షించావట ఆ చిన్నది నిన్నేకాని పెళ్ళాడనని శపథం చేసుకుందట ఆ వార్త తరవాత తెలిసింది ఆమెను పెళ్ళాడి రాజ్యం పాలించుకో" అని అతనెంత బతిమాలినా భాస్కరు డంగీకరింపలేదు

చారుమతి – "భాస్కరా నీచేత దొంగలనుండి రక్షించబడిన కలభాషిణికూడా నిన్నే కాని పెళ్ళాడనని శపథం చేసుకుని.. నువ్వు సముద్రంలో పడి మరణించినట్లు తెలియగానే ఆమెతండ్రి వేరొకని కిచ్చి వివాహం చేయబోగా నారచీరలు ధరించి విరాగిణిలా శ్రీశైలం పారిపోయొచ్చింది దారిలో మేమిద్దరం కలుసుకుని. ఒకరివృత్తాంతం ఒకరు తెలుసుకుని దుఃఖిస్తూ ఇక్కడికి చేరాం. ఇక్కడెవరో యోగులకు రత్నాలు పంచిపెడుతున్నారని విని. నీ దానగుణం గుర్తుకొచ్చి .ఆమెకు చెప్పకుండా వచ్చి ఈ నూతిలో పడ్డాను కలభాషిణి చాలా ఉత్తమురాలు. ఆమెని పెళ్ళి చేసుకుని సుఖపడు ' అంది

అంతలో కలభాషిణి అక్కడికి వచ్చి 'అత్తా! ఆశ్చర్యకరమైన విషయాలు విన్నాను నిజమేనా. నాతో చెప్పకుండా ఎలావచ్చావు? నిన్నుద్ధరించింది నీ కుమారుడేనట! భాస్కరుడేనా? నామనోహరుడైన భాస్కరుడేనా?" అని అడుగుతూంటే - చారుమతినీ భాస్కరుణ్నీ చెరోసందిటా చేర్చుకుని 'కలభాషిణి ఈమె నీకోసం ఎలాంటి వేషం ధరించిందో చూశావా. కలభాషిణీ ఇతడే నీ భర్త నీ అదృష్టమే నిన్ను కాపాడింది ధన్యురాలివి. వీడు నిన్ను పెళ్ళాడతాడు" అంది.

"అమ్మా! ఈమె తండ్రి మాట మన్నించక స్వతంత్రించి ఇల్లు విడచి ఒంటరిగా వచ్చిదేశాటనం చేస్తూంది కదా? ఇది సతీ ధర్మమేనా? చెప్పు పరులు శంకింపక మానుతారా? పరీక్షించి కాని పెళ్ళికి అంగీకరించను - " అనగానే కలభాషిణి ఉలికిపడి పరీక్షించాకే పెళ్ళి చేసుకోవచ్చును త్రికరణ శుద్ధిగా భాస్కరుడేనాభర్త అని తలిచాను ' అంది. "పదిరోజుల నుంచి చూస్తున్నాను ఈ రాజపుత్రిక ధృఢమైన శీలం కలది. నీయందే అనురాగం కలది" అని చారుమతి అంటూటే భాస్కరుడు నవ్వుతూ అతను దారిలో పరీక్షించిన విషయం ఆమెకు రహస్యంగా చెప్పాడు.

యశస్కరుడు చాలా సంతోషిస్తూ పెళ్ళిపెద్దగా నిల్చి. ఆ క్షేత్రంలోనే. మల్లికార్జున మహాదేవుడి సాక్షిగా వారికి వివాహం చేశాడు భాస్కరుడు విక్రమార్కుని మనవడని తెలియగానే అతని ఆనందానికి అడ్డుకట్ట లేకపోయింది. అతని సుగుణాల్ని చాలా పొగిడాడు.

ఆ లోగానే భాస్కరుడు తల్లికి హేమప్రభ వృత్తాంతం చెప్పాడు. ఆ రహస్యం చెవిన పడిన పూబోడి రాజపుత్రుడి చేయికున్న రత్నకంకణా న్నెలాగో సంగ్రహించి తనవెంట చాలాకాలం తిరిగిన మదనకేతనుడి కిచ్చి - రహస్యమంతా చెప్పి - "పో కలభాషిణి కంటె చక్కని దాన్ని కూర్చాను. నీరుణం తీర్చుకున్నాను నేను పోతాను" అని ఎక్కడికో వెళ్ళిపోయింది

యశస్కరుడు భాస్కరుడిని సకుటుంబంగా తన దేశానికి వచ్చి రాజ్యాన్నిఏలుకోమ్మని మళ్ళీ బ్రతిమాలాడు. "దేవా. నాకు మీరాజ్యంమీద

కొంచెమైనా కోరిక లేదు దైవానుగ్రహముంటే మాతాత పీఠమే అధిష్టిస్తాను అదీకాక కలభాషిణి తన గ్రామానికి రమ్మని వేడుకుంటూంది తండ్రి రాజ్యంఆమెదే అవుతుంది. నాకోసం ఆమెవిరాగిణై ఇహలోకసుఖాలను త్యజించి తిరిగింది కదా మొదట మేమాపురం వెళ్ళి తరవాత మీ పట్నం వచ్చి విందు చేస్తాం' అని...ఆయన అనుజ్ఞ తీసుకుని భార్యతోనూ తల్లితోనూ కొన్నాళ్ళకి చంద్రప్రస్థ పట్నానికి వెళ్ళాడు

' కలభాషిణి గురించి తండ్రి, ప్రజలు ఏం చెప్పుకుంటున్నారో వినాలని. మొదట తమగురించి ఏమీ తెలపక ఒక సత్రంలో బస చేశాడు ఆ సత్రంలో అనేక దేశాలనుంచి వచ్చేవారికి నివాసం, భోజనం మొదలైన సదుపాయాలు కలిగినా ఒకమూల వివాహాలు ఒకమూల సంతర్పణలు, ఒకమూల ఉపన్యాసాలు, మరోమూల పురాణాలు ఇంకాఎన్నో కార్యక్రమాలూ అహోరాత్రాలు జరుగుతూంటాయి దేశదేశాలవార్తలు వినపడుతూంటాయి పట్నంలోని రహస్యాలన్నీ అక్కడ వారికే ముందు తెలుస్తాయి. రాత్రి జరిగిన వింత – తెల్లవారకముందే అక్కడకిచేరి పోతుంది ఆ సత్రంలో బాటసారుల మధ్య జరుగుతున్న సంభాషణ అంతా భాస్కరుడు ఆసక్తిగా వినసాగాడు

*విదేశీయుడు* బ్రాహ్మణుడా! మీదే గ్రామం?

*బ్రాహ్మణుడు* ఉజ్జయిని.

*విదేశీయుడు* ఉజ్జయి నంటే సాహసవిక్రమార్కుని పట్నమే కదా?

*బ్రాహ్మణుడు* ఔను

*విదేశీయుడు* ఆ మహారాజు కుశలమేనా?

*బ్రాహ్మణుడు* · ఆయనుంటే మాకీకర్మెందుకూ? ఆయన స్వర్గస్థు డయ్యాడు.

*విదేశీయుడు* · శివశివా! ఎంతమాట విన్నాం. ఆ మహారాజు వితరణ మొదలైన సుగుణాల్ని ఎవరేనా పొగడగలరా? మావేపు ఆయన పేరు ప్రఖ్యాతులు చాలా బాగా వ్యాపించాయి

*బ్రాహ్మణుడు* . మీ దేదేశం?

విదేశీయుడు దక్షిణాది అనంతశయనం విక్రమార్కునికి సంతాన ముందా?

బ్రాహ్మణుడు పాలసముద్రంలో కాలకూటవిషం పుట్టినట్లు కీర్తికేతుడనే కొడుకున్నాడు అతణ్ని అపకీర్తికేతు డనవొచ్చు ఆ పాపాత్ముడే మమ్మల్నిలా పీడిస్తున్నాడు తండ్రి అనంతరం గద్దెఎక్కి మా నడ్డి విరిచాడు మహారాజు మాకిచ్చిన అగ్రహారాల మీద పన్నువేసి దైవక్షేత్రాలు, సత్రాలూ పనికిరావని మూయించేశాడు అడుక్కోవడం అపరాధమంటూ చెరసాల్లో యాచకులని పెట్టించాడు

విదేశీయుడు . ఆ!

బ్రాహ్మణుడు భార్యా, పుత్రుడూ తన మాట లెక్క చెయ్యకుండా ధానధర్మాలు చేశారని వాళ్ళనడవికి పంపించి చంపించాడు. అంతకంటె క్రూరు డెంకెవడేనా ఉంటాడా? – తరువాత వాడికి ప్రాయశ్చిత్తమయింది లెండి.

విదేశీయుడు : ఏమైంది?

బ్రాహ్మణుడు . తరువాత అతనొ కామెను పెళ్ళాడాడు. అదో చుప్పనాతిశూర్పణఖ దానివల్ల ఒక కొడుకుని కన్నాడు వాడు తండ్రిలాంటివాడే ఈ పట్నపు రాజు తనపుత్రిక కలభాషిణినిఇస్తానని శుభలేఖ రాయించగా... కొడుకు చిన్న వాడైనా రాజ్యంకోసం నమ్మించి కొడుకుతో సహా వచ్చాడు. ఈ రాజుకి కలభాషిణొక్కతే సంతానం పురుషసంతానం లేదు ఎందుచేతనో కలభాషిణి ముహూర్తానికి ముందే ఎక్కడికో వెళ్ళిపోయిందట .

విదేశీయుడు : ఎందుకనో?

బ్రాహ్మణుడు . స్త్రీల పనులు మీకు తెలియనివా ఏమిటి? దాసీ ద్వారా ఒక బ్రాహ్మణ కుమారుడితో సంబంధం కలుపు కుందట. అత నామెను తీసుకు పోయాడు

స్త్రీలకు పరపురుష సంగమం కంటె సంతోషం మరేముంటుంది.

మరొకడు . చీఛీ. ఎందుకలా నోటికొచ్చినట్లు కూస్తావ్? కళ్ళు పోగలవు.

కలభాషిణి మహాపతివ్రత మొదట నిశ్చయించబడిన పతి మృతుడయ్యాడని తండ్రి పునర్వివాహం తలపెట్టగా ఇష్టపడక విరక్తితో వెళ్ళిపోయింది ఇదే నిజం

*విదేశీయుడు* సరేలే తరవాతేం జరిగింది?

*బ్రాహ్మణుడు* పెళ్ళికూతురు పరారయిందనీ - తనకయిన ప్రయాణపు ఖర్చుయిచ్చుకోమని కీర్తికేతనుడు చంద్రగుప్తుడికి కబురుపంపాడు పెళ్ళికొడుకు చిన్నవాడని చంద్రగుప్తుడు ముందే చెప్పాడు కదా. వరహీనం అనే కారణంతో పరిహారం చెల్లించనన్నాడు దానితో ఇద్దరికీ విరోధం పుట్టింది ఇద్దరి మధ్యా చతురంగ బలాలతో గొప్పయుద్ధం జరిగింది

*విదేశీయుడు* వివాహం జరగక - విరోధం జరిగిందన్న మాట! బాగుంది సజ్జనులను బాధించిన పాపం వూరికే పోదు ఎవరు గెల్చారు? చంద్రగుప్తుడేనా

*బ్రాహ్మణుడు* : సందేహమా? యుద్ధంలో ఓడించి చంద్రగుప్తుడు కీర్తికేణ్ని సకుటుంబంగా బందీగృహంలో పెట్టించి అతని రాజ్యం ఊడలాక్కున్నాడు ఆ రాజ్యానికి చంద్రగుప్తుడే ప్రభువయ్యాడు కనక మా అగ్రహారాలకు పన్నులు తీసివెయ్యమని ప్రార్థించడానికి వచ్చాను ఇదే వృత్తాంతం

*విదేశీయుడు* · అయ్యో! విక్రమార్కుడి రాజ్యానికెన్ని పాట్లొచ్చాయి! అతని పుణ్యమేనా కాచింది కాదే! చెడ్డకొడుకు వల్ల కులం ఇలాగే చెడిపోతుంది ఆ మాటలన్నీ విన్న భాస్కరుడు ఆశ్చర్యానికీ విచారానికీ కూడా లోనయ్యాడు 'మా తండ్రినీ తమ్ముణ్ణీ చెరలోపెట్టిన చంద్రగుప్తుడు నాకు శత్రువే ఔతాడు. నేనతని దగ్గరకు పోయి బంధుత్వం కలపబోతే ఆమోదిస్తాడా? కలభాషిణిని మరొకరికివ్వాలనే అనుకుంటాడు. నాకంత గతిఎందుకు? అతనే నాదగ్గర కొచ్చి బతిమాలుకోవాలి చంద్రావలోకుడూ, యశస్కరుడూ యుద్ధంలో సాయపడతారు ఈ రాజుని జయించడానికి నాబలమేచాలు. అన్నట్లు నా ప్రియురాలు హేమప్రభమాట మరచిపోయానీ సందడిలో అక్కడ రాక్షసబలం ఉంది. వీళ్ళందరికీ ఒక్క

రాక్షసి చాలు వెంటనే వస్తానని చెప్పి ఆమె విషయం వదిలేశాను కృతఘ్నుడిని' అనుకుంటూ కంకణం కోసం చూసుకోగా అది కనిపించలేదు. దానివృత్తాంతం చెప్పాను కనుక తల్లికాని కలభాషిణి కాని తీశారేమో అనుకుంటూ వారి దగ్గరికి పోయి అడిగాడు వారు తమకేమీ తెలియదన్నారు

అతనికేమీ తోచలేదు హేమప్రభగురించి ఆలోచిస్తూ.. పిచ్చావాడిలా సాయంకాలం వరకూ ఊరంతా తిరిగి – ఉత్తరదిశగా పోయేసరికి అక్కడ తను ఆనాడు పడుకున్న – పాడుపడిన దేవాలయం కనపడింది చీకటిగా ఉన్నా అతనందులోకి పోయి నాలుగు మూలలూ తిరుగుతూంటే – ఒకచోట నుంచి సంభాషణ వినిపించింది.

స్త్రీ : బ్రాహ్మణపుత్రుడా నామనోహరుడేడీ? నన్నీ చీకటిలో ఈపాడు గుడికి తెచ్చా వెందుకు?

పురుషుడు : నీ మనోహరుడు పరలోక గతుడయ్యాడని విన్నాను. ఆ మాట చెప్పడానికిఇలా తీసుకొచ్చాను

స్త్రీ . ఆ. ఏమన్నావ్? నా భాస్కరు దస్తమించాడా! అయ్యో! వెంటనే వస్తాననీచెప్పివెళ్ళావే!

ఇంత దారుణమా. నీ ప్రేమనెలా మరిచిపోగలను? నువ్వేలోకానికి పోయావో చెప్పు వెంటనే నేనూవచ్చి నిన్ను కలుసుకుంటాను – అంటూ – గుండె బద్దలయ్యేలా శోకించసాగింది

పురుషుడు : ఊరికే దుఃఖిస్తా వెందుకు? ఎంత విచారిస్తే మాత్రం చచ్చిన వాళ్ళు తిరిగి వస్తారా ? ఊరుకో.

స్త్రీ : ఏం చూసుకుని ఊరుకునేది? నాకిం కేది గతి? నేనేం చెయ్యాలి?

పురుషుడు . నేనుండగా నీకు లోటేమిటి? నన్ను చూసుకుని ధైర్యంగా ఉండు. నీకు గతి నేనే.

స్త్రీ : నీవల్లనాకు ప్రయోజనం

పురుషుడు . భాస్కరుడివల్ల ఏమిటో. .అదే '

స్త్రీ దుఃఖంలో ఉండడంవల్ల యింతవరకూ సహించాను కారుకూతలు కూయకు.

పురుషుడు ఊరడింపు మాటలాడితే ఉరిమి పడతావేం? నన్ను పెళ్ళాడ మంట కొప్పడతావా ఏం?

స్త్రీ ఛీ. మూర్ఖుడా నా మనసు తెలుసుకోకుండా మాట్లాడుతున్నావు

పురుషుడు . నువ్వు కామపీడితవని తలచి అలా అన్నాను నన్ను వేధింపకు మదనుడు నా హృదయాన్ని హింసించి చంపుతున్నాడు. నీ అధరామృతంఇచ్చి బతికించు.(అంటూ కౌగలించుకోబోయాడు)

స్త్రీ : చాలుచాలు దూరంగా పో దురాత్మా. కపటంతో వంచించి తెచ్చి ఇలా బాధిస్తావా

పుణ్యాత్ములారా! రక్షించండి హా. భాస్కరా! (గట్టిగా కేకలు వేస్తుంది) వారి మాటలు వింటున్న భాస్కరుడు వారి వద్దకు పరుగు పరుగున వెళ్ళేసరికి ఆ పురుషుడు ఎటో పారిపోయాడు. చీకటిలోకూడా ఎంతో అందంగా మెరుస్తున్న ఆమెను చూసి -

"నీవెవరివి? ఈ చీకట్లో ఇక్కడి కెందు కొచ్చావ్? నీ వృత్తాంత మేమిటి?" అని అడిగాడు అతని కంఠస్వరం గుర్తుపట్టి నావృత్తాంతం చాలా ఉంది మెల్లగా చెబుతాను నువ్వు భాస్కరుడివి అనుకుంటాను ముందు - నీ వృత్తాంతం చెప్పి నాకానందం కలగజెయ్యి' అందామె.

'నేను భాస్కరుడినే. రాజకుమారుణ్ని హేమప్రభ అనే విద్యాధరిని వివాహం చేసుకుని ఆమె ఇచ్చిన రత్నకంకణం పారేసుకోడం వల్ల ఆమెను కలుసుకోలేక పిచ్చెక్కుతూంటే ఇక్కడికి వచ్చాను అది నీకు ఇక్కడ దొరికితే ఇవ్వు అన్నాడు

ఆమె అతన్ని కౌగలించుకొని-"మనోహరా." అంటూ పరవశిస్తూంటే-అతను కోపగిస్తూ-నా చిత్తశుద్ధి ఎరగక కామాసక్తుడిగా తలపోస్తున్న ఈమెకు బుద్ధి చెప్పాలనుకుంటూ- "పరపురుషుణ్ని ఇలా తాకొచ్చా? నువ్వు ఉత్తమురాలివని తలచి వచ్చాను" అన్నాడు

"నన్ను పరస్త్రీగా తలుస్తున్నావా కానుకాను నేను నీదాసురాలు హేమప్రభని. దైవం ఇలా అనుగ్రహించింది" అందామె

'ఏమిటీ. నువ్వు హేమప్రభవా. ఎలా వచ్చావు? ఏమిచిత్రం? నాకీ చీకట్లో యిక్కడికి రావాలని బుద్ధి పుట్టించినవాడు దైవమే ఎంత విచిత్రం! సరే . నువ్విక్కడి కెందుకొచ్చావు? ఎలావచ్చావ్?' ఌ ఽ గాడు. "మీరు వెళ్ళిన తరువాత పదిరోజులెలాగో గడిపాను. ఇక క్షణక్షణమూ యుగమైపోయింది. మీమాటలూ చేష్టలూ తలచుకుంటూ మరికొన్ని రోజులు గడిపాను. మీరు చెప్పిన గడువుదాటిపోయింది విరహాగ్ని నన్ను వేగింపసాగింది. అది అలా ఉండగా -

మా ఉద్యానవనంలో నా చెలికత్తెల కొక బ్రాహ్మణ కుమారుడు కనపడ్డాడు. 'నెవరివి? ఎందుకొచ్చావ్?" అని మావాళ్ళడిగారు. నేను విజయభాస్కరుడి స్నేహితుడిని. అతను తన భార్యహేమప్రభని తీసుకురమ్మని నన్ను పంపాడు. అందుకు వచ్చాను" అన్నాడు నా సఖులు ఆమాటని ఎంతో సంతోషంగా నాకు చెప్పారు. అతనికి భోజనాది సత్కారాలు చేసి - సఖులచేత మీవృత్తాంతం అడిగించాను

మీ రీ పట్నంలో ఉన్నారనీ నన్ను తీసుకొనిరమ్మని పంపారనీ, గుర్తులెన్నోచెప్పి రత్నకంకణం చూపించాడు నేనునమ్మి-రెండు రోజులతన్ని ఉంచి. గౌరవించి. ఇవాళ సాయంత్రం మీ దర్శన మౌతుందన్న ఆనందంతో చక్కగా అలంకరించుకుని ఆ మోసగాడితో సహా తటాకంలో మునిగాను. అత నిక్కడికి చేరుకోవాలని చెప్పాడు. వచ్చింది మొదలు అతని చేష్టలు మరోలా ఉన్నాయి. మిమ్మల్ని చూడాలని నేను తొందర చేస్తుంటే ఇదిగో అదిగో అని జాప్యం చేస్తూ చివరికి మీరు స్వర్గస్తులయ్యారని చెప్పడమే కాక తనని పెళ్ళి చేసుకోమన్నాడు ఆపైన కథ మీకు తెలిసిందే. 'ఆరత్నకంకణం అతని కెలా వచ్చిందో?" రాజకుమారుడు చాలా ఆలోచించగా తెలిసినట్లనిపించింది ఆ వా డీవూరివాడే కలభాషిణిని వరించి ఆమె దాసీ ద్వారా ఆమెతో శ్రీశైల ప్రయాణం చేశాడు దారిలో అత నామెను బలాత్కరించబోగా నే నడ్డుపడ్డాను. తరవాత నీ కథ మాతల్లితో చెబుతూండగా విని ఉంటాడు

కంకణం ఎలా సంగ్రహించాడో? దేవుడెలాటి సంఘటనలు కూరుస్తాడు ” అంటూ తాను సముద్రమందిరం వదిలింది మొదలు అంతవరకూ జరిగిన కధంతా హేమప్రభకి తెలియజేసి కలభాషిణి తనతల్లి ఉన్న సత్రానికి తీసుకుపోయి ఆమెను వారికి చూపాడు

కలభాషిణి, హేమప్రభ ఒకరి సౌందర్యానికొకరు ఆశ్చర్యపోయారు చారుమతి హేమప్రభని చూసి చాలా ఆనందించింది మర్నాడు విజయభాస్కరుడు - హేమప్రభా ఈ చంద్రగుప్తుడు మా తండ్రిని చెరపట్టాడు అతనితో యుద్ధం చేయవలసుంది అలాటి సమయంలో మీ రిక్కడుండకూడదు సముద్రమందిరానికి వెళ్ళి ఉండండి యుద్ధంలో గెలిచాక మళ్ళీ పిలుస్తాను' అన్నాడు

“మీరు కష్టపడి యుద్ధం చేయడం ఎందుకూ? మా మందిరంలో గిరిమస్తక అనే రాక్షసుంది దాన్ని చూస్తే దేవతలు సైతం భయపడతారు. అది మేం చెప్పినట్లు చేస్తుంది దానిని పిలిపిస్తాను ఆదే విజయం తెచ్చిపెడుతుంది మనం ఇక్కడే ఉం౯ చ్చు' అని ఆ రాక్షసిని తీసుకురాడానికి హేమప్రభ సముద్ర మందిరానికి వెళ్ళింది ఈలోగా భాస్కరుడు - కీర్తికేతుడు నా తండ్రి అతనిని చెరసాలలో పెట్టించడం తప్పు వారిని నావద్దకు తెచ్చి అప్పగించు” అవి రాయబారం పంపాడు. చంద్రగుప్త డామాటల్ని పరిహాసం చేస్తూ - మరోసా రిలాటి రాయబారాలు పంపితే అపరాధంగా ఎంచి శిక్షిస్తాం దీన్ని మొదటితప్పుగా ఏంచి క్షమించాం .అని తిరిగి వార్తపంపాడు

అంతలో హేమప్రభ గిరి మస్తకని తీసుకువచ్చి అతని ఎదటనిలబెట్టింది దాని మిగిలిన అవయవాలు సామాన్యంగా ఉన్నా తలమాత్రం కొండంత ఉంది. తల కొడితే పర్వతమైనా పగిలిపోవలసిందే దాని నోరు గుహలా ఉంది

భాస్కరుడు దాని రూపానికి ఆశ్చర్యపోయి - “ నీ ఆకారం చూసేసరి కెలాటివాడికేనా భయమేస్తుంది నువ్వు ప్రజలజోలికి పోవద్దు భటులను కూడా చంపకు చంద్రగుప్తుణ్ణి బంధించి నా దగ్గరకు తీసుకురా '

అని కర్తవ్యం చెప్పాడు అలాగే అని అది వెళ్తూ ఒక్కసారి గట్టిగా నవ్వేసరికి ప్రజలంతా మూర్ఛపోయారు. అప్పుడతను 'అలాగ లోకాని కుపద్ర మొచ్చేటట్లు అరవకు భయమేస్తూంది నోరు విప్పకుండా పని చేసుకునిరా" అన్నాడు అదివెళ్ళి అవలీలగా కోటదాటి. రాజమందిరంలో ఉన్న రాజు నొకపిడికిడితో పట్టుకుని, చెరసాలలో ఉన్న కీర్తికేతుడి సంకెళ్ళు తెంపి అతన్ని నెత్తిమీద పెట్టుకుని అడ్డంవచ్చిన వాళ్ళ నవతలకి తోసేస్తూ జనం చెల్లాచెదురై పోతూండగా... విజయభాస్కరుడి వద్దకు చేర్చింది. అప్పుడు చంద్రగుప్తుణ్ని చూస్తూ "నిన్న బేరాలు పలికావట. ఇప్పుడేమంటావు? మా తండ్రిని విడుస్తావా?" అని అడిగాడు. అతను తలదించుకున్నాడు. అప్పుడు కలభాషిణి వచ్చి తండ్రికి నమస్కరించి – "ఈయన మీ అల్లుడే. నన్ను దొంగలనుంచి కాపాడిన మహాత్ము డీయనే దైవకృపవల్ల ఈయననే భర్తగా పొందాను ' అంటూ జరిగిన కథంతా చెప్పింది

చంద్రగుప్తు డతన్ని కౌగలించుకుని – "నువ్వెవరవో తెలియక అవమానించి అపరాధం చేశాను. క్షమించు. ముందుగా అలాగే వార్త పంపితే ఇలా జరుగదు కదా ఏమైనా నా పూర్వపుణ్యం ఫలించింది నిన్నల్లుడిగా పొందాను" అంటూ ఎంతో పొగిడాడు.

కీర్తికేతుడు, విజయభాస్కరుణ్ని అతని తల్లినీ చూస్తూ చాలా ఆనందం పొందుతూ తాను వారికి చేసిన అపకారానికి సిగ్గుపడుతూ తలవంచుకుని మౌనంగా ఉండిపోగా – భాస్కరుడతనికి నమస్కరించి, పక్కనున్న తన తమ్ముణ్ణి కౌగలించుకుని – తామిల్లు విడచింది మొదలు అంతవరకూ జరిగినదంతా చెప్పారు.

కీర్తికేతుడతని చేతులు పట్టుకుని – "నాయనా నువ్వే మాతండ్రి కీర్తిని నిలబెట్టావు నేను పాపాత్ముడిని. రాజ్యానికర్హుణ్ని కాను నువ్వే ఏలుకో' అన్నాడు తన పాదాలమీద పడిన చారుమతిని లేవనెత్తి గౌరవిస్తూ అనునయవాక్యాలతో ఊరడించాడు.

చంద్రగుప్తుడు చాలావైభవంగా కలభాషిణీ భాస్కరులకి పాణిగ్రహణమహోత్సవం జరిపించాడు. ఆ ఉత్సవానికి చంద్రావలోకుడూ,

యశస్కరుడూ చతురంగ బలాలతోనూ వచ్చిపెళ్ళి పనులు చేశారు ఆ సందర్భంలో ఒకనాడు నిగమశర్మ తండ్రి వచ్చి - మాదారిద్ర్యం పోగొట్టడానికి చిన్నదాన్ని మాకప్పగించావు మావాళ్ళు నీ మహిమ తెలుసుకోలేక నిన్ను నూతిలో తోసేశారు ఆ పాపానికి ఫలమనుభవిస్తున్నారు ఏమైపోయారో? ఎక్కడున్నారో? తెలియదు నువ్వు విక్రమార్కుడి మనువడి వని తరవాత తెలిసింది అని విచారించాడు

బతికుంటే మీవాళ్ళని తీసుకొచ్చి అప్పగిస్తాను దుఃఖించకు' అని - ఉత్సవాలయ్యాక ఉజ్జయినికి పోదామని కీర్తికేతుడు తొందరపెట్టగా అందరినీ గిరిమస్తక తలమీద కెక్కించాడు చతురంగ బలాలు అందరూ కొండెక్కినట్లా రాక్షసితలమీద కెక్కగా అది మెల్లగా కదిలింది తోవలో ఒకచోట ఆగి - ఆ అరణ్యాన్నంతటినీ పెరికెయ్యమన్నాడు అప్పుడు వెదికి ఒక చెట్టుమొదటకల మెట్లని చూసి సేనలలో ఆ పాతాళ మందిరంలోకి వెళ్ళగా అక్కడ శక్తి గుడిముందు బలిపశువుల్లా కట్టివెయ్యబడిన నిగమశర్మ అతని తల్లి సోదరులు కనిపించారు వారిని విడిపించి తండ్రి కప్పగించాడు భాస్కరుడా దొంగలందరినీ పట్టుకుని ధనరాసులన్నిటినీ మూటలు కట్టించి రాక్షసి తలమీద కెక్కించాడు మళ్ళీ ప్రయాణం సాగించి వైభవంగా ఉజ్జయిని చేరుకున్నారు

విజయభాస్కరుడు పట్టాభిషిక్తుడయ్యాడు గిరిమస్తక కామరూపిణి కనక తాను తలచుకున్నప్పుడు వచ్చి పనులు చేసి పెడుతూండాలని కోరి సముద్ర గృహానికి పంపేశాడు విక్రమార్కుడికి బేతాళుడిలా విజయబాస్కరుడి కారక్కసి వచ్చి పనులు చేసి పెడుతూండేది అతను తాతను మించి ధర్మంగా రాజ్యపాలన చేసేవాడు గిరిమస్తక దంతమొకటి రాపిడిలో ఊడి ఈ అడవిలో పడిపోయింది పూర్వమిది చాలా పెద్దదిగా ఉండేది కాలంగడుస్తున్న కొద్దీ మట్టవుతూ ఇప్పటి కీ మాత్రం మిగిలింది

గోపా తరువాత మజిలీకి బయలుదేరు" అన్నాడు మణిసిద్ధుడు



# కాశీ మజిలీ కథలు

## 38. వ మజిలీ

"మహాత్మా అది మంచమా? విమానమా? కీలురథమా?' వస్తూనే హడావిడిగా అడిగాడు గోపాలుడు ఏది? అని నవ్వుతూ అడిగాడు మణిసిద్ధుడు

అప్పుడు వాడుకాసేపు స్తిమితపడి ఇలాచెప్పాడు ఈ వూరి కవతలి భూమంతా ఎడారిలా ఉంది ఇసుక నేలమీద సూర్యకిరణాలు పడి వజ్రంలా మెరుస్తూంది ఆశ్చర్యంగా చూస్తూ తిరుగుతున్నాను అప్పుడొకనీడ పాకుతూ పోయింది ఆకాశంలోకి చూశాను ఒక మనిషి మంచాన్ని నెత్తిమీద పెట్టుకుని పోతున్నట్లు కనిపించింది ఆకాశంవేపు కొంచెంసేపు చూసి పరుగెత్తుకొచ్చాను ఆకాశంలో ఆ మంచం ఆ మనిషి వృత్తాంతం గురించి వివరంగా చెప్పండి స్వామీ ' అన్నాడు మణిసిద్ధుడు ఆ మంచం మోస్తున్న మనిషి కథని చెప్పసాగాడు

## పుష్పహాసుడి కథ

గోపాలా! గంగాతీరంలో సింధువారం అనే నగరాన్ని ధనుంజయుడనే రాజు పరిపాలిస్తూండేవాడు అతనికి సుందరకుడనే కొడుకూ లలితనే కూతురూ పుట్టారు ఆ రాజు ఒకనాడు సభలో ఉండగా ఒక దూతవచ్చి-

'దేవా గుహుడనే పల్లెవాడు పదేళ్ళకొడుకుని వెంటబెట్టుకువచ్చి తమ దర్శనం కోరి ద్వారంవద్ద ఎదురుచూస్తూ ఉన్నాడు ' అనిచెప్పగా ప్రవేశపెట్టమన్నట్లు ఆ రాజు తల పంకించాడు

గుహుడు వచ్చి చంకలో ఉన్న కొడుకుని దింపాడు ఆ బాలుడి అందం రాజుని చాలా ఆశ్చర్యపరచింది వాడి చక్కదనాన్ని చూస్తూ- 'ఇటువంటి వాడిని మా చక్రవర్తుల కులంలో పుట్టించక నికృష్టకులంలో పుట్టించిన దేముణ్ణి నిందిస్తే మాత్రం తప్పేమిటి?' అనుకున్నాడు మనసులో అనుమానం తీరక - 'వీడు నీ కొడుకేనా?" అని అడిగాడు. 'అవును నాకొడుకే" అన్నాడు గుహుడు

ఆ పిల్లవాణ్ణి దగ్గరకి రప్పించుకుని వాడి పాలబుగ్గల్ని వేలితోమృదువుగా పొడుస్తూ - "నీ పేరేంటి?" అని అడిగాడు. వాడు చిన్నగా నవ్వుతూ - "పుష్పహాసుడు' అని ముద్దుగా పలికాడు.

"మంచి పేరే పెట్టావు వీడి నవ్వే వీడిపేరు చెబుతూందిలే. ఆc! ఏం పనిమీదొచ్చావు ఇక్కడికి?" అని అడిగాడు రాజు. గుహుడు తనపాగా మడతలోంచి ఒక రత్నంకంకణం బయటకుతీసి రాజుగారి ముందర పెట్టాడు."దేవా గాలం వేయగా మంచి చేప దొరికింది దాన్ని కోసేటప్పటికి దాని పొట్టలోంచి ఈ రత్నకంకణం బయట పడింది ఇది మాబోటి వాళ్ళ దగ్గ రుండదగినది కాదని తమరికి కానుకగా ఇద్దామని తీసుకొచ్చాను" అన్నాడు

ధనుంజయుడు ఆకంకణాన్ని అటూ ఇటూ తిప్పుతూ చూసి. "అయ్యో! చెల్లెలా! నిన్ను చూసి ఎన్నాళ్ళయింది! నీ సౌందర్యమంతా నీటి పాలయిందా? నీ కాపరం ఎంతలో మాయమయింది ' అంటూ దుఃఖిస్తూంటే -సమీపంలో ఉన్న ఆయన స్నేహితుడు దేవముఖుడనే బ్రాహ్మణుడు - "రాజా ఎందుకలా శోకిస్తున్నారు?" అని అడిగాడు.

"స్నేహితుడా. ఇది గంధర్వు డిచ్చిన కంకణం దీనినిబట్టి మావాళ్ళు గంగానదిలో పడి చనిపోయా రనిపిస్తూంది స్వల్పకాలంలో విధి మూడుప్రాణాలని పొట్టనబెట్టుకుంది. దీన్ని మనలలితకిచ్చిరా" అని అతనిచేతపంపి - పల్లెవాడా. నువ్వీ వస్తువు దాచుకోకుండా తెచ్చి ఇచ్చినందుకు సంతోషిస్తున్నా నీకేమేనా కోరికుంటే చెప్పు" అన్నాడు. "కోరికతోనే మీ దర్శనానికి వచ్చాను కానీ నేనిచ్చిన వస్తువు మీకు

విచారం కలిగించింది. కనుక మరోసారి తమ దర్శనం చేసుకుంటాను" అన్నాడు గుహుడు. కాని రాజు.."లేదు లేదు. ఇది మాకెంతో సంతోషం కలిగించింది నీకోరిక చెప్పు" అని బలవంతం చెయ్యగా – "దొరా! నా కీ కుర్రవాడు లేకలేక కలిగాడు చాలా గారాబంగా పెంచుకుంటున్నాను. ఏదడిగినా తెచ్చియిస్తాను కాని వీడు అలవిమాలిన కోరికలు కోరుతున్నాడు.నేనెలాతీర్చగలను?" అన్నాడు.

"ఏమిటా కోరికలు?"

"తన కిప్పుడు గొప్పచదువులు చెప్పించాలట. చిన్నబడి గురువులు పనికిరారట. దేవరవారి పాఠశాల్లో చదువుకుంటాడట."

రాజు నవ్వుతూ – "ఔరా! పల్లె పిల్లవాడి కెలాటి కోరిక లున్నాయి! వీడి రూపానికి తగిన విద్య ఉండవలసిందే. అలాగేనే చెప్పిస్తాను. రోజూపాఠశాలకు పంపుతూండు" అని తన పుత్రుడితో సమానంగా వాడు కోరిన అన్ని విద్యలూ నేర్పి పంపమని ఉపాధ్యాయులకు పత్రిక రాసిచ్చాడు.

ఆనాటి నుంచి పుష్పహాసుడు అన్నివిద్యలు నేరుస్తూ, ఎన్నిటిలోనో అఖండ పాండిత్యం సంపాదించాడు. గురువులే అతని గ్రహణశక్తి కాశ్చర్యపడి పోయేవారు. రాజకుమారుడైన సుందరకుడు అతనితోనే చదివినా అతనిముందు ఎందుకూ పనికిరాకపోయాడు.

ఒకనాడు ధనుంజయ మహారాజు వీధిలో వెళ్తూ – గుర్రంమీద విచిత్రమైన వేగంతో వస్తున్న పుష్పహాసుణ్ని చూసి ఆశ్చర్యపోతూ అతన్ని గుర్తించలేక పక్కనున్న మంత్రిని అతనెవరని అడిగాడు. మంత్రి అంతా జ్ఞాపకం చేశాడు. "యువరాజు కూడా ఇలా అద్భుతంగా గుర్రపుస్వారి చెయ్యగలడా?" అని రాజడగ్గా "వారు గుర్రమెక్కడం చూడలేదు – " అన్నాడు. మంత్రి పుష్పహాసుడి గురించి తాను విన్నది చెప్పగా – "రేపు వారిద్దరినీ సభకు తీసుకురమ్మని అధ్యాపకులకు చెప్పండి" అన్నాడు.

మర్నాడు రాజు తన కొడుకు ప్రతిభను పరీక్షించదలచి చాలా మంది పండితుల్ని పిలిచాడు.

రాజు . కుమారా. నేను రాచకార్యాలలో మునిగి నీ విద్యావ్యాసంగం గురించి అంతగా పట్టించుకోలేదు ఏ యే విద్యలు చదివావు? వేటిలో ప్రావీణ్యం కుదిరింది? శస్త్రాస్త్రవిద్యల్లోనూ గజ అశ్వ ఆరోహణలోనూ ఎక్కువగా కృషి చేశావా?

పుత్రుడు · తండ్రీ. మీదగ్గర అబద్ధం చెప్పడం ఎందుకు? ఈ ఉపాధ్యాయులు పల్లెవాడి మీద ఉన్నపక్షపాతంతో నాకు సరిగా విద్యలు నేర్పారు కారు.

ఉపాధ్యాయులు : (భయపడుతూ) రాజపుత్రా. అసత్యాలాడు తున్నావేం? నీపట్ల మేమేం కపటం చేశాం? నీకంటె వాడెక్కువవా డెందు కౌతాడు? రాజా! మేమిద్దరికీ సమానంగానే విద్యలు చెప్పాం

రాజు సరేలెండి ఏ విద్యలు నేర్పారు?

ఉపాధ్యాయులు . రాజోచిత విద్యలు అన్నీ చెప్పాం.

రాజు : పుష్పహాసా! పెద్దవాడివయ్యావే. ఈ ఉపాధ్యాయులు నువ్వు కోరిన విద్యలన్నీ చెప్పారా?

పుష్పహాసుడు . మీ దయవలన ఏ లోటూరాలేదు గురువులు వాత్సల్యంతో అన్నివిద్యలూ చెప్పారు మేం నియమంగా చదివాం.

రాజు · సుందరకుడు నీతో సమంగా చదివాడా?

పుష్పహాసుడే · చదివాడు.

రాజు గురువులు నీపట్ల పక్షపాతం చూపించారని చెబుతున్నాడే?

పుష్పహాసుడు అది నిజంకాదు దేవా! నేనతని కంటె అధికుడినా?

రాజు : మీ ఇద్దరి విద్యాశాస్త్రం పాండిత్యం చూస్తాను శాస్త్రంలో కొంచెం ప్రసంగం చేయండి. చిరంజీవీ! తర్క యుక్తియుక్తంగా ఉంటుంది కదా.

రాజపుత్రుడు · తర్కమంటే నా కసహ్యం

రాజకుమారుడా దినం తనకి మతిసరిగా లేదన్నాడు

అప్పుడు రాజు "గుఱ్ఱమెక్కి నడిపించగలవా?" అని అడిగాడు 'ఓ" అన్నా డతను

తీరా జీను సిద్ధం చేసి గుఱ్ఱాన్ని తెచ్చేసరికి – "కాలులో నొప్పి లేకపోతేనా . నా ప్రజ్ఞచూపించేవాడిని అన్నాడు

ఆ మాటకి అందరూ తలలు వంచుకుని నవ్వుకున్నారు పుష్పహాసుడు మాత్రం ఆపుకోలేక ఫక్కున నవ్వాడు

*రాజపుత్రుడు* . (కోపంతో) ఏమిటి నీకండకావరం! ఏటిలో నీటికాకిలా చేపలు పట్టుకుంటూ బతకవలసిన బెస్తవాడికి చదువు చెప్పించ బట్టికదా పోతరించి నవ్వడం

*పుష్పహాసుడు* . పుట్టుకకు అతని ప్రమేయం ఉండదు దానిగురించి ఆక్షేపించి ప్రయోజనముండదు మనిషిసాధించిన దానిని గురించి మాట్లాడాలి.

*రాజు* ఉపాధ్యాయులారా! మావాడికి నేర్పిన విద్యఇదేనా!

*ఉపాధ్యాయులు* · దేవా! యువరాజుగారికి చదువంటే కొంత చిరాకు గ్రహణశక్తి తక్కువ శ్రద్ధ స్వల్పం. ఈ లోపాలవల్ల చదువెలా వస్తుందో చెప్పండి రాజువాళ్ళందరినీ పంపివేశాడు. అప్పుడు సుందరకుడు – "బాబా. ఈ పుష్పహాసుడు మన రాజ్యంలాక్కుని తానే ఏలుతానని అందరితోనూ చెబుతున్నాడు' అనగానే – "నీకు సిగ్గులేదు నీలాటి పరమదౌర్భాగ్యుడు క్షత్రియ వంశంలో పుట్టాక ఎవరేం చేసినా చేస్తారు అవతలికి ఫో" అని కసిరాడు రాజపుత్రుడు అసూయపొంది ఉన్నాడని తెలిసి – గుహుడు పుష్పహాసుణ్నిక పాఠశాలకి పోవద్దన్నాడు.

ఒకరోజు దైవవశంవల్ల గుహుడికి మరో చేపకడుపులో రెండోకంకణం కూడా దొరకగా . విద్య నేర్పించినందుకు కృతజ్ఞతగా రాజు కిచ్చిరమ్మని కొడుకుని పంపాడు. పుష్పహాసుడు వెళ్ళేసరికి కొలువులో ఎవరూ లేరు రాజు వేటకెళ్ళాడని అక్కడి పరిచారిక చెప్పింది అతను రెండో కంకణం తెచ్చినట్లు విని ఆమాట రాజపుత్రికకు చెప్పివచ్చి – అంతఃపురానికి రమ్మంది.

"రాజుగారు వచ్చాక వస్తాను అని వెళ్ళి పోబోతుండగా ఆమె అతని కడ్డం నిలిచి బలవంతం చేసి అంతఃపురానికి తీసుకుపోయింది

## లలిత కథ

చెలికత్తెలందరూ తలొక పనిమీదా పోగా లలిత ఒక్కతే చంద్రకాంత శిలమీద కూర్చుని వీణవాయిస్తోంది తిలక - 'కంకణం తెచ్చినవాడిని తీసుకురానా? అని అడిగింది 'కంకణమే తే వాడెందుకు? అంది రాజపుత్రి.

"అతనుదాన్ని నీకు తప్ప యివ్వడట'

'పల్లెవాడేకదా? తీసుకురా అందామె అలాగ అతన్నీ రాజపుత్రికనీ ఒకరినొకరు చూసుకునేలా చేసింది తిలక రాజపుత్రిక పుష్పహాసుడి సౌందర్యాన్ని చూసి ఆశ్చర్యపోయింది అతని మీద ఆమెకు మోహం కలిగింది పుష్పహాసుడికి ఆమె మనోభావాలర్థమైపోయాయి తాను ప్రమాదంలో చిక్కుకున్నట్లు గ్రహించాడు

కంకణం ధరించడం చేతకావడం లేదు" అంటూ తిలక అతని చేత రాజపుత్రికి కంకణధారణ చేయించింది అతను వెళ్ళిపోతానంటే - పారితోషికం ఏం కావాలని తిలక నడగమంది రాకుమారి వారి అనుగ్రహం చాలంటూ - ఎవరేనా చూస్తారేమో అని వేగంగా నడుస్తూ ఆస్థానందగ్గరకి వచ్చేసరికి రాజపుత్రు దెదురుపడి - "నువ్వెందుకు లోపలికెళ్ళావ్? ఎవరు రమ్మన్నారు? ఆ వేళ మాతండ్రి ఎదుట ఏమేమో పేలావే ఇప్పుడు నాకుదొరికావు అంతఃపుర కాంతలుండే చోటుకి పోవడం తక్కువ నేరంకాదు ఆగు -" అని అరిచాడు

పుష్పహాసుడు కొంచెం జంకుతూ - 'మిత్రమా నామీద నీకింత కోపం ఎందుకూ? మనమిద్దరం స్నేహితులం కామూ? మా తండ్రి కివాళ రెండో కంకణం దొరికింది దాన్ని మీ తండ్రిగారికివ్వాలని వచ్చాను దారితెలియక అటుపోయాను మీతండ్రిగారెక్కడున్నారు? అని అడిగాడు మెల్లగా

చాలు చాలు నీ స్నేహంవల్ల నాకుమంచి గౌరవమే లభించింది ఆకంకణం ఏదీ? వీధిలోంచి అడక్కుండా లోపలికి వెళ్ళిపోవడమేనా? లేదు అంతఃపురదాది తీసుకెళ్ళింది "నిప్పు తొక్కిన కోతిలా ఎగిరిపడ్డాడు సుందరకుడు ఓరిమొద్దా పెద్దవాళ్ళు లేనప్పుడు వచ్చి అంతఃపురానికి వస్తువులు పంపుతావా! నిన్నేం చేస్తానో చూడు' అంటూ రక్షకభటు లెవరక్కడ? రండి రండి – ' అని అరిచాడు

కోపం వచ్చిన పుష్పహాసుడు – అల్పబుద్ధులు కలవారు మెల్లగా చెబితే వినరని – దండమే సరైన సాధనమని పిడికిటితో అతన్నొక్క పోటుపొడిచి అవతలకి వెళ్ళిపోయాడు

ఆ దెబ్బకు రాజకుమారుడు సొమ్మసిల్లిపోయాడు అప్పటికే రాజభటులు కొందరొచ్చి అతన్ని లేవదీసి – సేదతీర్చి 'మిమ్మల్నెవడిలా పడేశాడు? ఒక్కరూ యీమూలకెందుకొచ్చారు? అని అడిగారు అతను మండి పడుతూ ఛీ ఇంతపనికి మాలిన కావలివాళ్ళెక్కడా ఉండరు రాజులేడు కదా అని ఇవాళ కోటలోకి ఒక్కడేనా రాకుండా ఇళ్ళదగ్గర నిద్రపోయారు కాబోలు సరే మీపని పట్టిస్తా నుండండి' అని అరిచాడు.

'అయ్యా ఇది సంధ్యాకాలం అందుచేత కావలివాళ్ళు భోజనాలకి వెళ్ళారు అంతే తప్ప మరేమీకాదు మిమ్మల్నిలా కొట్టిన మూర్ఖుడెవరో చెప్పండి ఇప్పుడే వెళ్ళి వాడిని పట్టుకొచ్చి చెరసాలలో పెట్టిస్తాం కాలసర్పాన్ని కాలితోతొక్కినవాడు ప్రాణాలతో ఉండగలడా? ' అన్నారు వినయంగా

వినండి ఆ పల్లెవాడు నేనావెధవని అంతఃపురంలోకి పోనివ్వలేదని నన్నిలా చేసి పారిపోయాడు మీకు చేవ ఉంటే ఆ స్వామి ద్రోహిని పట్టుకుని చెరసాలలో పెట్టండి '

తనపాటి వాడెవడూ లేడని మిడిసిపాటు పడుతూ గర్వంతో గుఱ్ఱమెక్కి తిరిగే గుఱ్ఱాలకాపరి పుష్పహాసుడిని మీరెరగరా?"

'అమ్మో వాడా వాడు మీ స్నేహితుడే కదా? వాణ్ని పట్టుకోడం కష్టమే వాడు వెయ్యిమందినేనా కొట్టగటడు అందుకైతే చాలా సన్నాహం అవసరమౌతుంది" అన్నారు వాళ్ళు

అంతలో అతనికి నొప్పి ఎక్కువైంది అంతఃపురానికి తీసుకుపోయారు. శత్రువుని మోసగించడానికిదే సమయమని - బాధకొంచెంగానే ఉన్నా - అప్పుడే చచ్చిపోయే వాడిలా మూలగ సాగాడు రాజకుమారుడు అంతఃపురస్త్రీలు తల్లడిల్లిపోతూ రాజవైద్యులను రప్పించి చికిత్సలు చేయించసాగారు.

'పుష్పహాసుడు రాజకుమారుణ్ని ప్రాణాలు పోయేలా గుద్ది పారిపోయాడు" అనే వార్త పట్నమంతా వ్యాపించింది వేటనుండి తక్షణమే తిరిగి రావాలని సామంతులు రాజుకి కబురు పంపించారు

. . . .అదలావుండగా పుష్పహాసుడు వెళ్ళాక రాజకుమార్తె తన పొరపాటుని గ్రహించి - తిలకతో 'పుష్పహాసుడి రూపం నన్నెంత మాయచేసి తేలిక పరచిందో చూశావా? ఆతని సమక్షంలో అత నల్పకులం వాడని ఆలోచించకుండా ఏవేవో వెర్రితలపులు పెట్టుకున్నాను. ఇది కులస్త్రీకి అపరాధం కాదా? నువ్వేనా చెప్పావు కావేం? మన చేష్టలు వాడు గ్రహించాడా?" అంది

"మనమేమీ అసాధారణంగా ప్రవర్తించలేదే. వాడు కంకణం తెచ్చి మనకిచ్చాడు మనం తీసుకున్నాం అంతేకదా? దీనిలోతప్పేమిటీ?'

"అంతేకాదు అతన్ని చూడగానే ఇంత అందగాడిని మంచికులంలో పుట్టిస్తే ఎంత బాగుండేది. బంగారానికి సువాసన అబ్బినట్లుందేదికదా - అని నేను మనసులో భావించాను. నువ్వుకూడా అతని ప్రఖ్యాతిని పొగిడావు సుందరకుడితో పాటు చదువుకుని సకలవిద్యలందూ అసమానుడని రాజసభలో బిరుదాన్ని పొందినట్లు చెప్పావు ఆ ప్రఖ్యాతుడితనేనా అని నేనాశ్చర్యంగా చూశాను అతన్ని గద్దెమీద కూర్చోబెట్టావు నేనతన్ని మోహావేశంతో చూశాను అతనిచేత కంకణం స్వయంగా తొడిగించుకున్నాను జోడుంటే కాని కంకణం మరింత శోభించదని నేనంటే - ఔనంతే, జోడుంటేనే అందం - అని నువ్వు నర్మగర్భంగా అన్నావు ఇవన్నీ సాధారణమైనవేనా? అసాధారణ చేష్టలు కావా? "అని అడిగింది లలిత

"వీటన్నింటిలోనూ ప్రత్యేకమైనది అతను స్వయంగా నీచేతికి కంకణం తొడగడం మాత్రమే. అదికూడా అసాధారణమేమీకాదు. ఎందుకంటే - కళాద కులస్థులలా తొడగడం వాడుకే ఇదీ అంతే అనుకో ఔనౌను - కాని వాడిసోయగం చూసేసరికి మనసులో మన్మధభావాలు కలగడం మొదలు పెట్టాయి. కులం కొరత కాబట్టి కాని లేకపోతే ఎవరేమనుకున్నా అతన్నే పెళ్ళాడేదాన్ని. మనరహస్యం ఎవరికీ తెలియనీయకు సుమీ - ' అని ఆమె అంటూండగానే -

పరిచారిక ఒకరు వచ్చి "అమ్మా! అన్నయ్యగారి నెవరో గుండెలమీద గుద్దారట. అంతఃపురంలో మరణ బాధ పడుతున్నారు అమ్మగారు మిమ్మల్ని తీసుకు రమ్మన్నారు" అని చెప్పింది.

లలిత చటుక్కున లేచి "ఏమిటీ! మా అన్న బాధపడుతున్నాడా! వాడిని గుద్దిన వాడెవడు?" అని కంగారుగా అడిగింది. "ఆయనతో చదువుకున్నవాడట ఎవడో పుష్పహాసుడట. వాడు గుద్దాడని చెప్పుకుంటున్నారు. తొందరగా రమ్మన్నారు" అంది పరిచారిక.

లలిత తిలక మొహం చూసి - "ఇదేమిటి? ఇటువంటిది జరిగిందేమిటి? దీనివల్ల మనకేమైనా ముప్పురాదు కదా?" అంటూ ఆమెను వెంటపెట్టుకుని అన్నగారు వుండే మేడకి వెళ్ళింది

అక్కడ స్త్రీ లందరూ పుష్పహాసుణ్ణి - స్వామిద్రోహి, చదువు చెప్పించాడన్న విశ్వాస మేనా లేకుండా, రాజుగారి కొడుకని మన్నించకుండా ఇలాటి పనిచేస్తాడా. - అని నిందిస్తున్నారు. లలిత అన్నదగ్గరకి పోయి - అన్నా! నీకు దెబ్బ తగిలిందా?" అని అడిగింది.

అతను కళ్ళెత్తిచూసి-" ఆ పల్లెవాడు నీకు రెండో కంకణం పంపాడట నిజమేనా?" అని అడిగాడు. లలిత తడబడుతూ - "పంపాడు, పంపాడు" అంది.

"అదివాడి దగ్గర నుంచి తెచ్చి నీకిచ్చిన వారెవరు?" అందుకామె ఆలోచనలో పడగా తిలక - "నేనే తీసికెళ్ళిచ్చాను ఈ

సంగతామె మరిచిపోయింది" అంది 'కానీండి మీరందరూ స్వతంత్రులు. పైవాడనే సంశయమేనా లేకుండా వాళ్ళిచ్చిన వస్తువులని అంతఃపురంలోకి తెస్తారేం? రాజుని రానివ్వండి' అంటూ బెదిరించి - మళ్ళీ బాధ నటిస్తూ మూలుగుతూ రాత్రిగడిపాడు

పట్నమంతా పుష్పహాసుడి గురించే చెప్పుకోడం విని ఆరాత్రి గుహుడు కొడుకు వద్దకొచ్చి - "ఇదేం కర్మం నాయనా? నువ్వు రాజపుత్రుణ్ణి గుద్దావట రేపు నీపని ఔతుందని ప్రజలు పందాలు వేసుకుంటున్నారు. ఏంచేశావో నిజం చెప్పు" అన్నాడు అతను జరిగినదంతా చెప్పాడు "అయ్యో! ఎంతపని చేశావురా పడుచువాడివి అంతఃపురం పోవచ్చునా? రాజుగారు వింటే - కొడుకుని కొట్టడం కంటె దీన్నే పెద్ద తప్పుగా భావిస్తారు బలవంతులతో విరోదం వచ్చిందే. ఏం చెయ్యాలి? మనల్ని రక్షించేవారెవరు?' అని అతను వాపోతూంటే-

"తండ్రీ దీన్లో నాతప్పు ఏమాత్రం లేదు నే నంతఃపురానికి రానంటే అదే బలాత్కారంగా తీసుకుపోయింది నన్ను పోవద్దని అడ్డుపెట్టాడని వాడిని గుద్దాను రాజు తెలుసుకోకుండా ఊరికే శిక్షించే అధర్మశీలుడా? పోనీ వెయ్యిమందొచ్చినా నేను వాళ్ళకి లొంగను' అని బీరాలు పలికిన కొడుకుని మందలిస్తూ గుహుడిలా అన్నాడు -

'ఈ వార్త వింటే రాజుకి కోపం రాకమానదు నిన్ను దండించక వదలడు. అందుచేత నువ్విక్కడుండకూడదు యవనద్వీపాని కవతల అమరావతనే పట్టణముంది మనోడ లక్కడికి పోతూంటాయి అక్కడ నాకు మిత్రులున్నారు వారికి పత్రికలు రాసిస్తాను ముందు నువ్వక్కడికిపో. కొన్నాళ్ళయ్యేసరికి రాజుకోపం చల్లారి పోతుంది అప్పుడు వద్దువుగాని ఇదే మంచిది

పుష్పహాసుడి నెలాగో ఒప్పించి ఆ రాత్రి ప్రయాణం చేయించి పంపేశాడు గుహుడు. వేటనుంచి తిరిగి వచ్చిన రాజు జరిగినది విని పుష్పహాసుణ్ని రెక్కలు కట్టి తీసుకురండని కింకరుల నాజ్ఞాపించాడు. పదిమంది భటులు వెళ్ళి గుహు నిల్లు ముట్టడించి వెదికారు పుష్పహాసుడు

మాత్రం కనిపించలేదు గుడుడినే రాజు వద్దకు తీసుకుపోయి - పుష్పహాసుడు కనిపించలేదని చెప్పారు. ఓరీ. బెస్తవాడా నీకొడుకు పోతరంతో ఏం చేశాడో చూశావా? విద్యలు నేర్పించినందు కిదా పలం? సరే వాడినెక్కడ దాచావో చెప్పు. లేకపోతే నీవంశాన్నంతటినీ నాశనం చేస్తాను" అని రాజు గద్దించేసరికి -

వాడు గజ గజ వణుకూతు - "స్వామీ. నేను దేవర ఎదుటగ నిజమే చెబుతున్నాను. వాడు నాకు కడుపున పుట్టిన కొడుకు కాదు. నీ కొకనాటి రాత్రి గంగలో పెద్ద వలపన్నాను. మర్నా డుదయం ఆ వలతీసి అందులో చిక్కిన చేపలు మెదలయిన వాటిని దులపుతూంటే ఈ బాలుడు నేలపడ్డాడు అప్పటికి వాడికి నాలుగేళ్ళ వయసుంటుంది. ఆ పిల్లవాడిని చూసి ఆశ్చర్యపడుతూ- పిల్లలు లేని వాడినని గంగాదేవి కరుణించిందని ఇంటికి తీసుకొచ్చి ఆ అందాల బాలుణ్ని పెంచుకోసాగాను ఈ రహస్యమెవరికీ చెప్పకుండా నాకడుపున పుట్టిన వాడే అని చెబుతూ వచ్చాను. మా కులంలోవాళ్ళకి మాత్రం వాడు గంగదత్తుడని తెలుసు. దేవరవారు విచారించవచ్చు.

వెనకటిలాగే రెండవ కంకణం నాకు దొరికింది దానిని మీకిచ్చిరమ్మని పంపాను. వాడు కొలువుకూటానికి వచ్చి అక్కడెవరూ లేకపోడంతో అనుమానిస్తూ నాలుగు మూలలూ చూస్తూంటే - ఒక పరిచారిక వచ్చి ఆ కంకణం గురించి తెలుసుకుని దాన్ని తీసుకుని అంతఃపురానికి వెళ్ళిందట.

అంతలో యువరాజుగారొచ్చి - నువ్విక్కడి కెందుకొచ్చావురా ద్రోహీ! - అంటూ అదిలించేసరికి వాడు తాను వచ్చిన పని చెప్పాడట వారు చెప్పలేనంత కోపంతో నిలబడమంటూ ఆపారట వాడు నిలబడక తోసుకుని వచ్చేశాడట ఇంతే జరిగిందని వాడింటికొచ్చి నాకు చెప్పాడు

అప్పుడు నేను వాడి నెన్ని తిట్లు తిట్టానో, ఎలా కొట్టానో. విచారిస్తే దేవరకే తెలుస్తుంది వాడు నా దండనకు నిలవలేక నిన్నరాత్రి నాతో చెప్పకుండా ఎక్కడికో పారిపోయాడు. ఇదే నిజం నేను మీ పాదసేవకుణ్ని రక్షించండి అని పాదాలమీద పడి వేడుకున్నాడు

వాడు నీకు పుట్టిన కొడుకు కాదూ? రెండో కంకణం కూడా నీటిలోనే దొరికిందా?" అంటూ ఆలోచనలో మునిగి - అంతవరకూ ఉన్న కోపం కరిగిపోగా - కొడుకు ముఖంచూస్తూ - 'వీని మాటలు విన్నావా? నిజమేనా?" అని అడిగాడు అప్పుడు రాజపుత్రుడు -

వీడి మాటలన్నీ వట్టి బూటకాలు తనకి పుట్టలేదంటే మీరు కనికరిస్తారని కట్టుకథ చెబుతున్నాడు కడియం నెపంతో వా దంతః పురం వద్దకుచేరి ఆగడం చేశాడు పోవద్దనడం తప్పా? వాడు నన్ను తోసుకుపోయాడా నా గుండెమీద తగిలిన దెబ్బ పరీక్షించండి. ఈ సారి వాడిని విడచిపెడితే నేను తలెత్తుకు తిరగగలనా? క్షత్రియ వంశంలో జన్మించి, చేపలు పట్టుకునే బెస్తవాడి చేత దెబ్బలు తిని, బదులు చేయకుండా జీవించడం కంటె చనిపోడమే నయం' అంటూ ఏవేవో మాట్లాడి తండ్రిలో రోషం పుట్టించాడు

అప్పుడు రాజు - కానియ్, వాడు దొరికిన తరవాత చూద్దాం ఇప్పుడెందుకు - అని పుష్పహాసుణ్ణి పట్టుకోడానికి నాలుగు మూలలకీ దూతలని పంపి తాను అంతఃపురానికి వెళ్ళిపోయాడు

ఆ సంభాషణంతా విన్న తిలక లలిత వద్దకు వెళ్ళి - "ఆ మగవాడు పల్లెవాడి కొడుకు కాడట గంగలో-వలలో దొరికినవాడట పారిపోయాడట-అతని కిలాటి ముప్పుతెచ్చిన వాళ్ళం మనమే. అతనురానన్నా బతిమాలీ బలవంతం చేసీ తీసుకొచ్చాను అతనిలో ఏ తప్పులేదు మీ అన్నగోరంతను కొండంత చేసి చెప్పాడు మీ తండ్రి వాడిని పట్టుకురమ్మని దూతల్ని పంపాడు. ఇవీ సభావిశేషాలు" అని చెప్పింది.

లలిత - 'ఏమిటీ . అతను పల్లెవాడికి గంగలో దొరికాడా! బాగుంది. ఈ మాట నాకు చాలా ఆనందం కలిగిస్తూంది ఉత్తమకులంలో పుట్టకపోతే అన్ని మంచి లక్షణా లుండవు వాడెక్కడికి పారిపోయాడో రహస్యంగా తెలుసుకురా మనంకూడా అక్కడికే పోదాం" అంది.

"అలాగే పోవచ్చు. వెయ్యి జన్మలెత్తినా అలాంటి భర్తని సంపాదించుకోగలవా?'

ఆ రాత్రంతా తిలక పుష్పహాసుని ఇంటి పరిసరాలలోనే తిరుగుతూ అతని వృత్తాంతం గ్రహించి - మర్నాడు పొద్దున్న అంతఃపురానికి వచ్చేసరికి లలిత మంచంమీద కూర్చుని వెక్కి వెక్కి ఏడుస్తోంది 'ఇదేమిటి? అకారణంగా ఏడుస్తున్నావు?" అని అడిగింది తిలక అందుకామె -

"సఖీ. పుష్పహాసుడు రాత్రి కలలో వచ్చి నా శయ్యమీద పక్కనే కూర్చుని నన్ను ముద్దాడుతూ - నేను విదేశాలు పోతున్నాను. నా మనసేమో నీయందు లగ్నమై రానంటూంది. ఏంచేసేది? నిన్నే తలుచుకుంటూ విదేశంలో ప్రాణా లొదులుతాను. అనుగ్రహంఉంచు సుమీ '- అని వెళ్ళిపోయాడు అతని మాటలు తలుచుకుంటే గుండె పగిలిపోతూంది అతన్నిలాటి చిక్కుల్లో పెట్టింది మనమేకదా? అయ్యో! ఒకరి కపకారం చేసి జీవించడం దేకికి? ఈ పాపం ఎలా పరిహార మౌతుందో?" అని లలిత విచారిస్తూంటే తిలక నవ్వుతూ - "చాల్చాలు. ఇంత బేలతనం చూస్తే ఎవరేనా నవ్విపోతారు నేను తెచ్చిన వార్తకీ నీ కలకీ సరిపోయింది. అతను నిజంగా అసమాన్యుడే. నేను చెప్పేది విను అతని ఔదార్యం, గాంభీర్యం, చాతుర్యం, సత్యసంధతా చాలాగొప్పవట! కర్ణుడిని మించిన దాతృత్వమట అతనిది అతను వలలో దొరికిన బాలుడని అక్కడి వారికి తెలుసు. నే నాచుట్టు పక్కల తిరుగుతూంటే -వాళ్ళవాడు ఒకడు వచ్చి -

"నువ్వు తిలకవి కాదూ?" అని అడిగాడు "ఔను నీకెలా తెలుసు?"

"నీ మాటల్నిబట్టి గుర్తు పట్టాను. నేను పుష్పహాసుడి స్నేహితుణ్ని అతను విదేశానికి పోతూ నిన్ను తెలుసుకుని రహస్యంగా ఈ పత్రిక నిమ్మన్నాడు" అంటూ దాన్నినాకిచ్చి - "దైవికంగా నువ్విక్కడే కనపడ్డావు" అని వెళ్ళిపోయాడు లలిత ఆత్రంగా ఉత్తరం తీసుకుని చదివింది. కలలో ఆమెతో అన్నమాటలే ఆ ఉత్తరంలో రాశాడు. దానిలో కొన్ని పదాల క్రింద ఎర్రగీతలున్నాయి.

వాటిని బట్టి తిలక ఇక్కడికి మూడు యోజనాల దూరంలో ఉన్న వట పాదపారణ్యంలోని పల్లెలో అతను ఐదు దినా లుంటానని సూచించాడు అంటే మనల నక్కడికి రమ్మని అతని అభిప్రాయం' అంది. లలిత ఆశ్చర్యపడుతూ చూసింది ఔను సుమీ

అక్కడి నుంచి దేవానగరానికి వెళ్ళి అక్కడ ఆరు దినా లుంటాడట ఈ రాతలోనే అతని చాతుర్యమంతా తెలుస్తూంది"

మరి నువ్వేమంటావు? నీకిష్టమైతే నాకిష్టమే' అంది తిలక వాళ్ళిద్దరూ ఎవరికీ తెలియకుండా ఆ అర్ధరాత్రే రత్నాలు మొదలగు వాటిని అమర్చుకుని గుర్రం మీదప్రయాణమై వెళ్ళారు రాచకన్యకలకు గుర్రపుస్వారీ అలనాటే కానీ తిలకకు గుర్రం మీద ప్రయాణించడం కొత్త అందుచేత ఆమెకు కళ్ళు తిరిగాయి లలిత వెనుక కూర్చున్న ఆమె మూర్ఛపోయి ఒకచోట నేలమీదకు జారిపోయింది

కొంతదూరం వెళ్ళాక కానీ ఆ సంగతి తెలుసుకోలేదు లలిత అప్పుడాగి ఎంత పిలిచినా తిలక పలకకపోంతో వెన క్కవచ్చింది కాని ఆమె కనపడలేదు సూర్యోదయమయింది కానీ తిలక కనిపించలేదు అదొక మహారణ్యం వచ్చిన దారేదో, పోవలసిన దారేదో లలితకి తెలియటంలేదు అయినా ఏదో ఒకదారిన వెళ్ళాలి కదా అని చెట్లనీ లతలనీ చూస్తూ తిలకని వెదుకుతూ ఆమె గుర్రంమీద వెళ్ళసాగింది ఆమెకు విశ్రాంతి అవసర మనిపించింది

అప్పుడొక పెద్దమర్రి చెట్టు కనిపించింది దానినీడలో గుర్రం దిగి నాలుగువేపులా చూసింది హా విధీ నన్నీ అడవిలో పారేశావా కులకాంతకు కూడని పని అని తలచక వానిఉత్తరంలో లేనిపోని అర్థాలు తీసి - ఎండమావుల వెంట పరుగెత్తడం వల్లకదా ఇలా జరిగింది ఆ కోటగోడ ఎలాదాటానో నాకే ఆశ్చర్యంగా ఉంది కనిపెంచిన తల్లితండ్రులని లెక్కచెయ్యకుండా - వలచిన వానికోసం ఎంత పక్షపాతం చూపాను నేను నిజంగా ఇల్లొదిలి వచ్చానా? లేదేమో ఇది కలేమో

కాదు కాదు కలకాదు నిజమే తిలకా నీ అభిమానం ఎలా మరచిపోగలను? నీ మాట వినకుండా గుఱ్రాన్ని వేగంగా తోలడంవల్లనే నిన్ను జార్చుకున్నాను నాకు నువ్వు మళ్ళీ ఎలాకనపడతావు? ఇప్పుడు నేనేం చెయ్యాలి? ఎక్కడికి పోవాలి? నన్ను రక్షించే వారెవరు?

ప్రాణసఖిని పోగొట్టుకున్నాను పుష్పహాసుడు కనపడే మాట వట్టిది అన్నిటికీ చెడిపోయాను అంటూ ఆమె పరిపరివిధాల చింతింపసాగింది అంతలో ఆమెకు ఆకలి మొదలయింది ఏం చేయాలో తోచక తిలక కనిపిస్తుందేమో అని చుట్టూ చూడసాగింది

# గోవిందుడి కథ

**ఆ** ప్రాంతంలో - తామ్రపురమనే ఊరుంది అక్కడందరూ కాపులే వారికి పౌరోహిత్యం చేస్తూ గోవిందుడనే బ్రహ్మచారి ఆవూళ్ళోనే కాపరం చేస్తూండేవాడు అతనికి విద్యలేదు అందుచేత ఇరవయ్యేళ్ళ వయస్సు వచ్చినా పెళ్ళి కాలేదు అది అతనికి చాలా విచారంగా ఉండేది

పెళ్ళికోసం ఉవ్విళ్ళూరుతూ ఒకనా డతను తల్లితో - అమ్మా ఇరవయ్యేళ్ళొచ్చినా నాకు పెళ్ళవలేదు భార్యతో పీటల మీద కూర్చునే భాగ్యం ఎంత పుణ్యం చేసుకుంటే లభిస్తుందో? అయ్యో పల్లకీలో ఊరేగాలనే కోరిక తీరనేలేదు శోభనం శయ్యమీద భార్యచేత గంధం పూయించుకున్న వాడిదే కదా జన్మంటే? ఛీ నాకీజన్మకి పెళ్ళియోగం ఉందో? లేదో?

నాకు పౌరోహిత్యంలో వచ్చిన బియ్యం కాయలూ కూరలూ అంగోస్త్రాలు ఏం చేయాలి? చీరెలూ రవికెలూ కట్టుకుని ఆనందించే ఇల్లాలు లేకపోయాక? ' అని విచారిస్తూంటే -

'నీకెన్నేళ్ళొచ్చేశాయని పెళ్ళికి అంత తొందరపడిపోతున్నావు? నిన్నకాక మొన్నటివాడివి ఆకళ్యాణం గడియ రావాలే కాని వచ్చాక క్షణం ఆగమన్నా ఆగదు -' అని ఆ తల్లి ఓదార్చబోయింది

అప్పుడతను - మంచిదానివేలే. రెడ్డికొడుకులు నాకంటె చిన్నవాళ్ళు వాళ్ళభార్య లెంతున్నారు? అంతెందుకూ రెడ్డిగారి పాలెకాపు జానెడు లేడు కాని వాడిక్కూడా పెళ్ళయి పెళ్ళాం కాపరానికి వచ్చేసింది నేను ఆపాటి చెయ్యలేదు" అంటూ విచారించాడు.

ఆవేళ జాముపొద్దెక్కాక ఆకులు కోసుకుందుకు గోవిందుడు అడవికి వచ్చాడు ఆ మఱ్ఱిచెట్టు దగ్గరకు వచ్చేసరికి అక్కడ చాలా అందంగా ఉన్న లలిత కనిపించింది ఆమె అందాని కతనెంతో ఆశ్చర్యపోతూ, ఆమె కనిపించినందుకెంతో సంతోషిస్తూ ఆమెకు దగ్గరగా వెళ్ళి పలకరించాడు

తరుణీమణీ ఎవరు నువ్వు? నీపేరేంటి? ఎక్కడినుండి వస్తున్నావు? మా గ్రామం ఇక్కడికి దగ్గరలోనే వుంది. నేను బ్రాహ్మణుడిని నాకు తల్లికాక మరెవరూ లేరు మా ఇల్లు ఇక్కడికి దగ్గరే భోజన సదుపాయం చేస్తాను రా అన్నాడు

లలితకు చాలా ఆకలిగా ఉండడంతో వేరే మార్గం లేక - "సంతోషం మీయింటికి వస్తాను పద" అనే సరికి అతను చాలా ఆనందపడుతూ ఆమెను తన ఇంటికి తీసుకు పోయాడు ఆమెను తల్లిదగ్గరకి తీసుకెళ్ళి అమ్మా ఈమె మహాలక్ష్మిలా మనింటికి వచ్చింది ఆకలిగా ఉందట తొందరగా వంట చేసిపెట్టు' అన్నాడు అతని తల్లి ఒక్కనిముషంలో వంట చేసి ఆమెకు తృప్తిగా భోజనం పెట్టింది

గోవిందుడు రహస్యంగా తన తల్లితో - 'అమ్మా. ఈమెకు దిక్కెవరూ లేనట్లున్నారు నా పుణ్యం నేటికి పండినట్లుంది విఘ్నేశ్వరుడికి టెంకాయలు కొట్టాలి సుమా నన్ను పెళ్ళాడమని ఆమెకు బాగా నచ్చచెప్పు. ఈమెను పెళ్ళాడితే మనమొక్కవస్తువు పెట్టక్కర్లేదు అన్నినగలూ దాని నొంటిమీదే ఉన్నాయి ఇంతకంటే మంచి సంబంధం మనకి దొరకదు " అని బోధించాడు ఆమె "అలాగేరా నాయనా' అంది ఆమె ఆ యువతి వద్దకు వెళ్ళి - 'అమ్మా నీపేరేమిటో మా అబ్బాయి నిన్ను చాలా మెచ్చుకుంటున్నాడు ఇదివరకెందరో పిల్లనిస్తామంటూ వచ్చినా ఒప్పుకోలేదు వాడెంత తెలివైనవాడని పీటలమీద కూర్చుని

పెళ్ళిచేయిస్తున్నాడంటే ఎవరేనా నోరెత్త గలరా? ఉహు మాకు మూడూళ్ళున్నాయి బియ్యం కూరలు, బట్టలు సంవత్సరానికి సరిపడా దొరుకుతాయి నువ్వు వీడిని పెళ్ళిచేసుకుంటే ఎంతో సుఖపడతావు నీయిష్టమొచ్చినట్లుండొచ్చు అంటూ ఎంతో చెప్పింది

ఆ మాటలు వింటూంటే లలితకు నవ్వొచ్చింది అప్పటికి ఏమీ బదులు చెప్పకుండా ఊరుకుంది గోవిందుడుమాత్రం - 'మాట్లాడవేం? మనపెళ్ళివిషయంలో బదులు చెప్పవేం? నేను నీకు తగిన వాడిని కాననా? మాఇల్లు తీరుతెన్నులు నచ్చలేదా? ధనధాన్యాలు చాలవనా? నన్ను పెళ్ళాడావో -నీవు గొప్ప పురోహితుడి భార్యవౌతావు ప్రతిరోజు అబ్దికానివో మరిదేనివో బియం, పిండి కాయగూరలూ వస్తూంటాయి నీయిష్టమొచ్చినట్లు చేసుకోవచ్చు వాటిని నీ కద్దుండదు ఇంత మంచి భర్తా కాపరం నీకెక్కడా దొరకవు అని బతిమాలగా ఆమె మాటలకు సమాధానంగా చిరునవ్వు నవ్వి ఊరుకుంది

ఆ మందహాసాన్నే అర్ధాంగీకారంగా భావించి ఉబ్బిపోయి తల్లికి చెప్పి గోవిందుడు వెంటనే పంచాంగం చూసేశాడు అంతలోనే పెదవి విరుస్తూ అమ్మా ఇది శూన్యమాసం పైనెల మూఢం ఆపైదేమో అధికమాసం మూడుమాసాల వరకూ ముహూర్తాలు లేవు. ఇది నాకర్మ కాబోలు - "అని దుఃఖించాడు

అపుడు తల్లి - నాయనా మంచి ముహూర్తం నిర్ణయించు కోకుండా పెళ్ళాడకూడదు ఇంతకాలం ఆగి - ఇప్పుడెందుకు తొందర? మూడుమాసా లెంతలో తిరగాలి కళ్ళు మూసుకుంటే గడిచిపోతాయి అమ్మాయి మనింట్లోనే ఉంటుందికదా అని నచ్చచెప్పింది

అంతఃపురంలో ఉండవలసిన అందగత్తె వారింట్లో ఉండడం చూసి గ్రామస్తులు కొందరు 'పంచాంగముందా?' అని ఒకడూ 'ఇవాళ వర్జమెప్పుడు?' అంటూ యింకొకడూ 'తద్దినముంది త్వరగారా' అని మరొకడూ కాపుపంపించాడు అంటూ ఒకడూ మీ ఇల్లు బాగుందే అంటూ లోపలికి తొంగి చూసేవాడొకడూ - పడుచుకుర్రాళ్ళు ఏదో

వంకపెట్టి ఆమె సౌందర్యాన్ని కళ్ళతో చూడాలని రోజూ రావడం, వాళ్ళని గోవిందుడు కోపంతో కసరడం నిత్యకృత్యం అయిపోయింది

ఇదంతా చూస్తూ అక్కడుండడం కష్టమని ఒకనాడు లలిత అతన్ని పిలిచి – "మొన్న మర్రిచెట్టుక్రింద నా గుర్రాన్ని వదిలివచ్చాను అది ఆ చుట్టు పక్కలే మేస్తూ ఉంటుంది తీసుకొచ్చి మనవాకిట్లో కట్టేయ్ విలువ కలదాన్ని వదిలెయ్యడ మెందుకూ?' అంది.

ఆ మాత్రానికే వాడు బ్రహ్మానందపడిపోయి తల్లి దగ్గరకి పరుగెత్తి – ఆ చిన్నది నాతో మాట్లాడింది సుమీ అప్పుడే నాకు పనులు చెబుతూంది గుర్రాన్ని తీసుకు వచ్చేయ్యమంది అని చెప్పాడు అందుకామె 'కొత్తకనక రెండురోజులు సిగ్గుపడి ఊరుకుంది మాట్లాడ కేం చేస్తుంది? పెళ్ళాంమాటలు విని నన్ను వేరుచెయ్యకు సుమీ' అంది

గోవిందు దప్పటికప్పుడే మర్రిచెట్టు వద్దకుపోయి గుర్రాన్ని వెదికి తీసుకొచ్చాడు అప్పుడు లలిత – "ఓ బ్రాహ్మణుడా! నీదగ్గర సొమ్ములేనట్లుంది. ఈ కంకణా న్నమ్మి సొమ్ము తీసుకొస్తే హాయిగా ఖర్చుపెట్టుకోవచ్చు" అంటూ చేతికున్న రత్నకంకణం తీసిచ్చింది

అతను పొద్దున్న దగ్గరలో ఉన్న ఒక వూరువెళ్ళి ఆకడియా న్నమ్మబోగా – గొప్పవెలకలిగిన కడియాన్ని తక్కువ వెల కమ్మడం చూసి – రాజభటులు అతన్ని పట్టుకుని అనుమానంతో – 'నీకీ కడియ మెక్కడిది?" అని అడిగారు

"నా భార్యదే అన్నాడు గోవిందుడు వాళ్ళు నమ్మక దొంగలా ఉన్నావంటూ అతన్ని బంధించి నగరాధ్యక్షుని వద్దకు తీసుకుపోయారు తిలక పన్నినవ్యూహం వలన దొంగలు కోటగోడకి గొలుసువేసి లోపలికి దూరి రాజపుత్రిక నెత్తుకు పోయినట్లు భావించబడింది అందుచేత అలాటి దొంగలని పట్టుకుందుకు రాజు ఎందరో భటుల్ని పంపాడు రాజభటులతన్ని కడియంతో సహా రాజుముందర హాజరు పరిచారు రాజు కడియాన్ని చూడడం తోటే గుర్తుపట్టి – దుఃఖంతో లలితను తలుచుకుంటూ – గోవిందుడిని – నీకీ కడియం ఎలా వచ్చింది?' అడగ్గా 'అది నాభార్యది' అన్నాడు

పెళ్ళేకాని బ్రహ్మచారివి నీకు పెళ్ళామెక్కడిది? అని అడగ్గా - "ఇంకాపెళ్ళి చేసుకోలేదు. పిల్లనింటకి తెచ్చుకున్నాను" అంటూ వెర్రిమాటలు చెప్పాడు. అతనిల్లు పరీక్షించడానికి రాజు కొందరు దూతల నతనింటికి పంపాడు వారు కనుక్కుని వచ్చి - "దేవా వీనింటిలో తల్లి తప్ప మరెవరూ లేరు పదిరోజుల కిందట ఒక చిన్నదాన్ని తీసుకొచ్చి ఇంట్లో పెట్టాడట. ఇప్పుడేమైందో తెలియదని గ్రామస్తులు చెప్పారు. తల్లి నడిగితే - కొడుకులేని సమయం చూసి అదెక్కడికో పారిపోయిందని చెప్పింది

ఆ మాటలు వింటూ - "అయ్యో! నాభార్య పారిపోయిందా. ఎంతమోసం. ఇంక నేనెలా బతుకుతాను?" అంటూ గోవిందు దేడవసాగాడు. అతని చేష్టలన్నీ గమనిస్తున్న రాజుకి గోవిందుడు పిచ్చివాడిలా అనిపించాడు కాని అంతలోనే కడియం అతని దగ్గర దొరకడం వల్ల దొంగే అని భావించి ఏ శిక్షవిధించాలా అని ఆలోచిస్తున్నంతలో రాజభటులు కొన్ని వస్తువులతో కొందరు దొంగల్ని తెచ్చి వారిని రాజుముందు నిలబెట్టారు ఆ వస్తువులన్నీ లలితవే అని గుర్తించిన రాజు వాళ్ళని గద్దిస్తూ - "ఆ చిన్నదాన్ని మీరెలా తీసుకుపోయారు? ఇప్పు డెక్కడుంది? నిజం చెప్పకపోయారో మిమ్మల్నందరినీ కఠినంగా శిక్షిస్తాను ' అన్నాడు

వాళ్ళు భయంతో వణుకుతూ - "దేవరా. మేము నిజమే చెబుతున్నాం, వినండి. మేము తూరుపు సముద్రప్రాంతంలోని అరణ్యంలో తిరుగుతూండగా - పదహారేళ్ళ వయసు కలిగిన ఓ చిన్నది గుర్రం మీద వేగంగా ఎక్కడికో పోతూంది మేము కర్రలడ్డంగా విసిరి గుర్రాన్నాపి ఆమెని దిగమని చెప్పాం

ఆమె - భయపడుతూ అన్నలారా నావొంటిమీద నగలన్నీ ఇచ్చేస్తాను నన్నేమీ చెయ్యకుండా వదిలిపెట్టండి" అని ప్రార్థించింది మేము మొదట అంగీకరించాం. ఆమె తన వస్తువులన్నీ తీసి రాసిపోసి

గుర్రమెక్కబోతూంటే - మేం అడ్డుపెట్టి - "మాలో ఒకణ్ని పెళ్ళాడు" అన్నాం.

ఆమె మాకంటె చాలా గడుసుది మమ్మలందరినీ చూసి - "మీలో నన్ను పెళ్ళాడేదెవడు?" అని అడిగింది నేనంటే నేనంటూ మేము తగువులాడుకోసాగాం. అప్పుడామె - 'అదికాదు నే నీగుర్రం ఎక్కి ఒక దండం విసురుతాను. దానినెవరు ముందు తెచ్చి నాకిస్తారో అతనేనాభర్త" అంది. అందుకు మేమందరం అంగీకరించాం

ఆమె బారెడు కర్రనొక దానిని తీసుకుని గుర్రమెక్కి - "సిద్ధంకండి" అంటూ గట్టిగా విసిరింది అది నూరు బారల దూరంలో పడింది మేమందరమూ పరుగెత్తాం మావెనకే ఆమె గుర్రంమీద మరోవైపుకు పారిపోయింది మేమెంత వేగంగా పరుగెత్తినా మా కామె చిక్కలేదు వస్తువులు మాత్రం తెచ్చుకున్నాం ఈ భటులు మమ్మల్ని చావుదెబ్బలు కొట్టారు దేవా యదార్ధం చెప్పాం రక్షించండి" అని ప్రార్థించారు

రాజు కనికరించక - వారికి, ఆ బ్రహ్మచారికీ కూడా ద్వీపాంతర వాస శిక్ష విధించి - తన కుతూరికోసం ఆ సమీప అరణ్యాలన్నీ వెదికి రమ్మని తన భటులను పంపి చల్లని వార్తకోసం ఎదురు చూడసాగాడు'

అంతవరకూ చెప్పి - "మన ప్రయాణానికి వేళయింది మిగిలిన కథ తరవాయి మజిలీలో చెప్పుకుందాంలే' అన్నాడు మణిసిద్ధుడు.



# కాశీ మజిలీ కథలు

## 39. వ మజిలీ

### పోలిశెట్టి కథ

“లలిత సఖురాలు తిలక గుర్రంమీంచి పడిపోయిందని చెప్పావే కదా? ’ అంటూ పై మజిలిలో కథ మొదలు పెట్టాడు మణిసిద్ధుడు.

“ఔను గుర్తుంది గురువుగారూ. తిలక గుర్రపు స్వారీచేయలేదు సరికదా గుర్రంమీద కూర్చోడం కూడా సరిగ్గా చేతకాక లలిత గుర్రాన్ని వేగంగా పరుగెత్తిస్తూంటే – కళ్ళుతిరిగి . క్రిందపడిపోయింది. ఆమె అది గమనించిక చాలా దూరం వెళ్ళాక,వెనక తిలక లేదని తెలుసుకుని వెనక్కి వచ్చింది. కాని లలితకి తిలక కనిపించలేదు” అంటూ తను కథని చక్కగానే గుర్తుపెట్టుకున్నానని నిరూపించుకున్నాడు గోపాలుడు.

గోపాలుని జ్ఞాపకశక్తికి గురువు చాలా సంతోషించి తరువాయి కథని కొనసాగించాడు.

‘తిలక పడిపోయినచోటు కొంచెం యిసకనేల. అందుచేత ప్రాణం పోయేంత దెబ్బేమీ తగల్లేదు కాని ఆమె స్పృహతప్పి పడుంది. చాలాసేపటికామెకు తెలివొచ్చింది కళ్ళు తెరచిచూసేనరికి తెల్లవారుతోంది. మెల్లగా లేచి నాలుగు వేపులా చూసింది. లలిత కనిపంచలేదు

‘అయ్యో! లలిత నన్ను వదలి వెళ్ళిపోయిందా! నేను పడిపోడం గమనించక వెళ్ళిపోయుంటుంది దారితప్పామేమో నాజాడ తెలియక ఎక్కడ విచారిస్తూందో? అది మగడిని కలుసుకుంటే అంతేచాలు’ అనుకుంటూ ఒకదారిని పడిపోసాగింది. పోగా పోగా మధ్యాహ్నానికి

ఒక పల్లె కనిపించింది అక్కడొక గృహస్థుని ఇంట్లో భోజనం చేసింది తానెవరో చెప్పకుండా అక్కడి వారిద్వారా - సముద్ర తీరంలో ఉన్న రేవా నగరానికి దారి అడిగి తెలుసుకుంది.

తిలక చాలాశ్రమపడి కొన్ని రోజుల కెలాగో రేవాపట్టణం చేరుకోగలిగింది రేవా పట్నంవద్ద సముద్రపు రేవుంది ఇతర ద్వీపాలకు వెళ్ళేవారు అక్కడినుంచే ఓడెక్కి బయలుదేరతారు

పుష్పహాసుడు రేవానగరంలో ఇరవైరోజులుండి అక్కడ ఓడెక్కి అమరావతికి వెళ్తానని ఉత్తరంలో రాశాడు కనక తిలక అక్కడికి వచ్చింది ఆమె ఆ ఊరు సమీపానికొచ్చేటప్పటికి సూర్యాస్తమయం ఔతోంది.

పట్నంలో జనసంచారం ఎక్కువగా ఉందని - రేపు పోవచ్చని - ఆ రాత్రి కామె వూరిబయట నున్న గ్రామదేవత ఆలయానికి వచ్చింది ఆ ఆలయాని కెదురుగా ఒక పెద్ద రావిచెట్టుంది దాని మొదట్లో ఉన్న తిన్నెమీద కూర్చుని - శ్రమతీరా మగతలోకి జారిపోయింది కాని చాలాదూరం నడచి రావడంచేత - కొంచెం సేపటికే మెలకువ వచ్చేసింది. కడుపులో ఆకలి ఔతుంటే నిద్రెలా పడుతుంది? మెలకువ వచ్చాక మరామెకు నిద్రపట్టలేదు

అది కృష్ణపక్షం కావడంచేత ఆమె చుట్టూ గాఢాంధకారం అలముకుని ఉంది అక్కడ మనుష్య సంచారం ఉండదు ఏ మృగమేనా వచ్చి బాధిస్తుందేమో అని తిలకకి భయం వెయ్యసాగింది అప్పుడామె రావిచెట్టు మొదట్లో గదిలాఉన్న తొర్రలోకి దూరి - మెలకువగా ఉంటూ, తన అవస్థకు విచారించసాగింది

కొంచెం సేపటికక్కడకి ఒక మగాడు వచ్చాడు. అగ్గిపుల్ల వెలిగించి చుట్టూ పరికించి చూశాడు ఆ వెలుగులో తిలక అతన్ని చూసింది

చెవులకి రవ్వలదుద్దులు మొలకి పటకాలా బంగారు మొలతాడు చేతికి మురుగులు చేతివేళ్ళకి రంగురాళ్ళ ఉంగరాలు శరీర

ఛాయకారునలుపయినా నిగారింపుతోఉన్న మెరుగుతో - కొంచెం చూడదగినట్లే ఉంది కాని అన్నిటినీ కప్పేస్తూ చాలా పెద్ద బానలావున్న ఆ పొట్టనుచూస్తే ఎవరికేనా సరే నవ్వు రాకమానదు అలాటి ఆకారాన్ని చూసి - తిలక ఆశ్చర్యపడింది 'ఇతని వేషం చూస్తే భాగ్యవంతుడిలా కనిపిస్తున్నాడు. మరి ఇలాటి రాత్రివేళ చిట్టచీకటిలో ..ఒంటరిగా ఇక్కడి కెందుకొచ్చాడో?" అని ఆలోచించసాగింది. అంతలో అక్కడికి మరొకవ్యక్తి వచ్చాడు

వచ్చినవాడు "బాబూ. శెట్టిగారూ!" అని నెమ్మదిగా పిలిచాడు.

ఆ శెట్టిగారు అతని ముందుకి అడుగేసి - "ఏమిరా, నర్సిగా ఇంతాలస్యం చేశావేం? అప్పి కనిపించిందా? ఏమంది? కార్యం సానుకూల మౌతుందని చెప్పిందా?" అని ఆత్రంగా అడిగాడు

*నరిసిగాడు* . బాబూ! నేనారింటికెళ్ళి అప్పిని పిలిసేను ఆబ్రామ్మడు - నువ్వెవరివి? అప్పితో నీకేంటిపని? - అని కేకలేస్తూ పోపో అని కసిరేశాడు

సెట్టి · ఓరెధవా! దొడ్డి గుమ్మం దగ్గర కెళ్ళి పిలవమని నేను బెబితే వీధిగుమ్మం దగ్గరకెళ్ళి పిలిచావా! అయ్యో. .ఆ తరవాత?

*నరిసిగాడు* అప్పుడు నేను పరుగెత్తి వొస్తూంటే - దొడ్డి గుమ్మంనుంచి అప్పి వచ్చి - నాతో

సెట్టి (ఆత్రంగా) ఏం చెప్పిందిరా?

*నరిసిగాడు* సెట్టిగార్ని మరిడమ్మ గుడిదగ్గరుండమని చెప్పు. నేను తీసుకొస్తున్నానని చెప్పు అంది

సెట్టి అమ్మయ్య ఆ మాటంది కదా నరిసీ. నువ్వామనిషిని చూశావురా?

*నరిసిగాడు* ఆ ఎర్రావిడేనండీ? చాలా చిక్కిపోయిందండీ.

సెట్టి చిక్కిన దానందం చెప్పనలవి కాదురా

*నరిసిగాడు* ఆవిడ - బ్రాహ్మడిపెళ్ళామేనండీ?

సెట్టి : ఆయన పెళ్ళామైతే ఇన్ని చిక్కులెందుకూ? మనింటికే రప్పించుకుందును. ఆవిడ – వాళ్ళింటికొచ్చిన బంధువట. దానికోసం రెండు నెలల నుంచీ ప్రయత్నం చేస్తున్నాను. ఇందుకోసం ఆయన భార్యకి వెయ్యి రూపాయల రవ్వల జోడు పంపించాను. ఇంకా చాలదంటూంది.

*నరిసిగాడు* : ఆవిడని మొదట మీరెక్కడ చూశారు బాబూ?

సెట్టి : శివరాత్రినాడు రాత్రి కోటీశ్వరుడి ఆలయంలో దేవతాదర్శనం చేస్తూండగా చూశాను. అప్పటినుంచీ ప్రయత్నిస్తూంటే ఇప్పటికి లొంగుతూంది. చూడు అలికి డౌతూంది. వస్తున్నారేమో.

*నరిసిగాడు* : ఆ వస్తున్నారు. నేనలా చాటుగా గుడివెనక్కి పోతారు.

అప్పివొస్తుంది.

అప్పి : సెట్టిగారూ!

సెట్టి : ఏమేవ్.. ఇటు . ఇటు . ఇలా తీసుకురా.

అప్పి : అబ్బా! మీకోనం ఎన్నిపాట్లు పడ్డాను! ఏది నాబహుమతి!

సెట్టి : ఆవిడని రానీ. తొందరపడతావేం?

అప్పి : ఎప్పటిదప్పుడే. ఇప్పుడు నాకు పనుంది.

సెట్టి : (నాలుగురూపాయలిచ్చి) ప్రస్తుతం ఇంతే తెచ్చాను. రేపు మా ఇంటికిరా.

అప్పి : చాల్చాలు. ఇదా మీ భారీతనం! నాకక్కర్లేదు (అంటూ ఆరూపాయలనతని మీదే పారేసింది )

సెట్టి : ఏమంటావు?

అప్పి : పదికాసు లిమ్మంటాను.

సెట్టి : సరేలే రేపిస్తాను అందాకా ఇవి ఉంచు. అప్పీ! ఆమెనెలా వొప్పించావే?

అప్పి : నిన్న మధ్యాన్నం రామాబాయి గారు తలనొప్పొచ్చిందని పట్టు వేసుకుని మూలుగుతూంటే నేను శివాడాను.

సెట్టి : ఏమని?

అప్పి : ఆదివారం నాడర్ధరాత్రి పేరంటాలి చేత నాగుడికి చలిమిడి, పానకం, వడపప్పు, వక్కలు, ఆకులు, సాంబ్రాణీ పంపు, లేకపోతే నీ నొప్పిపోనివ్వను - అని శివాడాను

సెట్టి : తరువాత?

అప్పి : రామాబాయి ఆమెనలా చెయ్యమని బతిమాలుకుంది. ఆమె అంతా చూస్తూంది కనక కాదన లేకపోయింది.

సెట్టి : ఈ సంగతి రామాబాయి మొగు డెరుగునా?

అప్పి : అమ్మో! అతనికి తెలిస్తే ఇల్లు కదలనిస్తాడా? ఆమె అంటే ఆయనకి ప్రాణమే.

సెట్టి : మరి - నా సంగతేమీ చెప్పలేదా?

అప్పి : కొంచెం చెప్పాను. అక్కడ సెట్టిగారుంటారు. ఆయనతో మర్యాదగా మాట్లాడాలి.. అని. ఇక్కడికామె వచ్చాక నువ్వు మిగిలింది చూసుకో లేవా? సరసుడివికదా నిన్నుచూస్తే... (అని నవ్వింది.)

సెట్టి : సరే...బాగానే చెప్పావు. చాలావేళయింది. తీసుకురా. ఎక్కడ ఉంచావు?

అప్పి : మాయింటి కెళ్ళొస్తానని ఒక అరుగు మీద కూర్చోబెట్టివచ్చాను. వెళ్ళాలి మొదటే నువ్వు పలకరించకు సుమా. ఈ స్థంభం చాటున కూర్చో నేను పిలిచే వరకూ రాకు. (అని చెప్పి వెళ్ళిపోయింది)

సెట్టి : నరసిగో! తేలుకుట్టిందిరా.. పడుకోబోతుంటే.. తేలుకుట్టిందిరా... అబ్బా! అమ్మా .

నరసిగాడు : (వచ్చి) ఎక్కడ బాబూ? ఎక్కడ?

సెట్టి : కడుపుమీద కుట్టిందిరా! పాడుతేలు. బాబోయ్... కుట్టింది కడుపుమీదే కాని విషంగుండెల్లోకెక్కిపోతూందిరా .

నరసిగాడు . అయ్యో. కడుప్మీదే? ఏదీ అగ్గిపెట్టె? (పుల్లవెలిగించి) అమ్మో .మండ్రగబ్బండీ!

సెట్టి బాబోయ్! మండ్రగబ్బే? చచ్చిపోతాన్రా

నరసిగాడు : భయంలేదు లెండి, నల్లదే. వచ్చిన వేళమంచిది కాదు బాబూ ఇంటికి పోదామా?

సెట్టి : అయ్యో ఎలా రానురా? ఆ చిన్నది వొస్తూంది ఎలాగో బిగబట్టుకుని ఉంటాను. నువ్వింటికి పోయి - నా పెట్టెలో తేలు చెక్కుంటుంది. అదిపట్టుకురా. ఇదుగో తాళం జాగ్రత్త త్వరగారా. అంతలో అప్పివచ్చి శెట్టిగారూ. ఆమె ఆమె వొస్తూంది జాగ్రత్త.

సెట్టి : అప్పీ! నాపనయిపోయింది మండ్రగబ్బ పొత్తికడుపు కింద కుట్టింది. గుండెల్లో బరువెక్కువై పోతూంది అమ్మో.. దానిమీదకల మక్కువ కొద్దీ నిగ్రహించుకుంటున్నాను కానీ. దొర్లి ఏడవవలసినంత బాదగా ఉంది. (అరుస్తున్నాడు )

అప్పి . (తనలో) ఇవాళ్టికి గడిచిపోయింది. ఈ బొజ్జకనకయ్యని చూసి ఆ చిన్నది మాట్లాడుతుందా! అదీకాక ఆమె మంచిగుణవంతురాలు. కానియ్..రేపు నాబహుమతి తీసుకున్నాకే పని చేస్తాను (సెట్టితో) అయ్యో! మంచి విఘ్నమే వచ్చిందే! పోన్లెండి. ఇవాళ్టికి ఊరికే చూడండి. మళ్ళీ ఎల్లుండి తీసుకొస్తాను

సెట్టి : అందుకే ఇంటికి పోతున్నాను. ఆ చిన్నదాన్ని తలుచుకుంటే అంతబాధగా ఉండడంలేదనుకో.. కానీ..అమ్మా!

అప్పి · మూలక్కండి సెట్టిగారూ!.. అమ్మా ఇలా రండి ఇదే అమ్మవారిగుడి

ఆమె : అప్పీ! అమ్మవారికి ప్రదక్షిణం చేసివద్దాం, రా.. (గుడిచుట్టూ తిరిగి వచ్చి ముఖ మండపంలో ప్రవేశించి) తలుపులు వేయబడి ఉన్నాయేం?

అప్పి : తలుపువేసి అర్చకులు ఇంటికి పోతారు. రాత్రి ఇక్కడి నుంచే నైవేద్యం పెడతారు మీరు కూడా అలాగే చేయండి.

ఆమె : (దీపం వెలిగించి...హారతులిచ్చి నైవేద్యం పెట్టి ..చేతులు జోడించి నమస్కరించి) అమ్మా! భవానీ. నువ్వు జగజ్జననివి. నేనర్పించిన నైవేద్యం స్వీకరించి దయతో మా యజమానురాలి తలనొప్పి పోగొట్టి అనుగ్రహించు ఆమెకు సంతానం కలగజెయ్యి. నా మనసుని పాతివ్రత్య గుణంతో నింపు నన్ను నా భర్తతో ఎప్పుడు జతకూర్చుతావో? నిన్నే నమ్ముకున్నాను నీకివే పదివేల నమస్కారాలు.

సెట్టి : (స్వగతంలో) నాపాలిటి కీ పాడు మంద్రగబ్బ ఎక్కణ్నుంచి వచ్చిందో! కార్యం సిద్ధంగా ఉన్నప్పుడు అనుభవించడానికి యోగం లేక పోయింది కదా! ఆహా! ఆ చిన్నదెంత అందంగా ఉంది! ఒక్కసారి ముద్దెట్టుకుంటే జన్మానికంతకీ చాలు. ఎల్లుండి రాత్రి ఎప్పుడొస్తుందో.

ఆమె : అప్పీ! ఇలారా. ఈ పాత్రలు పట్టుకో. వేగంగా ఇంటికి పోదాం. అర్ధరాత్రవుతోంది. అక్కడెవరితో మాట్లాడుతున్నావు?"

అప్పి : చిత్తం ఎవరూలేరు నాలో నేనే ఏదో పాడుకుంటున్నాను. (అంటూపాత్రలు పట్టుకుని లాంతరుతో దారిచూపిస్తూ ఆమెతోపాటు వెళ్ళిపోయింది) అంతలో నరిసిగాడు తేలు మందుతీసుకొచ్చి . "బాబూ! ఎక్కడున్నారు?" అంటూ గట్టిగా పిలిచాడు.

సెట్టి : ఇదుగో ఇక్కడున్నాను. ముందుతెచ్చావా? బాధతో నా ప్రాణాలు పోతున్నాయిరా ఇంతవరకూ చిన్నదాన్ని చూస్తూంటే బాధకనిపించలేదు. ఒరేయ్! నా భార్య లేవలేదుకద?

నరిసిగాడు : నేను పెట్టితడుముతూంటే అదిరిపడి – "ఎవరువారు?" అంటూ అమ్మగారు లేచేరండి.

సెట్టి : ఎందుకని అడిగిందా ఏమిటి?

*నరిసిగాడు* : అడిగారు. తేలుచెక్కకోసం వచ్చానన్నాను పొరపాట్న బాబుగారికి మండ్రగబ్బ కుట్టిందని 'చెప్పేను బాబు.

సెట్టి : ఓరి వెదవా! ఎంత తెలివి తక్కువ పని చేశావురా! అమ్మవారి గుడి దగ్గరున్నానని కూడా చెప్పావా?

*నరసిగాడు* : ఆ మాట కూడా నోరు జారేశాను బాబూ.

సెట్టి · అయ్యో! అదిక్కడికి రావడం లేదు కద?

*నరసిగాడు* : తేలో,పామో అని భయపడుతూ బండికట్టించు కొస్తున్నారండి.

సెట్టి · ఎంతదూరంలో ఉందిరా వెధవకానా?

*నరసిగాడు* : దగ్గరకే వచ్చేశారు.

సెట్టి : కొంపముంచావు కదురా నువ్వెదురువెళ్ళి ఇక్కడ లేరని చెప్పు. *(అంటూ ఒకచిన్నగదిలో దూరి తలుపేసుకున్నాడు. నరసిగాడు గుడి వెనక్కి పోయాడు.)* అంతలో సెట్టిగారి భార్య బండిదిగి దీపం ఎత్తి నాలుగుమూలలా చూసి - "రామీ! ఇక్కడెవరూలేరే. ఇంటికి పోయారేమో.." అంది "ఇంటికొస్తే మనకికనపడరూ? మరోచోట ఉన్నారేమో." అంది రామి. "ఈదీపం పట్టుకెళ్ళి నాలుగువేపులా చూసిరా" అని దీపమిచ్చి రామిని పంపిందామె. దీపం పట్టుకుని వెదుకుతున్న రామికి రావిచెట్టు తిన్నెమీద దొంగనిద్రపోతున్న తిలక కనిపించింది.

"ఎవరు నువ్వు?" అంటూ రామి ఆమెను లేపింది. ఆమె కళ్ళునులుముకుంటూ లేచి - "మేం బాటసారులం. నాతో నీకేంపని?" అని అడిగింది. "ఇక్కడ మాసెట్టిగా రుండాలి. ఏమయ్యారో తెలుసా?" అని రామి అడగ్గా తిలక ఒకవేపు వేలితో చూపించింది రామి ఆ గది తలుపు తెరవగా అక్కడో మూలనెవరో ఉండడం గమనించి - "అమ్మా! ఇక్కడెవరో ఉన్నారు" అని కేకలు వేసింది.

"సెట్టిగారేమో చూడు-" అంది ఆమె. "మనసెట్టిగారిలా నక్కిఎందుకుంటారు? దొంగాడిలా ఉన్నాడు" అని రామి చెప్పేసరికి

సెట్టిగారి భార్య దీపం ఎత్తిపట్టుకుని లోపలికి వెళ్ళింది. అక్కడ సెట్టి గోడకానుకుని శవంలా నిలబడి ఉండడం చూసి – "అయ్యో! నీకిదేం ప్రారంబ్ధం వచ్చింది? కాని పనుల కిలా వచ్చావు కాబోలు. తెలిసింది. తేలంటే ఏమో అనుకున్నాను. లేకపోతే ఈ అర్ధరాత్రి నువ్వీ అమ్మవారి గుడికి రావడం ఎందుకూ? ఎన్నేళ్ళొచ్చినా పాడుపనులు మానేవు కావు. పదపద" అంటూ అతన్ని గెంటింది. సెట్టి మారు మాటాడకుండా ఆగెంటుతో మండపాని కివతలపడ్డాడు. "నరిసిగా! నరిసిగా! ఎక్కడున్నావురావెధవా? నువ్వు వాళ్ళతో సహకరించి మాయమాటలు చెప్పావన్నమాట! ఇంటికిరా నీసంగతి చెబుతాను" అంటూ సెట్టి బండిలోకెక్కి భార్యతోపాటు కూర్చున్నాడు. రామి బండి వెనకేనడుస్తూంటే ఇంటికి పోయాడు.

ఆ విశేషాలన్నీ కళ్ళతో చూసింది కనక తిలక చాలా ఆశ్చర్యపోయింది. ఆ చిన్నదాని ముఖం దీపం వెలుగులో బాగానే కనిపించింది. పోలిక బట్టి రాచబిడ్డలా ఉంది.

ఆమె మాటలు యోగ్యురాలి మాటలలా ఉన్నాయి. కాని కులట మాటల్లా ఎంత మాత్రం లేవు. ఆమె నీ సెట్టి మోహించి ద్రవ్యం ఖర్చుపెడుతున్నాడు. బ్రాహ్మణుని భార్య సెట్టివద్ద లంచం తీసుకుని కపటం పన్ని ఆమె నిక్కడికి పంపింది. అంతే తప్ప ఆమె మంచిదే అయివుంటుంది. ఇంటికెళ్ళాక సెట్టిని భార్య బాగా చితగ్గొట్టి ఉంటుంది. లోకంలో ఎన్నెన్నివింతలో! – అనుకుంటూ తిలక ఆ రాత్రి ఎలాగో గడిపింది.

మరునాడు ఉదయం ఆ పట్నంలో ప్రవేశించి రాజమార్గంలో నడవసాగింది. అది చాలా పెద్ద పట్నమవడం వల్ల ఎంతసేపు నడచినా మొదలూ చివరా కనపడలేదు. కాని దైవికంగా బ్రాహ్మణు లుండేవీధి కనిపించింది. అక్కడెవరేనా భోజనం పెడతారేమో అని ఆ వీధిలో అటూ ఇటూ తిరుగుతూంటే...

ఒక ఇంటి అరుగుమీద – భోజనం చేసి కూర్చున్న బ్రాహ్మణు డొకడు తిలకను చూసి – "అమ్మా! మీదేవూరు? ఈ వీధిలో ఎందుకటూ ఇటూ తిరుగుతున్నావు?" అని అడిగాడు. అందుకామె – "అయ్యా!

మాది చాలా దూరదేశం. మరో ద్వీపంలో ఉన్న అమరావతీపురానికి వెళ్తున్నాను. మేము శూద్రులం. ఆకలిగా ఉంది, పట్టెడన్న మెవరేనా పెడతారేమో అని తిరుగుతున్నాను" అంది. ఆ బ్రాహ్మణుడు నవ్వుతూ – "అమ్మీ అడిగితేకాని అమ్మయినా పెట్టదనే సామెత వినలేదా? ఊరికే తిరిగితే పిలిచి నీ కన్నమెవరు పెడతారు? పాపం, ఎప్పుడూ ఒకళ్ళని అడిగిన దానివి కావు కాబోలు రా. మా ఇంట్లో తిందువు గాని–" అంటూ ఆమె నాహ్వానించి – "అప్పీ! ఇలారా" అంటూ దాసీదాన్ని పిలిచి – "ఈ అమ్మిని దొడ్డిదారిని తీసుకుపోయి – అన్నం పెట్టించమని అమ్మగారితో – చెప్పు" అన్నాడు.

అప్పి ఆమెను లోపలికి తీసుకుపోయి ఒకచోట విస్తరివేసింది మరొకామె పళ్ళెంతో అన్నమూ పదార్థాలూ తెచ్చి వడ్డించింది. తిలక భోంచేస్తూ ఆమె చక్కదనం చూసి ఆశ్చర్యపోతూ – "రాత్రి అమ్మవారి గుడికి వచ్చిన చిన్న దీమె కాదుకద? అప్పి – ఈ ఇంటి దాసికాబోలు. ఆ కోమటిసెట్టి ఈ చిన్నదాన్ని చూసి వలపులో పడడం అబ్బురం ఏమీకాదు. ఈమె చక్కదనం అంతటిది – అని ఆలోచిస్తూ భోజనం ముగించింది. భోజనం చేశాక అలసట తీర్చుకుందుకా చావడిలోనే పడుకుని అక్కడి వాళ్ళతో ముచ్చట్లాడ సాగింది.

అప్పుడు లోపలినుంచి ఒక స్త్రీవచ్చి – "అప్పీ! మళ్ళీ ఇవాళ తలనొప్పి వొస్తూందేమో. అయ్యో! ఎక్కువైపోతుందే. నేను నిలబడలేకపోతున్నానే" అంటూ చతికిల పడిపోయింది. అప్పి తల విరబోసుకుని – ఊగుతూ..శివమాడసాగింది. అలా ఆడుతూ.."నేను మరిడమ్మని. నాకునిన్న పంపిన ఫలహారాల్లో పెరుగు లేకపోయింది. అందుకే నేను నీకు మళ్ళీ నొప్పి రప్పించాను మళ్ళీ మంగళవారం రాత్రి పెరుగుతో సహా నైవేద్యం పంపితే నీనొప్పి పోతుంది" అంది.

బ్రాహ్మణుడి భార్య – "తల్లీ! నువ్వెలా కోరావో అలాగే రేపురాత్రి నీ గుడికి ఉపాహారం మళ్ళీ పంపుతాను నానొప్పి తొలగించు. నీమహిమ చూపించు" అనేసరికి అప్పి శివమాడడం ఆపి...తలమాత్రం ఊపుతూ.. కొంతసేపయ్యాక మాట్లాడసాగింది ఆ మాటలు మామూలుగానే ఉన్నాయి

రామాబాయి - "ఆహో. నా తలనొప్పి ఎంతలో మాయమయిపోయిందో! శక్తి మహిమ చాలా గొప్పది" అంటూ పొగుడూతూ - పక్కనే ఉన్న చిన్నదానితో - "నువ్వు నాకోసం రేపుకూడా శ్రమపడాలి సుమీ!" అంది. ఆమె "అలాగే" అంటూ అంగీకారం తల ఊపింది.

అదంతా చూస్తున్న తిలక ఆశ్చర్యానికి మేరలేదు. 'ఆహో. స్త్రీలు ఎంతటికేనా తెగించగలరు కదా! ఒకళ్ళ ననడం ఎందుకు? నేను మాత్రం తక్కువ పన్నాగాలు పన్నానా? సరే. కానియ్ ..ఈమె ఎవరో, వీళ్ళింట్లో ఎందుకుంటూందో తెలుసుకోవాలి. ఈమెచాలా మంచిదిలా కనిపిస్తూంది రామాబాయి ఈమెను మోసం చేయాలనుకుంటున్నట్లుంది ఈ సంగతి యజమానుడికి తెలియదు ఆయన చాలామంచివాడు. జరుగుతున్నవి ఆయనకు చెప్పేదా?...నాకేందుకులే ఈగోల. రేపు ఆ గుడిదగ్గరకి పోయి ఏమి జరగబోతుందో చూస్తాను' అనుకుని ఆ ఇంటివారికి చెప్పి సెలవు తీసుకుని మరోచోటుకి వెళ్ళి పోయింది.

మర్నాడు రాత్రి ముందు లాగే పోయి రావిచెట్టు మొదలు నున్న తిన్నె మీద పడుకుంది తిలక. కొంత రాత్రి గడిచాక సెట్టి నరసిగాడిని వెంటబెట్టుకుని మెల్లగా ఆ గుడిదగ్గరకి వచ్చి - "ఆలస్యం చేస్తే నా పెళ్ళాం అనుమానపడి మళ్ళీ ఇక్కడ కొస్తుంది. ఆ చిన్నదింకా రాలేదు. తొందరగా వెంటబెట్టుకు రమ్మని అప్పికి చెప్పావా? నువ్వెళ్ళి ఆ సంగతి చూడు. ఇవాళ జోళ్ళు తొడుక్కుని వచ్చానులే. తేలునన్నేమీ చెయ్యలేదు" అని వాడిని వెళ్ళిరమ్మన్నాడు.

"పెందరాళే తీసుకురమ్మని అప్పితో చెప్పానండి. అయినా వెళ్తున్నానండి" అంటూ వాడు వెళ్ళగానే సెట్టి ఒకమూల - మంటపస్థంభాని కానుకని కూర్చున్నాడు

ఆ వూళ్ళో వీరుడనే సాలెవాడి కొడుక్కి జబ్బు చేస్తే అమ్మవారికి ఉపారం పెడతానని మొక్కుకున్నాడు. ఆ వేళే భార్యచేత ఉపారం పట్టించుకుని తా నామె వెనుకనే కఱ్ఱపట్టుకుని నడుస్తూ వచ్చాడు అమ్మవారి గుడి దగ్గరకి వచ్చాక తాను దూరంగా నిలుచుని భార్యని

నైవేద్యం పెట్టి రమ్మని పంపించాడు. ఆమె అమ్మవారి ద్వారంలో దీపం వెలిగించి నైవేద్యం పెట్టి నమస్కరించి, మొక్కి, తిరిగి వెళ్ళిపోబోతూంటే – సెట్టి ఆమెనే తాను వలచిన చిన్నదనుకుని మోహం ఆపుకోలేక – ఆమె కడ్డంనిలబడి – "ఆగాగు. ఎక్కడికి పోతావు? నీకోసం రెండు నెలల నుంచీ ఎరుదు చూస్తున్నాను. నాకోరిక తీర్చు నీకు కావలసినంత ధనమిస్తాను" అంటూ ఆమె చెయ్యి పట్టుకుని లాగసాగాడు.

అప్పుడామె – "అమ్మో! నన్నెవడో పట్టుకుంటున్నాడు" అనికేకలు పెట్టేసరికి – వీరుడు వేగంగా వచ్చి – "ఎవడ్రా నువ్వు?" అంటూ సెట్టి పొట్టమీద ఒక తన్ను తన్నాడు. ఆ దెబ్బ ఆయువు పట్టుమీద తగలడంతో సెట్టి గిలగిల కొట్టుకుని అక్కడి కక్కడే నిముషంలో ప్రాణం వదిలాడు. అప్పుడు వీరుడు దీపపు కాంతిలో అతన్నిచూసి – 'ఓహో' మొదటికే మోసం వచ్చింది. నా దెబ్బవల్ల వీడు చచ్చాడు. ఎవరేనా చూస్తే నాకు మాటొస్తుంది" అనుకుంటూ – తనదగ్గరున్న తాళం చెవులతో అతిప్రయత్నం మీద ఎలాగో గుడితలుపులు తెరిచిభార్య సాయం పట్టగా శవాన్నా గుడిలోకి తరలించి, మళ్ళీ తలుపులు వేసి –ఎవరికీ తెలియకుండా రహస్యంగా ఇంటికి పోయాడు.

తిలక ఇదంతా గమనిస్తూనే ఉంది. అంతలో ఆ చిన్నది అప్పిని వెంట పెట్టుకుని ఉపహారాలతో గుడి దగ్గరకి వచ్చింది. అప్పి – శెట్టిగారు కనపడక నాలుగు మూల్లలా తిరుగుతూంటే – ఆ చిన్నది దీపం వెలిగించి – పూర్వంలాగే ఉపహారా లమ్మవారికి నైవేద్యం పెట్టి – ఇంటికి పోదామని అప్పిని పిలిచింది. అప్పి – సెట్టిని వెదుకుతూ దూరంగా పోడంవల్ల ఆమె పలకలేదు. అప్పుడు దానిని వెదుకుతూ ద్వారం వరకూ వచ్చి ఆమె అక్కడ కూర్చుంది.

మగడు ఇంటిలో కనపడక పోడంతో సెట్టిభార్య అనుమానపడి బండెక్కి మునపటిలాగే అక్కడికి వచ్చింది. బండిలో వచ్చిందెవరా అని ఆ చిన్నది ఆలోచిస్తూంటే – సెట్టి భార్య బండిదిగి, దాసి దీపం పట్టుకుని ముందు నడుస్తూంటే – అమ్మవారి గుమ్మందగ్గరికి పోయి అక్కడున్న

స్త్రీని చూసి – "నువ్వెవరివి? ఒంటరిగా ఇక్కడెందుకున్నావు?" అని అడిగింది. ఆమె ఏమీ జవాబు చెప్పకుండా మౌనంగా ఉండిపోయింది.

సెట్టిభార్య – మునపటిలాగే తన భర్త ఎక్కడో నక్కిఉంటాడని తలచి – "రామీ! ఆ గది చూడు" అంది. ఆమె చూసి –ఇందులో లేరమ్మా. ఆలోపలకాని ఉన్నారేమో..." అంటూ గుడి తలుపులు తీసింది. వీరుడు తాళం వెయ్యకపోవడంవల్ల ద్వారం తెరుచుకుంది. రామిలోపలికి పోయేసరికి ఒక మూలపడున్న సెట్టిగారు కనుపించారు. 'అమ్మా! ఇక్కడున్నారు, రండి' అంటూ కేకవేసింది. ఆమె భర్తమీద అలకతో– "నువ్వు వచ్చేయ్, ఆయనక్కడే ఉండనీ." అని..రామివచ్చాక – "చూసేవా? ఈ రండ నా కొంపముంచుతూంది. దీన్ని తగులుకునే సెట్టి ప్రతిరోజూ రాత్రి ఇక్కడికొస్తున్నాడు. మొన్నరాత్రి మనతో బాటసారులమని చెప్పింది. వీళ్ళిద్దరినీ తలారులకప్పగించి శిక్షింపజేద్దాం" అంటూ ఆమెను బలాత్కరంగా ఆ గుడిలోకి తోసి – "నువ్వు కూడా అక్కడుండు. పొద్దుట మీ పని పట్టిస్తాను" అంటూ తలుపేసి బయట గొళ్ళెం పెట్టి కూర్చుంది.

తెల్లవారింది. వీధిలో తిరుగుతున్న తలారులని పిలిపించింది సెట్టి భార్య "అదొ రంకులాడి. నా మగడితో క్రీడిస్తూంది. రెండుమూడు సార్లు పట్టుకుని క్షమించి వదిలిపెట్టాను. ప్రతిరోజూ అదే భాగోతం అయితే ఎన్నాళ్ళూరుకుంటాను? ఇద్దర్నీ పట్టుకుని లోపల పెట్టాను. చూడండి. దానికి తగిన శాస్తి చేయండి" అని కోరింది.

తలారు లాగుడి తలుపులు తెరిచారు. అక్కడ – ఆశ్చర్యంతోనూ విచారంతోనూ దేవుణ్ణి ధ్యానిస్తున్న స్త్రీ కనిపించింది. "బయటకురా. నీ గుట్టు రట్టయింది. తలవాల్చుకుని ప్రయోజనం లేదు'' అని వారన్నమాటలకు ఉలిక్కిపడి ఆమె బయట కొచ్చింది.

గుడిలో కొంచెం చీకటిగా ఉండడంవల్ల సెట్టి చచ్చి పడున్నాడని గుర్తించలేక – నిద్రపోతున్నాడనుకుని – సెట్టి గౌరవం ముందే తెలిసిన వారు కనుక తలారులు సగౌరవంగా – "సెట్టిగారూ! లెండి. తెల్లవారింది. మీలాటి వారిలాటి పనులు చేయవచ్చునా?"

అన్నారు. సెట్టి లేవలేదు. అతని భార్య – "రామీ! ఆయనను రమ్మను. ప్రజల మొహం చూడడానికి సిగ్గుపడుతున్నాడు కాబోలు. సిగ్గుంటే ఇలాటి పనులెందుకు చేస్తాడు? ఎక్కడిదో మంచి తొత్తునే సంపాదించాడులే" అని ఆ స్త్రీ వేపు తిరిగి "రండా! ఇది వరకు నువ్వెన్ని కొంపలు తీసావు?" అంటూ పొడుస్తూ తిట్టసాగింది.

ఆ చర్యలన్నీ చూస్తున్న తిలక – ఆమె నిర్దోషి అని తెలుసుకనుక – జాలిపడి అక్కడికి వచ్చింది.

అంతలో – లోపలికి పోయిన రామి, బిగ్గరగా పిలిచినా, ఎంతలేపినా సెట్టిలేవక పోడంతో, విసుగొచ్చి బయటకు వచ్చింది "అమ్మో! సెట్టిగారు చాలా భయపడినట్లున్నారు. ఎంత పిలిచినా పలకడం లేదు. మీరేపోయి పిలవాలి" అంది. సెట్టిభార్య – "భయమెందుకూ? డబ్బుంది కదా? ఇంతమేత పారేస్తే అందరూ లొంగిపోతారు. మరెప్పుడూ ఇలా చెయ్యరని ఇలా చేశాను" అంటూ లోపలికి వెళ్ళి – చెయ్యి పట్టుకుని – "లెండి లెండి. అయ్యో! చీకట్లో నేలమీద పడుకున్నా రేమిటి? ఇంటిదగ్గర మూడు పరుపులు వేసినా ఒత్తుకుంటూందంటారు. ఇక్కడ... ఇదే సుఖంగా ఉంది కాబోలు. కోపం వచ్చిందేమిటి? సరదాగా ఇలా చేశాను. మగవాళ్ళు.. మీకేం తప్పు? తలారులు మిమ్మల్నేమీ చెయ్యరులెండి" అంటూ బతిమాలింది.

అప్పటికి వెలుగు బాగానే వచ్చింది. కాబట్టి ముఖమూ లక్షణాలు స్పష్టంగా కనిపించసాగాయి. ఆమె నిదానించి చూసి – "అమ్మో! ఈయన కళ్ళు ఇలా తెల్లగుడ్లు పడ్డాయేమిటీ? ప్రాణాలున్నాయా?" అని భయపడుతూ – ఊపిరి పరీక్షించి, అందక – గుండెలు బాదుకుంటూ..."అయ్యో!అయ్యో! నా మొగుణ్ని ఈ రంకులాడి చంపినదండో.." అని పెద్దగా అరుస్తూ ఏడవసాగింది.

ఆ కేకలకి తలారులు లోపలికి పరుగెత్తుకొచ్చి – సెట్టిని పరీక్షించి – చచ్చాడని నిశ్చయించి – ఆ పీనుగుని వాకిట్లోకి లాక్కొచ్చి పడుకోబెట్టారు. అంతలో ఈ వార్త తెలిసి రాజభటులు, గ్రామాధికారులు

మొదలైన వారు అక్కడికొచ్చి పరీక్షించి అతన్నెవరు చంపారని అడిగారు. సెట్టిభార్య చెప్పిన మాటను బట్టి తలారులు ఆ స్త్రీయే చంపిందని చెప్పారు.

ఆర్యభట్టు గారింట్లో ఉన్న ఆడది - మరిడమ్మ గుడిలో నిన్నరాత్రి సెట్టితో ఉండగా చూసి అతని భార్య తలుపులు వేయగా ఆమె సెట్టిని చంపిందన్న వార్త పట్నమంతా వ్యాపించింది. దానిలోని నిజానిజాలు అప్పికి కూడా తెలియలేదు.

మర్నాడు రామాబాయితో అక్కడ జరిగిందంతా చెప్పింది. తనకేమి మూడుతుందో అని భయపడుతూ - "నా గురించి ఏమీ చెప్పకు. ఆమె ఎక్కడుందని అడిగితే - రాత్రి గదిలోనే పడుకుంది, ఉదయం కనపడలేదు" అని అప్పిని చెప్పమంటూంటే - ఆర్యభట్టు అక్కడికొచ్చి - ఆమె గురించి అడిగాడు. "దానిగురించే అడుగుతున్నాను. పొరుగింటి కెక్కడి కేనా పోయిందేమో" అంది రామాబాయి. అంది రామాబాయి. "దాన్నింట్లో ప్రతిరోజూ రాత్రులు చూస్తున్నావా?" అని అడిగాడతను.

"పడుకునేటప్పుడూ, మళ్ళీ ఉదయం లేచాకా చూస్తూంటాను. ఆ మధ్యలో చూడ్డానికి నాకేంపని?" అంది ఆమె.

అప్పుడు ఆర్యభట్టు నిట్టూరుస్తూ-" అది ప్రతిరోజూ ఏం చేస్తూందో చూశావా! రాత్రివేళ మరిడమ్మ గుడిలో పోలిసెట్టిని కలుసుకుంటూం దట. మనకేమీ తెలియక అది గుణవంతురా లనుకుంటున్నాం. నిన్నరాత్రి అతనిమీద ఏంకోప మొచ్చిందో - గుడిలోనే చంపేసిందట. రాజభటులు దాన్ని పట్టుకుని అరాతీస్తున్నారు. దానివల్ల మనకి కూడా అపకీర్తి వచ్చింది" అంటూ ఆ వృత్తాంతమంతా చెప్పసాగాడు

అంతలో తిలక అక్కడికి పరుగెత్తు కుంటూ వచ్చింది. ఆర్యభట్టుని పిలిచి - "అయ్యా! నమస్కారం. మీ యింట్లో ఉండే ఆమె సెట్టిని చంపిందని రాజభటులు నిర్బంధించి తీసుకుపోతున్నారు. పాపం ఆమె ఏమీ ఎరుగదు. ఏమడిగినా మాట్లాడక మౌనంగా ఉండిపోడంతో - తప్పుచేసిం దనుకుంటున్నారు. వేగంగా వెళ్ళి ఆమెను కాపాడుకోండి"

అంది. "చాలుచాలు. దాని ఇల్లాలితనమంతా తెలిసింది. మా ఇంట్లో ఉందని చెబితే మాకు కూడా మాటొస్తుంది. దానిగొడవ నాకెందుకు? మా అన్న అప్పగించాడు కదా అని కూతురిలా పెంచుతున్నాను. అది చెడ్డదని తెలిస్తే మాగుమ్మం ఎక్కనిద్దునా? –" అన్నాడు ఆర్యభట్టు కోపంగా. తిలక.."అయ్యా! అలా అనకండి. ఆమె అమాయకురాలు. చాలామంచిది. ఆమె వృత్తాంతం మీకు తరవాత చెబుతాను. ఇప్పుడు వేగంగా వెళ్ళి రక్షించండి" అని ప్రాధేయపడగా, అతను వెళ్ళడానికి సిద్ధమయ్యాడు. కాని అతని భార్య – "వొద్దొద్దు. అదివిరుచుకుని మనమీద పడగలదు. అది మనకేమైనా బంధువా, చుట్టమా? అన్నగారప్పగించారని నాలుగురోజు లన్నంపెట్టాం. సరిపోయింది. ఆ గొడవలన్నీ మనకెందుకు?" అని వారించింది.

అప్పుడార్యభట్టు – "అమ్మీ! నువ్వెవరు ఆమెకూ నీకూ చుట్టరిక మెక్కడ కలిసింది? దాని మీద నీకింత ప్రేమ ఎందుకు కలిగింది?" అని అడిగాడు "అయ్యగారూ! ఆమెవరో నాకు తెలియదు. కాని – నిర్దోషని నిశ్చయంగా చెప్పగలను. నేనామెను చూసింది మొన్న మీఇంట అన్నంతింటున్నప్పుడే" అని తిలక చెబుతూండగానే –

రాజభటుడొకడు వచ్చి – "ఆర్యభట్టుగా రిల్లుయిదేనా?" అని అడిగాడు. ఆ మాటవిని ఆర్యభట్టు భయపడుతూ – అయ్యో! మాకొంపములిగింది. రాజదూత వచ్చి నాపేరే అడుగుతున్నాడు. ఏంచెయ్యాలి? ఎక్కడదాక్కోవాలి? – అని ఆలోచిసస్తూండగానే అతనులోపలికి వచ్చి – "ఆర్యభట్టువి నువ్వేనా? నిన్ను తీసుకురమ్మని మాదండనాయకు డాజ్ఞాపించాడు" అన్నాడు. తిలక "అయ్యో! మీకెందుకు భయం? పదండి, నేనుకూడా వస్తాను" అంది. వాళ్ళందరూ కలసి కచ్చేరి చావడికి పోయారు.

దండనాయకుడతన్ని – "ఆమెకీ అతనికీ చుట్టరిక మేమిటని అడిగాడు. తన అన్న చచ్చిపోతూ తనకప్పగించాడని ఆర్యభట్టు చెప్పాడు. అంత చిక్కిపోయివున్నది పోలిసెట్టిని చచ్చేలా ఏలా పొడవగలిగిందని

దండనాయకుడడగ్గా - తిలక - "నేను కళ్ళారా చూశాను కనక నిజం చెప్పగలను" అంటూ తాను మొదట రావిచెట్టు మొదలున కూర్చున్నది మొదలు, అప్పటి వరకూ జరిగినదంతా పూసగుచ్చినట్లు చెప్పింది.

దండనాయకుడు ఆర్యభట్టు ఇల్లు పరీక్షించడానికి భటుల్ని పంపాడు. వాళ్ళాయిల్లంతా వెదికి శెట్టి రాసిన ఉత్తరాన్ని, అతను పంపిన రవ్వలజత పట్టుకుని, అప్పినీ రామాబాయినీ వెంట పెట్టుకుని దండనాయకుడి దగ్గరకొచ్చి జరిగినదంతా చెప్పారు. పోలిసెట్టి రాసిన ఉత్తరం చదివి - అది ఎవరికి రాశాడని రామాబాయి నడిగాడు. రామాబాయికి జరిగిన దంతా తెలుసు కనుక ఆ నేరం తిలక మీదకు తోసేస్తూ అబద్ధాలు చెప్పింది. దండనాయకుడు తిలకని కూడా చెరసాలలో పెట్టమని ఆజ్ఞాపిస్తూండగా-

ఒకవేపునుంచి కోలాహలం వినిపించింది. అందరూ అటువేపు దృష్టి మళ్ళించారు. ఇద్దరు భటులు వచ్చి దండనాయకుడికి సలాము చేసి - "పుష్పహాసుడనే పల్లెవాడు చక్రవర్తి కొడుకును కొట్టి శిక్షకు భయపడి పారిపోయి వచ్చి ద్వీపాంతరానికి వెళ్ళిపోతూంటే ఓడలో పట్టుకుని మీ దగ్గరకి తీసుకొస్తున్నాం. దేవాలయం వరకూ వచ్చాక వాడు మమ్మల్ని తన్ని తాళ్ళు తెంపుకుని ఒక కోవెలలో దూరి తలుపులు వేసుకున్నాడు. ఆకోవెల - ప్రహరీ కోటలా ఉంది. తలుపులు తియ్యకుండా దానిలో ప్రవేశించడం శక్యం కాదు. దయచేసి తమరేవొచ్చి వాడిని పట్టుకోవాలి" అన్నారు వినయంగా.

ఆ మాటలు వింటూనే దండనాయకుడు - "ఔనౌను. వానిపేరు పుస్తకంలో వ్రాసిన జ్ఞాపకముంది. వాడిని పట్టుకుంటే మంచి పారితోషికం లభిస్తుంది" అని బూరావంటి దేదో ఊదాడు. నిముషంలో ఎందరో రాజభటులక్కడికి వచ్చారు.

"ఈ నేరంలో ఇంకా కొంత విచారించవలసి వుంది. వీళ్ళనిలాగే ఉంచండి. తొందరగా వచ్చేస్తాను" అంటూ కొందరు రాజభటులతో ఆ కోవెల వేపు వెళ్ళిపోయాడు దండనాయకుడు. ఆ కోవెల

ముందు పెద్దగోపురం ఉంది. దానితలుపుకోటతలుపుల కంటే కూడా చాలా పెద్దవి. ఉత్సవ దినాల్లో తప్ప మిగిలిన రోజుల్లో అవి మూయబడి ఉంటాయి. ఒక తలుపులో అమర్చబడిన చిన్న ద్వారం నుండి లోపలికి బయటికి రాకపోకలు జరిపిస్తూంటారు పుష్పహాసుడా చిన్నతలుపుకి లోపల గడియ బిగించేశాడు.

దండనాయకుడు ఆలోచించి – "లోపలున్న వారిని తలుపు తీయమని అరవండి" అన్నాడు భటులతో. వాళ్ళెంత అరచినా పుష్పహాసుడి నిర్బంధంలో ఉండడం వలన లోపలి వారికి తలుపుతీసే అవకాశం లేకపోయింది. అప్పుడతను గొలుసులూ, నిచ్చెనలూ మొదలైనవి తెప్పించి, గోడమీదుగా లోపలికి దిగి.. కోవెల ముఖమంటపానికి దగ్గరవరకూ పోయారు. కాని..పుష్పహాసుడు కనపడలేదు అక్కడున్నవారి నతను అధికారంతో అడిగేసరికి – "అయ్యా! మేము మీకేకలు విని తలుపులు తీయబోయాం. వాడు గడియగట్టిగా పట్టుకుని తీయనిచ్చాడు కాదు. మీరులోపలికి వస్తున్న సన్నాహం చూసి, రెండోవేపు నున్న గోపురం మీదుగా ఆ గోడెక్కి అవతలి కురికి పారిపోయాడు. ఇంతలో మీరు వచ్చారు. వాడెంత సాహసి! వాడిదెంత బలం!" అంటూ వారతని శక్తికి ఆశ్చర్యం ప్రకటించారు. "ఆ పల్లెవా డిక్కడున్నప్పు డేం చేశాడు?" అని దండనాయకుడు అడిగాడు.

ఒకడు ముందుకువచ్చి – "అయ్యా! వాడీగుడిలో ప్రవేశించింది మొదలు, నేను వాడి వెనకాతలే తిరిగాను. వాడు గుడి చుట్టూ తిరుగుతూ ఉత్తరం వేపునున్న గోడమీద ఏవో పద్యాలు రాసి ఉండగా చూసి – చదివి వాటికింద మసిబొగ్గుతో తానేదో రాశాడు. ఆ గోడలన్నీ పరీక్షిస్తూ తిరిగాడు. వాడు చేసినదంతే" అన్నాడు వినయంగా. దండనాయకుడు ఆ పల్లెవాడు రాసిన రాతలేమిటో చూడాలని ఆ గోడ దగ్గరకి పోయాడు. అతను మహమ్మదీయుడవడం వల్ల ఆ పద్యాలూ వాటి అర్థాలూ తెలియక ఆ మూడు పద్యాలనీ కాగితం మీద రాయించి – " పట్నమంతా తిరిగి వాడిని పట్టి తీసుకురండి " అని కింకరుల నాజ్ఞాపించి – అక్కడ నిలబడి వున్న ఆర్యభట్టుని వాటికర్థం చెప్పమన్నాడు.

దండనాయకుడి దగ్గరినుంచి ఆ కాగితం తీసుకుని అతను చదివాడు. అతనికి సంస్కృత భాషా పాండిత్యం బాగానే ఉంది. కాని పదిసార్లు చదివినా ఆ పద్యాలభావం అతనికి తెలియలేదు. "ఇది సాంకేతికంగా స్త్రీ పురుషులు రాసుకున్నట్లుంది. దీనిభావం నాకందడంలేదు" అనేశాడు. అప్పుడా దండనాయకుడు పట్నంలో ఉన్న గొప్పపండితులనేక మందిని రప్పించి ఆపద్యాల భావం ఏమిటని అడిగాడు.

ఆ పండితులు చాలా ఆలోచించి – "అయ్యా! మా దేవాలయాల గోడలమీద బాటసారులు ఏవోరాయడం తరుచుగా జరిగేదే. సత్రం గోడలమీద కూడా అలాగే రాసి పోతూంటారు. ఈ పద్యాలెవరికి తోచినట్లు వారు రాసినవే తప్ప ఒక అభిప్రాయంతో రాసినట్లు కనపడదు. ఒక దానితో మరొక దానికి సంబంధమున్నట్లు తోచదు" అనేశారు.

అంతటితో సభ ముగిస్తూ – దండనాయకుడు భటుల్ని చూసి – "దొరికిన అపరాధిని నిష్కారణంగా వదిలేశారు. పట్నమంతా గాలించి రేపు మధ్యాహ్నంలోపుగా వాడిని పట్టుకుని నా ఎదుట పెట్టకపోతే మిమ్మల్నందరినీ కారాగారంలో పెట్టిస్తాను. నేనింకా సెట్టిని చంపిననేరం విచారించాలి" అంటూ వెళ్ళిపోయాడు.

ఆర్యభట్టు భార్యతో ఇంటికి వెళ్ళి – తమని విడిచిపెట్టినందుకు భగవంతుడికి అనేక నమస్కారాలు పెట్టి – ఆ స్త్రీ చేసిన దుష్కార్యం గురించి ఇరుగు పొరుగులు వచ్చి వివరా లడుగుతూంటే తగు సమాధానాలు చెప్పి పంపాడు. తన భార్యగుణగణాలను మెచ్చుకున్నాడు. ఆ రోజు గడిచింది.

తిలక, ఆమె – ఖైదులో పెట్టబడ్డారు. ఆమె సాధారణంగా ఆప్తులతో కూడా ఎక్కువ మాట్లాడదు. ఒకటి రెండు మాట లంతే. అలాటిది తనకోసం నిష్కారణంగా జైలుపా లయిందని తిలకగురించి చింతిస్తూ మెల్లగా ఇలా అంది "నువ్వెవరో ధర్మాత్మురాలిలా ఉన్నావు. నువ్వీ మందభాగ్యురాలి కుపకారం చెయ్యాలని ఎందుకనుకున్నావు? నాకోసం అనవసరంగా నువ్వు శిక్షించబడ్డావు. పాడువిధి! ఇంకా ఎన్ని చిక్కులు పెట్టి, చంపుతుందో..."

కన్నీరు మున్నీరుగా ఏడుస్తున్న ఆమెను ఒదార్చుతూ – "అమ్మా! నాకోసం విచారించకు. నేనన్నిటికీ తెగించిన దాన్ని. నిన్ను చూసింది మొదలు నీ వృత్తాంతం తెలుసుకోవాలనిపిస్తోంది. నీ యజమానురాలి దగ్గరకు నువ్వెలా వచ్చావు? ఎందుకొచ్చావు? కోమటిదగ్గర లంచం తీసుకుని నిన్ను కపటంగా గుడికి పంపింది. నువ్వు ఉత్తమ ఇల్లాలివి. నీపతిఎవరు? నీజన్మ భూమేది? మననూరడించే వారెవరున్నారు? మనని మనమే ఊరడించుకోవాలి" అనగానే ఆమె మరింత దుఃఖంతో వెక్కి వెక్కి ఏడవసాగింది.

అప్పుడు – తిలక ఆమెను మరింతగా ఒదార్చుతూ – "నా ప్రశ్నల వలన నీ విచారం మరింత ఎక్కువైనట్లుంది. పోనీలే. మరెప్పుడేనా చెబుదువుగానిలే విచారించకు" అంది.

మర్నాడు దండనాయకుడు మళ్ళీ వచ్చి వారి నేరాన్ని విచారణ చేస్తూంటే – ఐదుగురు రాజభటులు విచ్చుకత్తులతో – ఒకయువకుడిని తీసుకువచ్చి, అతనికి సలాములు చేసి – "స్వామీ! వీడే పుష్పహాసుడు. పట్టుకుని తీసుకు వచ్చాం" అన్నారు.

దండనాయకుడు ఉలికిపడి – "ఏమిటీ! వీడేనా పుష్పహాసుడు? అయ్యో! చాలా మృదువుగా ఉన్నాడే! నిన్న మిమ్మల్ని తోసుకుని ఎలా పోయాడో? ఎక్కడ దొరికాడు? మీకెలా దొరికాడు?" అంటూ ప్రశ్నలు వేశాడు.

"స్వామీ! మీరు మాకు కఠినమైన ఆజ్ఞలివ్వగానే మేము పట్నమంతా వెదికాం. మారువేషాల్లో దేవాలయాలు సత్రాలూ గాలించాం. ఉదయం–కొంచెం చీకటి ఉండగానే వీడు నిన్నటి ఆలయంలోకి వచ్చి నాలుగువేపులా తిరిగి తిరిగి చూస్తూ ఉత్తరపు గోడదగ్గరకిపోయి అక్కడ రాయబడిన పద్యాలను పరిశీలిస్తున్నాడు అప్పుడక్కడ కావలి ఉన్న రాజభటులు చూసి చటుక్కున వీడిని పట్టుకుని సంకెళ్ళు తగిలించారు. మేమందరం కలుసుకుని వీడిని మీ దగ్గరకి లాక్కొచ్చాం. పైకి చూడడానికి మృదువుగా కనపడతాడు కాని, కలియబడ్డాడో వందమందిని చంపగలడు.

ఉండడం కూడా సహించక, దేముడు మళ్ళీ నన్ను ఆపదకి గురిచేశాడు. పోనీలే. అన్ని దుఃఖాలకీ విరుగుడయిన మరణం సంభవిస్తూందికదా! చింత అక్కర్లేదిక.

మా అబ్బాయికి పుష్పదంతుడని పేరు పెట్టుకున్నాం. మీరు చాలాసార్లు పుష్పహాసుడని చెప్పుకుంటూంటే – వాడు జ్ఞాపకం వచ్చి మనసుకలత పడింది. ఇదే నా వృత్తాంతం" అందామె.

తిలక ఎంతగానో ఆశ్చర్యపోతూ – "ఎంత విచిత్ర మెంత విచిత్రం! గంధర్వదత్తా! నీ కోసం మీ సోదరు డెంత విచారిస్తున్నాడో! నీ విషయం వింటే ఆయనెంత ఆనందిస్తాడో! నీభర్త, పుత్రుడూ ఏమయ్యారో నీకు తెలియదు కాబోలు. ఆహా! విధి నిన్ను ఎన్ని కష్టాలపాలు చేస్తోంది!" అంది జాలిపడుతూ...

"నన్ను నువ్వెలా ఎరుగుదువు? మా సోదరుడు నీకెలా తెలుసు? ఎక్కడ తెలుసు? నీపేరేమిటి? నీవృత్తాంతమేమిటి? నాభర్త, పుత్రుడు అక్కడ లేరని నీకెవెవరు చెప్పారు?" అంటూ ఎన్నో ప్రశ్నలు వేసింది గంధర్వదత్త.

తిలక మెల్లగా – "అమ్మా! నేను మీ మేనకోడలి సఖురాలిని. నాపేరు తిలక. ఒకనాడు నీ కడియం చేపగర్భంలో ఉండగా ఒకపల్లెవాడికి దొరికింది. అతనుదాన్ని మారాజు గారికి తెచ్చిచ్చాడు. దానిమీద నీపేరుండడం చూసి – ధనుంజయరాజుగారు కన్నీరు కార్చుతూ నీ వృత్తాంతమంతా చెప్పారు. నువ్వు చెప్పినట్లే – 'రాత్రి పుత్రుడితో మేడమీద పడుకున్నారు. పొద్దుటికి ఏమయ్యారో తెలియదు' అన్నారువారు కూడా. నీకోసం ఎన్నో దేశాలు వెదికించా" రంటూ ఆ వివరాలు చెప్పింది.

అదివిన్న గంధర్వదత్త పట్టలేనంత ఆశ్చర్యంతో..."ఔను. ఆ రాత్రి రత్నకంకణాల జత తీసి తలగడక్రింద పెట్టాను. అవి చేపకడుపులో కెలా వెళ్ళాయో? చిత్రంగా ఉంది. అయ్యో! నేనొక్కతినే దుఃఖ మనుభవిస్తున్నాననుకుంటున్నాను ఇన్నాళ్ళు. వారుకూడా లేరా! భగవంతుడా! మామీద ఎంత నిర్దయ చూపుతున్నావు!" అంటూ విచారంతో ఆగి – "తిలకా! మాసోదరుడు కుశలంగా ఉన్నాడా? నా మేనకోడలు పుట్టినప్పుడే

వచ్చాను ఈపాటి కది పెద్దదవుతుంది. పెళ్ళిజరిపించారా? దానిపేరు లలిత అని జ్ఞాపకం దానికి సుందరకుడనే అన్న ఉండాలి ఎలా ఉన్నాడు ' అంటూ అడిగింది.

'అమ్మా నువ్వడిగిన వాళ్ళందరూ క్షేమంగానే ఉన్నారు లలిత మాత్రం ఇప్పుడింటి దగ్గరలేదు"

'అత్తారింటికెళ్ళిందా? దానికి మంచిసంబంధం వచ్చిందా? నా సోదరుడు - ఇది నీకోడలు, చూసుకో' అన్నాడానాడు. కాని నాకంత భాగ్యం పడుతుందా? నాలాటి దుఃఖభాజని భూమ్మీదెక్కడా ఉండదు. లలిత కేమయినా పిల్లలా?"

ఇంకా పెళ్ళికాలేదు. ఆమె ఒక యువకుణ్ని వరించింది అతనత్యంత సుందరుడు కన్యావరయతే రూపం అని ఊరికే అన్నారా? ఆడపిల్ల అందాన్ని వరిస్తూ వివేకం కోల్పోతుంది.. " అని చెబుతూంటే - రాజభటులటు వచ్చారు. మాట్లాడుకుందుకు వీలు పడలేదు.

పుష్పవంతుడు పారిపోతాడేమో అని రాజభటులు అక్కడే తిష్టవేశారు. కొన్నాళ్ళు గడిచాక... దండనాధుడు వారందరినీ తన సభకు రప్పించుకుని - మొదట పుష్పదంతుడి నుద్దేశించి - "పుష్పహాసా! నీ చర్యలన్నీ రాసి మాచక్రవర్తికి పంపాను ఆయన వాటిని విచారించి - నువ్వు రాజద్రోహివనీ, దుండగుడివనీ, ద్రోహివనీ - అందుచేత నీకు ద్వీపాంతరవాస శిక్ష విధించామనీ తెలియజేశారు" అన్నాడు.

ఒక సారాగి.. ఆ స్త్రీల వేపు తిరిగి - "మాచక్రవర్తి ఎంతో కరుణామయుడు ఆడవాళ్ళని కనికరించి - పోలిసెట్టిని చంపినా మీ ఇద్దరికీ ఉరిశిక్ష విధించక, కేవలం ద్వీపాంతరవాస శిక్ష మాత్రమే నిర్ణయించాడు" అని చెప్పేసి ఆనాటికి సభచాలించి ఇంటికి పోయాడు"

అంతవరకూ కథ చెప్పి ఆగిపోయాడు మణిసిద్ధుడు

"పైమజిలీకి బయలుదేరే వేళయిందనా గురువుగారు కథ ఆపేశారు?" అడిగాడు గోపాలుడు.

సిద్ధుడంతే అన్నట్లు నవ్వాడు. తరువాత మజిలీ చేరాక - మళ్ళీ చెప్పసాగాడు మణిసిద్ధుడు



# కాశీ మజిలీ కథలు

## 40. వ మజిలీ

### వజ్రమాల కథ

"గోపాలా! పుష్పహాసుడు రాజభటులని తప్పించుకుని కోవెల ప్రాకారం మీంచి అవతలి కురికాడని నీకు జ్ఞాపకముంది కదా? అత నాగోడ పక్కనున్న ఒక మల్లెపందిరి మీదకి దిగాడు. తాళ్ళతో నేసిన పందిరిమీద మల్లెతీగ చాలా దట్టంగా అల్లుకుని ఉండడం వల్ల – ఎత్తునుంచి పడినా అతనికేమీ కాలేదు. పూలపాన్పుమీద పడినట్లే సుఖంగా పడ్డాడు.

అప్పుడు – పదహారేళ్ళ చిన్నది ఒక్కడే మల్లెపూలు కోస్తూంది. ఆకాశం నుంచి మెరుపులా జారిపడిన అతన్ని చూసి బెదిరిపోయి దూరంగా వెళ్ళి చూడసాగింది. అత నామల్లెపందిరి మీంచి దిగి – ఆమె వద్దకు వెళ్ళి – "ఈ ఇల్లెవరిది? నీ పేరేంటి? నీ ముఖం చేస్తే మంచిదానిల్లా కనిపిస్తున్నావు. నువ్వు నాకో ఉపకారం చేసిపెట్టాలి" అన్నాడు మృదువుగా. ఆమె అతని రూపానికి భావపరవశ అయిపోయి – తలవంచుకుని –

"నువ్వు దివినుండి అవతరించిన జయంతుడి వనుకుంటాను. నీకేంకావాలో చెప్పు. తక్షణం నెరవేర్చి జన్మధన్యం చేసుకుంటాను" అని ఒక్క క్షణంఆగి – "ఇది వజ్రదత్తుడనే వర్తకుడి ఇల్లు. నేనతని కూతుర్ని. నాపేరు వజ్రమాల. మాతండ్రి అల్లుడితో కూడా ద్వీపాంతరంలో ఉన్న అమరావతి పట్నానికి వ్యాపార నిమిత్తం వెళ్ళాడు. మా తండ్రికి మగ సంతానం లేకపోడంతో, అల్లుణ్ని తెచ్చి ఇంట్లో పెట్టుకున్నాడు. మా తండ్రి రత్నాలు, మణులవ్యాపారి. మేం కూడా మొన్ననే ఆపట్నం పోవలసింది. కాని బంధువయిన పోలిసెట్టి ఈ మధ్యనే బలవన్మరణం

పొందడం వల్ల మా ప్రయాణం ఆగిపోయింది అందువల్లనే మీ దర్శనం అనే అదృష్టం కలిగింది" అందామె.

వజ్రమాలతన్ని మోహిస్తూందని అతని కర్థమైపోయింది. మగడు కలిగిన ఆ ఇల్లాలు – ధర్మవిరుద్ధంగా ఇలాగ పరపురుషుల పట్ల మన్మధవికారం చెందడం అతనికి నచ్చలేదు కాని.. ఇప్పు డామెను కాదంటే తనపని చెడిపోతుంది. తరవాత చెప్పొచ్చు పరిచయం గాఢమయ్యాక ఏం చెప్పినా ఫరవాలేదని మనసులో అనుకుంటూ – "నేనొక బాటసారిని. రాజభటులు నన్ను అన్యాయంగా పట్టుకోబోతే తప్పించుకుని పారిపోయివస్తున్నాను. నా వృత్తాంతమంతా తరవాత చెబుతాను. ఇప్పుడు నన్ను మీ ఇంట్లో దాచి – మీరు పోతున్నప్పుడు నన్నుకూడా అమరావతీ నగరానికి తీసుకువెళ్ళండి. ఇదే నాకోరిక" అని చెప్పాడు.

అతని కోరిక విని – 'ఆహా! నా నోములిప్పటికి పలించాయి నా యౌవనం ఇప్పటికి సార్థక మౌతూంది. నిధి తనంత తానువచ్చి నట్టింట్లో పడింది ఈ సొగసు గాడి కౌగిలి లభించాక స్వర్గ మెందుకు? ఇక మన్మధుడు నన్నేం బాధించగలడు?" అని ఉవ్విళ్ళూరిపోతూ – "దీనికింత బతిమాలాలా? నాహృదయంలో పెట్టకుని నిన్ను కాపాడుకోనూ! మా ఇంట్లో ఉంటే ఈశ్వరుడేనా పట్టుకోలేడు. ఆమేడలన్నీ మావే. లోపలికిరా" అని ఆహ్వానించింది"

"పరిచారకులయినా చూడకూడదుసుమీ నన్ను." అంటూ హెచ్చరించి ఆమెవెంట నడిచాడతను. మేడమీదకి తీసుకుపోయి అతన్నామె కూర్చోబెట్టింది. అంతలో రాజభటులు వచ్చి, వాకిట్లో నిలచుని – తలుపులు తడుతూ కేకలు వేశారు. వజ్రమాల మేడదిగి తల్లిదగ్గరకి వచ్చింది. సేవకులు వచ్చి – "ఎవడో దొంగ ఇటువేపు పారిపోయి వచ్చాడట మన ఇల్లు వెదుకుతామంటూ రాజభటులు వచ్చారు. తలుపులు తీయమంటున్నారు" అని చెప్పారు.

వజ్రమాల వాళ్ళకి కొంత లంచం పంపుతూ – "ఇక్కడ ఆడవాళ్ళు తప్పవేరెవరూ లేరు. మేము చూసివచ్చామని చెప్పండి" –

అబ్బా! వీడిని లాగలేక మాచేతులు రక్తాలు చిమ్మాయి కదా" అంటూ వివరించారు భటులు.

"వీడు నిజంగా పుష్పహాసుడేనా? మీకు బాగా తెలుసా?" అని సందేహించాడు దండనాథుడు. "సందేహం అక్కర్లేదు వీడే పుష్పహాసుడు. ఎరగకుండా పట్టుకుంటామా?" అన్నారు వాళ్ళు దండనాయకుడు – "నువ్వు పుష్పహాసుడివేనా? రాజపుత్రుడి నెందుక్కొట్టావ్?" అని అడిగాడు. "నేను పుష్పహాసుడిని కాను. మకరందుడిని. నాకాపరం ద్వీపాంతరమందున్న అమరావతి నగరం. వీళ్ళు నన్ను నిష్కారణంగా పట్టి తీసుకువచ్చారు. ఇంతకంటె అన్యాయం ఇంకెక్కడైనా ఉంటుందా?" అని అతననేసరికి – దండనాయకుడు భటుల మొహాలు చూశాడు.

అప్పుడు వాళ్ళు "స్వామీ! వీడు గజదొంగ. వీడిమాటలు నమ్మకండి. మీసాలు గొరిగించుకుని పేడివాడిలా కనపడుతున్నాడు. వీడిని వదిలారో మళ్ళీపట్టుకోడం మాతరంకాదు" అని వాళ్ళు ఒకేమాటగా చెప్పారు.

"సరే. పుష్పహాసుడు పట్టుపడ్డాడని చక్రవర్తికి తెలియజేస్తాను. వారేవిధంగా ఆజ్ఞాపిస్తే అలా చెయ్యొచ్చు. అంతవరకూ వీడిని చెరసాల్లో పెట్టి జాగ్రత్తగా చూడండి" అన్నాడు.

పోలిశెట్టిని ఆ చిన్నది చంపినట్లూ, తిలక ఆమెకు నేరంలో సహకరించినట్లూ ధృవపరచి వాళ్ళిద్దరినీ నేరస్థులుగా నిశ్చయించినట్లు పత్రిక వ్రాసి న్యాయాధికారికి పంపాడు. పైవారినుంచి ఆజ్ఞలు వచ్చేవరకూ వాళ్ళిద్దరినీ చెరసాలలో ఉంచమని కింకరుల నాజ్ఞాపించి ఆ నాటికి సభచాలించాడు

"ఇతని మొహం ఎక్కడో చూసినట్లుందే. ఇతన్ని పుష్పహాసుడు అనుకుంటున్నారు. కాదని చెప్పేదా? వొద్దు. పుణ్యానికి పోతే పాపమెదు రౌతుంది. ఈ చిన్నదానికుపకారం చేయబోయేకదా ఈ కష్టం అనుభవిస్తున్నాను ఈగొడవ నాకెందుకు? పాపం, ఈ చిన్నవాడు ఊరికే నామొహం వేపు చూస్తున్నాడు ఒకరేనా పరిచయం చేయలేదు కదా

అతన్ని? ఆహా ఉరితీయబడడానికి సిద్ధంగా ఉండి వెర్రిమొర్రి ఆలోచనలు ఆలోచిస్తూన్నావేమిటీ?" అనుకుంది తిలక మనసులో.

రాజభటులు "పదండి, పదండి" అంటూ అదిలిస్తూ వాళ్ళని బందీగృహానికి తీసుకుపోయారు. మగవాడి నొక గదిలోనూ, ఆడవాళ్ళిద్దరినీ మరో గదిలోనూ పెట్టి తలుపు మూసేశారు. మకరందు డున్నగదికి, వాళ్ళిద్దరూ ఉన్నగదికీ మధ్య ఒక ఇనప కిటికీ ఉండడంచేత ఒకరినొకరు చూసుకునే అవకాశం ఉంది.

భటులు వెళ్ళిపోగానే - తిలక ఊరికే ఉండలేక - ఆ కిటకీలోంచి తొంగిచూస్తూ - "అందగాడా! నన్ను పదేపదే చూస్తున్నావు. నువ్వెవరివి? పాపం, నిన్ను పుష్పహాసుడనుకుని రాజభటులు పట్టుకుని జైల్లోపెట్టారు. ఇది చాలా అన్యాయం. పుష్పహాసుణ్ణి నేనెరుగుదును. నీ నివాసం అమరావతీ నగరమని చెప్పావు. అక్కడినుంచి ఇక్కడికి ఎప్పుడొచ్చావు? అక్కడ - సింధువారనగర కాపురస్తు లెవరేనా కనిపించారా?" అంటూ ప్రశ్నలు గుప్పించింది.

అతను తిలకకి తెలిసేటట్లు మెల్లగా ఏదో చెప్పాడు. "బాలా! నాకథ చాలా పెద్దది. తరవాత చెబుతాను నువ్వెందుకిలా చెరసాలలో బంధించబడ్డావు? నీతో ఉన్న ఆమె ఎవరు? నీ మొదటి వృత్తాంతం చెప్పక్కర్లేదు. తదనంతర వృత్తాంతం చెబితేచాలు" తిలక త్రుళ్ళిపడి అతని వేపుచూసి తానావూరు వచ్చింది మొదలు అంతవరకూ జరిగినదంతా విశదంగా చెప్పింది. అదివిన్న మకరందుడు ఆ చిన్నదాని శీలాన్ని మెచ్చుకుంటూ దండనాయకుడి అన్యాయం గురించి చింతించాడు.

వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటూంటే ఆమె విపరీతమైన దుఃఖంతో కన్నీరు కార్చసాగింది. ఆమెను చూస్తూ - "అమ్మా! మనమిప్పుడు యమలోక ప్రయాణానికి సిద్ధంగా ఉన్నాం. విచారించి ప్రయోజనం ఏముంది? నీరూపం చూస్తూంటే గొప్పవంశంలో పుట్టినదానిలా కనిపిస్తున్నావు. ఇప్పుడేనా నీవృత్తాంతం చెప్పి నీ సఖురాలినయిన నా మనసుకి శాంతి కలిగించవా? ఆత్మీయులతో చెప్పడం వలన కొంత విచారం తగ్గుతుంది కదా" అని బతిమాలింది అప్పుడామె చెప్పసాగింది.

# గంధర్వదత్త కథ

"పుత్రీ! నువ్వు ఉపకారం చేయడానికొచ్చి ప్రాణాలు పోగొట్టుకుంటున్నావు. నీకంటె నాకు ఆప్తులెవరు? నీకు చెప్పక మరెవరికి చెబుతాను? కాని..నేనిప్పుడు జారపురుషుణ్ని చంపానన్న అపఖ్యాతితో ఉరితీయబడబోతున్నదానిని. నేను నా పూర్వవృత్తాంతం చెబితే - అంతవరకూ ఉన్న కీర్తికి కూడా కళంకం తెస్తానేమో. అయ్యో!.. వైష్ణవమాయ" అని నిట్టూర్చి - "కానియ్. నీలాటి ఆప్తురా లడుగుతూంటే చెప్పకుండా ఉండడం తగదు. విను" అంటూ తన చరిత్ర చెప్పసాగింది.

నా జన్మభూమి - నువ్విందాకా చెప్పావే - సింధువారం అని అదే. మా తండ్రిపేరు సృంజయుడు. నా సోదరుడి పేరు ధనుంజయుడు. నాపేరు గంధర్వదత్త. నన్ను మాతండ్రి వింధ్యకూట నగరాన్ని పాలించే మణికులుడనే రాజకుమారుడి కిచ్చి వివాహం జరిపించాడు. నే నత్తవారింటికి వెళ్ళాక 'నాకొక ముద్దుల కొడుకుపుట్టాడు" అంటూ గంధర్వదత్త దుఃఖంతో ఆగిపోయి..గొంతులోంచి మాటరాక, కొంచెం సేపాగి, నిట్టూర్చి మళ్ళీ చెప్పసాగింది.

"వాడి కళ్ళు...వాడి ముఖం, వాడి అందం, లక్షణాలు చూసి - వీడు చక్రవర్తి ఔతాడని దైవజ్ఞులు చెప్పారు. అదేదీ నేను చూడలేకపోయాను. వాడిముద్దు ముచ్చట్లు చూసుకుంటూ నాలుగేళ్ళు ఒక ఘడియలా గడిపేశాను. నాభర్త కూడా రాజ్యవ్యవహారాలు మాని ఎప్పుడూ వాడితోటే కాలక్షేపం చేస్తూండేవాడు.

అప్పటి ఆనందం, ఇప్పటి దుఃఖం - రెండూ తలుచు కుంటూంటే ఏదీ స్థిరం కాదని అర్థమై బాధ కలుగుతూంది.

వసంతకాలంలో ఒకనాటిరాత్రి పండువెన్నెల కాస్తూంటే, మేము మేడపైన ఆకాశం కింద మంచం వేయించుకుని - మా ముద్దుల కొడుకుని మధ్యలో ఉంచి...వాడి ముద్దుమాటలతోనూ ఆటలతోనూ వెన్నెలలో గడిపాం. మా సుఖాలకదే చిట్టచివరి రాత్రి అని మాకు తెలియదు. ఎంతో ఆనందంగా గడిపి - నిద్రపోయాం.

మర్నాడు ఉదయం లేచి చూసేసరికి - ఈ ప్రాంతంలోని ఒక అగ్రహారంలో సూర్యభట్టు అనే బ్రాహ్మణు డింట్లో - నులకమంచం మీద పడుకుని ఉన్నాను.

ఆ బ్రాహ్మణుడు తనపొలంలో వరికుప్ప నూర్పిస్తూ తీసి రాసిగా వేసిన గడ్డిలో స్పృహ తప్పి పడున్నానట! అతను నన్ను చూసి, ఇంటికి తీసుకెళ్ళి సేద తీర్చినట్లు నాతో చెప్పాడు. సూర్యభట్టు - "నీ వృత్తాంత మేమిటి? నువ్వెవరివి? నీభర్తవరు?" అని ఎన్నోవిధాల అడిగారు. నేను మూగదానిలా ఏమీ మాట్లాడలేదు. సమాధానం చెప్పలేదు. అదేమి కారణమో, అతనికి నాకథ చెప్పబుద్ధి కాలేదు. వెర్రిదానిలా, మూగదానిలా ప్రవర్తించసాగాను.

ఆ బ్రాహ్మణుడు నన్ను కూతురిలాగే చూసుకుంటూ పోషించసాగాడు.

నేను పూర్వచరిత్రంతా కల...అంతే..అనుకుంటూ వైరాగ్యంతో కాలక్షేపం చేయసాగాను. కొన్నాళ్ళు గడిచాక - నా దురదృష్టంకొద్దీ ఆ పుణ్యాత్ముడు మరణించాడు. ప్రాణాలు పోయేముందతను తన తమ్ముడైన ఆర్యభట్టును రప్పించాడు. తనకి సంతానం లేదు కనక తన ఆస్తితోపాటు నన్నూ అతనికి అప్పగిస్తూ - "తమ్ముడూ! ఇది నాకూతురు సుమీ. వొట్టివెర్రిది. ఏమీ తెలియదు. దేవుడే నాకు తెచ్చిచ్చాడు. వెర్రిదయినా సుగుణాలకుప్ప. మూగదైనా - చెప్పిన పని చేస్తుంది. కూతురిగా చూసుకుంటూ దీని బతుకు తెల్లవార్చు. ఇదే నాకు నువ్వు చేయవలసింది" అంటూ తమ్ముడి నుంచి వాగ్దానం తీసుకుని చనిపోయాడు. అతనికి నామీద ఎందుకో అంతవాత్సల్యం అని ఆశ్చర్యపోతూ - అతనిచావుకి ఎంతో దుఃఖించాను.

ఆర్యభట్టు నన్నూరడించి, తన ఇంటికి తీసుకొచ్చి, భార్యతో చెప్పి - అన్నకిచ్చిన మాట ప్రకారమే ప్రేమగా చూసుకోసాగాడు. ఆయన భార్య రామాబాయి కూడా భర్తంటే భయంవల్లనో, సహజమయిన ప్రేమవల్లనో, దిక్కులేని దాన్ననో నన్ను ఆదరంగానే చూసేది. ఇలా

"మంచిపనే చేశావు. కాని...వొంటిమీద అన్ని వస్తువులతో దాని బంధువులు లేకుండా తీసుకెళ్ళాలంటే కొంచెం ఆలోచించాలి. సర్లే! నువ్వు ఔననేశావు కదా. ఇందులో మనంపడే ప్రత్యేకశ్రమ ఏంటుందిలే" అందావిడ.

మర్నాడు జలప్రయాణానికి నక్షత్రం మంచిది కాదని, ఆరాత్రే వాళ్ళు ముగ్గురూ ఒక బండిలో ఓడరేవుకు వెళ్ళారు. రాజభటులు వాళ్ళని చూసి ఆడవాళ్ళే కదా అని అనుమానించకుండా వదిలేశారు. మంచిగాలి వీచుతుండడం వల్ల తెరచాప లెత్తేసి ఓడనిగాలి వాలుగా వదిలారు నావికులు. ఓడ – వాయువేగంతో పోసాగింది. అది అంత పెద్దఓడ కాకపోవడంవల్ల వజ్రమాల ఆశపడ్డట్లు పుష్పహాసుడితో స్వేచ్ఛగా వినోదించడానికి వీలుపడింది కాదు.

పుష్పహాసుడెప్పటికప్పుడేవేదో మిషతో వజ్రమాలని తప్పించుకుని తిరిగేవాడు. గాలిఅనుకూలత వలన ఓడ పదిరోజుల్లోనే చాలాదూరం ప్రయాణించ గలిగింది. ఇక రెండు మూడు రోజుల్లోనే రేవు చేరిపోతామని నావికులు ఆనందం పడుతూండగా – గాలి ఎదురుతిరిగింది. ఓడ దిశ మారిపోసాగింది. అది గ్రహించిన నావికులు భయపడుతూ తెరచాపల్ని దించి..మునుపటిదిక్కుకి నడిపించడానికి ప్రయత్నించారు కాని వారి యత్నాలేమీగాలి ఫలించనివ్వలేదు.

అంతలో గాలివాన ప్రారంభమై – ఆ ఓడ అటూఇటూ కొట్టుకుంటూ మునిగిపోడానికి సిద్ధమయింది. నావికులు దేముడిమీద భారం వేసేశారు. ఆ ఓడ మునిగిపోక – తుఫానుగాలి విసురుకి ఒకదీవికి కొట్టుకుపోతూ అక్కడున్న రాతికొండకు తగిలి ముక్కలయింది. ఓడలోని వారు ప్రాణాలతో మాత్రం మిగిలి ఒడ్డున పడ్డారు. వజ్రమాల, తల్లి, పుష్పహాసుడూ మెల్లగా ఆ పర్వతమెక్కి నావికుల్ని అది ఏదేశమని అడిగారు. "ఇది మేమెప్పుడూ చూసిందికాదు. ఇదేదో కొత్తదీవి" అన్నారు వాళ్ళు. అంతలో తన వేపెవరో దూరం నుంచి వస్తున్నట్లు కనపడగా, వీళ్ళుకూడా వాళ్ళకెదురుగా కొంతదూరం నడిచారు. అప్పటికి వాళ్ళు

దొంగలని తెలుసుకుని పారిపోడానికి ప్రయత్నించారు. కాని ఆ దొంగలు వీళ్ళని పట్టుకుని వొంటిమీదున్న నగలన్నీ లాక్కుని కట్టుగుడ్డలతో మాత్రం వదిలారు ఆ సందడిలో నావికు లెక్కడికో పారిపోగా ఆడవాళ్ళు ముగ్గురే మిగిలారు.

అప్పుడు పుష్పహాసుడు మగరూపంలో తిరగాలనుకున్నాడు కాని - వజ్రమాల తల్లివల్ల మాటొస్తుందని అంగీకరించలేదు. అతను స్త్రీ వేషంలోనే ఉండి - వాళ్ళిద్దరినీ ఓదార్చుతూ ధైర్యం తెచ్చుకుని అక్కడ కనిపించిన ఒకదారి ననుసరించి నడవసాగాడు. అతని వెనుక వాళ్ళిద్దరూ నడవసాగారు.

ఆ పర్వతం దిగాక భూమి కనపడింది కాని ఆదారి సముద్రం వేపే పోయింది. వాళ్ళు కొంతదూరం నడిచాక - ఒకచోట కొందరు మనుషులు భూమిదున్నుతూ కనిపించారు. వాళ్ళని చూసి - పుష్పహాసుడు, "ఇది ఏదేశం? గ్రామం ఇక్కడి కెంతదూరముంది?" అని అడిగాడు. కాని వాళ్ళకి భాష తెలియక, వారిభాషలో - "మీరెవరు?" అని అడిగారు. పుష్పహాసుడు బహు భాషలు తెలిసిన వాడవడం వల్ల - వారి మాటలు తెలుసుకుని, వారి భాషలోనే తన ప్రశ్నలు అడిగడు. వారు - "ఇది యవనద్వీపం. యవనావతి అనేపట్నం ఇక్కడికి రెండు క్రోసుల దూరంలో ఉంది" అని చెప్పారు.

ఆ మాటవిని పుష్పహాసుడు చాలా భయపడుతూ - "మనం ప్రాణసంకటమైన చోటుకి వచ్చాం. మనదేశంలో తప్పు చేసిన వారిని ఈద్వీపం తీసుకొచ్చి వదిలేస్తారు" అన్నాడు.



# వరుణదత్తుడి కథ

"ఇక్కడున్న యవనులు అతిక్రూరులు హిందువుల్ని పనికట్టుకుని బాదిస్తుంటారు. సరే.ఇప్పుడు ఏంచేయగలం? దేముడెలా తలుచుకుంటే మనం అలా పోవలసిందే కదా" అంటూ అతను వారిద్దర్నీ వెంటబెట్టుకుని వేగంగా నడుస్తూ - కొంచెం పొద్దుండగానే ఆ పట్నం సరిహద్దులకి చేరాడు

అప్పుడొక గొప్ప ఉద్యోగస్థుడు రెండు గుఱ్రాలబండి మీద వొస్తూ - వారిముగ్గురినీ చూసి బండి ఆపించి - "మీ రెవరు? ఎక్కడికి పోతున్నారు?" అని - సేవకులచేత అడిగించాడు.

పుష్పహాసు డతనికి దగ్గరగా వెళ్ళి పరిశీలనగా అతని ఆకారం గమనించాడు. విశాలనేత్రాలు, గుండ్రని ముఖం, పొడవైన చేతులు, విశాలమైన వక్షమూ అన్నీ బాగానే ఉన్నాయి కానీ ఆ పొడవయిన గెడ్డమే కొంచెం వికారంగా ఉందనుకున్నాడు. ఆ లక్షణాన్నిబట్టి అతను ఔదార్యం కలవాడే అని మనస్సులో నిశ్చయించుకుని - సలమ్ చేస్తూ - "అయ్యా! మాది హిందూదేశంలో దేవనగరం. అమరావతీ పురానికి వెళ్తూ - సముద్రం మధ్యలో గాలి వానకి ఓడ పగిలి - ఈ దిక్కుకి చేరాం. తరవాత దొంగలు మమ్మల్ని దోచుకున్నారు. మా దేశానికి పోయేమార్గం చెప్పిపుణ్యం కట్టుకోండి" అని సవినయంగా ప్రార్థించాడు

అతను వారివేపు జాలిపడుతూ చూసి - కొంచెం ఆలోచించి - "మగవారి తోడు లేకుండా ఆడవాళ్ళు ప్రయాణం చేయవచ్చునా? మీరీ పట్నంలో ప్రవేశించారో యవనులు మిమ్మల్ని పరాభవించకుండా వదలరు. మీ పుణ్యం బాగుందికనక నాకు కనిపించారు మా ఇంటికి రండి త్వరలోనే మీ దేశం పంపుతాను. ఇలా కూర్చోండి" అంటూ తన బండిలో ఒకమూల వాళ్ళు కూర్చుందుకు చోటు చూపించాడు

అతని అకారణ వాత్సల్యాభిమానాలను పొగుడుతూ పుష్పహాసుడు వారితో పాటూ బండిలో కెక్కికూర్చున్నాడు అధికారి బండిని వెనక్కి మళ్ళించమని తనయింటికి తీసుకు పోయాడు. అతని భవనమూ,

ప్రాకారమూ చూసి ఆశ్చర్యపోతూ అతనొక చక్రవర్తేమో అనుకున్నాడు. సేవకులు దారి చూపగా వాళ్ళు ముగ్గురూ లోపలికి వెళ్ళారు.

ఆ యజమాని భార్య దాసులవలన వారి వృత్తాంతం విని - వారిని చాలా గౌరవిస్తూ - వారుండడానికి గదులను చూపించింది. ఆమె చేసిన సత్కారాలకు ఆశ్చర్యపోయి - పరోపకారపారీణు లన్ని దేశాల్లోనూ ఉన్నారని వాళ్ళు పొంగిపోయారు.

వాళ్ళింట్లో ఉన్నప్పుడు కూడా వజ్రమాల - పుష్పహాసుడు తన కోరిక తీర్చుతాడేమో అని ఆశపడుతూ రాత్రులు ఏకాంతంగా దొరుకుతాడేమో అని చూసేది కాని అతనలాటి అవకాశమివ్వకుండా తప్పించుకు తిరిగేవాడు క్రమంగా అతనాయింటి యజమాని భార్యతో పరిచయొ చేసుకుని ఒకనాడు "అమ్మా! ఈ పట్నంలో ఉన్న వారందరూ ఒక జాతి వారుగా కనపడుతున్నారు. మీ మతం హిందూ మతంలా అనిపిలుస్తుంది. స్మశానంలో తులసిమొక్కలా మీరొక్కరూ ఈ తురకదేశంలో ఎన్నాళ్లనుంచి ఉంటున్నారు? మీ వృత్తాంతం కొంచెం చెప్పి సంతోషం కలగజేయండి - అని ప్రార్థించే సరికామె చాలా ఆనందించి - ఇలా అంది.

# వసంతసేన కథ

"మా తండ్రి హిందూదేశ వాస్తవ్యుడు. శూరసేనుడనే ఒక సామంతరాజు. అప్పటి చక్రవర్తి కాయనపై ఏదో కోపం వచ్చి - మునుపిచ్చిన గ్రామాలు లాక్కుని - కట్టుగుడ్డలతో వదిలి పెట్టాడట. అప్పుడు తనకి కలిగిన అవమానానికి చాలా సిగ్గుపడుతూ మాతండ్రి ఆ దేశంలో ఉండడాని కిష్టపడక, భార్యతో బయలుదేరి విదేశాలు తిరుగుతూ ఒకనాటికి మక్కా అను పట్నం చేరాడట.

అప్పుడు దైవవశాన ఈ పట్నపు సుల్తానుగారి పెద్ద బిబ్బీ యాత్రార్థమై అకడికొచ్చింది. మాతండ్రిగా రెలాగో ఆమెతో పరిచయం

అనిపరిచారకులకి బోధించి పంపింది. రాజభటులా లంచానికి పొంగిపోయి ఆ ఇల్లు పరీక్షించకుండానే వెళ్ళిపోయారు. వజ్రమాల ఎంతో సంతోషంతో .. ఎంతో చక్కగా తయారై అలంకారాలు వేసుకుని..ఫలహారాలు పట్టుకుని..“అమ్మా!నేనివాళ మేడమీద పడుకుంటాను. పిలవకు.” అంది తల్లితో.

“నీమగ డూరలేడుకదా? ఒంటరిగా నువ్వామేడమీద పడుకుంటానంటావేం? ఇంతగా సింగారమెందుకు చేసుకున్నావు?” అని ఆవిడ అడిగేసరికి వజ్రమాల బుడిబుడి దుఃఖం నటిస్తూ – “అమ్మా! నీతో చెప్పకపోవడమేం? రాత్రి నా భర్తతో క్రీడిస్తున్నట్లు కలొచ్చింది. మధ్యలో మెలకువ రావడం వల్ల అప్పటినుంచీ మనసేదోలా ఉంది. ఇవాళ ఆ మంచం మీద పడుకుని.. ఊహించుకుంటూ నిద్రపోయానో నిన్నను మిగిలిపోయిన కల వచ్చి – మనసుకి సుఖంగా ఉంటుందేమో అనే ఆశతో ఇలా చేస్తున్నాను. నువ్వేమో ఊరికే అనుమానాలు పెట్టుకుంటావు” అంది.

ఆ తల్లి – అల్లుడు దేశాంతరం వెళ్ళి చాలా రోజులయింది; కూతురికి కోరిక కలిగింది కాబోలు – అనుకుని సరే అంది. తల్లిచేత ఔననిపించుకున్న వజ్రమాల ఆమేడమీదకుపోయి, తలుపులు మూసి..గాజుదీపాలు వెలిగించింది. పుష్పహాసు డొకచోట ఒదిగికూర్చుని ఏదో ఆలోచించుకుంటున్నాడు.

“అందగాడా! నువ్వింక భయపడవలసిన అవసరం లేదు. రాజభటులు రాగా లంచమిచ్చి సాగనంపేశాను. ఇదిగో నీళ్ళు, కాళ్ళు కడుక్కో. పళ్ళు, పిండివంటలు, పాలు ఇవిగో. నీకిష్టమైనవి తిను” అందామె అతనికి దగ్గరగా వెళ్ళి.

“నాకోసం ఎందుకింత శ్రమ తీసుకున్నావు? ఇవన్నీ ఎందుకు తెచ్చావు? నేనేమీ తినలేను. పాలుమాత్రం తీసుకుంటాను.”

“అదేమీ?”

"కొన్నాళ్ళ నుంచీ నన్నొక వ్యాధి పీడిస్తూంది. అంచేత పథ్యం తీసుకుంటున్నాను." ఆమె కొంచెం ఆశాభంగం చెందినా – "ఇవన్నీ పథ్యాలే. వీటిని తింటే నీవ్యాధి మటుమాయమౌతుంది. సుకుమారులిలాగే అంటారు. నువ్వు వీటిని తినాలని నా ప్రార్ధనా, ఆజ్ఞాకూడా" అంటూ బలవంతం చేసి అతనిచేత కొన్ని తినిపించింది. ఆకులు చిలకలు చుట్టి అందించింది కాని అతను తీసుకొలేదు.

పుష్పహాసుడు . నీ మాటలు, చేష్టలూ చూస్తుంటే చాలా ప్రౌఢలా ఉన్నావు. ఏమైనా చదివావా?

వజ్రమాల . ఎన్నో చదివాను. కాని...నా చదువులకీ, రసికతకీ ఆనందించేవారెవరున్నారనీ?

పుష్పహాసుడు ఎవరానందిస్తారు? నీ భర్తే ఆనందిస్తాడు.

వజ్రమాల : నాభర్త అపాటివాడైతే నాకీ ప్రారబ్ధమెందుకు?

పుష్పహాసుడు : నువ్వు ఏయే గ్రంధాలు చదివావు?

వజ్రమాల : వసుచరిత్ర, తారశశాంకం. బిల్హణీయం, హంసవింశతి, శుకసప్తతి, రాధికాస్వాంతనం, కొక్కోకం, కామసూత్ర, కందర్ప చూడామణి, అనంగరంగం, రతిరహస్యం, నాగస్వర స్వకాసిరత్న మన్మధసంహిత, మనసిజసూత్రం, రతిమంజరి, కామతంత్రం, రతికల్లోలిని మొదలయిన శృంగార ప్రబంధాలన్నీ చదివాను. సంగీతంలో నా గొప్పతనం నేను చెప్పుకోకూడదు కాని, సరస్వతీదేవే మెచ్చుకుంటుంది. అన్నీ ఉన్నాయి, అంచుకి తొగరేలేదు.

పుష్పహాసుడు వైరాగ్యగ్రంధాలేమీ చదవలేదా?

వజ్రమాల : అవి ముసిలి వారు చదువుకోవలసినవి. మనలాట పడుచు వారికెందుకు?

పుష్పహాసుడు పోనీలే, కొక్కోకం కంఠస్తమేనా?

వజ్రమాల : (తోవలోకొస్తున్నాడని ఆనందిస్తూ) తలకిందులుగా కూడా ఏకరువు పెట్టగలను.

పుష్పహాసుడు : కొక్కోకంలో పన్నెండో పిరిచ్ఛేదం నీకు జ్ఞాపకముందా?

వజ్రమాల : రసికుడివే! అదే దొరికిందానీకు? ఆపరిచ్ఛేదంలో ఏమడుగుతావు?

పుష్పహాసుడు : పదోశ్లోకం చదివి తాత్పర్యం చెప్పు.

వజ్రమాల : నాకు రాదనుకున్నారా?..( అంటూ ఆ శ్లోకం చదివి-) భర్త గ్రామాంతరం వెళ్ళినప్పుడు భార్య మంగళసూత్రం వంటి ప్రధాన నగలే తప్ప ఇతర అలంకారాలేవీ ధరింపకూడదు. గురువుల్నీ విప్రుల్నీ సేవిస్తూ భర్తక్షేమం కోసం వ్రతాలు చేస్తుండాలి - అని తాత్పర్యం.

పుష్పహాసుడు : మరి నువ్వలాగేచేస్తున్నావా?

వజ్రమాల : అమ్మకచెల్లా! నన్నాక్షేపించడానికా ఈ పరీక్ష? తెలిసికోలేక పోయాను, వెర్రిదాన్ని.

పుష్పహాసుడు : నాకిప్పుడు మనసు వ్యాకులంగా ఉంది. వీణ వాయించి గానరసంతో నాకానందం కలుగజెయ్యి. ఇప్పుడు మంచి దారికొచ్చావనుకుంటూ వజ్రమాల తీగెలు శ్రుతిచేసి వీణవాయిస్తూ పాటపాడసాగింది. అతను చేరబడి నిద్రపోతుండడం చూసి- “ఇతనికి రసికత్వం బొత్తిగా శూన్యంలా ఉందే! నాలాటిది ఏకాంతంలో పాడుతూంటే - మోహం చెందడం మాని నిద్ర పోతున్నాడే! నేనితనికోసం ఎంత శ్రమపడ్డాను! అంతా వృధాయేనా?”- అనుకుంటూ అతన్ని మేల్కొలపడానికి నానావిధాల అపశబ్దాలూ చేసింది. అయినాసరే అతను మేలుకోలేదు. అంతలో కోడికూత వినపడింది. వజ్రమాల తలుపులు వేసి వెళ్ళి తల్లి పక్కలో పడుకుంది.

తల్లినవ్వుతూ - “అమ్మా! కలవొచ్చిందా? ఆ కలలో నీ మనోహరుడు కనపడ్డాడా? అంత బాధెందుకూ? వాళ్ళెప్పుడో రమ్మన్నారు కదా? రేపు మన ఓడ ఒకటి ప్రయాణానికి సిద్ధం చేయమని నావికులకి

చెబుతాను" అంది ఓదార్పుగా. కాని ఆమాటలేవీ వజ్రమాల చెవి కెక్కలేదు.

మధ్యాహ్నం ఫలహారాలు పట్టుకుని మళ్ళీ మేడమీదకి వెళ్ళింది. తాను తెచ్చిన ఫలహారా లతని కందించి 'నీలాటి రసికుడి నెక్కడా చూడలేదు. రాత్రి - నన్ను సంగీతం పాడమని నువ్వు నిద్రపోతావా? ఎంతమంచి రాగాలాలపించానో! అయితే ఏం ప్రయోజనం? నా మగణ్ని మించిపోయావు స్తబ్దతలో" అంటూ అలిగింది. "సాధ్వీ! నాకు పదిరోజుల నుంచి నిద్రలేదు. అదీకాక దుఃఖంలో ఉన్నవాడికి దేనిమీదయినా విరక్తే.నన్ను అమరావతికి తీసుకుపో, అక్కడ నాచాతుర్యం చూపుతాను. ఒకపక్క వ్యాధి బాధిస్తూంటే నీ సంగీతం రుచిస్తుందా! అన్నాడు పుష్పహాసుడు.

"నీకు నేనురక్షణకల్పించాను కదా? ఇంకా భయమెందుకు? అమరావతీ ప్రయాణానికి అంతా సిద్ధమయ్యే ఉంది. నీ సంతోషమేకదా నేను కోరుకునేది"

'నన్ను పట్టుకుందుకు రాజభటులు ఎక్కడి కక్కడ గట్టిగా ప్రయత్నిస్తున్నారు.ఇంతకు మునుపు - ఓడలో కూర్చోగానే పట్టుకున్నారు. అందుచేత నేను ఈసారి స్త్రీ వేషంలో మీతో వస్తాను. అలా అయితే వాళ్ళు పరీక్షించలేరు. నీకూ తప్పుండదు"

"మంచి ఆలోచన. అందువల్ల ఎన్నోలాభాలున్నాయి" అంటూ-ఆమె అప్పటి కప్పుడే అతనికి తలదువ్వి జడవేసి, చీరకట్టి, కొన్ని నగళ్ళుపెట్టి అద్దంలో చూపించింది తన ఆడవేషం తనకే ఆశ్చర్యం కలిగించింది. జగన్మోహినిలా ఉన్న అతని స్త్రీ వేషం చూసి వజ్రమాలే సిగ్గుపడింది.

ఆమెను తన తల్లి దగ్గరకు తీసుకువెళ్ళి, "అమ్మా! ఈమె ధనపాలుడనే వర్తకుడి కూతురట.ఈమె భర్త అమరావతిలో ఉన్నాడట. మనం అక్కడికి వెళ్తున్నామని తెలిసి దీనితండ్రి తీసుకొచ్చి నాకుఅప్పగించాడు. నువ్వు లోపలపనిలో ఉన్నావని - నీతో చెప్పకుండానే నే నంగీకరించాను. నాకు తోడుగా ఉంటుంది తప్పు చేయలేదుకద నేను!"

చేసుకుని తనకుటుంబం గురించి ఆమెతో చెప్పుకున్నారట. ఆమెకు జాలి కలిగి ఆ దంపతులను తమతో ఇక్కడికి తీసుకువచ్చి ఒక ఉద్యోగం మిప్పించింది. మాతండ్రి చాలా బుద్ధిమంతు డవడం వల్ల క్రమంగా సుల్తాను గారి అనుగ్రహానికి పాత్రుడై చాలా ధనం సంపాదించాడు.

మా తండ్రి ఇక్కడికి వచ్చి నలభై సంవత్సరాలయింది. ఇక్కడికి వచ్చిన పదేళ్ళకు నేను పుట్టానట. లేకలేక కలిగినదాన్నని నన్నెంతో ముద్దుగా పెంచసాగారు. నాకు యౌవనం వస్తుంటే మా తండ్రికి నా పెళ్ళి గురించి చింత మొదలయింది. నన్ను యవనుడి కిస్తే కామధేనువుని కసాయి వాడికి దానమిచ్చినట్లే. తనజాతి పురుషు డీ దేశంలో లేడు. ఏం చేయాలో తోచక మా తండ్రి దేముడిమీదే భారం వేసేశాడు.

ఒకనాటి సాయంకాలం ఒక పురుషుడీ వూరి వీధుల్లో తిరుగుతూ - బాటసారు లుండడానికి సత్రమెక్కడున్నదని అడుగుతున్నాడట. ఇక్కడున్న వాళ్ళకి సత్రమంటే తెలియదు. మసీదనాలి. తురక లతన్ని పరిహాసం చేస్తూ అతడ్ని ఇంటింటికీ తిప్పసాగారట. తాగిన యవనులు కొంద రతన్ని తిట్టి కొట్టారు పాపం అతనలా రెండు జాములవరకూ తిరిగాడట. దొంగదొంగ అంటూ అతన్ని తరిమారట. హిందువులని చూస్తే ఇక్కడి యవను లలాగే కుక్కని తరిమినట్లు తరుముతారు. వీరికి దయా దాక్షిణ్యాలు ఉండవు. నీచులకు స్థానబలం అధికం.

అప్పు డతడు మరునా డుదయంవరకు తరమగొట్టబడి తిరుగుతూ, దెబ్బలకు రక్తాలు కారుతున్న శరీరంతో, పిచ్చి వాడిలా మాయింటివేపు వచ్చాడు. తురక బాలురతన్ని తరుముతున్నారు. వీధరుగు మీద కూర్చుని ముఖం కడుక్కుంటున్న మా తండ్రి అతని పరిస్థితికి జాలిపడి - ఆ పిల్లలని తరిమేసి అతన్ని పిలిచాడు. అపాటి మంచి మాటే కరవయిన అతను సంతోషంగా మాతండ్రి వద్దకు వచ్చి "నిన్నరాత్రంతా ఇక్కడి వారునన్ను పెట్టినబాధలు పరమేశ్వరుడికి తెలుసు. ఇక్కడ రాజూ, పాలనా లేదా? ఇంత అన్యాయం ఎక్కడేనా ఉంటుందా?" అని దుఃఖించాడు.

అతని మాటల నుంచి హిందువుడని గ్రహించి – ఓదార్చి – వైద్యులచేత అతని గాయాలకు చికిత్స జరిపించి, భోజనసదుపాయా లమర్చాడు మాతండ్రి. నాలుగు రోజులలో గాయాలు మాని అతను మనిషయ్యాక, అతని రూపురేఖల కాశ్చర్యపడి అతని వృత్తాంతం అడిగాడు. అతను కొంచెంసే పాలోచించి – "నేనొక గొప్ప వంశపు క్షత్రియుణ్ణి. నా పూర్వచరిత్ర తెలిసినట్లే అనిపిస్తుంది కాని గుర్తుకి రాదు. నోటికి రాదు శాపం వల్ల సముద్రంలో పడ్డాను. కాని..మునిగిపోలేదు. ఈదుకుంటూ తీరం చేరి నిన్న సాయంకాలానికే పట్నం చేరాను. తరువాత – మీకు తెలిసిందే" మాతండ్రి అతన్ని ఇంట్లో పెట్టుకుని వరుణదత్తుడని పిలుస్తూ పోషించసాగాడు.

కొన్ని రోజులయ్యాక నేను వింటూండగా మాతండ్రి మా తల్లి– "మన వసంత సేనకి పెళ్ళీడు వచ్చింది. మనజాతి వాళ్ళీ దేశంలో లేరు. ఈ వరుణ దత్తుడు రూపానికి మన్మధుడిలా ఉన్నాడు, విద్య,గుణము, శీలము కూడా మంచివే ఉత్తమక్షత్రియుడట. ఇతన్ని దేముడే మనింటికి తీసుకొచ్చాడేమో. ఇతనికి మన వసంతసేననిచ్చి వివాహం చెయ్యాలనుంది. ఏమంటావ్?" అని అడిగాడు.

అమ్మ నామొహం వేపు చూసింది. నేనంగీకారం సూపించాను. వాళ్ళు చాలా సంతోషించి నా కతనితో వివాహం జరిపించారు. అతనే నాభర్త. అనుకూలమైన భర్త లభించి నేను సకలసౌఖ్యాలూ అనుభ విస్తున్నాను. నా భర్త దయామయుడూ, సౌజన్యనిధీ. అతన్ని పొందడం నా అదృష్టం.

హిందూదేశంలో ద్వీపాంతరవాస శిక్షవిధించబడిన వారి నీ దీవికి పంపుతూంటారు. అలాటి వారిని పట్టుకుని ఇక్కడి యవనులు పశువుల్లా బాధిస్తూ పనులు చేయిస్తూంటారు. అదంతా చూసి నాభర్త అలాటివారిచేత పనులు చేయించే అధికారం తనకిమ్మని సుల్తాన్‌గారిని కోరాడు. మాతండ్రిమాట కాదనక సుల్తాన్ ఆయనకా ఉద్యోగమిచ్చాడు. నాతల్లితండ్రులు కొన్నాళ్ళకిందటే మరణించారు.

అప్పటి నుంచీ నాభర్త ఆ ఉద్యోగం చేస్తున్నారు నెలకోసారి ఓడరేవుకి పోయి - మీ దేశం నుంచి వచ్చిన నేరస్తులను పరిశీలించి - తీసుకొచ్చి - వారినేరాలకి తగిన పనులు మాత్రమే వారికి చెబుతూ కాపాడుతూంటారు ప్రమాదవశాత్తూ ఎవరేనా అన్యాయంగా శిక్షించబడ్డారని తెలిస్తే అలాటి వారిని విడచి పెట్టడానికి కూడా సుల్తాను నా భర్తకి అధికారమిచ్చారు. మనపెరటిలోని పొలంలో పువ్వులమొక్కలూ అవీ వేలకొద్దీ వేయించి వాటి పనులు అలాటి వారిచేత చేయిస్తూంటారు.

మీరు మొదటే వారికంటపడ్డారు కనక ఏవిధమయిన కష్టాలూ పడకుండా మాయింటికి వచ్చారు. లేకపోతే యవనులు మిమ్మల్ని నానాహింసలూ పెట్టి మీ శీలం భంగ పరిచేవారే"

పుష్పహాసుడు ఆమెవృత్తాంతం విని

"అమ్మా! నాకిక్కడ కలిగిన సందేహాలన్నీ పోగొట్టారు. మీ ఆకారాలూ అలంకారాలూ యవనుల పోలిక. ఆచారాలు హిందూ మతానివి. మొట్టమొదట నీ భర్తని చూసినప్పుడే అనుమానం వచ్చింది. నువ్వు చాలా ఉత్తమ ఇల్లాలివి. అతిధులనెంత చక్కగా ఆదరిస్తున్నావో! మాకీ పట్నం చూడాలనుంది. సహాయంగా ఎవరినేనా యిచ్చి పంపవా? మా దేశం వెళ్ళాక కూడా నిన్నెల్లకాలం చెప్పుకుంటూంటాం" అన్నాడు.

"అమ్మా! నాభర్త ఒడరేవుకి పోతున్నప్పుడు మీరొక బండిమీద పోయి నగరం చూసొద్దురుగాని. ఆయన విన్నారంటే అంగీకరించరు" అందామె పుష్పహాసుడు తాను స్త్రీ వేషంలో ఉన్నందుకు విచారిస్తూ పురుషుడిగా మారిపోడానికుపాయం ఆలోచించసాగాడు.

మర్నాడు వరుణదత్తుడు ద్వీపాంతరంనుంచి వచ్చే అపరాధులని తీసుకురాడానికి ఓడరేవుకి పోగా - వసంతసేన అతిధులు ముగ్గురినీ ఒక బండిలో పట్నం చూడడానికి పంపింది. ఆ బండివాడు కొత్తవాడు. ఎక్కడి కెళ్ళాలో తెలియక సుల్తాను గారి వీధి మేడకి తోలుకు పోయాడు. హిందు స్త్రీలకి ముసుగేసుకునే అలవాటు లేదు. పైగా ..పట్నం చూడాలని బండికిటికీలన్నీ తెరిచి కూర్చున్నారు.

దైవికంగా వీధిలో బంతాట ఆడుతున్న చిన్నసుల్తాను వారిని చూసి - బండిదగ్గరికి వచ్చి -వారెవరని బండివాడి నడిగి - వరుణదత్తు గారి బంధువులుగా తెలుసుకున్నాడు అదే సమయంలో పుష్పహాసుడు చిన్నసుల్తానుని చూశాడు. అతను - స్త్రీ వేషంలో ఉన్న పుష్పహాసుడి సౌందర్యానికి వలచి బండి చాలాదూరం వెళ్ళేవరకూ అలాగే చూస్తూ ఉండిపోయాడు పట్నమంతా తిప్పి బండివాడు సాయంకాలానికి వారిని ఇంటికి చేర్చాడు. తాము చూసిన విశేషాలు పుష్పహాసుడు వసంతసేతో చెబుతూంటే - సముద్ర తీరం నుంచి అయ్యగారు వచ్చారని పరిచారకులు తెలియజేశారు.

అప్పటికి కొంచెం చీకటి పడుతూంది. అలవాటు ప్రకారం వసంతసేనభర్తకి స్నానానికి వేడినీళ్ళు సిద్ధం చేయించింది. అతను స్నానం చేసి - భోజనం చేస్తూంటే - విసనకర్రతో విసురుతూనే ఆవేళ విశేషాలేమిటని భర్త నడిగింది.

వరుణదతద్తుడు "విశేషాలేమున్నాయి? ఎక్కడ చూసినా స్త్రీ సాహసమే ఎక్కువగా కనపడుతూంది. ఇద్దరు స్త్రీలు ఒక రత్నాల వర్తకుణ్ణి చంపేశారట! వాళ్ళకి ద్వీపాంతరవాస శిక్ష విధించబడింది. వాళ్ళేమో ప్రాణాలుమాత్రం మిగిలి ఉన్నారు. ఇలాటి సాహసాని కెందుకు పూనుకున్నారో? జారత్వంలో ఎంత దోషమేనా ఉంటుంది కాబోలు. ఆ స్త్రీలిద్దరితో పాటూ మరో అందమైన యువకుడు కూడా శిక్షించబడ్డాడు. అతనేం నేరం చేశాడో కనుక్కోలేదు. ఇవే నేటి సంగతులు" అన్నాడు. "ఆ స్త్రీలు వివాహితులేనా? పాపం, వారి భర్తలెంత విచారిస్తున్నారో! వాళ్ళకి కూడా వీళ్ళతోపాటు శిక్ష విధిస్తే - కలసి ఉందురు కదా. అలాకాక భర్తలు ..తరువాత ఇక్కడికి వస్తే రానిస్తారా?" అని భర్తని అడిగేసరికి అతను నవ్వుతూ - "జాతి అభిమానం పోనిచ్చావు కాదు. నేరం చేసి శిక్షించబడ్డాక వివాహితురాలైతే ఏమిటి, కాకపోతే ఏమిటి? భర్తలనెందు కనుమతిస్తారు? అయినా వాళ్ళు రాగలిగారనుకో మా ఇష్టప్రకారం చేస్తాం. నేరస్తురాలైన భార్యకోసం నిరపరాధి అయిన భర్తనెందుకు శిక్షిస్తారు?" అన్నాడు.

ఆమె ఉలిక్కిపడి - "ప్రమాదవశాత్తూ అపరాధం చేసి శిక్షించబడిన వారి విషయం నేనడిగాను. సరేలెండి. నాకు వాళ్ళని చూపిస్తారా? వాళ్ళమీద నాకెందుకో జాలేస్తుంది" అంది బతిమాలుతున్నట్లు.

"రేపు ఉద్యానవనంలోకి పోయి చూస్తే ఆ స్త్రీలు కనిపిస్తారు. ఇష్టమైతే వెళ్దాం" అని వరుణదత్తు డంటూండగా - ఒక పరిచారకుడు వచ్చి - "సుల్తానుగారేదో చీటి పంపారు తీసుకురానా?"అని అడిగాడు.

అతను తీసుకురమ్మని అప్పటికప్పుడే దాన్నిచదివాడు. "చూశానని చెప్పి ఈ చీటీని తెచ్చిన వాడితో చెప్పి - వెళ్ళమను." అన్నాడు సేవకుడితో. "ఏమిటంత విశేషం?" అడిగింది వసంతసేన.

"ఏమీలేదు. నాతో అత్యవసరంగా మాట్లాడవలసిన పనుందట. రేపు సూర్యోదయానికి ముందే వచ్చి తనని చూడమని రాశారు సుల్తాను" "దేని గురించి అయి వుంటుందో?"

"శిక్ష అనుభవిస్తున్న హిందువుల గురించి అడగడానికయి వుండవచ్చు"

"అందుకైతే అంత అత్యవసరమైనదేముంటుంది? మరేదో కారణముండొచ్చు." "రేపటికన్నీ తెలిసిపోతాయి కదా" అని - వేగంగా పడుకుని - సూర్యోదయం కాకముందే వరుణదత్తుడు బండెక్కి సుల్తానుగారి ఆస్థానం చేరుకున్నాడు.

ఆ చీటీ ఏమిటా అనే ఆలోచనతో వసంతసేనకు రాత్రంతా నిద్రలేదు. ఉదయం తొందరగా తయారై - పుష్పహాసుడేదో పనిమీదుండడంవల్ల మిగిలిన ఇద్దర్నీ వెంట బెట్టుకుని - పరిచారికలు వెంటరాగా ఉద్యానవనానికి వెళ్ళింది. అమ్మగారొస్తున్నారని - సేవకులు ఎదురొచ్చారు ఎక్కడికి తీసుకెళ్ళమంటారని అడిగారు.

"నిన్న వచ్చిన ఆడవాళ్ళున్న చోటుకి తీసుకెళ్ళండి" అంది వసంతసేనం

"అమ్మా! పాపం ఆ స్త్రీలు శిక్ష పడింది మొదలు అన్నంతినడం లేదట. చాలా చిక్కిపోయి ఉన్నారు రాత్రి ఎంతచెప్పినా తిన్నారు కారు. ఈ విషయం అయ్యగారికి చెప్పాలనుకుంటున్నాం" అంటూ వాళ్ళవద్దకు తీసుకెళ్ళారు.

అక్కడ ఒక సుందరి పడుకుని దుఃఖిస్తూంది రెండవ ఆమె పక్కన కూర్చుని ఒదార్చుతూంది. వసంతసేన వారి దగ్గరకి వెళ్ళి సహజమైన దాక్షిణ్యంతో - వారిస్థితికి విచారిస్తూ - "అమ్మా! మీరేం నేరం చేశారు? అన్నంతినక మీ ప్రాణాలు కళ్ళల్లో కొచ్చాయి కదా. ఎన్నాళ్ళిలా ఉపవాసాలు చేస్తారు? దేముణ్నే వేడుకోవాలి మీరు. విచారించకండి. భగవంతుడు మిమ్మల్ని రక్షిస్తాడు" అని ఊరడించేసరికి వారివిచారం కొంత తగ్గింది కాబోలు - వారిలో చిన్నది - "అమ్మా! ఇటువంటి చల్లని మాటలు విని ఎన్నాళ్ళయిందో తప్పు చేసి శిక్షించబడితే అదొకదారి పూర్వజన్మలో చేసిన నేరానికి దేవుడిప్పుడు శిక్షిస్తున్నాడులా ఉంది. నువ్వు చాలామంచిదానివిలా కనిపిస్తున్నావు మా బాధ నీతో చెప్పుకోడం వల్ల కొంత ఉపశమిస్తుంది. నిరపరాదులమైన మమ్మల్ని శిక్షించారు. ఈమె మహాపతివ్రత. ఈమె నిర్దోషి అని తెలిసి - అది చెప్పినందుకు నన్నూ శిక్షించారు. న్యాయమెలా ఉందో చూడు" అంటూ తాను రేవానగరం చేరింది మొదలు అప్పటివరకూ జరిగినీదంతా పూసగుచ్చినట్లు చెప్పింది

వారు నిరపరాధులని తెలియడంతో వసంతసేన జాలి మరీ ఎక్కువైపోయింది. ఆమెను తనరెండు చేతులతోనూ లేవనెత్తి కన్నీరు తుడుస్తూ - "నాభర్త చాలా మంచివారు. వారితో చెప్పి వీలయినంత ఉపకారం చేయిస్తాను మాయింట్లో భోజనం చేద్దువుగాని రా. అయ్యో! ఉపవాసాలతో నీ సుందరమైన శరీరం ఎంత చిక్కిపోయిందో! నీ పతి ఎవరు? నీ వియోగంతో అతనెంత కృంగిపోతున్నాడో?" అని అడిగింది.

తిలక - 'అమ్మా! ఆ చరిత్రంతా చేటభారతమంత ఉంది. మెల్లగా నీకు చెబుతాను మాభారం నీదే" అంది. వసంతసేన వారినింటికి

తీసుకు పోవాలనుకున్నా - "అయ్యగారికి చెప్పికాని తీసుకుపోకూడదు" అని పరిచారకులు మనవి చేసుకున్నారు. "వారికి చెప్పే రప్పించు కుంటాను" అని ఆమె ఇంటికివచ్చి గృహకృత్యాలలో మునిగి ఉండగా - వరుణదత్తుడు ఆ స్థానం నుంచి తిరిగివచ్చి తన గదిలో పడుకుని భార్యకి వర్తమానం పంపాడు.

ఆమె అతని గదిలోకి వెళ్ళేసరికి అతను కోపంగా ఉన్నారు. "సుల్తానుగారు మిమ్మల్నెందుకురమ్మన్నారు?" అని మెల్లగా అడిగింది. అతను కోపంగానే - "మనింట్లో ఉన్న ఆడవాళ్ళు నిన్న బండెక్కి పట్నంలో తిరిగారా?" అని అడిగాడు. ఆమె గడగడవొణికి పోతూ "వాళ్ళు పట్నం చూస్తామని పదిరోజులనుంచీ అడుగుతున్నారు. ఎంతకని కాదనగలను? నిన్న వాళ్ళని బండిమీద పంపాను. అందుకు సుల్తాను గారికి కోపం వచ్చిందా?" అని ఆత్రంగా అడిగింది. "ఇది పాడువూరని నీకు నేనెన్నో సార్లు చెప్పలేదూ? ఆడవాళ్ళు వీధిల్లో వెడితే వాళ్ళు ఊరికే పోనిస్తారా?" అని ఒకక్షణం ఆగాడు.

# సుల్తాను గారి కథ

"ఆ బండి సుల్తానుగారి వీధిలోంచే వెళ్ళిందట. సుల్తాను చూసి - ముగ్గురిలోనూ ఎర్రగా ఉన్నదాన్ని మోహించాడట. రాత్రంతా విరహంతో నిద్రపట్టలేదట. దానిని తనకిచ్చి పెళ్ళిచేయమన్నాడు. ఆమె ఒక మగనికి భార్య - అని చెప్పాను.

"దాని మగడెంత సొమ్మడిగితే అంతా ఇస్తాను. అందుకు ఒప్పుకోకపోతే బలిమినయినా దానిని తీసుకుంటాను-" అన్న సుల్తానుకి నేనేం జవాబు చెప్పగలను? ఆవుల్ని తినేవాడికి కనికర ముంటుందా? వీడు పాతసుల్తానుకాడు, మనం చెప్పినట్లు వినడానికి! వాడికొడుకు. యౌవనమదంతో ఉన్నాడు. అందుచేత - నేను కొంచెం ఆలోచించి "మీమాటకాదనడానికి నేనెంతటివాణ్ని? ఇంటిదగ్గర చెప్పి ఆమెనొప్పిస్తాను.

అనుజ్ఞయివ్వండి-" అని శలవుతీసుకుని వచ్చాను. ఇదీ అక్కడ జరిగిన విశేషం. ఇక మనం ఏం చేయాలో? ఆలోచించు" అన్న వరుణదత్తుడిని ఉలికిపడుతూ చూసింది వసంతసేన.

ముక్కుమీద వేలేసుకుని - "ఎలాటి విపరీతం! కొత్త సుల్తానంత మత్తులో ఉన్నాడా! మరొకరి భార్య నెలా పెళ్ళాడతాడు? పతివ్రత లందుకంగీకరిస్తారా? అయ్యో! ఇలా జరుగుతుందని తెలియలేదు. ఊరు చూస్తామంటే పంపించాను. అయ్యో! నాలుగురోజులింట్లో తలదాచుకుందామని వచ్చిన ఆమెతో - కులంచెడి, నీచజాతికి కలియమని ఎలా చెప్పేది? నానోట అలాటిమాటెలా వొస్తుంది?" అందామె.

"వాళ్ళలో పెళ్ళయినదాన్ని మళ్ళీ పెళ్ళి చేసుకోకూడదనే నియమేమీలేదు. నిషేధమూ లేదు. పశువులని కొనుక్కున్నట్లే ఆమె యజమానిని డబ్బిచ్చి కొనుక్కుంటారు. అదీకాక రాజుతలుచుకుంటే దెబ్బలకు కొదవా? కాని పని అని అతనికి చెప్పగలిగిన వాడెవడు? మనం ఊరుకుండిపోతే మన జీవితానికే భంగమొస్తుంది. ఆమెతో చెప్పడానికా - నోరు రావడం లేదు ఏం చెయ్యాలి దేవుడా?" - అని ఆలోచిస్తూ ఉండిపోయాడు రెండు జాములుదాటినా ఎవరికీ భోజనం చెయ్యాలనిపించలేదు

వారి సంభాషణంతా విన్న పుష్పహాసుడు మెల్లగా ఆగదిలోకి వచ్చి - "అమ్మా! మేము నిన్ను తల్లిగానూ, వారిని తండ్రిగానూ భావించుకుంటున్నాం మా గురించి ఏదో కలతపడి మీరు భోజనం చేయకుండా ఉన్నారు అదిన్యాయం కాదు. మీ ఆజ్ఞయితే - అగ్నిలో అయినా దూకుతాం. మీరు చూపుతున్న ఆదరం అటువంటిది" అన్నాడు.

"నిజమే, నువ్వన్నట్లు మేమలాగే చూసుకుంటున్నాం. పదిరోజుల్లో ఓడవస్తుందనీ, మిమ్మల్నమరావతీ నగరం పంపుదామనీ అనుకున్నాం. కాని - ఇంతలోనే దైవం ఒక చిక్కు తెచ్చిపెట్టాడు. నాకు తెలియకుండా మీరు నిన్న పురవిహారం చేశారట. అప్పుడు బండిలో ఉన్ననిన్ను చూసి - సుల్తానువరించాడు తనకిచ్చి పెళ్ళి చేయమని

కోరుతున్నాడు. లేకపోతే బలవంతంగా తీసుకుపోతాడట. అందుకే మిమ్మల్ని బయటకు పోవద్దని చెప్పాను. ఇప్పుడేం చెయ్యాలో ఎంతాలోచించినా తోడచం లేదు"

"అయ్యో! దీనికి మీరింత సంశయించాలా? నేను పోయి - శీలం చెడకుండా అతని చేతనే వద్దనిపించుకుని వస్తాను. అంగీకరించినట్లు జవాబు పంపండి. జవాబులో - దాని మగడెప్పుడూ దానినంటిపెట్టుకు తిరుగుతూంటాడు కనక జాగ్రత్తతో మెలగమని మాత్రం రాయండి. మీరేమీ సంశయించకండి. నేను కార్యం సాధించుకొస్తాను" అని ధైర్యంగానూ ఉత్సాహంగానూ చెప్పాడు పుష్పహాసుడు.

వరుణదత్తుడు సంతోషంగా లేచి - 'మీరు కోరిన చిన్నదానినీ రాత్రికే పంపుతున్నా నంటూ చీటీ రాసి - వాకిట్లో ఎదురు చూస్తూ నిలుచున్న రాజభటుడికిచ్చి పంపి - భోజనానికి వెళ్ళాడు.

భర్త భోంచేసేటప్పుడు - వీవనతో విసురుతూ - "నిన్నమీరు చెప్పిన ఆడవాళ్ళ నిద్దరినీ ఈ ఉదయం చూశాను. వాళ్ళ నన్యాయంగా శిక్షించారు. ఇందువల్లే కాబోలు - రాజ్యాంతంలో నరక మంటారు. ఆ వర్తకుడి నెవరో కాలితో తన్ని చంపారట. ఆ సమయానికి అమ్మవారి కుపారం పెట్టడానికీమె అక్కడుండడంవల్ల నేరా న్నీమెమీదకి తోసేశారట. ఆమె మహాపతివ్రత కనక ఏమీ మాట్లాడలేదట. అదంతా చూస్తున్న రెండవ స్త్రీ నిజం చెప్పిందని - ఆమెతో కలిసి వున్నందుకు ఈమెను కూడా శిక్షించారట! ఎంత అన్యాయమో చూడండి. వారి వృత్తాంతమంతా నాకు చెప్పారు. అమె ఉత్తమ ఇల్లాలని నేను ప్రమాణం చెయ్యగలను. రామరామ! పదిరోజులనుంచీ ఏమీఆహారం తినడం లేదట! వాళ్ళ ఉసురు తగులుతుంది. అమె చక్కదనం చూసి తీరవలసిందే. ఉపవాసాలవల్ల కృశించి - చంద్రరేఖలా కనిపిస్తూంది. వారినిక్కడికి తీసుకు వచ్చేటట్లు మీరాజ్ఞ ఇవ్వాలి. వాళ్ళకి భోజనం పెట్టి రక్షిస్తాను" బ్రతిమాలుతున్నట్లే అంది వసంతసేన.

తన భార్యకనికరానికి మనసులో మెచ్చుకుంటూనే - "నిన్నక్కడికి వెళ్ళమనడమే నా తప్పయినట్లుంది. నేరం చేసినవారెవరేనా

అలాగే చెబుతారు. వాళ్ళ మాటలనిబట్టి చేస్తే వ్యవహారాలు సాగుతాయా? తప్పు చేసిన వారుకూడా తప్పు చేయలేదనే ప్రమాణాలు చేస్తారు. నీకు నిదర్శనం చూపిస్తాను. భోజనమయ్యాక నాతోరా" అన్నాడతను.

కాని – "అదేమీ నాకు తెలియదు. వాళ్ళని కాపాడకతప్పదు" అందామె.

"సరేలే-చూద్దాం"అని...భోజన మయ్యాక భార్యని తీసుకొని ఉద్యానవనానికి వెళ్ళి అక్కడి కింకరుడికి– నిన్నవచ్చిన నేరస్తుల నిక్కడికి తీసుకురా" అని ఆజ్ఞాపించి ఒకచోట కూర్చున్నాడు. వాడు – ఆ నేరస్తులని తీసుకొచ్చి ఎదుట నిలబెట్టాడు. వరుణదత్తుడు – వాళ్ళలో ఒకణ్ని – "నువ్వేం నేరం చేశావు? నిన్నెందుకు శిక్షించారు?" అని అడిగాడు. అతను తలొంచుకుని – జవాబు చెప్పకుండా మౌనంగా ఉండిపోయాడు.

అప్పుడు వరుణదత్తుడు మరొకడిని – "నువ్వేం తప్పుచేశావు? నీ కెందుకు ద్వీపాంతరవాస శిక్ష విధించారు. నిజం చెప్తే నిన్ను విడిపిస్తాను" అన్నాడు.

అతను "అయ్యా! నేనేపాపమూ ఎరగను. దైవసాక్షి. ఆ చిన్నది అడవిలో ఉంటే గృహస్థ ధర్మంగా ఇంటికి తీసుకొచ్చాను. ఆ కడియం అదే ఇచ్చింది. దాన్ని తీసుకెళ్ళి అంగట్లో అమ్మబోతే – నన్ను భటులు పట్టుకుని సింధువారనగరం తీసుకుపోయి ధనుంజయుడి ఎదురుగా నిలబెట్టారు. అతను ధర్మాత్ముడే అనీ, కడియం తీసుకుని నన్ను విడచి పెడతాడనీ అనుకున్నాను. కాని కొంపముంచేశాడు. అబ్బా! ఆ రాజభటులు నన్నెన్ని చిక్కులు పెట్టారో! అన్నమయినా తిన్నగా తిననిచ్చారు కాదు. నా ఉసురువాళ్ళకెప్పుడు తగులుతుందో. ఏ దోషం తెలియక పౌరోహిత్యం చేసుకుంటూ బతుకుతున్న నా ఇంటికొచ్చి ఆ చిన్నదే నాకీ ముప్పు తెచ్చి పెట్టింది. ఇంతకంటె నాకేమీ తెలియదు –" అంటూ కన్నీరు ధారలు కట్టేలా ఏడిచాడు.

వరుణదత్తు డతని మాటలు వినగానే ఏదో జ్ఞాపకం వచ్చి – "హా! గంధర్వదత్తా! నీ వృత్తాంతం మరిచిపోయి మరోదేశంలో సుఖంగా ఉన్నావు కదా! నీ పేరయినా జ్ఞాపకం లేదే! అయ్యో! పుష్పదంతా!

ఒక్కనిముషం నీముఖం చూడకపోయినా పరితపించే నేనిన్నాళ్లు నిన్ను చూడకుండా ఎలా ఉన్నానో! హా! కన్నతండ్రీ! హా! ప్రాణేశ్వరీ!" అంటూ మూర్ఛపోయి కూలబడ్డాడు.

వసంతసేన ఎంతో కంగారుపడి – "రక్షించండి, రక్షించండి" అంటూ శైత్యోపచారాలు చేయించింది. కాని అతనికి తెలివి రాలేదు. అతన్ని గదిలోకి చేర్చి వైద్యులని పిలిపించింది. వారు – "ఇతనికేమీ భయంలేదు. సైతాను సోకిందంతే. ఎవరూ ఇతన్ని పిలవొద్దు. తలుపులు వేసి పడుకోనిస్తే – సాయంకాలాని కన్ని దోషాలు తొలగిపోతాయి" అని చికిత్స చేసి వెళ్ళిపోయారు. వసంతసేన తలుపులు వేసి ద్వారం దగ్గరే కూర్చుంది. నువ్వెవరివో నాకు తెలియదు. గంధర్వదత్త నా అర్ధశరీరం. ఎక్కడుంది? నా ముద్దులకొడుకేడీ? ఇక్కడికి నేనెలా వచ్చాను? నా రాజ్యమేమయింది?" అంటూ అతను కలవరివంచిన మాటలనే గుర్తు చేసుకుంటూ..ఆలోచిస్తూ..కూర్చుంది.

సాయంకాలం అవగానే – పెళ్ళికూతురిని తీసుకెళ్ళడానికి సుల్తాను పంపిన ఏడుగుర్రాలబండి వచ్చింది. పుష్పహాసుడు వేరొక మేడలో ఉండి అలంకరించు కుంటున్నాడు కనుక వరుణదత్తుడి విషయం అతనికి తెలియదు. బండివచ్చిన వార్త విని వజ్రమాల పరిహాసమాడుతూంటే – చక్కగా అలంకరించుకుని ఆ బండిలో కూర్చున్నాడు. ఆ బండి చాలా వేగంగా సుల్తాను గారి అంతఃపురానికి తీసుకు పోయింది. వివిధ వాయిద్యాలతో పరిచారిక లామెను అంతఃపురంలోకి తీసుకు పోయారు. చిన్న సుల్తాను ఆరాటపడిపోతూ పురోహితుణ్ణి తొందరగా మంత్రాలు చదివి తతంగం పూర్తి చేసెయ్యమన్నాడు. అప్పుడు సుల్తాను తన కులాచారప్రకారం ఒక గాజుపూసని పెళ్ళికూతురు మెడలో కట్టాడు.

తరవాత ఆ దంపతులను చక్కగా అలంకరించబడిన కేళీ పందిరంలో ప్రవేశపెట్టారు. ఆ మందిరానికి నూరుగజాల దూరంలో ఇతరు లెవరూ ఉండకూడదన్న సుల్తానుగారి ఆజ్ఞప్రకారం ఆప్తులందరూ దూరంగా తొలగిపోయి పడుకున్నారు.

పెళ్ళికూతురు తలవంచుకుని ఒక మూల నిలబడింది. ఆమె చేయి పట్టుకుని తల్పం వద్దకు నడిపించుకు వెళ్ళి – ఆమె ముఖాన్ని ఎత్తి – "నిన్ను చూసింది మొదలు ఎంత పరితాప పడ్డానో! ఇంతవరకూ నేనెందరినో పెళ్ళాడినా ఎవరూ నీలా నామనసు నాకర్షించలేదు. నీ అధరామృతం తోనే నా పరితాపం చల్లారుతుంది" అన్నాడు సుల్తాను.

"మహారాజా! నీలాటి మనోహరుడు నామనోహరుడిగా లభించడం నా అదృష్టం కాని.. దీనికొక అంతరాయం కలుగుతుందని జంకుతున్నాను. నాభర్త నన్నెప్పుడూ ఆవహించి ఉంటాడు. అతను చాలాబలవంతుడు. ఇది నేరంగా భావించి మీకేమైనా పరాభవం కలిగిస్తాడేమో అని సందేహిస్తున్నాను" అందామె.

"నీ పతికి నేను చక్రవర్తినని తెలియదా? నా కపకారం తలపెట్టడం ఎవరి తరం కాదు. నీకేదయినా కోరికుంటే అడుగు" అంటూ సుల్తాను ఆమెను కౌగలించుకుందుకు దగ్గరకు వచ్చాడు. అంతే పుష్పహాసుడు ఒకసారి గట్టిగా సింహంలా గర్జించి....గిరగిరతిరుగుతూ..స్త్రీ వేషం వదిలి పురుషుడై – "ఓరీ! మ్లేచ్ఛాధమా! నాభార్యని ఎత్తుకొస్తావురా? నిన్నిప్పుడే యమపురికి పంపుతాను చూడు" అంటూ పళ్ళు పటపట కొరుకుతూ...అతనిమెడ పట్టుకుని నేలమీదకు పడదోసి అతని మీద కాలు వేసి – నరికెయ్యడానికి కత్తెత్తాడు. సుల్తాను ఏమీచేయలేక –

"ఓ మహాపురుషా! నీకు సలామ్. నన్ను వదిలేయ్. నీ భార్యజోలికి రాను. వారింట అప్పగించి ఎన్నోకానుకలిస్తాను. నాకు ప్రాణదానం చెయ్యి. బతికినన్నాళ్ళు నిన్ను తలుచుకుంటాను. నాకు మంచి ప్రాయశ్చిత్తమయింది. రక్షించు" అని ప్రార్థించాడు. అతనికి మూర్ఛ వచ్చేటట్లు గొంతునొక్కి వదిలి...మళ్ళీ యధాప్రకారం స్త్రీ వేషంతో నిలబడ్డాడు.

కొంతసేపటికి సుల్తానుకి తెలివొచ్చింది. ఎదురుగా పెళ్ళి కూతురిని చూసి ఒణికిపోతూ.. "నువ్వు చెప్పిన మాట వినక చచ్చినంత పాటు పడ్డాను. నీ పొందుకి పదివేల సలాములు. చచ్చి మళ్ళీ పుట్టాను. నీ జోలికెప్పుడూ రాను. నీ మగనితో చెప్పు నువ్వు నాకు తల్లివి. పసుపు

కుంకుమలు, చీరెలుసారి కానుక లిస్తాను. తీసుకుని ఇంటికి వెళ్ళు" అంటున్న సుల్తాన్ని చూసి ఆమె నవ్వుతూ - "ఇక నువ్వు భయపడనక్కరలేదు. నా మగడు నీ పొగడ్తలకు మెచ్చి వదిలేశాడు.హాయిగా నిద్రపో. నేను పొద్దున్న యింటికిపోతాను" అంది

ఆమె మొగుడు మళ్ళీ వచ్చి మెడనొక్కేస్తాడేమో అన్న భయంతోటే ఎలాగో తెల్లవారేవరకూ గడిపి - ఎవరికీ చెప్పకుండా బండిని తెప్పించి - పెళ్ళికూతురి నెక్కించి - కానుకలతో పంపించాడు. ఆమెతోనే ' ఆడది కాదు, సైతాను. ఎరగక వరించాను. బుద్ధొచ్చింది. మళ్ళీ దానిని కానుకతో మీ ఇంటికి పంపాను.' అని ఉత్తరం రాయించి వరుణదత్తుడికి పంపాడు.

ఇంటికెళ్ళి - తాను సుల్తాన్ నెలా ఏడిపించాడో చెప్పి పుష్పహాసుడు వజ్రమాలని కడుపుబ్బా నవ్వించాడు. సుల్తాను రాసిన ఉత్తరం పట్టుకుని వరుణదత్తుడి వద్దకు వెళ్ళాడు. వసంతసేన అతన్ని చూసి - "అమ్మా! పోయొచ్చావా? నిన్నటినుంచి మీ తండ్రికి స్మృతి లేదు. ఏమిటో పలవరిస్తాడు. నువ్వు చాలా తెలివైన దానివి. వచ్చి చూడు" అని చెప్పగా, అతను చింతిస్తూ ఆ గదిలోకి వెళ్ళి - "తండ్రీ! ఇటుచూడు. నేను సుల్తాను గారి వద్దకు వెళ్ళివచ్చాను. ఆయనమీకేదో ఉత్తరమిచ్చారు. చూడండి." అనేసరికతనులిక్కిపడి - "ఏదీ ఆ ఉత్తరం?" అంటూ లేచాడు. పుష్పహాసుడందించగా చదువుకుని - "మంచినేర్పరివే! చెప్పినట్లే చేశావ్. ....." అంటూనే మళ్ళీ... "హా గంధర్వదత్తా! హా పుష్పదంతా!" అంటూ పలవరిస్తూ పడుకున్నాడు. అప్పుడు వసంతసేన -"అమ్మా! రాత్రంతా ఇలాగే పలవరింతలు. మరోమాట లేదు." అంటూ ఉద్యానవనానికి పోవడంతో మొదలుపెట్టి అంతవరకూ జరిగినదంతా చెప్పింది.

అప్పుడతను కొంచెం ఆలోచించి "తండ్రీ! ఇదుగో గంధర్వదత్త. నిన్ను చూడాలని వచ్చింది. ఆమెను విడచివచ్చావట!" అన్నాడు. వరుణదత్తుడు తటాలున లేచి - "నా ప్రాణసఖి ఏదీ? ఇటురమ్మను. కొడుకుని కూడా తీసుకు వచ్చిందా? ఎంత కలకన్నాను?" అంటూ

నాలుగుమూలలా చూశాడు. పుష్పహాసుడు – "తండ్రీ నీ పేరు మణికుండలుడు కాదా? వింధ్యకూట నగరం నుంచి ఇక్కడికెలా వచ్చావు?" అని అడిగాడు."నిజమే. నేను మణికుండలుడినే ఇదంతా స్వప్నంలా ఉంది. గంధర్వదత్తని చూపించు" అని అడిగాడు.

ఆశ్చర్యంగా చూస్తున్న వసంతసేనతో – "అమ్మా! ఇతని చరిత్ర నాకర్థమయింది. ఒకప్పుడు నేను ధనుంజయుడనే రాజు వద్దకు ఒక కడియం కానుకగా తీసుకెళ్ళగా ఆయన వీరికథ చెప్పాడు. భార్యపుత్రులతో మేడమీద పడుకొనగా మర్నాడు ఉదయం కనపడలేదట. వీరికోసం ఎంత వెదికించినా ప్రయోజనం లేకపోయిందని ధనుంజయుడు చాలా విచారించాడు. అది జ్ఞాపకం వచ్చే ఇలా అయ్యాడు. మరేమీ భయంలేదు" అన్నాడు పుష్పహాసుడు.

"ఔను ధనుంజయుడు మా బావమరిదే...అని వరుణ దత్తుడంటూంటే – పరిచారిక వచ్చి వసంతసేనతో – "వారెవరికో మీరు భోజనం పెడతామన్నారట. వారు వచ్చారు" అని చెప్పింది. ఆమె – "ఇప్పుడేవస్తానని లోపలికి వెళ్ళింది. ఆమె వారికి స్నానానికి వేణ్ణీళ్ళు, మడిబట్టలు..ఇచ్చి చక్కనిభోజనం వడ్డించింది. తిలక, ఆమె ఆత్రంగా తింటూంటే – "నెమ్మదిగా తినండి. తొందరేమీలేదు. నా భర్తతో మీమాట చెప్పాను. అప్పటినుంచీ – గంధర్వదత్తా! పుష్పదంతా! అని పలవరిస్తున్నాడు. వారి మనసు కొంచెం స్తిమితపడగానే మీకుపకారం చేస్తారు" అంది. వసంతసేన మాటలకు ఆమహిళ భోజనం చేయడం ఆపేసి ఆశ్చర్యంగా చూస్తూ కన్నీరు పెట్టుకోసాగింది. తిలక – "అమ్మా! మీరు భోంచెయ్యండి. నేనావిషయం చూస్తాను!' అనే సరికి వసంతసేన ఇమె ఎందుకు దుక్కిస్తుంది.– "గంధర్వదత్తని మీరెరుగుదురా?" అని అడిగింది.

"ఎరుగుదుం. నేనొచ్చి మీ భర్తగారితో మాట్లాడతాను" అని భోజనం అయ్యాక తిలక ఆమెతో వరుణదత్తుడివద్దకు వెళ్ళింది. ఆ గదిలోనే ఉన్న పుష్పహాసుడామెను గుర్తు పట్టి – "నీపేరు తిలక కాదూ? నువ్విక్కడికెలా వచ్చావ్? నీ స్నేహితురాలేమైంది?" అని అడిగాడు.

"నేను తిలకనే. ప్రారబ్ధవశాన ఇక్కడికి రావలసివచ్చింది. నా స్నేహితురాలు నాతోనే ఉంది. నిన్ను గుర్తుపట్టలేకపోతున్నాను. నీపేరు చెప్పి సంతోషం కలిగించు" అందామె.

అంతలో వరుణదత్తుడు లేచి – "వసంతసేనా! ప్రయాణానికి సిద్ధం చెయ్యి. నేను వింధ్య కూట నగరం వెళ్ళి నా ప్రాణసఖి గంధర్వదత్తని చూడాలి. ఆలస్యం కాకూడదు" అన్నాడు. అప్పుడు తిలక – "మీరంత దూరం పోనక్కర్లేదు. మీరు మణికుండలులే ఐతే గంధర్వదత్త ఇక్కడే ఉంది" అంది.

"ఏదీ? మీరు వట్టి మాటలు చెబుతున్నారు. నేను మణికుండలుడినే. గంధర్వదత్తా॥ ఇటురా. నీభర్త ఇక్కడున్నాడు" అని వరుణదత్తుడు పిలవగానే ఆమె లోపలినుంచి అక్కడి వచ్చి – "నామనోహరుడేడీ?" అంది. అతనామెను కౌగలించుకుని. "ప్రాణేశ్వరీ! గంధర్వదత్తా! నేనిక్కడున్నాని ఎలా తెలిసింది. ఎవరు చెప్పారు? ఎలా వచ్చావు?" అంటూ అడిగాడు. ఆమె బిగ్గరగా ఏడవసాగింది.

వసంతసేన తెల్లబోయి చూస్తోంది. పుష్పహాసుడు, తిలక కూడా నివ్వెరపోతున్నారు. వాళ్ళు.....వియోగ దుఃఖంనుంచి తేరుకొన్నాక – వసంతసేన "నాథా! గంధర్వదత్త నీ ప్రాణేశ్వరి ఎలా అయింది? ఎప్పుడూ చెప్పారు కాదేం? ఇప్పుడేనా స్పష్టంగా చెప్పండి" అంది మెల్లగా.

"నేను సముద్రంలోపడి తేలి మీ వూరు చేరిన ఉదంతం నీకు తెలుసుకదా. అంతకు మునుపటి వృత్తాంతం చెప్పకపోవడానికి కారణం నీకదంతా ఒక కలలా అనిపించడమే. లెక్కపెట్టిచూస్తే...నేను మాదేశం వదిలి ఇప్పటికి పదహారు సంవత్సరాలయింది. ఒకనాడు మేడమీద గంధర్వదత్తతోనూ పుత్రుడితోనూ నిద్రించడమే జ్ఞాపకముంది."

తరువాత తిలక గంధర్వదత్త పడిన కష్టాలన్నీ చెప్పింది. ఇద్దరి వృత్తాంతం విన్న వసంతసేన – "ఆహా! దైవఘటన ఎంత విచిత్రం! అందుకే కాబోలు ఈమెను చూసింది మొదలు నామనస్సు ఎంతగానో తపించిపోయింది." అనుకుంది. వరుణదత్తుడు గంధర్వదత్త వృత్తాంతం

విని - "పుష్పదంతు డెక్కడున్నాడో? దేవుని దయవల్ల అతనుకూడా కనపడితే ఈ జన్మకిక కోరవలసిందేమీ లేదు" అన్నాడు

తిలక - "ఆ లోటు కూడా దేవుడు తీర్చక మానడు. మీ మేనకోడలు లలిత కూడా మాతోపాటు చాలా కష్టాలు పడుతూంది. చూశారా?" అంది. "ధనుంజయుని కూతురా! ఏదీ, ఇటు తీసుకురండి. బంధువులందర్నీ ఒక్కచోటుకే చేర్చాడు భగవంతుడు. మన మీద అతనికిదయ కలిగినట్లుంది" అని వరుణదత్తు దంటూండగానే - తిలకవెళ్ళి - మగవేషంలో ఉన్న లలితని తీసుకొచ్చి చూపించింది. అతన్ని చూసి-"ఇతను - శిక్షించబడిన మకరందుడు కాడా? ఇందాకా తోటలో చూశానే లలితేదీ?" అని ప్రశ్నించాడు వరుణదత్తుడు.

తిలక నవ్వుతూ - స్త్రీ వేషంలో ఉన్నవాడు పుష్పహాసుడని గుర్తించింది. భగవంతుడి మాయను మరోసారి శ్లాఘించింది" "స్త్రీలను పురుషులుగానూ, పురుషులను స్త్రీలగానూ కూడా మారుస్తూంటాడు - దేముడు. లలిత ఈ పుష్పహాసుడి కోసమే పురుషుడైంది. పురుషుడైన పుష్పహాసుడు లలితకోసమే స్త్రీ అయ్యాడు! ఈ పుష్పహాసుడే మీ పుష్పదంతుడని చెప్పగలను. గంధర్వదత్త పోలికలు వీనిలో అతిస్ఫుటంగా కనిపిస్తున్నాయి, చూడండి"-అంటూ పుష్పహాసుణ్ణి గంధర్వదత్త పక్కన నిలబెట్టింది. ఇద్దరి ముఖాలూ అచ్చుగుద్దినట్లుగా ఒకేపోలికలో ఉన్నాయి. అంతేకాక - గంధర్వదత్త కిప్పుడు పాలు చేపుకొచ్చాయి.

వరుణదత్తు డాశ్చర్యంగా చూడసాగాడు. అప్పుడు తిలక మకరందుణ్ని పుష్పహాసుడి పక్కకి తీసుకొచ్చి నిలబెట్టింది. "అయ్యా! వీరే నీ కొడుకూ, కోడలూ, చూసుకొండి" అంటూండగానే -

ఆకాశంనుంచి ఒక దేవదూత మంచంతో దిగి - "నిజమే రాజా! వీడే నీ కొడుకు పుష్పదంతుడు. ఇది నీభార్య - గంధర్వదత్త. ఆమె - నీకోడలు లలిత. నేనే మీకిలా వియోగం కలగజేసిన దుర్మార్గుణ్ని" అంటూ వారి ముందు నిలబడ్డాడు. అందరూ ఆశ్చర్యంలోంచి తేరుకోలేక పోతున్నారు. అప్పుడు -

వరుణదత్తుడు దేవదూతకి నమస్కరిస్తూ – "ఆర్యా! నీ వెవరివి? మే మానాడు మేడమీద పడుకున్న మంచం ఇదికాదా? ఇది మీ దగ్గరికెలా వొచ్చింది? మా వియోగానికి కారణం మీరన్నారు. అదెలాగో చెప్పండి." అన్నాడు. అప్పుడాదేవదూత తనకథ చెప్పసాగాడు.

## దేవదూత కథ

అలకాపురంలో– నూరేళ్ళకొకసారి నిధి పూజామహోత్సవం జరుగుతూంటుంది. ఆ ఉత్సవానికి ఇంద్రుడు, జయంతుడు, ముప్ఫయిమూడుకోట్ల దేవతలు, దిక్పాలురు, సిద్ధులు, సాధ్యులు, విద్యాధరులు, గంధర్వులు, కిన్నరులు మొదలైన వారంతా తమతమ భార్యలతో సహాఅక్కడికి వస్తారు. ఎందరో మహర్షులువస్తారు.

అప్సరసలు వచ్చి నాట్యం చేస్తారు. నారద తుంబురులవంటి ప్రముఖ గాయకులు సంగీతం పాడతారు. మహామునులు ప్రసంగాలు చేస్తారు. ఒక్కమాటలో చెప్పాలంటే – త్రిమూర్తులు తప్ప తక్కిన దేవలోకాల్లోని వారందరూ అక్కడికొచ్చి ఆ ఉత్సవాన్ని చూసి ఆనందిస్తారు. కుబేరుడు భార్యతోసహా కదిలివచ్చి పదిరోజులు పూజలుచేస్తాడు.

అప్పుడు నలకూబరుడు ఆయా లోకాలనుంచి వచ్చిన వారిలో అతి చక్కని జంటలని వేరువేరుగాకూర్చోబెట్టి వారి సౌందర్యాన్నిపట్టి స్థానాల్ని నిర్ణయించమంటాడు. మునపటి ఉత్సవాలలో – నలకూబరుడు, జయంతుడు మొదటివారుగానూ, చంద్రుడూ, వసంతుడూ రెండవ స్థానంలోనూ, అశ్వినీ దేవతలు మూడవవారుగానూ ఎన్నుకోబడ్డారు. మన్మథుడికి రూపం లేదు కనుక కానీ, ఉంటేనా అతనిదే అగ్రస్థానమని కొందరు వాదించారు.

ఈ మధ్య జరిగిన ఉత్సవానికి కొంతకాలం ముందు, మా ప్రభువైన కుబేరుడు – ' భూలోకంలో కూడా చక్కని వారెందరో ఉంటారు. వాళ్ళని కూడా పిలిస్తే బాగుంటుంది' అని ఆలోచించి – నన్ను పిలిచి –

"నువ్వు భూమండలమంతా తిరిగి - చక్కదనంలో మిన్న అయిన ఒక జంటని ఉత్సవానికి తీసుకురా. వాళ్ళకి అందమైన కొడుకుండాలి సుమా!" అని నన్ను పంపాడు.

నేను భూగోళమంతా తిరగసాగాను. మగాడు అందగాడైతే, భార్య బాగుండేది కాదు. భార్యరంభయితే భర్త కురూపి. ఇద్దరూ బాగున్న అరుదైన జంటలకి పుత్రసంతానం మాత్రంలేదు. తిరిగి తిరిగి విసిగిపోయి అలకాపురానికి తిరిగి వెళ్ళిపోతుండగా - నారద మహర్షి కనిపించాడు. నే నాయనకి నమస్కరించగా వారు దీవించి ...విశేషా లడిగారు. నేను నా చిక్కుని విన్నవించుకున్నాను. అప్పు డాముని -

"నువ్వుకాని వింధ్యకూట నగరానికి పోయుండి, అక్కడి రాజకుమారుడు మణికుండలుడినీ, అతని భార్య గంధర్వదత్తనీ, కన్నులపండగ చేసే వారికొడుకు పుష్పదంతుడినీకాని చూసి ఉంటే ఇలా అనగలిగి ఉండేవాడివి కావు" అని పరిహాసమాడి - అలకాపురం వెళ్ళిపోయాడు.

నేను మీ వూరు వచ్చాను. మేడమీద వెన్నెల్లో నిద్రపోతూ మీరు ముగ్గురూ కనిపించారు. అంతే! మీ మంచం తలమీద పెట్టుకుని అలకాపురం వేపు ఎగరసాగాను. అంతలో - ఒక చండప్రచండమైన గాలివీచింది. దాంతో మీరు భూమిమీదకు పడ్డారు. నేనది గమనించక మంచంతో కుబేరుని ముందునిలబడగా - "వొట్టి మంచం తెచ్చావేం?" అని అడిగాడు. నేను వణికి పోతూ- జరిగినదంతా చెప్పాను.

ఆయన చాలా కోపంగా - "క్రీడిస్తున్న దంపతులని తెచ్చి అనవసరంగా ఆపదలపాలు చేశావా! వాళ్ళు చచ్చిపోయారేమో చూసితీసుకురా. అమృతం జల్లి బతికిస్తాను. వాళ్ళు బతికుంటే - విడిపోయిన వారిని కలిపిరా.ఏసంగతీ తెలుసుకోకుండా వస్తే నీ అశ్రద్ధకి నిన్ను శిక్షిస్తాను" అని గద్దించాడు. అదే మహాప్రసాదమని నేను మిమ్మల్ని వెదకాను. భూమ్మిదెక్కడా మీరు నాకు కనిపించలేదు. చనిపోయుంటారని

నిశ్చయించుకుని అలకాపురం పోతూంటే - తోవలో మళ్ళీ నారదమహర్షి కనిపించాడు. ఆయనకు మొక్కి నా కష్టం విన్నవించుకున్నాను. ఆయన దివ్యదృష్టితో చూసి -

"పావురాల జంట ఒకటి బిడ్డలతో గూటిలో ఆనందంగా ఉండగా, ఆ మాంసం మీద ప్రలోభం కొద్దీ మట్టి వుండ విల్లుకి సంధించి వాటిని కొట్టాడు. అందుకు కోపించిన పావురం - 'వియోగ దుఃఖం అనుభవించ" మని శపించింది. అందుచేత వారు వియోగదుఃఖం అనుభవించి - ఇప్పుడే యవన దేశంలో కలుసుకుంటున్నారు. అక్కడికి పో" అన్నారు.

వారి మాట ప్రకారమే ఈ మంచంతో నేనిక్కడికి వచ్చాను. మీరు కనపడ్డారు. నీకొడుకు గంగానదిలో పల్లెవాడు పన్నిన వలలో పడి - వానిచేత పెంచబడి మేనమామ కూతురు లలితచేత వరించబడి - దేశాలపాలై... రాజభటుల పీడకి భయపడి.. ఆడవేషంలో సముద్రం దాటి - మీఇంటికి చేరాడు. ఇతనే పుష్పదంతుడు. పుష్పహాసుడుడని పిలవబడుతున్నాడు.

నీభార్య - సూర్యభట్టు అనే బ్రాహ్మణుడి వరిగడ్డిరాసి మీదపడి - ప్రాణాలు పోక - ఆయనచేత కొంతకాలం పోషించబడి - తరువాత ఆర్యభట్టు ఇంటికి చేర్చబడి -ఆయన భార్యచేసిన కపటానికి గుడికివెళ్ళి - సెట్టిని చంపిందనే నేరం నెత్తినపడి - శిక్షించబడి - నీదగ్గరకు చేరింది. ఈ మహాసాధ్వి గంధర్వదత్తయే.

ఈ లలిత నీకొడుకుని వరించి, అడవులపాలయి ..దొంగల చేత దోచుకోబడి..పురుష వేషంలో రేవానగరంలో తిరుగుతూ, యితన్ని పుష్పహాసుడనుకుని రాజభటులు పట్టుకుపోగా - రాజు చేత శిక్షించబడి యిక్కడి కొచ్చింది. ఈ తిలక ఆమె స్నేహితురాలు.

మీ చరిత్ర దేవలోకానికి కూడా పాకిందని నారదులవారన్నారు"

అదంతావిని అందరూ ఆనందాశ్చర్యాలలో మునిగి ఉండగా - మగవేషంలో ఉన్న లలిత చటుక్కున లేచి అవతలికి వెళ్ళిపోయింది.

పుష్పహాసుడు పురుషవేషంలో తల్లితండ్రులకి నమస్కరిస్తూ "దేవుడు ఇంద్రజాలికుడిలా మనుషులనే బొమ్మల నాడిస్తూంటాడు. అది తెలియక, మనుష్యులు అంతా తమ ప్రయోజకత్వమే అని సుఖదుఃఖాలు పొందుతారు. నిజానికి – వీరికి – ఊపిరిపీల్చి విడవడానికేనా స్వతంత్రం లేదు. సర్వం దైవాధీనం. అంతా ఆశ్చర్యమే..అంటూ తిలక చేసిన పనులన్నీ చెప్పి ఆమె తెలివితేటలను పొగిడాడు.

తల్లితండ్రులతన్ని ఎత్తుకుని ముద్దాడారు. అప్పుడు – దేవదూత "అయ్యా! మీ రీమంచం మీదకూర్చొండి. మీ పట్నానికి తీసుకుపోతాను. ఇది కుబేరుడి ఆజ్ఞ" అనగా రత్నకుండలుడు సుల్తానుకి తనవృత్తాంత మంతా చెప్పి, అపరాధులందరికీ స్వేచ్ఛను ప్రసాదింపజేసి – వజ్రమాలను తల్లితో కూడా విడిపించి, ఓడనెక్కించి భర్త వద్దకు పంపాడు. తన కుటుంబ మంతటితోనూ మంచంమీద కూర్చున్నాడు.

అప్పుడు గోవిందుడనే బ్రహ్మచారి దీనమయిన ముఖం పెట్టి చూస్తూంటే – తన వల్లనే అతని కీ శిక్ష పడిందని – ఆ కథ చెప్పి – అతన్ని కూడా మంచంమీద కెక్కించమని – లలిత మామగారిని ప్రార్థించింది. అతనంగీకరించాడు.

అలా వారందరూ కూర్చుని మాట్లాడుకుంటూంటే, దేవదూత – మంచాన్ని నెత్తిమీద పెట్టుకుని – హనుమంతుడిలా అతివేగంగా వింధ్యకూటనగరానికి ఎగరసాగాడు.

"గోపాలా! ఆ మంచం నీడే నీకు కనిపించింది. అర్థమైందా?" అన్నాడు మణిసిద్ధుడు.

"మీదయుంటే – తెలియని దేముంటుంది? వారి భవిష్యత్తు కూడా కొంచెం చెప్పి మీ శిష్యుణ్ని కృతార్థుణ్ణి చేయండి" అని వేడుకున్నాడు గోపాలుడు.

మణిసిద్ధుడు నవ్వుతూ – చెప్పసాగాడు. "అలాగ ఆ దేవదూత ఆకాశమార్గంలో ఎగిరి వింధ్యకూట నగరానికి చేరుకుని వారి అంతఃపురంలో వెనకటి మేడమీద ఆ మంచాన్ని దింపి – ఆ వార్త రాజుకి

తెలియజేశాడు. వారి రాకకెంతో సంతోషించి - ఆ రాజు - అప్పుడే రాజ్యాన్ని వారి అధీనం చేశాడు. ఆ సంగతి తెలిసి ధనుంజయుడు సకుటుంబంగా వచ్చి - వారిని చూసి - వారి వృత్తాంతాలు విని ఆశ్చర్యపోయి. "పుష్పహాసుడు నామేనల్లుడేమో అనే అనుమానం రాకపోలేదు. దండనాధుడు నాకు రాసి పంపిన - దేవాలయం గోడలమీది పద్యాలను చూసి - పుష్పహాసుణ్ని లలిత వరించి వెళ్ళిందనీ, తిలక సహాయకారిగా ఉందనీ - శిక్ష విధించాక ఊహించగలిగాను. అప్పుడా శిక్ష తగ్గిస్తూ మళ్ళీ ఆజ్ఞ పంపాను" అంటూ అన్నీ చెప్పి కూతుర్ని కౌగలించుకుని-తిలకను అభినందించాడు. రెండు మూడు రోజులు వాళ్ళంతా సంతోషంగా గడిపారు. దేవదూత - శుభముహూర్తంలో లలితా పుష్పహాసులకు వివాహ మహోత్సవం జరిపించి - ఆ విషయం కుబేరుడికి తెలియజేసి - అతను పంపిన నవరత్నమాలను పుష్పహాసుడి కంఠంలో వేసి - "దీన్ని ధరించిన వారు వెయ్యేళ్ళు జీవిస్తారు" అంటూ దాని ప్రభావం తెలియజేసి - అతన్ని పట్టాభిషిక్తుడిని చేస్తాడు.

పుష్పహాసుడు తల్లితండ్రుల అనుమతితో; అత్తమామల కానందం కలగజేస్తూ, ధర్మంగా రాజ్యం పరిపాలిస్తూ - సకల సుఖాలూ అనుభవిస్తూ ఉంటాడు. దేవదూత వారిని ఒప్పించి అలకాపురానికి వెళ్ళిపోతాడు"

అంటూ జరగబోయేవి కూడా చెప్పి - శిష్యుడితో బయలుదేరి - తరవాత మజిలీ చేరాడు.



# కాశీ మజిలీ కథలు

## 41. వ మజిలీ

గోపాలుడెక్కడికీ వెళ్ళకుండా చావడి అరుగుమీదే కూర్చుని ధ్యానంలో మునిగినట్లుండిపోయాడు. అనుష్టానాలు తీర్చుకుని వచ్చిన మణిసిద్ధుడి కిది విచిత్రంగా కనిపించి – "ఎంత ఆశ్చర్యం! నువ్వేమిటి, ఎక్కడికీ పోకుండా ఇక్కడే కూర్చోడమేమిటి?" అన్నాడు నవ్వుతూ.

వాడు లేచి నమస్కరిస్తూ 'స్వామీ! ఇది చాలా చిన్నఊరు. దగ్గరలో అడవికూడా లేదు. ఇక్కడేం వింతలు కనిపిస్తాయిలే అని మీరింతవరకూ చెప్పిన కథలను జ్ఞాపకం చేసుకుంటున్నాను. వాటిలో నాకు కొన్ని సందేహాలు కలిగాయి. మిమ్మల్నడిగి తీర్చుకుందామని కూర్చున్నాను" అన్నాడు గోపాలుడు.

"ముందు, భోజనం కానియ్. తరవాత చెబుతాను" అన్నాడు యోగి. గోపాలుడు గబగబ తినేసి వచ్చాడు. స్వామీ! కృష్ణదేవరాయల భార్యకళానిలయ, రామలింగకవి భార్య మందారవల్లి–మహావిద్వాంసులని మీ కథలవల్ల తెలిసింది. వాళ్ళిద్దరిలోనూ ఎవరెక్కువ తెలివైనవారు? మందారవల్లి వాదించడానికి వచ్చినప్పుడు ఆమె మాట చెప్పారు కారేం? వాళ్ళిద్దరూ ఒకేవూళ్ళో ఉండేవారు కదా. తరవాతెప్పుడేనా వారిమధ్య ప్రసంగాలు జరిగాయా? వారి మధ్యతేడాని ఎవరేనా చెప్పారా? అది తెలుసుకోవాలని నాకు కుతూహలంగా ఉంది"

వాడి సందేహానికి సంతోషించి – మణిని ముందు పెట్టుకుని దీవించి – తలూపుతూ – "నీలోఏదో అద్భుత శక్తుంది. నువ్వడిగావంటే ఊరికేపోదు. నీ ప్రశ్నవల్ల ఒక మంచి కథ తెలుస్తూంది. విను" అంటూ చెప్పసాగాడు.

# కళానిలయ కథ

మందారవల్లి రాయలవారి ఆస్థానకవులతో ప్రసంగించే టప్పుడు కళానిలయ పుట్టింట్లో ఉంది. రామలింగకవిని పెళ్ళాడిన మందారవల్లి రాయలవారి వూరిలో ఉద్యానవనంలో కట్టించబడిన దివ్యసౌధంలో ఉంటూ విద్యావ్యాసంగం చేస్తూండేది. ఆమెకు కావలసిన ద్రవ్యం ఢిల్లీనుంచి తండ్రే పంపేవాడు.

కళానిలయ పుట్టింటినుంచి వచ్చిన తరవాత మందారవల్లి వృత్తాంత మంతావిని - ఒకనాడు రాయలుతో - "నేను లేనప్పుడు మందారవల్లి అనే వేశ్య వచ్చి మనపండితులని పరాభవించిందట. రామలింగకవి ఆమెను కపటంతో జయించాడట. దానినొకసారి నాదగ్గరకు రప్పిస్తారా? దాని పాండిత్య మెంతో చూస్తాను" అంది.

"ఆమె - వేశ్యకాదు. క్షత్రియకన్యక. రామలింగకవిని పెళ్ళాడి మనవూరిలో ఉంది. ఆమె తండ్రి మాకందరికీ చక్రవర్తి అయిన పాదుషావద్ద ప్రధానమంత్రి. అందుచేత మనమామెను రప్పించుకోకూడదు. చూడాలనుకుంటే నువ్వే ఆమె ఇంటికి వెళ్ళు" అంటూ ఆ వృత్తాంతం చెప్పాడు.

"ఈకథ - నేను వింటున్నదే. అది నిజమైన వేశ్యకూడా కాదు. పల్లెది. చదువుకున్నదని దానిని వలచి రామలింగకవే ఈ వ్యూహం పన్నాడు" అంటూంటే...

రాయలు కలగ జేసుకుని "నీబుద్ధి బలం బాగానే చూబెడుతున్నావు కాని... ఢిల్లీలో ఆమె తల్లి తండ్రులే ఆమెను తమపుత్రికని అంగీకరించారు. నాకు పత్రికలు రాశారు. అధికప్రసంగం మానుకొని చూడాలనుకుంటే వెళ్ళి చూడు. లేకపోతే ఊరుకో" అన్నాడు.



# వసుంధరుడి కథ

మందారవల్లి విద్యావిశేషాల గురించి అందరూ గొప్పగా చెప్పుకుంటుంటే ఈర్ష్యచెందిన కళానిలయ ఒకనాడు తన పదేళ్ళ వయసు కలిగిన కళావతిని వెంటబెట్టుకుని ఆమె వద్దకు వెళ్ళింది. ఆమెరాక వినిన మందారవల్లి ఆమె కెదురొచ్చి కౌగలించుకుని..కళావతిని కూడా ఉచితాసనం మీద కూర్చోబెట్టి ఎంతో గౌరవించింది. ఇద్దరూ ఒకరినొకరు ప్రశంసించుకున్నారు. అప్పుడు కళానిలయ – "ఈ బాల కళావతి కావ్యనాటకాది గ్రంథాలు చదివింది. తన పాటివారు లేరని గర్వపడుతూంది. పరీక్షించు – " అంది మందారవల్లి – "వసుంధరా! ఏం చేస్తున్నావు! ఒకసారిటురా" అని పిలిచింది. పన్నెండేళ్ళ వయసువాడు, అందమైన కుర్రాడు వచ్చాడు. అతని నా బాలికను పరీక్షించ వలసిందిగా చెప్పింది.

కాళిదాసు కల్పనలోనే తప్పులు పట్టిన వసుంధరుడి ముందు కళావతి నిలవలేక పోయేసరి కామె తల్లి కల్పించుకుంది ఆమె ఎవరని వసుంధరుడడగ్గా "మొన్నపాఠం చెప్పుకుంటున్నప్పుడు..." అంటూ గుర్తుచేసింది మందారవల్లి. ఓహో! నాచరిత్ర పురాణంగా చెప్పుకుంటున్నారన్న మాట!" అని గర్వంగా చూసి –"ఏ సందర్భంలో నాప్రసక్తి వచ్చిందో?" అని అడిగింది కళానిలయ.

"మా అమ్మ అసతీత్వము (దుర్మార్గురాలైన భార్య)నకు ఉదాహరణగా నీ గురించి చెప్పింది" అన్నాడు వసుంధరుడు.

"మీ తల్లికంటె నేను చెడినదాన్నా? కొన్నాళ్ళు వేశ్యలా తిరిగి ...చివరి కిల్లాలయింది" అని కళానిలయ అంటే – "నువ్వు పతివ్రతవైతే భర్త నెందుకు చంపాలనుకుంటావ్?" అన్నాడు వసుంధరుడు.

చివరికది కళానిలయ పాలిట పరాభవంగా పరిణమించింది. ఆ అవమానానికి ప్రతీకారం ఎలా చేయాలో అని ఆలోచించసాగింది. రాయలవారితోచెప్పినా ప్రయోజన ముందదు అనుకుంటూ తనబాల సఖురాలు పల్లవికను రప్పించి తన అవమాన బాధనంతటినీ చెప్పుకుంది.

"దేవీ! నువ్వొంటిగా అక్కడి కెందుకెళ్ళావు? ఆమె నవమానించ బోతే దైవం నీకు అవమానం కలగజేశాడు. సరేలే ఎలాగో ఆ కుర్రాడిని కడతేర్చితే దాని గర్వం అణుగుతుంది. నిన్ను చేసిన పరాభవానికి వాడూ పలమనుభవిస్తాడు" అంది పల్లవిక.

"ఆ భారం అంతా నీదే" అంది కళానిలయ. పల్లవిక అలాటి క్రూరకృత్యాల్లో చాలానేర్పరే. ఆనాటి నుంచే వసుంధరుడిని చంపడానికి అవకాశం కోసం ఎదురుచూడసాగింది. కాని వసుంధరు డెప్పుడూ తల్లిని విడచి ఉండడు. విహారానికైనా ఉద్యానవనం దాటిరాడు. ఆ బాలుణ్ణి చూడ్డానికే పల్లవికకి వీలుపడలేదు.

దీర్ఘకోపి అయిన కళానిలయ ఆవేళ పల్లవికతో – "నీ కాపని చెప్పి రెండేళ్ళవుతూంది. సాధించలేకపోయావ్" అని ఎత్తిపొడిచేసరికి – పల్లవిక – "అలా అనకండి ఆ పిల్లవాడు బయటికి రానేరాడు. సరే. నేనొక మార్గం ఆలోచించాను. దక్షిణ దేశమంతా తిరిగిన మంత్ర శాస్త్రవేత్త సోమశేఖరుడనే బ్రాహ్మణుడు మనవూరు వచ్చాడు. అతను మంత్రప్రయోగంతో ఆ బాలకుణ్ణి చంపగలడు. నే నాయనకి చెప్పి తీసుకొస్తాను. రహస్యంగా మాట్లాడు" అంది.

పల్లవిక సోమశేఖరుడి దగ్గరకెళ్ళి – తగిన సమయం చూసి – రాజపత్ని రమ్మనమని చెప్పిందంది. అతను రాగానే కళానిలయ పాదాభివందనం చేసి..సత్కారాలు కావించి ఏకాంతంలో – "నన్ను పరాభవించిన శత్రువుకి ప్రాయశ్చిత్తం చేయాలి. మీరు కోరిన డబ్బిస్తాను. మీ ఉపకారం జన్మలో మరిచిపోను" అని ప్రార్థించింది.

"అమ్మా! దీనికి నన్నింతగా అడగాలా? నీశత్రువు నాకూశత్రువు కాదా? వాడినేంచేయాలో చెప్పు. నన్నాంతరంగికుడిగా భావించు" అన్నాడతను.

"చెయ్యవలసింది – శత్రువధే. శాక్తేయుల కందెంత పని? నేను మీకు పదివేల దీనారాలు కానుకగా ఇస్తున్నాను. అలాగ శత్రువుని అంతం చేయగలిగే సామర్థ్యం మీకుందా?" అడిగిందామె.

అందుకతను - "అమ్మా! నీతో నిజం చెబుతున్నాను. శాక్తేయులకి డాంబికం ఎక్కువ. చెప్పేదంతా చెయ్యలేరు. దక్షిణదేశం తిరిగ..ఎనిమిదేళ్ళు శ్రమించి యక్షిణిని ప్రత్యక్షం చేసుకున్నాను. ఆ దేవత - మనుషులని దూరంగా పారెయ్య గలదే తప్ప చంపలేదు. మీ దగ్గర సత్యం దాచను" అన్నాడు.

"పోనీ...మహారణ్యంలో పడవేయించు. దేముడే వాడిని చంపుతాడు" అని అతను కోరినట్లు - తొమ్మిది దినాలు జపాలు, హోమం, బ్రాహ్మణ సంతర్పణలకు కావలసినవన్నీ ఇచ్చి - "చాలా రహస్యంగా జరగాలి సుమీ" అని హెచ్చరించింది. "ఔను. ప్రత్యర్థులకి తెలిస్తే ప్రతిక్రియ చేస్తారు. అమ్మా! రహస్యం కనుక నీ శత్రువు పేరిప్పుడు చెప్పక్కర్లేదు..దీక్షముగిసిన..పదోరోజు..నాశిష్యుడు మీవద్ద కొస్తాడు. మీ శత్రువు పేరురాసి ఆ చీటిని వాడికివ్వండి" అన్నాడతను. ఆమె అంగీకరించి అతనికి కావలసిన ద్రవ్యమిచ్చింది. అతను మరునాటినుంచే దీక్ష ప్రారంభించాడు.

పదోరోజున సోమశేఖరుడు ఛండుడనే తనశిష్యుణ్ని కళానిలయ అంతఃపురానికి పంపాడు. ఆ ఉత్తరం చూసుకుని ఆమె అతనికి తన శత్రువైన 'మందారవల్లి కొడుకు వసుంధరుడు' అనే పేరు రాసిన చీటీ ఇచ్చింది. అతనది పట్టుకువస్తూంటే - సింహద్వారం దగ్గర వేశ్యలు మనోహరమైన పాటలు పాడుతూ నాట్యాలు చేస్తున్నారు. ఛండుడు ఆ వినోదాలు చూస్తూ కూర్చున్నాడు. మైమరపులో - చేతిలోని చీటి జారిపడిందని గమనించలేదు.

కొంచెంసేపయ్యాక తెలివి తెచ్చుకుని ఆ చీటికోసం వెదికాడు. పరిచారికలు పోగుపెట్టిన చోట వెదకగా చీటి దొరికింది. అతను బతుకుజీవుడా అని త్వరగా పోయి దాన్ని గురువు కందించాడు. దానిలో 'కళానిలయ కూతురు కళావతి' అని ఉంది. దాని ప్రకారమే సోమశేఖరుడు యక్షిణిని - ఆమెను దూరప్రాంతంలో అడవిలో పారేయ్యమని ప్రార్థించి - హోమం ముగించాడు. అతని కార్యం సిద్ధించినట్లు చిహ్నాలు కనిపించాయి.

మరునా డతను అంతఃపురానికి వెళ్ళాడు. అప్పటికే కళావతి కోసం ఎందరో ఎంతగానో వెదికి వచ్చికనిపించలేదని కళానిలయకి చెప్పారు. అంతలో అక్షతలు పట్టుకుని సోమశేఖరుడు వచ్చాడు. అతన్ని లోపలికి తీసుకుపోయి- "నువ్వు మరచిపోయి మారాజపుత్రికను మంత్రించావా, ఏం?" అని అడిగిన పల్లవికతో.." "అదెవరో నాకు తెలియదు మీరు రాసిన చిన్నదాని పేరు జపించాను" అన్నాడతను.

"అదేమిటి? మేము వ్రాసిపంపినది చిన్నవానిపేరు" ఆశ్చర్యంగా చూసిందామె. "మీరే చూడండి." అంటూ చీటి అందించాడతను. దానిలో 'కళానిలయ కూతురు కళావతి' అని ఉంది. అదిచూసి ఆమె మూర్ఛపోయింది. "కొంపములిగింది. రాజపుత్రికనే అడవులపాలు చేశావా! మేము పంపిన కాగితం ఇది కాదే! ఇది నీ దగ్గరకి కెలా వచ్చింది? మొన్నను రాజపుత్రికకు వొంట్లో నలతగా ఉంటే, విభూతి పెట్టడానికీ పేరు రాసి చీటి పంపాం. అది మళ్ళీ మాదాసి తీసుకువచ్చిందే. ఆశ్యర్యంగా ఉంది. మీరు తెలిసి ఏకపటం చేయలేదుకద?" అని ఆమె నిందించేసరికి, అతను గజగజ వణుకుతూ "నేనేమీ ఎరుగను. మా శిష్యుడు తీసుకొచ్చిన చీటి ఇదే. దీనిలోని పేరే నేను జపించాను" అని మొరపెట్టుకున్నాడు.

అప్పుడా శిష్యుణ్ణి రప్పించి నిలదీసేసరికి - అతను జరిగింది చెప్పాడు.

"పిల్లని మళ్ళీ వెనక్కి రప్పించు" అందామె, అంతకంటె చేయవలసిందేమీ తోచక.

"అమ్మా! ఇది దైవికంగా జరిగింది. ఆరుమాసాలవరకూ నేను మళ్ళీ ఆజపం చేయకూడదు. చేసినా యక్షిణి ప్రత్యక్ష్యం కాదు. అదీకాక మా దేవతకి దూరంగా పారేసే శక్తే తప్ప దూరంనుంచి తీసుకు వచ్చేశక్తిలేదు. ఆరుమాసాలయితే కాని ఆ బాల ఎక్కడపడిందో తెలుసుకోడం కూడా సాధ్యపడదు. భటులని పంపి వెదికించవలసిందే" అన్నాడతను.

పల్లవిక తల్లడిల్లిపోతూ వెళ్ళి ఆ వృత్తాంతమంతా కళానిలయకు చెప్పింది. ఆమె గుండె బాదుకుంటూ దేవుణ్ణి ఆ మాంత్రికుణ్ని తిడుతూ పెద్దగా ఏడవసాగింది. పల్లవిక – రహస్యం బయట పడకుండా – “యక్షిణి రాజపుత్రిక నెత్తుకు పోయిం”దని రాయల వారికి తెలిపింది. రాయల అంతఃపురానికి వచ్చి కళానిలయ నూరడించి కూతుర్ని వెదకడానికి భటులని పంపాడు.

ఆరుమాసాలు గడిచాక కళానిలయ సోమశేఖరుణ్ని రహస్యంగా అంతఃపురానికి రప్పించి – కూతురి జాడ అడగకుండా – “ఈసారి శత్రువుని తప్పకుండా అంతర్ధానం చెయ్యాలి” అంటూ మందారవల్లి కొడుకు వసుంధరుడు – అని తానేచీటీమీద రాసి అతనికిచ్చి కానుకలతో అతణ్ని పంపింది.

విద్యున్మాల అనే యక్షిణి వసుంధరుడి నెత్తుకుపోయి ఒకకొండ శిఖరం మీదుంచి పోయింది. అతను అలవాటు ప్రకారం తెల్లవారు జామున లేచి పుస్తకం కోసం తడుముకోగా ఏమీ కనపడలేదు. అమ్మా అని పిలిస్తే బదులు రాలేదు. తెల్లవారగా చుట్టూ చెట్లూ లతలూ కనిపించాయి. కలేమో అనుకున్నాడు. కాని రాతి మీద శరీరానికి నొప్పి కలగడంతో... కొంతసేపటి వరకూ ఆశ్చర్యంనుంచీ అయోమయం నుంచీ తేరుకోలేక పోయాడు. చివరికి – ఏది జరిగినా మంచిదే అనుకున్నాడు. సూర్యోదయం కాగానే దగ్గరలో ఉన్న ఒక మఱ్ఱి చెట్టుఎక్కి నాలుగు వేపులా చూశాడు. ఎటుచూసినా అరణ్యమే తప్ప మరేమీ కనిపించలేదు. చెట్టుదిగి..జలపక్షులు ఎగరడం చూసి అటు వెళ్ళాడు. అక్కడమెట్లు కట్టబడిన ఒక తామరకొలను కనిపించింది. చెట్ల పళ్ళుతిని ఆ కొలనులోని నీరు తాగి .మెట్లమీద కూర్చుని ఆలోచించసాగాడు. అప్పుడు



# పరివ్రాజకుడి కథ

కొలను అవతలి వొడ్డున ఒక సన్యాసి స్నానంచేస్తూ కనిపించాడు. వసుంధరుడు - 'ఇది తపోవనం కాబోలు' 'అనుకుంటూ చాలా ఆనందించి ఆ రుషి దగ్గరకు వెళ్ళాడు. "మునీంద్రా! శరణు శరణు" అంటూ అతని పాదాలకు నమస్కరించాడు. అతను తనతో రమ్మని సైగ చేశాడు. ఆ మునిపర్ణశాలలోకి వెళ్తూ వసుంధరుణ్ని చెట్టుకింద కూర్చోమని..తాను విధులన్నీ పూర్తిచేసుకుని వచ్చాడు. "నువ్వెవరివి? ఈ అరణ్యానికెలా వచ్చావు?" అంటూ అడిగిన ఆయతితో - "కృష్ణదేవరాయలవారి ఆస్థాన కవి తెనాలి రామలింగని పుత్రుడిని, వసుంధరుడిని ఎప్పటిలాగే నిన్నరాత్రి శాస్త్రాలు చదివి పడుకున్నాను. తెల్లారే సరి కిక్కడున్నాను. నేనిక్కడి కెలా వచ్చానో - సర్వజ్ఞులయిన మీరే చెప్పాలి. మీరు చూపుతున్న ఆదరానికి చాలా కృతజ్ఞుణ్ని," అన్నాడు వసుంధరుడు.

"బాలుడవైనా బహుచక్కగా మాట్లాడుతున్నావు. నీ పాండిత్యానికి చాలా సంతోషించాను. నువ్విక్కడి కెలా వచ్చావో యోగదృష్టితో చూసి తరువాత చెబుతాను. విచారించకు. నా దగ్గర కొన్ని రోజులుండు. మంచి మంత్రాలు చెబుతాను" అంటూ మాటమార్చాడు. తన గురించి కూడా ఏమీ చెప్పలేదు. అతని మాటలు జాగ్రత్తగా విన్న వసుంధరుడు అతని కేమీ పాండిత్యం లేదని గ్రహించినా - నాలుగురోజులు చూశాడు.

ఆవేళ - "నే నడిగిన ప్రశ్నకు జవాబు చెప్పారు కారేం? మీ తపస్సుకి లోటువస్తుందనా? నన్ను పైవాడిగా తలచక - మీ పూర్వాశ్రమం, వృత్తాంతం చెప్పండి" అని వసుంధరుడు చమత్కారంగా అడుగ్గా అతను తన కథ చెప్పసాగాడు.



# తుందిలుని కథ

"వత్సా నా చరిత్ర రహస్యం. కాని నీ మీద ఇష్టంకొద్దీ చెబుతున్నాను విను. తామ్రపర్ణి నదీతీరంలో దేవనిలయమనే అగ్రహారంలో నివసించే - విష్ణుగుప్తుడనే బ్రాహ్మణుని ఏడవ కొడుకుని నేను. నాపేరు తుందిలుడు మా అన్నలందరూ వేదశాస్త్రాలు చదువుకుని రాజసభలకు వెళ్ళి చాలాధనం సంపాదించుకుని - చక్కని కన్యలని పెళ్ళాడి గృహస్థ ధర్మాలు నెరవేర్చుతున్నారు. నేనుమాత్రం ఆకతాయినై పెద్దలమాట వినక..బడికెళ్ళక అచ్చోసివదిలిన ఆబోతులా తిరుగుతూ..శ్రాద్ధభోజనాలు కడుపునిండా మెక్కుతూ బలిసి ..తుందిలుడనే పేరుకి తగినట్లు గర్వంగా ప్రవర్తించేవాడిని.

నా చదువు లేనిదానికీ, గర్వానికీ చింతిస్తూ నా తల్లితండ్రులు బెంగపడి కొంతకాలానికి చనిపోయారు. తరవాత నా అన్నలు నామీద విసుగుచెంది నన్ను గాలికి వదిలేశారు. నాలాటి కట్టుబాటులేని వాడికి పిల్ల నెవరిస్తారు? ఆదరించి అన్నంపెట్టేవాళ్ళు లేక - ఆ అగ్రహారంవదిలి కొంతకాలం దేశాటనం చేశాను. నేను చూడని పట్నాలు కాని, నడవని అరణ్యాలు కాని, మునగని తీర్థాలుకాని, లేనేలేవు. భూమంతా తిరిగాను. ఏ విశేషమూ కనపడలేదు. కాని...

# శతానందయోగి కథ

ఒకనాడు ఉత్తరకురుదేశాల్లో తిరుగుతూంటే - ఒక అరణ్యంలో ఇప్పుడు నాలా పర్ణశాల కట్టుకునివసిస్తున్న సన్యాసి వద్దకు దైవికంగా వెళ్ళాను. ఆ యతికి ఎనభయ్యేళ్ళుండవచ్చు. రుద్రాక్ష మాలతిప్పుతూ..ఆటలాడుకుంటున్న లేడిపిల్లలను చూస్తూన్నాడు

నేనతని పాదాలకు నమస్కరించాను. అతనడిగితే నా వృత్తాంతంచెప్పాను. "అజన్మాంతమూ మీకు శిష్యుడినై మీపాదాల

దగ్గరుండిపోతాను" అని ప్రార్థించాను ఆయన అనుగ్రహించారు. నేను వారికి సేవలు చేసుకోసాగాను

ఒకరాత్రి ఎందుకో లేచి చూడగా పర్ణశాలలో గాజుదీపాల కాంతి కనపడింది! వీణానాదం వినిపించింది! నేను లోపలికి తొంగిచూడగా. లోపల ఇంద్రభవనంలా ఉంది! ఒక చక్కని చిన్నది వీణవాయిస్తూంది మా గురువుగారు నవయువకులై ఆమె తొడమీద తలపెట్టుకుని ఆ గానం వింటున్నారు! అలాటి స్త్రీని పొందిన వాడిదే పుట్టుక అనుకున్నాను.

మర్నాడు ఉదయం చూస్తే ఆపర్ణశాల మామూలుగానే ఉంది. ప్రతిరాత్రీ నేనుచూస్తూనే ఉన్నాను. ఎనిమిదోనాడు మళ్ళీ ఆ వింత కనిపించింది. మాఅయ్యగారు వారానికొకసారి ఆ దివ్యాంగనతో క్రీడిస్తున్నారని అర్థమైంది. ఆమె సౌందర్యాన్ని తదేకంగా చూస్తూ మోహంలో స్పృహతప్పిపోయాను.

అలాగ ఆరువారాలు చూశాక నాలో మదనోన్మాదం జనించి...ఆకలి నిద్రలకు దూరమై తిరగడం గమనించి - స్వామి నా స్థితి గురించి అడిగారు. నేను నిజం చెప్పి - "స్వామీ! మీరు నిస్సంగులు కదా! వారానికోసారి ఆ నారీమణితో భోగిస్తున్నారేం? ఆమె ఎవరు? ఆమెను చూశాక నా మనసువశం తప్పింది. మీ వంటి వారికే అలాటికోరికుంటే - నాలాటివాడికుండదా?" అనేశాను.

ఆ జడదారినవ్వుతూ - "అందుకా నువ్వలా ఉన్నావ్! ఆమె ఒక యక్షిణీ కాంత. నలభైయేళ్ళు యక్షిణీ శైలంమీద తపస్సు చేసి ఆమెను వశపరుచుకున్నాను. ఆ ప్రభావం వల్లనే ఎప్పటికప్పుడు శృంగార విలాసాలు పుడుతూ ఉంటాయి ఆమె నడిగితే ఏదైనా పొందవచ్చు. వృద్ధుడికైనా యౌవనం వస్తుం దామెముందు. ఇహలోకంలో ఇలా సుఖపడుతూ - పరలోకం కోసం తపస్సు చేస్తున్నాను" అన్నాడు.

అప్పుడు నేను చేతుల జోడించి - "నాదొక విన్నపం పుట్టింది మొదలు కష్టాలే తప్ప ఒక్కసారికూడా స్త్రీ సుఖం రుచిచూడలేరు సగం

జీవితమైపోయింది. ఎక్కడో కొంచెం అదృష్టముండి మీ దర్శనం లభించింది. మీరు నాకా యక్షిణివశమయ్యే మంత్రం ఉపదేశించండి. ఆ కొండ కెళ్ళి ఆరాధించుకుంటాను. ఆమె ప్రసన్నురాలయితే సరే! లేకపోతే చనిపోతాను. మీరు మంత్రం ఉపదేశించకపోతే ఇప్పుడే మీపాదల దాగ్గర బతుకు చాలించేస్తాను" అన్నాను.

ఆయన నన్ను లేవనెత్తి "ఆ ఉపాసన సామాన్యం కాదు. విద్యున్మాల, చంద్రలేఖ, సులోచన...అని యక్షిణులు మూడు తెగలు. విద్యున్మాలను పదేళ్ళు...చంద్రలేఖను ఇరవయ్యేళ్ళు .. సులోచనని నలభయేళ్ళు ఉపాసించాలి. ఆ యక్షిణీ శైలానికి పోవడమే చాలా కష్టం. యక్షిణీదేవతలు క్రూరమృగాల రూపాల్లో వచ్చి ఆ శిఖరా న్నెక్కనివ్వరు. నలభైయేళ్ళు కందమూలాలు తింటూ అక్కడ ఉపాసనేం చెయ్యగలవు? ఇక్కడే సుఖంగా ఉండు" అన్నాడు.

కాని - నేను నా మాట వదలలేదు. అప్పుడాయన - క్రూరమృగాలు బాధించకుండా ఉండడాని కొక ఓషధి నిచ్చి దగ్గ రుంచుకోమని - "ఆపర్వతం మీద చెరువొకటి ఉంటుంది. దానికి దగ్గరలో ఆలయం. స్ఫటిక స్థంభంమీద ఉపాసనా క్రమముంటుంది-"అని నాకు శెలవిచ్చాడు. నేనిక్కడికి వచ్చి పదిరోజులు తక్కువగా ముప్ఫయేళ్ళవు తూంది. ఇంకో పదేళ్ళు ఉపాసించాలి" అన్నాడు.

క్షుద్ర సుఖంకోసం జీవిత కాలాన్నంతటినీ వృధాశ్రమ కప్పగిస్తున్న వారెంత మూర్ఖులో అనుకుంటూ - "ఆ యక్షిణీ దేవాలయం నాకు చూపారు కారేం" అని అడిగాడు వసుంధరుడు. "నేను రోజూ జపం చేసుకునే దక్కడే. మధ్యాహ్నం పర్ణశాలకొచ్చి భోజనం చేస్తాను. రేపు నాతో వద్దువుగానిలే" అని - మర్నాడతన్ని తన వెంట తీసుకువెళ్ళాడు తుందిలుడు. అతను జపం చేసుకుంటున్నంత సేపూ వసుంధరు డక్కడి విశేషాలు చూస్తూ - స్థంభంమీది లిపి చదువుకుని - యక్షిణి ఉపాసనాక్రమం అంతా అర్థం చేసుకున్నాడు.



# యక్షిణీదేవి కథ

సులోచనా యక్షిణిని వశం చేసుకుందుకు ముప్ఫయేళ్ళ మంత్రానుష్ఠానం తరవాత పద్నాలుగేళ్ళ బ్రాహ్మణ కుమారుణ్ణి బలివ్వాలి – అని చదివిన వసుందరుడికి – 'ఈ సన్యాసి నన్ను బలివ్వాలని కాబోలు అక్కడ గుర్తుపెట్టాడు' అనుకుని – అతన్ని జాగ్రత్తగా గమనించసాగాడు.

పదోరోజు స్నానం చేసి గుడికి వెళ్ళాక – "వసుంధరా! నీమీద మాకు వాత్సల్యం కలిగింది ఇవాళ నీకొక మంచిమంత్రం ఉపదేశిస్తాం. దానితో – పక్షిలా ఎగిరి మీదేశం పోవచ్చు" అన్నాడు తుందిలుడు. "ఆ మంత్రం మీకు సిద్ధించిందా? ఐతే ఓసారి ఎగిరిచూపించండి –" అడిగాడు వసుంధరుడు. "ఒకమంత్రం అనుష్ఠానం చేస్తున్నప్పుడు మరొకటి అనుష్ఠేయం కాదు."

"ఐతే – ఉపదేశం మాత్రం ఎలాచేస్తారు?" ఎదురు ప్రశ్న వేశాడు.

"కుశంకలు మాను. నువ్వేమీ గురుదక్షిణ ఇవ్వక్కర్లేదు. నా పాదాలమీద నీ తల ఉంచి – నేను చెప్పే మంత్రం చదువు చాలు" "నేలమీద పడుకోడం అలవాటు లేక కీళ్ళన్ని పట్టేశాయి. అందుచేత మీరు చెప్పినట్లు మొక్కలేను. నిలబడి ఉంటాను, మంత్రోపదేశం చెయ్యండి" అని వసుంధరుడనే సరికి – అతను కోపంగా – "నీ స్వభావం పోలేదు. యతికి బదులు చెబుతావు! మేం పడే శ్రమ చూడడంలేదూ?" అన్నాడు. "మీకు కోపం వస్తూంది. మీరు చెప్పినట్లే చేస్తాను. కాని...ఎలాగో ముందు మీరు చేసి చూపించండి" అన్నాడు వసుంధరునికి అతని ఉద్దేశం స్పష్టంగా తెలిసిపోయి.

అతను తనపాదాలకి దగ్గరగా బోర్లాపడుకోగానే అతని జుత్తు పట్టుకుని ఎత్తి – స్థంబంచాటు నుంచిన కత్తితీసి – "నీ దుర్బుద్ధి గ్రహించలేదనుకున్నావా? ఇష్టదేవతని తలుచుకో నీ ప్రాణం ఈ కత్తి తీస్తుంది" అన్నాడు.

అప్పుడా సన్యాసి కదలలేక – "హా! వసుంధరా! నన్నురక్షించు. చంపకు. నీ దాసుడినై ఉంటాను" అని మొరపెట్టుకున్నాడు. వసుంధరుడికి జాలి కలిగి – "నీచుడా! నన్ను చంపడానికి కపటంపన్నావా, లేదా? నిజం చెప్పు" అన్నాడు – అతని జుత్తు చేతిలో ఉంచుకునే.

సన్యాసి గిలగిల కొట్టుకుంటూ ....."నిజమే. నా బుద్ధి గడ్డి తింది. విడచిపెట్టు" అని ప్రార్థించాడు. అంతలో – "క్షత్రియ పుత్రా! వీడిని వదలకు. నాకు బలియ్యి. నేను నీకు వశమౌతా"నని అశరీరవాణి వినపడింది

అప్పుడు వసుంధరుడు – "అమ్మా! నేను వీనింట పదిరోజులు తిన్నాను. అందువల్ల వీడిని చంపడానికి చేతులు రావడం లేదు –" అన్నాడు.

"నీ దయకు మెచ్చాను. అవసరమైనప్పుడు తలుచుకో" అందా వాణి.

అతను – "దయలేని నీకీ జటలూ మహర్షి వేషం ఎందుకు?" అంటూ సన్యాసి జటలు నరికి వదిలేశాడు. ఆ కుర్రవాడి దయాగుణానికి సన్యాసి ఆశ్చర్యపడి మాటడకుండా ఇంటికి పోయాడు.

రాత్రివరకూ వసుంధరుడక్కడే ఉండి నిద్రపోక ఏదో ఆలోచిస్తూంటే..మనోహరమైన గానం వినపడింది. అతను లోపలికి పోయి విగ్రహం చాటున దాక్కున్నాడు. చక్కని వస్త్రాలు ధరించి..మణులూ రత్నాలూ పొదిగిన అలంకారాలు పెట్టుకుని –అందమైన యక్షకన్య లక్కడికి వచ్చి పాటలతోనూ వాద్యాలతోనూ ఆదేవి నారాధించారు.

**చంద్రలేఖ :** సఖులారా! మనం వస్తూంటే మంటపంలో పడుకునిఉన్నాడే.. ఎంత సుందరుడో!

**విద్యున్మాల :** వాడు – మందారవల్లి కొడుకు, వసుంధరుడు నేనే వాడినిక్కడికి తెచ్చి పడెయ్యవలసొచ్చింది. సోమశేఖరుడనే మాంత్రికుడి ఆజ్ఞానుసారం అలా చేయవలసి వచ్చింది. వీడి విద్య చూసి ఓర్వలేక రాజపత్ని అలా చేయించిందట. రూపమే కాదు, విద్య...దయాగుణం

మొదలైన వెన్నో ఉన్నాయి. ఈ సన్యాసిని చంపకుండా దయతలిచాడు. లేకపోతే మేము మా దేవితోపాటు పరిచారికలమయి ఉండవలసివచ్చేది. ఉత్తమ బ్రాహ్మణహృదయం...సిరి రా మోకా లొడ్డింది. వీడి సుగుణాలు చూసేకాబోలు మా దేవి రాజపుత్రికని అడవిపాలు చేసి వీడి నిక్కడికి తెచ్చింది.

సులోచన : ఐతే - వీడికి సామ్రాజ్య సౌఖ్యం కలిగేటట్లు మనం దీవించాలి.

చంద్రలేఖ : ఈ పుణ్యాత్ముడు పట్టభద్రుండగు గాక!

విద్యున్మాల : పట్టాభిషిక్తు దయ్యాక కూడా సుకృతి వర్ధిల్లుగాక.

అప్పుడతనికి అటూ ఇటూ పూలమొక్కలు, పళ్ళచెట్లూ ఉండి అందమైన మెట్లతోవ కనిపించింది. యక్షిణీ ప్రభావంగా గ్రహించి అత నాకొండదిగాడు. అక్కడ - మూడువేపుల సముద్రం, ఒకవేపు తామ్రపర్ణినది ఉన్నాయి. ఎలా దాటాలా అనుకుంటూంటే నావికులొక ఓడను తీసుకుని వచ్చి అతనినెక్కించుకుని అవతలిరేవులో దింపారు. అక్కడినుంచి పల్లెమీదుగా అతను ప్రయాణంచేశాడు.

గోపాలా! మనప్రయాణానికి కూడా వేళయింది. పదపద వొచ్చే మజిలీలో కళావతి కథ చెబుతాను" అని లేచాడు మణిసిద్ధుడు.



# కాశీ మజిలీ కథలు

## 42. వ మజిలీ

### కళావతి కథ

కళానిలయ కూతురు కళావతి - యక్షిణీ ప్రభావంతో అడవిలో పడవెయ్యబడింది కదా! పొద్దున్న లేచి - అంతఃపురమేమైంది? నా వీణేది? నేనిక్కడి కెలావచ్చాను? కలకాదుకద? ఇప్పు డేంచేయాలి? - అని విచారిస్తూ ఒక చెట్టుకింద కూర్చుంది

మిట్ట మధ్యాహ్నమయ్యేసరికి సదాచారి అనే బ్రాహ్మణుడా దారినబోతూ - ఎండకి తాళలేక విశ్రమిద్దామని - ముష్టిమూటలు చెట్టునీడన దింపుకోబోతూ ఆమెను చూసి - చెట్టుమీది బ్రహ్మరాక్షసే ఈ మనోహర రూపంలో వచ్చింది కాబోలు నిజంగా మనిషైతే ఒంటరిగా ఇక్కడెందుకుంటుంది? పారిపోదామంటే-వెంట తరిమి చంపుతుంది. ఉదయం మంచి శకునమయిందనుకున్నాను కాని నేటితో నా ఆయువు మూడినట్లుంది..అదుగో లేస్తూంది. అనుకుంటూ ప్రాణాలు పోయిన వాడిలా కదలకుండా ఉండిపోయాడు.

"వృద్ధుడా! ఎందుకలా భయపడతావ్! నే నేమయినా పెద్దపులినా?" అంటూ అతని వేపుకు కళావతి రెండడుగులు వేసేసరికి - "తల్లీ! నీకు నమస్కారం. నాకు బోలెడంత మంది పిల్లలున్నారు. నాజోలికి రాకు" అంటూ పరుగెత్తాడు. కళావతి అతని పిరికితనానికి నవ్వుకుని అటువేపే నడవసాగింది ఆమె తనను వెంటతరుముతుందన్న భయంతో..కాళ్ళు తడబడగా అతను నిట్టనిలువుగా చతికిలబడి పోయాడు. ఆమె అతని లేవనెత్త బోయింది.

"బాబోయి, నన్ను బ్రహ్మరాక్షసి చంపేస్తూంది. రక్షించండి" అంటూ అత నరిచాడు. అప్పు డామె నవ్వుతూ - "నేను బ్రహ్మరాక్షసిని

కాను. కృష్ణదేవరాయల కూతుర్ని, కళావతి నాపేరు. నువ్వుసాయం చేస్తావని నేను నీ దగ్గరకి వస్తూంటే - నువ్వేంటి, అలా పారిపోతావ్? నన్ను మావూరు చేర్చు. నీ దరిద్రం పోగొడతాను" అంది.

"నీ మాట లెలా నమ్ముతాను? బ్రహ్మారాక్షసి ఇలాగే చెబుతుందట. ఇంత మందుండగా నేనే దొరికానా తల్లీ? వదులు.." అని బతిమాలాడు.

"బ్రహ్మారాక్షసి నైతే ఈ పాటికే నిన్ను మింగెయ్యక ఇంతలా బతిమాలుతానా? నేను రాజపుత్రికని మా విజయనగరం చేర్చు. నీకు మంచి పారితోషికమిప్పిస్తాను" అందామె. అతను కొంచెం ధైర్యం తెచ్చుకుని - "నువ్వు రాజపుత్రికవైతే ఒక్కదానవీ ఇక్కడి కెలా వచ్చావు?" అని అడిగాడు. అప్పుడామె తన వృత్తాంతం యావత్తూ చెప్పింది.

దాంతో అతనికి ధైర్యంవచ్చి..."మీ తండ్రి ప్రసిద్ధి నేను విన్నాను. మీ దేశం ఇక్కడికి చాలాదూరం. నెమ్మది మీరు మీ వూరు చేరుస్తాను. ఇప్పుడు మా ఇంటికి పోదాం రా.. ఈ వస్తువులతో నిన్ను చూస్తే ఎవరేనా దొంగ లవుతారు" అన్నాడు. ఆమె ఆనగలతనికి మూట కట్టి ఇచ్చి - అతనివెంట గ్రామానికి వెళ్ళింది.

తాటక హిడింబల కోవకు చెందిన గయ్యాళి సదాచారి భార్య. మగనిచూసి - "దీన్నెందుకువెంట తీసుకొచ్చావ్? దీని సంతోషంలో పడి ముష్టెత్తడం మానేశావు కాబోలు. అందరి పొట్టలూ ఎలా నిండుతాయి? పాడుకాపురం.." అంటూ మండిపడగా - అత నామెకు రహస్యంగా ఆ బాలిక కథచెప్పి - నగలిచ్చి "తండ్రి కప్పగించడానికి రేపే పోతాను. మంచిపారితోషికం వస్తుంది" అన్నాడు.

"అతనీ నగల గురించి అడగడా? అతనిచ్చే కానుక వీటిలో ఐదోవంతు కూడా ఉండదు. చేతిలో ఉన్నది వదులుకుని రాబోయే దానికోసం నమ్ముకోడ మేమిటి! దీన్నే ఏపాడు నూతిలోనో తోసేసి రండి" అందామె. భార్యముందు భయంకొద్దీ అతనలాగే అన్నాడు.

ఆమె కళావతిని కొన్ని రోజులు బాగా చూసుకుంది. "మావూరికి తీసుకపోక ఆలస్యం చేస్తున్నావేం?" అని ఒక రోజు కళావతి సదాచారి నడిగింది. భార్య అతనికేం చెయ్యాలో చెప్పి మన్నాడే పంపింది. అతనా బాలికను భుజంమీ దెక్కించుని అడవిలో నడవసాగాడు. అతనికామెను చంపడం ఎంతమాత్రమూ ఇష్టంలేదు నిద్రపోతూండగా కంఠం పిసికి చంపాలన్నా, నూతిలోకి తొయ్యాలన్నా చేతులు రాలేదు.

కొన్నిరోజులయ్యాక "తాతా. నీకువిజయనగరం దారి తెలియదా? ఎన్నాళ్ళు చూసినా ఈ అడవుల్లోనే తిరుగుతావేం? నన్ను మోసి మోసి నీ భుజాలు కాయలు కాశాయి" అని అడిగింది. "నిజమేతల్లీ నాకు దారి తెలియదు" అని మళ్ళీ నడవసాగాడు. దైవికంగా కుముద్వతి అనే పట్నం చేరారు.

అక్కడొక సత్రంలో విశ్రమించారు. ఆ గోడమీద "ఈ పట్నపు రాజు కూతురు కౌముదితో చదరంగంఆడి గెలిచిన వారికి పదివేల మాడలు బహుమానం ఓడిపోయిన పురుషుడు ఉరి తీయబడతాడు" అనే ప్రకటన వారికి కనపడింది. అది చదివిన సదాచారి – "అమ్మా! నీకు చదరంగంలో నేర్పుందన్నావు. ఆ ప్రకటన చూడు" అన్నాడు. కళావతి – "నే నాడతానని చెప్పిరా" అని అతన్ని పంపింది. ఆమె ఓడిపోతే – తను చంపక్కర్లేకుండా వాళ్ళే ఉరి తీస్తారు. గెలిస్తే పదివేల మాడలు వస్తాయి. ఎలాగేనా తనకి లాభమే – అనుకున్నా డతను.

"అమ్మా! నీకు పురుషవేషం వేసి నా కొడుకువని చెపుతాను. రాజపుత్రికతో గెలిచి తీరతావు. నీ వల్ల నాకూ పేరొస్తుంది. ఈ ఉపకారం చెయ్యి" అని కోరగా కళావతి అంగీకరించింది.

## కళావంతుడి కథ

పురుషవేషంలోని కళావతిని కళావంతుడని పిలుస్తూ మర్నాడు రాజసభకు పోయి – తన కుమారుడు కౌముదితో చదరంగ మాడతాడని సదాచారి చెప్పాడు" డబ్బుకాశపడి మన్మధుడిలాంటి

కుమారుణ్ని చంపుబోకు. కొమ్ములు తిరిగిన వారు కూడా కౌముది చేతిలో చిత్తయ్యారు" అని ఎవరెంత చెప్పినా వినక ఒడంబడిక పత్రం రాసిచ్చాడు.

మూడోరోజు తన అంతఃపురానికి వచ్చిన కళావంతుడికి - కౌముదికూడా - "నీ రూపం చాలా చక్కగా ఉంది. ప్రాణాలు పోగొట్టుకోకు. నాతో చదరంగం ఆడి జయించడం కల్ల" అని చీటి పంపింది.

"కనికరమే నీహృదయంలో ఉంటే అలాటి వ్రతమెందుకు పడతావు? నన్నుచూసి జాలిపడక్కర్లేదు. నేను నిన్ను ఆటలో గెలవగలను -" అని జవాబు పంపాడు.

చదరంగంలో అత నామె నవలీలగా జయించాడు. అంతేగాక వేదశాస్త్రాల్లో ప్రసంగించి కూడా ఆమెనోరు కట్టించాడు. అందరూ అతన్నెంతో ప్రశంసించారు. సదాచారి సంతోషానికి మేరలేదు. అప్పుడు సత్రంలో వారితో ఉన్న హరిశర్మ అనే బ్రాహ్మణుడు - "ఇతను కౌముదిని చదరంగంలో గెలిచినందుకే ఆశ్చర్యపడుతున్నారు! వీనికంటె రెండుమూడేళ్ళు మాత్రమే పెద్దయిన దేవగుప్తుడు కృష్ణదేవరాయలవారి పండితులతో ప్రసంగించాడు. అతని విద్యాపాటవం వింటే మరెంత ఆశ్చర్యపోతారో!" అంటూ ఆ కథ చెప్పాడు.

# దేవగుప్తుడి కథ

"పాండ్యదేశ ప్రభువయిన మలయధ్వజుడు పండిత ప్రియుడు. ఈమధ్య - రాయలవారి ఆస్థానకవులు దిగ్విజయం చేస్తూ అతని రాజధాని మధురాపురానికి విచ్చేశారు. రాజు వారితో ప్రసంగానికి తన ఆస్థాన విద్వాంసుడైన విష్ణుగుప్తుడికి కబురు చేయగా అతను తన కుమారుడు పదహారేళ్ళవాడు దేవగుప్తుణ్ని తన ప్రతినిధిగా పంపాడు. దేవగుప్తుడు చూడ చక్కనివాడు. సభ్యులతని సుందర రూపాన్నిచూసి మురిసిపోయారు.

సభలో అష్టదిగ్గజాల్ని పరిచయం చేయగానే దేవగుప్తుడు వారిని ఎకసెక్కంచేసి. రాజు మందలించబోగా... "రాజా! వీరు మందారవల్లి అనే మహావిద్వాంసురాలితో ప్రసంగించిన వృత్తాంతం గమనించి ఉంటే వీరి గురించి భయపడకపోదురు. అప్పుడే తెలిసిపోయింది. వీరి ప్రజ్ఞఎంతటిదో? .." అన్నాడు. ఆ రహస్యం ఇతనికెలా తెలిసిందో అని దిగ్గజాలు దిగ్భ్రాంతి చెందారు. అతనికి జవాబు చెప్పడానికి రామలింగకవికే నోరుపెగల్లేదు. "పెద్దన్నగారూ! మీరు అరవయ్యేళ్ళకీ మనుచరిత్ర మొక్కటే రచించారు. అంటే ఏడాదికి పదిపద్యాలు చొప్పున మాత్రమే! రాజశేఖర చరిత్రమనే చిన్న గ్రందం రాసిన మల్లన్న కూడా గజమే!"

"రామలింగకవి గారు మందారవల్లిని జయించిన మార్గం మాకు తెలుసు. వారు పూజ్యులు. దేవనాగరలిపితో ఉన్న గ్రంధాలేమైనా తెస్తే నాకా భాష వచ్చు"

"అయ్యో! ఒక స్త్రీముందు ఓడిపోయిన మీరు సిగ్గువిడచి మళ్ళీ దిగ్విజయం చేయడానికి వచ్చారా! ఇంతకంటే అవివేకమేమన్నా ఉంటుందా?" అంటూ దేవగుప్తుడు సింహంలా గర్జించాడు.

అప్పుడు నియమిత కాలం అయిపోయిందని గంటమోగింది రామలింగకవి లేచి – "ఈ బాలుడి ఉపన్యాసానికి చాలా సంతోషించాం వీని ప్రశ్నలకు రేపు సమాధానాలు చెబుతాం" అన్నాడు ఆనాటికి సభముగిసింది

మర్నాడు ఆ దిగ్గజాల జాడలేదు. కాని ఒక పత్రిక రాజుకి చేరింది అందులో – "రాజా! మేము యధార్థమైన కవిపండితులం కాం. విష్ణుగుప్తుడికిలాటికొడుకున్నాడని తెలియదు. అతను మాదాయాది అవడంవల్ల ఇలా బెదిరిద్దా మనుకున్నాం. దేవగుప్తుడితో మేము ప్రసంగించలేము" అని రాయబడి ఉంది. సభ్యులందరూ దేవగుప్తుణ్ణి దండలతో పూజించారు.

రాజు ఆలోచించి – "కృష్ణదేవరాయా! దిగ్దంతులమని బిరుదాలు వహించిన మీ ఆస్థాన కవీశ్వరు లీమధ్య మా నగరానికొచ్చి మా ఆస్థాన కవిపుత్రుడైన దేవగుప్తునితో ప్రసంగించి ఓడి – పారిపోయారు. వారి లేఖ ఇందుతో జతపరచుచున్నాను. దీనిలో నిజానిజాలు తెలియడం లేదు. ఏదేమైనా ఇప్పుడు ఈ బాలపండితుడితో ఏ విద్యలో అయినా గెలిచిన వారికి మూడు గ్రామాలు పారితోషికంగా ఇస్తాను మీరు నిజమైన పండితులను వేగిరం పంపగలరు" అని రాసి పంపాడు

నేనక్కడున్నాను కనుక ఆ విశేషాలు చూశాను అని ముగించాడు హరిశర్మ.

"తరవాత రాయలతవారి పండితులు వొచ్చారా?" అడిగాడు బ్రాహ్మలు.

"తరవాతేం జరిగిందో నాకు తెలియదు" అనేశాడు హరిశర్మ.

ఆ మాటలు విన్న సదాచారి – కౌముదిని గెలిచినట్లే దేవగుప్తుని కూడా కళావంతుడు గెలుస్తాడనీ, తనకి మూడు గ్రామాలు దొరుకుతాయనీ – అతన్ని తీసుకుని మధురాపురం పోయాడు. అక్కడ కళావంతుడు ప్రకటన చూసి...రాజువద్దకు వెళ్ళి తనని పరిచయం చేసుకుని.. కౌముదిని ఓడించిన విషయం చెప్పి . దేవగుప్తుడితో ప్రసంగించదానికి వచ్చానన్నాడు. రాజు విష్ణుగుప్తుని వద్దకు దూతను పంపగా –

"దేవగుప్తుడు గ్రామాంతరం వెళ్ళాడు. పదిరోజుల్లో తీసుకొస్తాను" అని జవాబు పంపి –తానతన్ని వెదకడానికి కుముద్వతీ నగరానికి పోయాడు. అక్కడొక గృహస్థుని – "దేవగుప్తడను బ్రాహ్మణకుమారు డీ పట్నానికి వచ్చాడా?" అంటూ అతని గుర్తులు చెప్పేసరికి – "అతనెప్పుడొచ్చాడో తెలియదుకాని మొన్న రాజ పుత్రికను – చచ్చినదాన్ని.. బతికించాడు" అంటూ ఆ కథ చెప్పాడు



# మదపుటేనుగు కథ

మా రాజుకి లేక లేక కలిగిన ఒక్కర్తే కూతురు పేరు కౌముది. మొన్న ఉదయం పల్లకీ ఎక్కి ఉద్యానవనానికి వెళ్తూంటే - మదమెక్కిన పట్టపు ఏనుగు కట్టుగొలుసులు తెంపుకుని .. పిచ్చెక్కినట్లు మావటిని చంపి...చెట్లు విరిచేస్తూ, జనాలను చిత్రవధ చేయసాగింది. అది -అటురావడం చూసి - రాజకుమార్తె పల్లకీనిమోస్తున్న వారు పట్నం వేపు పరుగెత్త సాగారు. ఏనుగువారి దగ్గరకి రాగానే బోయీలు పల్లకిని క్రిందపడేసి తలోదారినీ పరిగెత్తారు

ఆ ఏనుగు పల్లకీని గాలిలోకెత్తేలోగా రాజకుమార్తె నేలమీదకి దూకి పక్కకి పరుగెత్తింది. పల్లకిని పదివేల ముక్కలు చేసి అది కౌముది వేపు వెళ్తూంటే - "రాజపుత్రిక చచ్చిపోయింది-" అని అరిచేవారే తప్ప అడ్డుపడేవారు లేకపోయారు. అంతలో - ఎక్కడి నుంచి వచ్చాడో - ఒక బ్రాహ్మణ కుమారుడు ఎడమచేత్తో కౌముదిని పట్టుకుని - కుడిచేత్తో ఏనుగు తొండాన్నదిమి పెట్టాడు.

ఎంత చిత్రమో. ఆ మదపుటేనుగు మంత్రించబడ్డట్లే నిలబడిపోయింది. రాజకుమార్తె భయంతో అతన్ని కౌగలించుకుని వొణికి పోతూంటే - "భయపడకు. దీని మీదెక్కి కూర్చో నిన్నుమీ ఇంటికి చేరుస్తాను" అని ధైర్యం చెప్పాడు. కాని ఆమె ఏనుగుపైకి ఎక్కింది కాదు. అతనొక చేత్తో ఏనుగు తొండం పట్టుకుని ఆమెను నడిపించ సాగాడు. అనుచరుడిలా అతని వెనుక వస్తున్న ఆ ఏనుగునీ, అతన్నీ చూసి పురప్రజలు ఆశ్చర్యపోయి - "భగవంతుడే..." అని పొగిడారు.

మదగజం కౌముదిని చంపుతూందన్న వార్త తెలిసి రాజు ఎందరో యోధులతో అతివేగంగా అక్కడికి వచ్చాడు. అతని కొకవేపు కౌముది, రెండోవైపు ఏనుగులతో ఎదురుగా వస్తున్న విప్రకుమారుణ్ణి చూసి అతనివల్లనే కౌముది రక్షించబడిందని విని - అతన్ని దేవుడిలా భావించి అతని పాదాలమీదపడి నమస్కరించి - రాజు ఎన్నోవిధాల పొగిడాడు. కౌముదిని రదంలో ఇంటికి పంపి, ఏనుగుని గొలుసులతో

కట్టించి పంపేశాడు. ఆ బ్రాహ్మణ కుమారుణ్ని పల్లకీ ఎక్కించి ఊరేగించాడు. అతన్ని విహారసౌధంలో ఉంచి, సేవలకెందరో పరిచారకులను నియమించాడు. ఇంతా చేస్తే – ఆ కుర్రాడి వయసూ పదహారేళ్లే! అతని పేరు దేవగుప్తుడని చెప్పినట్లే జ్ఞాపకం. లక్షణాలన్నీ మీరు చెప్పినవే"

...విష్ణుగుప్తుడు చాలా సంతోషించి – మర్నాడు విహార సౌధానికి వెళ్ళి దేవగుప్తుడి గురించి అడిగాడు. అక్కడివారు – "అయ్యా! నిన్నటివరకూ ఇక్కడే ఉన్నారు. నిన్నఎవరో కళావంతుడను విద్వాంసుడు కౌముదిని చదరంగంలో ఓడించాడని తెలిసి – మలయధ్వజుడి ఆస్థాన పండితులతో ప్రసంగించడానికి వెళ్ళేడు –" అని చెప్పగా అతనావూరికి ప్రయాణమయ్యాడు. మధురాపురం వెళ్ళి – "ఇక్కడికి దేవగుప్తుడు వచ్చాడా? సభ బాగా జరిగిందా?" అని తెలిసిన వారి నడిగాడు.

"ఆహా! ఇద్దరూ కుశలవులలా అనిపించారు. సభ్యులెందరో ఆశ్చర్యంతో చూశారు. వారిద్దరూ మూడురోజులు హోరాహోరీగా ప్రసంగించారు. మూడోనాడు దేవగుప్తుడు కళావంతుని గెలిచాడు. కళావంతు డతన్ని బృహస్పతి అని సభలో పొగిడాడు. మన రాజుగా రతనికి మూడుగ్రామములకు దానపట్టా రాసిచ్చారు. కళావంతుడు దేవగుప్తుడి నంటిపెట్టుకునే తిరిగాడు. నిన్ననే ఇద్దరూ మీ అగ్రహారం వెళ్ళారు" అని వారు చెప్పారు. విష్ణుగుప్తుడు పట్టలేని ఆనందంతో వేగంగా తనింటికి వెళ్ళాడు.

గోపాలా! మన ప్రయాణానికి వేళయింది. కౌముది కథ పై మజిలీలో చెప్పుకుందాం" అన్నాడు మణిసిద్ధుడు. గోపాలుడు కావడి నెత్తుకుని గురువు వెంట బయలుదేరాడు.



# కాశీ మజిలీ కథలు

## 43. వ మజిలీ

ఒకనాడు కౌముది అంతఃపురంలో సఖులతో - సంభాషించ సాగింది

కౌముది : ప్రజ్ఞావతీ! కళావంతుడివి ఉత్తరంఇచ్చావు కదా! దాన్ని చూసి అతనేమన్నాడు?

ప్రజ్ఞావతి : మందహాసం చేసి - సంతోషించామని చెప్పమన్నాడు.

కౌముది : అనుకూలుడనే అనిపించిందా?

ప్రజ్ఞావతి · అతన్ని ప్రేమించే ఓడిపోయావా ఆటలో?

కౌముది : అమ్మకచెల్లా! వాని బుద్ధి కౌశలం ఎంతటిదో! - నవ్వుతావేం?

ప్రజ్ఞావతి : తనకన్న చిన్నవాడిని పెళ్ళాడ్డాం లోకవిరుద్ధం ఔతుందని.

కౌముది : అందుకు నవ్వక్కర్లేదు. సీత - రాముడి కంటె ఎన్నేళ్ళు పెద్దదో నీకు తెలుసా?

ప్రజ్ఞావతి : నీ మనోరథాని కడ్డుపడే మరో వదంతి విన్నాను. ఏనుగు బారినుంచి నిన్ను తప్పించిన విప్రకుమారుడితో నీ వివాహం జరిపించాలని మీతండ్రి అనుకుంటున్నట్లు వదంతి పుట్టింది.

కౌముది : చాలు చాలు. భూములో, హారాలో, అగ్రహారాలో ఇస్తారు కాని ఆ మాత్రానికే నన్ను వానికిచ్చి పెళ్ళి చేస్తారా మా తండ్రి? - అది వొట్టిమాట.

ప్రజ్ఞావతి : అతన్నేంచూసి వరించావ్?

కౌముది : అతని విద్యేచాలు వరించడానికి, ఆపైన అతి చక్కని రూపం

ప్రజ్ఞావతి : నేనతన్ని చూడలేదు. కాని చక్కనివాడే అని చెప్పారు. మన జ్ఞానవతి కంతా తెలుసు. అదుగో మాటలోనే వొస్తూంది. జ్ఞానవతీ ఇలా రా...మన రాజపుత్రికను మదపుటేనుగునుంచి రక్షించిన యువకుడి పేరేమిటీ? నువ్వు అతన్ని బాగాచూశావా? అందగాడేనా?

జ్ఞానవతి : అతని పేరు దేవగుప్తుడు. అతన్ని చూడ్డమేకాదు, పరిచయం చేసుకుని మాట్లాడానుకూడా! అతని అందం – మనుషులకే కాదు, దేవ, యక్ష, సిద్ధ, విద్యాధర, కిన్నరులకు కూడా ఉండదని ఘంటాపథంగా చెప్పగలను.

ప్రజ్ఞావతి : అంతగా అక్కర్లేదు కానీ..కళావంతుడు చక్కనివాడా? దేవగుప్తుడు చక్కనివాడా? తేల్చిచెప్పు.

జ్ఞానవతి : కళావంతుడు చూడచక్కని వాడే కాని రవ్వంత ఆడపోలిక. దేవగుప్తుడు మాత్రం ఆకృతిలో పురుష సింహం.

ప్రజ్ఞావతి : మన రాజపుత్రిక కెవరు తగినవారో ఎంచి చెప్పు.

జ్ఞానవతి : దేవగుప్తుడే మన రాకుమారికి తగినజోడు అని నా అభిప్రాయం.

ప్రజ్ఞావతి : కళావంతుని పెళ్ళాడతానంటూంది మనరాజపుత్రిక.

జ్ఞానవతి : మనరాజుగారు మాత్రం దేవగుప్తుడికి ఇచ్చి పెళ్ళిచేస్తామనీ వెంటనే రమ్మని శుభలేఖలు కూడా రాశారనీ బహుశా ఈమెకు తెలియలేదు కాబోలు!

ప్రజ్ఞావతి : అప్పుడే శుభలేఖలు కూడా పంపేశారా! ఆ విషయం వదంతని నేను ఇంతకు మునుపు చెప్పాను.

జ్ఞానవతి : వదంతేమిటి? పెళ్ళి ప్రయత్నాలు కూడా చేస్తూంటే!

కౌముది : ఏమిటీ! మా తండ్రి నాపెళ్ళికి ప్రయత్నాలే చేస్తున్నాడా! దేవగుప్తుని రమ్మనివార్త కూడా పంపాడా! సరే అంతకు ముందే కళావంతు డొచ్చేలా చూడండినేను మా తండ్రిని ఎలాగో ఒకలాగ ఒప్పిస్తాను.

**జ్ఞానవతి** : కళావంతుడితండ్రి సదాచారి - వెనకటి సొమ్మిమ్మని రాగా వాణ్ని తీసుకురమ్మన్నాడు రాజు. కనక అతనెలాగేనా వస్తాడు.

**కౌముది** : అలా కాదు. ఈ విషయం వివరిస్తూ ప్రత్యేకంగా తెలియజేయండి. "అలాగే" అంటూ వాళ్ళిద్దరూ అక్కడి నుంచి వెళ్ళిపోయారు.

రాజు పంపిన దూత - దేవగుప్తుడిని వెదుక్కుంటూ ఒకనాటి మధ్యాహ్నానికి మహేశ్వరాగ్రహారానికి పోయి - అతడు విష్ణుగుప్తుడింట్లో ఉన్నాడని తెలిసి అక్కడికి చేరాడు. వీధి తలుపులు మూయబడి ఉన్నాయి. "భోజనం చేస్తున్నాం. వాకిట్లో కూర్చొండి" అని లోపలినుంచి ఎవరో చెప్పారు.

హమ్మయ్య! ఇప్పటికి నా తిరుగుడు కష్టం గట్టెక్కింది. శుభవార్త తెచ్చినందు కాయన నాకు మంచి పారితోషిక మివ్వకపోడు - అంటూ కూర్చునేసరికి, అక్కడికి మరో రాజభటుడు వచ్చాడు - "విష్ణుగుప్తుని ఇల్లు ఇదేనా?" - అంటూ. "ఇదే! రా" అన్నాడు ముందువచ్చిన దూత.

అతను వచ్చి - "కౌస్తుభా! నువ్విక్కడున్నావేం?" అని ఆశ్చర్యపోయాడు.

"నందకా! నువ్వా! నువ్వెందుకొచ్చావో?"

"మన రాజకుమార్తె కళావంతుడనే బ్రాహ్మణ కుమారుడికి ఏదో ఉత్తర మిమ్మంది. అత నిక్కడున్నాడని తెలిసివచ్చాను"

"రాజపుత్రికను మృత్యుముఖం నుంచి తప్పించిన దేవగుప్తుడి కామెనిచ్చి వివాహం చేయాలని - రాజుగా రతని కిమ్మని శుభలేఖ నాతో పంపారు. అందుకొచ్చాను."

రక్షకభటు లిచ్చిన ఉత్తరాలు ఎవరిది వారు తీసుకుని చదువుకున్నారు.

చిరునవ్వు నవ్వుకుంటూ ఒకరి ఉత్తరం ఒకరి కిచ్చుకున్నారు.

"ఒకరి ఉద్దేశం మరొకరికి తెలియక ఇలా రాశారనుకుంటాను. ముందుగా కన్యచేత వరించబడిన వాడివి నువ్వు. కనుక నీకే బలమెక్కువ. వేగంగా వెళ్ళి ఆమెను పెళ్ళాడు -" అన్నాడు దేవగుప్తుడు - కౌముది కళావంతుడికి రాసిన లేఖ చదివి "అలాకాదు. దానమివ్వబడే వస్తువుపై దాతకే అధికారం. కన్యాదాత అయిన రాజు అభీష్టం కౌముదిని నీకివ్వాలని కనుక నువ్వేవెళ్ళి ఆమెను వివాహం చేసుకో" అన్నాడుకళావంతుడు, న్యాయం చెబుతున్నట్లు. వాళ్ళిద్దరూ అలా మాట్లాడుకుంటూంటే సదాచారి విచారం నిండిన మొహం పెట్టుకుని అక్కడకు వచ్చాడు. అతనితో మాట్లాడ్డానికిని కళావంతుడు కొంచెం పక్కకి వెళ్ళాడు.

"చేతికి దొరికిన సొమ్ముని వదిలి పేరాశతో కష్టాలు పడుతున్నాను. ఆ వేళ - హరిశర్మ ఆ వృత్తాంతం చెప్పగానే, కౌముదిని గెలిచినట్లే దేవగుప్తుడిని కూడా ఓడిస్తావనీ, మూడు గ్రామాలు సంపాదిస్తాననీ అత్యాశతో - రాజు పంపిన పదివేల మూడలు వారివద్దే ఉంచమన్నాను కదా! ఇప్పుడడిగితే నిన్ను తీసుకురమ్మన్నారు. పెళ్ళాం బిడ్డల నొదిలి ఎన్నాళ్ళిలా తిరిగేది? నువ్వొచ్చి సొమ్మిప్పిస్తావా లేక ఉత్తిచేతుల్తో పోయేదా?" అన్నాడు సదాచారి. "మెల్లగా మాట్లాడు నేనొచ్చి సొమ్మిప్పిస్తాను. ఇదుగో ప్రయాణమౌతున్నాను" అన్నాడు కళావంతుడు. వారి సంభాషణలీలగా వినగలిగాడు దేవగుప్తుడు. కళావంతు దతనితో - "మనమెలా అయినా కుముద్వతికి వెళ్ళాలి. ఈ చమత్కారమేమిటో చూద్దాం" అన్నాడు. మర్నాడు విష్ణుగుప్తుడు పరుగెత్తుకొచ్చి - "దేవగుప్తా! నువ్వు మాపాలిట దైవంలా ఆపదల్ని తొలగిస్తున్నావు. నిన్ను నా కొడుకని చెప్పుకోడంతో - మలయధ్వజు డెప్పటి కప్పుడే రమ్మని వర్తమానం పంపుతూంటాడు. ఏం చేయాలో తెలియడం లేదు. ఎన్నిసార్లని నిన్ను శ్రమపెడతాం?" అంటూ రాజు పంపిన ఉత్తరం చూపించాడు.

"మా పండితులీ మధ్య దిగ్విజయం చేసిన మాట నిజమేకాని మీపట్నం పోలేదని చెబుతున్నారు. ఏదేమైనా మీ బాలపండితుని పాండిత్య ప్రకర్ష చూడాలని వేడుకగా ఉంది. తిరిగి తిరిగి అలసివచ్చిన మా

పండితులల్ని మళ్ళీ పయనం చేయమని చెప్పలేక పోతున్నాను మీ బాలవిద్వాంసు నొక్కసారి ఇక్కడికి పంపిస్తే అతని ఉపన్యాసం విని శ్రవణానందం చేసుకుంటాను. వారి రాక పోకలకగువిత్తం సమర్పిస్తున్నాను – కృష్ణదేవరాయలు" అని ఉందాలేఖలో. దానివెనుక – "మీ కుమారుడిని రాయలవారి వద్దకు పంపాలి కనక తక్షణం అతన్నిక్కడికి పంపండి – " మలయధ్వజుడు రాశాడు.

అది చదువుకుని – "నేనిప్పుడు కుముద్వతికి పోయి – అక్కడి నుంచి విజయనగరం వెళ్ళి రాయలవారి పండితులతో ప్రసంగిస్తానని నువ్వు మలయధ్వజుడివద్దకు పోయి చెప్పు" అంటూ దేవగుప్తుడు అతను రాజుకి చెప్పవలసిన మాటల్ని బోధపరచి పంపాడు.

ఆ మాటలు విన్న కళావంతుడు – "నువ్వు విష్ణుగుప్తుడి కుమారుడివి కావని తెలిసింది. మారువేషంలో ఎందుకు తిరుగుతున్నావ్? ఆ వృత్తాంతం ఏమిటో చెప్పు. నేను నీకు శిష్యుడినీ, భృత్యుడినీ కనక నిజం తెలుసుకునే అర్హత నాకుంది" అన్నాడు.

అతను నవ్వుతూ – "నువ్వు సదాచారి కొడుకువి కావని నాకూ తెలిసింది. ముందు నీ కథ చెప్పు. తరవాత నాకద చెబుతాను" అన్నాడు.

అందుకు కళావంతుడు నవ్వుతూ – "నువ్వుమందారవల్లి కొడుకువైతే నా వృత్తాంతం సాంతం చెబుతాను" అన్నాడు.

"నువ్వు కళానిలయ కూతురివైతే నేను మందారవల్లి కొడుకు నెందుకు కాకుండా ఉంటాను? నీ కదంతా చెప్పు"

"నువ్వు వసుంధరుడివని అప్పుడే అనుకున్నాను. అందుకే నిన్నాశ్రయించి తిరుగుతున్నాను. దైవం నా కోరిక తీర్చింది –" అంటూ – అడవిలో పడింది మొదలు అంతవరకూ జరిగినదంతా చెప్పింది కళావతి.

"నువ్వడివిలో పడ్డావని యక్షకన్యల సంభాషణ నుంచి నాకుతెలిసింది. కనుక నువ్వు కళావతివని అనుమానంతో నిన్ను నా వెంటే తిరగనిచ్చాను. నా వృత్తాంతం కూడా విను" అంటూ సన్యాసిని జడలు గొరిగి వదలి వేసినంత వరకూ తనకద చెప్పాడు.

# విష్ణుగుప్తుడి కథ

దేవీకటాక్షంతో జనపదాలలోకి వచ్చి-ఒకనాటి మధ్యాహ్నానికీ మహేశ్వరాగ్రహారం చేరాను. విష్ణుగుప్తుని కతిథి అయ్యాను. ఆ వేళ దంపతులు దేనికో విచారిస్తూ భోజనం చేయకుండా ఓ గదిలో దిగులుతో పడుకున్నారు. సేవకులు చెప్పి చూశారు ఫలితం లేకపోయింది. వారిలో ఒకడు – నేనడగ్గా రహస్యంగా – "ఈ విష్ణుగుప్తులవారు మలయధ్వజ మహారాజుగారి ఆస్థానపండితులు వారివలన ఎన్నోబిరుదులూ, అగ్రహారాలు బహుమానంగా పొందాను. ఇప్పుడు వారిసభకు రాయలవారి ఆస్థాన కవులు వచ్చారట. వారితో ప్రసంగించడానికి రమ్మని – రాజుపత్రిక పంపాడు' ప్రసంగ. యుద్ధంలో గెలవకపోతే...నీ అగ్రహారాలు ఊడలాక్కుని వారికిచ్చేస్తాం,' అనికూడా రాశారట. ఆ కవుల పాండిత్యానికి భయపడి – భోజనం మాని విచారిస్తున్నాడు" అని చెప్పాడు.

విష్ణుగుప్తుడు ధర్మశీలుడని విని ఉన్నాను. అంచేత అతన్ని కాపాడదామని– అతని వద్దకు వెళ్ళి – "రాయలవారి పండితులకు వెరచి భోజనం మానేశేరా! లెండి. భోజనం చేయండి. మీ బదులు నేను పోయి వారిని పరాజితుల్ని చేస్తాను. నేను కాశీలో సకలశాస్త్ర విద్యలు చదువుకుని ఇప్పుడే వస్తున్నాను. ప్రసంగాల కోసం పరితపిస్తున్నాను. మీ అగ్రహారాలుచేయిజారకుండా నిలపుతాను" అని నేననగానే అతనెంతో పొంగిపోతూ నా వృత్తాంతమడిగి, "నువ్వుచూస్తే బాలుడివి! ఆ ప్రౌఢపండితులతో ప్రసంగించగలవా? వారుసామాన్యులు కాదుసుమా!" అన్నాడు.

"నాపేరు దేవగుప్తుడు. నాజన్మభూమి మళయాళదేశంలో ఒక కుగ్రామం. ఆ పండితుల సంగతి నాకు తెలుసు. వారిని నేను తప్పకుండా గెలవగల్ను – మీరు నిశ్చింతగా భోంచెయ్యండి" అన్నాను నేను.

"నువ్వంతవాడివిలాగే కనిపిస్తున్నావు కాని – నీ విజయం వల్ల నాకేం ప్రయోజనం?"

“నేను మీ కుమారుడినని చెబుతాను అప్పుడు నాకు లభించే ఖ్యాతి అంతా మీదేకదా?” ఆ మాటకతను నన్ను పొగిడి. సుష్టుగా భోజనం చేశాడు.

మర్నాడు మలయధ్వజుడు పంపిన పల్లకీమీద పోయి వారిని పరాజితుల్ని చేశాను. తరవాతంతా నీకు తెలిసిందే కదా?” అన్నాడు.

## కళావతీ వసుంధరుల కథ

“అయ్యా! నీ ఔదార్యం, దయాగుణం మెచ్చదగినవి. సన్యాసిని దయతలచి విడచిపెట్టావు. కాని. .ఏనుగు నాపగలిగే శక్తి నీకెలా వొచ్చింది?” అని అడిగింది.

‘యక్షిణిని తలుచుకోడం వల్ల ఆ ఏనుగు నావశమైంది’ అన్నాడు వసుంధరుడు. “నీ పురుష వేషం చాలావింతగా ఉంది. అందుకే కాబోలు కౌముది తండ్రి మాటకూడా కాదని నీ కుత్తరం రాసింది. తొందరగా వెళ్ళి పెళ్ళాడవూ?” అని అతను చిలిపిగా పరిహసించాడు.

“ఏనుగు జడుపుతో నిన్నామె సరిగా చూసి ఉండదు. లేకపోతే మిమ్ముల్నే వరించేది ఎలా అయినా ఆమె మీకే దాసురా లవుతుంది కదా! ఎప్పటికయినా భృత్యుడు భృత్యుడే!” అంటూ ఆమె అతనివేపు శృంగార దృష్టుల్తో చూసింది.

“మనమిప్పుడు కుముద్వతి వెళ్ళి అక్కడ జరిగే వింతలు చూద్దాం. ఆ కౌముది ఎవరిని వరిస్తుందో... రాజామె నెవరికిచ్చి వివాహం చేస్తాడో...” అంటూ తన మనసులోని మన్మధ భావాలను దాచివేశాడు. వారిరాక విని రాజు సంతోషంతో వాళ్ళకి విడిదీ, పరిచారకులూ ఏర్పాటు చేశాడు. అక్కడ చేరింది మొదలు – సదాచారి – సొమ్ము, సొమ్మంటుంటే – “నువ్వు రాజుతో వియ్యమందాలి వస్తువులు పెట్టాలి కదా, సొమ్మేమైనా దాచుంచితే తే” అని వసుంధరుడు అనేసరి కతనవతలికి పోయాడు.

ఆ రాత్రి వసుంధరుడూ, కళావంతుడూ పురవిశేషాలు చూస్తూ ఒక దేవాలయం దగ్గర కొందరి మాటలు విన్నారు.

"సభా విశేషాలేమిటి? చివరకి కౌముదినెవరికివ్వాలని నిర్ధారణ చేశారు?"

"ఆ చిన్నది - తనను చదరంగంలో ఓడించిన వానినే చేసుకుంటా నందటగా?"

"గెలిస్తే పదివేల మాడలు.. ఓడితే ఉరి. అంతే కదా ప్రకటనలో ఉన్నది?"

"రాతలో లేకపోయినా ఆమె హృదయంలో అలా ఉందట."

"మరి - ఆమెను రక్షించిన వాడిని కౌగిలించుకుందిగా?"

"భయంతో కౌగలించుకుందట- అంతే."

"ధర్మశాస్త్రాలు తిరగేయించారుగా రాజుగారు?"

" ఆ పండితులూ కొందరటూ, కొందరిటూ సమర్థించారు."

"ద్రౌపదిలా ఇద్దర్నీ చేసుకుంటే సరి."

" ఏదీ నిర్ధారణ కాలేదు. వాళ్ళిద్దర్నీ రప్పించి... వాళ్ళు చెప్పినట్లు చేద్దామనుకున్నారు."

"ఇద్దరూ ఆమెను కోరితే? సిరి రా మోకాలొడ్డే వారెవరు? రాజ్యానికి రాజ్యం, చుక్కలాంటి భార్యా"

ఆ మాటలు వింటూ వాళ్ళిద్దరూ నవ్వుకుని - బసకు పోయి పడుకున్నారు. మర్నాడు సభకు వారిద్దరినీ రప్పించి ... విషయం వివరించాడు రాజు. కళావంతు డామెను తనకే ఇచ్చి చెయ్యాలని వాదించాడు.

రాజువాళ్ళకి నమస్కరించి - "రాజా! కృష్ణదేవరాయల ఆస్థానంలో దిగ్గంతులైన పండితులున్నారు కదా! మా వాదాలు వారికి

పంపండి" వాళ్ళెలా నిర్ధారించినా మేమంగీకరిస్తాం" అన్నాడు రాజు ఆ విషయాలన్నీ అప్పుడే పండితుల చేత రాయించి, ఉత్తరంతోపాటు దేవగుప్తుడినీ, కళావంతుడినీ కూడా రాయలవారి ఆస్థానానికి పంపాడు.

కృష్ణదేవరాయలు చాలా సంతోషించి - చిత్రశాలలో వారి నుంచి - పండితులకి తెలియజేశాడు. దేవగుప్తుడి పేరువింటేనే వొణికే పండితులు - రామలింగకవి ఇంటికి వెళ్ళారు.

"అయ్యా! మన హృదయంలో శూలమైన దేవగుప్తుడు ఇక్కడికిరానే వచ్చాడు. ఆనాడు ఎలాగో అవమానం దాటించావు. వానిద్వారా మనసామర్థ్యం తెలుసుకోవాలని రాయలవారి కాంక్ష. అప్పట్లా నువ్వు ఉపేక్షిస్తే మనకి అపఖ్యాతి తప్పదు. ఉపాయం ఆలోచించు. మందారవల్లిని జయించినట్లే వీనిని కూడా పరాభవించు" అంటూ ఎన్నోవిధాల వేడుకున్నారు.

అప్పుడు రామలింగకవి - "మిత్రులారా! నేనేం చేసేది? వాడి ఎదుట నాకు నోరు పెగలదు. ఆలోచన స్ఫురింపదు. ఏమీతోచకే కదా ఆనాడు అసత్య పత్రికపంపాను. ఇలా వెన్నంటి వస్తాడనుకోలేదు. కుముద్వంతుడు మనని పెద్ద చేసి - ధర్మసందేహం తీర్చమన్నాడు. దేవగుప్తుడితో ప్రసంగించడం నాతరం కాదు. మనమందరం రహస్యంగా పోయి అతన్నాశ్రయించి - ప్రసంగం చేయకుండా సాగనంపడమే మంచిది" అన్నాడు.

"అదికూడా నువ్వే చెయ్యాలి" అన్నారు వాళ్ళు.

మర్నాడు రాత్రి పొద్దుపోయాక పండితులందరూ దేవగుప్తుడున్న పూదోటకి పోతూండడం చూసి - ప్రజాభిప్రాయం తెలుసుకుందుకు మారువేషంలో తిరిగే అలవాటు కల కృష్ణదేవరాయలు ఒక బీద బ్రాహ్మణుడి వేషంలో వాళ్ళ వెంట నడిచాడు తాము వచ్చినట్లు వారు పరిచారికద్వారా దేవగుప్తుడికి కబురంపారు. ఈ లోగా రాయలు వారికి తెలియకుండా వెళ్ళి ఒక కిటికీ దగ్గర కూర్చున్నాడు.

*వసుంధరుడు*: కళావతీ! మనమీవూరు వదిలి నాలుగేళ్ళయింది. మనగురించి మనవాళ్ళేమనుకుంటున్నారో?

**కళావతి** : చనిపోయామనుకుంటారు. నాకు వేగంగా మా తల్లితండ్రుల్ని చూడాలనుంది. రేపు వెళ్ళేదా?

*వసుంధరుడు*: పండిత దిగ్గంతుల ప్రసంగాలు వినవూ?

**కళావతి** : స్వగ్రామంలో సభకి పోవడం సమంజసం కాదు. తరవాత విశేషాలు తెలుసుకుంటాను.

*వసుంధరుడు*: కౌముదిని పెళ్ళాడేవిషయం పండితులతో ప్రసంగించి వెళ్ళరాదా! వారేంచెబుతారో చూద్దాం.

**కళావతి** : రెండు వాదాలూ నువ్వే చెయ్యగలవు.ఐనా.... వాదించడాని కేముంది? ఇద్దరం నీ దాసులం అయ్యాం. మా తల్లి చేసిన అపరాధాలు మన్నించమని వేడుకుంటున్నాను.

*వసుంధరుడు*: మీ తల్లి నాకొక్కడికే కాక మనిద్దరికీ అపకారం చేసింది కదా. అదుగో! పండితులొస్తున్నారు, మాట్లాడకు.

**కళావతి** : వాళ్ళెందుకొస్తున్నారో?

*వసుంధరుడు*: పిరికితనమే.

ఆ విద్వాంసులు లోపలికి రాగా వారిని ఆహ్వానించి కూర్చోబెట్టాడు – వసుంధరుడు.

వారు వచ్చిన కారణం అడగ్గా – పెద్దనార్యుడిలా అన్నాడు "పండిత కంఠీరవా! విద్యచే మాకంటె అధికుడివయినా, వయసులో చిన్నవాడివి కనుక ఆశీర్వాదాలు.

మేము చిరకాలంనుంచీ ఈ దివాణా న్నాశ్రయించి సుఖంగా కాలక్షేపం చేస్తున్నాం. మాపేరు పెట్టుకుని ఎవరో మలయధ్వజుని ఆస్థానానికి వచ్చి నీతో ప్రసంగించి పరాజితులయ్యారని లోగడ విన్నాం. దానిలోని నిజానిజాలు తేల్చేతలంపుతో మారాజు నిన్నిక్కడికి రప్పించాడట.

రాజులకేం? కోడిపందాలు కట్టి వినోదించేవారిలా మనలో మనకి కలహాలు పెట్టి ఆనందిస్తారు. జయాపజయాలు దైవాధీనం అని కదా ఆర్యోక్తి.

వసుంధరుడు నవ్వుతూ..."పెద్దలారా! అలాగే! కాని...ఇంకా మీరు కపటంగా మాట్లాడ్డం ఉచితం కాదు. మలయధ్వజుడి ఆస్థానానికి వచ్చింది మీరుకాదూ? నిజం చెప్పండి" అన్నాడు. "మానోటితోనిజం చెప్పించకు. పెద్దలం కదా ఇంతటితో వదిలిపెట్టు" అని కోరారువాళ్ళు అప్పుడు – ఆ సంభాషణలన్నీ విన్న కృష్ణదేవరాయల సంతోషం పట్టలేక లోపలికి వచ్చి ఆ బాలుణ్ని కౌగలించుకున్నాడు. అతడు రాజని తెలిసి పండితులందరూ తెల్లబోయి చూడసాగారు.

రాయలవారు – "ఓహో! ఇతనెవరో తెలియక మీరు భయపడి శరణుచొచ్చారు. మన రామలింగ కవి కుమారుడు వసుంధరుడే ఇతను" అనేసరికి – రామలింగకవి – "వీడు మావసుంధరుడా! అంటూ అతన్ని కౌగలించుకుని, ఆనంద బాష్పాలు కురిపిస్తూ – "మమ్మల్ని మరచి – భయపెట్టడానికి వచ్చావా! మీ తల్లి నీకోసం చింతిస్తూ మంచం పట్టింది. నువ్వంత హఠాత్తుగా ఎలా అంతర్ధానమయ్యావ్" అంటూ ప్రశ్నించాడు.

వసుంధరుడు వాళ్ళందరినీ సావకాశంగా కూర్చోబెట్టి తనవృత్తాంతం, కళావతి వృత్తాంతం వివరంగా చెప్పి వారినాశ్చర్యంలో ముంచాడు. అప్పటికి తెల్లవారిపోతూంది, రాయలు పుత్రికను కౌగలించుకుని ఆమె నూరడించాడు. ఆ వృత్తాంతమంతా పట్నంలో చాటింపజేసి – మంగళ తూర్యాలతో – భద్రగజం మీద వాళ్ళ నెక్కించి ఇద్దరినీ వారివారి తల్లుల్లదగ్గరకి పంపాడు. పిల్లల్ని చూసుకుని మందారవల్లి, కళానిలయ–వియోగదుఃఖ మరచి ఎంతో సంతోషించారు.

రాయలవారు కుముద్వంతుడికి వసుంధరుడి చరిత్రను గూఢంగా తెలియజేస్తూ, నా పుత్రిక కళావతి ఇతనికిచ్చి పెళ్ళి చేస్తున్నాను, నువ్వుకూడా కౌముదిని ఇతనికే ఇచ్చి పెండ్లి చెయ్యి అని ఉత్తరం రాశాడు.

శుభముహూర్తంలో రాయలు వసుంధరుడికీ కళావతికీ ఘనంగా వివాహం జరిపించాడు. ఆ పెళ్ళిజరిగిన కొన్ని రోజుల తరవాత కుముద్వంతుడు వసుంధరుడిని తీసుకు వెళ్ళి కౌముదినిచ్చి పెళ్ళిచేసి తనరాజ్యాన్ని అతని అధీనం చేస్తూ పట్టాభిషేకం కూడా చేశాడు.

వసుంధరుడు ఇద్దరి భార్యలతోనూ సుఖిస్తూ చాలాకాలం ప్రజారంజకంగా రాజ్యం చేశాడు. "గోపాలా! ఈ కథ వల్ల మందారవల్లి, కళానిలయల్లో ఎవరు విద్వాంసురాలో తెలిసిందా?" అని అడిగిన మణిసిద్ధుడికి వాడు నమస్కరిస్తూ - "స్వామీ! మందారవల్లి కొడుకునకే సమాధానం చెప్పలేక పరితపించిన కళానిలయ మందారవల్లితో ఎలా సాటిరాగలదు?" అన్నాడు

మణిసిద్ధుడు గోపాలుడి తెలివికి మెచ్చుకుంటూండగా వాడు, యధాప్రకారం మరుసటి మజిలీకి పోడానికి ఉత్సాహంగా కావడి భుజానికెత్తుకున్నాడు.

**4 వ భాగం సమాప్తం**



